ప్రభాత ప్రచురణ—౬

# భారత జాతీయ కాంగ్రెసు చరిత్ర

## రెండవ సంపుటం

(1935 - 1942)

కర్త:

డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య.

అనువాదం:

కొడాలి ఆంజనేయులు.




ప్రభాత ప్రచురణ సమితి

[illegible]మెట్టు : : విజయవాడ

# స మ ర్ప ణ

మాతృదేశ విముక్తికై

మందహాసంతో,

లెక్కకు మించిన భారత, కుమారీ కుమారులు చేసిన

అమోఘ త్యాగాలకు, సేవకు.

ఆలవాలమైన, భారత

జాతీయ కాంగ్రెసుకు,

మార్గదర్శకమై నడిపించిన

సత్యాహింసలకు,

# విషయసూచిక

# పీఠిక

గాంధీ - గాంధీతత్వం 2 వ సంపుటాన్ని పాఠకుల కందించి దాదాపు పదేళ్లు గడిచిపోయింది. దీర్ఘకాలం తర్వాత ఈ గ్రంథాన్ని సమర్పించగలుగుతున్నాము. ఈ ఆలస్యానికి, విచారం ఒకప్రక్కన బాధిస్తున్నా విపరీతమైన ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొంటూ పాఠకులకు కాంగ్రెసు చరిత్రను అందించగలిగినందుకు ఆత్మ సంతృప్తి గూడా కలుగుతున్నది.

గాంధీ - గాంధీతత్వం ప్రచురణ తరువాత, హైదరాబాదు స్టేటు కాంగ్రెస్ ప్రజల పక్షాన పోరాటాన్ని ప్రారంభించింది. ప్రచురణసమితి నిర్వాహకులు అంతా యీ ఉద్యమంలో తీవ్రమైన పాత్ర వహించవలసి వచ్చింది. ప్రజలుగూడా పోరాటంలో మునిగి తేలుతున్నారు. పాఠకలోకమున్నూ గాంధీ - గాంధీతత్వం వంటి ఉద్గ్రంథ ప్రచురణకై తగిన ఆదరాభిమానాలు చూపి, ప్రోత్సహించలేదు. ఈ ప్రతికూల పరిస్థితులలో గూడా కాంగ్రెస్ చరిత్ర వంటి గ్రంథాన్ని ప్రచురించబూనుకోవడం సాహసమే! అయినప్పటికీ అనేక కష్టనష్టములకు పాత్రులమైగూడా యీ పుస్తకాన్ని పాఠకలోకానికి అందిస్తున్నాము. అనివార్య కారణాలవల్ల ఆలస్యమైనందుకు క్షమాపణ కోరుతున్నాము.

త్వరలోనే, మూడవ సంపుటం గూడా సమర్పించుకోగలమని ఆశిస్తున్నాము. పాఠకలోకం ఇకనైనా ఆదరించగలదని మా విశ్వాసం. మేము పాలుపడిన కష్టనష్టాలను పాఠకులకు ఏకరువుపెట్టి విసిగించదలచుకోలేదు.

బ్రిటిషుసామ్రాజ్యం భారతదేశాన్ని వశపరచుకొని, రాజకీయంగానే కాకుండా ఆర్థికంగా, సాంస్కృతికంగా, చివరకి మానసికంగా కూడా బానిసలనుగా చేసింది. భారతీయులు అనేక దీర్ఘ సంవత్సరాలు యీ దాస్యబంధనాలనుంచి బైటపడేటందుకు పోరాడారు. ఈ పోరాటాలు చరిత్రలో భారత జాతీయ కాంగ్రెస్ నాయకత్వం వహించి సాగించిన సమరం. ముఖ్యంగా మహాత్మాగాంధీ నాయకత్వంలో సాగించిన ప్రత్యక్షపోరాటం సువర్ణాక్షరాలలో లిఖించదగినది. ఈనాడు రాజకీయ స్వాతంత్ర్యం గడించుకొన్నప్పటికీ, గత చరిత్రను విస్మరించరాదు. అందుకని కాంగ్రెస్ చరిత్ర

అధ్యయనం చేయటం ప్రతి భారతీయుని పరమకర్మం. ఈ దృష్టితోనే కాంగ్రెసు చరిత్ర రెండవభాగాన్ని తెనుగులో అనువదించి ప్రకటించడానికి పూనుకున్నాము. కాంగ్రెసు చరిత్రకారులు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారిని, భారతీయులకు ముఖ్యంగా ఆంధ్రులకు పరిచయం చేయనవసరంలేదు. భారతదేశంలో అధికార పూర్వకంగా కాంగ్రెసు చరిత్రను వ్రాయగలిగింది వీరొక్కరే. ఈయన కేవలం చరిత్ర కారులే కాదు. పోరాటంలో ప్రధానభూమికాధారులుగూడా.

వీరు రచించిన కాంగ్రెస్ చరిత్ర ప్రథమ సంపుటం ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నది అంతకంటే ఈ సంపుటం విశిష్టమైనది అని చెప్పవచ్చు. ఇది పాఠకలోకపు ఆదర్శాన్ని పొందుతుందని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాము.

ఈ అవకాశాన్ని మాకు కలుగజేసిన శ్రీ డాక్టర్ గారికీ, అనువాదకులకూ ముద్రాపకులకూ, ఆర్థికంగా తోడ్పడ్డ మిత్రులకూ, మా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనాలు.

పుస్తకం చదువుతూవుంటే ఉత్సాహం తొణికిసలాడుతుంది. జరిగిన ఘట్టాలను, పరిచ్ఛేదం చేసి చూస్తూవుంటే అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లుంటుంది. గ్రంథాన్ని పరిశీలిస్తుంటే గాంభీర్యం ఉట్టిపడుతుంది. ఇంతకంటే యీ పుస్తకాన్ని పరిచయం చేయడం, తినబోయే కూరకు రుచి చెప్పడం అవుతుంది.

ప్రకాశకులు.



# తొలిపలుకు

కాంగ్రెసుచరిత్రయొక్క ఈ రెండవ సంపుటము మొదటి సంపుటపు ఉత్తర భాగం మాత్రమే.

మానవుని జీవితంలో జరిగే స్వర్ణోత్సవాలు షష్టిపూర్త్యుత్సవాలు అతని వయస్సును తెలియ చేయడమేగాక నానాటికి క్షీణించిపోతూన్న అతని ఆకాంక్షనుగూడా సూచిస్తూంటవి. కాని వయఃపరిమితిని ఎఱుగని సంస్థల విషయంలో మాత్రమలా కాదు. వాటికి ఆది కలదు. అంతమాత్రంలేదు. అయితే కాంగ్రెసు ఒక నిర్మాణం కావచ్చును. కాని అది చైతన్యంగలిగిన వ్యక్తివంటిది. 1885 వ సంవత్సంలో ఒక మహత్తర కార్యనిర్వహణం నిమిత్తమది సృజింపబడ్డది. ఆ కార్యం పరిపూర్తి కావడంతోనే దాని ఉనికికి అవసరం తప్పిపోతుంది. అరవై సంవత్సరాలు నిరంతర కృషిచేసిన కాంగ్రెసు, ఇండియాను విదేశపరిపాలనమునుండి తప్పించడానికి పోరాడే సంస్థగా అదృశ్యమై యిప్పటికి చిరవిశ్రాంతిపొంది ఉండవలసింది. నిరంతరాయమైన కార్యకలాపము కొనసాగించిన కాంగ్రెసుకు దురదృష్టవశాత్తు యింకా అట్టి కృతార్థత కలుగలేదు. బహుశా సప్తతితమ వార్షికోత్సవములోగా కాంగ్రెసు తన కర్తవ్యమును నిర్వహించగలదని ఆశిస్తున్నాము.

వేయిపుటలకు మించిన ఈగ్రంథము, 1941 లోనూ 1942 మొదలు 1945 వరకున్నూ గ్రంథకర్తకు జైలులో లభించిన బహు విశ్రాంతికాలంలో రచింపబడినది. విశ్రాంతిదొరకడం అదృష్టమేకావచ్చును. కాని సమకాలిక చరిత్రను రచించడం మాత్రం చాలా దుస్తరం. ఇటువంటి సందర్భాలలో ముఖ్యంగా ఔచిత్యం కొఱవడుతుంది. చరిత్ర నడుస్తూన్న కాలంలో ప్రాముఖ్యంగా కనిపించే సంఘటనలు కొన్ని తరువాత హఠాత్తుగా తమ ప్రాముఖ్యతను విశిష్టతనూ కోల్పోగలవు. కాబట్టి తాను వ్రాసినదానిని అంటిపెట్టుకొని ఉండే చరిత్రకారుడు దురదృష్టవంతుడు. ఈదృష్టితోనే యింకా యిప్పుడచ్చుపడినంత గ్రంథమును నిర్దాక్షిణ్యంగా తీసివేయవలసివచ్చింది. తీసివేసేటప్పుడు కొంత విచారం కలుగక పోలేదు. అంతేకాదు గ్రంథవిస్తరభీతిచే కొన్ని ప్రాముఖ్యమైన పత్రములనకూడా ముద్రించకుండా వదలివేయవలసి వచ్చింది.

చరిత్రను సమగ్రంగా పరిశీలించవలెననే కుతూహలం కలవారు కడచిన పదేండ్లలోని కాంగ్రెసు కరపత్రములను ఈచరిత్రకు అనుబంధంగా చేసుకొని పఠించవచ్చును. ఇంకనూ పరిపూర్ణంగా విషయాన్ని తెలుసుకోతలచినవారు "కల్లోలాలకు కాంగ్రెసు బాధ్యత" అనే ప్రభుత్వంవారి కరపత్రమున్నూ చిరస్మరణీయములైన "గాంధీ ప్రత్యుత్తరములు"న్నూ విశదంగా పఠించవలయును. ఆగస్టు తీర్మానానంతరం జరిగిన సంఘటనలన్నిటినీ పూర్తిగా గుచ్చెత్తి సంగ్రహపరచి వ్రాయడం మాకు సాధ్యపడలేదు. అందుకు సంబంధించిన సంజాయిషీ ఇప్పటికయినా రాలేదు. ఇంకనూ రావలసిఉంది. కార్యనిర్వాహక న్యాయశాఖలమధ్య జరిగిన వివాదమును తెలుసుకొన్నకొద్దీ తెలుసుకోవలెననిపిస్తుంది. అందుకు సంబంధించిన కేసులన్నిటినీ ఒకచోట చేర్చి "హిందూస్తాన్ టైమ్సు" పత్రిక ఒక పెద్ద గ్రంథం ప్రకటించింది. వీటన్నిటికీ తోడు, అనేకమంది గ్రంథకర్తలు కడచిన సంఘటనలనుగూర్చి విడివిడిగాగానీ మొత్తంగాగాని కొన్నిగ్రంథాలు వ్రాసిఉన్నారు. ఈగ్రంథంలో ముఖ్యంగా కాంగ్రెసు యుగానికి సంబంధించిన ఘట్టాలు మాత్రమే వ్రాయబడినవి. జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమమునకు సంబంధించిన ఆర్థిక వాణిజ్య పారిశ్రామిక విషయాలుకూడా యిందులో చేర్చబడి ఉంటే బాగుండేదని కొందరనవచ్చును. సంస్థానాలనుగూర్చి ఒక అధ్యాయం ఇందులో ఉంటే సమంజసంగా ఉండేది. సమంజసంగా ఉండడమే కాదు. అవసరమైన అలంకారంగా ఉండేదికూడా. కాంగ్రెసు లీగులమధ్య సవాలక్ష గ్రంథం జరిగిఉండగా అదంతా కలిపి ప్రత్యేకసంపుటంగా ప్రకటింపబడడం అవసరమనిపిస్తుంది. ఒరిస్సా వంగరాష్ట్రాలలో మానవునిచే కల్పింపబడిన కటికి కాటకాన్ని గురించి వివరంగా వ్రాయకపోవడం అత్యంత విషాదకరంగా తోస్తుంది. అయితే ఈ విషయాలన్నిటితో భారతజాతీయ మహాసభకుగల ప్రత్యక్షసంబంధం కేవలం ప్రతిషేధాత్మకం అనే సందేహం లేకపోలేదు. ఇవన్నీ ఇంకా అనేక సంఘటనలున్నూ "మన సమకాలిక చరిత్రాంశములు" కావచ్చును. కాని కేవలం "కాంగ్రెసుచరిత్ర" మాత్రం కానేరవు.

కొత్తఢిల్లీ,<br>డిశంబరు ౧౯౪౬

భో. పట్టాభి సీతారామయ్య.



రచయిత:

డాక్టరు. భోగరాజు పట్టాభి సీతారామయ్య

# పీఠిక

కాంగ్రెసు చరిత్ర ప్రధానంగా మానవచరిత్ర. చరిత్ర అంటే "మానవుల అపరాధాలు, మాధ్యాలు, దుఃఖాలను గూర్చిన కథనమేనని గిబ్బన్ అన్న మాటలను స్మరిద్దామా? ఈ గ్రంథంలో ఉదాహరింపబడిన కాలంలో ఇండియాలో అట్టివనేకం తటస్థించినవి. "ఈ పగ్రహాలలో ఒకటి చల్లారేటప్పుడు తటస్థించే అకీర్తిప్రదమైన ఒకానొక చిన్న ఇతిహాసమని" చరిత్రను గూర్చి లార్డు బెల్ఫోరు చెప్పి ఉన్నాడు. అది నిజమందామా? అటువంటివి కూడా మనకు చాలా లభించినవి. "ఒకానొక మహాత్కార్యమును సాధించేటందుకు మానవజీవితంలో జరిగే పోరాటం యొక్క కథా 'ప్రవర్తనమనే చరిత్ర' అని అందామా? అది యిక్కడ స్వాతంత్ర్య ప్రవర్తనం" అవుతుంది. అవును ఆత్మస్వాతంత్ర్యాన్ని కోరుతుంది. కాంగ్రెసు ఉపాసిస్తున్న లక్ష్యమే అది. సేవా త్యాగములకు సంబంధించిన కార్యక్రమమును నిర్వర్తించవలెనని తన పక్షంవారిని కాంగ్రెసు నిర్బంధించడం ఈ సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనము కొరకే. ఆ సంస్థ యింతకాలం నుండీ కష్టాలను కోరితెచ్చుకొని సహిస్తూండడం తన ఆశయంలోని న్యాయమును గూర్చి శత్రువులకు సైతం నచ్చచెప్పడానికే. ఇదంతా నిజం కావచ్చును కాని, చరిత్ర ఎప్పుడు వ్రాయాలి? ఎలా వ్రాయాలి? తీరికగా వ్రాయాలా? తొందరలో వ్రాసి ముగించాలా? అనే ప్రశ్నలు కూడా ఉన్నవి.

"పత్రికా రచన సాహిత్యం కాదు. అలా కాకపోవడమే దాని ఉనికికి అవసరమునూ బలమునూ కల్పిస్తూన్నది" అన్నాడు హట్లరు ఇల్లిమటెక్. అది సమకాలిక చరిత్ర; సమకాలపు స్త్రీ పురుషుల భవిష్యత్తు మాత్రమే దానికి తెలుసు. అంతకెక్కువగానీ తక్కువగానీ తెలియదు. అందువల్ల చరిత్రకారునకది ఉపయోగకారి. బహుశా పత్రికారచన తొందరలో వ్రాసిన చరిత్ర. నడుస్తూన్న చరిత్రను వ్రాసే రచయితలు, జరుగుతూన్న సంఘటనలను అందుకోవడానికే గాక ధనార్జనమునకు కూడా ఆతురపడుతూంటారన్నమాట చాలా నిజం. 'పూజ్యులైన గ్రంథకర్తలు' అనేక కారణాలవలన అనేక సంగతులను గూర్చి మంచి మాటలు వ్రాయవలసి వస్తుంది. వారి రాగద్వేషాలూ, వారి ప్రేమానుబంధాలూ, వారికి కలిగింపబడిన సౌకర్యాలకు కృతజ్ఞత, పాఠకులను సంతోషపెట్టవలెననే కోరిక, ఇవన్నీ కారణాలు.

ఏది ఎలా ఉన్నప్పటికీ గ్రంథకర్త దృష్టి ఊర్ధ్వముఖంగా గానీ అధోముఖంగా గానీ పరిమితంగా ఉంటుంది. ప్రస్తుత చరిత్రను సమగ్రంగా వ్రాసుకోవడం కష్టం. చరిత్ర వ్రాసేటందుకు మరి ఇరవై సంవత్సరాలు వేచి ఉండవలె. నేటి నాటి పరిస్థితి కాదు, ముఖ్య విషయాలను అర్థం చేసుకొంటే భవిష్యత్తు కంటె మునావే తేలికగా సత్యాన్ని గ్రహించవచ్చును. తగిన ఆధారాలు ఉన్నప్పుడే నిక్కచ్చి సంఘటనలను గూర్చిన కొన్ని విషయాలు బహిరంగంగా చెప్పడానికి వీలవుతుంది. గుప్తపెట్టిపోయిన మానవపు శాసనాల వలన కూడా కొంతమంది ఉద్దేశాలను గురించి స్పష్టంగా ప్రతికూల విమర్శలు చేయడానికి వీలు కలుగదు. వారు ప్రకటించ వీలులేని అంశాల ఏకాంత సంభాషణలలో తెలిసిన సూక్ష్మాంశములను రచించడంలో సైతం చాలా కష్టం ఉంది.

"మహోత్తర సంఘటనల విషాదచ్ఛాయలనుండి కూడా అప్పుడప్పుడూ ఆనంద జ్యోతులు తొంగి చూడవచ్చును" అనే మన పుస్తకాల పీఠికలలో వెంట వెంటనే సేకరించబడుతూన్న నూతనాలంకారాలు. సమకాలిక చరిత్రకు సంబంధించిన గ్రంథాలు వ్రాయడం విపరీతమైన కష్టం. ప్రధాన పాత్రల గురువారి ఫైళ్ళను బట్టి పునర్విచారణ చేసుకోవడానికి గానీ, పునర్నిర్ణయం చేసుకోవడానికి గానీ అవకాశం లేని స్థితిలో కొంతమంది మాత్రం సమకాలిక చరిత్రలను వ్రాసేటందుకు అవసరాన్ని బట్టి శ్రద్ధగా ప్రయత్నించారన్నాడు మెయిట్‌లాండ్. తాము రచించింది "పత్రికా రచన" అవుతుంది కాని చరిత్ర కాజాలదని సమకాలిక చరిత్రకారులు అవహేళనకు గురి అవుతున్నారు. కాని ఆ ఇతిహాసకర్తలు తెలిసినవాటిని నిజాయితీగా వ్యవహరించిన యెడల అటువంటి అవహేళనకు తావుండదు.

ఇంతా అయితే నిన్న ప్రజల తీవ్ర విమర్శలకు గురియైన రాజకీయ సంఘటనలే నేడు చరిత్రగా పరివర్తనం చెందుతూన్నవి. నేటి రాజకీయ వాద ప్రతివాదాలు రేపటికి పరిణతిపొందిన చారిత్రకాంశములుగా రూపొందుతూన్నవి. రాజకీయాలు చరిత్రకు నాందీ ప్రస్తావనలు. కాబట్టి చరిత్ర తప్పు త్రోవలను పట్టకుండా ఉండవలెనంటే తన పురోగామియైన రాజకీయ ఘట్టాన్ని విస్మరించరాదు. రాజకీయాలనూ చారిత్రకాంశాలనూ సరిగా పరిశీలించి సమన్వయం చేసుకున్నప్పుడే విజ్ఞానానికి తోడు వైదుష్యాన్ని కూడా చేకూర్చుకొని, చరిత్రకారుడు తత్వవేత్తఅవుతాడు. అయితే ఈ కలయిక దుర్లభం. సాధారణంగా తటస్థించదు. సమకాలిక చరిత్రను రచించడానికి తగిన అర్హతలు 'పక్షపాత బుద్ధీ - రోషమూ' అనీ అవి తనకు కలవనీ గ్రీకు చరిత్రకారుడు మిల్‌ఫోర్డు సగర్వంగా వ్రాసుకొన్నాడు. ఈ గ్రంథంలో

అవే కనపడతూ తూ న్నవో లేక నిజమయిన చారిత్రిక తత్వమును పరిస్ఫుటం చేయగల నిర్మమత్వమూ ఔచిత్యమూ కనబడుతూన్నవో, కాక ఆకట్టక్ ప్రభువన్నట్లు "ఈ పుటలాత్మోద్దీపన కరములు కాగలవో, ధారుణాశక్తికి భారంగా ఉండ గలవో" విమర్శకులే నిర్ణయించవలసి ఉంది.

అయితే ఈ గ్రంథకర్తయొక్క నిర్ణయాలు కొన్ని కాలానుగుణంగా మారవలసి వచ్చినయెడల రాజకీయధురంధరులకాయన ఒకఉత్కృష్టమైన సేవ చేసినట్లుభావించి సంతృప్తిపడగలరు. ఎందువల్లననగా వారి పూర్వులు చేసిన తప్పిదములను తెలుసుకొని వారింకా ఎక్కువ జాగరూకతతో వ్యవహరించడానికి సావకాశం కలుగుతుంది. ఈ ప్రపంచంలోని మానవులందరినీ రెండు తరగతులుగా విభజింపవచ్చును. మొదటి తరగతి వారు స్వానుభవం వల్ల విషయాలను తెలుసుకోగలరు. రెండవ తరగతివారు పరుల అనుభవం వల్ల తెలుసుకోగలరు. మొదటి తరగతివారికంటె రెండవ తరగతి వారే ఎక్కువ బుద్ధిమంతులు అటువంటివారికి సమకాలికచరిత్ర ఒక తార్కాణంగా గాని హెచ్చరికగాగానీ పనికివస్తుంది జాతీయత క్రమాభివృద్ధి పొందుతూన్న సమయంలో అప్పుడప్పుడూ దాని జయాపజయములను వరుసగా ఉల్లేఖిస్తూవుండడంఅవసరం. అందువలన పరిస్థితులనుబట్టి, కాలానుసరణంగా జాతీయనాయకులు, తమ స్వాతంత్ర్య పంథానూ కార్యక్రమములనూ సరిదిద్దుకోవడానికి వీలవుతుంది ఆ ఉద్దేశంతోనే భారతస్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను నేటివరకూ వ్రాసి 1948 జూన్ నెల దాటకపూర్వం బ్రిటిష్‌వారు భారతదేశాన్ని విడిచిపోయే ప్రకటన సంఘటించడంతో పరిపూర్తిచేయవలెనని సాహసించాను.

ఆశియాఖండం ప్రపంచానికి కేంద్రం అని బహుసమంజసంగా వర్ణింపబడింది భూగోళశాస్త్రానుసారంగా యిరోపాఖండం దాని అనుబంధం. ఆఫ్రికా ఒక ఉపఖండం. ఆస్ట్రేలియా దానిలోని ఒక ద్వీపం. విషాదకరములైన తీవ్ర నూతన పరివర్తనములలో మునిగి తేలుతూన్న ఆశియా ఒక పురాతన ఖండం. దానిలోని భూఖండములుగానీ చరిత్రాంశములుగానీ విశిష్ట సంప్రదాయములతోనూ పరివర్తనములతోనూ నిక్షిప్తమైన ఒకానొక విషమస్వరూపమునుపొంది ఉన్నవి. ఆధునికశాస్త్ర నైపుణ్యం దాని రూపు మాపింది. మారని తూర్పు అనే చిలుకపలుకు మూర్తీభవించిన పాశ్చాత్య దురహంకారానికి ప్రతిబింబం.

" వెలుపలినుండివచ్చిన నూతన పాశ్చాత్య సభ్యతకూ లోని ప్రాచీన సభ్యతకూ కలిగిన సంఘట్టన మూలమున ఆశియాలో బలవత్తరమైన అశాంతి నాటుకొని

పోయింది, దాని కారణంగా తటస్థించిన పరివర్తనముల వేగ పరిణామములు ప్రపంచంలో ఎక్కడా లేనంత తీవ్రంగానూ బాధాకరంగానూ చారిత్రక ప్రాముఖ్యత కలవిగానూ ఉన్నవి. ఈ ఖండం కేవలం అట్టుడికినట్లుడికి పోతూన్నది. ఆశియాఖండంలో జరుగుతూన్న పరివర్తనములలో ప్రపంచంలోని తదితర దేశాలలోకంటె విశాలతర ప్రదేశాలు, అధికతరులైన కోటానకోట్ల జనులు తీవ్రతర పోరాటాలు, ప్రసంచతర సంక్షోభాలూ యిమిడి ఉన్నవి. అవి హిందూమహాసముద్రం మొదలుకొని ఆశియా ఖండపు ఉత్తర సరిహద్దులవరకూ జరుగుతూనే ఉన్నవి. భూగోళశాస్త్రం ప్రధానంగా అనుకూల మండలాలకు సంబంధించినదనీ చరిత్ర నిర్ణీతకములకు సంబంధించినదనీ వంఘూకార్నిష్ అన్నాడు.

కాబట్టి ఒక దేశముయొక్క చారిత్రక భూగోళశాస్త్రంలో నూతన శకారంభమును నిర్ణయించే ప్రతి ఉపాఖ్యానంలోనూ యే యే మండలాలకు అనుకూల పరిస్థితులు కలిగినవో స్పష్టంగా నిర్ణయించాలి. ప్రస్తుతం చారిత్రిక భూగోళశాస్త్రం ఆశియాకు అనుకూలంగా ఉన్నట్లు తోస్తూన్నది. రాజకీయంగా ఆలోచించినట్లయితే 1842 నుండీ చైనాలో సంపాదించుకొన్నదంతా పాశ్చాత్య రాజ్యాలవారు దాదాపు పోగొట్టుకొన్నట్లే కనిపిస్తుంది. అంతేకాదు ఆర్థికంగాకూడా ప్రపంచంలో ఒక ప్రధాన సాంఘిక స్థితిని పొందవలెనని ఆశియాఖండం కృషిచేస్తూన్నది.

ఉపేక్షింపబడిన ప్రదేశాలకూ ప్రపంచజాతులకూ మధ్యగల పురాతన సంబంధాలను పునరుద్ధరించుకోడానికి 19 వ శతాబ్దం ఉపకరించింది. పాశ్చాత్య దేశాలనుండీ నూతన ప్రణాళికలనూ అభిప్రాయాలనూ ఆశియాఖండం దిగుమతి చేసుకొంటూన్నది. ప్రాచీన సన్నిహితత్వాన్ని పునర్నిర్మించుకొంటూన్న ఆశియాఖండం తన సిద్ధాంతాన్ని విదేశాలకు ఎగుమతి చేస్తూన్నది. భారతీయ విజ్ఞానాన్ని ప్రపంచానికి పంచిపెట్టిన ఆదర్శపురుషులు గాంధీ టాగూరులు. ప్రాచ్య పశ్చిమ దేశాల సంయోగమునుగూర్చి అలెగ్జాండరు ది గ్రేటు కనిన కలలు తిరిగీ స్మరణకు వస్తూన్నవి. ఈ సందర్భంలో ఆశియాఖండపు సిద్ధాంతాలు విశ్వశ్రేయస్సును కాంక్షిస్తూ పెంపొందుతూన్నవి. తన భవిష్యత్తునుగూర్చీ తాను ప్రపంచానికిచ్చే సందేశమునుగూర్చీ ఆశియాఖండం ఆశాపూరితహృదయంతో ఉప్పొంగుతూన్నది. సకల ఆశియాఖండ సంఘటనోద్యమానికి పునాదివేసిన చెంఘిస్‌ఖాన్‌ను జ్ఞాపకం చేస్తూన్నది. ఆశియాఖండపు ఐక్యమత్యం జపాను సామ్రాజ్యంలోని ఆశియాఖండపు దీవులలో ఈ అభిప్రాయాలు పరిణతి పొందుతూన్నవి. కాని కన్‌ఫూషియస్ నుడివినట్లు మనమింకా 'కల్లోలదశ' లోనే

ఉన్నాము. మనకు కొంచెంకూడా శాంతి కుదరలేదు. అత్యంత శాంతిస్థితి మన కిప్పటికీ దృగ్గోచరం కావడంలేదు.

ప్రపంచమంటే యిక ప్రత్యేక జాతుల సమ్మేళనమని అనుకోకూడదు. జాతీయతయొక్క ప్రయోజనాన్నీ నిర్వచనాన్నీ విపులపఱచిన అంతర్జాతీయ సిద్ధాంతంకూడా, రెండవ ప్రపంచ సంగ్రామం వలన కలిగిన విశిష్టపరివర్తనములకూ విశాల దృక్పథమునకూ తగినట్లులేదు. కాబట్టి ఇండియాను ప్రపంచంతో సంబంధంలేని ప్రత్యేక దేశంగా పరిగణించడానికి వీలులేదు. ఇండియా కేవలం ఇంగ్లాండుకు సంబంధించిన విషయమనీ అట్లాంటిక్ ఛార్టరు బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత దేశాలకు వర్తించదనీ చర్చిలు తాపీగాఅన్న మాటలను ప్రపంచం సహించజాలదు. ఇంగ్లాండుఅనే రాజప్రాసాదమునకు ఇండియా పెరటిదొడ్డికాదు; మొగసాలకాదు; తలవాకిటనున్న పాకకాదు, ప్రపంచంలోని మతాలన్నిటికీ ఇండియా కూడలిఅని అందరికీ తెలుసు. ప్రపంచ సంస్కృతిలో ఇండియాకు ప్రధానస్థానముంది. అంతేకాదు ఇండియా ప్రపంచ దృష్టిలో ఒక ధ్రువనక్షత్రం. విశ్వశ్రేయస్సుకు కేంద్రం. అవలిఒడ్డున తనకు ఎదురుగానున్న ఆఫ్రికావలెనే ఇండియాకూడా అట్లాంటిక్ పసిఫిక్కు మహాసముద్రాల సంగమస్థానం. కన్యాకుమారి అగ్రమునకుపోయి ఇండియా దక్షిణపుకొనను నిలబడి సముద్రంవంకకుచూస్తే కేప్ఆఫ్ గుడ్ హోపును చుట్టివచ్చే అట్లాంటిక్ మహాసముద్రంలో కలుస్తూన్న అరేబియా సముద్రము కుడిప్రక్కనూ, పసిఫిక్కు మహాసముద్రంలో సంగమిస్తూన్న బంగాళాఖాతము ఎడమప్రక్కనూ కనుపిస్తవి. ఆవిధంగా ఇండియా ప్రాక్పశ్చిముల కూడలిఅనీ, పసిఫిక్కుదేశాల స్వాతంత్ర్యమునకు కీలకస్థానమనీ, అట్లాంటిక్కు జాతుల అప్రతిహతాధికారమునకు అంకుశమనీ, బోధపడగలదు. ఇండియా చైనాకు సింహద్వారం జపాను దండయాత్రవలన చైనాలోని 45 కోట్ల ప్రజానీకముయొక్క స్వాతంత్ర్యం విపద్దశకు వచ్చింది. ఇప్పుడు జపానే మరియొక విజేత పదాఘాతముల కింద నలిగిపోతూన్నది. జపాను సామ్రాజ్యతత్త్వమును రూపుమాపడానికి చైనా స్వాతంత్ర్యం కాపాడబడాలి. శత్రుసేనల దండయాత్రలకు పూర్తిగా గుఱియైన ఐరోపాఖండపుమునకుగానీ, కొంతవరకు పారతంత్ర్యమును పొందిన చైనాకుగానీ సంపూర్ణ స్వేచ్ఛను అనుభవించేటందుకు సహాయం చేయవలెనంటే పరాధీన భారతజాతికి చేతకాని పని. కాబట్టి నూతన సాంఘిక వ్యవస్థా స్థాపనముకొఱకు భారత స్వాతంత్ర్య సంపాదనమె ముఖ్యావసరం. నేడు భారతదేశం ప్రజాబాహుళ్యంతో కలసికొని సాగిస్తూన్న స్వాతంత్ర్య పోరాటముయొక్క ప్రధానాశయమదే.

ఈ ప్రపంచ సమర సంగ్రామమునకు జీతపురాళ్ళకోసం ఆసకుడే సైనికులను మాత్రం పంపి. స్వతంత్రదేశాలు పరాధీనదేశాలుగానూ, బానిసదేశాలు స్వాతంత్ర్య దేశాలుగానూ పరివర్తనం చెందుతూండగా తన స్వాతంత్ర్యం మాట ఎత్తకుండా ఇండియా చేతులు ముడుచుకొని నుద్దప్ప చెప్పి చూస్తూ ఊరుకోవడం ప్రపంచ భవితవ్యమును అపాయస్థితికి తీసుకొనిరావడం. ఎందుకన్నంటే దినదిన ప్రవర్ధమానమవుతూన్న పక్కదేశాల వారికీ వారి సమీపస్థులకూ పరాధీన భారతదేశముపైనే ఎల్లప్పుడూ కన్నుంటుంది. ఇండియా దేశపు రాజకీయాలనూ, ప్రపంచ ఆర్థికస్థితినీ, నైతిక సిద్ధాంతాల శాశ్వత సత్యాలనూ మనస్సులోపెట్టుకొని 1942 లో కాంగ్రెసు సమిష్టి శాసనోల్లంఘనోద్యమం లేవదీసింది. ఈ తరువాత పుటలలో 1942 ఆగస్టు 8 వ తేదీని బొంబాయిలో చేయబడిన తీర్మానము ననుసరించి ఆ ఉద్యమం నడిచిన విధానమును గూర్చి దాని వివిధ పరిణామము లను గూర్చి వివరించబడింది. 'క్విట్ ఇండియా' నినాదం ఈ ఉద్యమానికి ప్రధానమై సమస్త ప్రజానీకాన్నీ సంఘటితపఱచే విజయశంఖారావంగా పరిణమించింది. వివిధ యుగాలలోనూ వివిధ శతాబ్దములలోనూ అనేక జాతుల వారిట్టి విప్లవ ప్రభావములకు లోనయినారు. ఒకప్పుడమెరికా మరొకప్పుడు ఫ్రాన్సు ఇంకొకప్పుడు గ్రీసు వేరొకప్పుడు జర్మనీ ఈలాంటి విప్లవాలకు లోనయినవే. వివిధకాలాలలో వివిధ పరిస్థితులలో వివిధదేశాలలో జరిగిన అన్ని విప్లవాలకూ మూలతత్వం ఒక్కటే.

## II

"ఇంతా అయితే చరిత్రమానవ సంబంధాన్ని ప్రధానంగా చేయవలసిన విధులలో ఒకటికాదు" అన్నాడు జూలియన్ హక్స్లీ. స్వ[illegible]వాదం మన భావంలో ఒక చిత్రమును సృజింపనక్కరలేదు. చిత్రము ఒకెక్కడనూ [illegible] అవసరంలేదు. కాని చరిత్రమాత్రం ఆబాలగోపాలానికీ సంబంధించిఉంటుంది. మానవుని కొక మానసిక తత్వమున్నది. దానిని ఆత్మ అనండి! ఇంకేమైనా అనండి. మానవుల సహజానుభవములనుగానీ, కవులూ గ్రంథకర్తలు దివ్యదృష్టితో గమనించి బోధించిన ఆధ్యాత్మిక ముఖ్యవిషయాలనుగానీ చరిత్రకారులు నిర్లక్ష్యంచేయజాలరు. జీవితంలోని జయాపజయాల అర్థం మనుష్యప్రకృతిపైన ఆధారపడి ఉంటుందని ముందుగా మనం తెలుసుకోవాలి. ఈ ప్రకృతి అనేకవిధాలు, దాదాపు అవన్నీ మానసిక సంబంధము లైనవని చెప్పవచ్చును. మనపూర్వులు చెప్పినప్రకారం ఎల్లప్పుడూ శుభాకాంక్ష గలిగిఉండడం, కోపంతోఉండడం, దిగులుగాఉండడం, సోమరిగాఉండడం, ఇవి ఆ ప్రకృతిలోని నాలుగు తరహాలు. ఆధునికులు రెండుతరహాలు ఉన్నవన్నారు. శాస్త్ర

ప్రకృతి అంతరంగిక ప్రకృతి. ఇవిగాక, ధ్యానం, భావం, ఉపలబ్ధి, ఆమూర్తం అను నాలుగు వర్గభేదాలు కలవు. ఐరోపాలో సర్వసాధారణంగా పరిగణింపబడే శారీరక మానసిక లక్షణాలు ఆఫ్రికాలో కనిపిస్తున్నవి. నన వ్యక్తిస్వభావలక్షణాలన్నిటినీ ఆఫ్రికాలో గుర్తించవచ్చును. నల్లనిచర్మము, నీగ్రోలక్షణాలూ, ఇతర జాతీయ ప్రకృతులు-ఇవన్నీ పైతొడుగులాటివి, కాని అడుగునవున్న నాడీ హేతు మాంస గ్రంథులు, నరాలనిర్మాణము, వ్యక్తిస్వభావమైన దానికి నిపాతము, శారీరక సౌష్ఠవమూ విభిన్న మానవపరంపర యివన్నీ యూరోపుఖండంలోవలెనే ఆఫ్రికాఖండంలో ఒకేతీరున ఉన్నవి."

తరుచుగా ప్రపంచ సంగ్రామాలు ఆయుధసామగ్రిలోనూ నేటి యుద్ధకరికరాల లోనూకల అత్యంతమైన ప్రాముఖ్యతను నిరూపిస్తాయంటవి "మాసిడోనియా బల్లెము గ్రీకు సంస్కృతిని ఆశియాఖండమునకు తీసుకొనిగిందనీ, స్పెయిన్ ఖడ్గము ఆధునిక ప్రపంచానికి రోముయొక్క ప్రాచీనసభ్యతను సమర్పింపజాలిందనీ" ఒకానొక చరిత్రకారుడు వ్రాశాడు. ఆవిధంగానే జర్మనీదేశపు రెక్కలబాంబులు 1944 లో ప్రపంచ సంగ్రామంయొక్క ప్రవాహాన్ని మార్పుచేయగలవని అనుకొన్నాము. కాని లాభం లేకపోయింది. ఐరోపాదేశపు యుద్ధనైపుణ్యంలో కూడా, ప్రపంచంలోని ఇతర శక్తుల ప్రభావంవలన ఫలితాలు తారుమారు కావడం కలదు. వాటినే బాకన్ "మానవుల మనోదార్ఢ్యము, వివేకం, ధైర్యం, సాహసం, దృఢనిశ్చయం, స్థైర్యం, కృషి" అని వివరించియున్నాడు. బాకన్ తత్వవేత్త, విజ్ఞానశాస్త్రజ్ఞుడూను. అయినప్పటికీ ఆయన వైజ్ఞానిక జగత్తును అతిక్రమించి పోలేకపోయినాడు, ఒకవేళ పోయినప్పటికీ ధైర్యాన్ని మించిన సుగుణాలు కలవని ఆయన భావింపలేకపోయినాడు. భారత దేశంలో పరం సత్యాహింసలకోసం త్యాగంచేయగల మహోన్నతస్థితికి మన పోరాటాలను తీసుకొనిపోగలిగాము. ఆవిధంగా అత్యున్నతపథాలకు కొనిపోబడిన సత్యాగ్రహం, చరిత్రయొక్క స్వరూపాన్ని, బలానికీ, న్యాయానికీ, సత్యానికీ, అసత్యానికీ హింసకూ, అహింసకూ, పశుబలానికీ, ఆత్మబలానికీ జరుగుతూన్న పోరాటాల విజయావకాశాలనూ పూర్తిగా మార్చివైచింది. రెండవ ప్రపంచ సంగ్రామంగా పరిగణింపబడుతూన్న ఈయుద్ధం మహాదాశయములకోసం జరగడంలేదు యుద్ధం ప్రారంభమై ఏడాది కడచినపిమ్మట రచించబడిన అట్లాంటిక్ చార్టరును ఇండియాకూ జర్మనీకీ కూడా వర్తింపకుండా చేసిన నేటి యుద్ధప్రేరేపకుల దురుద్దేశాలను వెల్లడిచేస్తూ తీవ్ర విమర్శలు బయలుదేరినవి, అధికారకేంద్రీకరణ విధానంకోసంగానీ; లేక యుద్ధంలో

సంబంధం కల్గించుకొన్న రాజ్యాల ప్రజలనందరినీ ఒకేమూసలో ఒకేవిధంగా తయారు చేసేటందుకుగానీ ఈయుద్ధం జరుగుతూండడం మరీదురదృష్టం. అందుకు తగిన పద్ధతులే ఈయుద్ధంలో బహిరంగంగా అవలంబింపబడుతూన్నవి. "తమ కిదివరకున్న దానిని తాము విడిచిపెట్టపోవడంలేదని" చెప్పిన చర్చిలు మాటలనూ, ప్రభుత్వంవారు బ్రిటను ఇండియాదేశాలలో రాజద్రోహులని పేరుపెట్టి అనేకమందిని శిక్షించడమూ, ఎన్నికలు జరుగకుండా ఆపివేయడమూ, పత్రికలనూ ప్రైవేటు ఉత్తరాలనూకూడా కఠినమైన పరిశీలనకు గురిచేయడమూ, వీటన్నిటినీ గమనించినయెడల స్వాతంత్ర్యము ప్రజాస్వామ్యమూ అని చెప్పబడే పెద్దపెద్ద మాటలన్నీ గాలిమాటలని స్పష్టంగా తేలగలదు. ఈ యుద్ధాశయాలనూ, విజయం సాధించడాని కవలంబింపబడుతూన్న పద్ధతులనూ గమనిస్తూన్నవారు, హాలెండు, జెకొస్లొవకియా, గ్రీసు, ఫిన్లాండు దేశాల స్వాతంత్ర్యాన్ని నిలబెట్టేటందుకు ఉత్సాహం చూపించడంలేదని ఇండియాను నిందింపజాలరు, ఒక్క బ్రిటనే పాతపడిన సామ్రాజ్య పద్ధతులను అవలంబిస్తూన్నదని నిందారోపణ చేయ వీలులేదు. సోవియటు యూనియను కూడా పురాతనకాలంలో జారుచే అవలంబింపబడి రెండవ నికలస్‌చే అనుకరించబడిన విదేశ రాజనీతిని ఆచరణలో పెడుతూన్నది. పోలాండు మోక్షం కోసం ప్రారంభింపబడిన యుద్ధం రష్యా యొక్క దురాశవలన పోలాండు విచ్ఛిన్నానికి దారితీసింది. అంతటితో ఆగలేదు. రష్యాదేశం, బెస్సరేబియా, బుకోవినా, ఫిన్లాండు, లాట్వియా, ఎస్టోనియా, లిథుయేనియాలపై దండెత్తి డార్డెనెల్సుగుండా మధ్యధరాసముద్రంలో స్థానం సంపాదించి పర్షియాను తన గుప్పిట్లో పెట్టుకోవలెనని కోరింది. ఇటువంటి యుద్ధంలోనే, తనకు తెలియకుండా తన యిష్టం లేకుండా ఇండియా కూడా భాగస్వామిగా ప్రకటింపబడింది. ఇందువల్లనే భారతదేశం మొట్టమొదటగా 'క్విట్ ఇండియా' నినాదం చేయవలసి వచ్చింది. అందుకు ఇండియా అనేక కష్టనష్టాలకు గురియైనది. వందలాది దేశభక్తులు ముక్కోణపుదెబ్బలు తిన్నారు. వేలకొలదీ తుపాకిగుండ్ల బారిపడ్డారు. లక్షలు కారాగృహాల పాలైనారు. రెండుకోట్ల రూపాయీల వరకూ సమిష్టి జరిమానాలు విధింపబడినవి. సాధారణంగా ప్రపంచంలో చరిత్ర అంతా ఒకే సిద్ధాంతాలనైన నడుస్తూ ఉంటుంది. కాని కొన్ని దేశాల విచిత్ర పరిస్థితులను బట్టి అక్కడి చారిత్రక పరిణామాలు వేరువేరుగా ఉండవచ్చును. ముఖ్యంగా ఇండియాలో ఇవి మొదటినుండి చివరవరకూ ఒక విశిష్ట రూపమును తాల్చినవి. ఒక మహాఖండమంత విస్తీర్ణం గలిగి వివిధ రకములగు భూసారములతోనూ నైసర్గికస్వరూపములతోనూ విరాజిల్లుతూన్న ఒక దేశం యావత్తూ దాదాపు రెండు శతాబ్దాల నుండి పరాధీనంగా ఉండడం ఆధునిక చరిత్రలో,

అపూర్వంగా కనిపిస్తుంది. క్రీస్తు యుగం ప్రారంభమైన మొదటి శతాబ్దాల చరిత్రలో, పశ్చిమాన బ్రిటను మొదలుకొని తూర్పున ఈజిప్టు వరకూగల సామ్రాజ్యంపైన దాదాపు నాలుగు శతాబ్దాల వరకూ ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన రోము పూర్వగాథ ఒక్కటే దీనితో సరిపోల్చతగిన తార్కాణం. అయితే ఈ ఉదాహరణం కూడా పరాధీనతకు సంబంధించినంతవరకే. కాని స్వాతంత్ర్య సంపాదనా విషయంలో మాత్రం తక్కిన దేశాలవలంబించిన పద్ధతికి కేవలం భిన్నమైన విధానమును ఇండియా అవలంబించింది కడచిన ఇరవైయైదు సంవత్సరాలలో ఇండియాలో సంఘటించిన పరివర్తనం చూచి ప్రపంచం విభ్రాంతి చెందింది. సత్యాహింసలనే మూలసూత్రములతో కూడిన సత్యాగ్రహంలో జాతీయ ప్రాతికూల్యమును ప్రస్ఫుటం చేసేటందుకు, సహాయ నిరాకరణం మొదలుకొని పన్నుల నిరాకరణ వరకూ అనేక అంతరువులు కలవు. ఇండియా పరాయిప్రభుత్వంయొక్క బలవంతంచేత ఇండియా అనుకోకుండా యుద్ధంలో ఒకానొకపాత్రను నిర్వహించవలసివచ్చింది, అది ఎవ్వరూ కోరదగినదికాదు. కాబట్టి జాతీయ ప్రతిఘటనకు వివిధ విధములైన శాసనోల్లంఘనమే గత్యంతరమని భావింపబడింది. ఇండియా యుద్ధంలో పాల్గొనవలెనంటే ముందుగా దానిని స్వతంత్రదేశంగా ప్రకటించవలెననీ అప్పుడే భారతీయులు ఉత్సాహంతో పోరగలరనీ కాంగ్రెసు అనేక పర్యాయములు విస్పష్టంచేసింది; కాని లాభంలేకపోయింది. కాంగ్రెసుకోరినకోరిక ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. ఇక శాసనోల్లంఘనమునకు తగిన వాతావరణం ఏర్పాటయింది. దేశాన్ని పోరాటానికి తయారుచేయడమంటే పోరాటంలోకి దించడమే. ప్రజలను స్వపరిపాలనకు అర్హులనుగా చేయవలెనంటే వారికి స్వపరిపాలన ఈయాలి. అదే విధంగా ఒక దేశాన్ని పోరాటానికి తయారుచేయవలెనంటే ఆదేశాన్ని పోరాటం ప్రారంభించేటట్లు చేయాలి. 1917 ఆగస్టు ఒకటో తేదీని గానీ, 1939 సెప్టెంబరు మూడో తేదీని గానీ ఇంగ్లాండు యుద్ధానికి తయారుగా ఉందా? యుద్ధంలో నిపుణులై ఉన్నవారే యుద్ధం చేయడం బాగా నేర్చుకొంటారు. ఈ సిద్ధాంతం హింసా యుద్ధాలకు గానీ అహింసా పోరాటాలకు గానీ సమానంగానే వర్తిస్తుంది అయితే ఏ యెత్తులో పోరాటాన్ని సాగించాలనేదే ప్రశ్న. వ్యక్తి సత్యాగ్రహంగా ఉండాలా? సమిష్టి సత్యాగ్రహముగా ఉండాలా? మొదటి పద్ధతి సత్యాగ్రహం యిదివరకే సాగింపబడి, క్రిప్సు రాయబారమనే రూపంలో కొంతవరకు మాత్రమే విజయం సాధించగలిగింది. రెండవ రకపు సత్యాగ్రహం ప్రపంచాన్ని సంక్షుభితం చేసి 1946 మార్చిలో బ్రిటిష్ మంత్రివర్గపు రాయబారాన్ని ఇండియాకు రప్పించింది.

చరిత్రప్రసిద్ధమైన ఈ యుగంలో ఇండియాలో జరిగిన సంఘటనలను సంగ్రహంగా చెప్పి ఉన్నాము. కాంగ్రెసు దాదాపు ముప్పయియైదు నెలలు కారాగారవాసం చేసి నిరహంకారంగానూ గౌరవంగానూ ఉద్యమం సాగించింది. కాని ఈ కొద్ది కాలంలో ఎన్నో లక్ష్యాలు సాధించింది. శతాబ్దాలలో జరుగవలసిన మార్పులు దశాబ్దాలలోనూ దశాబ్దాలలో జరుగవలసిన పరిణామం ఒక్క సంవత్సరంలోనూ కలుగుతూన్న యుగమిది. కాంగ్రెసు నిర్బంధం వలన ప్రపంచం సంక్షోభించింది. ఇండియాను యుద్ధంలోకి దించేటప్పుడు ఇండియా ప్రజలతో బ్రిటిష్‌వారు ఆలోచించారా అని పూర్వ పశ్చిమార్ధ గోళాలలోని ప్రజలు ప్రశ్నించ మొదలు పెట్టారు. ఇండియా ప్రజల క్షేమం కోసమే బ్రిటిష్ ప్రభుత్వ మక్కడ ఉన్నదని బ్రిటిష్‌వారు చెప్పుకొంటూంటారు కదా? అయితే ఆ దేశపు ప్రజలీ యుద్ధానికి ప్రతికూలంగా ఎందు కింత గోల చేస్తున్నారు? యుద్ధ సన్నాహాలలో సహకారం చేయడానికి కాంగ్రెసు ముస్లిం లీగులు రెండూ నిరాకరించినప్పటికీ యింతమంది సైనికులెలా చేరుతున్నారు? బ్రిటిష్ సామ్రాజ్యం మీది భక్తిచేతనా? కాలక్షేపం కోసం సాహస కార్యాలు చేయాలనే కుతూహలముతోనా? యుద్ధం వలన కలిగిన కరువుకాలంలో జీవించే టందుకు డబ్బుకోసమాశపడా? అని ప్రపంచంలోని ప్రజలు ప్రశ్నించసాగారు. ఈ రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమయిన తరువాత ఇండియా స్వాతంత్ర్య విషయము ప్రచారమయినట్లుగా అంతకు పూర్వమెన్నడూ కాలేదు. [illegible] దృష్టి గలిగి యింకా అక్కడక్కడా మిగిలిఉన్న కొంతమంది బ్రిటిష్‌వారు ఇండియాను గూర్చి హీనస్వరంతో చెప్పేమాటలుకూడా ఆ మహాసంగ్రామపు మందుగుండు ధ్వానాల మధ్యసైతం వినబడుతూనే వచ్చినవి.

అమెరికాలోని ప్రజలు ఇండియా విషయంలో మూడు తరగతులుగా ఉన్నారు. ఇండియా వ్యవహారం కేవలం బ్రిటిష్‌వారికి సంబంధించినదని చూస్తూ అభిప్రాయంతో ఏకీభవించేవారొకవర్గం, ఇండియా స్వాతంత్ర్యం వంటి సంక్లిష్ట సమస్యను పరిష్కరించడానికిప్పుడు అనువు కాదనీ మహాసంగ్రామానంతరం ముందు [illegible] చూచి ఉండడం మంచిదనీ, వాదించేవారు రెండవవర్గం. ఈ వర్గం చాలా తక్కువ. ఇండియాకు స్వాతంత్ర్యం తక్షణం ఇచ్చితీరాలని పట్టుబడుతూన్న అసంఖ్యాకులైన అమాయిక ప్రజానీకం మూడవవర్గం.

ఇండియా స్వాతంత్ర్యమునుగూర్చి అమెరికా చీనా దేశాలను జోక్యం కల్గించు కోవలసిందని కోరినప్పుడు, ఇండియా విషయం తమ అంతరంగిక విషయమనీ, ఇండియా

విషయంలోగానీ లేక తమ అధీనంలో ఉన్న యితర రాజ్యాల విషయంలోగానీ ప్రసక్తి కల్గించుకోవడానికి యితర దేశాలకు వేటికీ సంబంధం లేదనీ బ్రిటను అంటుందని భారతీయులనుకొని ఉండలేదు. కాని ప్రపంచంలో యితర దేశాలతో యేవిధమైన సంబంధమూ లేకుండా బ్రిటను ఒంటరిగా ఉట్టికట్టుకొని ఊరేగడం లేదనికూడా ఇండియాకూ కాంగ్రెసుకూ తెలుసు. తనలోని బలంకానీ దౌర్బల్యం కాని ఇండియాకు తెలియకపోలేదు. మానవత్వం పేరట బయటిదేశాల జోక్యంతో తన స్వాతంత్ర్యమును సంపాదింప తలపెట్టలేదిండియా. పైగా ఎవరైనా పౌరుడు తన మాతృదేశంలోనే అవమానింపబడేయెడల అంతర్జాతీయ శాసనాలు సాధారణంగా అతనిని సంరక్షింపలేవు. కాని బెల్జియంలో కాంగోలోని నేటివ్‌ల వలెనో, టర్కిష్ సామ్రాజ్యంలోని క్రిష్టియన్ ఆర్మీయనులవలెనో తమదేశంలో తామే భయంకరంగా బాధింపబడుతూన్న యెడల ప్రపంచం సంక్షోభిస్తున్నది. విశ్వమానవ సౌభ్రాతృత్వ భావముచే ప్రేరేపింపబడి యితర దేశాలా ఘాతుక చర్యలను ప్రతిఘటిస్తవి. 1905 లో జారిస్టు రష్యాలో జరిగిన హత్యాకాండనుగూర్చి అమెరికా యేవిధంగా ప్రతిఘటించిందో తెలియజేస్తూ రోస్టు యిలా వ్రాశాడు :—

“తమనుగూర్చి ప్రపంచంలో సుహృద్భావమూ సానుభూతీ ఉన్నవని తెలిసినప్పుడు నిరాశచెంది ఉన్నవారికి కొంతమందికి ధైర్యంగా ఉంటుంది. జరుగుతూన్న అత్యాచారలకు సభ్యతా ప్రపంచం జుగుప్సనూ నిరసనను ప్రకటించినప్పుడు అవి తగ్గిపోయేటందుకు కొంత సావకాశము కలుగుతుంది.”

కాబట్టి నిర్బంధవిధానాన్ని ఆపేటందుకు చేసిన ప్రయత్నంలో తాను కృతార్థురాలు కాకపోయినప్పటికీ, మహోత్కృష్టములగు సత్యా హింసలతోకూడిన సత్యాగ్రహ పోరాటం ద్వారా తాననుభవించిన బాధలూ చేసిన త్యాగాలకంటెకూడా, ఎక్కువ నైతిక ప్రయోజనాలను ఇండియా పొందగలిగింది. అందువల్లనే భారత స్వాతంత్ర్య ఘంటానినాదం, హిమాలయ శిఖరాగ్రములనుండే కాబూలు మార్గములనూ, మక్కా మువజ్జాన్, మదీనా మునవ్వార్ గిరినీ, పాలస్తానములోని సినాయి శైలమును, మధ్యఆశియాలోని పామిర్‌నూ, పశ్చిమాన ఆల్ప్సు అప్పినైన్సు ఫిరనీస్, ఆల్బియన్ కుధరములనూ అతిక్రమించి తూర్పున కాకసస్ ఊరల్ పర్వతాలగుండా పశ్చిమార్ధగోళంలోని మహాసముద్రాలలోనూ పర్వతశ్రేణులలోనూ ప్రతిధ్వనించింది. తన విజయం కేవలం తన చేతులలోనే ఉందని ఇండియాకు మొదటినుండీ బాగా తెలుసు, “దేశీయుల ఖడ్గాలలోనూ వారి చేతులలోనూ మాత్రమే మన ఆశాజ్యోతి

ఉంది" అన్నాడు బైరన్. కాని బైరన్ ఖడ్గం గాంధీజీ శాంతి దండంగా పరిణమించింది. క్రొత్తరకపు యుద్ధ పరికరాలతో నూతన చరిత్రను ప్రారంభించడానికి భారత దేశం ప్రయత్నించింది. అంతేకాదు రక్తపిపాసులైన యోధుల వధస్థానముల నుండి, మానవ చైతన్యము, దివ్యాత్మ అనే మహోన్నత పథాలకు రణరంగములను మార్చి వైచింది. ఈ ఇరవైవ శతాబ్దం క్రొత్త ఆశయాన్నీ, క్రొత్త పతాకాన్నీ, క్రొత్త నాయకుణ్ణీ సృజించుకొంది. భారత స్వాతంత్ర్య మహదాశయము ప్రపంచ ప్రజాభిప్రాయంలో కలిగించిన పరివర్తనమూ, భారత స్వాతంత్ర్య త్రివర్ణపతాకంలో కాలానుగుణంగా తటస్థించిన పరిణామాలూ, భారత స్వరాజ్య పోరాటమునకు మహానాయకుడైన మహాత్మాగాంధీ యొక్క దివ్యబోధలూ ప్రణాళికలూ, ఈ పుటలలో వివరింపబడేనవి.

---

# కాంగ్రెసు చరిత్ర

## [రెండవ భాగం]

## ౧ పంచాగ్నుల మధ్యనున్న ఇండియా.

కాంగ్రెసు పుట్టి భారత ప్రజానీకమును సేవించిన మొదటి ముప్పై సంవత్సరాలలో దాని భక్తగణమునందే నిరంతర పోరాటము సాగుతూ వచ్చింది. ఒక్కొక్కప్పుడు ఉప్పొంగిన ఉత్సాహము మఱొకప్పుడు ఎక్కడలేనిని స్తబ్ధత, వేఱొకప్పుడు పూర్వాపర భావపర్యాలోచనము-ఇవన్నీ కాంగ్రెసువాదులలో ప్రత్యక్షమౌతూండేవి "ఇండియాలో ఉద్యోగంచేసే బ్రిటనులో పింఛను తీసికొంటూవున్న ఆంగ్లో ఇండియనులున్నూ, భారతనిరంకుశ శాఢ్కాపలున్నూ లండను టైమ్సు పత్రికయున్నూ చేసే అసత్య దోషారోపణలకు" సమాధానంగా బ్రిటిష్ సింహాసనము ఎడల చీటికి మాటికి భక్తిని ప్రకటించుకొంటూ, రాజద్రోహమునకు వ్యతిరేకులమని గట్టిగా ప్రతిఘటిస్తూ వచ్చినందువలననే నాటి కాంగ్రెసుపోరాటముయొక్క ఆంతర్యమును గ్రహించవచ్చును. తరువాత వంగరాష్ట్రవిభజన జరిగినది. అప్పటినుండి రాజద్రోహకరంగా ప్రవర్తించటం ప్రజలకు పరిపాటి అయింది. కాని వారు న్యాయస్థానాలలో నిర్దోషులమని వాదించుకొనేవారు. ఆ పిమ్మట ఒక పదియేళ్ళు దేశంకొంత ప్రశాంతంగా ఉండెను. కాని వెంటనే ఐర్లాండుదేశపు స్త్రీ అనిబిసెంటు 'హోము రూలు' ఉద్యమమును ప్రారంభించెను. భారతదేశంలో బ్రిటిషు పరిపాలనము సాగకూడదని ఆ ఉద్యమ ఆదర్శము. కాని అంత్య నిర్ణయం బ్రిటనుతో సంబంధం లేకుండా జరుగవలెనని ఆ ఉద్యమ ప్రారంభకురాలి అభిప్రాయం కాదు. అనంతరం దేశంలో మామూలుగా ఉండే తటస్థభావంకూడా ఎంతోకాలం నిలవలేదు. తరువాత రంగమే [illegible]టునే ప్రారంభమైనది. డాక్టరు బిసెంటు కొద్దికాలం అదృశ్యమయింది. కాని గాంధి ప్రారంభించిన అభ్యుదయ ఉద్యమానికి-అనగా విప్లవోద్యమానికి ఆమె ఎదురయినది. గాంధీ ఇరవైయేళ్ళు రాజకీయరంగములో ఒక్క బిగువున నాయకత్వము వహించెను. ఒకప్పుడు కాంగ్రెసును నడిపే ప్రధాన నాయకుడుగానూ,

మఱొకప్పుడు కాంగ్రెసుకు ప్రాణప్రదుడుగానూ వ్యవహరించెను. గాంధీ కాంగ్రెసులో లాంఛనప్రాయంగా సభ్యుడైనా కాకపోయినా, సత్యాగ్రహ ప్రయోగములలో ఆయన కుగల అనుభవములనుబట్టి, ఆయన సర్వకాల సర్వావస్థలయందునూ కాంగ్రెసుకు మార్గదర్శిగానూ, భారతదేశమునకు జ్ఞానప్రదాయకుడుగానూ, విశాలప్రపంచమునకు మిత్రముగానూ నుండగలిగెను.

ఈ అన్ని అవస్థలలోనూ, అన్ని దశలలోనూ కూడా, ఒకప్పుడు కాంగ్రెసులో అగ్రేసరులుగా నున్నవారు, వారి సహచరులయొక్కయు, అనుయాయులయొక్కయు గమనవేగమును అందుకోలేక వెనుక పడిపోవలసినవారైరి. మఱికొందఱు వారి [illegible]మైన ప్రజాజీవిత రంగములనే విడిచివేయవలసివచ్చెను. అనేక పర్యాయములు [illegible] అభ్యుదయ యుగములకు ప్రతికూలముగా కూడా [illegible]నిలచిరి. గో[illegible] మహా[illegible]తాలు తిలకును, బెసెంటు గాంధీని ఎదిరించవమే ఈ యుగ [illegible]. 1934 అక్టోబరులో బొంబాయి కాంగ్రెసు జరిగిన [illegible] లోనే తాను నిర్ణయించుకొన్న ప్రకారం కాంగ్రెసులో ప్రాథమిక సభ్యుడుగా [illegible] కూడదని నిశ్చయించుకొన్నట్లు గాంధీ ప్రకటించెను. ఈ సంఘటనను [illegible] పరిశీలించినప్పుడు, జరిగిన చరిత్ర మళ్లీ జరుగుతూన్నట్లు కనిపిస్తుంది. [illegible] చదంమాత్రమే, కాని నిజమది కాదు. గాంధీ ఒక అతి దివ్యశక్తి [illegible] వత్తిడిలో సూక్ష్మరూపం దాల్చి ఒకేచోట కేంద్రీకృతంగా [illegible] ఊహించరానంత వేగంగా విజృంభించి విశాలప్రపంచమంతా వ్యాపిస్తుంది.

మఱుసంవత్సరం కాంగ్రెసు స్వర్ణోత్సవం జరుగవలసియుం[illegible] కాని ఆ [illegible] (1935) జాతీయ మహాసభ జరుగనేలేదు. 1936 ఏప్రిల్ నెలలో [illegible] కాంగ్రెసు జరిగింది. లక్నో నగరంలో జరిగిన ఆ మహాసభకు జవహరలాలు అధ్యక్షుడు. [illegible] వియోగమువలన దుఃఖభారముతో ఆయన అప్పుడే యూరోపునుండి [illegible] ఈ విషాద సంఘటనము ఆయనకేగాక భారతజాతి అంతకూ కూడా తీరని నష్టముగా పరిగణింపబడినది. ఈ సమయంలో జవహరలాలును రెండవసారి కాంగ్రెసు అధ్యక్షుడుగా చేయడం ఆయనకు కలిగిన దుఃఖమునకు భారతజాతి చూపిన సానుభూతికేగాక ఆయనను విడిచిపోయిన ఆయన ప్రియురాలు ప్రజా జీవితంలో ఆయనతో కలిసిమెలసి పనిచేసినందుకు భారతీయుల కృతజ్ఞతకుకూడా ఒక చిన్న నిదర్శనం. జవహరలాలు భారతదేశానికి వచ్చినప్పుడు ఆయనకు కలిగిన ఒక చక్కని చిన్న విజయమువలన

ఆయనరాక గణనకెక్కిన విషయం యిక్కడ కొంత చెప్పవలెనని కుతూహలం కలుగుతూన్నది. బెంగాలు పరిపాలనా నివేదికలో ఆయనను గూర్చి వ్రాసిన మాటలు సరికావని ఆయన చెప్పిన అభ్యంతరాలను బెంగాలు ప్రభుత్వంవారు అంగీకరించి వారి విచారమును వెలిబుచ్చవలసినవారైరి. ఆ సంఘటనకు సంబంధించిన బెంగాలు ప్రభుత్వంవారి ప్రకటన యిది:—

కలకత్తా

జనవరి 7, 1936

"ఈ పరిపాలనా నివేదిక బెంగాలు ప్రభుత్వమువారి అంగీకారంతో వారి అధికారంకింద ప్రకటింపబడినది. కాని ఆ అంగీకారం అభిప్రాయమును సంబంధించినంత వరకు మాత్రమేనని పీఠికలో నిస్పష్టము చేయబడి ఉన్నది. ప్రభుత్వంవారు రచయితకీ విషయం వ్రాసి తెలుసుకోగా, వివాదగ్రస్తమయిన ఆ ప్రకటన, పండిత నెహ్రూ తన అరెస్టుకు పూర్వం చేసిన బహిరంగోపన్యాసముల నుండి, ముఖ్యంగా 1934 జనవరి 18 వ తేదీని కలకత్తాలో చేసిన ప్రసంగమునుండి గ్రహించి వ్రాయబడినదే కాని మరొకటి కాదని సంజాయిషీ యిస్తూన్నాడు. ఆ ఉపన్యాసం సాకల్యంగా మాకందఉంది. తాను ప్రబోధిస్తున్న ఆర్థిక సాంఘికోద్యమాలు ప్రస్తుత సంఘ నిర్మాణమును, ప్రభుత్వాధికారమును, భగ్నం చేయడానికే ఉద్దేశింపబడినవి గనుక అవి న్యాయశాస్త్ర విరుద్ధంగా ఉండకతప్పదని వివరించడానికే నెహ్రూ పండితుడా ప్రసంగంలో విశేషించి ప్రయత్నించాడు"

"రైతులలోనూ కూలీలలోనూ పనిచేయవలసిన అవసరమును గూర్చి చెప్పి ఈ ఉద్యమంలో ప్రస్తుత న్యాయశాస్త్రానికి సంఘానికీ విరుద్ధంగా బహిరంగంగా తిరుగుబాటు చేయవలసిన తరుణం వచ్చిందిగనుక యిక ప్రభుత్వంతో పోరాటం తప్పనిసరి అవుతుంది అంటూ, వెంటనే అదే ధోరణిలో హరిజనోద్యమానికి వెనుక నిజమైనబలం రావడంతోనే ప్రభుత్వంతో కయ్యం వచ్చిందని 'ఆయన' ఉపన్యాసం సాగించాడు. ఈ ఉపన్యాస ధోరణినిబట్టి హరిజన నిధిలోనుండి హరిజనోద్యమానికి ధన సహాయం జరుగుతుందని ఊహించడం సహేతుకమేననీ ప్రస్తుతం తగాదాకు కారణమైన ప్రకటన న్యాయంగా భావింపబడినదేననీ బెంగాలు పరిపాలనా నివేదిక యొక్క రచయిత అభిప్రాయపడుతూన్నాడు."

"పైన వివరించిన ప్రకారం నివేదికలో వెల్లడింపబడిన అభిప్రాయాలు బెంగాలు ప్రభుత్వాభిప్రాయాలుగా వెలువరింపబడలేదు. కాని వాటికి ప్రకటన యిచ్చిన ప్రభుత్వం తన బాధ్యతను తప్పించుకో కోరడంలేదు. రచయిత పండితుని బహిరంగ ప్రసంగాలను ఆధారంగా చేసుకొని వ్రాశాడు కాని వాటిని పండితుని గాఢమైన ధోరణినిగూర్చి తనకు తెలిసిన దానినిబట్టి వ్యాఖ్యానించాడు. ప్రభుత్వంవారికి విషయాన్ని పునర్విచారణచేసి వివాదగ్రస్తమైన భాగము అసలును మించి అధికంగా వ్రాయబడినదనీ, రాజకీయాలతో సంబంధంలేని ఉద్యమాలు వెనుక రాజకీయ ప్రయోజనాలకోసం ఉపయోగింపబడడం తెలిసినకారణమున వాటిని ఆధారంగా చేసికొని ఇట్టి ఊహ చేయబడినదనీ నిష్కపటంగా అంగీకరిస్తున్నారు. పండితుడు కాదన్నప్పుడు ప్రభుత్వంవారు ఆయన అభిప్రాయాన్ని మన్నిస్తూ, ఊహను సత్యంగా ప్రకటించినందుకున్నూ, ప్రస్తుత సంఘటనలను సరిగా చిత్రించవలసిన నివేదిక యిటువంటి విషయానికి తావిచ్చినందుకున్నూ తమ విచారమును వెల్లడిస్తున్నారు. ప్రభుత్వంవారిస్వాధీనంలో ఉన్న అన్ని ప్రతులనుండీ ఈ భాగం తొలగించబడుతుంది."

1936 ఏప్రిల్‌లో భారతదేశ స్థితి ఎలా ఉంది? ఆమె చూపు దేనిమీద ఉంది? ఐరోపా ఖండాన్ని విప్లవ తరంగాలతో ఊపివేస్తూన్న ఆర్థిక సాంఘిక శక్తులవలన ఆ దేశంలో కలుగుతూన్న పరివర్తనా లెట్టివి? పాశ్చాత్య ప్రపంచంలో పొంగి పొరలి వస్తూన్న నూతన భావాలు భారతదేశమునకు రాకుండా ఆపడానికి; అగాధమైన అట్లాంటిక్ మహాసముద్రంకాని, అంతులేని పసిఫిక్ మహాసముద్రంకాని, అందరాని హిమాలయ పర్వతాలు కాని సమర్థములు కాగలిగెనా? యుద్ధోపకరణాలు యుగయుగానికి మారుతూ వస్తూన్నవి. ధర్మరాజు అశ్వమేధయాగం చేసినరోజులలో ఆయన విడిచిన గుఱ్ఱం ఆయన ఏకచ్ఛత్రాధిపత్యమునకు గుఱుతు. ఆ గుఱ్ఱాన్ని ఆపినవారు ఆయనతో పోటీ జయించాలి లేదా ఆయన సార్వభౌమత్వ మంగీకరించి గుఱ్ఱాన్ని అప్రతిహతంగా విడిచిపెట్టాలి. అది రాజకీయ విజయం. అశోకుడు కళింగ రాజ్యమును గెలిచినప్పుడు జయస్తంభాలను నాటి వాటిపైన తన పదునాల్గు ధర్మాలను చెక్కించడంతో సంతృప్తి పడ్డాడు. అది ధర్మ విజయము. తరువాత దేశాలపైన ఆశతో యుద్ధాలు జరగడం ఆరంభమయింది. పిదప పందొమ్మిదవ శతాబ్దాంతంలో రోజ్ బెరీ ప్రభువు ఊహించిన వాణిజ్య యుద్ధాలు సాగినవి. రెండవ ప్రపంచ మహాసంగ్రామం, అభిప్రాయాలకూ సిద్ధాంతాలకూ మధ్య జరిగిందని అంటారు. అనగా ప్రజాస్వామ్యానికీ, నియంతృత్వానికీ,

ప్రజా పరిపాలనమునకూ నిరంకుశాధికారానికీ మధ్య జరిగిందన్నమాట. ప్రత్యక్ష విరోధ భావాలు ఒక్కసారి అకస్మాత్తుగా కలిగినవి కావు. ఇంతా అయితే క్రమాభివృద్ధి పొందుతూ చలిచప్పుడు లేకుండా కలుగుతూన్న సంపత్తినముయొక్క పరిణామావధనే విప్లవమంటాము మహోపృష్టాలు కానీ ఉన్నపెసామ్రాజ్యాలు కానీ తుదినిమిషంవరకూ ఉన్నట్లే ఉండి చిట్టచివరి దెబ్బతో చూస్తుండగా విచ్చి కలిగించేటట్లు కంటికి కనపడకుండా చాపచుట్టగా జాగిలపడవని [illegible] ఒక్కసారి సంగ్రామదేవతకు బలి కావడం కానీ, అమెరికా, ప్రపంచ చరిత్రలో రెండవ [illegible] సంగర జ్వాలలలో [illegible] కానీ హఠాత్తుగా సంభవించలేదు వీటికి వెనుక అనేక కారణాలు, అవస్థాలు, అన్యాయాలు చాలకాలంనుండి పనిచేస్తున్నవి. తుఫాను రాబోయేముందు అంతా ప్రశాంతంగా ఉన్నట్లుగానే ఉండి మబ్బులూ ఉరుములూ మెరుపులూ పిడుగులూ లేనట్లుగానే [illegible] చెలరేగేముందుకూడా ఎక్కడో దూరాన కొంత కల్లోల ధ్వని [illegible] ఆవేశంతో వినిపిస్తూ వచ్చింది.

1936 ఏప్రిల్‌లోని లక్నో కాంగ్రెసు నాటికే రాబోయే తుఫానును సూచించే శకునాలు చాలా కనిపించినవి 1935 లోనే ఇటలీ అబిసీనియాను ముట్టడించింది. భారతదేశంలో పౌరస్వాతంత్ర్యం పూర్తిగా అణచబడింది గవర్నర్ జనరల్ క్రిమినల్ లా సవరణచట్టమును సర్టిఫై చేసిఉంచాడు ౨౦౦౦ మంది డిటెన్యూలు 1934 జూలై నాటికీ జైళ్లలో మ్రగ్గిపోతూండిరి ఇంతకుపూర్వం అయిదు సంవత్సరాలలో ౫౦౦ వార్తాపత్రికలనుండి ధరావతులు కోరబడినవి అందులో ౩౫౦ పత్రికలు ధరావతులు చెల్లించలేక ఆగిపోయినవి ౧౩౦ పత్రికలు దాదాపు ౫౦,౦౦౦ వరకు ధరావతు చెల్లించినవి దూరాన [illegible] అభ్యుదయ కార్యక్రమము ప్రపంచదృష్టిని ఆకర్షించడం ప్రారంభించింది. దాస్యశృంఖలములను ఛేదించుకొని పెట్టుబడిదారీ విధానపు బంధనములనుండి విముక్తి పొందిన [illegible] ప్రాచ్య దేశముయొక్క ప్రగతి అభ్యున్నతగాఢ చిరకాలంనుండి నిరంతర పారతంత్ర్యములో నిమగ్నమై నిరాశాపూరితమైన భారత ప్రజానీకమునకు ఆశాజ్యోతిగా పరిణమించింది. నూతన సంఘవ్యవస్థకు దారితీసే, ప్రజాసామాన్యముయొక్క మోక్షంకోసం ఈ మహత్తరదేశమవలంబించిన గమనవేగమునకు మాస్కో పెట్రోగ్రేడులే కాక, జార్జియా ట్రాన్సుకాకస్సులుకూడా లోనైనవి. భారతదేశపు పారిశ్రామిక జనసంఖ్య రెండు లక్షలకు మించిలేదు భారతదేశమునకు వెన్నెముక అనదగిన అసంఖ్యాక కర్షక ప్రజా సమూహమే భారతదేశమునకు నిజమైన సమస్య వారికి

అసలు పని లేకపోలేదు. కాని తగినంత పని లేదు. జాతీయ ఆరోగ్యశాఖ కార్యాలు ప్రస్తుత పరిపాలనకంటె యే విధంగానూ యోగ్యమైనవి కావు. ... పరిపాలన కింద పడి నలిగిపోతూన్న భారత ప్రజల భావాలు, ఆశయాలు, ఆదర్శాలు, వాంఛలూ అన్నీ కూడా వునపు ఉపశాన్యదశకు హాసాయిదానిగానున్న దేశాలనుంచి వచ్చే శక్తులవల్ల ఆకిథలు కేవలం పక్షపాత దృష్టితో అల్పనవై ఆక్షేపణీయముగా ఉంటే నుంచవచ్చును గాక - ప్రజ్వలితములై, రష్యా ఉక్రేనలలోని సామ్యవాదులవంటి సామ్యవాదులను వారి సంస్థలను పోలిన సంస్థలను వారి స్వాతంత్ర్యములను పరిరక్షించు స్వాతంత్ర్య సంస్థాపనమును ప్రోత్సహిస్తూండినవి ఇటలీ, జర్మనీ దేశాలు లనుకునే తో బాధితని క్షామ నివారణోపాయములను ఆచరణలో పెడుతూ తమ దేశ ఆర్థిక స్వాతంత్ర్యములను పెంపొందించి జాతీయ పునరుజ్జీవనమునకు తగిన విశ్వాసోత్సాహములను ప్రజలలో పునరుద్ధరిస్తూ ఉండినవి. విజేత అయిన ఇంగ్లాండు బాధితగా నిలబడి, సంఘ క్షేమానికి కావలసిన ప్రణాళికను బాగా ఆలోచించి, సక్రమంగా తయారుచేసికొని, కమ్యూనిస్టు దండయాత్రలను తట్టుకోగలిగింది. అయితే ఇంగ్లాండుచేసిన ఈ చికిత్స, తరతరాలనుండీ వస్తూన్న పెత్తనదారీతనమువలననూ, పెట్టుబడిదారీ విధానమువలననూ తటస్థించిన చిత్తవైకల్యమునకు తాత్కాలిక నివారణోపాయమేకాని, అసలు రోగమును మూలచ్ఛేదం కావించే శాశ్వత చికిత్సమాత్రం కాజాలదు. ముసలితనపు పింఛనులను, కార్మిక చట్టములను, ప్రసూతి సౌకర్యములను, అనారోగ్య భీమాలను అనాథబాల శరణాలయములను కుష్ఠు ఆసుపత్రులను, నిరుద్యోగ విరామములను ఇంగ్లాండు, బోల్షివిజంయొక్క మహా ప్రవాహమునకు ఆనకట్టలుగా వినియోగించింది. అయితే, "యుద్ధంలో విజయం పొందిననాడున్నంత మిక్కుటంగా యే సైన్యమూ యెప్పుడూ ఉండదు" అని మార్షల్ ఫోక్ చెప్పినట్లుగా ఇంగ్లాండు దౌర్బల్యం జగద్విదితం.

## కాంగ్రెసు దృక్పథం.

తన రాజకీయ స్వాతంత్ర్య సంపాదన నిమిత్తం యాభైయేండ్లకిందట భారత దేశం కాంగ్రెసుద్వారా ఒక ప్రణాళికను తయారు చేసుకొన్నది. 19 వ శతాబ్దారంభంనుండీ ఐరోపాఖండంలోని రాజకీయ పరివర్తనమునందు గట్టిగా నాటుకొనియున్న జాతీయతా సిద్ధాంతం, ఆ కాలంలో యావద్భారతదేశంలోనూ ఒకే విధమైన జాతీయ జీవితమును, భావమునూ, ఆశయమునూ, ప్రయత్నమునూ, ఆదర్శమునూ,

ఆచరణమునూ వ్యాపింపచేసింది. ఈ ఐక్యత చారిత్రిక మనండి, నైసర్గికమనండి, శారీరకమనండి, తెగల (Ethnological) సంబంధమనండి, లేదా సాంఘికమనండి సాంస్కృతికమనండి, ఏదైనప్పటికీ దీనితో పాటు, ఆశియా ఐరోపా ఖండములలోని దేశాలలోనూ, రాజ్యాలలోనూ నివసించే మానవ సమాజ జీవితములో విశేష పరివర్తనం కలిగించిన ఆర్థిక సిద్ధాంతముల తీవ్ర పరిణామములనుకూడా భారతదేశం ఎప్పటికప్పుడు అనుసరిస్తూనే ఉన్నది. ఒకే జన్మస్థానము, ఒకే సంప్రదాయమూ ఒకే సహోద్దులు, ఒకే జాతీయ లక్షణాలు, ఒకే జాతీయతా భావాలు, ఒకే స్వాతంత్ర్య వాంఛలూ, ఇవన్నీ ప్రత్యేకంగానూ, మొత్తంగానూకూడా సమిష్టి ప్రయత్నాన్ని ప్రోత్సహించి సమగ్ర కార్యక్రమానికి దోహదం చేసినవి. అంతకుపూర్వం ఊహా మాత్రముగానున్న జాతీయ భావాలు, ఘనీభవించి మనిషికి మనిషికీ గల సాంఘిక బాంధవ్యమును నిరూపింపదొడగినవి. నూతన ఆర్థిక సిద్ధాంతములు నూతన పరిపాలనా సూత్రములు అతివేగంగా ప్రచారంలోకి రాప్రారంభించినవి. ‘నావిష్ణుః పృథివీపతిః’ అనే పూర్వాభిప్రాయం పూర్తిగా మాఱిపోయి ప్రజాభిప్రాయంద్వారా సంక్రమించిన సర్వాధికారాలు గల సార్వభౌముడుగా రాజు తలంపబడుతూన్నాడు దైవ సమానుడనుకొనే రాజును నిరంకుశ పరిపాలకుడుగా భావిస్తూన్నారీకాలపు ప్రజలు. కాని ప్రజలకు లభించిన వోట్లుగానీ అభిప్రాయం ప్రకటించేహక్కుగానీ వారికి సంతృప్తి కలిగించలేదు. వోట్లతో ఎవరికీ కడుపునిండదు. ప్రతి మానవుడూ బ్రతికేటందుకు, కనీసం తినడానికికూడూ, కట్టేటందుకు బట్టా, నిలవడానికి నీడా ఉండాలి; ఇవి సాధ్యమైనంత త్వరలో ప్రతివానికీ లభిస్తవని నిశ్చయంగా చెప్పగలిగిఉండాలి. నూతన సంఘవ్యవస్థ వెంటనే స్థాపింపబడుతుందో అందుకు చాలాకాలం పడుతుందో అది వేరేమాట కాని ఆర్థిక సంతృప్తీ, సాంఘిక సమానత్వమూ లేని ఎటువంటి రాజకీయ స్వాతంత్ర్యమూకూడా ప్రజా సామాన్యానికి సంతృప్తి కలిగించచాలదు. విజాతీయ ప్రభుత్వంకింద పడిఉన్న భారతదేశంవంటి దేశంలో జాతీయ స్వాతంత్ర్యసమస్య సాంఘిక పునర్నిర్మాణ సమస్యకంటె ముందుగా పరిష్కారంకావలెనని తేలికగా అందఱూ అంగీకరిస్తారు. అయితే సంప్రదాయసిద్ధమైన దేశీయ విద్యా విధానమును, న్యాయ పరిపాలనమును, ఆర్థిక నిర్మాణమును తల్లకిందులుచేసిన విదేశీ పరిపాలనకింద నూటయాభైయేండ్లనుండీ ఉన్న దేశానికి సాంఘిక పునర్నిర్మాణం జరుగనిదే స్వాతంత్ర్యం వస్తుందనేమాట వట్టి కల్ల. స్వాతంత్ర్యం వచ్చినపిమ్మట యెప్పుడో సాంఘిక

సమస్యను పరిష్కరించవచ్చుననుకోవడంకూడా సరియైన మాటకాదు. స్వాతంత్ర్య పోరాటమూ సాంఘిక పునర్నిర్మాణమూ ఒకేసారి జరుగుతూవుండాలి. అందువలననే గాంధీజీ నాయకత్వంక్రిందనున్న కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమునుగూర్చి; ముఖ్యంగా రైతుల అభ్యున్నతికీ, సాంఘిక ఐకమత్యమునకూ, నిమ్నజాతుల పునరుద్ధరణకూ సంబంధించిన సమస్యలనుగూర్చి పదే పదే వక్కాణిస్తూవుంటుంది. భారతదేశపు సాంఘిక ఆర్థిక పునర్నిర్మాణముకంటెకూడా; భారత రాజకీయ స్వాతంత్ర్య సంపాదనమునుగూర్చి జాతీయదృష్టి ఎక్కువ కేంద్రీకరింపబడడం చాలా విచారకరము. మొదటిరంగంలో పనిచేసేవారు చిందర వందరగానున్న సంఘంలో ఎక్కడనో ఒకచోట అణగి మణగి కాలక్షేపం చేయవలసివుంటుంది. రెండవ రంగంలో పనిచేసేవారు కావించిన ప్రీతి త్యాగమూ బహిరంగంగా ప్రకటింపబడుతుంది. కాని కాంగ్రెసు మాత్రం జాతీయాభ్యుదయమునకు సర్వతోముఖంగా తోడ్పడింది. రాజకీయ స్వాతంత్ర్యోద్యమము, సాంఘిక పునర్నిర్మాణము, శాసనోల్లంఘనము, నిర్మాణ కార్యక్రమమూ అన్నిటినీ విదేశీపాలకుల దుండగములను లెక్కచేయకుండా సవ్యసాచిత్వబుద్ధితో కాంగ్రెసు నడపగలిగింది. 1929 మధ్యలోనే బొంబాయి అ. భా. కాం. సం. అంగీకరించిన తీర్మానమునుబట్టి దాని అపూర్వమైన దూరదృష్టి వెల్లడి కాగలదు. భారతీయుల దరిద్రమునకు, దౌర్భాగ్యమునకూ, విదేశీ ప్రభువుల దోపిడీ విధానమేగాక, వారు దానిని కొనసాగించేటందుకు సంఘములో ప్రోత్సహించిన ఆర్థిక నిర్మాణ పద్ధతికూడా కారణమనీ, పైన పేర్కొనబడిన భారత ప్రజానీకముయొక్క దరిద్రమునూ దౌర్భాగ్యమునూరూపుమాపి వారి అభ్యున్నతికి తోడ్పడవలెనంటే, నేటి ఆర్థిక సాంఘిక పునర్నిర్మాణములో అపూర్వపరివర్తనములను కలిగించి సమాజములోగల విపరీతపు హెచ్చు తగ్గులను తొలగించవలెననీ ఆ తీర్మానములో వివరింపబడింది. భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యమునుగూర్చి లాహోరులో చేసిన తీర్మానమునకు ఆరు నెలలు ముందుగానే ఈ తీర్మానము చేయబడినసంగతి గమనించవలసివుంది. స్వాతంత్ర్యం వచ్చేవరకూ నూతన సంఘ వ్యవస్థాపనము జరుగ వీలులేదని సిద్ధాంతరీత్యా అంగీకరిస్తూన్నప్పటికీ, సాంఘిక ఆర్థిక వ్యవహారములలో తీవ్ర పరివర్తనములను కలిగించవలెననే కోరికమాత్రం, స్వాతంత్ర్య తీర్మానమునకు ఆరు నెలలు ముందుగానే వెల్లడింపబడింది. ఈ విధంగా భారత దేశంలో స్వాతంత్ర్యభావాలూ, పునర్నిర్మాణభావాలూ, ఈ రెండూ, ఈడూ జోడుగా ఒకేసారి అభివృద్ధి పొందుతూన్నట్లు

1929-30 లోని కరాచీ కార్యక్రమమును పరిశీలించినచో తెలియగలదు. "ప్రజా సామాన్యమును దోచుకొని తినే విధానమును రూపు మాపవలెనంటే ఆకలితో అలమటించే కోటాను కోట్ల ప్రజల ఆర్థిక స్వాతంత్ర్యంకూడా మన రాజకీయ స్వాతంత్ర్యంలో ఇమిడి ఉండాలి" తరువాత 1936 లోని కర్షక ప్రణాళిక కూడా ఈ విషయాన్ని ఇంకా స్పష్టం చేస్తున్నది.

స్వరాజ్య సంపాదనమే కాంగ్రెసు ప్రధాన సిద్ధాంతమైన 1920 నాటినుండీ, భారతీయ మూలపురుషులలో ఒకరై పండితుడూ, జ్ఞానీఅని చెప్పకోదగిన డాక్టరు భగవాన్ దాసు స్వరాజ్యమనే పదాన్ని నిర్వచించవలసిందని కాంగ్రెసును పదేపదే కోరుతూఉండెను ఇంగ్లాండులోవలె యేఖై కుటుంబాలచేతులలోనో, ఫ్రాన్సులోవలే యే 200 కుటుంబాల యాజమాన్యంక్రిందనో ఇండియా దేశపు పరిపాలన జరుగవలెనా? ఉత్పత్తి లాభవృష్టితో విదేశాల కెగుమతిజేయుటం నిమిత్తంగాక కేవలం దేశంలోని ప్రజల ఉపయోగం నిమిత్తమే కావలెనను సాధారణ సిద్ధాంతంపైన సంఘపునర్నిర్మాణం జరుగవలెనా? ఈ సంగతులు తేల్చుకోవలసి వచ్చింది. ఫలానా విధానము కావలెనని ముందుగా పేరుపెట్టడం తీరని ఛీత్కారములకు కారణమౌతుంది కాని పేరు పెట్టినా పెట్టకపోయినా, కాల పరివర్తనములనుబట్టి కాక భావ పరివర్తనములనుబట్టియైనా సాంఘిక పరిణామములు తటస్థిస్తూనే ఉన్నవి.

స్వతంత్ర దేశాలలోని ప్రజలు నిజపరిస్థితుల కనుగుణంగా తమ బాధ్యతలను తీర్చిదిద్దుకొంటారు భారతదేశంలోని ప్రజలు స్వతంత్రించి యేపని చేయడానికి వీలు లేదు. అటువంటి స్వాతంత్ర్యంలేని ప్రజలకు పైన ఉపహరింపబడే బాధ్యతా భావంకూడా కొఱవడుతుంది. అనగా ప్రేమలేని ఇంజనువలె పనిచేస్తారు. కాబట్టి కమ్యూనిస్టు పద్ధతుల మీద నిర్మాణం కావలెననే ఆకర్షణలను కార్మికవర్గం ఎదుర్కోవలసివచ్చింది. యువక హృదయాలలో పచ్చిసోషలిస్టు భావాలు చొచ్చుకొనిపోయినందున పెట్టుబడిదార్లూ, పెత్తనదార్లూ గతిలేక క్రమక్రమంగా విదేశీ ప్రభువుల చేతులలో పడిపోదొడగినారు కమ్యూనిస్టు మహోతరంగాలకూ, పెట్టుబడిదారుల పిల్లకెరటాలకు మధ్య విడిగి పడకుండా కాంగ్రెసు కొండవలె నిలబడ్డది. కాంగ్రెసు పరిష్కరించు దలచుకొన్న సమస్య ఒక్కటే. అది అహింసామూలకమైన జాతీయ స్వాతంత్ర్యం. కాని బ్రిటిష్‌వారివలెనే కాంగ్రెసుకూడా ద్వంద్వవిధాన మవలంబిస్తున్నది. బ్రిటిష్‌వారు నిర్బంధముతో పాటు సంస్కరణములను, దౌర్జన్యముతోపాటు సామవాక్యములను ప్రయోగిస్తూఉం

టారు. కాంగ్రెసు కూడా పోరాటంతోపాటు నిర్మాణ కార్యక్రమము సాగిస్తూ వచ్చింది. కాబట్టి కాంగ్రెసు ఆదర్శం కేవలం రాజకీయ స్వాతంత్ర్య సంపాదనమే కాని నూతన సంఘవ్యవస్థాపనము కాదనడం సమంజసంకాదు. కాంగ్రెసు చాలాకాలంక్రిందటనే అనగా 1920-21 నాటికే, రాజకీయాధికారంకోసం బ్రిటిషువారితో జోరైనపోరాటంతోపాటు నిర్మాణకార్యక్రమాన్ని కూడా అవలంబించింది. బ్రిటిషువారు నూరేండ్లు బుద్ధిపూర్వకంగా ప్రయత్నించి, భారతదేశాన్ని రాజకీయంగానూ, ప్రాదేశికంగానే గాక, నైతికంగానూ ఆధ్యాత్మికంగానూ, సాంఘికంగానూ ఆర్థికంగానూకూడా జయించారు. కాంగ్రెసు తన నిర్మాణ కార్యక్రమంతోకూడిన రాజకీయ పోరాటంద్వారా మళ్లీ అన్ని విధాలా భారతదేశాన్ని గెలుచుకోబోతున్నది. ప్రపంచ మహాసంగ్రామం ప్రచారంలోకి తెచ్చిన 'నూతన సంఘవ్యవస్థ' అనే నినాదంలోని భావం, కాంగ్రెసు సిద్ధాంతంలోనూ కార్యక్రమంలోనూకూడ ఇమిడిఉంది. ఐరోపా అమెరికా ఖండములపారిశ్రామిక విధానమునకుకూడా భూతమైన యంత్రయుగమువలన, పాశ్చాత్య నాగరికతకు స్పర్థ మూలకందమై వివాదములు పెచ్చుపెరిగినవి. ప్రాచ్యదేశాలలో సహకారభావమే సంఘవ్యవస్థకు పునాదిగాఉండి అహింసాతత్త్వమును పెంపొందించగా, పాశ్చాత్యదేశాల సాంఘిక ఆర్థిక నిర్మాణమునకు హింస మూలమయింది. అందువలననే గ్రామాల పురాతన శిల్పకళా పరిశ్రమలు పునరుద్ధరింపబడి అవి స్వయంసంపూర్ణములుగా ప్రకాశించినప్పుడు అహింసాతత్త్వముయొక్క ప్రత్యక్ష స్వరూపము గోచరం కాగలదు. పాశ్చాత్య సభ్యతయొక్క దోపిడి దురాశా విధానములకు కేంద్రమయిన స్పర్థాభావం ప్రాచ్య పాశ్చాత్యదేశాలకు, ఒక జాతికి మఱొకజాతికీ, గ్రామాలకూ పట్టణాలకూ, కర్షకులకూ పారిశ్రామికులకూ, స్వయం సంపూర్ణతకూ సామ్రాజ్య తత్త్వమునకూ వివాదములను పెంచి ఇరవై శతాబ్దములో జరిగిన రెండు ప్రపంచ మహాసంగ్రామములకు కారణభూతమయింది. అయితే ప్రాచ్యదేశీయులమైన మనకు, బ్రిటనుదేశపు ప్రజాస్వామ్యమునకుగానీ, జర్మనీదేశపు నియంతృత్వమునకుగానీ యేమీభేదం కనిపించడం లేదు. ఒకదానిని సామ్రాజ్యవాదమనీ రెండవదానిని ఫాసిజమనీ అంటే అనవచ్చు. రెండూకూడా తమ స్వంత బడాయికోసం ప్రపంచంలోని అంగళ్లను స్వాధీనం చేసుకోవలెననే ఉద్దేశంతో ఆయాదేశాలవారిని బానిసలుగా తయారుచేయడానికిమాత్రమే ఎక్కువగా కృషి చేస్తూన్నవి. పారిశ్రామికతత్త్వంకానీ పెట్టుబడిదారీ విధానంకానీ కనబడకుండా పట్టణాలచుట్టూ యేవిధంగా వలలు పన్నుకొనివస్తూన్నవో ఆ విషయమునూ, ఈదేశంలో

ఇంకా పూర్తిగా అస్పష్టంకాని పెత్తందారీతనం, జమీందారులు, పెద్ద పెద్ద భూస్వాములు జాగీరుదారులు ముఠాదారులు, మున్సబ్‌దార్లు, మాల్ గుజారీదారులు, ముట్టాదారులు. ఇంకా అనేకమంది మధ్యవర్తులద్వారా ఎంత చాకచక్యంగా పెంపొందింపబడుతూన్నదో ఆ సంగతిన్నీ కాంగ్రెసు గ్రహించకుండా పోలేదు. ఇటువంటి మధ్యవర్తులు సంయుక్త రాష్ట్రాలలో పదమూడున్నర కోట్లవారూ పశ్చిమభారతంలో ఎంతలేదన్నా రెండుమూడు కోట్లవారూ ఉన్నారు. హిందూదేశం పారిశ్రామిక దేశంకాదని కానీ. అక్కడి మిల్లు కూలీలు సంఖ్య 50 లక్షలకు మించిలేదని కానీ, చెప్పినంత మాత్రంతో సాధారణ సాంఘిక విషయాలను తిరిగి సమన్వయం చేయవలసిన అవసరం లేకపోలేదు. ఆ సంగతి కాంగ్రెసు గ్రహించి 1931 కరాచీ కాంగ్రెసులో పౌరుల ప్రాథమిక హక్కులనూ, ధర్మాలనూ వివరిస్తూ ప్రకటన చేసింది. తరువాత బొంబాయిలో జరిగిన అ. భా. కాం. సం. ఆ ప్రకటనను బలపరిచింది. ఇదంతా కరాచీ కాంగ్రెసు జరిగేముందు కరాచీలో జరిగిన బహిరంగసభలో గాంధీ మొట్టమొదటిసారి 'గాంధీజం' అనివాడిన ఒక చిన్నమాటలో సూచింపబడింది.

అయితే యీ నూతన సంఘ వ్యవస్థను ఏ పద్ధతులతో నిర్మించాలి? దానిని నిర్మించేవారెవరు? అనే విషయాలను గూర్చి పూర్వమూ భేదాభిప్రాయముంది; యిప్పుడూ ఉంది. అహింసద్వారానా లేక హింసామూలకంగానా అనేది ముఖ్య భేదం. కాంగ్రెసు ప్రధాన సూత్రంలో ఉన్న 'శాంతియుతము ధర్మసమ్మతము' అనే మాటలకు బదులుగా 'సత్యము, అహింస' అనే మాటలను చేర్చవలెనని, 1934 అక్టోబరులో బొంబాయి అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలోనూ తరువాత విషయ నిర్ధారణ సభలోనూ వచ్చిన తీర్మానము వీగిపోయిన మాత్రాన, నిజంగా ప్రజా సామాన్యమునైనను, అధిక సంఖ్యాకులైన కాంగ్రెసువాదులపైననూ కూడా అహింసా సిద్ధాంతము యొక్క పలుకుబడి తగ్గిపోలేదు. కాని హింసామూలక విప్లవంద్వారా అతి త్వరితంగా ఫలితం చేకూరగలదనుకోవడం వలన. యువకులు బాగా ఆకర్షింపబడ్డారు. 1930-34 సంవత్సరాలలో కారాగృహవాసము అనుభవిస్తూన్నప్పుడు వీరికి, హింసలో విశ్వాసం కలిగినందుకు బ్రిటిష్‌వారిచే అమానుష క్రూరచర్యలకు పాల్పడిన అనేకమందితో సాహచర్యము కలగడమేకాక. వారి శుశ్రూష కూడా లభించింది ఆటువంటి రాజకీయ బాధితుల అపూర్వ త్యాగ గాథలదివరకే పైపు కాగితాలలో మీరు చదివివున్నారు. అటువంటివారితో కలిగిన

ప్రత్యక్ష సంపర్కమునకు తోడు, రహస్యముగా అందచేయబడిన యం. యన్ రాయిగారి బోధనలుకూడా వారికి హింసలో నూతన విశ్వాసంకలగడానికిగానీ లేక పాత విశ్వాసాన్ని పునరుద్ధరించడానికిగానీ బాగా దోహదంచేసినవి. అంతేకాక అహింసా ఉద్యమం అపజయం పొందినట్లుగా కనిపించడం, అంతవరకూ అణగి మణిగి ఉన్న అధికారుల మరహంకారం పెచ్చుపెరిగి విజృంభించడంచూచి, అదివరకల్లా అటు ఇటూ కాకుండా ఊగులాడుతూన్న యువక బృందమునకు కొంత ఉద్రేకం పెరిగింది. దాని ఫలితమే దేశంలోని యువకులలో ఎక్కడచూచినా సోషలిస్టు నినాదాలు వినిపించడం యూత్ లీగులు, విద్యార్థి ఫెడరేషనులు ఎక్కడపడితే అక్కడ స్థాపించబడినవి. త్వరలోనే కాంగ్రెసు సోషలిస్టుపక్షం అనేపేరుతో ప్రత్యేకంగా కాంగ్రెసులోనే ఒక పక్షమేర్పాటు చేయబడి కొన్ని శిక్షణలో పనిచేయడం ప్రారంభించింది తరువాత క్రమక్రమంగా కమ్యూనిస్టుపార్టీ అనే పేరుతో మరొక పక్షం పైకి వచ్చి త్వరలోనే సోషలిస్టు పార్టీని తొక్కివేసింది సి యస్. పి అనీ సి పి. అనీ ఈ రెండు పార్టీలు బాగా వాడుకలోకి వచ్చినవి. అంతకుపూర్వం వీటినిగూర్చి యేమీ తెలియని ప్రజా బాహుళ్యానికి గవర్నమెంటువారిచే నడపబడిన కుట్ర కేసుల ద్వారా ఈ విషయాలు బాగా తెలిసివచ్చినయి. దక్షిణ భారతంలో సి యస్. పి వారి ఒక సాంవత్సరిక నివేదికలో, సి. యస్. పి. నిజంగా సి పి. వలె పనిచేస్తూన్నదని స్పష్టంగా ఉదహరింపబడినది. సి. యస్. పి. త్వరలోనే తన పలుకుబడిని పోగొట్టుకొని 1940 నాటికి రంగాన్ని సి. పి. కి వదలి దాదాపు అదృశ్యమయింది. రెండవ ప్రపంచ సంగ్రామంలో సి పి. వారి కార్యకలాపం ప్రసిద్ధికెక్కింది. 1941 ప్రారంభంనాటికి ప్రభుత్వంవారు 600 మందిని (వారిలో చాలామంది యూనివర్శిటీ విద్యార్థులే) డిటిన్యూలుగా ఉంచినట్లు ప్రకటన చేశారు. ఈ విషయాలనుగూర్చి ముందు మరొకసారి విపులంగా ప్రస్తావించగలము. కాని 1936 ఏప్రిల్ నాటి లక్నో కాంగ్రెసుతో ప్రారంభమైన సంఘటనల పుట్టు పూర్వోత్తరాలను పరిశీలించడానికి పాఠకులకు వీలు కలిగేటట్లు కడచిన ఐదు సంవత్సరాల చరిత్రము సంగ్రహంగా చెప్పవలసివచ్చినది.

ఈ పూర్వాపర సందర్భాలన్నిటినీ గమనించి లక్నో కాంగ్రెసు కెవరు అధ్యక్షులుగా ఉండాలాఅనే విషయాన్ని నిర్ణయించవలసివచ్చింది. గాంధీకి మతం ప్రధానమనీ, ఆయన రాజకీయవేత్తగాకంటె ఋషిగానే యెక్కువ రాణిస్తాడనీ అను కోవచ్చు. కాని ఆయనకు రాజకీయ చాతుర్యంగానీ, లౌక్యంగానీ లేదను

కోవడానికి వీలులేదు. ఆయన ఈనాడు పూర్వాచార పరాయణుడుగా కనిపించవచ్చు. అంతమాత్రంతో ఆయనకు ఆధునిక భావ పరంపరతో సంబంధంలేదని తలంచరాదు. ఇవన్నీ అలా ఉండగా ముఖ్యంగా ఆయన కష్ట సుఖాలు తెలిసినమనిషి. సంవత్సరంలో ఎప్పటికప్పుడు జరిగే సంఘటనలను చక్కగా ఆయన గమనిస్తూనే ఉండెను. 1935 లో వైద్యం చేయించుకోవడానికి కమలానెహ్రూ ఇండియానుండి బేడెన్ వేలర్‌కు పోయేటప్పుడు ఆమె గాంధీని దర్శించి, తన ఆసుపత్రిని గాంధీగారి చేతులలోపెట్టి వెళ్ళెను. తరువాత జవహరులాలునెహ్రూ, తాను విడుదలకావలసిన తేదీకి 5½ నెలలు ముందుగా 1935 సంవత్సరం సెప్టెంబరు 4వ తేదీని హఠాత్తుగా విడుదలై, జర్మనీకి పరుగెత్తెను. ఏళ్ళకొలదీ పోరాడి ఎన్నో బాధలకోర్చి కమలానెహ్రూ దివంగతురాలైంది. జవహరలాలునెహ్రూ 1936 మార్చిలో ఇండియాకువచ్చి తన రాష్ట్రంలోనే కాంగ్రెసు అధ్యక్షపదవిని స్వీకరించెను. ఆ పరిస్థితులలో ఆయనను కాంగ్రెసు అధ్యక్షుడుగా చేయడం అత్యంత సమంజసం. తన అర్ధాంగితోపాటు దాదాపు ఇరవై సంవత్సరాలు అష్టకష్టాలూపడి శక్తివంచనలేకుండా ఉత్కృష్టమైన సేవచేసినవానిని ఇంతకంటె భారతజాతి ఏ విధంగా సమాశ్వాసింపగలదు ? ఇంక ఏకారణము లేకపోయినా ఈ ఒక్క కారణమే చాలును ఆయనను అధ్యక్షునిగా ఎన్నుకోవడానికి. పైగా ఈ కారణమే కాక, ఆయనను తప్పనిసరిగా ఎన్నుకోవలసిన పరిస్థితులనేకం కలవు. కాంగ్రెసును లోపలనుండి నడిపించడానికిగానీ, వెలుపలనుండి నిరోధించడానికిగానీ గాంధీ తరువాత ఆయనయే అత్యంత శక్తివంతుడైన కాంగ్రెసువాది. గాంధీతో ఆయన నిష్కపటంగానూ నిష్కర్షగానూ పోట్లాడుతాడు. కాని తుదకు ఆయన నిర్ణయాలను అంగీకరించడం నియమంగా పెట్టుకొన్నాడు. అంతేకాక రష్యా, జర్మనీ, ఇంగ్లండు, అమెరికా, జపాన్, చైనా, ఫ్రాన్సు, స్పెయిన్, ఇటలీ, దేశాలలోనూ మధ్య ఐరోపాఖండంలోనూ జరుగుతూన్న సంఘటనలను పరిశీలిస్తూ నేటి క్లిష్టపరిస్థితులను అర్థంచేసుకోవడానికి ప్రయత్నం చేశానంటాడాయన. కమ్యూనిస్టు సిద్ధాంతం తనకు ఆశాకాంతులను ప్రసాదించిందని అంగీకరిస్తాడు. ఏది ఎలాఉన్నా ముఖ్యంగా భారత జాతీయ వాతావరణం రాజకీయ స్వాతంత్ర్యసమస్యతోనిండి, జాతీయ దృక్పథమునకొక విశిష్ట స్వరూపమిచ్చినదన్న సంగతి ఆయనకు తెలియకపోలేదు. ఈనాడు విద్యావంతులైన భారతీయ మధ్యతరగతుల వర్గం అత్యంతశక్తివంతమైన విప్లవ సమాచ

మని ఆయన శీఘ్రంగా గమనించినాడు. భారతీయ కమ్యూనిస్టులు ఐరోపాఖండపు కార్మికోద్యమ ప్రమాణములనుబట్టి మన జాతీయోద్యమమునకు వెలకట్టడమే వారు ముఖ్యంగా చేస్తూన్న తప్పిదమని ఆయన విమర్శించి ఉన్నాడు. "భారత జాతీయోద్యమము, కార్మికోద్యమం కాదనేమాట అందరికీ తెలిసిందే, దాని పేరునుబట్టియే అది మధ్యతరగతులవారి ఉద్యమమని తెలుస్తుంది. దాని ఆదర్శం యింతవరకు రాజకీయ స్వాతంత్ర్యమే కాని సాంఘికవ్యవస్థా పరివర్తనము కాదు * ఈ మాటలనుబట్టి దేశంలోని భూమివిధానమునుకానీ పెట్టుబడిదారీ పద్ధతినికానీ కాంగ్రెసు మార్పుచేయ తలపెట్టలేదని ఆయన చెప్పినట్లు అర్థంచేసుకోకూడదు. ఆయన ఆ విషయంలో చాలా శ్రద్ధకలిగి ఉన్నాడు. 1936 వరకూ కాంగ్రెసు ఎందుకోసం నిలచివున్నదో ఆవిషయాన్ని మాత్రమే ఆయన భారతజాతికి వివరంగా వ్యాఖ్యానంచేసి చెప్పినాడు. ఆయన మనస్సులోని విశ్వాసాలకు, నిర్వర్తించవలసిన ధర్మాలకు, ఆయన ఉద్రేకాలకు అనుభూతికీ నిరంతర పోరాటం జరుగుతూ ఉండినదన్నమాట నిస్సందేహం. వాటిని సమన్వయం చేసుకోవడానికాయన ఎంతో కృషిచేస్తూఉండెను. కాబట్టి కొత్త పాతల కలయికకు కానీ, గాంధీ తత్త్వము కమ్యూనిస్టు సిద్ధాంతములకు కానీ ఒక సేతువుగా నుండగలడని భావింపబడుతున్న నెహ్రూ, లక్నో కాంగ్రెసు అధ్యక్ష పీఠము నలంకరించుట కెంతో తగిఉండెను. ఈ సందర్భం నుసకొక చారిత్రక విషయాన్ని జ్ఞాపకంచేస్తూన్నది. "రష్యాలో పెట్టుబడిదారీ పక్షాలతోనిండిన డూమా కున్నూ మొదట్లో సాంఘిక విప్లవకారులు మెన్షివిక్కులతో నిండిన సోవియట్లకున్నూ కెరెన్స్కీ, షియోజ్ (Chkheıoze) షెరిటెల్లీ (Tseretelle) లవంటి కొంత మంది మితవాద సోషలిస్టునాయకులు సేతువుగా పనిచేయ ప్రారంభించారు. వీరికి సోవియట్టులోనూ డూమాలోనూకూడా స్థానములున్నవి." ఈ విషయాలు అప్పటికి స్పష్టంగా గోచరించి ఉండకపోవచ్చును.

లక్నో కాంగ్రెసు సాధించిన పనులనుగూర్చి, - కాదు కాదు సాధించలేక పోయిన వాటినిగూర్చి జవహరలాలుకు చాలా కోపమూ ఆశాభంగమూ కలిగింది. 1929 లాహోరు కాంగ్రెసు కాయన అధ్యక్షత వహించినప్పుడు తాను సోషలిస్టుననీ ప్రజాసామ్యవాదిననీ చెప్పుకొన్నాడు. తరువాత ఏడేండ్లకు 1936 లో లక్నో కాంగ్రెసు కధ్యక్షుడైనప్పు డాయన సోషలిజం, కమ్యూనిజంగా క్రమపరిణామం

* జవహర్ లాల్ స్వీయచరిత్ర పేజి 366.

పొందింది. కాని తాను కమ్యూనిస్టు ననుకొంటూన్నప్పటికీ, స్వరాజ్య సంపాదన నిమిత్తం కాంగ్రెసుతోనూ, "శాంతియుతము ధర్మబద్ధమూ అయిన పద్ధతులుగల" దాని ప్రధానసిద్ధాంతం:తోనూ ఏకీభవించి పనిచేశాడు. 'శాంతి ధర్మము'లంటే 'సత్యాహింసలు' కావనేమాట వాస్తవం. నిజానికి కాంగ్రెసు నియమావళిలోని ప్రధమసూత్రాన్ని పై ప్రకారం మార్పుచేయించవలెనని గాంధీజీ చేసిన ప్రయత్నం (1934 అక్టోబరులో బొంబాయి కాంగ్రెసు విషయనిర్ధారణ సభలోనే) విఫలమయింది. స్వరాజ్య సంపాదనమునకీ రెండు సుగుణాలూ సరియైన మార్గములనుకొని సోషలిస్టులూ కమ్యూనిస్టులూ అనేకమంది, ఈ విషయాన్ని ఎప్పటికప్పుడు ఎత్తి చూపుతూనే ఉన్నారు. 1929 నుండీ జవహరలాలుకు అహింసాభావము వందంతకంతకు ఎక్కువ మమకారమేర్పడి, గాంధీ యందాయనకుగల ఎడతెగని విశ్వాసంవలన అతుగ్రాలా అది బలపడింది. అయితే తరువాత సంవత్సరాలలో అప్పుడప్పుడూ ఖద్దరుకూ అహింసకూ వ్యతిరేకంగా అనేకసార్లాయన బయటపడలేదని కాదు దీనిఅర్థం. జవహరలాలుకూడా ఇంతవరకూ 'ద్వైధీభావంతో'నే కొట్టుకొంటూన్నాడు. భారతదేశంలో అందరికంటెను తాను గొప్పవాడననే ఆధిక్యభావం ఒకటి, గాంధీకంటె తనను తక్కువవాడ ననుకొంటూన్నారేమోనని అల్పత్వభావం ఒకటి ఈరెంటితోనూ ఆయన బాధపడుతూ ఉన్నాడు. 1929 సెప్టెంబరు 29వ తేదీని అ. భా. కాం. సం. జవహరలాలును అధ్యక్షునిగా ఎన్నుకొన్న తరువాత, ఆయన ఎడల తన వైఖరినిగూర్చి గాంధీ బహుసమంజసంగా వివరించాడు. యంగిండియానుండి [జవహరలాల్]

"29వ తేదీని లక్నోలో జరిగిన అ. భా. కాం. సం. లో పండిత జవహరలాలునెహ్రూను కాంగ్రెసు అధ్యక్షుడుగా నెన్నుకోవడం చాలా వివేకమైన పని. స్వాతంత్ర్యమును సంపాదించవలెననే పట్టుదలగల చైతన్యవంతమైనజాతికి, యెంతగొప్పవాడైనాసరే, తుదకు మహాత్ముడైనప్పటికీ తప్పనిసరి కాజాలడు. ఏ వస్తువులోని భాగమైనప్పటికీ వస్తువుకంటె ఎక్కువ పెద్దది కాజాలదు. జాతి అంతటికీ ప్రాతినిధ్యం వహిస్తూన్నానని చెప్పే కాంగ్రెసు, జాతిలోని శ్రేష్ఠభాగంకంటె కూడా పెద్దదనే మాట నిస్సందేహం. కాంగ్రెసు సజీవంగా ఉండవలెనంటే, ఆ సంస్థలోని అత్యంత సుప్రసిద్ధ సభ్యుల ప్రతిఘటనలను కూడా ఎదుర్కొనగలిగి ఉండాలి. అ. భా. కాం. సం. చేసిన నిర్ణయంవలన కాంగ్రెసుయొక్క సహజశక్తిలో తనకుగల విశ్వాసాన్ని ఆ సంస్థ బాగా ప్రదర్శించింది.

"అధికారం వృద్ధుల చేతులలో నుండి యువకుల చేతులలోకి రానం దంవలన కాంగ్రెసుకు రోజులు దాపరించినవని కొందఱు భయపడుతున్నారు. నాకా భయంలేదు. పక్షపాతభూయిష్ఠములైన నాచేతులవంటి చేతులలో అధికారం ఉంటే ఆలా భయపడాలి. జవహరలాలు పేరును నేను సూచించేటప్పుడే, 'ఈభారం మోయ డానికి తగినశక్తి నీకున్నదని అనుకొంటున్నావా, అని ఆయన్నే అడిగి నిశ్చయం చేసుకొన్నాను. 'బలవంతాన ఆ భారం నాపైన పెడితే నేను తప్పించుకొని పారి పోను' అని ఆయన సహజ సౌశీల్యంతో ప్రత్యుత్తరమిచ్చాడు. ధైర్యంలో ఆయనను మించినవాడు లేడు. దేశభక్తిలో ఆయనకన్న మిన్న ఎవరు? "ఆయన తొందర మనిషి అనీ ఉద్రేకపరుడనీ' కొందరంటారు. ఈ తరుణంలో ఈగుణం మరీ ఆయ నకు వన్నె పెడుతుంది. యోధుడికుండవలసిన సాహసోద్రేకములే కాకుండా రాజకీయ చతురున కుండవలసిన వివేకంకూడా ఆయనకు ఉంది. తన పరిసరములకు చాలా అతీతంగా ఆలోచించే తీవ్రవాది ఆయన; అయితే 'తెగేదాకా లాగేబాపతు' కాదు. తగినంత వినయము. లోకజ్ఞానమూ కలిగి ఉండడమే అందుకు కారణం. ఆయన స్ఫటికంవలె స్వచ్ఛమైన మనిషి, అనుమానించడానికి వీలులేని సత్యసంధుడు. గొప్ప క్షాత్రంగల యోధుడు. ఆయన చేతులలో భారతజాతి సురక్షితంగా ఉంటుంది."

ఇది ఆ యేటి అధ్యక్షుని గూర్చి గాంధీజీ చేసిన ప్రశంస. తండ్రి మోతీ లాలునుండి జవహర్‌లాలుకు స్వాభిమానమూ రాగద్వేషాలూ లభించినవి. పిత్రుసమా నుడైన గాంధీనుండి వివేకం వచ్చింది. ప్రపంచ పరిషత్తులోనేకాక, ప్రపంచ సభ్యతా పునర్నిర్మాణంలో కూడా భారతదేశానికొక ఉన్నతస్థానమును లభింప చేయవలెనని గాంధీజీ ఉద్దేశం. ప్రపంచ అంతర్జాతీయాభ్యుదయమున కనుగుణంగా భారతదేశం, తదితర ప్రపంచజాతుల సమిష్టిసర్గంలో అర్హస్థానమును తిరిగీ సంపా దించుకొనేటట్లు చేయడమే జవహరలాలునెహ్రూయొక్క ప్రధానాశయం. కాని లక్నో కాంగ్రెసు సృజించిన సాహిత్యంలో ఒకమూల భారతదేశ సర్వతోముఖ కళా పునరుద్ధరణమును గూర్చిన ఉన్నతాశయమును ప్రకటించే భాగమొకటి కని పిస్తూన్నది. లక్నో కాంగ్రెసు ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ ప్రకాశ్ ఉపన్యాసం లోని చివరిభాగమే అది. దీనిని ఈక్రింద ఉదాహరిస్తూన్నాము.

"నిజంగా మనం చేయవలసిన పని చాలా పెద్దది. మనం స్వరాజ్యం సంపాదించదలచుకొన్నాము. కేవలం మనం పోగొట్టుకొన్న ఐశ్వర్యాన్ని తిరిగి పొందడమే స్వరాజ్యంకాదు. పోయిన ఆత్మను పునరుద్ధరించుకోవడం మన స్వరాజ్యం. మన యిష్టంవచ్చినట్లు మన జీవితాలను తీర్చి దిద్దుకోవడానికే మనకు స్వరాజ్యం కావాలి. మన పనులు మనం చక్కబెట్టుకోవడానికి మన శక్తి సామర్థ్యాలను పునరుజ్జీవింప చేసుకోవాలి."

ఇంతకాలం గడచినవెనుక ముఖ్యంగా మంత్రిత్వ స్వీకరణ విషయం స్థిరపడిన పిదప మరీ ఈకొద్దికాలానికే ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామ సందర్భంలో మంత్రులు రాజీనామాలుకూడా యిచ్చిన తరువాత, లక్నో కాంగ్రెసులో రేగిన దుమారమును గూర్చి మరచిపోవడం సహజం. పూర్వసంఘటనల యుక్తాయుక్తములను తరువాత అనుభవములనుబట్టి నిర్ణయించడమెప్పుడూ తప్పు. అంతేకాదు ఆయా సంఘటనలకుగానీ ఆయా విషయములకుగానీ అవి జరిగిననాటి లేక తటస్థించిననాటి పరిస్థితులనుబట్టి ప్రాముఖ్యత ఉంటుంది. 1935 ఇండియా చట్టము ననుసరించి ఉద్యోగ స్వీకరణములోగాని రాష్ట్రీయ మంత్రివర్గ నిర్మాణములోగాని గొప్ప నైతిక సిద్ధాంతమేమీ ఇమిడి ఉండనప్పటికీ కాంగ్రెసులో నోరుగలవాళ్ళు కొంతమంది ఆ సంస్కరణల ప్రకారం పనిచేయడంవలన రాజకీయంగా కాంగ్రెసు మితవాద దృక్పథంలోకి పోతుందేకాని గాంధీ దృక్పథమైన ప్రజాకార్యక్రమమునకు ప్రజాభ్యుదయమునకు దారితీయదని విశ్వసించారు. మితవాద దృక్పథం కలవారు కాంగ్రెసు ఉద్యోగస్వీకరణ చేయవలెనని ఆదుర్దాలో ఉండిరి. అందుకు కారణం రాజ్యాంగ ప్రణాళిక విచ్ఛిన్నం అవుతుందేమోననే భయమేకాని వారికి కాంగ్రెసు నందుగల ప్రేమ కాదు. గవర్నరులు చట్టరీ ప్రకారం కాంగ్రెసు కోరిన హామీలు ఈయడానికి వీలులేదనికూడా వారు చాలాకష్టపడి ఋజువుచేయ ప్రయత్నించారు. అల్పసంఖ్యాక పక్షాలనుండి గవర్నర్లు మంత్రులను నియమించవచ్చునని కూడా వాదించారు. ఈ పై ఇరువర్గాలవారి దృక్పథాలూ కేవలం ప్రత్యక్ష విరుద్ధములుగా నుండెను. విదేశపరిపాలనమనే పిశాచాన్ని దేశంలోనుండితోలివేయవలెననియే కాంగ్రెసు యింతకాలమునుండిపోరుతూన్నది. దేశస్వాతంత్ర్యమునకుపనిచేయవలెననిశాసన కర్తలకు వోట్లద్వారా ఆదేశించిన ప్రజాభిప్రాయమును కాంగ్రెసు వ్యక్తీకరించింది. అధికార వర్గము వారి కటాక్షముల కెదురుచూడని ప్రొఫెసరు కీత్, అల్పసంఖ్యాక పక్షాలకు

చెందిన మంత్రివర్గ నిర్మాణమును ఖండించి; బాధ్యతాయుత ప్రభుత్వ సిద్ధాంతము అను సవిమర్శంగా పరిశీలించిన గాంధీని ఆయన సహచరులను శ్లాఘించి, గవర్నరులకు ప్రత్యేకాధికారముల నిచ్చినందున రాజ్యాంగచట్టములో మొదటినుండి నిజమైన బాధ్యత లోపించడం ప్రమాదకరమైన విషయమని ప్రకటించారు. ఇంతకంటె విస్పష్టంగా గవర్నరులు హామీ యీయడానికిఅధికారం లేకపోవడం విచారకరమని ఆయన బహిరంగంగా చాటినారు. కాబట్టి రాజ్యాంగచట్టమును విశాలతరంగా చేయడమే ముఖ్య సమస్య. అయితే మొదటి ఎన్నికలు జరిగిన యింత త్వరలో శాసనం ద్వారా ఆపని చేయడం వీలుకానిపని. కాని వ్యాఖ్యానం ద్వారా అలా చేయడం సుగమము. కనుకనే 1937 జూన్‌లో లిన్‌లిత్‌గో ప్రభువు చిట్టచివరకా విధంగానే వ్యాఖ్యానంచేసి అటువంటి హామీల నీయగలిగినారు. ఆ హామీలు లేకపోయినట్లయితే కాంగ్రెసు ఉద్యోగస్వీకరణం చేయవలసిన నిర్బంధంలేదు. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో ఉద్యోగస్వీకరణ చేస్తామని వాగ్దానంచేసి వోట్లు తీసికొనలేదు. సంస్కరణ ప్రణాళికపైన ప్రజాభిప్రాయ ప్రకటనమునకే కాంగ్రెసు వోట్లడిగింది. ప్రజల తీర్పును చేపట్టి రాజ్యాంగచట్టమును విశాలతర మొనర్చుటకు కాంగ్రెసు దానినొక పరికరంగా ఉపయోగించుకోవచ్చును.

ఇంతా అయితే ప్రభుత్వకార్యాలయంలో ఒక్కసారి ప్రవేశించిన తరువాత ఆ సుఖవాతావరణమున కలవడి మనవాళ్ళు భోగలాలసత్వమునకు లోనుగావచ్చునని కొంతమందికి చాలా భయంవేసింది. కాబట్టి అటువంటి వ్యామోహాలకు మొట్టమొదట్లోనే దూరంగా ఉండడం మంచిదనిపించింది. కాని రెండవ ప్రపంచ సంగ్రామ సందర్భంలో కాంగ్రెసుమంత్రులు ఎంతమాత్రమూ గునియకుండా హఠాత్తుగా రాజీనామాలిచ్చి బయటకురావడంచూస్తే లక్నోలో కలిగిన భీతి సిద్ధాంతరీత్యా తొలగించ వీలులేకపోయినప్పటికీ ఆచరణనుబట్టి చూస్తే అది కొంత అతిశయోక్తి అని తేలిపోయింది. కాని కాంగ్రెసు మహాసభ తన నిర్ణయాన్ని వాయిదావేయడం కానీ లేక ఒక చిన్న సంస్థగా నిర్ణయమును వదలివేయడంగానీ సరియైనమార్గం కాదనిపించింది. లక్నోలోనూ ఫెయిజ్‌పూరులోనూ కూడా ఆనాడు ఉద్యోగస్వీకరణమునకు ప్రతికూలురైనవారు రాష్ట్రీయ స్వాతంత్ర్యమునకు సంబంధించినంతవరకు గవర్నర్ల ప్రత్యేక రక్షణాధికారాలను బలహీనపఱచే హామీలను గాంధీ కోరడం అశాస్త్రీయమని

ఎందఱో సుప్రసిద్ధ న్యాయవాదులు న్యాయశాస్త్రప్రవీణులూ కూడా ప్రతిఘటించి నప్పటికీ, ఆయన యేవిధంగా జయంపొందినాడో గ్రహించకపోలేదు.

జవహరలాలు కమ్యూనిస్టు మార్క్సు సిద్ధాంతాలను పుక్కిటపట్టుకొని మాతృదేశానికి మఱలివచ్చాడు. కాంగ్రెసు కార్యకలాపమాయనకు ఆశాభంగం కలిగించింది. ఆయనకు ప్రపంచమంతా ఎదురునిలచినట్లు తోచింది. భారత జాతిలో సాంఘిక విప్లవమును ప్రజ్వలింపచేయవలెనని ఎంతో ఆశిస్తూవచ్చిన జవహరలాలుకు కాంగ్రెసు తీర్మానించిన కర్షక ప్రణాళిక కట్టి వ్యపదేశ (apology) మనిపించింది. అయితే తన కార్యవర్గంలోకి ముగ్గురు సుప్రసిద్ధ సోషలిస్టులను సభ్యులనుగా తీసుకొని అప్పటి పరిస్థితులను తనకు సాధ్యమైనంత అనుకూలంగా ఉపయోగించుకోగలిగాడు. వారు జయప్రకాశ నారాయణ్, నరేంద్రదేవ్, అచ్యుత పట్వర్ధన్‌లు. సరోజినీదేవినికూడా విడనాడడంలో కొంత అంతరంగిక కల్లోలం కలుగకపోలేదు. అందువలననే మధ్యలో యేర్పడిన ఖాళీకి ఆమెను తిరిగి కార్యవర్గ సభ్యురాలుగా ఆహ్వానించవలసివచ్చింది. నిర్మాణ కార్యక్రమంపైన యేవిధమైన తీర్మానమూ లేకపోవడంలోనే లక్నో కాంగ్రెసు ఆంతర్యం తెలుసుకోవచ్చును. అంతకుపూర్వమే బొంబాయిలో [1934 అక్టోబరులో] అఖిల భారత గ్రామ పరిశ్రమలనుగూర్చి ఒక తీర్మానం చేయబడినసంగతి పాఠకులకు జ్ఞాపకముండవచ్చును కాబట్టి లక్నోలోకూడా దానికి సంబంధించిన తీర్మానం ఒకటి రావచ్చుననుకోవడం సహజం. కాని అలా జరుగలేదు. దానికి కారణం అటువంటి తీర్మానమునుగూర్చి యెవ్వరూ తలపెట్టకపోవడంకాదు. వర్కింగు కమిటీలో అందుకు సంబంధించిన చిత్తు తీర్మానమొకటి ప్రవేశపెట్టబడింది కాని అంగీకృతంకాలేదు లక్నో మహాసభకు ముందుజరిగిన అలహాబాదు వర్కింగుకమిటీలో ఆ తీర్మానం బుట్టదాఖలయింది. వినడానికి కుతూహలం కలిగించే మఱొక చిన్న విషయంకూడా జరిగింది. కొంతకాలంనుండి సంయుక్తరాష్ట్రాలన్న పేరుకు బదులుగా 'సుబాహింద్' అనే పేరా రాష్ట్రానికి పెట్టవలెనని ఆలోచనలు జరుగుతూవచ్చినవి. 'ఆగ్రా అయోధ్యల వాయవ్య సరిహద్దు రాష్ట్రాలనే పూర్వపు పేరుకు ఈ సంయుక్తరాష్ట్రాలనే నామకరణం స్మారక చిహ్నం మాత్రమే. ఈ పేరు 1920 కి పూర్వమెప్పుడో కొంతకాలంకిందట వచ్చింది. ఇది తక్కిన రాష్ట్రాల పేర్లవలె అనగా వంగ, ఉత్కళ, ఆంధ్ర, మహారాష్ట్రాల పేర్లవలె భారతదేశ పూర్వచరిత్ర కేమాత్రమూ సంబంధములేని పేరని ఆ రాష్ట్రంలోని మిత్రుల మనస్సుకు కష్టంగాఉంది. అది న్యాయమే. పూర్వం

నిజంగా ౫౬౨ రాజ్యాలుండేవి వాటిలో తమరాష్ట్రానికి వారేపేరు పెట్టుకొన్నా పెట్టుకో వచ్చు. కోసల రాష్ట్రమని పెట్టుకోవచ్చు. లేదా ప్రధాన నగరంపేర ప్రయాగ రాష్ట్రమనో, అలహాబాదురాష్ట్రమనో, లక్నో రాష్ట్రమనో పిలుచుకోవచ్చు. అంతే కాని భారతదేశంలోని పదకొండు రాష్ట్రాలలో ఒక రాష్ట్రానికి 'సుబాహి హింద్' అనే పేరు పెట్టడం కాంగ్రెసు అంగీకారంకాలేదు. 'హింద్' అనిగానీ 'హిందూస్థాన్' అనిగానీ సంపూర్ణ భారతదేశమును మాత్రమే పిలవవలెనని కాంగ్రెసు ఆశయం. ఆ కారణంతోనే వారికోరిక నిరాకరించబడింది. లక్నో కాంగ్రెసు దృష్టిలో స్వదేశ సంస్థానాల సమస్య భూరి సమస్యగా పరిణమించింది. 1934 ఏప్రిల్ ఆరో తేదీని గాంధీజీ చేసిన ప్రకటనలో తనకూ కాంగ్రెసులోని ఒక వర్గానికి మూడు నాలుగు విషయాలలో ముఖ్యంగా భేదాభిప్రాయాలు కలవని సూచించినమాట పాఠకులకు జ్ఞాపకం ఉండి ఉండవచ్చును. వాటిలో ఒకటి స్వదేశ సంస్థానాల విషయమే. ఏది ఎలా ఉన్నప్పటికీ లక్నో తీర్మానమువలన "భారత దేశములోని తక్కిన ప్రదేశాలలో నివసిస్తూన్న ప్రజలకువలెనే స్వదేశ సంస్థానాలలోని ప్రజలకుకూడా స్వయం నిర్ణయాధికారంకలదనీ, భారత దేశంలోని ప్రతిభాగంలోనూ సమానంగా రాజకీయ, పౌర, ప్రజాస్వామ్య స్వాతంత్ర్యములను ప్రతిష్ఠించడమే కాంగ్రెసు ఆశయమనీ స్పష్టమయింది. కాని సంస్థానాలలోని స్వాతంత్ర్య పోరాటమును అచటి పరిస్థితులను బట్టి సహజంగా సంస్థాన ప్రజలే సాగించవలసివున్నదనికూడా కాంగ్రెసు విస్పష్టం చేయగోరుతూన్నది".

కర్షక ప్రణాళిక సరియైన సమయంలో ఆచరణలోకివచ్చింది. భారతదేశమంతటా భూమి శిస్తులు అత్యధికంగా వున్నవనీ ప్రభుత్వానికి జమీందార్లకూకూడా ప్రతికూలంగా పెద్దగగ్గోలుపుట్టింది ముఖ్యంగా జమీందారీలలో, చెరువులు, చెరువుకట్టలు నీటి వసతులు, పంటబోదెలు, పచ్చికబీళ్ళు, అడవులూ, ఈ అన్నీకూడా జమీందార్ల నిరంకుశాధికారంకింద వుండడంవలన రైతులగోలకు అంతులేకుండాపోయింది. రైతుకు ప్రభుత్వానికీ మధ్య ఒక వంగరాష్ట్రంలో 13 మందిన్నీ తక్కిన వివిధ రాష్ట్రాలలో వివిధ సంఖ్యాకులున్నూ దళారీలు ఏర్పడ్డారు. వివిధ రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాలకు, 1936 ఆగస్టు 21 వ తేదినాటికి కాంగ్రెసు సూచించిన తొమ్మిది విషయాలను గూర్చి వర్కింగుకమిటీకి సిఫారసులను పంపించవలెనని కాంగ్రెసు కార్యవర్గంవారు

కోరారు. దాదాపు ఈ విషయాలే కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో చేర్చబడివున్నవి. వాటినిగూర్చి తిరిగీ మరొకసారి చర్చించెదముగాక!

ఇండియా ప్రభుత్వ-చట్టమును ఖండించడానికి కాంగ్రెసు అనేక కారణాలను చూపించింది. అది ప్రధానవిషయం. కాని తాను తయారుచేయబోయే ఎన్నికల ప్రణాళికను ఆధారంగాచేసుకొని ఎన్నికలలో పోటిచేయవలెనని కాంగ్రెసు తీర్మానించింది. అధికార స్వీకరణ విషయంలో "ఏ సందర్భంలో ఏ పరిస్థితులు ఎలా తారు మారవుతయ్యో తెలుసుకోవడం కష్టంగాఉంది. కాబట్టి ప్రస్తుతం ఇదమిత్థమని నిర్ణయించడం మంచిదికాదని తోచి, సరియైన సమయంలో రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాలతో సంప్రతించి అ. భా. కాం. సం. చేసే నిర్ణయమునకు వదలివేయబడెను. రాజ్యాంగ-చట్టము, స్వయంనిర్ణయసూత్రమునకుగానీ, సమిష్టి నిర్ణయ సూత్రమునకుగాని సంబంధించినదిగా గాక 'పరాయివారి నిర్ణయమునకు' లోనై ఉండడమే ప్రధానమైన అభ్యంతరం.' అంతేకాక గవర్నమెంటువారు బుద్ధిపూర్వకంగా ఈ రాజ్యాంగ చట్టమును తలకాయలేని పట్టి మొండెంగా తయారుచేశారు. ఇది ఒక పెద్దలోపం కాబట్టి రాజ్యాంగ వ్యవహారాలలో పరస్పర సంబంధం కానీ, ఒక కట్టుబాటుగానీ ఉండడానికి వీలులేదు. ఒక ప్రణాళికను సంసిద్ధంచేసి విద్యుద్వేగముతో నడిపించగల మేధాసంపత్తిగానీ, రాష్ట్రాల వివిధ కార్యకలాపములను సమన్వయంచేసే విధానంకానీ యీచట్టంలో కనపడదు. చర్చి, సైన్యము, విదేశాంగ వ్యవహారములు, యుద్ధము, శాంతి, ఆయుధములు, దండయాత్రలు ఈ అన్నిశాఖలూ నిరంకుశప్రభుత్వం చేతులలో ఉండడమే యిందుకు నిదర్శనం. ఆర్థికమంత్రి కొక ఆర్థికశాస్త్ర సలహాదారుడుంటాడు. ఆయన అభిప్రాయాలే ఆచరణలో ఆర్థిక మంత్రికి ఆజ్ఞాపత్రములుగా పరిణమిస్తూంటవి. పార్లమెంటరీచట్టం ప్రకారం రైల్వే బోర్డు అనే సంస్థ ఒకటి సృజింపబడ్డది. ఆసంస్థయే రైల్వేరేట్లను నిర్ణయిస్తుంది. అందువల్ల ఆవిషయంలో శాసనసభకేమీ అధికారంలేకుండా పోయింది. శ్వేత పత్రమును బట్టి రిజర్వుబ్యాంకు నిర్మాణంలో అది మార్పులు చేసుకోవచ్చును. కాని చట్టంలో ఈకాస్త అధికారమూకూడా దానికితొలగించబడ్డది. కరెన్సీ, నాణ్యముల విషయంలో అనగా, రూపాయిలో ఎంత వెండి ఉండాలి, సవరనులో ఎంత బంగారం ఉండాలి. ప్రచారంలోవున్న నోట్లకు సంబంధించి వెండి బంగారాలెంతవరకు నిల్వవుండాలి, ఎంత కరెన్సీ ప్రచారంలోవుండాలి అనే విషయాలలో శాసనసభలకేమీ అధికారం

లేదు. 250 రూపాయిలపైన జీతాలు తెచ్చుకొనే ప్రభుత్వోద్యోగులను శిక్షించడానికిగానీ సంజాయిషీ అడగడానికిగానీ, బదిలీచేయడానికిగానీ మంత్రుల కధికారం లేదు. సి. ఐ. డి. శాఖవారిమీదకూడా మంత్రులకేమీ అధికారంలేదు. ఆ శాఖ కేవలం నిరంకుశ ప్రభుత్వానిది. రాజప్రతినిధియే గవర్నరు జనరలుకూడా. గవర్నరు జనరలుయొక్క విచక్షణకు (Discretion) నిర్ణయమునకు ( Judgement ) అనేక విషయములు వదలివేయబడినవి. ఆయనయే రాజప్రతినిధిగా సంస్థానాధిపతులతో వ్యవహరిస్తాడు. అనగా యింతకుపూర్వం రెండుముఖాలతో దేవుడుగా వున్న వైస్రాయి యిప్పుడు పంచముఖ బ్రహ్మగా పరిణమించాడు ఇవన్నీకాక ఇంకా అనేక రక్షణలూ ప్రత్యేకాధికారాలూ కూడా యేర్పాటు చేయబడినవి. ముఖ్యంగా వాణిజ్యరక్షణలు యునైటెడ్ కింగ్‌డం నుండి వచ్చే వస్తువులపైన పన్నులువేసే అధికారంలేకుండా చేస్తున్నవి. అందువల్ల భారతదేశపు వస్తువుల కంటె సీమవస్తువుల ఖరీదు ఎక్కువ చేయడానికి సాధ్యంకాదు. భారతీయ కంపెనీల పరిపాలనా విధానమునుకానీ పెట్టుబడినిగానీ అదుపులోవుంచడానికి ఏర్పాటుచేయబడిన శాసనాలు, నియమాలూ, నిబంధనలూ, ఈ అన్నీ యునైటెడ్ కింగ్‌డం కంపెనీలకు పూర్వపువాటికి, ప్రస్తుతం నడుస్తూన్నవాటికి, ముందు రాబోయేవాటికి కూడా వర్తించకుండా చేయబడినవి. నౌకాయానం విషయంలోకూడా యునైటెడ్ కింగ్‌డం నౌకలకు ఈలాగే ప్రత్యేక సదుపాయము లేర్పాటుచేయబడినవి. పరస్పర సహాయ సదుపాయము (Reciprocity) లనే పేరుతో మఱొక తమాషాచేశారు. యునైటెడ్ కింగ్‌డంలో, ఆదేశపు కంపెనీలకిచ్చే ప్రభుత్వపు గ్రాంటులుగానీ విరాళములుకానీ అక్కడి భారతీయ కంపెనీలకు నిరాకరింపబడే యెడల, భారతదేశంలో కూడా భారత కంపెనీలకిచ్చే గ్రాంటులనూ విరాళములనూ భారతదేశంలో పనిచేసే యునైటెడ్ కింగ్‌డం కంపెనీలకు నిరాకరించవచ్చునట! ఇంతకన్న హాస్యాస్పదమైన విషయం మఱొకటివుందా? ఏ భారతీయ కంపెనీయైనాసరే యునైటెడ్ కింగ్‌డంకు పోయి అక్కడివారితో వ్యాపారంలో పోటీచేయగలదని ఊహించడానికి వీలుందా? గవర్నర్లకుగల ప్రత్యేకాధికారాలు రక్షణలు అలావుండగా, రాష్ట్రాలలోని మంత్రుల అధికారాలుకూడా గమనించదగినంతగా కుంచింపబడినవి. గవర్నర్లకిచ్చిన ఆదేశపత్రం (Instrument of Instructions) చట్టంలో చేర్చబడివుండడ మిదే మొట్టమొదటిసారి. అందువలన దానికికూడా చట్టప్రాముఖ్యత వచ్చింది. కాని వుద్యోగ

స్వీకరణ సమస్య కేవలం చట్టముయొక్క గుణ దోషాలపైన ఆధారపడిలేదు. రాజకీయ చతురంగములో అవలంబించవలసిన యెత్తు పైయెత్తులపైన ఆధారపడివుంది. కాబట్టి ఎన్నికలయ్యేటంతవరకూ తుది నిర్ణయం నిలుపుదల చేయబడింది.

లక్నో కాంగ్రెసు అ. భా. కాం. సం రెండు ముఖ్యధర్మములను నిర్వర్తించవలసినదిగా ఆజ్ఞాపించింది. ఒకటి కర్షక ప్రణాళికయొక్క అంతిమ రూపమును తయారుచేయడం, రెండు ఎన్నికల ప్రణాళికను సంసిద్ధం చేయడం, ఈరెండూ దాదాపు ఒకటే మొదటిది రెండవదానిలో ఒక భాగంగా ఉండవలసింది. కాంగ్రెసు అధిక సంఖ్యాకపక్షంగా ఎన్నికలలోగెలిచివచ్చి ఉద్యోగ స్వీకరణం చేయవలసివస్తే ఈరెండూకలసి కాంగ్రెసువారి శాసనసభా కార్యక్రమానికి మొదటి పునాదిగా ఉండవలసినవే. ఆనాడీ మూడింటికీగల ముఖ్య సన్నిహిత స్వభావం అంత విస్పష్టంగా గోచరం కాలేదు. ఆరేండ్ల తరువాత (1941 జూన్) ఎనిమిది రాష్ట్రాలలోని కాంగ్రెసుమంత్రులు మొత్తం ఇరవైఏడు మాసాలుమాత్రమే పనిచేసినప్పటికీ వారు సాధించిన ఘనకార్యములనుబట్టి ఆలోచిస్తే లక్నో నిర్ణయాలెంత సమంజసముగా చేయబడినవో తరువాతి చరిత్ర నిర్మాణమున కవి యెంత ప్రముఖ స్థానము వహించినవో స్పష్టంగా తెలుసుకోడానికి వీలు కలుగుతూన్నది.

అయితే ఆనాటి ఘటనా కలాపంలో ఒక ప్రధానమైన చిక్కు ఏర్పడింది. అధిక సంఖ్యాకులైన వర్కింగు కమిటీ సభ్యులకూ అధ్యక్షునకూ పొత్తు కలియలేదు. కమిటిలోకి క్రొత్తగా తీసుకోబడిన ముగ్గురు మిత్రులునూ అధ్యక్షునున్నూ కలసి నలుగురే వారు. అంటే కమిటీలో నాలుగోవంతుకంటె కొంచెం ఎక్కువ కాని సాధారణంగా వర్కింగు కమిటీలోని చర్చలుకానీ నిర్ణయాలు కానీ వోట్లపైన ఆధారపడి ఉండవు. మొట్టమొదటనే జవహరలాలు తాను రాజీనామా నీయ నిశ్చయించుకొన్నాడు కాని ఆయనను ఉండి పనిసాగించవలసిందని తక్కినవారు ప్రోత్సహించారు. మిత్రులు కోరిన ప్రకారం మామూలుగాపనిచేస్తూనే వున్నారాయన. కాని మనస్సుకుమాత్రం శాంతిలేదు. ఆయనంతరాత్మ పీకుతూనేవుంది. ఒకపక్కను ఆయన అధ్యక్షోపన్యాసం కేవల సిద్ధాంత విశదీకరణంగా మాత్రమేకాక ఒక నిర్దిష్ట కార్యక్రమంగా ఉద్దేశింపబడివుంది. మఱొక ప్రక్క గాంధీయున్నూ ఆయన అనుచరులు పదిమంది నీన్నికలసి ఒకే కరడుగట్టిన ముఠాగా ఆలోచించి పనిచేయడం జరుగుతూన్నది. ఇక పదిహేనవసభ్యుడు సుభాస్‌బోసు ఖైదులో వున్నాడు కనుక వర్కింగుకమిటి సమావేశాలకు రావీలులేదు. ఒకవేళ

ఆయనవచ్చినా ఈ రెండుముతాలలో ఏదో ఒకముతాలలో చేరిపోక 'ముణ్డేశే స్త్రితీయః పంథా' అన్నట్లు మరొకతోవ త్రొక్కేమాట నిజం. అధమం 1200 సంవత్సరాల అభ్యుదయమునకు మూలహేతువులైన స్వసంప్రదాయములను పెంపొందించుకొన్న భారతవర్షమునకు ఈ యుగాంతరాలలో కాలమాన పరిస్థితులనుబట్టి తటస్థించిన అవాంతరాలను జయప్రదంగా తట్టుకొని నిలబడ్డ సంఘనిర్మాణంగల భారతవర్షమునకు ఆధ్యాత్మికంగా, ఆర్థికంగా, నైతికంగా జాతీయ జీవితంలో ఒకానొక విశిష్టతను అలవఱచుకొన్న భారత వర్షమునకు, జవహరలాలు అధ్యక్షోపన్యాసం కమ్యూనిజమును ప్రబోధించింది. భారతదేశంలో ఆర్థిక సాంఘిక విషయములను గూర్చిగానీ ఆధ్యాత్మిక విషయములను గూర్చిగానీ యిప్పుడు క్రొత్తగా ప్రారంభించి నేర్చుకోవలసినవి లేవు కాని 'క్రొత్త ఒక వింత' అన్నట్లు యేక్రొత్త విషయంపైన అయినా కొన్నాళ్లు చాలా మోజు వుంటుంది. పాతబడగానే అది సన్నగిలడం సహజం. అయితే ఈ గుట్టు తెలిసేటంతవరకు మాత్రం ప్రజలకూ నాయకులకూకూడా చాలాకష్టపురోజులని చెప్పాలి ఇంతాఅయితే మార్క్సు విధానమొక మతంగానూ, మార్క్సు ఒక మత ప్రవక్తగానూ, మార్క్సిజం గురుపీఠంగానూ తయారయింది. వలీలు, రసూలులు, పైగంబరులున్నూ, ఋషులు, మహాత్ములూ అవతారులున్నూ పరంపరాగతంగా ప్రబలుతూవచ్చిన భారతదేశంలో, దేవాలయాలలో మసీదులలో ఉత్పన్నమైన ఆధ్యాత్మిక మహాశక్తిద్వారా తీర్చిదిద్దబడిన సంఘనిర్మాణంగల భారతదేశంలో ఇవన్నీ కమ్యూనిస్టు సిద్ధాంతవ్యాప్తికి తీరని అడ్డంకులుగా పరిణమిస్తున్నవి. ఈ సందర్భంలో బర్నార్డుషా వ్రాసిన వాక్యాలీక్రింద ఉదాహరించడం సమంజసంగా భావిస్తున్నాము. (The intelligen Woman's guide to Socialism—Capitalism, Sovietism and Fascism)

"శాస్త్రీయ మార్క్సు సిద్ధాంతముపైన బర్నార్డుషా అభిప్రాయం"

సోషలిస్టు మత ప్రచారకులు, దేవుడిపేరు తలపకుండా ఉన్నంతమాత్రంతో, వారిసంస్థను మతపేరమని అననంతమాత్రంతో వారిసమావేశస్థలములు శిఖరాలంకృతములు కానంతమాత్రముతో వారినిగూర్చి అన్యథా తలంచకూడదు. విశ్వవ్యవస్థలో తుదకొక 'ఉత్కృష్ట వర్గం' ఏర్పాటు కావడం తప్పనిసరి అనీ, అది యేర్పాటయినప్పుడు 'అంతకుముందున్న అల్ప వర్గాల' వ్యత్యాసములన్నీ దానిలో సమన్వయం కాగలవనీ వారు బోధిస్తుంటారు. వారి మతప్రవక్త కారల్ మార్క్సు, వారి గురుపీఠం క్యాథలిక్

చర్చికాదు. మూడో ఇంటర్నేషనల్, వారి ఆధ్యాత్మిక విద్య జర్మను వేదాంత శాస్త్రజ్ఞులు,—హెజెల్ (Hegel) ఫెనర్‌బాష్ (Fenerbash) ప్రారంభమై, సర్వజ్ఞాన సమన్వితమని, ప్రమాదరహితమనీ దైవప్రేరితమని నీకార్మికులపాలిటి వేదమనీ భావింపబడుతూన్న కారల్ మార్క్సుయొక్క ఉత్కృష్ట సాహిత్య గ్రంథం 'దాస్ క్యాపిటల్'తో పరిపక్వం పొందుతుంది. చర్చి ఆఫ్ ఇంగ్లాండుయొక్క అరావ సూత్రంలోని మొదటి రెండు భాగాలు ఎంత పరస్పర విరుద్ధంగా వున్నవో వారి సిద్ధాంతాలలో రెండు భాగాలు అంత పరస్పర విరుద్ధంగానూ ఉన్నవి. పెట్టుబడిదారీ విధానం సామ్యవాద పద్ధతిలోకి (Socialism) క్రమ పరిణామం పొందితీరుతుందని ఒక సిద్ధాంతం అనగా మనం చేతులు ముడుచుకొని కూర్చున్నప్పటికీ దానంతటది తటస్థించి తీరుతుందని అర్థం. ఇది మోక్షంకోసం వారవలంబించే భక్తిమార్గం మరొక సిద్ధాంతమేమంటే కార్మిక నియంతృత్వమును స్థాపించే విప్లవంద్వారా దానిని ఆచరణలోకి తీసుకొనిరావలెనని ఇది వారి కర్మమార్గం. ప్రభుత్వం నడిపించడానికి మార్క్సిజం మార్గదర్శకంగా పనికి రాకపోగా పైపెచ్చు అది ప్రభుత్వాన్ని భగ్నం చేస్తుంది

"అటువంటి ఆచరణయోగ్యములుకాని సిద్ధాంతాలు ఆధునిక రాజ్య పరిపాలనకు ఐదు నిమిషాలుకూడా పనికిరావు. ఈ సంగతి లెనిన్ చాలా త్వరలో గ్రహించి స్పష్టంగా ఒప్పుకొన్నాడు."

"కాని మన రెండవ హెన్రీ, రోమన్-చర్చి పలుకుబడినుండి ఇంగ్లాండు ప్రభుత్వమును వెలికి లాగలేకపోయినట్లే, లెనిన్‌గానీ ఆయన వారసులుగానీ స్వతస్సిద్ధంగా తమచే స్థాపింపబడిన నూతన రష్యా ప్రభుత్వమును ఈ కొత్త రష్యన్ అంతర్జాతీయ [క్యాథలిక్ చర్చి] ప్రభావమునుండి బయటకు తీయలేకపోయినారు. ఏదైనా సందిగ్ధస్థితి తటస్థించినప్పుడు రష్యా రాజనీతి జాతీయ, లౌకిక, దృక్పథముద్వారా సోవియట్టుచే నిర్ణయింపబడుతుందో లేక మార్క్సిస్టు దృక్పథంద్వారా మూడవ ఇంటర్నేషనల్ చేతనే నిర్ణయింపబడుతుందో ఎవ్వరూ తెలుసుకోలేకుండా ఉన్నారీరోజున.... రష్యా ప్రభుత్వమే మార్క్సిస్టు చర్చియొక్క లౌకికాధికారమును భగ్నంచేసి ఎప్పుడో ఒకప్పుడు రాజకీయాలను దానినుండి లాక్కొనితీరాలి..... అంతవరకూ, మూడవ ఇంటర్నేషనల్ అనబడే మార్క్సిస్టు చర్చి పూర్వపు పోపు లెన్ని చిక్కులు పెట్టినారో అన్ని చిక్కులూ పెట్టి తీరుతుంది.

"శాసనసభా వ్యవహారములకు మార్క్సిస్టు బైబిలు యేవిధంగా ఉపకరించదో అదే విధంగా క్రైస్తు సిద్ధాంతాలుకూడా ఉపకరించవు. అందువలన క్రైస్తు సిద్ధాంతాలను తగులవేయమనికానీ, యేసుక్రీస్తు మనకు బోధించతగినదేదీలేదనికానీ మేము చెప్పబోవడంలేదు."

మార్క్సు ఒక గొప్ప ప్రవక్త. ఆయన ఉపదేశాలను ఇప్పటికీ అర్థం చేసుకోని రాజనీతిజ్ఞులు అత్యంతం అపాయకరులుగా పరిణమిస్తారు. మార్క్సును ప్రమాదరహితుడైన ప్రవక్తఅని గుడ్డిగా అనుసరించడానికి బదులు ఆయనను నిజంగా తెలుసుకొన్నవారుకూడా, మార్క్సుకంటె మార్క్సిస్టులుకారు.

"ప్రభుత్వ వ్యవహారములను బాధ్యతతో నిర్వహించడంలో ఆయనకేమీ అనుభవంలేదనీ ఆయన వర్ణించిన ప్రత్యేక కార్మిక వర్గమునకూ మామూలు ఆడ కూలీలకూ, ఆయనచే పేర్కొనబడిన మధ్యతరగతివారికీ [బూర్జువా] నిజంగా ఆస్తిగల ఆడవాళ్ళకూ ఎక్కడా సన్నిహితమైన పోలికయే లేదనీ గమనించండి".

"తదితర విషయాలవలెనే మార్క్సిజంకూడా ముఖ్యంగా ఒక నూతన స్వర్గరాజ్యం" కావలెనంటుంది.

## మార్క్సిజంనుగూర్చి జవహరలాలు:—

"ఈ రోజున కాంగ్రెసు ఆలోచించవలసిన విషయం మార్క్సిజంనుగూర్చి కాదు మన పరిసరాలలోనున్న దుష్ఫలితములను రూపు మాపడానికి మనమిప్పుడు పోరాడవలెనా లేక వాటి అట్టడుగున గల కారణాలను పరిశీలించవలెనా అనేదే మనం యోజించవలసిన సమస్య. కేవలం ఫలితాలనుగూర్చియే బాధపడేవారు ఎంతో దూరం పోలేరు. వారసలు కారణాలను వదిలిపెట్టి కేవలం ఫలితాలకు వ్యతిరేకంగా మాత్రమే పోరాడుతూన్నారనే మాటను మఱచిపోకూడదు. వారు పరిస్థితులను ఇంకా అధోగతికి పోకుండా ఆపితే ఆపవచ్చునుగానీ, అసలు మార్గాన్ని మార్చే ప్రయత్నాలు చేయడం లేదు. వారు ప్రయోగించే మందులు తాత్కాలికోపశమనమునకు పనికివస్తవేగాని అసలు రోగాన్ని కుదర్చలేవు".

"ఫలితాలా కారణాలా మనం గమనించవలసిందనేదే ప్రధాన సమస్య. కారణాలను గమనించడమే మనం చేయవలసినపని. అప్పుడు సామ్యవాద విశదీకరణం మనకు బాగా వాటిని నిరూపిస్తుంది. సోషలిస్టు రాజ్యస్థాపనము ముందెప్పుడో రానున్న స్వప్న

వృత్తం కావచ్చును; దానిని చూచె భాగ్యం మనలో చాలామందికి కలుగకపోవచ్చును, కాని ప్రస్తుతం మనం నడువవలసిన మార్గాన్ని స్పష్టంగా చూపించగలిగినది సామ్యవాద దీపకళికయే.”

From Eighteen Months In India)—Page 41.

కాని చిరకాలంనుండీ విదేశీపాలనకు లోనయియున్న దేశంలోని యువక మండలిలో ‘పనికిరాని’ పురాతన ధర్మశాస్త్రాలంటేనూ సంస్థలంటేనూ ఒక విధమైన విసుగుదలకలిగింది. అంతేకాక పాలకజాతియొక్క చట్టాలూ సంస్థలూ అంటేకూడా సహజంగా ద్వేషంపుట్టింది. కాబట్టి ఈ రెండింటికీ సంబంధంలేని మరొకచోటనుండి తమ సమస్యా పరిష్కారానికి తగిన మార్గాన్వేషణం ప్రారంభించారు. 20 లక్షలమంది సభ్యులతో నడుపబడి 75 లక్షల పౌరుల ప్రాణాలను హరించి హింసాయుత విప్లవమునకు మూలమైన రష్యన్ ప్రయోగంలో కొన్ని ఆపరాని ఆకర్షణలు కనపడుతూన్నవి. కాని ఆ రష్యన్ ప్రయోగముయొక్క అంతిమ స్వరూపమింకనూ తేలనప్పుడు, పరిసరములనుబట్టి సాంప్రదాయములనుబట్టియే దాని స్వరూపస్వభావములు చాలా వరకు నిర్ణయింపబడవలసి వున్నప్పుడు, ప్రతిదేశమూ భూతకాలమును వర్తమానకాలముతో సమన్వయంచేసుకొని ఈరెంటినీ గమనిస్తూనే తన భావి భవితవ్యమును నిర్ణయించుకోవలెనని అందరూ అంగీకరిస్తారు. కాలంతోనే అన్నిదుఃఖాలనూ, అన్ని చెడుగులనూ మరచిపోతుంటాం. అలాగే అతిశయోక్తులూ అపోహలూకూడా కాలంతోనే తొలగిపోగలవు. లక్నోలో దుర్నిరీక్ష్యమైన సూర్యకాంతిని, ఫైజుపూరులో నేత్రానందకరమైన వెన్నెలగా కాలమే మార్చింది. ఆనాడు సోషలిస్టు వుద్యమాన్ని భారతీయంగా మార్చవలసిందని దివ్యసందేశం పంపిందికూడా ఆ జవహరలాలే.

## జవహరలాలు సోషలిస్టులకు పంపిన సందేశం

డిశంబరు 20, 1936.

మీ మహాసభకొక సందేశం పంపవలసిందని కామ్రేడ్ మసానీ నన్ను కోరినాడు. నేను సంతోషపూర్వకంగా నా అభినందనాలను పంపుతున్నాను. మన అందరి హృదయాలలోనూవున్న ఉత్కృష్ట ప్రయోజనమునకు మీ సమాలోచనము చక్కగా వుపకరించగలదని ఆశిస్తూన్నాను. దేశంలో శక్తివంతమైన సమిష్టి సామ్రాజ్య వ్యతిరేక శంగాన్ని నిర్మించడంవలననే మన ఉద్దేశం నేడు చక్కగా నెరవేరగలదు. అలా

సమిష్టి రంగంగా వుండదగిన సంస్థ జాతీయ కాంగ్రెస్సనే మాట వేరుగా చెప్పనక్కరలేదు.

“అన్ని సమస్యలూ సోషలిస్టు దృక్పథంనుండి పరిష్కారం కావలెనని నేను చాలా వుత్సాహపడుతూన్న సంగతి మీకు తెలిసిందే. అయితే ఈ దృక్పథానికి ఆధారమైన మూల సిద్ధాంతమేదో మనం తెలుసుకోవటం మంచిది. అందువల్ల మన మనస్సుకు మనం చేయవలసిన పని స్పష్టంగా తెలిసి మన చర్యలందుకు అనుగుణంగా ఉంటవి. అయితే ఈ సందర్భములో రెండు విషయాలు నేను ఆలోచిస్తూన్నాను. భారతీయ పరిస్థితుల కనుగుణంగా వుండేటట్టు ఈ దృక్పథాన్ని ఎలా వర్తింపచేయాలి అనేది మొదటిది భారతీయ భాషలో సోషలిజమును గూర్చి ఎలాచెప్పాలి అనేది రెండోది మనం చెప్పేది ప్రజకు తెలియాలంటే ప్రజాభాషలోనే మనం మాట్లాడాలి' అనే విషయం చాలాసార్లు మఱచిపోతూంటాము. అంటే నేను కేవలం భారతదేశంలోని పలుభాషలను గూర్చి మాట్లాడుతున్నాననుకోకండి. పూర్వసంపర్క సభ్యతా సంస్కార చరిత్రలనుండి క్రమానుగతంగా పెంపొందుతూన్న భాషనుగూర్చియే నేను ఎక్కువగా మాట్లాడుతున్నాను. ప్రాచీనత్వమంటే పడిచచ్చే భారతీయ చిత్తవృత్తి కనుగుణమైన భాషలో మనం మాట్లాడనంతకాలమూ చాలావరకు మన మాటలవలన కలిగే ప్రయోజనం కలగకుండాపోతూన్నది. మనం మాట్లాడేమాటలూ సమాసాలూ మన కర్థమయితే కావచ్చు. కాని భారత ప్రజాసామాన్యంలో వాడుకలేని భాషను మనం ప్రయోగించడం వట్టి వ్యర్థ ప్రయత్నం. సామ్యవాద దృక్పథమును ప్రజల సన్నిధిని పెట్టడంలో ఈ సమస్యనుగూర్చియే - అనగా భారతీయ భాషలో ఆశాజనకమూ వుత్సాహపూరితమూ అయిన సామ్యవాద సందేశాన్ని ప్రజాహృదయమునకు ఎలా నచ్చచెప్పాలా అనే నేను ఆలోచిస్తూన్నాను. సోషలిస్టులుకూడా ఆ విషయమే బాగా ఆలోచించవలెనని నా కోరిక.”

కాని లక్నో ఫెయిజ్పూరు కాంగ్రెసు(డిశంబరు 1936) లమధ్య గమనించదగిన సంఘటనలు చాలాజరిగినవి. వాటి సంగ్రహ చరిత్రను నిచ్చట పొందుపఱచెదముగాక! వాటిలో అత్యంత విషాదకరములైనవి రెండు. గుజరాతు రాష్ట్రానికి భీష్మాచార్యులనదగిన పూజ్యశ్రీ అబ్బాస్ తయ్యాబ్జీ ముస్సోరీలో 1936 జూన్ 10వ తేదీని మరణించెను. లక్నో కాంగ్రెసు అయినవెంటనే రైలుబండిలో డాక్టరు అన్సారీ దివంగతుడయ్యెను. ఈయన మరణమునకు దేశమంతటా సంతాపమును వెలిబుచ్చుటకు 1936 మే

17 వ తేదీ నిర్ణయింపబడెను. వర్కింగుకమిటీవారి ఆదేశానుసారం భారతదేశమంతటా మతీ రెండు 'రోజులు' కూడా జరపవలెనని నిశ్చయింపబడింది. మే 9 ని అబిసీనియా యెడల సానుభూతిని చూపిస్తూ, ఇటలీని నిరసిస్తూ తీర్మానములుచేయబడెను. అబిసీనియాను ద్రోహంచేసినందుకు అంతర్జాతీయసమితి (League of Nations) కూడా అనేకచోట్ల కొంతవరకూ నిరసనకు గుతియైనది. తరువాత అయిదు సంవత్సరాలు గిఱ్ఱున తిరిగి వచ్చేసరికి, బ్రిటిష్‌వారి సహాయంతో అబిసీనియా చక్రవర్తి హెయిలీసెలాస్సే 1941 జూన్‌లో రెండవ ఐరోపా మహాసంగ్రామం జరుగుతూన్నప్పుడు ఇటలీని గట్టిగా ఓడించి తన రాజధాని అడిస్ అబాబా కూ చేరుకొనెను.

సుభాస్‌చంద్రబోసును విచారణలేకుండా కుర్సియాంగు (Kurseong) లో ఆయన సోదరుని బంగాళాలో ఖైదుచేసి, హోము మెంబరు ఆయనను బహిరంగ విచారణ చేయడం ప్రజాక్షేమమునకు తగినపని కాదని చెప్పినందుకు, మే 10 వ తేదీని 'సుభాస్ రోజు' అనే పేరుతో దేశమంతటా రోషవిషాదములను వెలిబుచ్చుతూ తీవ్ర అసమ్మతి తీర్మానములు చేయబడినవి.

## రాజకీయ ఖైదీల రోజు.

రాజకీయఖైదీల నిర్బంధముకానీ, వారిని అవమానించడంకానీ, భారతదేశమున 1936 లో కొత్తగా తటస్థించిన సంఘటనలుకావు. నిజంగా ఈ నిర్బంధవిధానం లిట్టన్ ప్రభువు రాజప్రతినిధిగానున్న 1877-78 లో 'దేశభాషా పత్రికా శాసనం తోనూ (Vernacular Press Act) ఆయుధ శాసనంతోనూ ప్రారంభమై స్వరాజ్య నిర్మాణంకోసం భారతదేశంలో రాజకీయచైతన్యం గలిగి, ప్రపంచంలోని తదితర దేశాలలోవలెనే భారతీయులకు జాతీయాభిమానం రేకెత్తినకొద్దీ కొనసాగుతూ వచ్చింది. 1897 లో ఇండియన్ పీనల్ కోడుకు - రాజద్రోహమునకూ, వర్గద్వేషమునకూ సంబంధించి 124 ఏ, 153 ఏ, అనే రెండు కొత్త సెక్షనులను చేర్చడమే లోకమాన్యతిలకు మహాశయుని కార్యకలాపమునకు బ్రిటిష్ ప్రభుత్వమువారు వెంటనే చేసిన ప్రతిక్రియ. ప్లేగు నిర్మూలన కార్యక్రమంతో ప్రారంభమై పూనాలోని లెఫ్టినెంటు ర్యాండు కెప్టెన్ ఐర్స్టుల హత్యలతో అంతమైన కార్యరంగం, మహారాష్ట్ర దేశమునుండి వంగరాష్ట్ర విభజనాందోళన సందర్భంలో 1905 నాటికి బెంగాలుకు మారింది. ఆరోజులలో అంతవరకూ కనీ వినీ యెఱుగని నిర్బంధపద్ధతు లవలం

బింపబడినవి. విద్యార్థులు ఊరేగింపులలోనూ రాజకీయాలలోనూ పాల్గొనరాదని నిషేధింపబడెను. బేకరగంజి జిల్లాలోని జనం కొంతలావూ, కొంతపొడుగూ గల కర్రలను తప్ప అంతకుమించిన కర్రలను పట్టుకొని తిరుగరాదని ఉత్తరువులీయబడినవి. బారిసాల్ రాష్ట్రీయ మహాసభ జరిగే సమయంలో సురేంద్రనాథబెనర్జీ వంటి పూజ్యునిపైన జరిగిన లాఠీప్రయోగం, పిదప 1930 నుండీ ప్రతిరోజూ జరుగుతూ వచ్చిన తీవ్ర లాఠీప్రయోగములకు నాందీవాక్యంగా భావించవచ్చును 1908 లోని రాజద్రోహ సభల చట్టం, 1910 లోని ముద్రణాశాసనం, 1912 లోని క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టు, ఇవన్నీ 1914 నాటికి రాబోయే ఇండియా రక్షణచట్టమునకు మార్గదర్శకములా అన్నట్లు తోచినవి. తరువాత రెండు రౌలట్టు బిల్లులలోనూ యిమిడ్చి ఈ ఇండియారక్షణచట్టమును కొనసాగించవలెనని ప్రయత్నములుజరిగినవి అందులో ఒక బిల్లుచట్టం చేయబడింది. రెండో బిల్లు మొగ్గలోనే రాలిపోయింది ఈయుగం జలియన్ వాలాబాగ్ హత్యాకాండతో అంతమయింది. మాంటె ఫర్డు సంస్కరణలతో ప్రారంభమయిన కొత్తయుగంలో, పౌర స్వాతంత్ర్యముల విషయంలోనూ, నిర్బంధశాసనములకు బలియైనవారి యెడల ప్రభుత్వమవలంబించిన విధానంలోనూ కొంత పరివర్తనం కలిగింది. చాలా నిర్బంధశాసనాలు రద్దుచేయబడినవి కాని క్రిమినల్ లా సవరణ చట్టం మాత్రమే వైశ్యకథనంవలె తరతరాలనుండీ మాతో నే వస్తూన్నది. కాలంతో పాటు కొత్త కొత్త ఆర్డినెన్సులూ కొత్తకొత్త రకాల శిక్షలూ ఆచరణలోకి వచ్చినవి. జైళ్ళలోని ఖైదీల యెడల ప్రభుత్వము వారవలంబించిన వైఖరి ఎంతో ఘోరంగా ఉండెను. రాజకీయ బాధితుల సమస్యా పరిష్కారంకోసం నిరాహారదీక్ష పూని 61 వ నాడు 1929 సెప్టెంబరు 13 వ తేదీని జతీంద్రనాథసేను అసువులను బాసెను. (ఆయన కీర్తి చిరస్థాయి యగుగాక!) జతీందాసు యేవిధంగా ఒక ధర్మనిర్వహణం కోసం ప్రాణాలర్పించాడో ఆవిధంగానే ప్రాణాలర్పించ సంసిద్ధమై ఆయన అడుగుజాడలలో కొంతమంది నిరాహారదీక్షను పూనిరి. వారిలో ఒకడు జోగేశఛటర్జీ. ఆయన సుదీర్ఘకాలమీకఠిన వ్రతమునకు కడంగెను. కాని ఆయన నీ నిరశనవ్రతము నుండి విరమించవలసిందని అనేకులు కోరిరి. రాజకీయ ఖైదీల కోరికలను సమగ్రంగా వివరిస్తూ, వారిని మానవ మాత్రులుగా చూడవలెనని అఖిల భారత రాజకీయ ఖైదీల సంఘాధ్యక్షుడు బాబూ రాజేంద్రప్రసాదు ఒక ప్రకటన చేశాడు. ఆ ప్రకటన ప్రతులు అన్ని డిటెక్షన్ క్యాంపులలోనూ, అండమానుదీవులలోను విరివిగా అనేక

చోట్ల పంచిపెట్టబడినవి. కాంగ్రెసు ముఖ్యంగా రాజకీయ ఖైదీలకు ఎక్కువ మానవ సంబంధం కలిగించవలెనని పట్టుపట్టింది. అనగా స్నేహితులనూ చుట్టాలనూ ఎక్కువ పర్యాయములు చూడడానికి వీలుకలిగించవలెననీ, ఎక్కువ ఉత్తరాలు వ్రాయడానికీ తెప్పించుకోవడానికీ అవకాశం కల్పించవలెననీ కోరింది. పుస్తకాలు, వార్తా పత్రికలు, వ్రాత పరికరముల నిచ్చి రాజకీయ ఖైదీల మానసిక వికాసమునకు దోహదము కలిగించవలెననీ, ఏకాంత శిక్ష తొలగించవలెననీ, అండమాను దీవులనుండి రాజకీయ ఖైదీలను రప్పించవలెననీకూడా కాంగ్రెసు కోరింది. జతీంద్రాను మరణించిన మొదటి వార్షిక దినమున [సెప్టెంబరు 13] కాంగ్రెసు అధ్యక్షుడు జవహార్లాలు నెహ్రూ 'రాజకీయ ఖైదీల రోజు' ను జరుపవలసిందిగా అన్ని కాంగ్రెసు కమిటీలకూ అందరు కాంగ్రెసువాదులకూ ఉత్తరువులను జారీ చేశాడు. ఈ ఆందోళన వెంటనే ఫలప్రదముకానిమాట నిజమేకాని ఖైదీల హృదయాలలోనూ, ప్రభుత్వ హృదయంలోనూకూడా పరివర్తనం కలగడానికిదియొక మార్గంగా పరిణమించింది. హత్యాకాండకు దిగినందువలన ప్రయోజనం లేదని ఖైదీలు గ్రహించిరి. ప్రభుత్వంవారు బలవంతంమీద కొద్ది కొద్దిగా రాజకీయ ఖైదీలను విడిచిపెట్ట ప్రారంభించారు. ఈ విడుదల చాలా కాలం పట్టినందువల్ల దాని విలువ సగం పోయింది; సౌజన్యం అసలే కనపడలేదు.

తరువాత కొలది మాసాలలో, రాజకీయ ఖైదీల విడుదల విషయం ప్రధాన రాజకీయ సమస్య కావచ్చునని భయంవేస్తూ వచ్చింది హరిపురా కాంగ్రెసునాటికి అనగా 1938 ప్రారంభదశలో అలా జరుగనే జరిగింది. రాజకీయ ఖైదీల పరిస్థితులు ముఖ్యంగా వంగరాష్ట్రంలో చాలా పాడుగాఉండి తీవ్ర విమర్శకు గురియైనవి.

వంగరాష్ట్ర రాజకీయ ఖైదీల స్థితిగతులు మరీ భయంకరంగా నుండినవి. తాళములు వేయబడిన గదులలో వారు 20 గంటలుండవలెను. వారు విచారణలో ఉన్న ఖైదీలయినప్పటికీ వండిన ఆహారంకానీ వండని ఆహారంకానీ బయటనుండి తెప్పించుకొనకూడదు. కొందరికి రాత్రింబవళ్ళు గొలుసూ సంకెళ్లు తగిలించబడి ఉండేవి. ఆహార పదార్థాలు అసహ్యంగా ఉండేవి. బియ్యంలో కావలసినన్ని రాళ్లు, కూరలన్నీ పుచ్చువీ చచ్చువీని. చేపలకూరలో చేపలుండేవికావు. మూడో తరగతి ఖైదీలకు, సబ్బు, నూనె, చెప్పులూ యివేవీ ఈయబడేవికావు. పత్రికలసలే రావు వీరికి. ఖైదీలొకరి పుస్తకాలింకొకరి కిచ్చుకోవడానికి వీలులేదు. దక్కా

జైలులో ఖైదీలపైన లాఠీలను చాలా పర్యాయాలు ప్రయోగించారు. పై తరగతి ఖైదీలను మూడోతరగతి ఖైదీలుగా తగ్గించడం సర్వసాధారణంగా జరిగే శాశ్వతశిక్ష. వైద్య సహాయం చాలాతక్కువగానూ, అసంతృప్తికరంగానూ ఉండేది. జైలు విజిటర్లను చూడడానికికూడా ఖైదీలకు వీలులేకుండా చేయబడింది. ఒక్కొక్కప్పుడు నూనె గానుగలు లాగే పనికూడా రాజకీయ ఖైదీల కీయబడెను.

ఎక్కడా కనీ వినీ యెఱుగని పెద్ద ఎత్తులో జరుపబడుతూన్న రాజకీయ నిర్బంధ విధానంవలననూ, భారత రాజ్యాంగ చట్టమును అమలులోకి తీసికొనిరావలె నని అధికారవర్గంవారు చేస్తూన్న ప్రయత్నాలవల్లనూ హిందూదేశంలో సంచలనం చాలా ఎక్కువగాఉంది. ఇండియాలోని ఈ సంచలనమునకు తోడు విదేశాలలోని సంఘటనలుకూడా కాంగ్రెసు దృష్టిని ఆకర్షించక తప్పిందికాదు. అబిసీనియాపైన ఇటలీ చేసిన దండయాత్ర, నీగస్ [అబిసీనియా చక్రవర్తి] రాజ్యం విడిచిపెట్టి పరారీకావటం, అంతర్జాతీయసమితి మూకీభావం వహించడం, యూరపియన్ జాతులు ప్రత్యక్షంగా తప్పుచేసినవానితో కలసి తోడుదొంగలుకావడం, ఇవన్నీ చూస్తే తమ పరాధీనదేశమునకు స్వాతంత్ర్యం లభిస్తుందనే ఆశ కాస్తా భారతీయుల మనస్సులలో నుండి వైదొలగింది. ప్రపంచంలోని యుద్ధ వ్యతిరేకవాదులు, యింతకాలమూ నోరు మూసికొని ఊరుకుండలేదు. ప్రపంచంలో ప్రజాస్వామ్య పార్లమెంటులని పిలువ బడే మారుమూల ప్రదేశాలలో ఎక్కడో ఒకచోట వారు తమ 'నిశ్చల నీరస కంఠ ధ్వనినీ' వినిపిస్తూనే ఉన్నారు. కనుకనే సెప్టెంబరు ఆరో తేదీని ప్రపంచ శాంతి మహాసభ బ్రిస్సెల్సులో సమావేశమయింది. ఆనాడు ప్రపంచ శాంతి అభ్యుదయ ములకు నిలబడ్డ అన్ని శక్తులకూ ఈ మహాసభ కేంద్రమై ప్రాతినిధ్యం వహిస్తూన్నట్లు తలంపబడెను. ఆ సభలో పరస్పర విరుద్ధాభిప్రాయాలుకల నానారకాలవారూ ఉన్నారు. ఇంగ్లాండులోని కన్సర్వేటివ్ పక్షంవారు మొదలుకొని, లిబరలు లేబరు పార్టీలవారు, ఫ్రాన్సులో సంయుక్త ప్రజా పక్షము (Popular Front) ను బల పరచేవారు అంతర్జాతీయ సమితికి అనుకూలురు ఉన్నారు వీరేగాక, యుద్ధ ప్రతి కూలురు (Pacifists) సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యూరపులోని అభ్యుదయ ప్రభుత్వాల ప్రధానులు, ప్రపంచంలోని యింకా అనేక సంస్థల అగ్రనాయకులూ కూడా ఆ సభలో ఉండి, ఫాసిజం, ఏ ప్రపంచ సంగ్రామములవలన రానున్న విప
, ఎదిరించడానికి అందరూ చేతులు కలిపారు ఈ ప్రపంచ సంస్థలో భారత

జాతీయ మహాసభ పూర్తిగా పాల్గొన్నది. వి. కె. కృష్ణమీనను జాతీయ మహాసభ పక్షాన ప్రతినిధి. ప్రపంచంలోని వివిధ జాతులకూ వివిధ సంస్థలకూ చెందిన స్త్రీ పురుషు లొక్కచోట గుమికూడి ప్రపంచ శాంతిని పెంపొందించ ప్రయత్నించినప్పటి పూర్వాపర పరిస్థితులను విచారించవలసియున్నది. అప్పటికి పది యేళ్లనుండీ ఎప్పటి కప్పుడు యుద్ధం వస్తూన్నదన్న ప్రవాదాలు బాగా వ్యాపించి ఉన్నవి. సరిగా ప్రపంచశాంతి మహాసభ సమావేశమైన తరుణంలో యుద్ధ మేఘాలు కారుక్రమ్మి ఉన్నవి ప్రపంచమొక అగ్ని పర్వతం అంచున ఉన్నట్లు తోచింది. స్పెయిన్‌లో అప్పటి కప్పుడే అంతర్యుద్ధం చెలరేగింది. పక్క దేశాలవారు తటస్థంగా ఉన్నట్లు కన పడుతూనే ఆ అంతర్యుద్ధంలో మెల్లిదిగా యేదో ఒక పక్షాన చేరుతూ ఉండిరి. శాంతి యుతంగా ఎన్నుకోబడి అభ్యుదయశక్తులకు ప్రాతినిధ్యం వహిస్తూన్న స్పెయిన్ ప్రజా ప్రభుత్వమును విదేశీయుల ధన సహాయముగల సైనికుల తోడ్పాటుతో తిరుగు బాటుదారు లాకస్మికంగా ఎదుర్కొన్నారు స్పెయిన్ పోరాటం అనగా 'స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ'కి 'రాయల్ డచ్చి షెల్ ఫరమ్' కూ ఉన్న పోరాటమేననికూడా కొంతమంది అభిప్రాయం. ఈ మాట విన్నప్పుడు మనం నిర్ఘాంతపోవలసిన అవసరం లేదు. యూరపులోని ఆయుధ కర్మాగార ప్రభువులు తమకు వ్యతిరేకంగా ప్రయో గించడానికి తమ శత్రువులకు సైనిక సామగ్రిని సప్లయిచేశారనీ, చాలా సందర్భాలలో తమ ప్రభుత్వాల ఎఱుకమీదనే అలాచేశారని మనకు తెలిసినప్పుడు ఈ విషయంలో ఆశ్చర్యమేమున్నది? భారత జాతీయ మహా సభాధ్యక్షుడు స్వయంగా స్పెయిన్ దేశ మును దర్శించి తిరిగి రాగానే ఆ దేశంలో అన్నాతురులైన అసంఖ్యాక ప్రజలకు ఇండియానుండి ఆహార పదార్థములను పంపిన విధానమును ముమ్మందు గమనించెదము గాక! ప్రపంచ శాంతి మహాసభ జరుగుతూన్న సమయంలో కాంగ్రెసు అధ్యక్షుడీ దిగువ సందేశమును పంపెను.

"మేము శాంతినే కోరుతూ సంగ్రామశక్తులను నిరోధింప ప్రయత్నాలు చేస్తూ న్నప్పటికీ, యుద్ధకారణాలను నిర్మూలిస్తేనే కాని నిజమైన శాంతి కలగదని విశ్వసిస్తూ న్నాము. కాబట్టి ప్రపంచ శాంతి మహాసభ యుద్ధకారణాలను తెలుసుకోవడానికి ప్రయత్నించి వాటికి తగిన నివారణోపాయములనుకూడా ఆలోచించవలెను. ప్రస్తుతం విరోధాభండాన్ని ఆందోళనపరుస్తూ ప్రపంచ సంగ్రామమునకు కారణభూతములైన విషయములను గూర్చి మేమిప్పుడంతగా చెప్పనక్కరలేదు అవన్నీ మీకు బాగా

తెలిసినవే. కాని వలసదేశాలలో మాత్రం సామ్రాజ్యవాదుల నిరంకుశాధికారం తొలగింపబడితేనే గాని శాంతి కుదరదని నొక్కివక్కాణించగలను. సామ్రాజ్యాధికారాన్ని కొనసాగించడం శాంతికోసమేనని చెప్పడం సహించరానిది. సామ్రాజ్యవాదానికీ శాంతికీ సగమెఱుక. కాబట్టి భారతదేశంలో నివసిస్తూన్న మాకున్నూ, మావలెనే ఉన్న తదితర దేశాలవారికిన్నీ మొట్టమొదట కావలసింది రాజకీయ స్వాతంత్ర్యం తరువాత సాంఘిక స్వాతంత్ర్యం దానిని అనుసరించి ఉండాలి. అప్పుడు మేము మా దేశంలో ప్రపంచంలోని తదితర దేశాలతోసహా శాంతి స్వాతంత్ర్య అభ్యుదయములను చిరస్థాయిగా స్థాపించుకోగలము.

"సామ్రాజ్యాధికారుల దోపిడీవిధానానికి, అందువలన తటస్థించే అన్ని చెడుగులకూ భారతదేశ మీనాడు బలి అవుతూన్నది. ఈ బాధలనుండి తప్పించుకోవడానికే మా శక్తిసామర్థ్యాల నన్నిటినీ వినియోగించవలసి వస్తూన్నది. భారత రాజ్యాంగమును గూర్చి బ్రిటిష్ పార్లమెంటువారు చేసిన నూతన చట్టం, సామ్రాజ్యవాదుల అధికారాన్ని యింకనూ బలపరుస్తూన్నదేకాని దుర్బలం చేయడంలేదు. కాబట్టి మేమీ చట్టాన్ని ఎదిరించితీరాలి. ఇతర దేశాలలోని మా మిత్రులందరూ, ఇండియాలోని మా ప్రస్తుతస్థితినీ మేమెదుర్కొవలసిన చిక్కులనూ గమనించవలెనని కోరుతూన్నాము. ఆర్థిక విషయంలో రైతులయొక్కయు, కార్మికులయొక్కయు, నిరుద్యోగులయిన మధ్యతరగతులవారి యొక్కయు స్థితి చాలా క్లిష్టంగా ఉంది. కాబట్టి ఆర్థిక సమస్యా పరిష్కారం కాకుండా, కేవల రాజకీయసమస్యా పరిష్కారం జరిగినప్పటికీ ప్రజాసామాన్యానికి ఏమీ క్షేమం చేకూరదు. అయినప్పటికీ అన్నిటికన్నా ముందు రాజకీయ పరిష్కారం జరిగితీరాలి. అనగా భారతదేశం స్వాతంత్ర్యం పొందితీరాలి. భారతదేశము నెదుర్కొన్న సాంఘిక సమస్య స్వాతంత్ర్యంవలననే పరిష్కారం కాగలదని భారత జాతీయమహాసభ విశ్వసిస్తూన్నది. కనుక ఆసంస్థ అందుకోసమే కంకణం కట్టుకొన్నది.

"ఐతే మా జాతీయమహాసభ భారతస్వాతంత్ర్యంకోసం పనిచేస్తూన్నప్పటికీ, మాదేశం పరాయిదేశాలతో సంబంధంలేని వెలికాకిగాగానీ, ఇతరదేశాల దురాక్రమణను ప్రోత్సహించేదిగాకానీ ఉండకూడదని విశ్వసిస్తూన్నది. వివిధజాతుల పరస్పర సహకారంపైనా న్యాయంపైనా ఆధారపడివుండే ప్రపంచవ్యవస్థ కావలెనని కోరుతూన్నది. ప్రపంచశాంతి మహాసభ ఈ ఆశయంకోసం పనిచేసేయెడల, యుద్ధ

కారణాలు నిర్మూలింపబడి ఛిన్నాభిన్నమైన ఈ ప్రపంచంలో తిరిగి శాంత్యభ్యుదయములు స్థాపింపబడవచ్చునని నమ్ముతున్నాము.”

1936 సంవత్సరం అనేక సోదాలు, అరెస్టులూ, శిక్షలూ జరిగినవి. విపరీతపు టుత్తరువులకూ అశాంతికీ నిర్బంధవిధానానికీ ఆ ఏడాది పెట్టింది పేరు. ‘వై సోషలిజం’ ‘సోవియట్ సైడ్ లైట్సు’ అనే నిరపాయకరములైన పుస్తకాలనుకూడా అధికారులు పట్టుకొనిపోయారు. గోర్కీ వ్రాసిన ‘వైడ్ సీ కెనాల్’ షేరువుడ్ ఎడ్డీ వ్రాసిన ‘ఛాలెంజి ఆఫ్ ది ఈస్టు’ ‘యు. యస్. యస్. ఆర్-హ్యాండు బుక్కు’ మారిస్ థోరో వ్రాసిన ‘ఫ్రాన్సు టుడే’ ‘ఫీపిల్సుఫ్రంటు’ అనే పుస్తకాలు అహమ్మదాబాదు వాస్తవ్యుడు భట్టు వ్రాసిన ‘దరియేదావ్ లగ్యో’ అనే గుజరాతీ గ్రంథమూ వీటన్నిటినీ కూడా ప్రభుత్వమువారు పట్టుకొనిపోయినారు. 1936 కు పూర్వం కొలది సంవత్సరాలలోనే రాజద్రోహ చట్టము, సీ కష్టమ్సు చట్టమూ, ఆర్డినెన్సు చట్టములను అమలుజరిపినందువలనకానీ, దోషపరిశీలనా సంఘంవారి (Board of Censors) కార్యకలాపమువలనగానీ 348 వార్తాపత్రికల ప్రచురణ ఆగిపోయినది. విద్యార్థులు ప్రవాసమునకు పంపబడిరి. కాంగ్రెసు ప్రెసిడెంట్ కు లయాల్ పూరులో ఆహ్వానపత్రములు సమర్పించవలెనని చేయబడిన మున్సిపల్ కౌన్సిళ్ళ తీర్మానములు ఆచరణలోకి రాకుండా తాత్కాలికంగా నిలుపుచేయబడినవి. కార్మికుల హక్కులు నిరోధించబడినవి. ఈ జాడ్యం ఫ్రెంచి పరిపాలనక్రింద ఉన్న పుదుచ్చేరికి కూడా సాకింది. కమ్యూనిస్టు ప్రణాళికను గవర్నమెంటువారు వశపఱచుకొన్నట్లు ప్రకటింపబడెను. అచ్చువేసిన గాంధీ బొమ్మగల లకోటా ఒకటి నిషేధింపబడినదని వ్రాసినవారికే త్రిప్పి వేయబడింది. కలకత్తాకు దగ్గరగానున్న ఒక శివారులో 144 సెక్షన్ క్రింద బహిరంగసభలూ, ఉత్సవాలు, ప్రదర్శనాలూకూడా నిషేధింపబడినవి. ప్రజా సమితులు, రైతు సంఘాలు అధికారరీత్యా నిషేధింపబడినవి. డిటెన్యూల సంచారమునుగూర్చి చేయబడిన ఉత్తరువులను శాస్త్రప్రకారం ఉల్లంఘించారనే నెపంమీద వారు తేలికగా అరెస్టు చేయబడుతూండిరి. కపుర్థలా, జోధ్పూరు, మైసూరు, బరోడా, సిరోహి, మార్వారు, రాజానంద గవాన్ లవంటి భారతసంస్థానాలు ఈ నిర్బంధ విధానాన్ని అనుకరించినవి. ఈ భయంకర గాఢాంధకారంలో ఆల్మోరా పర్వతాల నుండి ఒక ఆశాకిరణం కనిపించింది. తాననుభవించవలసిన శిక్షా కాలమును పూర్తి చేసుకొని 1936 ఆగస్టు ఒకటో తేదీని ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ అక్కడనుండి విడు

దలయ్యెను. కాని జైలు ద్వారంకడనే, సరిహద్దు రాష్ట్రాలలోకీ పాంచాల రాష్ట్రం లోకీ ఆయన రాకను నిషేధిస్తూ ఉత్తరువులు పంపబడ్డవి. సరిహద్దు రాష్ట్ర ప్రభుత్వం వారాయన ప్రజాక్షేమానికి భంగంగా ప్రవర్తించినట్లు నేరం మోపుతూ నిషేధించారు. పాంచాల ప్రభుత్వంవారు ప్రజాక్షేమానికి భంగంగా ప్రవర్తించియుండిరని కానీ లేక ప్రవర్తించనున్నారని కానీ తెలియడంచేత నిషేధించామన్నారు. 1914-15 సంవత్సరాలనాటి లాహోరు కుట్రకేసులో శిక్షింపబడి పరమానందు అనే ఆయన 23 సంవత్సరాలనుండి శిక్ష అనుభవిస్తూ లాహోరు జైలులోనుండెను. కామన్సుసభలో ప్రభుత్వంవారాయనను విడుదలచేయ నుద్దేశించలేదని ప్రకటించబడెను. 1936 జులైలో ఒక్క వంగ రాష్ట్రంలోనే 2000 మంది డిటినూలు ఉన్నారు. అయినప్పటికీ యింకా ఎక్కువ తీవ్రంగానూ పట్టుదలతోనూ నిర్బంధవిధానం సాగుతూనేఉన్నది. పంజాబులోని, సోషలిస్టు వర్కర్లపైనకానీ, కాంగ్రెసు ప్రచారకులపైనగానీ 50 మందికి తక్కువకాకుండా, వారి వారి గ్రామాలను విడిచిపెట్టకూడదని ఉత్తరువులు జారీ చేయబడ్డవి. 1936 సెప్టెంబరు, అక్టోబరు నవంబరు మాసాలలో వరుసగా ఒక్కొక్కటి చొప్పున బెంగాలు డిటినూ్యలలో మూడు ఆత్మహత్యలు జరిగినట్లుగా తెలిసి టాగూరు మహాకవి బహిరంగ విచారణ జరిపించవలసిందని కోరినాడు. 1932 నాటి వంగరాష్ట్ర ప్రజారక్షణచట్టంలోని అధికారాలు, చాల కొత్తగా వాటిని మించిన అధికారాలను వంగరాష్ట్ర ప్రభుత్వంవారు తమ కార్యనిర్వహణాధికారులకు జారీ చేశారు. ముఖ్యంగా కలకత్తా పోలీసు కమీషనరుకు, కొంతమంది జిల్లా మేజస్ట్రేటులకూ అటువంటి అధికారాలందజేయబడ్డవి. విప్లవోద్యమాన్ని, కమ్యూనిస్టు సిద్ధాంతాలనూ ప్రచారంచేస్తున్నారనే సాధారణ నేరం మోపబడుతూండేది చాలామంది పైన. ఈ అంతులేని అధికారాలు యువక సంఘాలనూ, కార్మిక, సోషలిస్టు సంఘాలనూ దెబ్బకొట్టడానికి మాత్రమే ఉపకరించినవి. హింసావాదులు (Terrorists) విప్లవ వాదులను గూర్చిన అనుమానాలు పూర్తిగా తొలగిపోనేలేదు. ఢక్కాలో 'స్వగృహ నిర్బంధ విధానం' విశేషంగా అవలంబింపబడింది.

"ఆగస్టు 4వ తేదీని, జారీచేయబడిన ఉత్తరువు ప్రకారం, సూర్యాస్తమయ సూర్యోదయముల మధ్య" ఢక్కాలో 19 ప్రదేశాలలోనూ, నారాయణగంజిలో 16 ప్రదేశాలలోనూ, (ఉద్యానాలు, ఆటస్థలాలూ దేవాలయాలతో సహా) 12-30 యేండ్లమధ్య వయస్సుగలవారెవ్వరూ కూర్చోకూడదనీ పచారు చేయకూడదనీ

నిషేధింపబడింది. ఈ ఉత్తరువుల నుల్లంఘించినవారి కారు నెలలు ఖైదు, జరిమానా విధింపబడునని ప్రకటింపబడెను. వంగరాష్ట్ర టెర్రరిస్టుల నిర్మూలన చట్టం అమలు లోకి వచ్చిన తరువాత ఇటువంటి ఉత్తరువు జారీచేయబడడానికదే మూడవ పర్యాయం.

"కలకత్తా విశ్వవిద్యాలయాధికారులు వంగరాష్ట్ర ప్రభుత్వంతో చిరకాలం రాయబారాలు నడిపిన తరువాత, జిల్లా ప్రధాన పట్టణంలోని పాఠశాలా భవనంలో సైన్యాలను ఉంచి పాఠశాలా కార్యకలాపముల కడ్డంకు కలిగించడం, యికముందు నుండీ సాధ్యమైనంతవరకు జరగకుండా చూచెదమని ప్రభుత్వంవారు తెలియపరిచారు. మొట్టమొదట్లో అటువంటి అడ్డంకు కలిగించబడనేలేదని ఆ ప్రభుత్వంవారే వాదించారు.

ఢిల్లీ:—"1920 నాటి బొంబాయి నగరపోలీసు చట్టం శెక్షన్ 27 కింద 1933-34, 1934-35, 1935-36 సంవత్సరాలలో బొంబాయి నగరంనుండి బయటకు పంపబడినవారి సంఖ్య క్రమంగా 346, 578, 663, ఈ కాలంలోనే '1864 నాటి 'విదేశీయుల చట్టం III' శెక్షన్ 3 కింద 67 మంది పైన ప్రవాసపుటుత్తరువులు జారీచేయబడినవి. వీరిలో చాలామంది శిక్షలు పడ్డవారే. వారి శిక్షాకాలం పూర్తి కాగానే ఈ ఉత్తరువులు జారీచేయబడ్డవి.

సింధు:— "హైదరాబాదు డి. జి. నేషనల్ కాలేజీలో అధ్యాపకుడైన ఆచార్య వాస్వానీ కాంగ్రెసు రాజకీయాలలో తీవ్రంగా జోక్యం కలిగించుకొంటూ న్నట్లు భావింపబడడంచేతనూ యం ఆర్. మసానీకి తన యింట్లో బస యిచ్చినందు కున్నూ ఆయన ఉద్యోగమునకు మూడురోజులలో రాజీనామా యీయవలెనని ఉత్త రువులు జారీచేయబడినవి.

వాయవ్య సరిహద్దురాష్ట్రాలు:— "ప్రజాశాంతి అదనపు అధికారాల చట్టం లోని 5, 16, 17 శెక్షనులు కోహట్, బన్ను, డేరాయిస్మాయిల్‌ఖాన్, హజరా జిల్లాలలో 1936 డిశంబరు 23 వరకూ అమలులో వుండునని గవర్నరు ప్రకటించాడు. పెషావరు జిల్లాలో యింతకు పూర్వమే అమలులో వుంది.

పత్రికలపైన నిర్బంధం 'లోకశక్తి' అనే మరాటి దినపత్రికను ప్రచురించడా నికి రు 1000, ధరావతు కట్టవలసినదని పూనా జిల్లా మేజస్ట్రేటు ఉత్తరువులుచేశాడు.

ఒక రాజకీయసభ అధ్యక్షోపన్యాసం నుండి కొన్ని భాగాలు ముద్రించినందుకు 'పంజాబ్ కేసరి' అనే అమృతసరం దిన పత్రికనుండి రు 2,000 ధరావతు కోరబడెను. వివిధ భారతీయ భాషలకూ ఒక రంగస్థలము నేర్పాటుచేయవలెనని కృషిచేస్తూన్న స్వచ్ఛమైన సాహిత్య మాసపత్రిక 'హంస' నుండి రు 1,000 ధరావతు కోరబడెను. పాట్నా వారపత్రిక 'అజాద్' నుండీ ఆగ్రా వారపత్రిక 'సైనిక్' నుండీ వరుసగా రు 1,000, రు 2,000 ధరావతు కోరబడ్డది. ఈ మొత్తాలవి చెల్లించినవికూడాను. కలకత్తాలోని కార్మిక వారపత్రిక 'మజ్దూర్'ను సెక్యూరిటీ అడిగిన కారణంచేత అది ఆగిపోయింది."

నిర్బంధ విధానం 1936 లో కొత్తగా ప్రారంభంకాలేదు. ఆ నిరంతర నిర్బంధ విధాన వాహినిలో పేర్కొన్న సంఘటనలు చిన్నచిన్న బిందువులు మాత్రమే. కాబట్టి లక్నో కాంగ్రెసు కాగానే మొట్టమొదటుగా సరోజినీదేవి యాజమాన్యంకింద అధ్యక్షుడు భారతీయ పౌరసా తంత్ర్య రక్షణ సంఘమును Indian Civil Liberties Union) నిర్మించాడు. దానికి డాక్టరు రవీంద్రనాథటాగూరు గౌరవాధ్యక్షుడు.

ఈ సంఘముపేరు వినగానే పాశ్చాత్య దేశాలలోని ప్రజలు కష్టపడి సంపాదించుకొన్న తమ హక్కులను ప్రజా ప్రభుత్వనాయకులు భంగం చేయకుండా కాపాడుకోవడానికి నిర్మించుకొన్న సంస్థల అనుకరణములని భారత రాజకీయ నాయకులకు తోచవచ్చును. ఇట్టి సంస్థలక్కడ ఉండడం న్యాయంకూడాను. ఎందువల్లనంటారా, ఎన్నుకోబడిన కొద్దిమంది మంత్రుల అభిప్రాయములనూ నిర్ణయములకూ అనుసరించియేకదా ప్రజాపాలనముకూడా నడుపవలసింది? ఒకసారి అధికారంలోకి వచ్చినతరువాత వారు పరిపాలించాలి లేదా రాజీనామాలిచ్చి లేచిపోవాలి. పరిపాలన కష్టమైనపని. పని చాలించుకొనిపోవడం నెమ్మదిగా జరిగేపని. ఈ రెండింటి మధ్యనూ ప్రజా మంత్రివర్గం ప్రజల హక్కులను భంగంచేసే పనులు చేయవచ్చును. చేయవచ్చుకాదు చేయడం సర్వసాధారణం. కాబట్టి ఈ పౌర స్వాతంత్ర్యరక్షణ సంఘమును అటువంటి పరిస్థితులలో స్థాపించడం కేవలం సమంజసమేకాదు అత్యవసరం కూడాను. ఈ సంఘముయొక్క వైశాల్యము, నిర్మాణము, కార్యకలాపము - ఈ అన్ని చట్టములు, శాసన పత్రముల సంప్రదాయములద్వారా గ్యారంటీ చేయబడిన పౌరుల హక్కులకు ప్రత్యేకాధికారాలకు భంగం కలగకుండా కాపాడేటందుకు ఉపయోగించగలవు. ఇండియాలో ప్రజలకు హక్కులనేవి లేనేలేవు. రాజ్యాంగ

చట్టమని చెప్పబడే చట్టం ప్రజాస్వామ్యమునకు వ్యతిరేకమైనది కావడమే కాక, ప్రజల స్వేచ్ఛకూ హక్కులకూ భంగం కలిగించేదిగాకూడా ఉన్నది. అటువంటప్పుడు పైన ఉదహరింపబడిన సంఘం కేవలం పాశ్చాత్య దేశాలలోని పౌర స్వాతంత్ర్య రక్షణ సంఘములకు అనుకరణం మాత్రమే కాగలదు. లేదా అది భారత జాతీయ మహాసభ యాభై సంవత్సరాలనుండి జయప్రదంగా నిర్వర్తిస్తూన్న ఆ బ్రహ్మాండమైన కార్య క్రమమునంతను తన నెత్తిమీద వేసికొని నిర్వహించనైనా నిర్వహించాలి. అయితే ఇండియాలో స్థాపించబడిన ఈ సంఘం చేయవలసినపని అమెరికా, ఇంగ్లాండు ఫ్రాన్సు దేశములలోవలె పౌరహక్కుల రక్షణకుకాదు, పౌరహక్కులను క్రొత్తగా స్థాపించడం అయితే దీనిస్థాపనమును ఒక విధంగా సమర్థించవచ్చును. 1936 లో స్థాపించబడుతూన్న యీ సంఘమే, భారత దేశంలో ప్రజాస్వామ్య రాజ్యాంగచట్టం పూర్తిగా అమలులోకి వచ్చిన తరువాత సంస్థాపించబడవలసిన పెద్ద సంఘమునకు ప్రాతిపదిక కావచ్చును. 1898 లోనే ఫ్రాన్సులో 'మానవహక్కుల సమితి' స్నీ (League of the Rights of Man) 1920 లో అమెరికాలో 'పౌర స్వాతంత్ర్య రక్షణ సమితి' స్నీ స్థాపించ బడినవని తెలిసినప్పుడు పై విషయమును తేలికగా అంగీకరించగలరు.

1936 లో రామమనోహర లోహియా రచించిన 'పౌరుల హక్కులకై పోరాటం' అనే గ్రంథమును అఖిల భారత కాంగ్రెసు సంఘముయొక్క విదేశీ శాఖ వారు ప్రకటించారు. అందులో 'పౌర హక్కుల రక్షణ సంఘాలు' ఫ్రాన్సు, అమెరికా, ఇంగ్లాండు దేశాలలో ఎలా అభివృద్ధి పొందినవో సంగ్రహంగా వివరిస్తూ, ఇండియాలో ఆ సంఘం ఎలా ఉండాలోకూడా తెలిసేటట్లు వ్రాశాడు. యుద్ధానికి పూర్వం జరిగిన కొన్ని విషయాలను ఆ గ్రంథంనుండి యిక్కడ ఉదాహరిస్తే పాఠకులకు ఉత్సాహదాయకంగా ఉంటుంది. నిరంకుశాధికారమును నిర్మూలించి పౌర స్వాతంత్ర్యమును స్థాపించడానికి నెత్తురు వోడ్చిన ఫ్రాన్సు, అమెరికా జాతులలో కూడా యెన్నో అన్యాయ్యాలు, అశాస్త్రీయ కార్యములు, అధికార దుర్వినియోగములు శాసన విరుద్ధ కృత్యములు, వ్యక్తులకూ సంఘాలకూ ప్రజా సమూహములకూ కూడా ప్రతికూలంగా జరిగినవి. అప్పుడు తఱచుగా ప్రజాభిప్రాయమును రేకెత్తించే టందుకు, ప్రభుత్వానికిరాయబారాలు పంపేటందుకు, పార్లమెంటుకు అర్జీలిచ్చుకొనే టందుకు, కరపత్రములను వేసేటందుకు, సభలుపెట్టేటందుకు ప్రదర్శనములు చేసేటం దుకు యిటువంటి సమితులను స్థాపించవలసి వచ్చింది. ఫ్రెంచి విప్లవమునకు దాటితీసిన

నినాదములగూర్చి ఫ్రెంచి ప్రజకు కొత్తగా జ్ఞాపకం చేయనక్కరలేదు. కాని అటువంటి ఫ్రాన్సులోకూడా, విప్లవమునకు పునాదులైన ఆ ప్రాథమిక సూత్రాలూ నియమాలూ సరిగా పాలింపబడక అనేకసార్లుల్లంఘింపబడుతూ వచ్చినవి. "మనుష్యు లందఱూ పుట్టుకతోనే స్వతంత్రులుగా ఉండి స్వతంత్రులుగాజీవిస్తూ చట్టము దృష్టిలో సమానులుగా ఉండాలి" కాని కోర్టులు, అధికారులూ మాత్రం మనిషికీ మనిషికీ భేదము చూపిస్తూనే ఉన్నారు. స్వాతంత్ర్యం, ఆస్తి, ధనమాన ప్రాణరక్షణ, దౌర్జన్యనిరోధము ఇవన్నీ ప్రతిమనిషికీ ఉండవలసిన సహజ హక్కులనీ, ప్రభుత్వాధికారం ప్రజలదేననీ శాసనంద్వారా వారి అభిప్రాయం వెల్లడిజేయబడుతూన్నదనీ సిద్ధాంతరీత్యా అంగీకరింప బడుతున్నప్పటికీ వీటినిఆచరణలో ఉల్లంఘించినందున అనేకసార్లుపౌరస్వాతంత్ర్యరక్షణ సంఘం జోక్యం కలిగించుకోవలసివచ్చింది. యుద్ధంమధ్యలోకూడా, రాజీ చేసుకోవలె నని రాజ్యాంగచట్టం మార్చాలని కానీ, శాంతిస్థాపన చేయవలెనని కాని కోరేహక్కు ప్రతిపౌరునికీ ఉన్నదని అంటారు కాని ఆప్రకారం చేసినవారు సంవత్సరాలకొలదీ ఖైదు అనుభవించవలసివస్తూన్నది. ఫ్రాన్సులోని ఈ సమితివారు తమ సిద్ధాంతములను ఆచర ణలోకి తీసికొనివచ్చి బాధితులైన వ్యక్తులకు న్యాయం కలిగించేటందుకు న్యాయ స్థానములలోనూ కార్యనిర్వహణాధికార వర్గములలోనూకూడా చర్య తీసికొనే యేర్పాటు చేశారు. పత్రికలద్వారానూ సభలద్వారానూ, కరపత్రములద్వారానూ అనేక సంక్షోభకర విషయములనుగూర్చి ప్రజాందోళనము చేయబడెను. రాజకీయ ఖైదీ లలో వ్యక్తులకు సంబంధించిన సందర్భములనేకం విచారణచేసి ప్రభుత్వంవారికి ఈ సమితివారు నివేదించారు. ఫ్రెంచిసమితి, రాజద్రోహ చట్టములు, ముద్రణాశాసనములు సమావేశ స్వాతంత్ర్య నిరోధములు, కార్యనిర్వహణాధికారుల నిరంకుశ చర్యలు, అన్యా యాలు, వీటికి వ్యతిరేకంగా పౌరహక్కులను రక్షించడమేగాక, ప్రజాస్వామ్య శాంతి భద్రతలను కాపాడి 'నియంతృత్వాధికారంవలన' 'మానవ స్వాతంత్ర్యములకు' భంగం కలగకుండా ఉండేటట్లుకూడా ప్రయత్నిస్తూన్నది. అంతేకాదు; కార్మికులకు తగిన ఆహా రం, యువకులకు పని, అందఱికీ మత స్వాతంత్ర్యం, 'సమ్మె' చేసే హక్కు, ప్రభుత్వాన్నీ పత్రికలనూ, ధనవంతుల గూడుపుఠాణీనుండి తప్పించడం. ఈ అన్ని సమస్యలనూ పరి ష్కరించవలెనని ఆ సమితి చాలా ఉత్సాహంగా పనిచేస్తూన్నది. బ్యాంకులనూ, 'యుద్ధ పరికరములను తయారుచేసే ఫ్యాక్టరీలనూ, జాతీయం చేయవలెననీ యుద్ధాలను నిర్మూ లించవలెననీ, వలసరాజ్యాల ప్రజలకు స్వాతంత్ర్య మివ్వవలెననీ ఆసమితి ఆదర్శం.

దీనినిబట్టి ఆ సమితి కేవలం న్యాయస్థాన వ్యవహారములకు, కార్యనిర్వహణ వ్యవహారములకూ సంబంధించి మాత్రమేగాక, ప్రజాస్వామ్య ప్రజాపాలనా సిద్ధాంతములను రక్షించే ఉద్దేశంతో రాజకీయంగా కూడా పనిచేస్తూన్నదని బోధపడగలదు.

ఎన్నో దశాబ్దములనుండి ప్రజాస్వామ్య హక్కులను పుట్టినిల్లుగా భావింపబడుతూన్న అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి దేశంలో, ఈ హక్కులు ధనవంతుల యొక్కయు గూడుపుఠాణీ ప్రభుత్వవర్గాలయొక్కయు పలుకుబడివలన యెంతవేగంగా తృణీకరింపబడుతూన్నవో గమనిస్తే ఆశ్చర్యకరంగా ఉంటుంది కేవల సిద్ధాంతాలు బహిరంగ చర్యలలోకిదిగి శాంతి భద్రతలకు భంగం కలిగినప్పుడుమాత్రమే 'సమ్మె'లతో ప్రభుత్వం జోక్యం కలిగించుకొన్న రోజులు మన మెరుగుదుము. నేడో అమెరికాలోని సమ్మెలు సైనికుల జోక్యంతో అణచివేయబడుతూన్నవి. ప్రభుత్వంవారు బయొనెట్లుతో భయపెట్టి బాంబుల్ను తయారుచేయిస్తూన్నారు. ఒక తప్పు రాజకీయ సిద్ధాంతమునుగానీ, లేక చట్టవిరుద్ధమైన రాజకీయ సిద్ధాంతమునుగానీ ఆచరణలోకి తీసికొనిరాకపోయినప్పటికీ ప్రచారంచేసినంతమాత్రంతో అయిదు సంవత్సరాలఖైదు శిక్ష విధించడం, పరిస్థితులకేమాత్రమూ అనుగుణంగాలేని నిర్బంధ విధానమని మన భారతదేశంలోకూడాభావింపబడుతూన్నది. కాని అమెరికాలో జరుగుతూన్నదదే. పెద్దపెద్ద ఆస్తిపరుల యెడల పట్టి పక్షపాతబుద్ధిని చూపించే సైనిక న్యాయపరిపాలనములకు గుర్తుగా ఋజువుచేయ తగిన అన్యాయములకు కొదువలేదక్కడ" జరిగిన పది ఇరవై ఏండ్లలో అమెరికాలోని పంటల దరలు తగ్గిపోయినప్పుడు, అక్కడి గ్రామ పరిస్థితులను, అక్కడ తటస్థించిన పోరాటములను గమనించి, యావత్తు వ్యాపారమును గుప్పెట్లో పెట్టుకొని ఉన్న ధనవంతులు, రైల్వేవారు, బ్యాంకింగు సంస్థలూ ఏవిధంగా రేట్లు హెచ్చించారో తెలిసికొన్నయెడల అమెరికా దేశపు రైతుల స్థితికూడా మన భారతదేశంలో పేదరికంతోనూ ఆకలితోనూ కుంగి కృశించిపోతూన్న చిన్న చిన్న రైతులయొక్కయు వ్యవసాయ కూలీలయొక్కయు స్థితికి ప్రతిబింబంగా ఉండేటంతవరకు క్షీణించిపోయిందా అని ఆశ్చర్యంవేస్తుంది. ఇక్కడవలెనే అక్కడకూడా 'చరాస్తులను తాకట్టుపెట్టడం జప్తుచేయడం' వగైరా చర్యలకు వ్యతిరేకంగా పోరాడవలసియున్నది ఇండియాలో పన్నుల నిరాకరణోద్యమ సందర్భంలో చిరపరిచితములైన - వేలంలో వస్తువులు అమ్మకం కాకుండాచేసే ప్రయత్నాలుకూడా అక్కడి రైతులు చేయవలసివస్తూన్నది. వ్యవసాయ సామగ్రిలో యే ఒక్క వస్తువు నాలుగణాలకు అమ్ముడు కాకపోయి

నప్పుడు గుత్తాల జతలను వేల పెడితే కొనే దిక్కు లేనప్పుడు రైతుల హక్కులను అపహరించేటందుకు చేయబడుతూన్న ప్రయత్నాలనుగూర్చి వారెంత పట్టుదలతో ప్రతి కూలంగా ఉన్నారో మేము వేరుగా చెప్పనక్కరలేదు. ఈ సందర్భంలో వారుచేసిన సమ్మెలు, కలహాలకూ ప్రభుత్వ సైనికుల మధ్యనూ, కంపెనీ ముఠాదార్ల మధ్యా సాయుధపోరాటాలకు కారణాభూతము లవుతూన్నవి. అమెరికాలోని దక్షిణ రాజ్యాలలో ఆచరణలోఉన్న పంట పంపిణీ విధానమువలనను, కౌలుదార్లకు తమ హక్కులను తెలుసుకోగలిగిన చైతన్యం కలుగుటవలనను రైతులను ఖైదులలో పెట్టడం సమావేశాలను నిషేధించడం దౌర్జన్యంతో సభలను చెదరగొట్టడం మొదలయిన తీవ్ర ప్రతీకార చర్యలకు కడంగవలసిన అవసరం వచ్చింది. అమెరికన్ వలస రాజ్యాలయిన ఫిలిప్పైనులు, పోర్టురీకో, వర్జిన్ దీవులు, హవాయి, సెమోల్, గువాన్ హైతీల లోనివారి కష్ట నివారణములకోస మేర్పాటుచేయబడి శాంతియుత సమావేశములు నిషేధింపబడినవి. రాజద్రోహ శాసనాలవల్లనూ సైనిక బల ప్రయోగంమూలముననూ సమావేశములను నిషేధించడంచేతనూ అవాంఛనీయులైన వ్యక్తులను ప్రవాసమునకు పంపడంద్వారానూ వాక్స్వాతంత్ర్యము కఠినముగా అరికట్టబడినది.” అమెరికా దేశీయుల తమ సంస్కృతిని తదితరులపైన బలవంతంగా రుద్దవలెననీ, అమెరికన్ ఉద్యోగస్థులు తమ యిష్టంవచ్చిన రీతిని ప్రభుత్వాధికారము కేంద్రీకరించుకొని అమెరికా దేశీయుల వ్యాపార ప్రయోజనముల కనుగుణంగా నడిపించవలెననీ చేస్తూన్న ప్రయత్నములనుగూర్చిన వ్యతిరేక భావమే ఈ నిర్బంధ విధానమునకు కారణమని మాకు తెలియవచ్చింది. ఇదంతా పౌరుల హక్కులు తృణీకరింపబడుతూన్నవనే దృఢాభిప్రాయమునకు నిదర్శనము. అందువలన 1920 లో ‘పౌర హక్కుల రక్షణ సమితి’ (Civil Liberties Union) స్థాపించబడింది. అమెరికాలో జరిగే చిల్లర తగాదాలు కొన్ని ఇండియాలో జరిగేవాటిని జ్ఞాపకంచేస్తూన్నవి. ఒక్కొక్కప్పుడవి నమ్మడానికి వీలులేనంత చిన్నవిగాకూడా ఉంటవి. అమెరికాలోని అనేక రాజ్యాలలోనున్న ఉపాధ్యాయులు రాజభక్తి ప్రమాణములు తీసుకొనవలెనని కోరబడిరి. ఒక రాజ్యంలో కాంగ్రెసును పరిస్థితులను మార్చుకోనేటట్లు ప్రజలు చేయగలరని ప్రకటించడమే రాజద్రోహంగా పరిగణింపబడెను. గ్రంథాలయాలు ప్రభుత్వ పరిశీలనకు గురిఅయినవి. పాఠ్య గ్రంథాలలోని కొన్ని భాగాలు తొలగింపబడినవి. తీవ్రవాద రాజకీయ సంస్థల సమావేశములకు పాఠశాలా సభా భవనములు నిరాకరింపబడినవి.

ఇంతకన్న కూడా ఇంకా ఎక్కువ సంగతులు జరిగినవి. ప్రైవేటు సంస్థల దౌర్జన్యమును కొన్ని రాజ్యాల ప్రభుత్వాలు ఎఱుగనట్లుగా ప్రోత్సహించడం ప్రారంభించినవి. మఱి కొన్ని రాజ్యాలలోని రాజకీయ సిబ్బందీ, దాదాపు ధనవంతులకు దాస్యం చేయడం మొదలుపెట్టింది.

అమెరికాలోని పౌరస్వాతంత్ర్యరక్షణసమితి నాలుగుభాగాలుగా పదునాల్గురంగాలలో దండయాత్రసాగించింది. (౧) అభిప్రాయ స్వాతంత్ర్యం (విద్యావిధానంతో సహా) రాజకీయ నిర్బంధితుల విడుదల, దేశంలోకి రప్పించేటందుకు ప్రవాసమునకు పంపేటందుకూ చేయబడే శాసనాలు, పట్టణాలలో కానీ తదితర ప్రదేశాలలో కాని సమావేశాలు జరుపుకొనే స్థలాలు (౨) రైతులకు కార్మికులకూ సమ్మెలు చేయడానికీ పికెటింగు చేయడానికీ కావలసిన హక్కులు, (౩) రేడియోలలో, సినిమాలలో, పుస్తకాలలో, పోస్టాఫీసులలో జరుగుతూన్న దోషపరిశీలనా విధానం, (౪) అల్పసంఖ్యాక జాతులకోసం పోరాటం.

'పార్లమెంటులకు మాతృదేవియగు బ్రిటిష్ పార్లమెంటుచే పోషింపబడుతూన్న ప్రాజాస్వామికమునకు పుట్టినిల్లయిన యింగ్లండులోకూడా, పౌరుల హక్కులపైన దండయాత్రలు జరుగుతూనే ఉన్నవి. ఒకప్పుడు స్త్రీలకు వోటింగు హక్కు లేకుండా చేయబడినది. వకీలు వృత్తిలోకీ విశ్వవిద్యాలయములలోకీ స్త్రీలకు ప్రవేశం నిరాకరించబడినవి. రోమన్ కాథలిక్కులు, సివిల్ ఉద్యోగాలలోకీ విశ్వవిద్యాలయములలోకీ రాకుండా నిషేధించబడడం అయితే ఇవన్నీ పూర్వకాలపు విషయాలు. కాని నేడు ప్రతి ఆంగ్లేయుని యిల్లుకూడా ఒక కోట అని చాలామంది అనుకొంటారు. అది నిజంకాదు. సర్ జాన్ సైమన్ అటర్నీ జనరల్‌గా ఉండగా, రైల్వే పనివాళ్ళు, గనుల పనివాళ్ళు, రవాణా పనివాళ్ళు కలసిచేసిన సమ్మె అశాస్త్రీయంగా ప్రకటించబడిన సంగతి అందరికీ తెలిసిందే. అకారణంగా అరెస్టుచేయడం, నేరాలనుగూర్చి పోలీసులు నిర్బంధంగా విచారణ చేయడం, బెయిలు నిరాకరించబడడం, యివన్నీ మామూలుగా ధనంగలవారికీ ధనవంతుల సంస్థలకూ పౌరస్వాతంత్రముల నరికట్టడానికీ యెంత పనికిబడిఉన్నదో తెలియచేయగలవు. "ఏదోఒక ఉద్దేశంతో అటు ఇటూ పచారుచేస్తున్నాడు"నే నేరం మోపడం యిటీవల ప్రతి పోలీసువానికీ పరిపాటి అయిపోయింది. ఈ పని ప్రమోషన్ కోసం పోలీసువాళ్లుపడే పాట్లుఅని తెలుస్తూన్నది. పోలీసు నిర్బంధంలోకానీ ఖైదులో కానీ ఉన్న ముద్దాయిలను వారి నేరాలనుగూర్చి విచారించడంలో తదితర పోలీసు

అధికారాల విషయంలోనూ పోలీసు పౌరులవలంబించే పద్ధతులలోనూ, రాయల్ కమీషన్ వారుచేసిన నియమాలు సరిగా పాటించబడడం లేదు. పోలీసువారి ఆజ్ఞ ప్రకారం బెయిలు అసలే నిరాకరింపబడడమో లేక కష్టమైన షరతులు కోరడమో జరుగుతూన్నది. పోలీసువారి యేజెంట్లుగా పనిచేయడం, అరెస్టు చేయబడినవారిని కేసు పెట్టకుండానే ఖైదులో ఉంచడమూ ఇంగ్లాండులో సర్వసాధారణంగా జరుగుతూన్నపని.

ఇండియాలోని బ్రిటిష్ గవర్నమెంటువారు పాతచట్టాలను పైకితీసి ప్రజలను ప్రవాసమునకు పంపడం క్రిమినల్ ప్రొసీజరుకోడులోని 108, 144 శెక్షనులను వాటి మూలోద్దేశాలకు భిన్నంగా దుర్వినియోగం చేయడంచూచి మనం ఆశ్చర్యపోతూంటాము. ఇంగ్లాండులోకూడా యిదేవిధంగా శాసనాలు దుర్వినియోగం చేయబడుతూన్నవి. ఇటీవల 'శాంతి ప్రచారం'కోసం బాకాలూదినవారిని నిర్బంధించడానికి, 100 సంవత్సరాలకిందట కొమ్ములు మొదలయిన శబ్దంచేసే పనిముట్లను ఉపయోగించడాన్ని నిషేధిస్తూచేయబడిన శాసనం ప్రయోగించబడింది. 1361 లో మూడవ ఎడ్వర్డుచేసిన శాసనం, ప్రస్తుతం ఏమీ చేయకపోయినప్పటికీ ఏదో అపాయకరమైనపని ఎప్పుడో చేస్తారని ప్రభుత్వంవారనుమానించిన వారిని ఖైదులో పెట్టడానికి ఇటీవల ఉపయోగించబడింది. ఇటువంటి దండయాత్రలను ఎదుర్కోవడానికే బ్రిటిష్ పౌర స్వాతంత్ర్య సమితి స్థాపించబడింది. సమావేశాలు జరుపుకొనేహక్కు, ఊరేగింపులను నడుపుకొనే హక్కూకూడా పోలీసు నిషేధాలవలననూ అధికార దుర్వినియోగంవలననూ న్యాయ సమ్మతములుకాని స్థానిక శాసనములవలననూ యిటీవల నిరోధింపబడుతూన్నది. మామూలుగా సమావేశాలను జరుపుకొనే చోటులలోకూడా, రాకపోకలకు అడ్డంకులుకలుగుతూన్నదనే మిషతో సభలను పోలీసువారు నిషేధించడం ప్రారంభించారు ఆల్బర్టుహాలును అద్దెకు తీసుకొన్నవారు ఒక రకమైన రాజకీయ సభకు ఆ భవనమును ఈయ నిరాకరించారు. యుద్ధము, శాంతి అనే విషయాలపైన స్పష్టమైన అభిప్రాయాలను వెల్లడించిన ఉపాధ్యాయులు, ఆచార్యులు శిక్షించబడ్డారు. బి బి సీ కొన్ని అభిప్రాయాలను వెల్లడించేటందుకు పక్షపాత దృష్టితో ఎక్కువ సావకాశం కల్పిస్తూన్నదనీ ఆనేకుల నిందారోపణకు గురిఅవుతూన్నది. 1934 లోకూడా 'ద్వేషప్రోత్సాహ చట్టం' (Incifement to Disaffection Act) చేయబడింది. దాని ప్రకారం సిపాయిలలో ద్వేషాన్ని రేకెత్తించకపోయినప్పటికీ, అభిప్రాయాన్ని బహిరంగంగా ప్రకటించడంకూడా నేరం అవుతూన్నది. అందువలన అది అభిప్రాయ ప్రకటనా స్వా

తంత్ర్యాన్ని భగ్నం చేస్తూన్న ది. ఈనూతన శాసనమువలన తటసించేఅనర్థాలను బ్రిటిష్ పౌరులకు వివరించడానికి సామాన్యప్రజల ఊరేగింపులతోకూడిన పెద్ద ఆందోళన ప్రారభించబడింది. ముద్రాలయాధికారులు కొన్ని కాగితాలు అచ్చు వేయడానికి భయ పడేది ఒక్క భారతదేశంలోనేకాదు. ఇంగ్లాండులోకూడా శాసన సమ్మతములైన కాగి తాలను అచ్చువేయడానికి భయపడి కొంతమంది ముద్రాలయాధికారులు తిరస్కరిం చారు. అమెరికాలో శాసనమే పౌరహక్కులకు భంగం కలిగిస్తూన్నదనీ ఇంగ్లాండులో దానిని అమలుపరచడంలో పౌరహక్కులకు భంగం కలుగుతూన్నదని అంటారు. బ్రిటిష్ సమితి బ్రిటిష్ పార్లమెంటువారికిందనున్న యావన్మంది ప్రజలపక్షాన పనిచేస్తూ న్నది. 1934 నాటి చట్టం అంగీకరింపబడినప్పుడు ఏపక్షానికీ చెందని పౌరహక్కుల జాతీయ సంఘం (The National Council of Civil Liberties) స్థాపించ బడింది. ఆసంఘం తొమ్మిది శీర్షికలకింద నివేదికలను సంగ్రహిస్తూంటుంది. అవి యివి (౧) సభలు (౨) ఊరేగింపులు (౩) ప్రచారం (౪)పోలీసు వారిఅక్రమచర్యలు (౫) దోష పరిశీలనము (౬) కనిపట్టి శిక్షించడం (౭) సోదాలు, కేసులుపెట్టడం (౮) రాజకీయాభి ప్రాయములనుబట్టి ప్యాసుపోర్టుల నిరాకరణ (౯) రాజకీయాభిప్రాయాలకోసం ఇష్టం వచ్చినట్లు ప్రవాసాలకు పంపడం."

ఇక మనం భారతదేశ సంఘటనలనుగూర్చి కాంగ్రెసు కార్యవిధానమును గూ మనదృష్టిని మరల్చెదముగాక. కిందటి మహాసభనాడు ఏర్పాటుచేయ బడిన పార్లమెంటరీ సబ్‌కమిటీయున్నూ, లేబరుకమిటీయున్నూ క్రమంగా పనిచేస్తూండ డం ఈ సంవత్సరం గమనించదగిన విషయాలలో ఒక ముఖ్యవిషయం. 1937 ఫిబ్రవరి నెలలోవచ్చేరాష్ట్రీయశాసనసభలకు ఒకసాహిత్యశిల్పమనతగిన ఎన్నికలప్రణాళికతయా రుచేయబడింది. ఈఎన్నికలలో 3½ కోట్ల ప్రజకు వోటింగుహక్కు కలిగింది. కాంగ్రెసు సాధారణ స్థానాలేగాక మహమ్మదీయ స్థానాలను, షెడ్యూలు తరగతులవారి స్థానా లనూ కూడా పోటీచేయ తలపెట్టడంచేత యీ ప్రణాళికద్వారా కాంగ్రెసు సందేశం భారతదేశంలోని మారుమూలల గ్రామాలకుకూడా చేరకతప్పదు తరువాత 1936వ సం వత్సరం ఆగస్టు 22, 23 తేదీలలో బొంబాయిలో జరిగిన అ. భా. కాం. సం. వారి ఎన్నికల ప్రణాళికను ఆమోదించారు. ఆ ప్రణాళికయొక్క సారాంశమిది :—

భారతదేశంలోని ఆర్థిక క్లిష్టపరిస్థితినీ, రైతుల 'పేదరికమును' పారిశ్రామిక కార్మికుల పనిలేనితనమునూ గూర్చి ఆ ప్రణాళిక చాలాదూరం చర్చించింది. కాబట్టి

కోట్లాను కోట్ల ప్రజలకు జాతీయస్వాతంత్ర్యం అతివేగంగా పరిష్కరించబడతగిన ముఖ్య సమస్య అయినది కాని ఈ సందర్భంలో వారు నడిపిన పోరాటాలవలన వారికి స్వేచ్ఛ కలుగకపోగా పైపెచ్చు అంతకంతకు వారి స్వాతంత్ర్యం అరికట్టబడుతూ వచ్చింది. కాంగ్రెసు 1935 వ సంవత్సరపు ఇండియా రాజ్యాంగచట్టమును నిరాకరించి శాసనసభా ప్రవేశం మూలకంగా తన ఆంతరంగికబలాన్ని అభివృద్ధిచేసుకోవలెనని నిర్ణయించింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని నిరోధించి, వారి రెగ్యులేషనులను, ఆర్డినెన్సులను, శాసనాలనూ తుదముట్టించడమే కాంగ్రెసు వాదులవలంబించ తలచుకొన్న రాజనీతి. పౌరుల ప్రధాన ధర్మములకు, హక్కులకు సంబంధించినంతవరకు కాంగ్రెసు కరాచి తీర్మానమున కనుగుణంగా నడుచుకొంటుంది. మత్తుపదార్థాలను నిషేధించడం, భూమివిధానాన్ని సంస్కరించడం, భూములపైన భారాన్నీ, యుద్ధపు పన్నులనూ అద్దెలనూ తగ్గించడం, పొలం దున్నుకొనేవారికీ ప్రభుత్వానికీ మధ్యనున్న దళారీలను తొలగించడం, రైతుల ఋణాలను తగ్గించివేయడం, చౌకగా అప్పుపుట్టే అవకాశాలు కల్పించడం, యివీ మొట్టమొదట కాంగ్రెసు చేయదలచుకొన్న పనులు. ఇక పారిశ్రామిక కార్మికుల విషయంలో వారి జీవిత ప్రమాణాన్ని గౌరవప్రదంగా ఉండేటట్లు హెచ్చించడం, పనిచేసే గంటలను షరతులనూ నిర్ణయించడం, తగాదాలను పరిష్కరించడం, ముసలివాళ్ళకూ, రోగులకూ, పనిలేనివారికీ పరిహారమియ్యడం, యూనియనులను సాపించుకొని సమ్మెలనుచేసే హక్కును కల్పించడం మొదలైన సంస్కరణములను కావించవలెనని కాంగ్రెసు ఉద్దేశించింది అనారోగ్యంవలన తటస్థించిన నష్టాన్ని భర్తీచేయడం, గర్భిణీస్త్రీలకు, బాలింతరాండ్రకూ కొన్ని సౌకర్యాలు కలిగించడం, ఆడకూలీల రక్షణ, పౌరుల ధర్మాలకూ హక్కులకూ సంబంధించినంతవరకు స్త్రీలకు కూడా పురుషులతో సమాన ప్రతిపత్తిని కల్పించడం, అంటరానితనాన్ని తొలగించడం, హరిజనులయొక్కయు ఇంకా వెనుకపడివున్న యితర వర్గాలయొక్కయూ అభ్యున్నతికి తోడ్పడడం, ఖాదీ మొదలయిన గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించడం, రాజకీయ ఖైదీల స్థితిని బాగుచేయడం, వివిధ సంఘాల కోర్కెలను సమన్వయంచేయడం ఇదంతా కాంగ్రెసు శాసనసభలలో నిర్వర్తించదలచుకొన్న కార్యకలాపం. మంత్రిత్వ స్వీకరణ విషయం ఎన్నికలయిన తరువాత ఆలోచించబడుతుంది.

కృపలానీ కార్యదర్శిగానున్న కాంగ్రెసు కార్మికశాఖా ఉపసంఘం ఒక కార్య ప్రణాళికను తయారుచేసింది. కార్మిక సంఘాలనుగూర్చి వాటి నిర్మాణమునూ

గూర్చి పారిశ్రామిక వివాదములనుగూర్చి తగిన సంజాయిషీ సంపాదించడంకూడా ఆ కార్య ప్రణాళికలో ఒక అంశం. ఈసందర్భంలో అఖిలభారత ట్రేడ్ యూనియను కాంగ్రెసు, జాతీయ మహాసభ కార్మికశాఖా ఉపసంఘంతో సమావేశం కావలెనని కోరడం చాలా ఎక్కువ సంగతి. ఈ కోరిక ననుసరించి అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, N. F. T. U. అ. భా. రైల్వే కార్మికుల ఫెడరేషన్, అహమ్మదాబాదు బట్టలమిల్లు కార్మికుల సంఘం (Ahmadabad Textile Labour Association) అ. భా. పోస్టల్ అండ్ ఆర్. యం. యస్. యూనియన్, అ. భా. ప్రెస్‌వర్కర్ల ఫెడరేషన్‌వారు కాంగ్రెసు కార్మికశాఖా ఉపసంఘంవారిచే తమ తరువాతి సమావేశమునకు ఆహ్వానింపబడిరి. దీనికితోడు మే 17, 18, 19 తేదీలలో బొంబాయిలో శ్రీమతి మణిబెన్ కారా అధ్యక్షతక్రింద జరిగిన పదిహేనవ అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు మహాసభకు, కాంగ్రెసు అధ్యక్షుడు ఆహ్వానింపబడి హాజరైనాడు. ఆ మహాసభలో అఖిలభారత ట్రేడ్ యూనియన్ ఫెడరేషనుతో ఐకమత్యము కలిగివుండడమును గూర్చీ స్వాతంత్ర్య పోరాటంలో భారతజాతీయ మహాసభతో ఇంకా ఎక్కువ సన్నిహితసంబంధం కలిగివుండడమునూగూర్చీ ఆలోచనలు జరిగినవి. వివిధ కార్మిక సంస్థలను ఆహ్వానించిన కాంగ్రెసు కార్మికశాఖా ఉపసంఘం, 1936 వ సం॥ ఆగస్టు 18, 19 తేదీలలో కార్మిక సంస్థల చిక్కులను పరిష్కరించి వాటికి కాంగ్రెసు ఎలా ఉపకారి కాగలదో అనే విషయాన్ని గూర్చి ఆయా సంస్థల ప్రతినిధులతో సంప్రదింపులు జరిపింది. దేశంలోని కార్మికసంస్థలను స్థాపించుకోవడానికి కార్మికులకు కావలసిన సౌకర్యాలను కల్పించవలెననీ, సక్రమమైన కార్మికసంఘాలు యజమానులతో రాయబారాలు నడుపుకోవడానికి వీలుగా వాటిని అంగీకరించవలెననీ, కార్మికసంఘాల శ్రేయస్సుకోసం చురుకుగా పనిచేసే పనివాళ్ళకు బుద్ధిపూర్వకంగా అపకారం చేయరాదనీ పారిశ్రామిక యజమానులు ప్రోత్సహింపబడిరి. కార్మికులకు తగిన జీతాలు ముట్టేటట్లు, వారియెడల యజమానుల ప్రవర్తన సాధారణంగా సవ్యంగా వుండేటట్లు శాసనములు చేయవలసిందని శాసనసభలలోని కాంగ్రెసువాదులకు సిఫారసు చేయబడినది. పారిశ్రామిక కార్మికుల క్షేమానికి సంబంధించిన సమస్యలలో ఎక్కువ శ్రద్ధవహించి వారి స్థితిగతులను అభివృద్ధిచేసేటందుకు తగినచర్య తీసికోవడం అత్యవసరమని బ్రిటిష్ ఇండియాలోని కాంగ్రెసు కమిటీలకూ సంస్థాన ప్రభుత్వాలకూ నచ్చచెప్పి నారాసభ

వారు. అంతేకాక రైల్వే లంతకంతకు ప్రభుత్వపరం చేయబడడం ప్రభుత్వ స్వాధీనంలోనున్న రైల్వేలలో సిబ్బందిని తగ్గించడం తక్కువ జీతగాళ్ళ జీతాలింకా తగ్గించబడడం మొదలైన సమస్యలను పరిష్కరించడానికి తగిన తీర్మానములు చేయవలెనని కార్మికశాఖా సంఘమూ, ఆ సభవారూ కూడా సిఫారసు చేశారు.

కాంగ్రెసు అంతకంతకు పార్లమెంటరీ కార్యక్రమంలో మునిగి తేలవలసిన కాలమాసన్నమైనది. అది సక్రమంగా జరుగవలెనంటే క్రమశిక్షణ దానికి పునాదిగా ఉండాలి. కాని క్రమ శిక్షణకు భిన్నమైన చర్య లక్కడక్కడా అప్పటికప్పుడే జరుగుతూవచ్చినవి. తిరుచునాపల్లిలో జరిగిన ఒక సంఘటనమువలన అనగా ఒక మిత్రుడు చేసిన తప్పిదమునకు పరిహారముగా శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులవారు తన కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యత్వమును త్యజించారు. శ్రీ, జయప్రకాశ నారాయణకూడా తన కాంగ్రెసు కార్యవర్గ సభ్యత్వపదవిని వదులుకొన్నారు. లక్నో కాంగ్రెసు జరిగిన కొన్ని నెలల తరువాతకూడా ఆయన అ. భా. కాం. సం. సభ్యుడు కాకపోవడంవలన తానింకనూ కార్యవర్గ సభ్యుడుగా ఉండడం వాంఛనీయంకాదనుకొన్నాడు. ఆ కారణంగా కిందటి బీహారు రాష్ట్ర కాంగ్రెసు సమావేశంలో ఆయన అ. భా. కాం. సం. సభ్యుడుగాకూడా నిలబడలేదు. కాళీపడిన ఈ రెండు స్థానములలోనూ శ్రీమతి సరోజినీనాయుడు శ్రీ. గోవిందవల్లభ పంతులు నియమింపబడిరి.

లక్నో మహాసభనుగూర్చిన ఈ అధ్యాయం ముగించేలోపుగా ఆయేటి అధ్యక్షుని స్థితి యెలా ఉందో ఆయన సొంతమాటలలోనే వివరించడం అవసరమని అభిప్రాయపడుతూన్నాము.

“అధ్యక్షుడుగా నేనే యీ కాంగ్రెసుయొక్క ప్రధాన కార్య నిర్వహణాధికారిని. ఈ సంస్థకు నేను ప్రాతినిధ్యం వహిస్తూన్నట్లుగా అందరూ భావిస్తూంటారు. కాని నేడు కొన్ని ప్రధాన విషయాలలో కాంగ్రెసు అనుసరిస్తూన్న రాజనీతికి అనుగుణంగా, లక్నో కాంగ్రెసు తీర్మానాలద్వారా ప్రకటితమైన అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి నేను అనుకూలుడనుకాను. కాబట్టి వర్కింగుకమిటి ఈ విషయములలో భిన్న దృక్పథముల ననుసరిస్తూన్న నా అభిప్రాయాలకూ, అధిక సంఖ్యాకుల అభిప్రాయాలకూకూడా ఒకేసారి ప్రాతినిధ్యం వహించచాలదు.” 1939 లో త్రిపురీలోనూ, 1942 ఏప్రిల్ అలహాబాదులో అ. భా. కాం. సం. సమావేశం జరిగిన తరువాతను సరిగా యిటువంటి పరిస్థితులే తటస్థించినట్లు ముందు ముందు తెలియగలదు.

"వర్కింగుకమిటీ సభ్యులను ఎన్నుకొనేభారం అ. భా. కాం. సం. కు వదలివేసిన యెడల వారే తమ యిష్టంవచ్చిన సభ్యులను ఎన్నుకొంటారని" మొట్టమొదటనే తాను చెప్పవలెనని జవహరలాలు మనస్సులో గట్టిగా కోరిక కలిగినప్పటికీ "బాగా ఆలోచించిన తరువాత ఆమార్గం సరియైనది కాదని తోచి" తనపైన వేయబడిన "బాధ్యతనుండి ఆయన తప్పించుకోలేదు" ఓర్పూ ఆత్మ నిగ్రహమూకలిగి పరిసర పరిస్థితులను సరిగా గ్రహించినందువలననే జవహరలాలు తన బాధ్యతను నిర్వర్తించ గలిగినాడు. వర్కింగుకమిటీ ముఖ్యంగా అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని ప్రతిబింబింప చేస్తూన్నప్పటికీ అల్పసంఖ్యాక సభ్యులుకూడా అందులో ఉన్నారు. సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో ఆ కమిటీలోని సభ్యులందఱూ కలసి బాగా పని చేస్తారని జవహరలాలు ఆశించాడు.

లక్నో కాంగ్రెసు తరువాత తనకు తటస్థించిన చిక్కులనుగూర్చి తన స్నేహితులకూ విమర్శకులకూకూడా జవహరలాలొక సందేశం పంపినాడు. "నేను మీకు లక్నోలోనూ తరువాతనూకూడా, కాంగ్రెసు కార్యవర్గంలో నా స్థితి యెంత సందిగ్ధంగా ఉందో నిష్కపటంగా చెప్పే ఉన్నాననుకొంటాను. కాని విచిత్రమైన ఆ క్లిష్ట పరిస్థితి నాసోషలిస్టు సిద్ధాంత విశ్వాసంలో ఏమీ మార్పు కలిగించలేకపోయింది అది మొట్టమొదటుగా లక్నోలో వెల్లడి అయిన రాజకీయవిభేదం. దానిని మేమెవ్వరమూ కప్పిపుచ్చలేదు. ఎవరి వోట్లను మేము కోరుతూన్నామో, ఎవ్వరు భారతదేశ భవితవ్యమును నిర్ణయించవలసి ఉన్నదో ఆ ప్రజలకు తెలియకుండా ప్రధాన విషయాలను దాచిపెట్టరాదని తలంచి మేమంతా చాలా నిష్కపటంగానూ నిష్కర్షగానూ ప్రవర్తించాము. కనుక మాకుగల అభిప్రాయ భేదాలను బహిరంగంగా ఒప్పుకొన్నాము. అయినప్పటికీ మేమంతా పరస్పర సహకారంతో కలసి పనిచేయవలెనని కూడా అంగీకరించాము. మేమందరమూ భారత స్వాతంత్ర్యము సంపాదనవిషయంలో ఏకాభిప్రాయం కలిగిఉండడమేగాక, మేము భేదించిన విషయాలకంటె ఏక్యభవించిన విషయాలే చాలా ఎక్కువకావడంవలన కూడా మాకీ ఒడంబడిక కుదిరింది. చాలా సందర్భాలలో మాకు భిన్నదృక్పథములుండడం సహజం. ఇదంతా రాజకీయ విభేదమేకాని సాంఘిక విభేదంకాదు. సోషలిస్టు సిద్ధాంతం మాటలోనూ, దృక్పథంలోనూ తెచ్చిన విభేదం తప్ప వేరే సాంఘిక విభేదంలేదు. లక్నో తీర్మానాలలో సోషలిస్టు సిద్ధాంతానుగుణమైన తీర్మాన మొకటికూడా లేదు. ప్రధాన

సమన్వ్య రాజకీయమనీ, భారతస్వాతంత్ర్య సంపాదనమనీ సోషలిస్టులుకూడా గ్రహించి దానిమీదనే వారిదృష్టిని కేంద్రీకరించారు. కాంగ్రెసులో చీలికలు కలిగినవనడం అసందర్భం. భారతస్వాతంత్ర్య విషయం ప్రధానసమస్యగా ఉన్నంతవరకూ మాలో చీలికలు పుట్టడం అసంభవం. మేము ఏకీభవించవచ్చు ఏకీభవించకపోవచ్చు. ఒక్కొక్కప్పుడు చీలిపోవచ్చుకూడా. కాని స్వాతంత్ర్య శంఖారావం వినబడగానే మేమంతా ఒక్కమాటమీదనడుస్తాము." ఖాదీనిగూర్చి నిరుత్సాహపరుస్తూ ఆయన మాట్లాడినట్లు విని ఇతరులు చేసిన విమర్శనల కాయన జవాబిది "మన ఆర్థికపుచెడుగులన్నిటికీ ఖాదీయే తుదిపరిష్కారంగా నేను భావించడంలేదని ఇదివరకనేకసార్లు చెప్పివున్నాను. కాబట్టి దాని తుది చికిత్సకోసం నేను వేఱొకచోట పరిశోధిస్తూన్నాను. అయితే మన పరిస్థితులలో ఖాదీకి రాజకీయంగా సాంఘికంగా ఆర్థికంగా కూడా ఒక ప్రత్యేకస్థానమున్నది. కాబట్టి దానిని ప్రోత్సహించితీరాలి" రష్యాలోని సాంఘిక నిర్మాణమునకు పునాదియైన ప్రధాన ఆర్థిక సిద్ధాంతంలో తనకు విశ్వాసమున్నట్లుకూడా ఆయన ప్రకటించాడు. రష్యాదేశం విద్యా, విజ్ఞాన, ఆర్థిక, పారిశ్రామిక, విషయాలలోనేకాక ఆధ్యాత్మిక విషయంలోకూడా యెంతో అభివృద్ధిపొందిందని ఆయన అభిప్రాయపడ్డాడు. అయినప్పటికీ రష్యాలో జరిగినదంతా ఆయన అంగీకరిస్తూన్నాడనీ కానీ ఆమోదిస్తూన్నాడనికానీ తలంచవలదన్నాడు కాబట్టి రష్యాను గుడ్డిగా అనుకరించవలదనికూడా ఆయన సూచించాడు. కనుకనే ఆయన కమ్యూనిజం అనేమాట వాడకుండా సోషలిజం అని వాడుతూండడం. కమ్యూనిజం సోవియట్టు రష్యాకు చిహ్నంగా పరిగణింపబడుతూన్నది తీరా వివరించి చూస్తే జవహరలాలు ఆదర్శానికీ, ఆయన సహచరుల ఆదర్శానికీ చాలా తక్కువభేదమున్నట్లుతోస్తుంది. "సమాజంలో లాభంకోసం ప్రయత్నించే పద్ధతి పోవాలి దానికి బదులు సంఘసేవాపరాయణత్వం వ్యాపకం కావాలి. పోటీపోయి సహకారభావం రావాలి. లాభంకోసంకాక ఉపయోగంకోసమే ఉత్పత్తి చేయాలి. లాభంకోసంచేసే ఉత్పత్తిలో హింస ఉంది. హింస అంటే నాకు ఘోరంగా కనిపిస్తుంది. హింసమీద ఆధారపడిఉన్న మన ప్రస్తుత విధానాన్ని నేను బుద్ధిపూర్వకంగా సహించలేను. ధైర్యవంతమైన బలిష్ఠమైన యిచ్ఛాపూర్వకమైన సాంఘిక విధానం నాకు కావాలి. దానికి హింస పునాదిగా ఉండదు దానిలో ద్వేషం కనిపించదు. ద్వేషానికి బదులు ఉదారాశయాలు వేళ్లు నాటుకోవాలి. దీనినే నేను సోషలిజం అంటాను." సోషలిజం అనండి గాంధీజం అనండి కాంగ్రెసు అధర్శమూ అదే!

కాంగ్రెసు కోరుతూన్నదానికీ జవహరలాలు కోరేదానికీ చాలా సన్నిహిత సంబంధం ఉంది. జవహరలాలు ఇలా అన్నాడు. "సోషలిజం వచ్చేలోగా గానీ సోషలిజంకోసం ప్రయత్నించేలోగా గానీ మన భవితవ్యమును మనం నిర్ణయించుకొనే అధికారం ఉండాలి. రాజకీయ స్వాతంత్ర్యం కావాలి అదే మనమందరమూ కలసి పరిష్కరించవలసిన పెద్ద సమస్య. మనకు సోషలిజంలో నమ్మకమున్నా లేకపోయినా స్వాతంత్ర్య సంపాదన విషయంలో తగినంత శ్రద్ధ ఉంటే వదిలిపెట్టడానికి యిష్టంలేనివారి చేతులలోనుండి మనం మన స్వాతంత్ర్యాన్ని బలవంతంగా గుంజుకోగలం" నిజంగా నిష్కపటంగా ఆలోచిస్తే, గాంధీజీ నాయకత్వంకిందనున్న కాంగ్రెసు సోషలిజమనే సాలిగూడు నిర్మాణంకోసం స్వతంత్ర సంపాదనము చేయతలపెట్టుట లేదు. గ్రామాల ఆర్థిక పునర్నిర్మాణమే పడుగుగానూ, సాంఘిక ఐకమత్యమే పేకగానూ, నైతిక పునరుద్ధరణమే అంచులుగాను. భారతజాతీయత అనే వస్త్రం కాలమనే మగ్గంపైన ఇన్నిగంటలు పని చేయాలి ఇంత కూలి యీయాలి అనే ఆందోళనలు లేకుండా రాత్రింబవళ్లు ఒకేరీతిగా నేయబడుతూన్నది.

# ౨. ఫైజ్‌పూర్ మహాసభ

1939 డిశంబరు తరువాత కాంగ్రెసు ఫైజ్‌పూరును ఆహ్వానింపబడింది. చరిత్రా భూగోళమూ చదువుకొన్న వాళ్ళకెవళ్ళకీ ఈపేరు తెలియదు. ఇంతవరకూ కాంగ్రెసు మహాసభలను జరిపేగౌరవం నగరాలకే దక్కింది. ఆయాసభలలో చేయబడిన చారిత్రక నిర్ణయాలుకూడా ఆ నగరాలపేర్లతో సన్నిహితసంబంధం కలిగివుండేవి. బొంబాయి, కలకత్తా, మద్రాసు, అలహాబాద్, లాహోరు, వారణాసి, లక్నో, నాగపురం, అమరావతి, బంకీపూరు, కరాచీ, పూనా, అహమదాబాదు, సూరత్, గౌహతి' అమృతసరం, గయా, కాకినాడ, బెల్గాం, కాన్పూర్, ఢిల్లీ మొదలైన నగరాలకు మాత్రమే భారతజాతిని వార్షికమహాసభలు జరుపుకొనేందుకు ఆహ్వానించి ఆతిథ్యమీయడానికి హక్కు శక్తిసామర్థ్యాలూ ఉన్నట్లు దేశీయులు భావిస్తూండేవారు. 1930, 1932 సంవత్సరాలలోని సత్యాగ్రహోద్యమమునకు పిమ్మట, 1934 లో గాంధీజీ గ్రామ పరిశ్రమల సంఘమును స్థాపించినప్పుడు భారతదేశము యొక్క నిజస్వరూపము 7½ లక్షల గ్రామాలలో ప్రత్యక్షమయినట్లు, మూడువేల పట్టణాలలోనూ నగరాల లోనూ ప్రస్ఫుటం కాజాలదని ఆయనకు విశ్వాసంకలిగింది. పెద్ద పెద్ద నగరాల తరువాత, బెల్గాం, కాకినాడల వంటి చిన్నచిన్న నగరాలవంతు వచ్చింది. 1923, 1924 సంవత్సరాలలో కాకినాడ బెల్గాములలో కాంగ్రెసు మహాసభలు జరిగినవి. తరువాత మళ్లీ పెద్ద నగరాలవైపుకే కాంగ్రెసు దృష్టి మరలింది. నగరాలలోజరుపబడే కాంగ్రెసు మహాసభలకు గ్రామాలను రప్పించడంకంటె, గ్రామాలలోకి, గ్రామస్థులచేరువకు, నగరాలను తీసికొనివెళ్ళవలెనని గాంధీజీ సంకల్పించాడు. వారు జాతీయ మహాసభను జరుపవలసిన పద్ధతులను దానికి యాజమాన్యంవహించి చేయవలసిన విధులనూ నేర్చుకోవాలి యిప్పుడు. ఈవిధముగా ఫైజ్‌పూరు, హరిపుర, త్రిపురి, రామఘర్ గ్రామాలు భారతజాతీయాభ్యుదయ చరిత్రలో ప్రసిద్ధ క్షేత్రములుగా పరిణమించినవి.

ఇంకొక చిన్న విషయం జరిగింది. అయితే భారత స్వాతంత్ర్య పోరాటమునకు సంబంధించి పోల్చిచూస్తే అది చిన్న విషయంగా తోస్తుందికాని దానంతటది చిన్న

విషయంకాదు. సామ్రాజ్యమకుటంలో భారతదేశం మహోజ్జ్వల మణియని భావింపబడుతూంది. మన బానిసత్వమునకు బాదలకూ ఓదార్పుగా అప్పుడప్పుడూ ఇటువంటి భావకవిత్వం చెబుతూ ఉండేవారు. భారతదేశం కేవలంమణిపూసకాదు; మకుటమే. మకుటానికి కావలసిన మణులు బంగారమూ అవి పెట్టుకొనేందుకుండవలసిన మంజూష (పెట్టె) అన్నీ ఇండియాలో ఉన్నవి. ఈ మకుటం పెట్టుకొన్న చక్రవర్తి నూటయాభైయేండ్ల నుండి చీకూ చింతా లేకుండా భారతదేశాన్ని పరిపాలిస్తూన్నాడు. భారతీయులలో ఏకొద్దిమందో రాజుగారిని చూచిఉంటారు. రాజరికమంటే నిజంగా భారతీయులకంత మోజుకూడా లేదు. ఎప్పుడో ఇక్ష్వాకులనాటి నిజమైన భారతీయ రాజరికం ప్రజల కానాడు నచ్చితే నచ్చివుండవచ్చు. ఈరోజులలో రాజులన్నా సింహాసనాలన్నా గత కాలంనాటి చరిత్రగా భావిస్తూన్నారు జనం. ఎన్నో కిరీటాలు విప్లవజ్వాలలో కటిగిపోతూన్నవి. అయినా ఇండియామాట ఎలావున్నా బ్రిటనులో మాత్రం ఇంకా రాజరికంమీద ఉన్న మోజు అంతతొందరగా పాతబడేటట్లు కనుపించదు. జాతీయశక్తులన్నిటికీ అది కూడలి. పరస్పర విరుద్ధశక్తులను సమన్వయం చేయగల కేంద్రస్థానం, ఒకప్పుడు అవసరమైతే బ్రిటిష్‌ప్రజ రాజుల తలలు తీయడానికి గానీ, వారిని సింహాసనభ్రష్టులను చేయడానికిగానీ జంకలేదు. కాని అదృష్టవశాత్తు ఇటీవల కొన్ని శతాబ్దాలనుండీ ఈ అనుభవాలు తటస్థించడంలేదు. ఐదవ జార్జి చక్రవర్తి స్వర్గస్థుడుకాగానే ఆయన పెద్ద కుమారుడు ఎనిమిదవ ఎడ్వర్డు సింహాసనమునకు వచ్చాడు. ఎడ్వర్డురాజు వేల్సు యువరాజుగా నున్నప్పుడాయనలో కొంత విశిష్టత కనిపించింది. సోషలిజంపైన ఆయనకు పక్షపాతం. రాజరికమునకు శిష్టవర్గమునకూ సంబంధించిన సంప్రదాయాలంటే ద్వేషం. లేనివాళ్ళ దురవస్థలు తొలగించవలెనని ఆయనకెంతో కోరిక. వేల్సు మొదలైన ప్రదేశాలలో పనిలేక అల్లాడుతూన్న ప్రజను చూడడానికి తఱచు వెళ్ళుతూండేవాడు. రాజుగారు బహిరంగంగానూ, బుద్ధిపూర్వకంగానూ అవలంబిస్తూన్న పటాటోపంలేని అసంప్రదాయ యీపద్ధతులవలన గొప్పకుటుంబీకుల మనుకొనేవాళ్ళు చాలా అపకీర్తి పాలైనారు. ఇదంతా ఇలావుండగా, 1937 మే 12 వ తేదీని రాజుగారి పట్టాభిషేకం జరుగుతుందని 1936 మేలో రాజప్రకటన జరిగింది. 1936 లో, రాజుగారు సమావేశపఱచిన మొట్టమొదటి పార్లమెంటులో, ఆయనచేసిన ప్రారంభోపన్యాసంలో, పట్టాభిషేకమైన తరువాత తాను చక్రవర్తిగా సింహాసనాధిష్టుడు కావలసిన దర్బారునందు

పాల్గొనవలెననే ఉద్దేశం తనకున్నట్లు ప్రకటించారు. అయితే రెండో డిశంబరునాడే ఒక క్లిష్టపరిస్థితి యేర్పడ్డది. రాజుగారికి దేవుని దయ కావలెననే సంగతి ఆయనకు తెలిసే ఉంటుందని అనుకొంటున్నానన్నాడు బెడ్‌ఫర్డు మతాధిపతి (బిషప్) అంతటితో ఆగక రాజుగారి పట్టాభిషేక ఫలితం ఆయన స్వయంసమర్పణ బుద్ధిమీదనే ఆధారపడి ఉంటుందని కూడా అన్నాడు. ఇదంతా ఎందుకువచ్చిందంటే రాజుగారు అర్నెస్టుసింప్సన్ అనే ఒక అమెరికన్ స్త్రీని వివాహమాడదలచినట్లు తన మంత్రులకు తెలియచేశాడు. ఆమె ఇదివరకే ఇద్దరిని పెండ్లిచేసుకొని ఆభర్తలతో విడాకులు పుచ్చుకొంది. వారిద్దరూ జీవించివున్నారు. అందులో ఒకరు బ్రిటిష్ పౌరుడు. ఈ వివాహం మంత్రుల కిష్టంలేదు. 4 వ డిశంబరు తేదీని సమాన ప్రతిపత్తిలేనియీ వివాహము జరిగేటందుకు వీలుగా ప్రత్యేక శాసనాన్ని ప్రవేశపెట్టే ఉద్దేశం ఘనత వహించిన రాజుగారి ప్రభుత్వానికిలేదని బాల్డ్విన్ ప్రధాని కామన్సు సభలో ప్రకటన చేశాడు. 10 వ డిశంబరున రాజుగారు తన రాజ్యాన్ని త్యజించడానికి నిర్ణయించుకొన్నట్లుగా కామన్సు సభాధ్యక్షుడు ఆయన (రాజు) సందేశాన్ని సభ్యులకు చదివి వినిపించాడు. ఈరాజ్య త్యాగమునకు సంబంధించిన చిత్తు చట్టం రెండు పార్లమెంటు సభలలోనూ అంగీకరింపబడి ఘనత వహించిన రాజుగారి ఆమోదమునుకూడా పొందింది; అర్ధరాత్రివేళ గంపెడు చీకట్లో చినుకులు చిటపటా పడుతూండగా పూర్వపు రాజుగారు ఎక్కడికో ఎవ్వరికీ తెలియకుండా సముద్రాలు దాటి వెళ్ళాడు. 'రమణికోసం రాజ్యాన్ని' తోసిపుచ్చిన ఆ మనిషి పటాటోపంలేని ప్రపంచపౌరుడుగా ఆ పిమ్మట ఆనందంతో జీవయాత్ర చేస్తున్నాడు- ఆయన తరువాత వృత్తాంతంతో మనకు నిజంగా ప్రసక్తిలేదు. కాని విండ్సర్ ప్రభువు (Duke of Windsor) అనే పేరుతో ఆయన యుద్ధ సమయంలోనూ శాంతి కాలంలోనూ కూడా బ్రిటిష్ జాతికి సేవచేస్తున్నాడు. అయితే యుద్ధ సమయంలో ఆయనను యాభైవేల జనాభామాత్రం గల బర్ముడాస్‌కు గవర్నరుగా పంపడం ఆశ్చర్యం. 1936 లోని భారతదేశపు చారిత్రక స్వరూపమును సరిగా అర్థం చేసుకొనేటందుకు గావలసిన పుట్టుపూర్వోత్తరాలకోసం, కొంతసేపు బ్రిటను ప్రసక్తి తేవలసి వచ్చింది. ఇక రష్యానుగూర్చికూడా కొంత విపులంగా తెలుసుకోవలసి ఉంది. రష్యాలోని నూతన సంఘ వ్యవస్థలో 1924-1936 సంవత్సరాల మధ్య ఎంతో మార్పు కలిగింది. రష్యా అవలంభించిన నూతన ఆర్థిక విధానపు ప్రారంభదశలో పాత పెట్టుబడిదారీ

పద్ధతియొక్క అడుగుజాడలు అచ్చువ గుద్దినట్లు కనిపిస్తూనే ఉండినవి. పిదప నూతన రాజ్యాంగ చట్ట నిర్మాణంతో రష్యన్ జాతీయార్థిక రంగాలన్నిటిలోనూ ధనికవాదము పూర్తిగా నిర్మూలింపబడింది. 1936 నవంబరు 25 వ తేదీని, సరిగా ఫైజుపూరు కాంగ్రెసు యింకా నెలరోజులకు జరుగుతుందనగా, యు యస్. యస్. ఆర్. యొక్క నూతన రాజ్యాంగ-చట్టమును చర్చించి ఆమోదించే నిమిత్తం క్రెమ్లిన్ ప్రాసాదంలో 2040 మంది ప్రతినిధులు సమావేశమైనారు. జరిగిన పంధ్రెండేండ్లలో సోవియట్ రష్యా ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, సాంఘిక విషయాలలో పొందిన అభ్యున్నతి ఈ రాజ్యాంగ చట్టంలో మూర్తీభవించింది. వీటన్నిటినీ నిరూపించడాని కదియొక ప్రమాణపత్రమని కూడా చెప్పవచ్చును. ప్రపంచంలో కేవలం వ్యవసాయిక దేశముగా పరిగణింపబడే సోవియటు యూనియనులోని పరిశ్రమలుకూడా, వ్యవసాయ వృత్తితో సమానంగా ఆధునిక శాస్త్రీయ పద్ధతులతో నిర్మింపబడినందున, ఒక్కమారుగా ప్రపంచంలోని అభ్యుదయ దేశాలలో ఒకటిగా అది పరిణామం పొందింది. ఆ నూతన రాజ్యాంగ చట్టం నూతన శకమునకు నూతన ప్రభుత్వ నిర్మాణమునకూ మూలమయింది. లెనిను తన 47 వ యేట రష్యా ప్రభుత్వానికి నాయకుడై అధికారం వహిస్తే, ఆయన తరువాతవచ్చిన జోసెఫ్ స్టాలిన్ 34 వ యేటనే అధికారం వహించాడు సోవియట్టుల ఎనిమిదవ సమావేశంలో, రాజ్యాంగ సభానిర్మాణమును గూర్చి, దాని విధులనుగూర్చి, 1924 నుండి 36 వరకునూ సోవియట్టు యూనియను ప్రజా జీవితములో కలిగిన పరిణామమును గూర్చి, నూతన రాజ్యాంగ చట్టములోని ప్రధాన లక్షణములనుగూర్చి వాటిపైన బూర్జువావర్గంవారు చేసిన విమర్శలను గుతించి వాటిలో సూచించబడిన సవరణలనుగూర్చి, రాజ్యాంగ చట్టముయొక్క ప్రధానాశయమునుగూర్చి జోసెఫ్‌స్టాలిన్ ఉపన్యసించినప్పుడు చెలరేగిన ఉత్సాహం వలన, సభాసదుల కరతాళములతో, హర్షధ్వనులతో, ఉద్రేక నినాదాలతో సభాసదనం దద్దరిల్లింది. రష్యన్ నూతన ఆర్థిక విధానపు ప్రథమ దశ అది. ఆకాలంలో సోషలిజమును సంపూర్ణంగా పెంపొందిస్తూనే ఒక విధమైన పెట్టుబడిదారీ విధానపు పునరుజ్జీవనమునుకూడా అంగీకరించవలసి వచ్చింది అప్పుడు జోసెఫ్ స్టాలిన్ ఇలా అన్నాడు. "ఆ కాలంలో (1924) మన పరిశ్రమ ఎవరికీ అసూయ కలిగించేటంత అభ్యున్నత స్థితిలో లేమ ఇక వ్యవసాయమూ అంతకెంతెనూ హీనంగా ఉన్నది. జమీందారులు అప్పటికప్పుడే రూపుమాశారు. 'కులక్కు'లు మాత్రం యింకా కొంతబలంగానే ఉన్నారు.

మొత్తంమీద వ్యవసాయమంతా వ్యక్తిగతంకా చిన్నచిన్న రైతుల చేతులలో విశాల భూఖండంలో వ్యాపించి మధ్యయుగంనాటి అనాగరిక పద్ధతులమీద నడుస్తూన్నది. వస్తువిభజనమునుగూర్చికూడా యిదే విధంగా చెప్పవచ్చును. వస్తువిభజన సంవర్భంలో సోషలిస్టువిధానం నూటికి 50 మొదలు 60 వంతులకంటె ఎక్కువ అవలంబింపబడలేదు." 1936 నాటికి పెట్టుబడిదారీ పద్ధతి పూర్తిగా రూపుమాసింది. పరిశమలు బ్రహ్మాండంగా పైకెగిపోయినవి. వ్యవసాయం ప్రపంచంలోకి ఉత్కృష్టమయిన యంత్రోత్పత్తిద్వారా ప్రభుత్వ యాజమాన్యంకిందనూ సహకార సంఘాల సాముదాయక యాజమాన్యంకిందనూ ఆధునిక శాస్త్రానుగుణంగా నడుపబడుతూన్నది. వర్తకులూ, సాహస వ్యాపారస్థులూ (Speculators) మచ్చుకు కనపడకుండా పోయినారు. వస్తువిభజనము యావత్తు సహకారవ్యవసాయ సంఘాల చేతులలోనూ సాముదాయక కర్షక వర్గాల చేతులలోనూ ఉండిపోయింది. ఈ విధంగా ఒక మనిషిని మరొకమనిషి సొంత లాభంకోసం ఉపయోగించుకొనే పద్ధతి నిర్మూలింపబడింది. ఉత్పత్తి పరికరముల విషయంలోనూ ఉత్పత్తివిధానం విషయంలోనూ కూడా సోషలిస్టు (సామాజిక) యాజమాన్యం సాపించబడింది. ఇంతకు పూర్వం పౌరహక్కులను కోల్పోయి దేశంలో వెలిపెట్టబడిన వైట్ గార్డులు, పూర్వపు జమీందారులు, కులకులు, క్రైస్తవ మతాధిపతులు, తొలినాటి పెద్ద కుటుంబీకులు, జారు కాలంనాటి పోలీసు మిలిటరీ ఉద్యోగులు మొదలైన వారందరికీ పౌరహక్కులు తిరిగీ ప్రసాదించబడినవి. తక్కిన యూనియనులు సోవియటు యూనియనునుండి విడిపోవడానికిగల హక్కులను తొలగించవలెనని తేబడిన సవరణ వీగిపోయింది. అందువలన యు.యస్ యస్.ఆర్. లోనున్న రిపబ్లికులన్నీ సమానహక్కులు కలిగి స్వచ్ఛందంగా ఒక యూనియనులో చేరినప్పటి విశిష్టతకు భంగం కలగకుండా పోయింది. రెండవశాసనసభను అనగా జాతులసభను (Council of Nationalities) రద్దు చేయవలసిందని తెచ్చిన సవరణకుకూడా స్టాలిన్ వ్యతిరేకించాడు. యు. యస్. యస్. ఆర్. వివిధజాతుల సమ్మేళనం కావడమే యిందుకు కారణం. రాజ్యాంగచట్టంలోని 124 వ నిబంధనను, సవరించవలసిందని అనగా మత స్వాతంత్ర్యమును రద్దు చేయవలసిందని తెచ్చిన తీర్మానములనుకూడా స్టాలిన్ ఎదిరించాడు. ఈ సవరణ రాజ్యాంగ శాసనముయొక్క అభిప్రాయానికే విరుద్ధమన్నాడు. క్రైస్తవ మతాధిపతులను, పూర్వపు వైటు గార్డులను, కలవారినీ, సంఘ శ్రేయస్సుకుపయోగపడే పనిలో నిమగ్నులు కానివారినీ వోటింగు హక్కులేనివారుగా చేయవలె

సనీ, అధమం వారికి ఎన్నుకొనే హక్కు ఉన్నా ఎన్నుకొనబడేహక్కు లేకుండా చేయబడవలెననీ తెచ్చిన సవరణనుకూడా స్టాలిన్ ఎదిరించాడు. కష్టజీవులు కాని వారినీ స్వలాభపరులనూ శాశ్వతంగా ఎన్నికహక్కు లేనివారుగా చేయవలెనని సోవియట్టు ప్రభుత్వోద్దేశంకాదు. కొంతకాలంవరకూ తాత్కాలికంగా వారిని అలా ఉంచడం మాత్రమే ప్రభుత్వోద్దేశమన్నాడు స్టాలిన్. "వారందరికీ వోటింగుహక్కు తొలగించడం ఆనాటి సోవియట్టు ప్రభుత్వం, వారియెడల అవలంబించిన ప్రతీకారచర్య. అప్పటినుండీ ఇప్పటికి కొంతకాలం గడిచింది. ఇప్పుడు ఫాసిజం అనే కుటిలనీతి తరగలు కార్మిక తరగతుల సోషలిస్టు ఉద్యమాన్ని కలంకంచేస్తూన్నవి. సభ్యతా ప్రపంచంలోని అత్యుత్తమ జాతుల ప్రజాస్వామ్య వాంఛలనుకూడా అవి కలుషితం కావిస్తూన్నవి. యు. యస్. యస్. ఆర్. యొక్క ఈ నూతన రాజ్యాంగచట్టం ఫాసిజముకు వ్యతిరేకముగా చేయబడిన ప్రతీకారచర్య ఫాసిస్టు కూరత్వమునకు ప్రతికూలంగా ప్రస్తుతం పోరాడుతూన్న అందరికీ అది నైతికంగానూ ప్రత్యక్షంగానూకూడా సహాయకారి కాగలదు." అని ఉపన్యసించాడు స్టాలిన్.

ఈ పరిస్థితులలో జరిగిన ఫైజుపూరు కాంగ్రెసులో ఒకవంక కార్మిక కర్షకుల హక్కులను వక్కాణించే సోషలిస్టు నినాదాలతోనూ మరొకవంక సామ్రాజ్యవాద, ఫాసిస్టు తత్వ ప్రతికూల నినాదాలతోనూ వాతావరణం నిండి నిబిడీకృతం కావటమొక వింతకాదు. ఫైజుపూరు కాంగ్రెసు విషయ నిర్ధారణ సభలో "ప్రపంచ పరాధీన ప్రజానీకంతోనూ వారు వలస రాజ్య ప్రజలు కానీయండి 'స్వతంత్ర' దేశాలని చెప్పుకొనే రాజ్యాలలోని ప్రజలుకానీయండీ - సోవియట్టు ప్రజానీకంతోనూ భారత ప్రజానీకం ఐక్యభావం కలిగి ఉంటుందని కాంగ్రెసు ప్రకటిస్తూన్నది" అనే తీర్మానం చేయవలసిందని సోషలిస్టుపార్టీ సూచించింది. ఈ సూచన వస్తుందని అందరూ అనుకొన్నదే. ఎందువల్లననగా "యు యస్. యస్. ఆర్. లో సాధ్యమైన ఈపని తదితర దేశాలలోకూడా పూర్తిగా సాధ్యంకాగలదని నిరూపించడానికిది తగిన సాక్ష్యం" అన్నాడు స్టాలిన్. రష్యానుండి స్టాలిన్ అడిగిన ఈ మాటలువిన్న మాసంలోపుగానే ఆయన పిలుపుకు ప్రత్యుత్తరంగా ఫైజుపూరులో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పై సూచన చేశారు.

రష్యా రాజ్యాంగచట్టం అంగీకరింపబడిన నాల్గు వారాల తర్వాతను, 'ఎడ్వర్డు' రాజు రాజ్యత్యాగము చేసిన చారిత్రిక సంఘటనమునకు పిదప రెండు వారాలకున్నూ

ప్రత్యేకంగా నిర్మింపబడిన వెదురుపాకల 'తిలకు నగరం'లో ఫైజుపూరు మహాసభ జరిగింది. ఫైజుపూరు గ్రామసు పరిసరములలో భారత జాతియొక్క యావన్మంది ప్రతినిధులూ సమావేశమైనప్పుడు, ఇంగ్లాండు దేశంలోని సంఘటనలనుబట్టి కాంగ్రెసు వాతావరణం మేఘావృతమై ఉంటుందని కొందరు భావించవచ్చును. కాని ఇంతకూ మన్నికగా రాజరికం గురించి పట్టించుకోవడమే లేదు ఎప్పుడైనా రాజుగారిమాట తలపుకువస్తే రాబోయే రాజుగారి పట్టాభిషేక మహోత్సవాన్ని ఏ విధంగా బహిష్కరించాలా అనే ఆలోచన తప్ప మరేకోటి భావాలు ప్రజకు లేనే లేదు. రాజరికపు వ్యవస్థ సులోపాలను ... దానిని నిర్మూలించని ఈ రాజుగారి విషయంలో ఆ మహాప్రభావోత్సవం విషయంలోగాని భారత ప్రజానీకమున కెంత ఉత్సాహముంటుందో సంకోచించే అవసరమే. ఇంతకాలంగా ... నిజమైన సార్వభౌమత్వం ప్రజలది. ప్రజాసత్తు శక్తి ఆధారంగా ప్రజలందరే పరిపాలకులుగా రావలెనని భారతీయులు ... కాంక్ష ఇంగ్లాండు రాజుగారి రాజ్యత్యాగము వలన ఫైజుపూరు గ్రామ వాతావరణంలో చేరిన లక్షలాది ప్రజల హృదయాలలో సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్ష యింకనూ బలవత్తరమైనది.

అన్ని విధాలా ఫైజుపూరు కాంగ్రెసు విజయవంతంగా జరిగినది బహుశా అనుకొన్నదానికంటె కూడా ఎక్కువ బాగా జరిగింది. ఒక ప్రత్యేకోద్దేశంతో భావించబడిన "ప్రజా సన్నిహిత సంబంధం" కేవలం భావి కార్యక్రమంగా నిలచిపోక, ఫైజుపూరు కాంగ్రెసు ఏర్పాట్లలోనే ఆచరణలోకి వచ్చింది. దీనికి కారణం ఈ కాంగ్రెసుకు వెనుకనున్న శక్తి గాంధీజీ. గాంధీ బహిరంగంగా కాంగ్రెసులో ఉండి పనిచేసినప్పుడెంత శక్తివంతుడో కాంగ్రెసునుండి విరమించి మరుగున ఉన్నప్పుడుకూడా అంత శక్తిమంతుడు. అక్కడ ఏర్పాటుచేయబడిన అంత చక్కని వస్తుప్రదర్శనమున కాయనయే కారకుడన్నమాట వేరుగా చెప్పనక్కరలేదు అక్కడి అన్ని యేర్పాట్లను, అతి సూక్ష్మాంశములనుగూడా ఆయన పరిశీలించాడు అనువులకు ఆధారమైన నీరు నిచ్చే సెలయేటి స్థానం, పుట్టినచోట నిర్మలంగా ఉన్నంతమాత్రంతో ప్రయోజనం లేదు. ఆ నీరు ప్రవహించే పిల్ల కాలువలన్నీ కూడా స్వచ్ఛంగా ఉండాలి. అభిప్రాయం ... అత్యుత్కృష్టమూ అయినచోటునుండి అభిప్రాయాలు రావచ్చును. కాని కార్యనిర్వాహకులకు అభ్యున్నత భావములుకానీ ఆచుత్కృష్టవైఖరికానీ లేకపోయినట్లయితే ఆ పలు తత్వానికీ వ్యవహారానికీ సిద్ధాంతానికీ, ఆచరణకూ, అభిప్రాయాలకూ

ప్రణాళికలకూ, కావలసినంత భేదం కానవస్తుంది. అయితే అదృష్టవశాత్తు ఈ ఫైజు పూరు కాంగ్రెసులో ప్రధానపాత్ర వహించి పనిచేసిన మనిషి శంకరరావ్ దేవ్. ఆయన గాంధీజని సునిశిత బుద్ధితో శ్రద్ధా భక్తులు కలిగి అనుసరిస్తున్నాడు. మహారాష్ట్రీను కుండవలసిన మంచి ఆదరణ యోగ్యమైన మేధాసంపత్తి ఆయనకుంది. లక్నో సభను ముగిస్తూ తన భవితవ్యమునకు దురపిల్లిన అధ్యక్షుడుకూడా చాలావరకు మార్దవమైనాడు. జరిగిన ఎనిమిది నెలలో అధ్యక్షుడు సత్యే పరిస్థితులను చక్కగా గ్రహించినందువలన లక్నోలో నాడు ఆయనకును ఆయనసన్నిహితులకును మధ్యనున్న అంతరువు ఒకవంతెన యేర్పాటయింది ఆయనపేరు కాంగ్రెసు అధ్యక్షపదవికి సూచించబడగానే తన సోష లిస్టు సిద్ధాంతాలనూ, కార్యక్రమాన్ని దేశం ఎటినీ ఉంటుందనుకోంటానని కొంత బింకంగా (challenging) మాట్లాడాడు. కాని ఎవరూ ఏమీ భయపడలేదు. వల్ల భాయిపటేలు సకాలంలో దానికి సరియైన ప్రత్యుత్తరమిచ్చాడు. కానున్న అధ్యక్షు నకా ప్రత్యుత్తరంవలన తన స్థితిగతులను తెలుసుకోవడానికి మంచి సావకాశంకలిగింది. కాబట్టి లక్నో మహాసభకంటె ఫైజుపూరు మహాసభ ఇంకా ఎక్కువ సామరస్యంగా సాగిందంటే అధ్యక్ష ఎన్నిక సందర్భంలో జరిగిన పూర్వచరిత్రయున్నూ లక్నో అధ్య క్షుడు కడచిన యేడాదిలో జీవిత విశ్వవిద్యాలయమునందు గడించిన అనుభవమున్నూ కారణములని చెప్పవచ్చును. ఆనాటి ఉత్తర ప్రత్యుత్తరాలకు సంబంధించిన కొన్ని ముఖ్య విషయాల నీదిగువను పొందుపఱచెదముగాక:—

"ఒక విధంగా నిరుడు నేను వివిధ అభిప్రాయాల కలయికకూ కొలికిపూసగా పని చేశాను. అందువల్ల విభేదాలను సాధ్యమైనంతవరకు తగ్గించి, సామ్రాజ్య వ్యతిరేక పోరాటమునకు కావలసిన ఐక్యతనుగూర్చియే ముఖ్యంగా వక్కాణిస్తూ వచ్చాను. చాలా విషయాలలో 'అవునని' కానీ 'కాదని' కానీ నేను నిర్ణయించి చెప్పజాలక పోయినానుకూడా. అందువల్ల వర్కింగుకమిటీ నిర్ణయానికే వదిలివేస్తూ వచ్చాను. ఇప్పుడు అధ్యక్షపదవికి పేర్లు సూచించబడడమేగాక ఎన్నికకూడా సమీపిస్తున్నది. కాబట్టిఇంకా నేను మూకీభావం వహించడం మంచిది కాదని తలుస్తున్నాను. నాఅభి ప్రాయాలు నా దేశీయులకు చెప్పి తీరవలసిన తరుణమాసన్నమయింది. మనం తల పెట్టిన మహత్కార్యమును కొనసాగించేటందుకు నా సహచరులలో ఎవరిని ఎన్ను కొన్నప్పటికి నేను వారితో మఱొక ఉద్యోగ ధర్మంలో సంతోషంగా సహకరిస్తాను. అయితే నా దేశీయులు నేనే కావలెనని నేయెడల 'కాదు' ని నిరాకరించజాలను. వారి

చిత్తం వచ్చినట్లు నేను నడుచుకొంటాను. కాని వారా నిర్ణయానికి వచ్చేముందు నా ఆదర్శాలేమిటో, నా అభిప్రాయాలేమిటో నా వ్రాతలకూ మాటలకూ కారణ భూతములైన సంఘటనలు ఏవో, ముందుగానే పూర్తిగా వారు తెలుసుకోవాలి. వీటిని గూర్చి చెప్పవలసినదంతా ఇదివరకే చెప్పివేశాను. దానినిబట్టి నన్ను బాగా తెలుసుకో వచ్చును" సర్దారు వల్లభాయి పటేలు కాంగ్రెసు అధ్యక్ష స్థానపు ఎన్నికనుండి ఉప సంహరించుకొంటూ చెప్పిన కొన్ని వాక్యాలను ఇక్కడ ఉదహరిస్తున్నాను. "జవహర్‌లాల్ అభిప్రాయాలన్నిటినీ పూర్తిగా ఆమోదిస్తున్నందువలన నేను పోటీనుండి విరమించుకొంటున్నట్లు ఎవ్వరూ భావించరాదు. కొన్ని ప్రధాన విషయాలలో జవహర్‌లాలు అభిప్రాయాలతో నేను ఏకీభవించనూలేనన్న సంగతి కాంగ్రెసు వాదులకు నిజంగా తెలియనే తెలుసు. ఉదాహరణంగా, పెట్టుబడిదారీ విధానములోని దౌష్ట్యాలను తొలగించడం అసాధ్యమని నేను నమ్మను. స్వాతంత్ర్య సంపాదనమునకు సత్యాహింసలు అత్యంతావశ్యకములని కాంగ్రెసు విశ్వసిస్తూన్నంతవరకూ, ప్రజా సామాన్యమును నిష్కారణంగా దోచుకొని తింటూన్న వారిని, మానవ సమాజమునెడల వారు చేస్తూన్న మహాపరాధమునుండి తొలగించగలమనే నమ్మకం, మాటకూ చేతకూ భేదంకాని కాంగ్రెసువాదులందరికీ ఉండితీరాలి. అది న్యాయం. ప్రజాసామాన్యం తమ ఘోర పరిస్థితిని గ్రహించిన తక్షణం, దానినిగూర్చి యేమిచేయాలోకూడా వారికి తెలిసివస్తుంది. యావత్తు భూమీ, యావత్తు ఐశ్వర్యమూకూడా అందరిసొత్తు అనే సిద్ధాంతంతో ఏకీభవించడానికి నాకేమీ చిక్కులేదు. స్వయంగా నేను వ్యవసాయకుడను కావడంచేతను సంవత్సరాల తరబడి రైతులతో కలసి మెలసి ఉండడం చేతనూ అసలు చిక్కెక్కడ ఉన్నదో నాకు తెలియకపోలేదు. అయితే ప్రజాశక్తితో తప్ప యేపనీ చక్కబడదనే సంగతి నాకు తెలుసు.

"కాని అసలు లక్ష్యాన్ని గురించి మాకేమీ భేదాభిప్రాయం లేదు. మామీద బలవంతంగా రుద్దబడిన రాజ్యాంగ చట్టమును నిర్మూలించవలెననియే మా అందరి కోరిక. శాసనసభలలోనుండి ఎలా దానిని నిర్మూలించగలమా అని మేమాలోచిస్తూన్నాము. కాంగ్రెసు పతాకంక్రింద శాసనసభలకు పోయిన స్త్రీ పురుషుల విచక్షణ జ్ఞానంపైనా, చాతుర్యంపైనా ఆధారపడి ఉండవది. శాసనసభలలో కాంగ్రెసు వారవలంబించవలసిన రాజనీతిని అ. భా. కాం. సం. లేక వర్కింగు కమిటీవారు నిర్ణ

యిస్తాను. కాని దాని ఆచరణ కాంగ్రెసు ప్రతినిధుల విశ్వాసంపైననూ చాకచక్యపైననూ ఆధారపడి ఉంటుంది.

"ఉద్యోగస్వీకరణను గూర్చిన విషయం యిప్పటికిప్పుడు నిర్ణయింపవలసిన సమస్యకాదు. కాని మన అందరి ఉద్దేశమూ సఫలంకావడానికి ఉద్యోగ స్వీకరణ కూడా అవసరంకావచ్చును. ఆ తరుణమునుకూడా నేనూహించగలను. అప్పుడు జవహర్‌లాలు మధ్య నామధ్యగానీ, లేక దాదాపు కాంగ్రెసువాదులందరి మధ్యనూగానీ తీవ్రమైన విభేదాలు కలుగవచ్చును. జవహర్‌లాలు కాంగ్రెసు నేతల పరిపూర్ణ విశ్వాసంకల మనిషి కావడంచేత ఆయనకు వ్యతిరేకంగా అధికసంఖ్యాకులు నిర్ణయించినప్పటికీ ఆ నిర్ణయాలను అతిక్రమించజాలడని కూడా మాకు తెలుసు. నేను పార్లమెంటరీ కార్యక్రమానికి ఎంత సుముఖుడనో ఉద్యోగ స్వీకరణమునకు కూడా అంతే సుముఖుడను. కొన్ని పరిస్థితులలో మనం ఉద్యోగ స్వీకరణంకూడా చేయక తప్పనిసరికావచ్చుననీ, కాని అది మన ఆత్మగౌరవానికిగానీ మన లక్ష్యానికిగానీ భంగకరంగా జరుగకూడదనీ మాత్రమే నేను చెప్పదలచుకొన్నాను. నిర్మాణ కార్యక్రమానికి నేను రెండోస్థానమిస్తూన్నాను. అసలు పని అంతా శాసనసభలకు బయటనే వున్నది. కాబట్టి నిర్మాణ కార్యక్రమము కొనసాగిస్తూ మన బలాలను కేంద్రీకరింపుకొనేటందుకు మన శక్తిసామర్థ్యాలన్నీ వినియోగించవలెను. అందరము కూడా జాగ్రత్త చేసుకోవాలి. కాంగ్రెసు అధ్యక్షునికి నియంతృత్వాధికారాలు లేవు. చక్కగా నిర్మింపబడిన మనసంస్థకాయన అగ్రాసనాధిపతి. ఆయన కాంగ్రెసు సమావేశాలను సక్రమంగా నడుపుతూ దాని నిర్ణయాలను అమలుజరుపుతూంటాడు. ఒకవ్యక్తిని ఎన్నుకొన్నంత మాత్రాన — ఆవ్యక్తి ఎంత గొప్పవాడైనాసరే — కాంగ్రెసు తన విశాలాధికారాలనెన్నడూ వదులుకోబోవడం లేదు.

"కాబట్టి దేశంలో పనిచేస్తూన్న వివిధబలాలనూ సక్రమంగా సరియైన త్రోవను నడిపింపగల ఉత్కృష్ట జాతీయనాయకుడు జవహర్‌లాలునెహ్రూనే ప్రతినిధులందరూ అధ్యక్షునిగా చేయవలెనని కోరుతూన్నాను.

తరువాత సీతాపురం జిల్లాలోని హరగావ్ నుండి పండిత జవహర్‌లాల్ కింది ప్రకటన చేశాడు.

"రాబోయే కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలనుగూర్చి, అలహాబాదునుండి బారిలీకి పోతూ, రైలులో ఒక ప్రకటనచేశాను. నా మనసంతా చీకాకుగా ఉండి ఏమి

నప్పుడల్లా ఉద్యోగ స్వీకరణమునకు ప్రతికూలంగా అనేకసార్లు ప్రకటించాను. నా వ్యక్తి ప్రాయాలను నేను కాంగ్రెసు ముందు గట్టిగా వివరిస్తాను. కాంగ్రెసు తన యిష్టప్రకారం నిర్ణయించవచ్చును. కాంగ్రెసు తన నిర్ణయాలను పరోక్షప్రవర్తనద్వారా ఆకస్మికంగా గాక ప్రత్యక్షంగా అన్ని విషయాలనూ సమగ్రంగా ఆలోచించి చేయవచ్చును. ప్రస్తుతం దేశాన్ని ఆందోళనపరుస్తూన్న ప్రధాన సమస్య రాజకీయ స్వాతంత్ర్య సంపాదనమని నావిశ్వాసం. కాబట్టి ఆసమస్యనుగూర్చి అందరూ సమిష్టిగా ఏకవాక్యంతో వ్యవహరించడం అత్యవసరం. ఇదంతా అపోహాలను తొలగించడానికి చెబుతూన్నా నేగాని నన్ను ఎన్నుకోవలసిందని పరోక్షంగా ప్రచారం చేయడానికి కాదు. ఇంతా చెప్పిన తరువాత కూడా నన్నే ఎన్నుకొంటే కిడచిన ఎనిమిది నెలలలోని నాకార్య విధానమును అధిక సంఖ్యాకులైన కాంగ్రెసువారు అంగీకరించినట్లు అర్థమవుతుందే కాని ఏ సమస్యమీదకానీ నావ్యక్తిగత ప్రత్యేకాభిప్రాయాలను వారామోదించినట్లు అర్థంకాదు. నేనావిధంగా ప్రవర్తించడానికే కారణాలు కలవో అవి యింకా అలాగే ఉన్నవి. నేను అధ్యక్షుణ్ని అయినా కాకపోయినా సాధ్యమైనంతవరకు నేనదేవిధముగా పనిచేయగలమనుకొన్నాను."

1936 లోని ఫైజుపూరు కాంగ్రెసు అధ్యక్షోపన్యాసంలో సంఘితజవహరలాలు నెహ్రూ, 'చిరకాలం ఖైదులో నానాఅవస్థలూ పడి బైటకువచ్చిన శ్రీ. యం. యన్. రాయిను, నిర్బంధ నిరోధమునుండి Inferment) ఖాన్ అబ్దుల్ గఫర్ ఖానునూ ఆహ్వానించాడు." యీయుగపులో ఫాసిజం నిర్నిరోధంగా విజృంభిస్తూన్న సంగతి" ముక్తకంఠంతో ప్రకటించాడు. అంతర్జాతీయ వ్యవహారాలలో బందిపోటుపద్ధతి ప్రవేశపెట్టబడినదనీ దానిని సకాలంలో సరిగా నిరోధించకపోయిన యెడల ప్రపంచ మహాసంగ్రామం తప్పనిసరి అవుతుందనీ ఊహించాడు. అబిసీనియాపై దండయాత్ర స్పెయిన్ అంతర్యుద్ధమూ యిందుకు సాక్ష్యంగా కనిపిస్తూనే ఉండినవి.

బ్రిటను విదేశ రాజనీతికూడా నిష్కళంకంగా లేదు అంతర్జాతీయ సమితిలోని రాజ్యాలు జోక్యం కలిగించుకోజాలమని చేసిన వ్యర్థ ప్రకటన, స్పెయిన్ ప్రజా ప్రభుత్వాన్ని దుర్బలపరచడానికే ఉపయోగపడింది. ఫాసిస్టు బలానికి బ్రిటిష్ సామ్రాజ్యం చేదోడువాదోడుగా మాత్రమే పనిచేస్తూ వచ్చింది. ఈ అభివృద్ధి నిరోధశక్తుల మధ్య "భారత జాతీయ మహాసభ ఇండియాలో సంపూర్ణ ప్రజాస్వామ్య స్థాపనంకోసం పని చేస్తూన్నది. సోషలిజంకోసం కాదు. కాంగ్రెసు సామ్రాజ్య వ్యతిరేకసంస్థ మన ఆర్థిక

దానిని మనమింకా ప్రోత్సాహంచేయాలి. సామ్రాజ్యతత్వమునకు వ్యతిరేకంగా నిలబడగల అన్ని బలగాలనూ సంఘటితంచేసి ఐక్య జాతీయరంగమును నిర్మించడమే భారత స్వాతంత్ర్యంకోసం మనమిప్పుడు నిర్వర్తించవలసిన ముఖ్యమైన పనులన్నింటిలోకీ మొట్టమొదటి పని. కాంగ్రెసులో ఈ వివిధశక్తులకూ చాలావరకు ప్రాతినిధ్యమున్నది. ఎన్నో విభేదాలు విచ్ఛిన్న దృక్పథాలూగల అవన్నీ సమిష్టి ప్రయోజనంకోసం పరస్పరం సహకారంతో కలసి పనిచేస్తూన్నవి.”

ఇక మేము ఫైజుపూరులో చర్చించబడిన విషయాలను, చేయబడిన తీర్మానాలనూ గూర్చి శీఘ్రంగా సింహావలోకనం చేసెదముగాక! వాయిదాల ప్రకారం విభజింపబడిన ఒక కాలపరిమితిలో ఒక దేశంయొక్క చరిత్రను పరిశీలించడమంటే కొన్ని కష్టాలున్నవి. ఆకాలపరిమితిలోని సంఘటనలన్నీ సహజపరిసమాప్తిని పొందకపోవడమే దానికి కారణం. కాని ఒక దేశముయొక్క జాతీయ జీవితమును అనుసరించుకొని మొదటినుండీ తుదివరకు ఒకవిధమైన విద్యుత్తరంగములతో నిండిన ఒకానొక వాతావరణం ఉంటుంది. అదే ఆయాకాలాలలో ఆజాతియొక్క భావపరివర్తనములను నిర్ణయిస్తుంది. లక్నోలోవలెనే ఫైజుపూరులోకూడా ప్రపంచశాంతి మహాసభనుగూర్చి ఒకే అభిప్రాయాలు మా మనస్సులలో ఉండినవి. ప్రపంచ మహాసంగ్రామమును గూర్చిన భయాలుకూడా అలాగే ఉన్నవి; పౌర స్వాతంత్ర్య భంగమును గూర్చిన నిస్సహాయభావంకూడా అలాగే వుంది. భారతదేశంలో రానున్న శాసనసభల ఎన్నికలనుగూర్చిన ఆందోళనకూడా సరిగా అలాగే వుంది. 1936 సెప్టెంబరులో బ్రస్సెల్సు నగరమున జరిగిన ప్రపంచశాంతి మహాసభకు భారతదేశమునుండి ప్రతినిధి వెళ్ళాడు. ఫాసిజములకు వ్యతిరేకంగా స్థాపించబడిన ఉపసంఘమునకు గౌరవాధ్యక్షుడుగా పనిచేస్తూన్న మాన్సియర్ రొమేన్ రోలాండు ఆ శాంతిసభలో పాల్గొనవలసిందని భారతజాతీయ మహాసభను ఆహ్వానించాడు. ఒక జాతిపైన మరొక జాతి అధికారం చలాయిస్తూ దోచుకొని తినడం జరుగుతూన్నంతవరకూ ప్రపంచశాంతికి సావకాశంలేదని కాంగ్రెసు అభిప్రాయం. సామ్రాజ్యయుద్ధాల మూలకంగా తటస్థించే అపాయాలనూ అటువంటి యుద్ధాలలో భారతదేశ మొక పనిముట్టుగా ఉపయోగింపబడడం తప్పనిసరికావడమూ తేలికగా గ్రహించగలిగి ఉండడంచేత ఈపై అభిప్రాయాన్ని కాంగ్రెసు 1927 నుండీ వక్కాణిస్తూనేవుంది.

ప్రపంచ సంగ్రామం పొసగే సందర్భంలో భారతదేశమును భారతీయ ప్రజను భారతదేశపు వస్తుసామగ్రినీ బ్రిటిషు సామ్రాజ్య ప్రయోజనాలకోసం ఉపయోగించకో రాదనీ, అటువంటి ప్రయత్నాన్నన్ని నిరోధించవలసిందనీ, దేశాన్ని ప్రబోధిస్తూ ఫైజు పూరు కాంగ్రెసులో ఒక దస్మ్ర తీర్మానం చేయబడింది. ఆ యుద్ధానికి కావలసిన అప్పులుగానీ, స్వచ్ఛంద విరాళములనుగానీ, యుద్ధఋణాలనుగానీ యిచ్చేటందు కేవిధంగానూ సహాయపడరాదనీ, యుద్ధసన్నాహాలన్నిటినీ నిరోధించవలెననీ, భారత దేశపు పరిసరదేశాలతో మిత్రభావం కలిగి సరిహద్దులలో శాంతిని కాపాడవలెననీ ఫైజుపూరు కాంగ్రెసు భారతీయులను ప్రబోధిస్తూ తీర్మానాలు చేసింది. వాయవ్య సరిహద్దురాష్ట్రంలో సామ్రాజ్య ప్రయోజనాలకోసం ఇండియా గవర్నమెంటు వారవ లంబిస్తూన్న రాజనీతి పూర్తిగా అపజయంపొందిందని కాంగ్రెసు తన దృఢవిశ్వాస మును ప్రకటించింది. సరిహద్దులలోని పఠాను కొండజాతులవారు భయంకరులనీ దురా క్రమణదారులనీ చేసే నిందారోపణకేమీ ఆధారంలేదనీ, వారితో మిత్రభావమును సంపాదించుకొని వారినొక అమూల్యమైన బలంగా సమకూర్చుకోవడానికి వీలున్న దని కాంగ్రెసు తన నమ్మకమును వెల్లడించింది. వేలకొలది భారతీయులను కాలపరి మితి లేకుండా జైళ్ళలో ఊరకే ఉంచుతూన్న (Detention) బ్రిటిషు గవర్న మెంటువారి అమానుషమూ అన్యాయమూ అయిన రాజనీతిని కాంగ్రెసు కఠినంగా నిరసించింది. వారిని విడిచిపెడుతూ వరుసగా మూడు నెలలలో ముగ్గురుడిటెన్యూలు ఆత్మ హత్య కావించుకోవలసిన సందర్భాలను విచారించి అండమానుదీవులకు ఖైదీలను పంపే పద్ధతి పునరుద్ధరింపబడుటచే వాటిని మానివేయవలెనని స్పష్టంగా తీర్మానింపబడింది.

అయితే ఫైజుపూరు కాంగ్రెసులో చర్చింపబడిన విషయాలలో ఎన్నికలు, ప్రజాపరిషత్తు, శాసనసభలలోని ఎన్నిక ప్రతినిధుల సమ్మేళనము, రాజుగారి పట్టాభి షేకములోగాని తదితర సామ్రాజ్య వ్యవహారములలోగాని జోక్యం కల్గించుకోకుండుట 1937 ఏప్రిల్ ఒకటో తేదీ హర్తాళం మొదలయినవి అత్యంత ప్రాముఖ్యమయినవి. భారతదేశము వద్దన్న రాజ్యాంగచట్టమును బలవంతంగా ప్రవేశపెట్టదలచినందున దానిని నిరోధించడానికి భారతీయ ప్రజల మనోభావమెంత బలిష్ఠంగావున్నదో ప్రద ర్శించేటందుకే ఈ చివరి కార్యక్రమ ముద్దేశింపబడినది. 1935 రాజ్యాంగశాసనము భారతస్వాతంత్ర్య పోరాటమునకు ద్రోహకరంగా బ్రిటిషు సామ్రాజ్యతత్వమును బల పరుస్తూ, భారతీయ ప్రజాసామాన్యముపైన దోపిడీ విధానమును యింకా ఎక్కువగా

కొనసాగించేటందుకే ఉపయోగపడుతుందని ఈ కాంగ్రెసు అభిప్రాయపడ్డది. తన రాజ్యాంగశాసనమును తాను నిర్మించుకొనేహక్కు భారతదేశానికి కలదని భారతీయుల వాదం. రాజకీయాధికారం ప్రజల చేతులలో పెట్టబడి, సహజమైన ప్రజాస్వామ్య ప్రభుత్వం ఆచరణలోకి రావలెనన్నచో, అది సామాజిక నియోజకవర్గముచే ఎన్నుకోబడిన ప్రజాపరిషత్తు నిర్మించిన రాజ్యాంగచట్టం ద్వారానే రావాలి. ఆ చట్టముయొక్క అంతిమరూపాన్ని నిర్ణయించే అధికారం అటువంటి ప్రజాపరిషత్తుకే ఉండాలి. రాష్ట్రీయ ఎన్నికలు జరిగినవెంటనే ఉద్యోగస్వీకరణమును గూర్చిన విషయం అఖిల భారత కాంగ్రెసు సంఘమువారి నిర్ణయమునకు వదలివేయబడింది. అయితే ఈలోగా వివిధ రాష్ట్రాలలోనూ కేంద్రంలోనూ వున్న కాంగ్రెసు శాసనసభ్యులయొక్కయు, అఖిలభారత కాంగ్రెసుసంఘ సభ్యులయొక్కయు, కాంగ్రెసు వర్కింగుకమిటీవారు నిర్ణయించిన తదితర సభ్యులయొక్కయు సమ్మేళన మొకటి ఏర్పాటుచేయడమునకు నిర్ణయింపబడినది. ఈ సమ్మేళనముద్వారానే రాజ్యాంగ పరిషత్ నిర్మాణము వెంటనే జరుగవలెననే కోరికను ప్రకటింపవలెనని ఫైజుపూరు కాంగ్రెసు వుద్దేశించింది. అ. భా. కాం. సం. వారిచే చర్చింపబడిన ఎన్నికల ప్రణాళికకు ఈ కాంగ్రెసులో ఆమోదింపబడింది. లక్నోలో తయారు చేయబడిన కృషక కార్యక్రమం (Agrarian programme) కొన్ని మార్పులతో తాత్కాలికంగా అంగీకరింపబడి దాదాపు ఎన్నికల ప్రణాళికతో జోడించబడింది. కాంగ్రెసు పార్లమెంటరీ కార్యక్రమాన్ని అవలంబించి ఉద్యోగస్వీకరణమును గూర్చి యింకనూ తీవ్రంగా విచారణచేస్తూన్న సమయంలో శాసనోల్లంఘన ప్రసక్తి తీసికొనిరావడం సమంజసంగా కనిపించలేదు. కనుకనే రాజుగారి పట్టాభిషేక మహోత్సవంలో జోక్యం కల్గించుకోకూడదని మాత్రమే కాంగ్రెసు తీర్మానించిందికాని బహిష్కరించవలసిందని తీర్మానించలేదు. ఈ విషయాన్ని యింకనూ విశదీకరిస్తూ ఈ తీర్మానం రాజుగారి వ్యక్తిత్వమునెడల ద్వేషంగానీ అగౌరవంకానీ ప్రకటించవలెననే వుద్దేశంతో చేయబడలేదని కాంగ్రెసు స్పష్టీకరించ కోరింది. అందుమీద తీవ్ర వాదోపవాదాలు చెలరేగినవి. కాని తీర్మానం మాత్రమంగీకరింపబడింది.

## ఫైజుపూరు కాంగ్రెసు-ఆ పిమ్మట లేక ఎన్నికలు

ఫైజుపూరు కాంగ్రెసు ప్రధానలక్షణం గ్రామీయ వాతావరణం కలిగి ఉండడమే. కాబట్టి ప్రజా సామాన్యంతో కాంగ్రెసు సన్నిహిత సంబంధం

కలిగి ఉండాలనే అభిప్రాయం లెక్కన్నగా ఎక్కువ ప్రబలిఉండటం కూడా సహజం. అయితే ఈ సంబంధ మెలా కలగాలి ? పట్టణాల మొహల్లాలలోనూ, గ్రామాలలోనూ ఏర్పాటు చేయబడిన ప్రాథమిక సంఘాల ద్వారానూ కలుగ వచ్చును. లేదా హస్త్యసంస్థయైన కాంగ్రెసుతో ట్రేడుయూనియనులకు, కార్మిక సంఘములకూ, కిసాను సభలకు సహజ సంబంధం కల్పించడం ద్వారా నైనను కలుగవచ్చును. ఎలా కలిగినప్పటికీ ప్రజాసామాన్యాన్ని దగ్గరకుచేర్చి కూడ గట్టుకొన్నందువలన ఉపనదులతో మహానదీ ప్రవాహము విశాలతను పొందినట్లుగా కాంగ్రెసు సంస్థకూడా అత్యంత బలిష్ఠమూ వైశాల్యమూ ఫలప్రదమూ అవుతుంది. శాసనసభల ఎన్నికల ప్రచారం బాహుళ్యము వలన సరిగా ఇంతే జరిగినది. మూడుకోట్ల మంది వోటర్లుగా చేర్చబడ్డారు. అందులో పురుష వోటర్ల భార్యలు కూడా వోటర్ల జాబితాలో వచ్చారు. అక్షరాస్యులందరు వోటర్లయినారు ఇందు మూలంగా స్త్రీలకు పౌరహక్కులను గూర్చి బాగా తెలిపింది ప్రజాసామాన్యంలో ఒక్కసారిగా అక్షరాస్యత హెచ్చింది. వేలకొలది స్త్రీలు వోటర్ల జాబితాలో ధర ఖాస్తులు పట్టి తమ పేర్లను చేర్పించుకొన్నారు. అదివరకు చదువురాని వారనేక మంది కొత్తగా సంతకం చేయడం నేర్చుకొన్నారు. ఈ విధంగా దేశంలోని ఒక మూలనుండి మరొక మూలకు రాజకీయ చైతన్యం ప్రచండ వేగంతో విజృంభిస్తున్న సంగతి తెలుసుకోవడానికి ప్రభుత్వానికి కొంతో కాలంపట్టలేదు. ఇంతా అయితే జన సంఖ్యలో నూటికి పదిమంది మాత్రమే వోటింగుహక్కు లభించినప్పటికీ; దేశంలో సదీ చప్పుడూలేని విప్లవం ప్రారంభమయ్యే సూచనలను కూడా వారు గమనించ గలిగారు. కనుకనే ప్రభుత్వోద్యోగులందరూ ఎన్నికలలో ఎంతమాత్రము పక్షపాతం చూపక తటస్థులుగా 'ఉండగలరని' వైస్రాయి, ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేటు, మొదలగు వారంతా అసందిగ్ధంగా ప్రకటనలు చేశారు. ప్రజలకా ప్రకారం అభయ హస్తమిచ్చారు. అయినప్పటికీ కొన్ని రాష్ట్రీయ ప్రభుత్వాలు, రాజధాని శాసన సభల ఎన్నికలకు పోటీ చేయదలచుకొన్న కాంగ్రెసు అభ్యర్థులు కొందరు రాజకీయ నేరాలకు శిక్షింప బడ్డారన్న కారణాన ఎన్నికలలో నిలబడడానికికల వారిఅనర్హ తను తొలగించుటకు కిష్టపడలేదు. కొన్ని రాష్ట్రాలలో శాంతియుతంగా ఏర్పాటు చేయ బడిన ఊరేగింపులనూ, సమావేశాలనూ, జాతీయ పతాకాభివందనాలనూ, గౌరవనీయు లైన కాంగ్రెసు నాయకుల సంచారములను నిషేధిస్తూ ఎన్నికల ప్రచారంలో

ప్రభుత్వంవారు నిరంతరం తీవ్రంగా జోక్యం కలిగించుకొన్న తార్కాణాలు చాలా కనిపించినవి. ముఖ్యంగా వాయవ్యసరిహద్దు రాష్ట్రానికి సంబంధించిన నిదర్శనం. ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ పంజాబులో గానీ వాయవ్యసరిహద్దు రాష్ట్రంలో గానీ అడుగుపెట్ట రాదనే షరతుతో విడుదలచేయబడ్డాడనే సంగతి యిదివరకే ఉదహరించివున్నాము. వాయవ్య సరిహద్దు రాష్ట్రపు ప్రజాశాంతి శాసనం [1932 నాటి మూడో శాసనం] 5 వ సెక్షన్ ప్రకారం, ఫైజుపూరులో ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్‌కు పూర్వ ఖాందేష జిల్లా పోలీసు సూపరింటెండెంటు అందించిన ఉత్తరువు :—

"మీరు ప్రజాశాంతికి భంగకరంగానూ ప్రజాశాంతికి భంగకరమైన ఉద్యమానికి ప్రోత్సాహకరంగానూ ప్రవర్తిస్తూవున్నట్లు విశ్వసించడానికి తగినన్ని సహేతుకములైన నిదర్శనాలు కలవని చీఫ్ సెక్రటరీ సంతృప్తిపడ్డాడు. కనుక మీరు వాయువ్య సరిహద్దు రాష్ట్రంలోకి ప్రవేశించరాదనీ, నిలవరాదనీ నివసించరాదనీ గవర్నరు ఇన్ కౌన్సిలు ఆదేశిస్తూన్నాడు. ఈ ఉత్తరువు 1937 డిశంబరు 29 వ తేదీవరకు అమలులో ఉంటుంది. [పెషావరు, డిశంబరు 14, 1936.]

సాధారణ రాష్ట్రీయ శాసనసభల ఎన్నికలు సరిగా రెండు నెలలకు జరుగ బోతూన్నవనగా, ఏ ఒకనికిగానీ తాను నివసిస్తూన్న రాష్ట్రంలోకి పోయే హక్కును నిరాకరించడం ఒక విధమైన కసి తీర్చుకోవడంగా కనిపించడమేగాక ప్రభుత్వంవారు మర్యాదగా ప్రవర్తించ తలచుకోలేదనికూడా ఆ ఒక్క చర్యవల్లనే స్పష్టపడుతుంది. గవర్నమెంటువారి ఈ వ్యతిరేక భావం కాంగ్రెసు అభ్యర్థులను మరింత చురుకుగా బలపరచడానికి ప్రజా సామాన్యమును ఇంకా ఎక్కువగా ప్రోత్సహించింది. అందు వల్ల ఇటువంటి చిక్కులెన్ని ఆటంకపరచినా కాంగ్రెసుగెలుపు పూర్తిగా నిశ్చితమయింది. ఇంతేకాదు. చదువురాని వోటర్లు శాసనసభాభ్యర్థులకు వోట్లిచ్చే పద్ధతి రహస్యం కాకపోవడంచేత స్వేచ్ఛగా యిష్టంవచ్చినవారికి వోటిచ్చే వీలు వారికి లేకుండా పోయింది. అందుచేత ఆ పద్ధతికి బదులుగా అఖిలభారత ఫ్రాంచైజు కమిటీవారున్నూ రాష్ట్రీయ ఫ్రాంఛైజు కమిటీలవారున్నూ సూచించిన ప్రకారం రంగు పెట్టెలను ప్రవేశపెట్టవలెనని కాంగ్రెసు కోరింది. భావి సంఘటనల నిప్పుడే చెప్పడం తప్పుగా భావించకపోతే నిజానికి ఈ రంగు పెట్టెల పద్ధతి దక్షిణ హిందూస్థానంలో అవలం బించబడిందనీ హిందువుల గృహస్థ జీవితంలోనూ సాంఘిక జీవితంలోనూ పసుపు

రంగుల శుభసూచకంగా భావింపబడుతూన్నట్లుగానే ఎన్నికల సందర్భంలో కూడా కాంగ్రెసుకీరంగు శుభంగా పరిణమించినదనీ మేమిక్కడ చెప్పడం సమంజసమే నను కొంటూన్నాము. కాంగ్రెసు కార్యక్రమం విస్పష్టంగా ఉంది. ఎన్నికల ప్రచారాన్ని చక్కగా ఏర్పాటుచేసి జాతీయ పోరాటంలో పార్లమెంటరీ కార్యక్రమానికి శాశ్వత విజయం చేకూర్చడమే కాంగ్రెసుకు నేడు ప్రధాన కర్తవ్యం. అఖిల భారత దేశం లోని కాంగ్రెసు శాసనసభ్యుల పరిషత్తును సమావేశపరచి రాజ్యాంగ నిర్మాణ సభా సంస్థాపనకు ప్రయత్నాలు చేయడం మొదటిపని. ఫెడరల్ రాజ్యాంగ నిర్మాణమునూ, నూతన చట్టంలోని మిగతా భాగమునూ భగ్నం చేసేటందుకు క్రమ శిక్షణకు లోనయిన తీవ్ర పోరాటమును సాగించడం ఆపిమ్మటి కార్యక్రమం. స్వతంత్ర భారతదేశపు రాజ్యాంగచట్టమును రచించడమే రాజ్యాంగ పరిషత్తుపని. 'వయోజనులందరిచేతనూ ఎన్నుకోనబడ్డ ఒక బ్రహ్మాండమైన పంచాయతు అని చెప్పాలి దానిని. ప్రజలకు నిజమైన అధికారం చేతికి వచ్చినప్పుడది సమావేశమై చేసిన నిర్ణయాలను బయటివారి జోక్యం లేకుండా ప్రజలు జరిపి, కాంగ్రెసు ఆదర్శ మైన స్వతంత్ర ప్రజాస్వామ్య రాజ్యాన్ని సంస్థాపించకలిగి ఉండాలి" జాతీయ పోరాటంలో నూతన శకారంభమును ప్రతిబింబింప చేస్తూన్న ఈ మహోద్యమంలో క్రమశిక్షణ, ఐక్య నాయకత్వము, ఏకాధికారము, నచ్చిన జాతీయ నాయకత్వము నెడ హృదయపూర్వకమయిన విధేయత, ప్రధానంగా ఉండవలసిన లక్షణాలు.

క్రమశిక్షణ నిబంధనలు:— క్రమశిక్షణ చర్యనుగూర్చి వర్కింగుకమిటీవారు పూర్వంచేసిన తీర్మానములన్నిటినీ రద్దుచేస్తూ, వాటికి బదులుగా ఈ కింది నిబంధనలను అంగీకరించారు.

1. వర్కింగుకమిటీవారు,

(౧) కాంగ్రెసు కార్యక్రమానికీ నిర్ణయాలకూ ప్రతికూలంగా యేకాంగ్రెసు కమిటీయైనా, బుద్ధిపూర్వకంగా నడుచుకొనినా, ప్రచారంచేసినా, లేక పై అధికారులయొక్కగానీ, మధ్యవర్తి పంచాయతీదార్లయొక్కగానీ, శాస్త్రీయంగా నియోగింపబడిన కమీషనుయొక్కగానీ ఉత్తరువులను బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించినా లేక వాటికి అవిధేయత చూపించినా ఆ కమిటీకి వ్యతిరేకంగానూ,

(౨) కాంగ్రెసు కార్యక్రమానికీ నిర్ణయాలకూ ప్రతికూలంగా ఎన్నుకోబడిన యే కాంగ్రెసు కమిటీయొక్కగానీ, యే కాంగ్రెసు కార్యవర్గముయొక్కగానీ యే సభ్యుడైననూ బుద్ధిపూర్వకంగా నడుచుకొనినా ప్రచారంచేసినా లేక పై అధికారులయొక్కగానీ, మధ్యవర్తి పంచాయతీదార్లయొక్కగానీ, శాస్త్రీయంగా నియోగింపబడిన కమీషనుయొక్కగానీ ఉత్తరువులను బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించినా, లేక వాటికి అవిధేయత చూపినా. ఆ సభ్యునికి వ్యతిరేకంగానున్నా,

(౩) ఏ కాంగ్రెసు సభ్యుడైననూ కాంగ్రెసు నిర్ణయాలకు ప్రతికూలంగా బుద్ధిపూర్వకంగా నడుచుకొనినా, పైఅధికారిగాని మధ్యవర్తిగానీ, పంచాయతీవారుగానీ లేక శాస్త్రీయంగా నియోగింపబడిన కమీషనుగానీ జారీచేసిన ఉత్తరువులను బుద్ధిపూర్వకంగా లెక్కచేయకపోయినా ఉల్లంఘించినా లేక కాంగ్రెసు సొమ్మును అపహరించినా, లేక డబ్బు విషయంలోగానీ లెక్కల విషయంలోగాని యేదైనా మోసంచేసినా లేక కాంగ్రెసుకుగాని దాని అధీన సంస్థకుగానీ యిచ్చిన ప్రమాణ పత్రమునకు భంగంగా ప్రవర్తించినా, కాంగ్రెసు సభ్యులను చేర్పించడంలోగానీ, కాంగ్రెసు కమిటీ యెన్నికలోగానీ యేదైనా మోసంచేసినా, లేక కాంగ్రెసు వర్కింగుకమిటీ అభిప్రాయంలో కాంగ్రెసు ప్రతిష్ఠకూ అధికారానికీ లోటు కలిగించేటట్టున్నా ఆయన కాంగ్రెసు సభ్యుడుగా ఉండడం కాంగ్రెసుప్రయోజనాలకు నష్టదాయకంగా ఉండేటట్లున్నా బుద్ధిపూర్వకంగా నడచుకొన్నా, ఆ సభ్యునికి వ్యతిరేకంగానున్నా కాంగ్రెసు వర్కింగుకమిటీ క్రమశిక్షణ చర్య తీసుకోవచ్చును.

(౧) కాంగ్రెసు కమిటీ విషయంలో క్రమశిక్షణచర్య ఆ కమిటీని రద్దుచేయడం కావచ్చు; తప్పుచేసిన వ్యక్తి సభ్యుల విషయంలో అవసరమైన తదితర చర్యకూడా తీసుకోవచ్చును.

(౨) ఏదైనా కాంగ్రెసు కార్యవర్గంలోగాని యెన్నుకోబడిన కాంగ్రెసు కమిటీలోగానీ సభ్యుడుగానున్న వాని సందర్భంలో క్రమశిక్షణచర్య వాని పదవిగానీ సభ్యత్వమునుగానీ తొలగించడంకావచ్చు. ఏ కాం

గ్రెసు కమిటీలోనూ సభ్యత్వమునకుగానీ పదవికిగానీ న్యాయశాస్త్ర రీత్యా ఇంతకాలంలోగా ఎన్నుకోబడరాదనికూడా ఒక కాలపరిమితిని నిర్ణయించవచ్చు.

(ఇ) ప్రాథమిక కాంగ్రెసు సంఘంలో సభ్యుడుగానున్నవాని విషయంలో ఒక నిర్ణీతకాలంలోగా యేయెన్నికలలోనూ, శాసనసభలు, స్థానిక సంఘాలు మున్సిపాలిటీల ఎన్నికలలో సహా నిలబడడానికి అనర్హునిగా చేయడం కాని, లేక ఆయన సభ్యుడుగానున్న మిగతా కాలంలో కార్యాలయ హోదాలను చలాయించరాదని నిర్ణయించడంకాని, ఒక నిర్ణీతకాలంలోగా ఆయన కాంగ్రెసు సభ్యుడుగా ఉండడానికి అర్హతలేదనికాని నిర్ణయించడమే క్రమశిక్షణ చర్య అవుతుం.

3. ఎవరిపైన క్రమశిక్షణచర్య జరుపదలచుకొన్నారో ఆ కమిటీకిగానీ వ్యక్తికిగానీ సంజాయిషీ యిచ్చుకొనేటందుకున్నూ, వారిపై మోపబడిన నేరాలకు వర్కింగుకమిటీ ముందు ప్రత్యుత్తరమిచ్చుకొనేటందుకున్నూ సావకాశం కలుగ చేయకుండా క్రమశిక్షణచర్య తీసుకోబడరాదు.

4 రాష్ట్ర కాంగ్రెసుసంఘాల కార్యవర్గములకుకూడా వాటి అధీన కాంగ్రెసు సంఘాలపైననూ ఆయా రాష్ట్రాలలోని ప్రాథమిక కాంగ్రెసు సంఘాల యొక్కయు, కాంగ్రెసు కార్యవర్గముల యొక్కయు సభ్యులపైననూ, క్రమశిక్షణచర్య జరిపేటందుకు అధికారం కలిగివుండాలి. అటువంటి చర్య తీసుకోవలసిన సందర్భాలన్నిటిలోనూ కాంగ్రెసు వర్కింగుకమిటీ వారందుకు తయారుచేసిన నియమావళినీ, నిబంధనలనూ వర్తింపచేయాలి. క్రమశిక్షణచర్య తీసుకోబడిన యే వ్యక్తిగానీ, యే కాంగ్రెసు సంస్థగానీ ఆ చర్యకు వ్యతిరేకంగా వర్కింగుకమిటీకి అప్పీలు చేసుకోవడానికి అధికారం వుంది. అయితే అప్పీలు తీర్పు వచ్చేలోగా ఆ క్రమశిక్షణ చర్యకు విధేయతచూపాలి. కాని ఆలోగా ఆ క్రమశిక్షణ ఉత్తర్వును అమలుజరుపకుండా వర్కింగు కమిటీ ఆపివేయవచ్చును.

5. వర్కింగుకమిటీ సమావేశం కానిసమయాలలో క్రమశిక్షణచర్యకుసంబంధించిన తొందర విషయాలన్నిటినీ కాంగ్రెసు అధ్యక్షుడు తన విచారణలోపెట్టుకొని

వర్కింగుకమిటీకి బదులుగా వ్యవహరించవచ్చును. అటువంటి సందర్భాలన్నిటిలోనూ అధ్యక్షుడు చేసిన నిర్ణయాలను రాబోయే వర్కింగుకమిటీ సమావేశంలో పెట్టి వారి ఆమోదమును పొందవలెను.

## ౧౯౩౭ ఎన్నికలు

మహాసమ్మేళీయ స్థానాలు మొత్తం [illegible] కాంగ్రెసు [illegible] స్థానాలకు అభ్యర్థులను నిలబెట్టి పోటీ చేసింది. అందులో [illegible] స్థానాలుమాత్రమే కాంగ్రెసు గెలుచుకో గలిగింది. [illegible] కాంగ్రెసేతర [illegible] మహాసమ్మేళనములు గెలుపొందినారు. [illegible] కోట్ల ఎనభై లక్షలమంది వోటర్లు [illegible] అనగా మొత్తం [illegible]లో నూటికి [illegible] వోట్లు చేశారు. రాష్ట్రాలలోనికింద శాసనసభల మొత్తం స్థానాలు [illegible]లోనూ కాంగ్రెసు ౨౦౦ (711) స్థానాలను గెలుచుకొన్నది. అయిదు రాష్ట్రాలలో అనగా మద్రాసు సంయుక్త రాష్ట్రాలు, మధ్య రాష్ట్రాలు, బీహారు, ఒరిస్సాలలో— పూర్తిగా అధిక సంఖ్యాకులతో లుపొందింది.

| | | |
|---|---|---|
| మద్రాసు | 215 స్థానాలలో కాంగ్రెసు స్థానాలు 159. జస్టిసుపక్షం - 21 మాత్రమే. | |
| సంయుక్త రాష్ట్రాలు | 228 లోను | 134 కాంగ్రెసు |
| మధ్య రాష్ట్రాలు | 112 ,, | 70 ,, |
| బీహారు | 152 ,, | 95 ,, |
| ఒరిస్సా | 60 ,, | 36 ,, |
| బొంబాయి వాదాపు : | | |
| అస్సాం | 108 ,, | 35 ,, |
| వాయువ్య సరిహద్దు రాష్ట్రం | 50 ,, | 19 ,, |
| బెంగాలు | 250 ,, | 60 ,, |
| పాంచాలం | 175 ,, | 18 ,, |
| సింధు | 60 ,, | 8 ,, |

లెజిస్లేటివ్ అసెంబ్లీలలో కాంగ్రెసుపక్షస్థితి అయిదు రాష్ట్రాలలోని లెజిస్లేటివ్ అసెంబ్లీలలో అనగా మద్రాసు, సంయుక్త రాష్ట్రాలు. మధ్యరాష్ట్రాలు, బీహారు ఒరిస్సాల

అసెంబ్లీలలో తదితర పక్షాలన్నియేకమైనా కాంగ్రెసుకు పూర్తిగా అధిక సంఖ్యాక స్థానాలు లభించినవి. ఈ నాలుగు రాష్ట్రాలలో అనగా బొంబాయి, బెంగాలు, అస్సాం వాయవ్య సరిహద్దు రాష్ట్రాలలో తక్కిన అన్ని పక్షాలలోకీ కాంగ్రెసు పక్షం అగ్రస్థానం వహిస్తున్నది. సింధు పంజాబు రాష్ట్రాలలో తక్కిన పక్షాలకంటె అల్పసంఖ్యాక పక్షం.

ఈ దిగువ పట్టీ, కాంగ్రెసు వివిధ రాష్ట్ర అసెంబ్లీలలో గెలుచుకొన్న స్థానాలును, కాంగ్రెసు మొత్తం వోట్లలో నూటికి ఎన్నవవంతు స్థానాలను సంపాదించినదో సరిసమానంగా ఆ వివరములను తెలియచేస్తున్నది.

| రాష్ట్రం | దిగువ శాసనసభలలో మొత్తం స్థానాలు | కాంగ్రెసు గెలుచుకొన్న స్థానాలు | కాంగ్రెసు పోటీ చేయబడిన మొత్తం స్థానాలలో నూటికి ఎన్నొవ వంతు గెలుచుకున్నది. | వోట్లలో నూటికి షుమారుగా ఎన్నొవ వంతు కాంగ్రెసుకు లభించినది. |
|---|---|---|---|---|
| మద్రాసు | 215 | 159 | 74 | 65 |
| బీహారు | 152 | 98 | 65 | 75 |
| బెంగాలు | 250 | 54 | 22 | 25 |
| మధ్యరాష్ట్రాలు | 112 | 70 | 62. 5 | 61 |
| బొంబాయి | 175 | 86 | 49 | 56 |
| సంయు. రాష్ట్రాలు | 228 | 134 | 59 | 65 |
| పంజాబు | 175 | 18 | 10. 5 | 13 |
| వాయవ్య-సరిహద్దురాష్ట్రం | 50 | 19 | 38 | .. |
| సింధు | 60 | 7 | 11. 5 | 12 |
| అస్సాం | 108 | 33 | 31 | .. |
| ఒరిస్సా | 60 | 36 | 60 | .. |

ముస్లిం స్థానాలు

11 రాష్ట్రాల లెజిస్లేటివ్ అసెంబ్లీలలోని మొత్తం ముస్లిం స్థానాలు 482 ఇందులో కాంగ్రెసు 58 స్థానాలకు మాత్రమే పోటీచేసి 26 స్థానాలను గెలుచుకున్నది. అనగా పోటీచేసిన స్థానాలలో నూటికి 45 వంతున కాంగ్రెసు గెలుచుకొన్నది.

కార్మిక స్థానాలు

11 రాష్ట్రాలలోని కార్మికస్థానాలు మొత్తం 38. ఇందులో కాంగ్రెసు 20 స్థానాలకు పోటీచేసి 18 స్థానాలను గెలుచుకొన్నది. అనగా పోటీచేసిన స్థానాలలో నూటికి 90 వంతులు గెలుచుకొన్నది.

భూస్వాముల స్థానాలు

11 రాష్ట్రాలలోనూ భూస్వాములకు ప్రత్యేకించబడిన స్థానాల మొత్తం 37. ఇందులో కాంగ్రెసు 8 స్థానాలకు పోటీచేసి 4 స్థానాలను గెలుచుకొన్నది.

వాణిజ్య పరిశ్రమలు

11 రాష్ట్రాలలోనూ వాణిజ్య పరిశ్రమలకు ప్రత్యేకించబడిన స్థానాలు 56. ఇందులో కాంగ్రెసు 4 స్థానాలకే పోటీచేసింది. మూడుస్థానాలను మాత్రమే గెలుచుకొన్నది.

అన్ని రాష్ట్రాలలోనూకూడా కాంగ్రెసు అభ్యర్థులు వారి ప్రత్యర్థులను చాలా పెద్ద మెజారిటీలతో వోడించారు. అదీ గమనించవలసిన విషయం.

1934 లో జరిగిన కేంద్రశాసనసభా ఎన్నికల ఫలితాలుకూడా ఈదిగువ నుదహరింపబడినవి.

| | |
|---|---|
| కాంగ్రెసు 44 స్థానాలనూ,<br>కాంగ్రెసు శేషనలిస్టులు<br>11 స్థానాలనూ గెలుచుకొన్నారు. | { 98 ఎన్నిక స్థానాలలోనూ<br>55 స్థానాలు |

మాంటేగు చెమ్స్‌ఫర్డ్ ప్రణాళిక ప్రకారం కేంద్ర శాసన సభా నిర్మాణం ఈదిగువ విధంగా ఉంది.

| | |
|---|---|
| మహమ్మదీయేతరులు | 52 |
| మహమ్మదీయులు | 30 |

| | | | | |
|---|---|---|---|---|
| యూరోపియనులు | 9 | నామినేటెడ్ సభ్యులు | | 41 |
| జమీందారులు | 7 | | | |
| వాణిజ్యము, పరిశ్రమలు | 6 | | | |
| సిక్కులు | 2 | | | |

1[illegible]

ఎన్నికలలో కాంగ్రెసువారు విజయం చేకూర్చారు. కాని ఆ జస్టిసుపార్టీవారు [illegible] కొన్ని శాసనసభ్యులుకూడా దాని [illegible]. వారి పరిపాలన [illegible] శక్తి సామర్థ్యాలలో లేని [illegible] వారిలో [illegible] సామర్థ్యం [illegible] తొందరలో అధికారం తీసికొని వర్కింగుకమిటీ భారతజాతిని అభినందించింది. ఆ తీర్మానమిది :—

"కాంగ్రెసు విధానము నెడల ప్రజా సామాన్యమునకుగల అభిమానమును, వెల్లడిస్తూ నూతన రాజ్యాంగ చట్టమును ప్రతిఘటించి విధ్వంసము చేయుటకును రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుద్వారా స్వాతంత్ర్య ప్రజాస్వామ్య స్వరాజ్యమును సంస్థాపించి, అన్నివర్గాల ప్రజలనూ బాధాకరముగానున్న భారములను తొలగించుటకును, ఇటీవల ఎన్నికలలో కాంగ్రెసు పిలుపునకనుగుణంగా భారతజాతి చూపిన ఉద్ధృతి సాకారమునకు వర్కింగుకమిటీ హర్షనందిస్తూన్నది. భారత జాతి తనపైనపెట్టిన మహాబాధ్యతను గుర్తించి ఈ కమిటీవారు కాంగ్రెసు సంస్థలనూ ముఖ్యంగా కొత్తగా ఎన్నికోబడిన కాంగ్రెసు శాసన సభ్యులను ఈ విశ్వాసమును బాధ్యతగా స్వీకరించుకొని కాంగ్రెసు సిద్ధాంతములనూ ఆదర్శములనూ సమర్థించుటకును, ప్రజా విశ్వాసమునకనుగుణంగా ప్రవర్తించుటకునూ, మాతృదేశ విమోచనముకొఱకునూ పీడిత ప్రజానీకముయొక్క బాధా నివారణముకోసమున్నూ స్వరాజ్యయోధులవలె నిరంతరం కృషి చేయవలెనని కోరుతూన్నారు."

రాజభక్తి ప్రమాణమొక సింహాస్వప్నంగా పరిణమించింది. ఇప్పుడావరణలో ఉన్న రూపంలో బ్రిటిషురాజు నెడల విశ్వాసం కలిగిఉంటామని ప్రమాణం చేయడానికి అంతరాత్మ అభ్యంతరాలు కలవారు చాలామంది ఉన్నారు. అటువంటి ప్రమాణం

చేయడం సమంజసమూ అనికూడా సందేహాలున్నవి. ఆ ప్రమాణం చేసినంతమాత్రంతో స్వాతంత్ర్య వాంఛలో మార్పుకానీ కొఱవకానీ యేర్పడ్డట్టుకాదనీ అందరు కాంగ్రెసువాదులునూ అందరు భారతీయులూ ప్రధానంగా భారతజాతియెడల విశ్వాసం కలిగి ఉండవలెననీ వర్కింగు కమిటీ తీర్మానం ప్రకటించింది. నూతన రాజ్యాంగ చట్టం నియమములలో వచ్చే ఏప్రిల్ ఒకటో తేదీ పిమ్మట ఎప్పుడో ఒకనాడు శాసన సభ్యులు రాజభక్తి ప్రమాణము చేయవలెనని ఉండెను. అంతకుపూర్వమే మార్చి 19. 20 తేదీలలో క్రొత్తగా ఎన్నుకోబడిన శాసన సభ్యులున్నూ తదితరులున్నూ సమావేశమైన పరిషత్తులో వారంతాకూడా జాతీయ స్వాతంత్ర్యమునకు కృషి చేసెదమనీ భారత ప్రజానీకము నెడల విశ్వాసం కలిగిఉండెదమనీ ముందుగానే ప్రమాణం తీసుకొన్నారు. ఆ ప్రమాణం పత్రమిది :—

“నేను అఖిలభారత పరిషత్సభ్యుడనైన నేను, భారతదేశమునకు సేవ చేసెదననీ, శాసన సభలను బయటనూ, వెలుపలనుకూడా, భారత స్వాతంత్ర్య సంపాదనము కొఱకునూ, భారత ప్రజానీకమును దోచుకొని తినే విధానమును తుదముట్టించుటకునూ పనిచేసెదనని ఇందుమూలంగా ప్రమాణం చేస్తున్నాను. హిందూదేశం స్వేచ్ఛా స్వాతంత్ర్యములను పొంది, కోటానుకోట్ల ప్రజలు పీడాకరములైన మహాభారములనుండి విముక్తులయ్యేటందుకు కాంగ్రెసు క్రమశిక్షణక్రింద కాంగ్రెసు సిద్ధాంతములను ఆదర్శములను కొనసాగిస్తూ పనిచేసెదనని ప్రమాణం చేస్తున్నాను.” కాంగ్రెసు శాసన సభ్యులు శాసన సభలలోపలచేసే పనికితోడు వెలుపలకూడా పనిచేయడమే వారు నిత్యం నిర్వర్తించవలసిన ధర్మం. అందుకుగాను వారు తమ తమ నియోజక వర్గములతో సన్నిహిత సంబంధం కలిగిఉండి ప్రజాసామాన్యముయొక్క రోజువారీ కష్టసుఖాలలో జోక్యం కలిగించుకొని తగిన సహాయంచేస్తూ ఉండాలి. శాసన సభ్యులు నివసించే ప్రదేశములలోని కాంగ్రెసు సంస్థలు ప్రజలతో సన్నిహిత సంబంధంకలిగి చురుకుగా పనిచేసేటట్లు చూచే బాధ్యతను వారు కూడా వహించవలెనని నిర్ణయింపబడింది. అంతేగాక, ఎన్నికలలో ప్రజాసామాన్యమునందు కలిగిన రాజకీయ చైతన్యము, వారికి కాంగ్రెసు కార్యక్రమమునందు కలిగిన ఉత్సాహము వృథాపోకుండా జాతీయాభ్యున్నతికోసం వారు

నిరంతర శ్రద్ధకలిగి పనిచేసే ట్లు వారిని కార్యకర్తలుగా తయారుచేయాలి.

శాసన సభలలో కాంగ్రెసు చేయవలసిన పని ఈ దిగువ వివరించబడింది :—

1. “రాజ్యాంగచట్టము, దానిలో ఇమిడిఉన్న కుటిల రాజనీతికూడా భారత దేశములో బ్రిటిష్ సామ్రాజ్యాధికారమును బలిష్ఠంచేసుకొని భారత ప్రజానీకమును స్వార్థంకోసం వినియోగించుకొనేటందుకే ఉద్దేశింపబడి ఉన్నవిగనుక కాంగ్రెసు ఆ చట్టముతోనూ బ్రిటిష్ ప్రభుత్వంతోనూ సహకారం చేసేటందుకుగాక వాటిని ప్రతిఘటించేటందుకే శాసనసభలలో ప్రవేశించింది.

2. కాంగ్రెసు ఆశయం పూర్ణ స్వరాజ్యం లేక సంపూర్ణ స్వాతంత్ర్యం అందుకోసమే యావత్తు కార్యకలాపమూ సాగింపబడుతూన్నది. రాజకీయాధికారం యావన్మంది ప్రజలకూ సంక్రమించి, ప్రభుత్వం, వారి చెప్పుచేతలలో ఉండడమే నిజమైన ప్రజా స్వామ్యరాజ్యం. దానికోసమే కాంగ్రెసు ఇంత కాలంనుండీ కృషి చేస్తూన్నది. అటువంటి రాజ్యమును భారత ప్రజానీకమే స్థాపించవలెను. అందువలననే రాజ్యాంగ శాసన నిర్ణయంకోసం, వయోజన నియోజకవర్గములచే ఎన్నుకోబడిన ప్రజాపరిషత్తును స్థాపించడానికి కాంగ్రెసు ఒత్తిడిచేస్తూన్నది. భారత ప్రజానీకము పరాయివారి జోక్యంలేకుండా తన భవితవ్యమును నిర్ణయించుకోడానికి శక్తినీ అధికారమును సంపాదించుకొన్నప్పుడు మాత్రమే ప్రజాపరిషత్తు రూపం తాలుస్తుంది.

3. నూతన రాజ్యాంగ చట్టమును ప్రతిఘటించి చట్టంలో ఫెడరేషనుకు సంబంధించిన భాగము అమలులోకి రాకుండా అడ్డుతగులుతూ ప్రజా పరిషత్తును గూర్చిన జాతీయవాంఛను గట్టిగా వక్కాణించడమే శాసనసభలలో కాంగ్రెసు నిర్వర్తించవలసిన తక్షణ కార్యక్రమం. ప్రజా పరిషత్తునుగూర్చిన ఈ వాంఛను సాధ్యమైనంత త్వరలో నూతన శాసనసభలద్వారా ప్రకటించవలెనని ఫైజుపూరు కాంగ్రెసు, శాసనసభలలోని కాంగ్రెసు సభ్యులందరికీ ఆదేశిస్తూన్నది.

4. భారత దేశంలో బ్రిటిష్ సామ్రాజ్య తత్వముయొక్క అధికారాన్నీ ప్రతిష్ఠనూ సంపాదించగలిగిన ఏ చర్యలోనూ, ఏ కార్య కలాపంలోనూ జోక్యం కలిగించుకొని సహకారం చేయకపోవడమే కాంగ్రెసు రాజనీతిఅని శాసన సభలలోని కాంగ్రెసు సభ్యులందరూ జ్ఞాపకముంచుకోవాలి. ఆచార రీత్యా

గానీ, సాంఘిక రీత్యాగానీ, అధికార రీత్యాగానీ. జరుపబడే ఇటువంటి కార్య కలాపములలో కాంగ్రెసు సభ్యులు జోక్యం కలిగించుకోకుండా తప్పించుకోవాలి. అనుమానం తోచిన సందర్భాలలో నే సభ్యుడూ వ్యక్తి బాధ్యత మీద నడుచుకోకూడదు. ఆయా విషయాలలో కాంగ్రెసు శాసనసభాపక్షం వారు చేసిన నిర్ణయాలకు కట్టుబడి వుండాలి.

5 బ్రిటిష్ ప్రభుత్వంవారిచ్చే బిరుదులను వేటినీ కాంగ్రెసు సభ్యులెవ్వరూ అంగీకరించకూడదు.

6 రాష్ట్ర శాసనసభలలోని కాంగ్రెసుపక్షంవారు క్రమ శిక్షణకులోబడి వ్యవహరించాలి. వారి నాయకుడే వారి పక్షానికి ప్రాతినిధ్యం వహించి ప్రభుత్వం వారితోనూ తదితర పక్షాలతోనూ సంభాషణలు సాగిస్తూఉంటాడు. సభ్యులెవ్వరూ వేరు వేరుగా ప్రభుత్వంవారితో అధికారరీత్యా సంబంధము పెట్టుకోకూడదు. అయితే సభ్యులుగా తమ ధర్మములను నిర్వర్తించవలసి వచ్చినప్పుడున్నూ, తమ పార్టీవారు స్పష్టంగా అధికార మిచ్చినప్పుడూ మాత్రం పెట్టుకోవచ్చును.

7. సభ జరుగుతూండగా కాంగ్రెసు పక్షం హాజరవుతూన్న సమయాలలో కాంగ్రెసు సభ్యులు తమ తమ స్థానాలలో ఉండవలెనని కాంగ్రెసు భావం. కారణం చూపించిగానీ, సెలవు పొందిగానీ ఉంటేనే తప్ప సభ్యులు గైరు హాజరు కాకూడదు.

8. కాంగ్రెసు శాసనసభ్యులందరూ ఖాదీ దుస్తులలోనే ఉండాలి.

9. వర్కింగుకమిటీవారి అనుజ్ఞ లేకుండా రాష్ట్ర శాసనసభలలోనీ కాంగ్రెసు పార్టీలు ఎసెంబ్లీలలోని యితర ముఠాలతో కలియకూడదు.

10. కాంగ్రెసు పక్షాన ఎన్నుకోబడని, రాష్ట్ర శాసనసభలలోని యే సభ్యుడైనా కాంగ్రెసు ప్రమాణం తీసికొని కాంగ్రెసు క్రమ శిక్షకూ కాంగ్రెసు సిద్ధాంతాలకూ కట్టుబడి ఉంటానన్నప్పుడు, ఆ శాసనసభలోని కాంగ్రెసు పక్షం ఆయనను చేర్చుకోవడము వాంఛనీయమని భావించినట్లయితే, అక్కడి కాంగ్రెసు పార్టీలోకి ఆయనను తీసుకోవచ్చును. కాని కాంగ్రెసు క్రమశిక్షణ

చర్యకు గుఱియైనవారిని మాత్రం నర్కింగుకమిటీ అనుజ్ఞలేకుండా తీసుకో కూడదు.

11. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలోను భూమి విధానమునకు సంస్కరణ తీర్మానంలోనూ (Agrarian resolution) నిర్వచించిన ప్రకారం కాంగ్రెసు శాసనసభ్యులు కాంగ్రెసు కార్యక్రమాన్ని సాగించడానికి గట్టిగా పనిచేయాలి.

1. రెంటునూ, రెవిన్యూనూ చాలావరకు తగ్గించాలి.
2. ఒక నిర్ణీత కనీస మొత్తమునకు లోబడి వ్యవసాయిక ఆదాయాలపైన క్రమాభివృద్ధిని సూచించే రేట్లతో ఆదాయపుపన్ను విధించాలి.
3. భూమి హక్కులను నిర్ణయించాలి.
4. గ్రామస్థులను అప్పుల బాధనుండీ, జమీందారీ శిస్తులు యివ్వని మెంటుశిస్తుల బకాయి బాధలనుండీ తప్పించాలి.
5. నిర్బంధశాసనాలను రద్దు చేయాలి.
6. డిటెన్యూలనూ, ఇంటర్నీలనూ రాజకీయఖైదీలనూ విడుదలచేయాలి.
7. శాసనోల్లంఘనోద్యమాలలో గవర్నమెంటువారు వేలంవేసినట్టీ, స్వాధీన పఱచుకొన్నట్టీ ఆస్తులను భూములనూ తిరిగి యిచ్చివేయాలి.
8. పారిశ్రామిక కార్మికులకు రోజుకు ఎనిమిది గంటలు మాత్రమే పనిఉండాలి. జీతాలు తగ్గకూడదు. బ్రతుకు తెఱువుకు కావలసిన భృతి ఉండాలి (Living wage).
9. మత్తుపదార్థాలన్నీ నిషేధింపబడాలి.
10. పనిలేనివారికి పరిహారమియ్యాలి.
11. పెద్దపెద్ద జీతాలూ భత్యాలూ తగ్గాలి. ప్రభుత్వ పరిపాలనా వ్యయంకూడా తగ్గాలి.
12. ప్రస్తుతచట్టం ప్రకారం వైస్రాయి, గవర్నర్ల చేతులలో, రక్షణలు, ప్రత్యే కాధికారాలు ఉన్నప్పటికీ, ప్రభుత్వోద్యోగులకు రక్షాకవచము లేర్పాటు చేయబడినప్పటికీ ప్రతిష్టంభనలు రాకతప్పదు. కాంగ్రెసు విధానాన్ని సాగించ డంలో అవి తటస్థించేయెడల వాటిని తప్పించుకోవాలని ప్రయత్నించకూడదు.

మేర్పాటుచేయబడింది. ఆ జాతీయ పరిషత్సమావేశమునకు కొన్నాళ్లు ముందుగా సర్దారు వల్లభాయిపటేలు ఇలా ఉపన్యసించాడు.

"ఎన్నికలను సక్రమంగా నడిపి జయంకలిగేటట్లు మాచేపని కాంగ్రెసు నాకు ఒప్పచెప్పింది. జవహర్‌లాలు నెహ్రూ యొక్క ఉత్తేజకర నాయకత్వమున లభించిన సహాకారమునకున్నూ, నా సహచరులైన బాబూరాజేంద్రప్రసాద్, గోవిందవల్లభపంతు భూలాభాయిదేశాయిల నిరంతరకృషికీ, హృదయపూర్వక సహాయమునకూ యావద్భారతదేశము కనపరచిన అత్యద్భుతమైన ఉత్సాహమునకూ నా కృతజ్ఞతాభివందనాలు. మన మనుకొన్న దానికంటెకూడా ఎక్కువ విజయంకలిగింది. దక్షిణ హిందూస్థానంలో మనకు బ్రహ్మాండమైన విజయం లభించింది. క్రైస్తవులు కూడా కాంగ్రెసు టిక్కెట్టుపైన ఎన్నికలలో గెలిచారు. శ్రీయుత్ సి. రాజగోపాలాచార్యులవంటి గొప్ప రాజకీయ చతురుడు తిరిగి కాంగ్రెసులో చేరడమే ఈ విజయానికి చాలావరకు కారణం.

"మన పనిలో మొదటి అధ్యాయం ముగిసింది. ఇప్పుడు మనం రెండవ అధ్యాయంయొక్క ప్రారంభదశలో ఉన్నాము. తత్కారణం మన కాలము శక్తీ అంతా ఇందుకోసమే వినియోగపడాలి. ఎన్నికలలో గెలవడంకోసం మనమెంత ప్రశంసనీయమైన పట్టుదలా ఐకమత్యమూ చూపగలిగినామో అంత పట్టుదలా అంత ఐకమత్యమూ శాసనసభా కార్యక్రమంలోకూడా చూపగలిగిన యెడల మన శత్రువులను పడగొట్టి తూరి కంగారుపెట్టి స్వరాజ్య సంపాదనమును చేయవలెను తేలుమని నిస్సందేహంగా చెప్పగలను మనమందరము సమానంగా కోరుతూన్న ఆదర్శాన్ని అందుకోవడానికి కార్యవిధానంలో మనలోమన కొన్ని భేదాభిప్రాయాలున్నప్పటికీ, ఢిల్లీలో సమావేశంకాబోయే కాంగ్రెసు నాయకులందరూ, కాంగ్రెసు వర్కింగుకమిటి ఏ నిర్ణయములను చేసినా, ఆ నిర్ణయములకు పూర్తిగా బద్ధులై అవిచ్ఛిన్నమైన ఐకమత్యమును ప్రదర్శిస్తూ శక్తివంచనలేకుండా పనిచేయగలరనే ధైర్యం నాకున్నది.

"శాసనసభలకు వెలుపలనున్న వారందరూ, పార్లమెంటరీ కార్యకలాపాలను, అధిగమించి పని చేస్తూ, కాంగ్రెసు శాసనసభ్యుల స్థితిని బలిష్ఠ మొనరిస్తేనేగాని భారత రాజ్యాంగ చట్టమును తుదముట్టించవలెననే కాంగ్రెసు ఆశయం నెరవేరదు

కాంగ్రెసులో భారతీయులకు కల విశ్వాసమును వారు నిశ్చయంగా ప్రకటించగలిగారు ఎన్నికల విజయంతోనే నిజంగా కాంగ్రెసు లేని పోరాటమును ప్రారంభం

చేసింది "ఎన్నికలలో అఖండవిజయమును పొంది కాంగ్రెసు బయటపడ్డది. సామ్రాజ్యవాద నిరాశావిగ్రహులు పెంపొందించిన విశ్వాసమును కాంగ్రెసు నిలబెట్టుకోగలదనంటే ఎలా ప్రవర్తించాలో వివరిస్తూ లండను టైమ్సు మొదలగు పత్రికలూ, కొందఱు రాజకీయవేత్తలూ అప్పుడే స్వచ్ఛందంగా సలహాయిస్తూన్నారు. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలోని కార్యక్రమమునకు భారతదేశపు "మిత్రులు" విపరీతార్థాలు తీస్తూన్నారు. కాంగ్రెసు ఆశయమేమిటో కార్యక్రమమేమిటో భారతదేశానికి తెలియకపోలేదు. ప్రజలకు లేనిపోని ఆశలను కాంగ్రెసెన్నడూ కల్పించలేదు. భారతీయులకేమి కావలెనో స్వరాజ్య ప్రభుత్వంలో వారేమి పొందగలరో అదే ఎన్నికల ప్రణాళికలో వివరింపబడి ఉంది."

"ఆశాపూరితమైన ఆనందమయప్రకృతిలో ఒకవిధమైన అనుకంపతోనే పరిషత్తు ఢిల్లీనగరమున సమావేశమయింది. అంతకు పూర్వమే మార్చి 17 వ తేదీని అ. భా. కాం. సం. సమావేశం జరిగింది. ఆ సాయంకాలమే అయిదు సంవత్సరాలకంటె ఎక్కువకాలము ప్రవాసంలోనూ విచారణా శిక్షా లేని నిర్బంధంలోనూ (detention) ఉండి శిథిలీభూతమైన ఆరోగ్యంతో శ్రీ సుభాస్‌చంద్రబోసు విడుదలైనాడు. ఆయన విడుదలైనందుకు కాంగ్రెసు అధ్యక్షుడు అఖిలభారత కాంగ్రెసు సంఘమువారి అనురాగపూర్వక స్వాగతమునూ ఆయన ఆరోగ్యం త్వరలో చక్కబడవలెనని వారి ఆశీస్సులనూ అందజేశాడు. కాంగ్రెసు వారాధిక సంఖ్యాకులుగా ఎన్నుకోబడ్డ రాష్ట్రాలలోని కాంగ్రెసుపక్ష శాసనసభ్యులు రాజ్యాంగ వ్యవహారములలో గవర్నరు జోక్యంకలిగించుకొని తన ప్రత్యేకాధికారములను వినియోగించడనీ, మంత్రుల సలహాలను నిరాకరించడనీ తాము సంతృప్తిపడి బహిరంగంగా ప్రకటించగలిగినప్పుడు యెడల వారాయా రాష్ట్రాలలో ఉద్యోగములను స్వీకరించుటకు, అధికారమూ, అనుజ్ఞా యీయబడినది."

పరిషత్తులోని సభ్యులందఱూ సమావేశమై ఐక్యకంఠంతో భారత జాతీయ భాషయైన హిందూస్థానీలో ప్రమాణమును స్వీకరించినప్పటి గభీరదృశ్యం చూడముచ్చటగావున్నది. ఆ ప్రమాణమునకనువాదమిది :—

"అఖిలభారత పరిషత్తులో సభ్యుడనైన నేను, భారతదేశ సేవ కంకితంచేయబడి, శాసనసభలలోపలనూ వెలుపలనుగూడా భారత స్వాతంత్ర్యమునకు పాటుపడుతూ భారతీయ ప్రజానీకమును దారిద్ర్యమునుండీ పరపీడనమునుండీ విముక్తి నొందించుటకు

కృషి చేయగలవని ప్రమాణం చేస్తున్నాను. హిందూదేశమునకు స్వేచ్ఛా స్వాతంత్ర్యము లను సంపాదించి కోట్లకొలది భారతీయ ప్రజానీకము యొక్క బానిసత్వముగా నున్న మహాభారము తొలగించే ఉద్దేశంతో కాంగ్రెసు కార్యాలనూ ఆశయాలనూ కొన సాగిస్తూ కాంగ్రెసు క్రమశిక్షణతో పనిచేయగలవని ప్రమాణం చేస్తున్నాను.” అనువారి జాతీయ వాంఛ పునరుద్ఘాటింపబడినది.

“1925 నాటి భారత రాజ్యాంగశాసనం భారత ప్రజానీకి మనుభవిస్తూన్న పరాధీనతను, పరాక్రమణాన్ని ఇంకా కొనసాగించి భారతదేశముపైన బ్రిటిష్ సామ్రాజ్యాధికారమును బలవత్తరం చేసుకోవడానికే ఉద్దేశింపబడినదని భారత ప్రజా నీకము పడుతూన్న అభిప్రాయమును ఈ పరిషత్తు పునరుద్ఘాటిస్తూన్నది.

“భారతదేశముయొక్క రాజకీయ ఆర్థిక నిర్మాణం ఫలానారీతిగా ఉండవలెనని ఆదేశించడానికి బయటి ప్రభుత్వానికి గానీ, మరొక అధికారవర్గమునకు గానీ హక్కు ఉన్నట్లుగా భారత ప్రజలంగీకరించజాలరని ఈ పరిషత్తు ప్రకటిస్తూన్నది.

“రాజకీయాధికారమును యావన్మంది ప్రజలకూ సంక్రమింపచేయగల నిజమైన ప్రజాస్వామిక రాజ్యమును భారతదేశంలో సంస్థాపింపచేయడమే ఈ పరిషత్తుయొక్క పరమ లక్ష్యం. వయోజన నియోజక వర్గములచేత ఎన్నుకోబడి దేశముయొక్క రాజ్యాంగమునుగూర్చి అంతిమ నిర్ణయంచేసే అధికారంగల ప్రజాపరిషత్తు ద్వారా ప్రజలే అటువంటి రాజ్యమును నిర్మించుకోవాలి.

“కాంగ్రెసు లక్ష్యమైన స్వాతంత్ర్యమునుగూర్చి రాజ్యాంగ శాసన నిర్మాలన మునుగూర్చి అత్యధిక సంఖ్యాకులైన వోటర్లు తమ ఆమోదమును ప్రకటించారు. కాబట్టి బ్రిటిష్‌ప్రభుత్వమువారు పన్నిన ప్రజాస్వామ్య పద్ధతిద్వారానే ప్రజలా రాజ్యాంగ చట్టమును నిరసించి పూర్తిగా నిరాకరించినట్లయింది. అంతేకాక జాతీయస్వాతంత్ర్యమే లక్ష్యంగాగల తమ రాజ్యాంగచట్టమును ప్రజాపరిషత్తు ద్వారా తాము నిర్మించుకొన కోరుతూన్నామనికూడా వారు ప్రకటన చేశారు.

“కాబట్టి భారతజాతి పక్షాన సాధ్యమైనంత త్వరలో ఆయా శాసన సభల లోని కాంగ్రెసు పార్లమెంటరీ పక్షాలవారందరూ, భారతీయ ప్రజ తమ రాజ్యాంగ చట్టమును తాము నిర్మించుకొనేటందుకు వీలుగా, 1935 నాటి ఇండియా ప్రభుత్వ చట్టముపసంహరింప బడవలెనని తీర్మానించవలసిందిగా ఈ పరిషత్తు వారిని ఆదేశిస్తూన్నది.”

ఎన్నికలలో ప్రభుత్వోద్యోగుల సాహాయ్యం కల్పించుకొన్నట్లు ఒక తీవ్ర నిందారోపణ కేంద్ర శాసనసభలో చేయబడగా న్యాయ శాఖాధ్యక్షుడు సర్ హెన్రీ క్రేక్ యిలా సమాధానమిచ్చాడు. "నా దృష్టికి వచ్చిన నాలా విషయాలు గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిలువారి పరిశోధనకు ప్రాప్తమునకు వచ్చినట్టు మాత్రం నాకు తెలియదు కానీ వంటి వాటిలేవు. నాకు వారినిగూర్చి యేమీ తెలియదు. ఇప్పటినుండి నాయకులు కొన్ని విషయాలు గవర్నర్లు ఆనాటి కమిటీలకు తెలియచేయడానికి అవకాశం దానికి సామాన్యం వహించవలసిన అవకాశం ఉండే కారణం. కాని ఏదైనా ఒకదానినుండి ఆ అవకాశం దుర్వినియోగం."

ఎన్నికలలో సాహాయ్యం కల్పించుకోవడమును గురించి సర్ హెన్రీ క్రేక్ యిలా అన్నాడు. "ప్రభుత్వోద్యోగులు ఎన్నికలలో సాహాయ్యం కల్పించుకొన్నారని నిందారోపణ చేయడం ఆశ్చర్యంగా ఉంది. వోట్లున్న ప్రభుత్వోద్యోగులలో అత్యధిక సంఖ్యాకులు కాంగ్రెసుకే వోటిచ్చినట్లు దాదాపు ప్రతి రాష్ట్రమునుండి రిపోర్టులు వచ్చినవి. ప్రభుత్వోద్యోగులు కాంగ్రెసుకే వోటు చేసినప్పుడు వారు కాంగ్రెసుకు ప్రతికూలంగా పనిచేసిఉండడం అసంభవం" అన్యాయపు నడక నడిచినట్లూ, కూడని పనులు చేసినట్లూ ఒక పక్షముపైననే కాక కాంగ్రెసు పక్షముపైకూడా ఆరోపింపబడెనని సర్ హెన్రీ క్రెయిక్ యాదృచ్ఛికంగా అన్నాడు.

1937 ఏప్రిల్ ఒకటో తేదీవచ్చి ఆసేతు హిమాచలపర్యంతమూ జరిగిన శాంతియుత హర్తాళంతో కడచిపోయింది. అప్పటినుండి మూడునెలలవరకూ దేశమంతటా ప్రచండ వేగంతో ప్రచారమూ అంతులేని ఆందోళనమూ సాగింది. మొత్తం 11 రాష్ట్రాలలోనూ, ఆరు రాష్ట్రాలలో అధిక సంఖ్యాకులుగా వచ్చిన పక్షంవారు ఉద్యోగమును స్వీకరించనూ స్వీకరించరు పోనీ ఉంటారో ఊరుకోనూ ఊరుకోరు; కాంగ్రెసు, భారతజాతి యొక్క పార్లమెంటుకీ ఐక్యమనంగా నిర్మూలింపబడిన యెడల యేమిచేయవలెనో బ్రిటిషు ప్రభుత్వానికి తెలుసు. లేక కాంగ్రెసు ఉద్యోగ స్వీకారమే చేసినయెడల ఆ నూతన వాతావరణమును ప్రభుత్వమే యొక విధముగా సరిపట్టుకొనిఉండేది. నిరంకుశాధికారవర్గంవారు కాలపరివర్తనముల కనుగుణంగా ప్రవర్తించడంలో అవకాశం వచ్చినప్పుడు ప్రతికూలురను కిందికి తోయడానికి వేచిఉండడంలోనూ అందె వేసినచేతులు. అయితే కాంగ్రెసుమాత్రం ప్రభుత్వంవారిని యిష్టంవచ్చిన ప్రకారం చెలరేగనీయలేదు. హిందూదేశచరిత్రలోనే కాదు బహుశా ప్రపంచ చరిత్రలోకూడా

రాజ్యాంగ వ్యవహారాలలో గవర్నర్లు జోక్యం కల్పించుకొని ప్రత్యేకాధికారాలను వినియోగించరనీ మంత్రుల సలహాలకు భిన్నంగా నడుచుకోరనీ హామీనీయవలసిందని ఒక రాజకీయ సంస్థ కోరడానికి కిదే మొదటి పర్యాయం. కాని ఈ అధికారాలు మొదట్లోనే గట్టి దీర్ఘాలోచనమీద శాసనబద్ధంగా చేయబడి "ప్రత్యేకాధికారాలు"గా ఉదాహరింపబడిన సంగతి గుర్తించుకోవాలి. పరాధీన దేశంలోని ప్రజాస్వామ్యం, పాలక జాతి యొక్క స్వార్థ ప్రయోజనములకు విరోధంగా ప్రవర్తించకుండా, శాసనబద్ధంగా యేర్పాటుచేయబడిన రక్షణలనూ ప్రత్యేకాధికారాలను వదులుకొని గవర్నర్లు చేతులు ముడుచుకొని కూర్చొనవలసిందేనా? అటువంటి హామీలనడగడం న్యాయశాస్త్రి ప్రకారంగానీ, రాజ్యాంగ శాసనం ప్రకారంగానీ సహజసమా అని ప్రత్యక్షంగా వాద ప్రతివాదాలు చెలరేగినవి. హామీలడగడం న్యాయశాస్త్రానికిగానీ, రాజ్యాంగ చట్టానికిగానీ అనుకూలమా ప్రతికూలమా అనేది కాదు దేశానికిప్పుడు కావలసింది. హిందూ దేశంతో యేసంబంధమైన ప్రసక్తిలేని రాజ్యాంగచట్ట మొకటి ఉన్నదెక్కడ. అందులో 'స్వయం' నిర్ణయ చిహ్నాలు లేవు సరికదా 'సమిష్టి' సమాలోచనపు జాడలుకూడాలేవు. అది నట్టి 'పర' నిర్ణయం. అది కేవలం బయటివాళ్ల బలవంతం. భారతీయులట్టి రాజ్యాంగములో పనిచేయవలెనంటే వారి సొంత షరతులమీదమాత్రమే పనిచేయవలసిఉంటుంది. లేనట్లయితే కొత్తచట్టంలోని సెక్షనుల ననుసరించి రాజ్యాంగ శాసనమూ న్యాయ శాస్త్రీమూకూడా వాటితోవ అవి చూచుకోవాలి. అప్పుడు ప్రతిష్టంభనలువస్తే భారత దేశపు తప్పు కాదు. ప్రజాభిప్రాయమును తృణీకరించి బ్రిటిష్ గవర్నమెంటు వారవలంబించిన విధానమొకప్రక్కను నూతన రాజ్యాంగ చట్టమును ప్రతికూలించి తుద ముట్టించవలెనను అ. భా. కాం. సం. వారి నిర్ణయము మఱొకప్రక్కను, ఎన్నికలసమయంలో నియోజకవర్గముల యెదుట బహిరంగంగా ప్రతిపాదింపబడినవి ఈ రెండింటికీ గల పరస్పర విరుద్ధ ప్రయోజనములను బట్టి తప్పనిసరిగా వచ్చే ప్రతిష్టంభనలు బ్రిటిష్ సామ్రాజ్యవిధానానికీ భారతజాతీయతకూ నైసర్గికంగా ఉన్న ప్రాతికూల్యమును ఇంకా వెల్లడిచేసి భారత రాజ్యాంగ చట్టములోని నిరంకుశత్వమునూ ప్రజాస్వామ్య విరుద్ధస్వభావమును మఱింత విస్పష్టం కావింపగలవు. ఇక రాజ్యాంగ చట్టములోని సుగుణాలను ఆలోచించి, అది ఉపయోగపడినంతవరకే ఉపయోగించుకోవడానికి కాంగ్రెసు ఎందుకు సంసిద్ధం కాకూడదో అనేక కారణాలను వివరించవచ్చును. ఈదృష్టితో ఈ సమస్యకు సంబంధించిన వివిధ సందర్భాలను విచారించ

పలసి ఉంటుంది. కాని ప్రస్తుతం న్యాయశాస్త్రానికీ రాజ్యాంగ శాసనానికీ సంబంధించి మనదృష్టిని తిరిగి మరల్చవలెనుగాక! హామీలవిషయంలో కాంగ్రెసు వైఖరి సరియైనదేనని గాంధీ గట్టిగా నిలబడినప్పుడు ఆయన ఆలోచించినా, మాట్లాడినా, వ్యవహరించినా ఒక రాజకీయపక్షమునకు చెందిన నాయకుడుగా గాక, న్యాయశాస్త్రనిపుణుడుగా, రాజ్యాంగ శాసనమును అనుకూలంగా అనుగామాచేసుకొన్న న్యాయవాదిగా, సామ్రాజ్యంలోని స్వయంపాలనా ప్రదేశములలోకూడా రాజ్యాంగమునందు చిరకాలం జోక్యం కల్గించుకొన్న అనుభవజ్ఞుడుగా మాత్రమే ప్రవర్తించాడు. ఇంగ్లాండులోనూ ఇండియాలోనూకూడా న్యాయశాస్త్ర ప్రవీణులు పరస్పరవైరుధ్యాలా వాద ప్రతివాదాలు సాగించారు. కాంగ్రెసు వైఖరిని దాదాపు మొట్టమొదట ప్రతిఘటించిన వ్యక్తి సర్ తేజ్ బహదూర్ సప్రూ. అయినా హామీలను కోరడం అంగీకరింపదగనిపని నిష్కర్షంగా చెప్పివేశాడు. అయినా ప్రజలలోని అభ్యుదయభావాలు ప్రతిపాదించిన జాతీయవాంఛలను ఎన్నడూ గుర్తించక మూలసిద్ధాంతాన్ని నాయకులనెదిరిస్తూండడం భారత దేశపు దురదృష్టం 1929 డిసెంబరు 23 వ తేదీని ఇర్విన్ ప్రభువు గాంధీ, నెహ్రూలతో మాట్లాడటానికి వారిని పిలిచినప్పుడు, డాక్టరు సప్రూ, జిన్నాలు, ప్రజావాంఛలకు అడ్డుతగులుతూన్న బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించడానికి బదులు. అసలు ప్రజల కోరికలనే ప్రతిఘటించిన సంగతి భారతీయులకి జ్ఞాపకముండే ఉంటుందనుకొంటాము. 1931 లో ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య సామరస్యం కుదర్చడానికి డాక్టరు సప్రూ తన పలుకుబడిని వినియోగించిన మాట నిజమే; కాని 1937 లోని సందిగ్ధావస్థలో కాంగ్రెసుకు కేవలం ప్రతికూలంగా నిలబడ్డాడు. ఈ సుప్రసిద్ధ న్యాయవాదికెదురుగా అడ్వొకేటు జనరల్ ఉద్యోగంచేసిన శ్రీ తారాపోర్వాలా (Tarapore wala) డాక్టరు బహదూర్జీ అను ఇరువురు ప్రఖ్యాత న్యాయశాస్త్ర ప్రవీణులు, కాంగ్రెసు కోరిన హామీలు న్యాయశాస్త్రమునకుగాని రాజ్యాంగ శాస్త్రమునకుగానీ ఎంత మాత్రమూ విరుద్ధంకావని జాగ్రత్తగా ఆలోచించి విస్పష్టంగా అభిప్రాయమిచ్చారు. భారతీయాభిప్రాయ మీవిధంగా అనుకూల ప్రతికూలవాదాలతో నిండివున్నప్పుడు ఇంగ్లాండుదేశపు రాజ్యాంగశాస్త్రనిపుణుడు బెరిడేల్ కీత్ (Berridaile Keith) కాంగ్రెసు అభిప్రాయాన్ని బలపరుస్తూ హామీలుకోరడం న్యాయమేనని ప్రకటించాడు. కాంగ్రెసు వైఖరివలన చెలరేగిన శాస్త్రవాదాలిలా జరుగుతూండగానే, వివిధ రాష్ట్రాలలోని ప్రధాన రాజకీయ నాయకులూ ఆనాటి ఈ తీవ్రసమస్యలో ఇమిడి

ఉన్న వివిధ విషయాలనుగూర్చి మూడు నెలలపాటు - ఏప్రిల్, మే, జూన్ నెలలలో విస్తారంగా ప్రచారంచేశారు

ఈ చర్చ ఒక్క ఇండియాలోనేకాక ఇంగ్లాండులోకూడా సాగింది. భారతీయనాయకుల అభిప్రాయాలను ప్రకటించడంలో ఇంగ్లాండు దినపత్రికలు శ్రద్ధ తీసుకొన్నవి. జవహర్‌లాలునెహ్రూ లండన్‌లోని న్యూస్ క్రానికలు పత్రికకు పంపిన ప్రశ్నకు మార్క్వెస్ ఆఫ్ లోథియన్ ఈ విధంగా జవాబిచ్చాడు

“సుప్రసిద్ధ స్వీయచరిత్రకు రచయిత అయిన మహాపురుషుని విజ్ఞానౌన్నత్యమూ, సాహిత్యమూ నెహ్రూ పంపిన తంతీ (Cable) లో ప్రతిబింబిస్తూన్నది. కాని బ్రిటను తన ఇష్టమొచ్చినట్లు భారత స్వాతంత్ర్యాన్ని మట్టగిస్తూన్నదని వర్ణించిన కర్ణన నిజంగా నిలువనేరదు. భారతీయ నాయకులతో గాంధీగారితోసహా జరుపబడిన నిరంతర చర్చల ఫలితమే ఈ నూతన రాజ్యాంగ చట్టం. కాని పూర్తిగా ఒక్క బ్రిటిష్ పార్లమెంటువారి బాధ్యతమీదనే శాసనరూపం తాల్చింది. అది భారత స్వపరిపాలన కొక మార్గమును ప్రతిపాదిస్తూన్నది నెహ్రూగారున్నూ ఆయన మిత్రులున్నూ వేరొక మార్గమును విశ్వసిస్తూ వున్నారు. అక్కడే నిజమైన భేదం. తక్షణ స్వపరిపాలనమునకు భారతదేశంలోనే పెద్ద పెద్ద అడ్డంకులు కలవు. ఆ అనుభవాన్ని ఆధారంగా చేసికొని ఈ రాజ్యాంగం నిర్మింపబడింది.

ఈ సందర్భంలో శాస్త్రరీత్యానూ సిద్ధాంతరీత్యానూ ఇమిడివున్న విషయాలలా ఉండగా, గవర్నరులు తమ ప్రత్యేకాధికారాలను వినియోగించరాదనీ, రాజ్యాంగ వ్యవహారాలలో మంత్రుల సలహాలను నిరాకరించరాదనీ కాంగ్రెసు కోరిన కోరికల లోని అంతరార్థమును చక్కగా పరిశీలించడం న్యాయం. ఈ ప్రత్యేకాధికారాలు కొన్ని కూటాలకూ ప్రయోజనాలకూ ప్రదేశాలకూ సంబంధించి ఉన్నవి. ఈకూటాలు అల్పసంఖ్యాక జాతులవారు. ఈ ప్రయోజనాలు బ్రిటిష్‌వారి స్వామ్యప్రయోజనాలు. ప్రదేశాలు - బ్రిటిష్ ఇండియాలోని మినహాయింపు ప్రదేశాలు (Excluded areas) అర్ధ మినహాయింపు ప్రదేశాలు (Semi excluded areas) భారత సంస్థానాలు. ఈ కోరికవలన భారతదేశంలోని గవర్నరులు ఆస్ట్రేలియాలోని రాష్ట్ర గవర్నరులు వ్యవహరించినట్టు మాత్రమే వ్యవహరించవలసివస్తుంది. (సెక్షన్ 51) వారి యిష్ట ప్రకారం మంత్రులను భర్తరఫుచేయడానికి వీలుకాదు. శాసనసభా నాయకుని యిష్టప్రకారమే జీతాలు నిర్ణయింపబడాలి. (సెక్షన్ 50); వారు మంత్రివర్గపు సమా

వేళాలలో అగ్రాసనాధిపత్యం వహించడానికి వీలులేదు వారు జోక్యం కల్గించుకొని ఆర్డినెన్సులనుగానీ (55-58), లేక శాంతిభద్రతలకు భంగం కలుగుతూన్నదనే కారణాలతో చట్టాలనుగానీ చేయకూడదు. అట్లా చేస్తే, జనరల్ నియామకంలోగాని పోలీసు నిబంధనలను చేయడంలోగాని వారికేమాత్రం స్థానం లేదు (సెక్షన్ 56).

(సెక్షన్ 57) జోక్యము చేసుకోవడంతో
(,, 59) మంత్రులు చేయవలసిన పనులను గూర్చి నియమావళిని తయారు చేయడం
(,, 62) అసెంబ్లీని రద్దుచేయడం
(,, 74) బిల్లులను ప్రవేశపెట్టడం
(,, 75) బిల్లులను అంగీకరించడం
(,, 78) బడ్జెటులో అదనపు ఖర్చులను చేర్చడం
(,, 82) ఏదైనా పన్నును వేయడానికిగానీ, ఎక్కువ చేయడానికిగానీ మంత్రుల సిఫారసుమీద కాకుండా రద్దుచేయడానికిగానీ, బిల్లునో బిల్లుకు సవరణనో ప్రవేశపెట్టడం.
(,, 84) స్పీకరు సంప్రతింపుతో శాసనసభా కార్యక్రమమునకు సంబంధించిన నియమావళిని తయారుచేయడం
(,, 85) గవర్నరు ప్రత్యేకాధికారం కింద ఉన్న విషయాలలో జోక్యం కల్గించుకొనే బిల్లుకు ప్రతిరోధం కలిగించడం
(,, 88) గవర్నరుయొక్క ఆర్డినెన్సులు
(,, 90) గవర్నరుయొక్క శాసనాలు
(,, 92) మినహాయింపు ప్రదేశాలు (Excluded areas)
(,, 258) ప్రభుత్వోద్యోగుల విశేషాధికారాలు

ఎన్నికలు పూర్తయిన తరువాత రాజప్రతినిధి ఉపన్యాసం జరిగింది. ఈమధ్య కాలంలో వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెసు నాయకులను ఆయా గవర్నర్లు మంత్రివర్గ నిర్మాణమునకు తోడ్పడ కోరారు. కాంగ్రెసువారు కోరిన హామీలను యీయడానికి రాజ్యాంగచట్టంలో సవరణలు జరిగితేనేగాని గవర్నర్లకు అధికారం లేదని బ్రిటిష్ మంత్రుల వాదం కాని ప్రఖ్యాత న్యాయశాస్త్ర ప్రవీణులు, కేవలం రాజ్యాంగ

చట్టమునకు లోబడియే హామీలీయవచ్చునని కాంగ్రెసు వర్కింగుకమిటీకి సలహా యిచ్చారు. వైపెమ్సు జెట్లండు ప్రభువు, ఆర్. ఎ. బట్లర్లు చేసిన ప్రకటనలు కాంగ్రెసుకు మరింత కోపకారణములైనవి. కాంగ్రెసు కోరికలను వారు సంతృప్తిపరచకపోగా కాంగ్రెసు దృక్పథమునకు వారు మరకములను కల్పించి లోకాన్ని తప్పు త్రోవను పట్టించారు. అంతేకాదు వారి ప్రకటనలో ఉపయోగించిన భాషా విధానము కూడా కాంగ్రెసుకు గౌరవప్రదంగా లేవు. " గవర్నరుకూ మంత్రులకూ తీవ్ర భేదాభిప్రాయాలు కలిగినప్పుడు, మంత్రివర్గమును భర్తరఫు చేయడానికిగానీ, అసెంబ్లిని రద్దుచేయడానికిగాని గవర్నరుకుగల హక్కును నిర్మూలనం చేయవలెననే ఉద్దేశంతో హామీలను కోరడంలేదనీ. గవర్నర్ల ప్రతిరోధానికి మంత్రులు మెలకువగ్గ ఊరుకోవడం కాంగ్రెసు ఏమాత్రం సహించదనీ, కాబట్టి అంతకంటెహా, గవర్నర్లు మంత్రులను బర్తరఫు చేసే బాధ్యతను నిర్వర్తించవలసిన స్థితికి తీసుకొని రావడంకంటెకూడా మంత్రులే రాజీనామా యీయడం ఉత్తమ పద్ధతి అనీ " సూచిస్తూ కాంగ్రెసు తన వైఖరిని పునరుద్ఘాటించింది. కాని ఈ లోగానే కాంగ్రెసు సభ్యు లధికసంఖ్యాకులుగాగల రాష్ట్రాలలో, కేవలం చట్టవిరుద్ధంగా, రాష్ట్ర స్వాతంత్ర్య సిద్ధాంతమునకు ప్రతికూలంగా అత్యధిగ సంఖ్యాక ప్రజాభిప్రాయమును తృణీకరించి మంత్రివర్గ నిర్మాణము జరుగుతూ వచ్చింది. మంత్రులని పిలవబడుతూన్న ఆ వ్యక్తుల చర్యలను నిరసిస్తూ దేశమంతటా బహిరంగసభలు జరుపబడినవి. వారి ప్రవర్తనను సమర్థించుకొంటూ చేతనైతే శాసనసభను పిలువవలసిందని పదేపదే కోరబడిరి. ఈ కల్లోలంలో కాంగ్రెసువాదుల కర్తవ్యమేమో అందరికి విదితమే ముఖ్యంగా శాసనసభా సభ్యులు తమ నియోజకవర్గాలలోని ఓటర్లతో సన్నిహిత సంబంధం కలిగించుకొని మిల్లుబట్టలను మినహాయించి ఖద్దరును ఉపయోగించవలెననీ, చేతితో వడకిన నూలుతో చేతితో నేసిన బట్టను స్థానికంగా ఉత్పత్తిచేసుకోవలెననీ, మత్తుపదార్థాలను పూర్తిగా మాన్పింపవలెననీ, వ్యష్టిగానూ సమిష్టిగానూ కూడా ప్రయత్నించి సాంఘికైకమత్యమును సమకూర్చవలెననీ అంటరానితనమును అన్నిరూపాలలోను నిర్మూలించవలెననీ నిర్మాణ కార్యక్రమమునకు సంబంధించిన కాంగ్రెసు సందేశాన్ని ప్రజాసమూహాకమునకంద చేశారు. కాంగ్రెసు అధిక సంఖ్యాక రాష్ట్రాలలోని తాత్కాలిక మంత్రివర్గమునకున్నూ, తదితర రాష్ట్రాలలోని మంత్రివర్గమునకున్నూ సంబంధించినంతవరకు, వారితో

సంబంధం పెట్టుకోవడంగాని. వారిని సందర్శించడంకానీ కాంగ్రెసు వాదులకు కూడని పనిగా నిషేధింపబడింది.

రాజకీయాలకూ న్యాయశాస్త్రానికీ సంబంధించిన పరస్పరవిరుద్ధాభిప్రాయాలు ప్రతిరోజూ కుప్పతిప్పలుగా కేబుల్ ద్వారానూ తంతులద్వారానూ ఇంగ్లాండుకు పంపబడుతూవున్నప్పటికి మూడు నెలలవరకూ హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగానీ, ఇండియా ప్రభుత్వంవారుకానీ మూకీభావం వహించి ఊరకొన్నారు. చిట్టచివరకు జూన్ 21 వ తేదీ రాత్రి, జెట్లాండు ప్రతిష్టంభనమునుగూర్చి ఒక చిన్న సందేశాన్ని విగ్గానుండి రేడియోద్వారా ప్రకటించారు. అందులోని అభిప్రాయాన్ని యిక్కడ సంగ్రహంగా ఉదహరిస్తున్నాము. రాజ్యాంగములో ప్రవేశపెట్టబడిన మార్పులు చాలా ప్రాముఖ్యమైనవి. అవేమీ చిక్కులులేకుండా రావడానికి వీలులేదు. ఆ చిక్కులనుగూర్చి చాలా పెద్దచేసి చెప్పడం తేలికే. కాని జెట్లాండు చేసిన ప్రకటన ఆచిక్కులను పరిపూర్ణంగా తొలగించడానికే ఉద్దేశింపబడినది. అయితే ఆయన తెల్పించుకొన్న విధానం వలన ఆ సమస్య అత్యంత సులభముకాలేదు. వర్ణనీయాంశము అతి సూక్ష్మముకాలేదు. ఆయన సందేశం కొంత లాంఛనప్రాయంగా ఉన్నప్పటికీ, సానుభూతిసహితంగా ఉండవలెననికానీ, సుభావంగా ఉండవలెననిగానీ ఉద్దేశింపబడలేదు. కేవలం న్యాయశాస్త్రమూ రాజ్యాంగ సిద్ధాంతమే కాదు మన మనస్సులను సంచలింపచేసి మన అభిప్రాయాలను అనిభూతిమొనర్చగలవి. భారతీయ మనోభావమూ, చిత్తవృత్తికూడా అందుకు కారణాలుగా పరిగణింపబడవలెను. కొన్ని రాష్ట్రీయ శాసనసభలలో అధికసంఖ్యాక సభ్యులుగలిగి కూడా ఉద్యోగం తీసుకోవడానికి నిరాకరించే పక్షమొకటి ఉంది. చట్టం ప్రకారం తను నిర్ణయమును లేక విచక్షణను లేక తమ వ్యక్తిగత వివేకమును గవర్నరు జనరల్ యొక్క సాధారణాధికారమునకు లోబడి ఆచరణలో పెట్టవలసిన ప్రత్యేకాధికారాలుగల గవర్నర్లున్నారు. భారతరాజ్యాంగ కార్యదర్శి సాధారణాధికారమునకు లోబడవలసిన గవర్నరు జనరలున్నాడు. ఇప్పుడు చర్చింపబడుతూవున్న అంశాలు ప్రధానంగా గవర్నరులకు, పక్ష నాయకులకూ సంబంధించినవైనప్పటికీ, ఇంగ్లాండులోనూ ఇండియాలోనూ చేయబడిన ప్రకటనల ననుసరించి, గవర్నరుజనరలా చర్చలను కొనసాగించ పూనుకొని, మన సమక్షంలోనున్న రాజ్యాంగ సమస్యలను గూర్చి అధికారుల వైఖరిని విశదంచేశాడు. గవర్నరులకూ వారి మంత్రులకూగల

సంబంధ బాంధవ్యములను గూర్చి, మంత్రివర్గంవారి దినసరి కార్యక్రమంలో గవర్నర్లెంతవరకు ఏవిధంగా జోక్యం కల్గించుకోవచ్చుననే విషయములోనూ, నిజమైన అభిప్రాయభేదాలు అపోహలూ ఉన్నవనేమాట ఇంతవరకు జరిగిన చర్చల ఫలితంగా తేలిపోయింది.” ఇప్పుడీ అపోహలను తొలగించి, రాష్ట్రీయ గవర్నరుల కర్తవ్యాను స్వభావమును గూర్చి, తామున్న ప్రాంతాలలోను వారున్న పరిస్థితుల భావంతో వ్యవహరించవలెననుకొంటూన్నారో ఆ ప్రాంతాల మంత్రివర్గ మంత్రులతో ఏవిధంగా పని చేయవలెననుకొంటున్నారో ఆ సంబంధ బాంధవ్యములు, గవర్నర్లెంతవరకు వార్టీకి సంబంధం పకుండా వెలిగా ఉంటారో, ఎంతవరకు కాంగ్రెసులు చెప్పినట్లుగా నడుచుకొంటారో ఆసంగతి, ఇండియా ప్రభుత్వమూ, బ్రిటిష ప్రభుత్వంకూడా విస్పష్టంగా ప్రకటించడానికి వీలుకలిగింది చట్టంలోని నియమాలనుబట్టి గవర్నర్ల దగ్గరనుండి కొన్ని హామీలను తీసుకోకుండా మంత్రిత్వాలు పుచ్చుకోవడం వివేకం కాదనుకొంది. కాంగ్రెసు మంత్రివర్గాలు నిర్మింపబడిన రాష్ట్రాలలో జరిగిన మూడు నెలల అనుభవమునుబట్టి ప్రభుత్వోద్యోగస్థులు బాగా సహకారం చేస్తూన్నారనీ, మంత్రులయెడ గవర్నర్ల సహకారమూ, సహాయసానుభూతులు తగినంతగా ప్రస్ఫుటితమౌతున్నవనీ, రాజప్రతినిధి దృష్టాంత పూర్వకంగా ఋజువుచేయ పూనుకొన్నాడు. కాంగ్రెసు నిజంగానే అపోహపడుతూన్నదని అంగీకరించినప్పటికీ, ఆ అపోహకు తగిన కారణాలు వైస్రాయికి కనిపించలేదు. గవర్నరులు మంత్రుల కార్యవిధానలో జోక్యం కల్పించుకోవడానికి అవకాశాలకోసం నిరీక్షిస్తూంటాగనడానికికాని, రాష్ట్రాల రోజువారీ పరిపాలనములో మంత్రులను ప్రశ్నించడానికీ, వారికి ప్రతిరోధం కలిగించడానికీ చట్టం ప్రకారం తమకీయబడిన ప్రత్యేకాధికారాలను గవర్నర్లు అనవసరంగానూ అకారణంగానూ వినియోగిస్తాననడానికిగానీ తగిన ఆధారాలులేవని వైస్రాయి అభిప్రాయం. రాష్ట్రక్షేమంకోసం గవర్నరుల యొక్కయు ఉద్యోగస్థుల యొక్కయు సహకారంతో, మంత్రులు సంపూర్ణ విశ్వాసంకలిగి, విశాలమైన పద్ధతులమీద శాసనసభా కార్యక్రమమును నిర్మించుకొని అమలుపరచడానికి అవకాశం కలిగించడమే చట్టంయొక్క ముఖ్యోద్దేశం. రాష్ట్రీయ స్వాతంత్ర్యము ననుసరించి మంత్రుల యాజమాన్యంకిందకు వచ్చిన అన్ని విషయాలలోనూ, అల్పసంఖ్యాకులు, ఉద్యోగస్థులు మొదలైనవారికి సంబంధించిన విషయాలలోకూడా, గవర్నరులు, పార్లమెంటుకుగాక శాసనసభలకు బాధ్యతవహించిన మంత్రుల సలహా ననుసరించియే సాధారణముగా నడచుకొనవలెననీ

అసలు చట్టమూ 'ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్స్' కూడా (అను శాసనపత్రం) నిస్సందేహముగా స్పష్టీకరిస్తున్నవి.

గవర్నరుయొక్క ప్రత్యేక బాధ్యతలని చెప్పబడేవాటిలో అత్యంత ప్రాముఖ్యమైనవి, రాష్ట్రంలోగాని, రాష్ట్రం . . భాగంలోగాని శాంతి భద్రతలకు భంగం కలుగవచ్చునని ప్రతి కేసులోను దానిని ఆపటం ప్రత్యేక బాధ్యతలైనవి. అల్పసంఖ్యాక ప్రజానీకపు, ఉద్యోగస్థుల హక్కులు ప్రయోజనాలను రక్షించేపని పార్లమెంటు వారు గవర్నర్ల బాధ్యతగా నిర్ణయించారు. ఈ బాధ్యతల వ్యాప్తి సాధ్యమైనంత సంకుచితంగా చేయబడినప్పటికీ, అన్నిటిలోనూ మంత్రులుకూడా వీటితో కలిసివచ్చేటట్లు గవర్నర్లు ప్రయత్నించాలి. తదితర విషయాలలో గవర్నర్ల సొంత అభిప్రాయాలెలా ఉన్నా మంత్రివర్గంవారి సలహాలను విధిగా వారనుసరించితీరాలి.

తన వ్యక్తిగత నిర్ణయమును (individual judgment) అమలుపరచవలసిన విషయాలలో, గవర్నరుకూ మంత్రివర్గానికీ ఏకాభిప్రాయం కుదరకపోతే ఏమి కావాలి? మంత్రివర్గంవారి అధీనంలోఉన్న అన్ని కార్య నిర్వాహక విషయాలను గురించి, గవర్నర్ల ప్రత్యేక బాధ్యతలతోసహా మంత్రులు గవర్నర్లకు సలహా ఈయడం వారి విధీ హక్కూకూడాను. అటువంటి సలహా ఈయడంలో మంత్రులు శాసనసభలకు జవాబుదారీగా ఉండాలి. గవర్నరు ప్రత్యేకంగా తన వ్యక్తిగత నిర్ణయమును అమలుపరచవలసిన సందర్భాలలో తప్ప తక్కిన అన్ని సందర్భాలలోనూ మంత్రుల సలహాను ఆయన అనుసరించితీరాలి. గవర్నర్ల ప్రత్యేక బాధ్యతల విషయంలోకూడా వారి అధికారాలకు చాలా పరిమితి యేర్పాటు చేయబడింది. గవర్నర్లు మంత్రుల సలహాలకు అనుకూలించినా ప్రతికూలించినా వారు పార్లమెంటుకు బాధ్యులు. మంత్రుల సలహాలను గవర్నరు నిరాకరించినప్పుడు ఆ భాధ్యత గవర్నరుదే అవుతుంది. కాని మంత్రులకేమీ బాధ్యత ఉండదు. పైగా మంత్రులు ఫలానా విషయంలో తమకేమీ బాధ్యతలేదనీ, తాము గవర్నరు నిర్ణయానికి వ్యతిరేకంగా సలహా యిచ్చినామనీకూడా బహిరంగంగా ప్రకటించవచ్చును. గవర్నరు తన మనస్సులోఉన్న అభిప్రాయాన్ని పూర్తిగా మంత్రుల కెరుకపరచి, తన నిర్ణయంప్రకారం తానొక ఉత్తరు వీయడానికిగానీ, ఒక మార్గాన్ని అనుసరించడానికిగానీ, అవసరమైన కారణాలను మంత్రులకు వివరించి చెప్పవలెను. అటువంటి సందర్భాలలో మంత్రివర్గం రాజీనామా

యీయవలెనా లేక బహిరంగంగానో, ఆంతరంగికంగానో ఆ విషయాన్ని గూర్చి తమ వైఖరిని తెలియపరిచినప్పటికీ తమ పని తాము చూసుకొంటూ ఊరుకోవలెనా? లేక తమను భర్తరఫు చేయవలసిందిగా గవర్నరును కోరవలెనా? గవర్నరుల ప్రత్యేక బాధ్యతలలో సహజ ప్రాముఖ్యంగల వివిధ విస్తృత విషయాలు కూడి ఉన్నవి. ఈ కారణంవల్లనే "గవర్నరుకూ, మంత్రులకూ మధ్య తీవ్ర భేదాభిప్రాయాలు కలిగినప్పుడు మాత్రమే వారు విడిపోవడమనే సమస్య యేర్పడుతుందని" గాంధీజీ చేసిన సహాయకరమైన సూచనను రాజప్రతినిధి హృదయపూర్వకంగా సంతోషించాడు. అటువంటి సందర్భాలలో మాత్రమే మంత్రులు రాజీనామా ఇయ్యడంకానీ, భర్తరఫు కావడంకానీ సంభవించవలెను. రాజీనామా ఇయ్యడం మంత్రుల ఆత్మగౌరవానికి తగినపని. మంత్రులు స్వచ్ఛందంగా అప్పటికప్పుడు తీసుకొనే చర్య అది. భర్తరఫు కావడమనేది చాలా అసాధారణమైనపని. అంతేకాదు. అది మంత్రుల చిన్నతనాన్ని సూచిస్తుంది. అంతా సాధ్యమైనపనులే. కాని గవర్నరు భర్తరఫు చేయవలసిన చర్య తీసుకోవలసివచ్చినప్పుడు, మంత్రులు రాజీనామా పెట్టితీరవలెనని చట్టంలో ఎక్కడాలేదు. అయినప్పటికీ సాధారణంగా గవర్నర్లకూ మంత్రులకూ మధ్య ఘటిల్లించే భేదాభిప్రాయాలన్నీ, ఉభయ పక్షాల పరస్పర సుహృద్భావంతో పరిష్కారం కాదగినవిగానే ఉంటవి.

గవర్నర్లుకూడా మంత్రులతో తగాదా పెట్టుకోకుండా ఉండవలెననీ, రాకుండా చూచుకోవలెననీ అటువంటివి వస్తే సర్దుకోవాలనికూడా చూస్తూంటారు. నిజానికి కార్యనిర్వాహకాధికారం సామాన్యంగా గవర్నరు పేరుతోనేకదా నడుస్తూవుంటుంది. కాని మంత్రివర్గములకు లోబడ్డ విషయాలలో కొన్ని షరతులకు లోబడి గవర్నర్లు, మంత్రులు తీసుకొన్న చర్యలపైన తమ అధికారాన్ని వినియోగించవలసి ఉంటుంది. స్పష్టంగా నిర్వచింపబడిన కొన్ని అత్యంత పరిమిత విషయాలలో, ఇతర దేశాలలోవలెనే ఇక్కడకూడా, ప్రధానంగా మంత్రులమీదనే బాధ్యత ఉంటుంది. తుదకు గవర్నరు పార్లమెంటుకు బాధ్యుడుగా ఉంటాడు. తక్కిన అన్ని విషయాలలోనూ మంత్రులే సర్వబాధ్యతనూ వహిస్తారు. వారు కేవలం శాసనసభలకు మాత్రమే జవాబు చెప్పవలసిఉంటుంది. ప్రత్యేక బాధ్యతల సందర్భంలో గవర్నరు మంత్రుల సలహాను ఇతరంగా వ్యవహరించవచ్చును. ఒక్కొక్కప్పుడు వ్యవహరించవలెనుకూడా. అటువంటి సందర్భాలలో నిర్ణయించుకోవలసింది ఆయనే. ఆనిర్ణయం తీసుకొన్నందుకు

ఆయన పార్లమెంటుకు జవాబుదారీ వహించాలి. అయితే ఆయనకోసం ప్రత్యేకించబడిన పరిమిత బాధ్యతలను అతిక్రమించి, రాష్ట్రంలోని దినసరి పరిపాలనలో జోక్యం కల్గించుకోవడానికి గవర్నరుకు స్వాతంత్ర్యం ఉందనికానీ, హక్కుగానీ అధికారముగానీ ఉందనికానీ అర్థంకాదు కఠిన సంప్రదాయాలద్వారాగాక 'ఇచ్చి పుచ్చుకోవడం' పద్ధతిమీదనే ఇంతవరకూ రాజ్యాంగ క్రమాభివృద్ధి జరుగుతూవచ్చింది. అత్యంత క్లిష్ట పరిస్థితులను దాటుకుపోయేటందుకు చట్టంలో చేయబడిన నియమాలనుబట్టి ఆ క్లిష్ట పరిస్థితులు నిజంగా తటస్థించవలెనని శాసనిక చట్ట నిర్మాతలనుకున్నట్లుగా భావించకూడదు ఈ మాటలలో రాజప్రతినిధి తన విశ్వాసాన్ని ప్రకటించాడు. "మీలో చాలామంది ఎక్కువగా వాంఛిస్తున్న ఆ ఘనతర రాజకీయ జీవితమునకు అత్యంత సన్నిహిత మార్గం. ఈ రాజ్యాంగ చట్టమును అంగీకరించి దాని ఉపయోగమును పూర్తిగా పొంద ప్రయత్నించడమే ఈ రాజ్యాంగ చట్టమునను సరించి పనిచేస్తూ పూర్తిగా దీనిని అభివృద్ధిచేయడంలోనే మనమందరమూ అత్యంతం అభిలషిస్తున్న గ్రామస్థులయొక్కయు, సంఘంలో అట్టడుగున ఉన్నవారియొక్కయు క్షేమాభివృద్ధులకు అవకాశం వుందనే ఆశ ఎక్కువగా కనిపిస్తున్నది".

---

# 3 మంత్రిత్వ స్వీకరణము.

## [ జులై 1937 ]

రాజ ప్రతినిధి జూన్ 20వ తేదీని చేసిన ఉపన్యాసం తరువాత తక్షణం 1937 జూలైలో కాంగ్రెసుస్థితి ఎలావున్నదో తెలుసుకోవలెనంటే, ఆనాడు కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానముల ననుసరించి చాలావరకు ఆభాషలోనే యిక్కడ సంగ్రహంగా కొన్ని పేరాలలో వివరించడం లాభదాయకం. శాసన సభ్యుల పరిషత్సమావేశమునను ముందుగా 18వ మార్చి తేదీని ఢిల్లీలో అ. భా. కాం. సం. సమావేశమై, రాజ్యాంగ చట్టం విషయంలో కాంగ్రెసు ముఖ్యంగా నడుచుకోవలసిన విధానమున్నూ, కాంగ్రెసు శాసనసభ్యులు శాసనసభలలోనూ, వెలుపలాకూడా నిర్వర్తించవలసిన కార్యక్రమాన్ని నిర్ణయించారు. కాంగ్రెసు సభ్యులధిక సంఖ్యాకులుగానున్న రాష్ట్రాలలో, గవర్నరు తన ప్రత్యేకాధికారాలను వినియోగించి రాజ్యాంగ వ్యవహారాలలో మంత్రులసలహాను నిరాకరించడనీ ప్రతిరోధం కలిగించడనీ కాంగ్రెసు పక్షనాయకుడు సంతృప్తిపడి తానావిషయం బహిరంగంగా ప్రకటించగలిగిన స్థితిలోనున్నయెడల మంత్రిత్వ స్వీకరణమునకు అనుజ్ఞ యీయవలెనని నిర్ణయింపబడినది. వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెసు నాయకులవసరమైన హామీలను ఏవిధంగా అడిగారో ఆ హామీలు రానప్పుడేవిధంగా మంత్రివర్గనిర్మాణం చేయడానికి నిరాకరించారో యింతకుపూర్వమే చెప్పివున్నాము. తరువాత యీ విషయాన్నిగూర్చి, భారత రాజ్యాంగ కార్యదర్శి, ఆయన అండర్ సెక్రటరీ, వైస్రాయి వీరంతా బ్రిటిష్ ప్రభుత్వపక్షాన చేసిన ప్రకటనలలో కాంగ్రెసు కోరికల దరిదాపులకు చేరవలెననే ఉద్దేశ్యం కనిపిస్తూన్నప్పటికీ అవన్నీకూడా కాంగ్రెసువారు కోరిన హామీలకు చాలా తక్కువగానేవున్నవని కాంగ్రెసు వర్కింగుకమిటీవారభిప్రాయపడ్డారు. ఈప్రకటనలలో కొన్ని బ్రిటిష్ ప్రభుత్వముతో భారతదేశానికి భాగస్వామ్యమును ప్రతిపాదించినవి. దీనినికూడా కాంగ్రెసు వర్కింగుకమిటీ అంగీకరించజాలకపోయెను. బ్రిటిష్‌ప్రభుత్వమున్నూ భారత ప్రజకూగల సంబంధం దోపిడీ చేసేవారికీ దోపిడీ చేయబడుతూన్న వారికీ గల సంబంధమేనని వర్కింగుకమిటీ అభిప్రాయం. అయినప్పటికీ కాలపరిస్థితు

లనుబట్టి కొన్ని సంఘటనలనుబట్టి, గవర్నర్లు తమ ప్రత్యేకాధికారాలను వినియోగించడం తేలిక కాదని నమ్మవచ్చునని వర్కింగుకమిటీవారు భావించారు. కాబట్టి వార్ధాలో జూలై మొదటివారమున సమావేశమైన వర్కింగుకమిటీ వారీదిగువ తీర్మానం చేశారు.

"కాంగ్రెసు వారాహ్వానింపబడిన యెడల ఉద్యోగము పుచ్చుకోవచ్చునని నిర్ణయించి ఈ కమిటీ తీర్మానిస్తున్నది. అయితే కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో ఉదాహరింపబడిన పద్ధతుల ననుసరించి పనిచేయడానికి మాత్రమే ఉద్యోగాన్ని అంగీకరించి ఉపయోగించవలెననీ, ఒకప్రక్కను నూతన రాజ్యాంగ పట్టమును ప్రతిఘటిస్తూ మఱొకప్రక్కను కాంగ్రెసు నిర్మాణకార్యక్రమమును నిర్వర్తిస్తూ కాంగ్రెసు నీతికనుగుణంగా అన్నివిధాలా పనిచేయవలెననీ విస్పష్టం చేయడమే ఈ కమిటీ కోరిక" (కింద గీతగీచిన మాట గ్రంథకర్తవి.)

"ఈ నిర్ణయం చేయడంలో అఖిలభారత సంఘంవారి అండదండలు తమకు కలవనీ, ఈ తీర్మానము కాంగ్రెసు అ. భా. కాం. సంఘములు నిశ్చయించిన సాధారణ కార్యక్రమాన్ని కొనసాగించగలదనీ, వర్కింగుకమిటీవారి విశ్వాసం. అవకాశముంటే ఈ విషయంలో అ. భా. కాం. సం. వారి ఆదేశాన్ని ఈ కమిటీ సంతోషపూర్వకంగా స్వీకరించివుండేది. కాని తొందరగా ఇదమిత్థమని తేల్చవలసిన ఈ తరుణంలో యింకా నిర్ణయంచేయక జాగుచేయడం దేశక్షేమమునకు హానికరమనీ, ప్రజలమనస్సులలో కల్లోలంకలగడానికే కారణమవుతుందనీ ఈకమిటీ అభిప్రాయం."

## మంత్రులు, స్పీకర్లు, అడ్వొకేటు జనరలుల జీతాలు.

మార్చి 15-22 తేదీల మధ్య జరిగిన కాంగ్రెసు వర్కింగుకమిటీ ఈ దిగువ తీర్మానం చేసింది:—

నివాసమునకు వాహనమునకు ప్రభుత్వంవారు చేసే ఉచిత ఏర్పాట్లుగాక, మంత్రులు, స్పీకర్లు, అడ్వకేటు జనరలుల జీతాలు, పౌరుల ప్రధాన హక్కులనుగూర్చి, ఆర్థిక కార్యక్రమమునుగూర్చి కరాచీ తీర్మానంలో (1931) ఉదహరింపబడినట్లుగా నెలకు ఐదువందల రూపాయీలకు మించి ఉండరాదు. ఈ సమయంలో కొంతవరకు జాగ్రత్తగా పరిశీలించవలసిన రెండు సంఘటనలు తటస్థించినవి. మంత్రిత్వస్వీకరణంఅంగీకరింపబడినది. అది వర్కింగుకమిటీవారిచే అంగీకరించబడినది. ఈ తీర్మానం ఈవిధంగా

పరిణతిపొందడానికే యేదశలలో, యేయే చర్యలు కారణభూతములైనవో జ్ఞాపకం తెచ్చుకొంటే పుట్టుపూర్వోత్తరాలు బాగా అర్థంకావచ్చును. లక్నోలో (ఏప్రిల్ 1936), యిందుకు సంబంధించిన (తొమ్మిదో తీర్మానంలో) "పరిస్థితులే విధంగా పరిణామం పొందగలవో నిశ్చయంకానందున ప్రస్తుతం కాంగ్రెసు ఏనిర్ణయను చేయకుండా ఉండడం మంచిదని భావిస్తూన్నది." అని ఉదాహరింపబడినది.

అప్పుడొక ప్రణాళిక ప్రకటించబడునని వాగ్దానం చేయబడెను.

ఆ ప్రణాళికలోని మూడవపేరాలో "ఎన్నికలు జరిగిన తరువాత ఈ నిర్ణయం చేయడం మంచిదని అ. భా. కాం. సం. అభిప్రాయపడుతూన్నది. ఏమి నిర్ణయించి నప్పటికీ, కాంగ్రెసు నూతన చట్టమును నిరాకరించి దాని కార్యవిధానంలో సహాయనిరాకరణ మవలంబించడమే కాంగ్రెసు ఆదర్శం." (కింద గీటుగీచినమాట గ్రంథకర్తది.)

తరువాత అభ్యర్థుల నిర్ణయం జరుగవలసివచ్చింది. దానినిగూర్చి ఫైజుపూరు కాంగ్రెసు అధ్యక్షోపన్యాసంలో ఒక అర్థవంతమైన ప్రకటన చేయబడింది. అది యిది:-

"ఏలాగైనా సరే ఎన్నికలలో అధిక సంఖ్యాకులను గెలిపించుకోవలెననే రాజీ వైఖరి కొంత కనబడుతూన్నది. ఇది చాలా ప్రమాదకరమైన అపమార్గం. దీనిని నిరోధించి తీరాలి".

ఇవే ఆనాటి పరిస్థితుల పుట్టుపూర్వోత్తరాలు. వీటినిగూర్చి దాదాపు తుట్టతుదవరకూ అభిప్రాయభేదాలుండనే ఉన్నవి. మంత్రిత్వ స్వీకరణమునకు ప్రతికూలురు అల్ప సంఖ్యాకులుగా ఉండవచ్చునని అనుకొంటూన్నప్పటికీ, ఎన్నడూ ఆ విషయంలో ఎవ్వరూ వోట్లు తీసికొని ఉండలేదు. వర్కింగుకమిటి వారి నిర్ణయాన్ని ఆమోదించడానికి చాలాకాలానికి అనగా 1937 అక్టోబరు 30, 31 తేదీలలో అ. భా. కాం. సం. సమావేశమయింది. అప్పుడుకూడా "ఈ నిర్ణయం చేయడంలో వర్కింగుకమిటీవారి చర్య ఆమోదింపబడుతూన్నది" అని లాంఛనప్రాయంగా సంగ్రహమైన తీర్మానం చేయ

మంత్రివర్గాలు నిర్మింపబడిన విధానమూ పరిపాలనమూ నడుపబడుతూన్న పద్ధతీ కూడా కొన్ని అపోహలకు కారణములైనవి. వాటిని తక్షణం తొలగించవలసివుంది. కాంగ్రెసువాదుల ఉపన్యాసాలలో సంస్కరణలను ధ్వంసం చేయవలెననే కఠినమైన

భాష ఉపయోగింపబడుతూన్నప్పటికీ, కాంగ్రెసు మాత్రము కొత్త చట్టమును నిరాకరించవలెనని అంటూనూడా, చట్టాన్ని ప్రతిఘటించడమనే అభిప్రాయాన్ని అతిక్రమించి ఎన్నడూ పోలేదు. "నూతన చట్టమును నిరాకరించి, దాని కార్యవిధానంతో సహాయ నిరాకరణం చేయడమే కాంగ్రెసు ఆశయమని" అది అంది. కాబట్టి మంత్రివర్గాలకు ప్రతికూలంగా చేసిన విమర్శనలు చాలావరకు, కాంగ్రెసు తీర్మానములలో ఉపయోగింపబడిన మాటలను విమర్శకులు సరిగా అర్థంచేసుకోకపోవడం వలన తటస్థించినవే. అంతేకాక, ఉపన్యాసకులక్కడక్కడా ఉపయోగించిన మాటలలో పడిపోయి అప్పుడు వారి మనస్సులలో కలిగిన అభిప్రాయాలకు అనుగుణంగా అనుసరించడం కూడా దీనికి కారణం. హామీల తరువాత ఏమిజరిగిందో అధికారరీత్యా ఈదిగువ ఉదహరింపబడినది.

"వార్ధాలో వర్కింగుకమిటీ ఉద్యోగబాధ్యతను వహించవలసిందని చేసిన తీర్మానం తరువాత, కాంగ్రెసు అధిక సంఖ్యాకులుగాగల ఆరు రాష్ట్రాలలోని - అనగా బొంబాయి, మద్రాసు, సంయుక్తరాష్ట్రాలు, మధ్యరాష్ట్రాలు బీహారు ఒరిస్సాల లోని తాత్కాలిక మంత్రులు రాజీనామాలిచ్చారు. అందువలన ఆయా రాష్ట్రాలలోని గవర్నర్లు కాంగ్రెసుపక్ష నాయకులను నూతన మంత్రివర్గ నిర్మాణంలో తమకు సహాయ మొనర్చవలెనని ఆహ్వానించారు. గవర్నర్లమధ్యనూ కాంగ్రెసు నాయకులమధ్యనూ జరిగిన సంభాషణ సమాగమములు సంతృప్తికరముగా నున్నట్లు భావించడంచేత, నాయకులు మంత్రివర్గ నిర్మాణమున కంగీకరించి వారి సహచరుల పేర్లను గవర్నరుల కందచేశారు.

దానిఫలితంగా తరువాత ఈవిధంగా కాంగ్రెసు మంత్రివర్గాలేర్పాటుచేయబడినవి.

| రాష్ట్రం | మంత్రులు | పార్లమెంటరీ కార్యదర్శులు |
|---|---|---|
| బొంబాయి | 7 | 6 |
| మద్రాసు | 10 | 10 |
| సం. రాష్ట్రాలు | 6 | 13 |
| బీహారు | 4 | 8 |
| మధ్యరాష్ట్రాలు | 7 | .. |
| ఒరిస్సా | 3 | 4 |
| వాయవ్య సరిహద్దురాష్ట్రాలు | 4 | .. |

మంత్రులు, స్పీకర్లు, అడ్వొకేటు జనరలుల జీతాలు ఇదివరకొకచోట ఉదాహరింపబడినట్లుగా, నెల 1కి అయిదువందల రూపాయీలని వర్కింగుకమిటీచే నిర్ణయించబడింది. ప్రభుత్వంవారు వారికి ఉచితంగా ఇచ్చే వాహన, నివాసములిందులో చేరవు. ఊహించడానికి వీలులేనంత ఈ చిన్న మొత్తము 1931 ఏప్రిల్‌లోని పౌరుల ప్రధాన హక్కులు ఆర్థిక కార్యక్రమమును గూర్చిన కరాచీ తీర్మానము ననుసరించి నిర్ణయించబడింది.* ప్రపంచంలోని తదితర దేశాల వారవలంబిస్తూన్న జీతాల ప్రమాణమునుబట్టి వీటిని పోల్చిచూస్తే ఎంతో కౌతుకమూ ఎంతో పరిజ్ఞానమూ కలుగుతుంది. కాంగ్రెసు అవలంబించిన జీతాల ప్రమాణం తక్కువలోకి తక్కువ. కాంగ్రెసు ప్రభుత్వాలుకల ఆరు రాష్ట్రాలలోనూ నాలుగు రాష్ట్రాలకు మాత్రమే పార్లమెంటరీ కార్యదర్శుల నియామకం జరిగింది. అది అనుకోని చిక్కులకు కారణభూతమయింది. రాజ్యాంగంలో వారి స్థానమేమిటి ? మంత్రులు శాసనసభలలో కూర్చునివున్నప్పుడు వారి మంత్రులకు బదులుగా వ్యవహరించగలరా ? వారు తమ ప్రధాన కార్యస్థానములో నున్నప్పుడు ప్రభుత్వ కార్యదర్శులతోనూ, సంచారంలోవున్నప్పుడు జిల్లా ప్రభుత్వోద్యోగస్థులతోనూ ఎటువంటి సంబంధం కలిగివుండాలి ? వారి సిబ్బంది, వారి ప్రయాణపు బత్తాలు వారి సంచారంలో వెంటరావలసిన ఉద్యోగులు, వారి అధికారాలు - యివన్నీ చాలా చిక్కు సమస్యలుగా పరిణమించినవి. మూడవ తరగతి ప్రయాణం రోజుకొక రూపాయిబత్తా, చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శికి తప్ప తక్కిన వారివెంట గుమాస్తాగానీ, టైపిస్టుగానీ లేకపోవడం, శాసనసభలలో మంత్రులు లేకుండా ఉన్నప్పుడుమాత్రమే వారు వ్యవహరించవలెనని రూలింగీయడం, ఇవన్నీ కొంత అసంతృప్తికి కారణాలైనవి. కాని మనదేశంలో మన పరిస్థితుల కనుగుణంగా కాలక్రమేణా కొన్ని సంప్రదాయాలను స్థాపించుకోవడంతో ఈ చిక్కులను తొలగించుకోవచ్చును. బహుశా పార్లమెంటరీ శెక్రటరీలను చిన్న మంత్రులుగా (Junior Ministers) భావిస్తూ, పెద్ద మంత్రుల హోదాకు సరియైన హోదా వీరికిచ్చి, మంత్రివర్గం మాత్రం పెద్ద మంత్రులతోనే కూడివుండే ఆచారం పెట్టుకోవచ్చును. ఇంగ్లాండులో, పార్లమెంటరీ శెక్రటరీలకు నియోగింపబడిన పనులను మాత్రమే వారు నిర్వహిస్తూంటారు. భారత

* కారు ఖర్చులు, ఇంటి అద్దెలతోసహా పార్లమెంటరీ కార్యదర్శులకు మొత్తం రు 400 నెల 1కి ఈయడానికి ఆమోదించారు. మంత్రులకు ఇంటి అద్దెకింద నెల 1కి రు 100 లున్నూ, కారుకింద రు 150 లున్నూ ఆమోదించబడింది. కారులు ప్రభుత్వానివే.

దేశంలోని వివిధ రాష్ట్రాలవారు వివిధ విధానములను అవలంబించారు. కాంగ్రెసు ప్రభుత్వాలింకా కొంతకాలం యిక్కడ కొనసాగివున్నట్లయితే ఈ సమస్యలనే కాక ఇటువంటి చిక్కు సమస్యలనింకా అనేకం సరిగా పరిష్కరించివుండేవారు.

ఉద్యోగ స్వీకరణం జాతీయ జీవితంలో నూతన పరివర్తనం కలిగిస్తూవచ్చింది. కాంగ్రెసు వాదులకనేక విధములైన, అనేక తరగాల ప్రాముఖ్యతగల పరిపాలనానుభవములున్నవి. అయితే, బ్రిటనంత వైశాల్యమూ అంతే జనసంఖ్యాకలిగి, ఇటలీకిగానీ యుద్ధానికి పూర్వపు టర్కీకిగానీ మూడు రెట్లు, స్కాట్లండుకు అయిదు రెట్లు, స్విట్జర్లాండుకు పదిహేను రెట్లూ పరిమాణంగల రాష్ట్రాల పరిపాలనము మాత్రం వారికి కొత్త. ఇంగ్లాండు దేశంలోని ప్రజాపాలనపు పుట్టు పూర్వోత్తరాలు, మాగ్నకార్టా రూన్నిమీడ్ (Runaymeade) మైదానములలో బ్యారనుల పోరాటం, వోటింగు అధికారంలోకలిగిన క్రమాభివృద్ధి, 1869 నాటి విప్లవము అంతఃకలహాలు, వివిధ రాజ్యాంగ శాసనాలు, సంస్కరణచట్టాలు, ప్రజాస్వామ్య సంప్రదాయాల అభ్యుదయం, బ్రిటిష్‌వారు గొప్పగా చెప్పుకొనే పార్లమెంటరీ ఆచారాలు – ఇవన్నీ మన మంత్రులకు కరతలామలకం. కాని యిక్కడి మన మంత్రులు లిఖితపూర్వక రాజ్యాంగ శాసనానికి, నియమావళికి, నిబంధనలకు, స్టాండింగు ఆర్డర్లకు జి. వో. లకూ న్యాయస్థయలులకు, స్మృతి గ్రంథాలకు అనుగుణంగా నడుచుకోవాలి. రాజ్యాంగతంత్రం ఆమూలాగ్రంగా తెలిసినవారుకూడా శాశ్వత ప్రభుత్వాధికారుల అఘాతములకు గురికాకుండాఉండడం దుర్లభం. అసలు మంత్రులనిర్ణయంలోనే కొంతకష్టమున్నది. గవర్నర్లీ సందర్భంలో అవలంబించవలసిన విధానాన్ని గూర్చి విశాలంగా సూచిస్తూ ఒక పత్రం ఉన్నది. దానికి "ఇక్‌స్ట్రమెంటు ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్సు" అని పేరు. గవర్నర్లిచ్చిన "హామీ" లను బట్టి ఆ పత్రమును అక్షరశః అవలంబించవలసిన అవసరంలేదు. కాని అందులోని భావాన్ని అవలంబించడానికేమీ అభ్యంతరముండకూడదు. బాధ్యతాయుత ప్రభుత్వముయొక్క ప్రజాస్వామ్య నాయకుడుగానీ సమిష్టి బాధ్యతగల మంత్రివర్గముగానీ, శాసనసభలలో తమ యాజమాన్యంకింద నడవడానికి అంగీకరించిన భిన్న ప్రయోజనాలుగల వివిధవర్గాల ప్రతినిధుల అభిప్రాయాలను గమనించకుండా ఉండడం సాధ్యంకానిపని అంతేకాదు. అమెరికాలో పార్టీ ప్రభుత్వాలను నడిపినట్లుగా కాంగ్రెసుకు పార్టీ ప్రభుత్వాలను నడపవలెననే కోరిక యెన్నడూలేదు. అవి నీతికి తావలమైన అమెరికా రాజకీయ కక్షుల విధానాన్ని కాంగ్రెసు అవలంబించ

తలచుకోలేదు. అయినప్పటికీ కాంగ్రెసు మంత్రులకొక లోపం లేకపోలేదు. అందులో కొంతమందికి శాసనసభలలోనూ, ప్రభుత్వంలోనూకూడా కొంత అనుభవం ఉన్నది. కాని వారి అనుభవం పరిపాలనలోని చిక్కు సమస్యలను సమగ్రంగా గ్రహించతగినంత సన్నిహితమైనదని కానీ సర్వతోముఖమైనదని కానీ చెప్పడానికి వీలులేదు. అంతేకాక భిన్న ప్రయోజనాలు కలవారిని సంతృప్తిపరచాలి. పరస్పర విరుద్ధ ప్రతిపాదనలకు రాజీ కుదుర్చి సమన్వయం చేయాలి. ఎంతో కాలం ప్రవాసంలో ఉండి స్వగృహానికి పోయి నంత ఉత్సాహంతో ప్రభుత్వ కార్యాలయానికి మంత్రులు పోలేదు. నిజంగా వారు హిందూ కుటుంబాలలో అత్తవారింటికిపోయిన క్రొత్త కోడళ్లు తమ భర్తలతో నేగాక, అత్త మామలతోనూ, ఆడు బిడ్డలతోనూ, బావగార్లతోనూ మఱదులతోనూకూడా చక్కగా మెలగవలసిఉన్నట్లు, గవర్నర్లతోనూ, పదిమంది పర్మనెంటు శెక్రిటరీల తోనూ, పద్నాలుగుమంది ప్రభుత్వశాఖల ప్రధానోద్యోగులతోనూ మెలగవలసి ఉంది. వీరిలో చాలామంది ఐ. సి. యస్. ఉద్యోగులుకూడా. మంత్రివర్గమనే రైలు బండీ క్రొత్తగా యేర్పాటు చేయబడినప్పటికీ ఒక్క యింజనులు మాత్రమే సరిక్రొత్తవి. పెట్టెలన్నీ వట్టి పాతతుక్కు. కావలసినదానికంటెకూడా ఎక్కువ చులుకుగాఉండేవి బేరికులు మాత్రమే. బొగ్గు పాతది. బొగ్గు వేసేవాళ్లు నూనెవేసేవాళ్లు పనికి ప్రాల్మాలు తూండిరి. యంత్రంలోని బిగువువలన రైలు కదులుతూన్నప్పుడల్లా పెట్టెలన్నీ కట కటలాడడం ప్రారంభించినవి. ఇంజనులుకూడా సరాసరి తగినంతవేగంగా నడవలేక పోయినవి. [మోటారుకార్లు కొనుక్కొనేవాళ్లకు క్రొత్తలో త్వరగా నడిపించవద్దని కంపెనీలవారు చేసే సూచనలను చాలామంది గమనించేఉంటారు.] ప్రయాణీకులు కూడా గగ్గోలుపెట్టడం ప్రారంభించారు. ఈ క్రొత్త రైళ్లలో పెట్టెలన్నీ చల్లగా ఉంటవనీ, ఇంజనులు వేగంగా నడుస్తవనీ, బల్లలమీద దిండ్లు మెత్తగా ఉండి రైలు నడుస్తూన్నప్పుడు ఒక విధమైన ఊపిస్తూ ప్రయాణీకులకు హుషారు కలిగిస్తూంటవనీ ఊహించి ఉంటారు. కాని బీటాలోనీ XB ఇంజన్లవలె అతి భయంకరంగా పెట్టె లను తగిలించుకోవడం, దిళ్లలోపలి స్ప్రింగులు రైలు కదలినప్పుడల్లా గుచ్చు కొంటూండడం, అసలు రైలు పోయేదారే చదునుగా వుండకపోవడం, సిబ్బంది నియ మాలను అనుసరించడమనే పేరుతో రైలు సాగనివ్వకపోవడం, ఇదంతా చూస్తే ప్రయాణీకులు గోలకెత్తక ఏంచేస్తారు? శెక్రిటరీలు మాకు అపూర్వంగా సహాయం చేస్తున్నారని మంత్రులెంత శ్లాఘించినప్పటికీ ప్రజలకామాటలు విశ్వాసపాత్రములుగా

లేవు. మద్రాసులోని ఒక మంత్రి గవర్నరును మిత్రుడనీ, సచివుడనీ మార్గదర్శకుడనీ శ్లాఘించినప్పుడు, ప్రజల అసహ్యం నిజమైన కోపంగా పరిణమించింది.

అసలు సంగతి యిలావుండగా ప్రజల ఆశలు చూదామా అంటే ఆకాశాన్ని అంటుతూవుండినవి. శాసనసభల ఎన్నికలలో దాదాపు పెద్ద పెద్ద భూస్వాములంతా ఓడిపోయినారు. అందువల్ల అంతకుపూర్వమే ప్రజా సామాన్యంలో ప్రజ్వలితమైన విప్లవోద్యమ భావానికి మరింత ప్రోత్సాహం కలిగింది. జమీందారీలలోని రైతులు పాతకాలు పద్ధతులు పన్నుల విధానమూ పూర్తిగా సంస్కరింపబడవలెననీ, పూర్వ సంప్రదాయాలూ ఆచారాలూ పూర్తిగా నిర్మూలంకావలెననీ కోరుతూ వచ్చారు. భూమిపైన వత్తిడి తగ్గించాలనీ, ఋణాలను తీసివేయించాలనీ, వెంటనే మత్తు పదార్థాలదుకాణాలను రద్దు చేయించాలనీ, వ్యవసాయ విషయంలో నడమధ్యవువాళ్లను తొలగించాలనీ, భూములను కనిపెట్టుకొని వుండని భూస్వాముల కుండతగిన భూమి పరిమితిని నిర్ణయించవలెననీ, చట్టసమ్మతంకానివసూళ్లను రూపుమాపవలసిందనీ, అడవులకు సంబంధించి రైతుల కష్టాలను నివారించవలెననీ అటవీ సౌభాగ్యమును అభివృద్ధి చేయవలెననీ గృహపరిశ్రమలను భారీ పరిశ్రమలనూకూడా ప్రోత్సహించవలెననీ, పన్నులను సమంజసంగా విధించవలెననీ, విదేశీప్రభుత్వ ప్రయోజనములకోసంగాక జాతీయ ప్రయోజనముల కనుగుణంగా విద్యా విధానంలో మార్పు చేయవలెననీ, దేశీయ సంస్కారమును పునరుద్ధరించవలెననీ, గ్రామ పంచాయతీలను పునర్నిర్మించవలెననీ న్యాయ పరిపాలనము సమంజసంగానూ తొందరగానూ చౌకగానూ నిశ్చయంగానూ జరిగేటట్లు చూడవలెననీ, న్యాయస్థానములలోనే కాక, మానవుల అన్ని వ్యవహారములలోనూకూడా నోటితో అన్నమాటకు తొలినాటి విలువ, గౌరవ ప్రపత్తులనుకల్పింపవలెననీ, సత్యమును పునఃప్రతిష్ఠితంగా చేయవలెననీ, అహింసాప్రధాన సిద్ధాంతంపైన పౌరుల ధర్మాలనూ హక్కులనూ తిరిగీ సంస్థాపించవలెననీ, హరిజనులు మొదలైన నిమ్నజాతులవారి ఆర్థిక రాజకీయ సాంఘిక స్థితులను పెంపొందింప చేయవలెననీ, కార్మిక వర్గమే దేశంలో నిజమయిన పెట్టుబడిగా గమనించవలెననీ, ధనాన్ని ఆదర్శంగా గ్రహించక సేవను ఆదర్శంగా గ్రహించవలెననీ, గ్రామ పునర్నిర్మాణమును భారీగా సాగించవలెననీ -అనగాపోటీ వుద్దేశం లేకుండా సహకారోద్దేశంతో అన్ని పనులనూ, నడిపించవలెననీ మాత్రమే ప్రజలచేత ఎన్నుకోబడ్డ మంత్రులు తలపెట్టారు. అయితే ఈ పన్నులన్నీ అనుకొన్నంత

తేలికగాదు. ప్రతి విషయంకూడా ముందు జాగ్రత్తగా పరిశీలించవలసి వుంది. తరువాత ఆచరణ యోగ్యమైన కార్య విధానాన్ని నిర్ణయించుకోవాలి. ప్రజలలో ఆయా విషయాలను గురించి వున్న రాగ ద్వేషాలకు సమాధానం చెప్పాలి. సామాన్య జనంలో ఆర్థిక సాంఘిక మూల్యములనుగూర్చి అదివరకున్న అభిప్రాయాలకు మెఱుగుపెట్టి అభ్యున్నతి చేకూర్చాలి. యింతేకాదు ఆయా విషయాలనుగూర్చి ఆయా రాష్ట్రాలలో స్థానికంగా వున్న దురభిమానాలనుకూడా మంత్రులు గమనించాలి. దక్షిణ హిందూస్థానంలో హిందీ తప్పనిసరిగా చదివితీరవలెననే కార్యక్రమానికి వ్యతిరేకంగా ఆందోళన ప్రారంభమయింది. ఆదే రాష్ట్రంలో కమ్యూనిస్టులతో బహిరంగంగా చేతులుకలిపిన 'సోషలిస్టుల' నాయకత్వాన రైతుల తిరుగుబాట్లు జరుగుతూవచ్చినవి. ఈ తిరుగుబాట్లు చిన్న చిన్న కొట్లాటలుగా పరిణామం చెందినవి. ఈ 'కొట్లాటలే' బ్రహ్మాండమైన ఒక కార్మిక కర్షక విప్లవానికి దారి తీయగలవని వారి వాదం. దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ రాజకీయ ఖైదీలుండిరి. వారిలో కొందరు దౌర్జన్యం చేశారనే నేరాలకిందకూడా శిక్షింపబడినవారున్నారు. వారంతా కాంగ్రెసు ప్రభుత్వం తమను విడిపించగలదని ఎదురుచూస్తూ వుండిరి ముఖ్యంగా వంగ పాంచాల రాష్ట్రాలలో, అన్ని రాష్ట్రాలలోకంటెనూ ఎక్కువమంది రాజకీయఖైదీలుకలరు. ఆ రెండు రాష్ట్రాలలోనూ కాంగ్రెసు మంత్రులు లేరు. అందువల్ల రాజకీయ ఖైదీల విడుదల సమస్య క్లిష్టదశకు వచ్చింది. ఇవన్నీ ఇలా వుండగా రాజకీయ శాసనమును అనుసరిస్తూ కాంగ్రెసు పనిచేస్తూన్న విధానమునుగూర్చి వుద్దేశమునుగూర్చికూడా కాంగ్రెసుకు విరోధులైన విమర్శకు లనేకులు అనేకవిధములగు సంశయములను వెల్లడించసాగినారు.

భారతరాజ్యాంగ చట్టమున కనుగుణంగా పనిచేయవలెననే వుద్దేశంతో కాంగ్రెసు వుద్యోగస్వీకరణం చేయలేదని గాంధీ చెబుతూనే వున్నాడు. ఐతే ఆయన అదివరకు చెప్పిన మాటలకిది ప్రతికూలంగా లేదా అని ప్రతివాళ్ళూ అడుగుతూవచ్చారు. అవును. గాంధీ ముఖ్యంగా మనుష్యమాత్రుడు. ప్రధానంగా రాజకీయ నాయకుడు. కాని మనం నిత్యజీవితంలో చూస్తూన్న రాజకీయ నాయకులకూ ఈయనకూ చాలా భేదముంది. ప్రాపంచక వ్యవహారాల నాయన నిరంతరం ఆదర్శప్రాయములుగా నిర్వహిస్తాడు. ఆయన ఊహలు, వుపాయాలు, కార్యక్రమాలు అన్నీ వున్నతస్థాయిని వుంటవి. ఆయన అంతకుపూర్వం చెప్పిందికూడా ప్రతిష్టంభనములను ప్రతిపాదించవలెననికాదు. చట్టమును ఎదిరించి తుదముట్టించవలెనని కాంగ్రెసు చేసిన తీర్మానములు

చాలామందిలో - ప్రముఖులలో కూడా - చాలా అపోహలను కలిగించినవి. శాసన సభలలో మాటిమాటికీ కీచులాటలు, వాగ్యుద్ధాలు కనిపిస్తూ జరుగుతూంటవని వారి ఊహ. ఈ ఊహ ప్రకారం అక్కడ తగాదాలు ప్రతిష్టంభనలూ తప్ప మరేమీ జరిగే పనివుండదని తోచడం సహజం కాని అది మా వుద్దేశమే కాదన్నాడు గాంధీ. అలా కాకపోయినట్లయితే చట్టాని కనుగుణంగా కాంగ్రెసువారు నడుచుకొంటారని ప్రజలు సహజంగా భావించారు. కాంగ్రెసువారు చేయబోయే పనికి, పూర్వం మిత వాదులు చేసిన పనికీ, ఆనాడు తాత్కాలిక మంత్రివర్గంవారు చేస్తూవుండిన పనికీ యేమీ భేదంలేదని కూడా వారనుకొన్నారు వీరందరూ ఇండియాలోని బ్రిటిష్‌వారి ప్రయోజనాల కనుగుణంగా నడుచుకొన్నారు; నడుచుకొంటూన్నారు; అలాగే కాంగ్రెసు కూడా నడుచుకొంటుందన్నారు. కాంగ్రెసు పనిచేసే విధానమదికాదన్నాడు గాంధీ. భారతదేశపు దృక్పథం పడమరనుండి తూర్పుకు మార్చడమే కాంగ్రెసు వుద్దేశమన్నాడు. అనగా భౌతిక విషయాలనుండి ఆధ్యాత్మిక విషయాలకూ, నగరాలనుండి గ్రామాలకూ, యంత్రాలయాలనుండి కుటీరములకూ, యంత్రములనుండి హస్తకౌశలమునకూ, ధనసంపాదనమునుండి సేవాపరత్వమునకూ, పటాటోపం ఆడంబరములనుండి నిరాడంబరమునకూ నిస్వార్థపట్యమునకూ, సుర చక్రమునుండి రాట్నచక్రమునకూ భారత దేశపు దృక్పథం పరివర్తనం చెందాలని కాంగ్రెసు వుద్దేశాన్ని గాంధీ వివరించాడు. కాబట్టి చట్టాన్ని ప్రతిఘటించి తుదముట్టించడమనే పదానికి మామూలుగా పైకి కనిపించే అర్థంకంటె ఎక్కువ విశాలమూ గంభీరమూ అయిన అర్థంవుంది. భారత దేశముయొక్క 'జాతీయస్వరూపమే' సంపూర్ణంగా సంస్కరింపబడాలి. అప్పుడు భారతదేశము ఇంగ్లాండుదేశమునకు మొగసాలగా (out house) గాక, పటాటోపం లేని జాతీయ దృక్పథమూ, అంతర్జాతీయ భావమూగల స్వయంసంపూర్ణ దేశంగా వుంటుంది. గాంధీ వివరిస్తూవచ్చిన నిరాడంబరమైన దుస్తులు, పటాటోపంలేని జీవితం, వున్నతాలోచనము, మూడవతరగతి రైలుబండిలో ప్రయాణము, స్వార్థరాహిత్యము, పేదలసేవ, యివన్నీ ఆ నూతనాదర్శము ననుసరిస్తూ జాతీయలక్ష్యాన్నే చూర్పు చేయగలవు. బ్రిటిష్‌వారు నీకళ్ళయెదుటనే ఒకప్రక్కను స్వర్గసీమనూ మరొకప్రక్కను శ్మశానవాటికనూ ప్రదర్శిస్తూన్నారు ఒకవంక అయిదు అంకెలుగల పెద్దపెద్ద జీతాలు పుచ్చుకొనేవారు కనిపిస్తారు. ఇంకొకవంక అష్టదరిద్రులను చూస్తూంటాము. ఒకవైపున రాజప్రసాదాలు మరొకవైపున చుట్టుగుడిసెలు, పెద్దపెద్ద వణిగ్వీథులుగల నగరాలొక

చోట, పాడుపడిన కొంపలతో నిర్జనములైన బేచిరాకు గ్రామాలింకొకచోట. కనిపిస్తూంటవి. ఈ వ్యత్యాసములనే స్వర్గసీమలు శ్మశానవాటికలు అని మేము వాదుతూన్నాము. మీరు సినీమాలను చూడవచ్చును. కాని వాటిలోనే కాపురంవుండము, సినీమా తారలను మీరు చూడవచ్చును. కాని వారివలెనే మీభార్యలనుగానీ తల్లులనుగానీ తయారుచేయవలెనని కోరరు. కాబట్టి మన మంత్రులుకూడా పాత మూల్యములను త్యజించి క్రొత్తమూల్యములను అవలంబించాలి. ఇది జరిగినప్పుడు మన పాఠశాలలు తాగుడు ఆదాయముపైన ఆధారపడవలసినంత అధికవ్యయమునకు గురికావలసిన అవసరముండదు. తాగుబోతుల వ్యసనంపైననే కళాశాలలభివృద్ధి కావలసిన అగత్యం ఉన్నట్లయితే వాటిని మూసివేసినా మనం దుఃఖించవలసిన పని లేదని బహిరంగంగా అనుకొంటూన్న విషయమే. నీపిల్లల చదువుకోసం నీపొరుగు వాణ్ణి తాగుబోతుగా తయారుచేయడం అన్యాయం. కాబట్టి పాఠశాలలు స్వయం సహాయకములుగానుండి, కారాగారాలు నిజమైన సంస్కార మందిరములుగానూ వృత్తి విద్యాలయాలుగానూ పరిణమించినప్పుడు అవి ప్రభుత్వానికి సహాయకారులు కాగలవు. ప్రభుత్వం వాటికి సహాయం చేయవలసిన అవసరముండదు. కళాశాలలోనూ పాఠశాలలలోనూ ఉన్న ఆరు లక్షలమంది విద్యార్థులు రోజుకు రెండు గంటలు నూలు వడుకుతూన్న దృశ్యాన్ని ఊహించండి. కొండంత నూలు సముద్రమంత బట్టా తయారవుతుంది. పాఠశాలలు ప్రభుత్వానికి ఎంతో ద్రవ్యం చేకూర్చి పెట్టగలవు విద్యకు కావలసిన ఖర్చుకోసం తాగుడు పన్నును తద్వారా తాగుడునూకూడా తప్పనిసరిగా ప్రోత్సహించడంకంటే ఈ ఉపాయం ఉచితంగా తోచడంలేదా!

మన మంత్రులు అబూబక్రు, ఓమర్, హర్షవర్థనుల జీవితములవంటి జీవితములనుగానీ, సిద్దిక్, ఫరూకులవంటి జీవితములనుగానీ, నేటి వశిష్ఠుడో పరాశరుడో అనతగిన గాంధీ జీవితమువంటి జీవితములనుగానీ నడుపుతూన్నయెడల భారతదేశము తన పూర్వపుటౌన్నత్యమును పొందగలదు. హిందూదేశంలో, హిందూదేశంకోసం చేయబడే బ్రిటిష్ ప్రభుత్వమువారి శాసనములన్నీ, భారతీయ హృదయాని కనుగుణమైన పద్ధతిని, పునర్నిర్మింపబడగలవు ఒక్క రక్తబిందువు స్రవించవలసిన అవసరంకానీ, ఒక్క లాఠీ ప్రయోగం జరుగవలసిన అవసరంకానీ ఉండదు.

గాంధీజీ "రాజ్యాంగ చట్టాన్ని శాసనబద్ధంగా అమలు జరుపవలెనని" అంటారు- దాని అర్థమేమిటని కొంతమంది విమర్శకులు ప్రశ్నిస్తూన్నారు. దానికి ప్రత్యుత్తరం యిచ్చితీరాలి.

గాంధీజీ చెప్పిన మాటలివి;

ఈ రాజ్యాంగ చట్ట నిర్మాతలకు కలవనుకొనే ఉద్దేశాలను భగ్నం చేయవలె ననుకొని 3 కోట్లమంది వోటర్ల ప్రతినిధులు, తగినంత తెలివితేటలతో ఆత్మ విశ్వాసం కలిగి, తమ చేతులలోని అధికారమును [ఉద్యోగ స్వీకరణముతో సహా] విని యోగించినయెడల బ్రిటిష్‌వారి ఆశలు విచ్ఛిన్నం కావచ్చును బ్రిటిష్‌వారనుకొన్నట్లు గాకుండా ఈచట్టమును న్యాయశాస్త్రానుగుణంగా ఉపయోగించుకొగలిగినయెడలనూ వారి ఉద్దేశాల కనుగుణంగా ఉపయోగించక ఊరుకొన్నందువలననుగూడా ఈ పనిని తేలికగా సాధించవచ్చును.

"న్యాయ శాస్త్రానుగుణంగా" అనే మాటను చట్టంలోని సూత్రాల ననుస రించి దానిని ఉపయోగించుకోవడం తప్పుకాదనే అర్థంలోనే గాంధీజీ వాడిఉన్నాడు. అంతేకాని రాజ్యాంగ శాసనాన్ని 'తూ' 'చా' తప్పకుండా అమలు పరచవలెననే అర్థంలో ఆయన సలహా యిచ్చినట్లుగా భావించరాదు.

ఇంత గ్రంథం నడిచినప్పటికీ 258 సెక్షన్ క్రింద ఉద్యోగస్థులు గవర్నరుల ప్రత్యేక బాధ్యతగా పరిగణించబడడంతో నిజమైన చిక్కు తటస్థించింది. కొత్త మంత్రివర్గ నిర్మాణ సందర్భమున (జులై 13, 1937) వంగరాష్ట్ర గవర్నరుగారుచేసిన మహత్తరు ప్రకటననుబట్టి రాష్ట్రీయ గవర్నరుకూ, రాజుగారి సేవకులకూగల బాంధ వ్యం విస్పష్టం చేయబడింది.

"ఇంగ్లాండులోవలెనే ఇండియాలోకూడా, రాజుగారికీ, రాజుగారి సేవకులకూ గల సంబంధము ఎంత అకృత్రిమమో, అంత అస్పష్టం. ఈ నూతన విధానమున ఉద్యో గస్థుల భక్తి విశ్వాసముల విషయంలో పరస్పర సంఘట్టన మేర్పడుతుందని భావించ రాదు. అదే నేను గట్టిగా చెప్పదలచుకొన్నాను. దానికి కారణమేమంటే చట్టం ప్రకారం ప్రవర్తించే రాజ్యాంగ సలహాదారులకు వెనుక రాజుగారి యావత్తు అధికారమూ మద్దతుగా ఉంటుంది. ప్రభుత్వోద్యోగుల విషయంలో గవర్నరుకు ప్రత్యేక బాధ్యత ఉంటుందన్నమాట మీ కందరికీ తెలిసిందే కాని అంతమాత్రముతో శాంతి క్రమాలను [లా అండ్ ఆర్డర్] కాపాడే మంత్రిగారి బాధ్యత పోలేదు. ఈయన ఆధీనంలోఉన్న

యావన్మంది రాజుగారి సేవకులు, తమ సౌఖ్య సంరక్షణలకోసం ఆయనమీదనే ఆధారపడి ఉండాలి. ఆయన ద్వారానే గవర్నరుగారి వ్యక్తి ఆదరణకు పాత్రులుకావాలి. ఈ ప్రాతిపదికపైననే రాజుగారికీ రాజుగారి సలహాదారులకూ రాజుగారి సేవకులకూ మధ్య పరస్పర విశ్వాసం పెంపొందడానికి వీలుంది. క్రమ బద్ధమూ అభివృద్ధి దాయకమూ అయిన ప్రభుత్వం కావలెనంటే ఇటువంటి పరస్పర విశ్వాసం ఉండితీరాలి”.

అయితే వివిధరాష్ట్రాల కార్యవిధానములకూ పరస్పరం సమన్వయం చేయదగిన కేంద్రప్రభుత్వం లేకపోవడంచేత అత్యంత క్లిష్టదశ ఏర్పడింది. ఆర్థిక విధానాన్ని రాష్ట్రాలకు వేరుగానూ కేంద్రానికి వేరుగానూ ప్రత్యేకించడంవలననే ఎంతో కీడు కలిగింది. అదిచాలక శాసన వ్యవహారాలలో రాష్ట్రాలకూ కేంద్రానికీ గల అధికారాలను గూర్చి సందిగ్ధత ఏర్పడింది. 1908 నాటినుండీ మద్రాసు ఎస్టేట్సు ల్యాండు ఆక్టు చట్టంలో ఉండి అమలుజరుగుతూన్న విషయాలనే 1939 లో ఒరిస్సా - టెనెన్సీ చట్టంలో ప్రవేశపెట్టడం వ్యక్తుల హక్కులను అపహరించడమవుతుందా? సంయుక్త రాష్ట్రాల టెనెన్సీ చట్టం, మంత్రులు అధికారంలో ఉన్నంతకాలమూ గవర్నరు జనరలుగారి ఆమోదమును పొందలేదు సరికదా, తరువాత యుద్ధం ముగిసిన యేడాది వరకూ కూడా ఆయన ఆమోదమును పొందలేదు. ఒరిస్సా చట్టమును ఆయన అసలే నిరాకరించారు. మద్రాసులో చేయబడిన ఋణవిముక్తి చట్టం ఫెడరల్ కోర్టులో న్యాయసమ్మతిమా కాదా అని విచారింపబడి న్యాయసమ్మతమేనని తీర్మానింపబడింది. మద్యనిషేధ చట్టంలోని ఒకానొక నిబంధన చేయడానికి మద్రాసు ప్రభుత్వానికధికారం లేదని ఫెడరల్ కోర్టులో తీర్పుచెప్పబడింది. బొంబాయి మద్య నిషేధ చట్టంలో విదేశీలను గూర్చి చేయబడిన నిబంధనల విషయంలో బొంబాయి శాసనసభకు అధికారంలేదని బొంబాయి హైకోర్టు తీర్పుచెప్పింది. అదేవిధంగా ఋణాల మీదనూ, బరాతం చేయడానికిగానీ, అమ్మడానికీ కొనడానికీగానీ వీలైన యితర ప్రోనోట్లమీదనూ ( Negotiable instruments ) వడ్డీనిగూర్చి రాష్ట్రీయ శాసనసభలు చట్టం చేయవచ్చునా అనే విషయంలోకూడా కొన్ని చిక్కులేర్పడ్డవి. మామూలు ఋణాలనూ, అమ్మడానికీ, కొనడానికీ, విలియా వేయడానికీ వీలైన ప్రోనోట్లనూ, రెండు తెగలుగాచేసి ఒక తెగను రాష్ట్రీయ శాసనసభల అధికారం కిందనూ రెండవతెగను కేంద్రశాసనసభాధికారం కిందనూ ఉంచడమే ఈ చిక్కులు కలగడానికి ముఖ్యకారణం. ఈ సందర్భంలోనే, రాష్ట్ర శాసనసభలు ఋణవిముక్తి

చట్టం చేసేటప్పుడు బ్యాంకుల ఋణాలను ఆ చట్టంలోనుండి మినహాయించవలెనా లేదా అనే విషయంలో కూడా చిక్కు తటస్థించింది. బ్యాంకులు కేంద్ర ప్రభుత్వ వ్యవహారంగా వర్గీకరణం చేయబడడమే యిందుకు కారణం. హైకోర్టుల యొక్కయు ఫెడరల్ కోర్టు యొక్కయు నిర్ణయములకు లోబడిగానీ, లేక వాటితో నిమిత్తం లేకుండానైగానీ, కేంద్ర ప్రభుత్వానికీ రాష్ట్రీయ ప్రభుత్వాలకూ సమన్వయం చేయడానికి కాంగ్రెసు వర్కింగు కమిటీ ప్రత్యక్షంగాగానీ లేదా వారి పార్లమెంటరీ సబ్ కమిటీవారి ద్వారాగానీ పనిచేస్తూవచ్చింది. ఇందుకుగానూ పార్లమెంటరీబోర్డు లోని ముగ్గురు సభ్యులకూ రాష్ట్రాలు విభజింపబడినవి. వారిలోని ప్రతి ఒక్క సభ్యుడు తన యాజమాన్యం కిందనున్న రాష్ట్రాలలోని అర్జంటు వ్యవహారాలను వ్యక్తిగతంగా తానే పరిష్కరించవలసి యుండెను. ఆంతరంగిక పరిపాలనా వ్యవహారాలలో కాంగ్రెసు కార్యవర్గం తఱచుగా జోక్యం కల్పించుకొంటూన్నదని ముఖ్యంగా కొన్ని ఆంగ్లోఇండియన్ పత్రికలున్నూ కొంతమందిఉద్యోగస్థులున్నూ విమర్శనలుసాగించారు. చిట్టచివరకు భారతరాజ్యాంగ కార్యదర్శి, బ్రిటిష్ ప్రధాని కూడా విమర్శించారు. ఏ సందర్భాలలో కాంగ్రెసు వర్కింగు కమిటీవారు జోక్యంకల్గించుకొన్నారో ఉదాహరించడం కొంతసమంజసంగా ఉంటుందనుకొంటాం. నిజంగా అది కాంగ్రెసు వర్కింగు కమిటీ తనంతట తాను కల్పించుకొన్న జోక్యంకూడా కాదు. మధ్యరాష్ట్రాల ప్రధాన మంత్రి తాను రాజీనామా యిచ్చి మంత్రివర్గమును పునర్నిర్మాణం చేసినప్పుడు, హింసాయుతములైన నేరములకోసం శిక్షింపబడిన రాజకీయ ఖైదీలను యు. పి. బీహారు రాష్ట్రాల గవర్నర్లు విడుదలచేయ నిరాకరించగా ఆయారాష్ట్రాల మంత్రులు రాజీనామా యిస్తామని బెదరించినప్పుడు, ఒరిస్సా ప్రభుత్వంలోని యేదో ఒక శాఖకు ప్రధానోద్యోగిగా మంత్రులకింద పనిచేస్తూన్న ఒకనిని ఆ రాష్ట్రానికే గవర్నరుగా నియోగిస్తారని తెలిసి మంత్రులు రాజీనామా యిస్తామన్నప్పుడు, కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆయా మంత్రుల కోరికపైన జోక్యం కల్పించుకొన్నమాట నిజమే. ఈ సందర్భాలన్నిటిలోనూ కాంగ్రెసు వర్కింగుకమిటీ గట్టిగా పట్టుదలతో పనిచేయడంవలన కాంగ్రెసు ప్రభుత్వాల ఆత్మగౌరవం పెంపొంది వారి ఐకమత్యం అభివృద్ధి అయింది. కాని కాంగ్రెసు వర్కింగుకమిటీమీద విమర్శకూడా విచ్చలవిడిగా సాగింది. పార్లమెంటరీబోర్డుతో కూడిన కాంగ్రెసు వర్కింగుకమిటీవారు వివిధ రాష్ట్రాల వ్యవహారాలలో నిర్వర్తిస్తూవచ్చిన కార్యకలాపమునే, ఆయారాష్ట్ర కాంగ్రెసు సంఘాలుకూడా

ఆయా రాష్ట్రీయ ప్రభుత్వ వ్యవహారములలో కొద్ది పరిమాణంలో నిర్వహింపవలసి వచ్చింది. రాష్ట్రకాంగ్రెసు సంఘాల కార్యనిర్వాహణోద్యోగులు వివిధ శాసనసభా కాంగ్రెసుపక్షాల నాయకులుగానూ, మంత్రులుగానూ వ్యవహరిస్తూన్నప్పుడు, వారికి వోట్లుచేసిన ప్రజాబాహుళ్యమునకున్నూ ఆ మంత్రులకున్నూ ప్రత్యక్ష సంబంధమేర్పడింది. శాసనసభాభ్యర్థులను నిర్ణయించి వారి ఎన్నికలను నడిపిన జిల్లా రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములు, ప్రజల హక్కులను కాపాడడానికీ ప్రభుత్వమునకునూ తమకునూ మధ్యనున్న సంస్థలుగా భావింపబడుతూవచ్చినవి. అంతేకాదు మంత్రులకున్న అధికారాలు కొన్ని వీరికికూడా ఉన్నట్లు ప్రజలు భావిస్తూవచ్చారు. కాబట్టి ఎవరెవరికి యేయే కష్టాలు కలిగినా వాటిని నివారించుకోవడానికి జనం ఈ కాంగ్రెసు కమిటీలచుట్టూ మూగుతూవచ్చారు. రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాల స్థితి చాలా దుర్భరమయింది. కాంగ్రెసు సంఘాలు సర్వసమర్థములనీ అన్నిపనులూ వెంటనే నిర్వర్తించగలవనే నమ్మకంతో ప్రజలు వేలకొలదీ కోరికలతో వాటిని ముట్టడించడం, వారు నిరంతరం పనితో మునిగి తేలుతూన్న మంత్రుల దగ్గరకుపోయి ఈ నివేదికలందచేయడం చాలా కష్టమనిపిస్తూవచ్చింది ఇటువంటి పని పగవాడికైనా వద్దనిపించింది. సుస్థాపిత సంప్రదాయాలపైనను. న్యాయశాస్త్ర నిబంధనలపైననూ ఆధారపడిన సక్రమ ప్రభుత్వం స్వపక్షపక్షపాతంతో వ్యవహరించడానికి వీలులేదు. కాని అడుగునుండి అటువంటి పరిస్థితులు అభివృద్ధిపొందుతూన్నట్లు చిన్నెలు కనిపించినవి ఎడతెగని పనితో మునిగి తేలుతూన్న ప్రభుత్వానికీ, అంతులేని కోరికలతో అలమటిస్తూన్న ప్రజలకూ మధ్య రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు సమాధానం కుదర్చవలసివచ్చింది. ఒక్కొక్కప్పుడు పరిపాలనతో అనవసరంగా జోక్యం కల్గించుకొని అభివృద్ధికర కార్యములను అతి వేగంగా జరిగించవలెనని చేసే ప్రయత్నాలను కూడా నిరోధించవలసివచ్చేది. మఱొకప్పుడు అధికారము యెడల తగు గౌరవమునూ, న్యాయ్యమైనదృక్పథమునూ కనపరుస్తూ మంత్రుల సంస్కరణ కార్యక్రమాన్ని ద్విగుణీకృతవేగంతో జాగ్రత్తగా నడిపించడానికి మామూలు లాంఛనాలను మాన్పించి సజీవ ప్రభుత్వంలో ఉండవలసిన మానవత్వమూ, వ్యక్తిత్వమునూ ప్రదర్శించవలెనని కోరవలసివచ్చేది. ఇది అంత తేలికైన పనికాదు. అక్కడక్కడా ప్రత్యక్ష ప్రతిరోధక చర్యలుకూడా జరుగుతూవచ్చినవి. కార్యనిర్వాహణాధికారంతో జోక్యం కల్గించుకొన్న సందర్భాలు చాలావున్నవి. కొన్నిచోట కాంగ్రెసు సంఘాలు అయినదానికీ కానిదానికీ జోక్యం కల్గించుకొం

టూండడం చూచి వాటిని కాంగ్రెసు వర్కింగుకమిటీ వారు గట్టిగా మందలించవలసి కూడా వచ్చింది. ఇందుకూ కాంగ్రెసు కమిటీలకు కోపం కలిగినమాట వాస్తవమే. అయితేనేమి? ఆ క్లిష్టపరిస్థితులలో కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘమున్నూ దాని అధీన సంఘములున్నూ తమ తమ ధర్మాలను సక్రమంగానే నిర్వహిస్తూవచ్చినవి. ఈ సందర్భంలో, అ. భా. కాం. సం. నకు కాంగ్రెసు మంత్రివర్గమునకూగల సంబంధ బాంధవ్యములనుగూర్చి కాంగ్రెసు అధ్యక్షుడొక దీర్ఘమైన సందేశాన్ని జారీచేశాడు.*

మద్రాసు మంత్రివర్గ నిర్మాణంలో ఒక చిన్న సంఘటనం కొంత అలజడికి కారణమయింది. ఒక వ్యక్తి పై శాసన సభకు (కౌన్సిలుకు) సభ్యుడుగా ముందుగా నామినేటు చేయబడి, తరువాత 10 మంది మంత్రులలో ఒక మంత్రిగా చేయబడ్డాడు. గవర్నరు చేసిన నామినేషనును కాంగ్రెసువాది అంగీకరించవచ్చునా? పై శాసనసభలో నామినేటెడ్ సభ్యుడుగానున్న వ్యక్తి రాష్ట్రీయ మంత్రివర్గంలో ఒక మంత్రిగా నియోగింపబడడం బాధ్యతాయుత ప్రభుత్వ సంప్రదాయాల కనుగుణంగా ఉన్నదా? ఈ సందర్భాలన్నీ సమగ్రంగా యిక్కడ చర్చించడానికి తగిన ప్రాముఖ్యత ఈ సమస్యకు గలదనియే మా అభిప్రాయం

గవర్నరు తనంతట తాను నామినేటుచేసినదానికీ, ప్రధాన మంత్రి సిఫారసు మీద నామినేటు చేసినదానికీ కావలసినంత భేదముందని మొట్టమొదట ఒప్పుకొని తీరాలి. కలకత్తా లండను నగరాలవంటి పెద్ద పెద్ద మున్సిపల్ సంఘాలలో సభ్యులను ఎన్నుకొన్న పిమ్మట ఆ ఎన్నిక సభ్యులు ఆల్డర్ మెన్‌ను నియోగించుకొనే ఆచారముంది. అలా నియోగించుకోబడిన ఆల్డర్ మెన్ ఎన్నికకు నిలబడడానికి ఇచ్ఛకలవారు కాకపోవచ్చును. కాని వారి పరిణతబుద్ధినీ చిరానుభవమునూ కార్పొరేషనువారమూల్యంగా భావించవచ్చును. ఇటువంటి నియామకం, కార్పొరేషనులోని అధిక సంఖ్యాక పక్షంవారు, అనగా వారి నాయకుడు చేయవలసిఉంది. అలాగే సంప్రదాయమునుబట్టికానీ పూర్వాచారమును బట్టిగానీ, కౌన్సిలులోని రెండు స్థానాలకు అధిక సంఖ్యాక పక్షనాయకుడు - అనగా ప్రధాన మంత్రి యిష్టం వచ్చినవారిని నియోగించుటకు గవర్నరు వదలివేసెను. అప్పుడు శాసనసభా నాయకుడైన ప్రధాని తన యిష్టం ప్రకారం గౌరవనీయులు వయోవృద్ధులూ అయిన వారినిద్దరినీ, ఎన్నిక

* కాంగ్రెసు బులెటిన్ 7-27 అండ్ 32 పేజీలు డిశంబరు 1937.

లకు ఏ కారణంవల్లనో నిలబడడానికి యిష్టంలేని సమర్థులూ విజ్ఞానవంతులూ అయిన వారిని ఏరీ కోరీ తెచ్చుకొని గవర్నరు నియామకమునకు సిఫారసు చేస్తే తప్పేముంది? అసలు చట్టంలోనే అసహ్యకరమైన నామినేషను పద్ధతి ఉండడమే తప్పంటారా? అది వేరుసంగతి. ఈ అభ్యంతరకరమైన నామినేషన్ పద్ధతిని ప్రధాని వినియోగించుకోకూడదని సిద్ధాంతరీత్యా చేయబడే విమర్శకు తప్ప మరొక న్యాయమైన విమర్శకెక్కడా తావేలేదు. అయితే మనం మంత్రివర్గ నిర్మాణం చేయడానికి నిర్ణయించుకొన్నప్పుడు రాజ్యాంగ చట్టానికి అనుగుణంగా చేయబడే ఏపనినీ విమర్శించరాదు. "మహాజనాః పలాయన్తే మశకానాంతు కాకథా" అన్నట్లు ఈ చిన్న విషయాన్నిగూర్చి యింత విమర్శ కూడదు. అందులో కాలక్షేపంకోసం విమర్శిస్తూండే జనంనుండి యిటువంటివి వినబడుతూండడం అసలే న్యాయ్యంకాదు.

ఈ సరిక్రొత్త పరిస్థితులలో శాసనసభల వెలుపలనూ లోపలనూకూడా కాంగ్రెసువాదులు తమ కార్యక్రమానికొక నూతనరూపం కల్పించాలి. శాసనసభల వెలుపలనుండి పనిచేసే కాంగ్రెసువాదులు ప్రజలకు హితబోధకులుగా, మిత్రులుగా, మార్గదర్శకులుగా ఉండి, భూత వర్తమాన కాలముల నిజపరిస్థితులను అనుభవంలోకి తెచ్చుకొని, భవిష్యదాదర్శముల కనుగుణమైన ప్రణాళికలను తయారుచేసి కాంగ్రెసు మంత్రుల భారమును కొంతవరకు తగ్గించవలెనని పదే పదే హెచ్చరింపబడిరి.

కాంగ్రెసు రాష్ట్రీయ ప్రభుత్వంలోకి రావడంతోనే ప్రజా సామాన్యంలో ఒక విధమైన ధైర్యంకలిగి వారి కార్యకలాపంలో యేకీభావమూ చైతన్యమూ కనిపించినవి. దీనికి కారణం కాంగ్రెసు ప్రభుత్వంలో ప్రతిదీ సలక్షణంగా జరుగుతుందని ప్రజా సామాన్యముయొక్క నమ్మకం. కాని ఒక్క సంగతిమాత్రం మనమందఱమూ జ్ఞాపకముంచుకోవాలి. కాంగ్రెసు మంత్రివర్గంలోఉంటే ఉండవచ్చును. కాని ఇంకా సంపూర్ణాధికారంలోమాత్రం లేదు. ఒకవేళ కాంగ్రెసు అధికారంలో ఉన్నప్పటికీ శాసనసభలలోపల ఎంత విస్తీర్ణంగానూ ఎంత గాఢంగానూ కాంగ్రెసు తన కార్యక్రమాన్ని కొనసాగించవలసి ఉందో వెలుపలకూడా అదే విధంగా తన కార్యక్రమాన్ని సాగించవలెను. ప్రజా బాహుళ్యం న్యాయమైన ఆందోళనను ఎంత తీవ్రంగా సాగిస్తే అంత వేగంగానూ అంత బలిష్ఠంగానూ కాంగ్రెసు మంత్రులు తమ కార్యక్రమాన్ని కొనసాగించగలరు.

ఇందులో ఇంకొకసంగతికూడా ఉంది. పరిపాలనా వ్యవహారములనుగూర్చి కాంగ్రెసుయొక్క భావాలు చూచాయగా ఉన్నవేకాని అంత విస్పష్టంగా లేవు. అయితే పరిస్థితులనుబట్టికూడా అలా ఉండకతప్పదు. సుశిక్షితులైన ప్రభుత్వ కార్యదర్శులు అంతకుపూర్వమున్న శాసనాలను, నియమాలను, నిబంధనలను, ప్రభుత్వపుటుత్తరువులను వీటినన్నిటినీ అనుసరించి గట్టిగాజరిపి చూచినప్పుడుకాని కాంగ్రెసుతయారుచేసిన ప్రణాళికలుకానీ పథకాలుకానీ ఎంతవరకు ఉపయోగములో, ఎంతవరకు ఆచరణయోగ్యములుగానుండగలవో తేలదు. మన చిన్నచిన్న అనుభవాలలో యిటువంటి సంగతులనేకం చూస్తూన్నాము. కొంచెంఆలోచనాశక్తిగల మనిషి, ఏదైనాబ్యాంకులోనో ఇన్సూరెన్సు కంపెనీలోనో, సహకారసంఘంలోనో ఖద్దరు కేంద్రంలోనో డైరెక్టరుగా ఉండి ఒక కొత్త ప్రణాళికను సూచించినప్పుడు ఆయా సంస్థలలోనున్న కార్యదర్శులు నిజపరిస్థితులను 'తూ. చా'. తప్పకుండా నిరూపించగానే ఆ ప్రణాళిక ఎందుకూ పనికిరానిదిగా తేలిపోవడంకద్దు. చిన్నచిన్న సంస్థలలోనే ఇటువంటి అనుభవాలు కలుగుతూంటే, వివిధ సాంఘిక, ఆర్థిక, నైతిక సమస్యలకు సంబంధించి విశాల భూఖండమునకు వర్తింపచేయవలసిన పరిపాలనా వ్యవహారములలో ఇంకా ఎన్ని చిక్కులు తటస్థించగలవో మనం తేలికగా ఊహించుకోవచ్చును. ఒకపక్క గవర్నరుగారి ప్రత్యేకాధికారాలూ, మరోపక్క మనలో స్వతస్సిద్ధంగా ఉన్న బలహీనతా, చూస్తూ చూస్తూండగా ఇప్పుడే రామరాజ్యాన్ని స్థాపించవలెనని ప్రజాసమూహం ప్రదర్శిస్తూవున్న వేగిరపాటు, శాసనాలనూ నిబంధనలనూ, నియమాలనూ ఉదాహరించి ఆశాజనకములైన ప్రజాహిత కార్యక్రమాలకు అడ్డంకులు కల్పించే ప్రభుత్వ కార్యదర్శులు, ఈ అన్నిటిమధ్యనూ మంత్రుల పని సుకరంకాదు. ఎంతోకష్టం.

ఇంతవరకూ కాంగ్రెసు ఈ మార్గంలో ఏమీ పనిచేయలేదు. పరిపాలనా వ్యవహారాలలో ప్రాచీన మితవాద వర్గంవారికే ఎక్కువ దక్షతా అనుభవమూ ఉంది. 17 సంవత్సరాలనుండి కాంగ్రెసువాదులు అవిచ్ఛిన్నంగా ప్రభుత్వంపైన తీవ్రమైన పోరాటం సాగిస్తూ దండయాత్రచేశారు. వారు అంతకాలమూ అనేక త్యాగాలుచేసి దేశాన్ని సేవించారు. కాబట్టి వారికి ప్రభుత్వంవారు ప్రచురించే శ్వేతపత్రములనుకానీ బ్లూ బుక్కులనుకానీ, ఆదాయవ్యయపట్టీలపైన జరిగే చర్చలనుకానీ. మహాసభలూ ఉపసంఘాలూ తయారుచేసిన నివేదికలనుగానీ, శాసనసభా చర్చలనుగానీ సరిగాచదివి పరిశీలించడానికి సావకాశం లేకపోయింది. ఈసంగతి ఒప్పుకోవడానికి సిగ్గుపడనవసరములేదు. ప్రస్తుత క్లిష్టసమస్యలను సరిగా అర్థంచేసుకొని జాగ్రత్తగా పరిశీలించడానికి ఈ నగ్నసత్యాన్ని ఒప్పుకొని తీరాలి. అప్పుడే అవకాశమూ తీరికా ఉన్న

సమర్థులు కొంతమంది ఈపనికి పూనుకొని శాసనసభ్యులకూ మంత్రులకూ కూడా సహాయపడవచ్చును. కాంగ్రెసు నిర్మాణమును బలిష్ఠంగా చేయాలి. కడచిన యాభై సంవత్సరాలనుండీ చేసిన కృషిఫలితంగానే కాంగ్రెసు నిర్మాణం బలిష్ఠమై మనకు అపూర్వజయాన్ని చేకూర్చింది. కాంగ్రెసుయొక్క నిర్మాణ బలమువలననే మనకు జయము చేకూరడమున్నూ తక్కిన పక్షాలు అపజయం పొందడమున్నూ తటస్థించింది. కాంగ్రెసు నిర్మాణముయొక్క విస్తీర్ణతనుబట్టియే ఆ సంస్థ అనేక రాజకీయ పక్షాలలో ఒకటిగా భావింపబడక బ్రిటిష్ ప్రభుత్వంతో నిరంతర పోరాటం సాగిస్తూన్న ఏకైక సంస్థగా పరిగణింపబడుతూన్నది. ప్రతిగ్రామంలోనూ కాంగ్రెసు కమిటీ ఉండితీరాలనీ, కాంగ్రెసు కమిటీలేని గ్రామం దేవాలయం లేని గ్రామంగా పరిగణింపబడుతుందని ప్రచారంచేసిన రోజులున్నవి.

ఇండియాలోని అత్యధిక సంఖ్యాక జనులు నిశానీదార్లు. శాసనసభలకు వెలుపల నున్న కాంగ్రెసువాదులు వారికి మిత్రులుగా పనిచేయాలి. కాని వారా మూకప్రజ చెప్పిన మాటలన్నింటినీ చిలుకపలుకులులాగా అధికారులకు అప్పచెప్పేస్థితిలో ఉండ కూడదు. వారుచెప్పిన మాటలలో అవసరమైనవేవో, అనవసరమైనవేవో, నిజమేవో నిజం కానివేవో గ్రహించగల విమర్శన జ్ఞానం కలిగిఉండాలి ఈ సందర్భంలో ఉద్యోగస్థుల ప్రవర్తనను జాగ్రత్తగానూ నెమ్మదిగానూ పరిశీలిస్తూ ఉండాలి. అంతే కాని వారిని ప్రజాశత్రువులుగా భావించరాదు. ప్రజాక్షేమంకోసం వారితో స్నేహం చేసి ప్రజలకు వారికీ పరస్పర విశ్వాసం కలిగించేటట్లు చూడాలి. తమ అధికారపద్ధతులను విడిచిపెట్టడానికి ఉద్యోగస్థులకు కొంతకాలం పట్టేమాట నిజమే. కాని కాంగ్రెసువాదులెంత వినయవిధేయతలతో వారితో గౌరవంగా వ్యవహరిస్తే అంత తొందరగా అధికారులు తోవకువస్తారు. అయితే యింతకుపూర్వమున్న పరిపాలనా విధానంలో ఉద్యోగులకూ ప్రజలకూ సన్నిహిత సంబంధం లేకపోవడమే ఒక గొప్ప లోపం. ఈ నిరంకుశత్వం మారుమూలలనున్న గుమాస్తాలవరకూ కూడా వ్యాపించింది. జాతీయ స్వభావం మారిపోనంతవరకూ పైనుండి యెంత వత్తిడిచేసినా, యెంత అదుపాజ్ఞలలో ఉంచినా ఈ అవగుణం అంత తొందరగాపోదు. అనగా పైవారు కిందివారిని శిక్షిస్తామన్నంత మాత్రంతో లాభంలేదు. కిందివారిలోనే నైతికపరివర్తనంరావాలి. ప్రజలలోనూ ఉద్యోగస్థులలోనూ కూడా ఒకవిధమైన మర్యాదా ఆత్మగౌరవమూ పెంపొందాలి.

రాష్ట్రీయ వ్యవహారాలలోగానీ, యావద్భారత వ్యవహారాలలోగానీ, ప్రజలకు బాధ్యత కల్గించకపోవడం వలన వచ్చిన విషాదకర పరిస్థితి యేమంటే, గ్రామాల

లోని పెత్తనదార్లు తమ ఊళ్ళలో చిల్లర వివాదాలతోనూ హాస్య కేళులతోనూ కాలక్షేపం చేసుకొంటుండిన వారైనారు. చిన్న చిన్న పరిమిత ప్రదేశాలలో ఉత్పన్నమైన కక్షలు అవసరాన్ని మించి తీవ్రంగా పరిణమించడం సహజం. చిల్లర తగాదాలు పెచ్చు పెరిగి బ్రహ్మాండమైన సివిల్ క్రిమినలు దావాలుగా పరిణమించి చిట్టచివరకు కూనీల వరకూ ఆక్షేపలు పోతున్నవి. దెబ్బలాటలతో సంబంధంలేని దావాలలో చిక్కుకొని ఉన్నప్పటికీ గ్రామస్థులు తమ సమిష్టిభావాన్ని సహజసౌకర్యభావాన్ని కోల్పోయినారు. కాబట్టి ప్రస్తుతం గ్రామాలలోని సంఘభావమును పునరుజ్జీవింపచేయాలి. గ్రామపెద్దలద్వారా ఊళ్ళలోని తగాదాలన్నింటినీ పరిష్కారం చేయించాలి. స్థానికంగా ఉన్నవారు కావడంచేత అసలు విషయాలు వారికి సమగ్రంగా తెలిసి ఉంటవి.

ఇంతేకాక, యింతవరకూ ప్రభుత్వం వారిచే కేవలం అనుమానింపబడకపోయినా అంటరానివిగా భావింపబడుతూన్న సంస్థలలో పండలకొలదీ జాతీయ స్వచ్ఛందసేవకులు, శిక్షణపొంది నిర్మాణాత్మకమైన కార్యకలాపంలో నిరంతరం నిమగ్నులు కావాలి. మన దేశంలోని ఆసుపత్రులు కాని, శరణాలయాలు కాని, పారిశ్రామికశిక్షణాలయాలు కాని, కుష్ఠు చికిత్సామందిరములు కాని, తలిదండ్రులులేనిబిడ్డల వసతిగృహములు గాని, క్రిమినల్ సెటిల్‌మెంట్లు కాని, గుడ్డివాళ్ళకొరకూ చెవిటివాళ్ళకొరకూ, ఏర్పడినపాఠశాలలు కానీ-అన్నీ విదేశీ క్రైస్తవమిషనరీల దాతృత్వంపైన ఆధారపడి ఉండడమునుబట్టియే దేశీయుల నిస్సహాయత ఎంతవఱకు వేళ్లు పాతుకొనిపోయిందో స్పష్టపడుతూన్నది. ఈ పనులన్నీ యింతటినుండీ మన యువకబృందం నిర్వహించేటట్లు వారికి తగిన శిక్షణ యీయాలి. దేశంలో తటస్థించే అగ్నిప్రమాదాలను గానీ, వరదలు, ఉప్పెనలు, భూకంపాలు, కలువులు వల్లకలిగే కష్టాలనుగానీ నివారించేటందుకు మన యువతీ యువకులు పూనుకొనేటట్లు చేయాలి. మన విద్యాసంస్థలీ దృక్పథంతో విద్యార్థులను సుశిక్షితులనుగా చేయాలి. కాని అంతకుముందుగానే సంఘంలోని పెద్దలున్నూ కుటుంబ యజమానులున్నూ తమ బిడ్డల విద్యావిధానంలో ఈ మార్పులను కలిగించవలెనని అధికారులకు నచ్చచెప్పాలి. అంతేకాని అన్ని పనులూ మంత్రులే చక్కబెడతారని ఊరుకోకూడదు. రిజిస్ట్రారులో మనం తీసికొనిపోయిన దస్తావేజులను రిజిస్టరుచేసినట్లు, మన మంత్రులుకూడా, ఆలోచనా పూర్వకములైన మన అభిప్రాయాలను ప్రణాళికలనూ ఆచరణలోపెట్టడానికి ప్రయత్నంచేస్తారు. ప్రజలహక్కులు అవిచ్ఛిన్నంగా రక్షింపబడవలెనంటే వారు చాలా జాగరూకతతో మెలగాలి.

జైళ్ళలో జరుపబడిన చిన్నచిన్న సంస్కరణలకు మద్రాసు రాజధానికే కీర్తి దక్కింది. సంస్కరణలు చిన్నవైనప్పటికీ వాటి ప్రాముఖ్యత చాలాఉంది. చిత్తా

కర్షకములుగాకూడా ఉన్నవి. జైళ్ళలో పాకీపని కేవలం హరిజనులకున్నూ తదితర షెడ్యూల్డు తరగతులవారికిమాత్రమే అప్పజెప్పబడుతూండేవి. ఇప్పుడలా చేయకూడదని మద్రాసులోని కాంగ్రెసుప్రభుత్వం నిషేధించింది కులాల పటుత్వం సంఘంలో క్షీణించిన చాలాకాలం తరువాతకూడా, బ్రిటిష్‌ప్రభుత్వంవారుమాత్రం వాటి బిగువు తగ్గిపోకుండా ఉండడానికి తన ప్రభుత్వ సంస్థలద్వారాగానీ, ప్రభుత్వంతో సంబంధం గల తదితర సంస్థలద్వారాగానీ చాలా కృషిచేస్తూ వచ్చారు. బ్రిటిష్‌ప్రభుత్వ చరిత్రలో ఇది ఒక వింత పరిస్థితి. రైల్వేహోటలులలో కులాలవారీగానే భోజనాలు చేయవలెనని గానీ, జైళ్ళలో హరిజనులూ, ఏనాదులుమాత్రమే పాకీపని చేయవలెనని కాని బ్రిటిష్ ప్రభుత్వంవారు నిబంధన చేశారంటే దాదాపు అపనమ్మకంగా ఉంటుంది. కాని మొదటి విషయంలో కొంతవరకు 1941 లో ఇండియా గవర్నమెంటున్నూ రెండవ విషయంలో 1937 లో మద్రాసులోని కాంగ్రెసు ప్రభుత్వమున్నూ పరిహారం కల్పించగలిగినవి.

కాంగ్రెసు మంత్రులుండిన రాష్ట్రాలలో నిర్వహించిన కార్యకలాపములను గూర్చి, సంస్కరణలనుగూర్చి వివరాలు ప్రత్యేకం మరొకచోట ఉదాహరింపబడినవి. కాంగ్రెసు మంత్రులతోకూడిన రాష్ట్రాలలో అస్సాం రాష్ట్రంకూడా కలిసిందనీ, సింధు రాష్ట్రం కేవలం కాంగ్రెసు రాష్ట్రాల అడుగుజాడలలో నడుస్తూన్నదనీ 1939 వ సంవత్సరంలో ఒకానొకప్పుడు, ఇండియాలోని 11 రాష్ట్రాలలో 8 రాష్ట్రాలు కాంగ్రెసు ప్రభుత్వాలు కలవనికానీ లేక కాంగ్రెసు చిత్తవృత్తి కలవిగా వ్యవహరిస్తూన్నవనికానీ చెప్పడానికి సావకాశం కలిగింది. తొలీగా మంత్రిత్వ స్వీకరణం అంగీకరింపబడినప్పుడు త్వరలోనే సంయుక్త మంత్రివర్గాలు ఆచరణలోకి వస్తవని కొంత మంది జోశ్యంచెప్పినారు. కాని అప్పుడే ఆ జోశ్యం దురాగ్రహపరులుచేసే వికృత విమర్శగా తృణీకరింపబడింది. ఈ విమర్శలను తృణీకరించడంలో చూపబడిన తీవ్రత తృణీకరించిన వారి దృఢవిశ్వాసమును మాత్రమే ప్రతిబింబింపచేసింది. కాని రాజకీయ రంగంకూడా చదరంగం, పేకలవంటిది. ఏయే పరిస్థితులలో ఏ ఎత్తులు, ఎత్తవలసి వస్తుందో, ఏయేపొత్తులు కల్పించుకోవలసివస్తుందో ముందుగాచెప్పలేము. అదేవిధంగా అస్సాములో 8 మంది మంత్రులున్నా ప్రధాని ఒక్కడే కాంగ్రెసు మంత్రి. ఈ సంఘటనం, వంగరాష్ట్రంలో సంయుక్త మంత్రివర్గ నిర్మాణానికి ప్రథమంలో కాంగ్రెసు కార్యవర్గం అంగీకరించలేదన్న అసంతృప్తిని ఇంకా ఎక్కువగా రేకెత్తించింది. కాని తరువాతి సంఘటనలనుబట్టి తొలిచర్యలను విమర్శించ పూనుకోవడం న్యాయంకాదు. కాంగ్రెసుయొక్క పలుకుబడీ, అధికారమూ హెచ్చినకొద్దీ దానికి కొన్ని కష్టాలుకూడా కలుగుతూవచ్చినవి. మిల్లులు-మిల్లుకూలీల సందర్భంలో రేకెత్తిన అభ్యుదయ భావ

పరంపరలు ప్రజాహృదయంలో ఆశాజ్యోతిని ప్రజ్వలింపచేయడమేకాక అతి వేగంగా అనేక సంఘటనలకు దారి తీసినవి. ఇక్కడా అక్కడా అనే విచక్షణ లేకుండా ప్రతి చోటా జరిగిన సమ్మెలే ఆ సంఘటనలకు ప్రత్యక్ష సాక్ష్యములు. కాంగ్రెసుమంత్రుల కళ్లయెదుట అనేకసార్లు పోలీసులూ సిపాయీలూ తుపాకులను కాల్చవలసి వచ్చింది. దక్షిణ హిందుస్థానంలో కాంగ్రెసు మంత్రివర్గం పనిచేసిన 27 నెలలలోనూ మూడుసార్లు తుపాకులు కాల్చబడినవి. అదే చాలా ఎక్కువనిపించింది. సంయుక్త రాష్ట్రాలలో అదేకాలంలో 47 సార్లు సైనికదళం పిలువబడ్డది. దక్షిణ ఇండియాలోని మూడు పర్యాయముల కాల్పులూ దానిముందు దిగదుడుపు అనిపించింది. అయితే సంయుక్త రాష్ట్రాలలో మిలిటరీ సహాయం కేవలం పక్కను నిలబడి, అవసరం వచ్చినప్పుడు ప్రయోగించడానికి మాత్రమే పిలువబడిన సంగతి గమనించాలి. దక్షిణ ఇండియాలోని చిట్టివలసలో ఒక సమ్మె జరిగింది. కూలీలు మిల్లులో కూర్చొని కదలమన్నారు. విచారణకొక అధికారుల ఉపసంఘం నియమింపబడింది. ఇన్స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు ఒక రెవిన్యూబోర్డు సభ్యుడూ, లేబరుకమీషనరూ అందులో సభ్యులు. ఆవిచారణలో కలెక్టరు పొరపాటు నిర్ణయంచేసినట్లు తేలింది. ఆయన ఆంగ్లేయుడు. ఆయనను వాల్తేరు నుండి అంతకన్నా చల్లని ప్రదేశమైన ఉదకమండలానికో, దక్షిణభారత నందనవనమనదగిన మలబారు జిల్లాకో లేక దాని తరువాత మంచిజిల్లా అనతగిన బళ్ళారికో బదిలీ చేయడమే ఒక శిక్షగా సూచింపబడినది. రాష్ట్రీయ స్వపరిపాలనములో ఉద్యోగులకు సంబంధించిన ఈ గుణపాఠం, భారతరాజ్యాంగ చట్టమునుగూర్చి దేశంలో వ్యాపించిన ఆశలనూ ఆపోహలనూ ఋజువుచేయడానికి సకాలంలో అనుభవానికి వచ్చింది. కాంగ్రెసు పరిపాలనా ప్రారంభదశలోనే దక్షిణ ఇండియాలో ఐ. పి. సి. 124 A శెక్షనుకింద ఒక రాజద్రోహపు కేసు పెటబడింది అదిచూచి కాంగ్రెసువారు నిర్ఘాంత పోయినారు. కాని కలకత్తాలో జరిగిన 1928 అక్టోబరునాటి అ. భా. కాం సం సమావేశంలో, ముద్దాయి ప్రోత్సాహంవల్లనే ఆయన ఉపన్యాసం ఎక్కువ ప్రచారంలోకి రాగా అంతకుపూర్వం ప్రజా సమూహంలో ప్రజ్వలించిన రోషం కొంతవరకు తగ్గింది. ప్రధానమంత్రి స్వయంగా మందలించిన తరువాత ముద్దాయి తన ఉపన్యాస ధోరణిలో కొంతమార్దవం చూపినందుకు ప్రజాభిప్రాయం హఠాత్తుగా తిరిగీ రోషపూరితమయింది. ఈ సంఘటనంలో రాజభక్తి రాజద్వేషమూగాక, హింసా, అహింసలు ప్రాముఖ్య స్థానము వహించినవి. ఈ రెండింటికీగల వ్యత్యాసం జాగ్రత్తగా గమనికతో గుర్తించబడింది. కాంగ్రెసు ప్రభుత్వాలు తమ రాజధానులలో దౌర్జన్య ప్రేరణమును సహించరాదని అంగీకరింపబడింది. బ్రిటిష్ రాజుకింద శాంతిక్రమాలను నెలకొల్పడమనేపేరుతో

చిరకాలంనుండి పరంపరాగతంగా స్వసంప్రదాయములను పెంపొందించుకొన్న మేజ స్ట్రేట్ల చేతులలో యిటువంటి వ్యవహారాలను విడచివేయడంకంటె శిక్షా స్మృతిని తగినట్లుగా మార్పుచేయడం మంచిదని నిర్ధారణ చేయబడింది. ఒక మూలనుండి మరొక మూలకు రైతుయాత్రలు జరిగించడం మూలకంగా ప్రజాసామాన్యంలో ముఖ్యంగా జమీందారీ ప్రదేశాలలో కలిగిన చైతన్యమూ, మిల్లులలో సమ్మెలు, రైతుల సభలూ తరువాత ప్రారంభింపబడిన మూక సత్యాగ్రహమూ-యివన్నీ కాంగ్రెసు మంత్రులను ఊపిరాడకుండ చేసినవి.

కార్మిక శాసనమును ప్రారంభించి, పూర్తిచేసినదొక్క బొంబాయిరాజధానియే. మొట్టమొదట ఒక కార్మికోపసంఘం యేర్పాటుచేయబడింది. తరువాత ఆలోచించి ఒక కార్మిక శాసనాన్ని బొంబాయి శాసనసభవారంగీకరించారు. కాని బొంబాయి కార్మికులలోని ఒక వర్గమునకీ శాసనము నచ్చలేదు. కాని నిజంగా సంయుక్త రాష్ట్రంలోని సంఘటనలు చాలా విషాదకరములు. అక్కడ మతకలహాలూ యితర రకాల దొమ్మీలుకూడా చాలా జరిగినవి. అందువల్ల సైనికదళాలను అనేక పర్యాయములు పిలువవలసివచ్చెను. ఇటువంటి కల్లోలసమయాలలో, క్లిష్టదశలలో, నూతనానుభవములలో సంయుక్త రాష్ట్రాల కాంగ్రెసు ప్రభుత్వం నిర్మాణాత్మక కార్యక్రమాన్ని కొనసాగించ వలసివచ్చింది మొట్టమొదటగా కాంగ్రెసు చిత్తవృత్తిగల శాసన సభలన్నీ, 1935 నాటి భారతరాజ్యాంగ చట్టం ప్రజాభీష్టమునకు భిన్నంగానూ, భారతీయుల పరాధీనతనూ అవిచ్ఛిన్నంగా చేసేదిగానూ వారికి పూర్తిగా అసంతృప్తిదాయకంగానూ ఉందిగనుక, ప్రజాపరిషత్తు వెంటనే స్థాపింపబడవలెనని తీర్మానించినవి. బొంబాయి రాష్ట్రంలో శాసనోల్లంఘన ఫలితంగా వేలంబడిన భూములను ప్రభుత్వంవారు తిరిగికొని, ఉద్యమంలో వాటిని కోల్పోయిన పట్టాదారులకుగానీ వారి వారసులకుగానీ ఉచితంగా యిచ్చివేశారు. దీనిని ఒక అత్యుత్కృష్ట సంఘటనమని చెప్పవలెను. ఇతర రాష్ట్రాలలోవలెనే ఇక్కడకూడా అనేకమంది రాజకీయ ఖైదీలు విడుదలచేయబడ్డారు. వివిధ రాజకీయ సంస్థలపైననూ, నిషేధములు తొలగింపబడినవి. పత్రికలనుండి తీసుకొన్న ధరావతులు అన్నీ కాంగ్రెసు ప్రభుత్వాలూ యిచ్చివేసినవి. ఉచితమైన సందర్భాలన్నిటిలోనూ పుస్తకాలపైననూ సినిమా చిత్రములపైననూ నిషేధములు తొలగింపబడినవి. కార్మిక నాయకులపైనకల నిరోధపుటుత్తరువులను రద్దుచేయడమేగాక, కార్మిక శాసనములను సంసిద్ధపరచడంకూడా జరుగుతూవచ్చింది. మద్రాసురాజధానిలో తొలి రోజులలోనే రైతులను ఋణవిముక్తులనుగా చేయవలెననే ప్రయత్నాలు ప్రారంభమైనవి.

మొట్టమొదట వ్యవసాయ ఋణస్థులపైన ఏవిధమైన చర్యా కొంతకాలంవరకూ ఏకోట్టూ తీసికోకుండా నిలిపివేయవలెనని ఏర్పాటు చేయబడింది. తరువాత వెంటనే ఋణాలను చాలవరకు తగ్గిస్తూ శాసనం చేయబడింది. తరువాత మద్యనిషేధం మంత్రుల దృష్టిని ఆకర్షించింది. ఈవిషయంలో ప్రతి మంత్రివర్గమూ ప్రత్యేకమార్గాల ననుసరించింది. మద్రాసురాజధాని ముందుగా కేంద్రములోగాక చుట్టూ ఉన్న ప్రదేశాలలో ఈ నిషేధాన్ని అమలుపరచవలెనని తలంచింది. బొంబాయిరాజధాని ముందు ప్రధాన నగరమైన బొంబాయిలోనే ఈపని ప్రారంభించింది. ఎంతకాలంనుండో ఎదురు చూస్తూన్న సంస్కరణ ఒకటి దక్షిణ ఇండియా జైళ్ళలో అమలులోకి వచ్చింది. ఖైదీలకు మజ్జిగ సప్లయిచేయడం చాలా అవసరమైన సంస్కరణమిక్కడ. ఇతర చోట్లవలెనే ఇక్కడకూడా ఖైదీలు విడుదలచేశారు. కాని మాప్లా దుండగముల చట్టమును (Moplah Outrages Act) రద్దుచేయడం మహద్విషయం. 1920 సహాయ నిరాకరణంలోనూ, 1930 శాసనోల్లంఘన సందర్భంలోనూ, రాజీనామాలిచ్చిన ప్రభుత్వోద్యోగులకు తిరిగీ వుద్యోగాలీయడం కాంగ్రెసు ప్రభుత్వం నిర్వహించిన ఉత్కృష్ట కార్యం. జమీందారీ ప్రదేశాలలోని రైతుల పరిస్థితులనుగూర్చి విచారించుటకు శాసనసభ్యులనుండి ఒక వుపసంఘం నియమింపబడడం, తక్కువసంగతికాదు. ఆ కమిటీ అచటి పరిస్థితులను ఆమూలాగ్రంగా చర్చిస్తూ ఒక వుద్గ్రంథమనదగిన సమగ్ర నివేదికను తయారుచేసింది. 1939 అక్టోబరునెలలో కాంగ్రెసు మంత్రులు రాజీనామా యిచ్చిన కారణాన అందులోని సిఫారసులను అమలు జరపడానికి వీలైనదికాదు కాంగ్రెసు నిర్మాణకార్యక్రమమున కత్యంత ప్రయోజనకారిగా పరిగణింపబడే ఖాదీనీ, వడుకు నూలునూ అభివృద్ధిచేయడానికి రెండులక్షల రూపాయీలను విరాళమీయడంలో మద్రాసు మంత్రులు చాలా ధైర్యం చూపించారు. చేమగ్గపు బట్టలుగాక తదితరవస్త్రములను అమ్మే వర్తకులకు లైసెన్సులు అవసరమని నిర్ణయించడం చేనేత పారిశ్రామికుల రక్షణకు మొదటిమెట్టుగా వుద్దేశింపబడింది. కొన్ని సమ్మెల సందర్భంలో సమాధాన సంఘములు నియోగింపబడినవి. వైద్యవృత్తి, ప్రజారోగ్యము- ఈరెంటినీ పునర్నిర్మాణము చేయడానికి మద్రాసులో సంకల్పింపబడింది. ఆసుపత్రులలో గౌరవ వైద్యులు (Honorary Medical Officers) మగదాదులు (Male Nurses) నియోగింపబడ్డారు. మున్సిపాలిటీల జిల్లాబోర్డుల ఎన్నికలలో రంగుపెట్టెల వోటింగు విధానం ప్రవేశపెట్టబడింది.

సంయుక్తరాష్ట్రాలలోని ఆరుగురు మంత్రులలో ఇద్దరున్నూ 13 మంది పార్లమెంటరీ కార్యదర్శులలో ముగ్గురున్నూ మహమ్మదీయులే. ఇద్దరు పార్లమెంటరీ కార్య

దర్శులు నిమ్నజాతులకు చెందినవారు. రైతుల కష్టనివారణమునకు తగిన మార్గాలను అన్వేషించడానికి రెండు వుపసంఘాలు నియోగింపబడినవి. కౌలుదారులను తొలగించడానికి తెచ్చిన దావాలను నిలిపివేయవలసిందని వుత్తరువు లీయడంచేత వారికి తక్షణ పరిహారం లభించింది. రెండవ వుపసంఘంవారు గ్రామస్థుల ఋణనివారణోపాయములనుగూర్చి విచారణ ప్రారంభించారు. కాన్పూరులో అనేక సమ్మెలు జరిగినవి. మంత్రులు సకాలంలో జోక్యం కల్గించుకొని యజమానులకూ, కూలీలకూ సమాధానం కుదిర్చారు. మధ్యరాష్ట్రాలలో అనేక సంస్కరణము లుద్దేశింపబడినవి అయితే అడవులపైన హక్కులనుగూర్చి కొన్ని సంస్కరణలు చేయబడినవి అడవిజాతులవారి కొఱకు పాఠశాల లేర్పాటుచేయబడినవి. రాష్ట్రంలో ప్రధానమైన పరిశ్రమలయందే ప్రభుత్వ శాఖలవారు ప్రత్యేక పక్షపాతం కలిగి వుండవలెనని నిర్ణయించబడింది. రాష్ట్రంలో ఆర్థిక వాణిజ్య పరిస్థితులను పరిశీలిస్తూ ఒక సుప్రసిద్ధ నివేదిక తయారు చేయబడింది. చిన్న చిన్న పట్టాదార్ల శిస్తులలో నూటికి 12½ వంతున రాష్ట్రమంతటా శాశ్వతంగా తగ్గించబడింది. ఋణసమాధానసంఘాలు స్థాపించబడినవి. క్లబ్బులకు లైసెన్సులిచ్చేటట్లు, విదేశీ సారాదుకాణాలను తగ్గించేటట్లు, యితర చోటులలో దేశీయ సారాదుకాణాలను తగ్గించేటట్లు సారా ఖరీదు కొద్దిగా హెచ్చించేటట్లు సూచనలు చేయబడ్డవి. ప్రభుత్వనిర్మాణముల (Public Works) విషయంలో ప్రభుత్వభవనములపైన పెట్టుబడులు చాలావరకు తగ్గించబడినవి. "అన్ని శాసనాలకూ నియమాలకూ" వ్యతిరేకంగా ఎక్కడనయితే సాగుపడిరేట్లు ఎక్కువగా వున్నవో అక్కడల్లా ఆరేట్లను తగ్గించి ప్రభుత్వం క్లిష్టపరిస్థితులను తొలగించింది. ఇంతకుపూర్వం విద్యాసౌకర్యము లేవీ లేని 24,000 గ్రామాలలో విద్యామందిర ప్రణాళిక ప్రకారం విద్యాలయా లేర్పాటు చేయబడినవి వీటన్నిటినీ మించి ప్రత్యేక స్థానమీయదగిన మహద్విషయం మఱొకటున్నది. వంగరాష్ట్రంలో కాంగ్రెసు మంత్రులు లేరు. అన్ని రాష్ట్రాలలోకంటెనూ ఆ రాష్ట్రంలోనే ఎక్కువమంది రాజకీయఖైదీలు డిటెన్యూలు ఉన్నారు. గాంధీ ఆవిషయంలో జోక్యం కల్గించుకోవలసి వచ్చింది. ఆయన ఆరోగ్యం సరిలేదు. రక్తపుపోటు (Blood Pressure) హెచ్చుగాఉంది. అయినప్పటికీ 25 అక్టోబరు మొదలు 15 వ నవంబరు వరకూ దాదాపు మూడు వారాలు ఆయన కలకత్తాలోనే ఉన్నారు. వంగరాష్ట్ర మంత్రివర్గంతోనూ గవర్నరుతోనూ ఆయన దీర్ఘంగా సంభాషణలు సాగించారు. ఆయన అనేకమంది మాజీ డిటెన్యూలనూ తదితర రాజకీయ ఖైదీలనూ కలుసుకొన్నారు. కలకత్తానుండి తిరిగివచ్చేటప్పుడు హిజ్లీ కాంసెంట్రేషన్ క్యాంపుకుపోయి అక్కడి 16 మంది స్టేటుఖైదీలతోనూ రెండు

గంటలు మాట్లాడినారు. బెంగాలు ప్రభుత్వమువారిప్పుడు 1,100 మంది డిటెన్యూలను విడుదల చేయవలసిందని ఉత్తరువులిస్తూ ఒక ప్రకటనను జారీచేశారు.

"తక్కిన డిటెన్యూలు 450 మంది కంటె ఎక్కువలేరు. వారిలో ఎక్కువ మంది క్యాంపులలోను, జైళ్ళలోనూ ఉన్నారు. కొద్దికాలంలోనే వారి కేసులను ప్రభుత్వంవారు విచారించదలచుకొన్నారు. గాంధీగారు ప్రతి డిటెన్యూను తెలుసుకొంటానని వాగ్దానం చేశారు. ఆపని వారు నాలుగు నెలలలో పూర్తిచేయగలరున్నారు. ఈ సందర్భంలో ప్రభుత్వంవారాయనకు అన్ని అవకాశాలూ కల్పిస్తారు. డిటెన్యూలను వ్యక్తిగతంగా చూచిన పిమ్మట గాంధీగారెవరి విషయంలో సంతృప్తికరమైన హామీలను ఈయగలరో వారిని తక్షణం విడుదలచేయగల స్థితిలో అప్పుడు ఉండగలదని ప్రభుత్వం ఆశిస్తూన్నది. ఈలోగా ప్రభుత్వంవారు కొందరు వ్యక్తుల సందర్భంలో కొన్ని నిర్బంధాలనుసడలించేవిషయం ఆలోచిస్తూన్నారు. అందువలన ప్రయోజనం కలిగినట్లయితే పూర్తిగా విడిచివేయగలరు.

రాష్ట్రంలో అహింసా వాతావరణమును కాపాడడం అత్యంతావశ్యకమని గాంధీజీ విస్పష్టం చేశారు. కాని వంగరాష్ట్ర ప్రభుత్వంవారు మాత్రం వఱొకతరహా పదజాలాన్ని ప్రయోగించారు. "ప్రభుత్వంవారు రాజకీయ ఖైదీలను క్రమ క్రమంగా విడుదల చేయదలచుకొన్న విధానం ప్రజల సహకారం పైనను, ప్రజాభిప్రాయమునకు మార్గదర్శకులుగా ఉండేవారు. విధ్వంసకోద్యమమును ప్రోత్సహించని వాతావరణమును కాపాడడంపైననూ ఆధారపడి ఉంది. ప్రభుత్వంవారీ సందర్భంలో వాడిన "విధ్వంసకోద్యమములనే" మాటలు "దౌర్జన్యయుతములైన చర్యలకుగానీ, దౌర్జన్యమును ప్రోత్సహించడానికుద్దేశించబడిన చర్యలకుగానీ మాత్రమే" భావింపబడినట్లు గాంధీజీ తన ఆశా విశ్వాసములను ప్రకటించాడు.

## 1937 – సంగ్రహచరిత్ర

1937 అనేక సంఘటనలతో కూడిన చారిత్రాత్మక సంవత్సరం. ఆసంవత్సరంలో కాంగ్రెసు మహాసభ జరుగలేదు. కాని ఒక అర్ధ శతాబ్దంలో జరుగవలసిన అభివృద్ధి ఆ ఒక్క యేడాదిలోను జరిగింది. కాంగ్రెసు ఆకస్మికంగా మంత్రివర్గ నిర్మాణమును పూనుకొన్నప్పుడు, ఆ కార్యక్రమం జాతీయ సంస్థాతోరణమునకు మకుటాయమానంగా పరిణమించింది. అంతకుపూర్వం అలవాటైన అసహాయోద్యమ మార్గా

ద్వారా పొందవలసిన అభ్యుదయరీతిలో పరివర్తనం కలిగింది. కాని సహకారం చేయవలసిన తరుణమింకా రాలేదు. రాజ్యాంగచట్టంలో ఫెడరేషనుకు చెందిన భాగమును అమలులో పెట్టడానికి కాంగ్రెసుయొక్క ప్రతికూలభావం ఎంతమాత్రమూ తగ్గలేదు. కాంగ్రెసువారు మంత్రివర్గ నిర్మాణముకావించిన కొలదికాలంలోనే ఆ ప్రతికూల భావం తగ్గుతుందని బ్రిటిష్ ప్రభుత్వం వారూహించారు. ఫెడరేషనును ఆచరణలోకి తీసుకొని రావలెనని బ్రిటిష్ ప్రభుత్వం చేస్తూవుండిన ప్రయత్నాన్ని భారతప్రజను ధిక్కరించడంగా కాంగ్రెసు భావించింది. వివిధరాష్ట్రీయ కాంగ్రెసు సంఘములకు, స్థానిక కాంగ్రెసు సంఘములకు ప్రజాసామాన్యమునకు రాష్ట్రీయ ప్రభుత్వాలకూ మంత్రివర్గములకూ ఈ ఫెడరేషను మన నెత్తిపైన పడకుండా నిరోధించవలెనని ఆదేశించింది. 1935 చట్టంలో వుద్దేశించబడిన ఫెడరేషనుకు వ్యతిరేకతను ప్రకటిస్తూ లాంఛనంగా శాసనసభలలో తీర్మానములను ప్రతిపాదించవలెనని రాష్ట్రీయ ప్రభుత్వములకు ప్రత్యేకంగా ఆదేశములు పంపబడినవి.

ప్రముఖ సమస్యయైన ఫెడరేషను విషయమలా ఉండగా, భారతీయప్రజకూ బ్రిటిష్ ప్రభుత్వమునకూ మధ్యనున్న తదితర వివాద విషయములుకూడా కాలానుగుణంగా రావలసిన నిజమైన సహకార భావమునకు అడ్డంకులు కలిగిస్తూవచ్చినవి. అందులో ముఖ్యమైన విషయం, ఇండియాలోనూ అండమానులలోనూ ఉన్న క్యాంపు జైళ్ళలోనూ తదితర కారాగారములలోనూ వేలకొలదీ డిటెన్యూలు విచారణలేకుండా పడివున్నారు. అండమాను ఖైదీలు, హింసలో తమకిదివరకున్న విశ్వాసం పోయిందని ప్రకటిస్తూ గాంధీగారికి తంతివార్త పంపిన తరువాతకూడా వారిని అక్కడకానీ మరొకచోటగానీ నిరోధించడంలో ఏమీ న్యాయంకానీ ఔచిత్యంకానీ లేదని గాంధీయున్నూ కాంగ్రెసున్నూ ఎవరికోసం ప్రబల ప్రయత్నాలు చేస్తున్నారో వారికి తోడు, ఈదిగువ వర్గములకు చెందినవారుకూడా ఉన్నారు. వారి నేరములు హింసాయుతములు కావడంచేత కొంత చిక్కు కలిగింది. అయినప్పటికీ వారి విషయంకూడా తక్షణం విచారించతగినదే. దేశాంతర్గతులైనవారు కూడా ఉన్నారు. వారినిగూర్చి అ. భా. కాం. సం. ఈదిగువ తీర్మానంచేసింది.

"రాజకీయ కారణాలచేత దేశాంతరములకు పంపబడిన వారిపైనగల నిర్బంధాలనూ నిరోధాలను వెంటనే తొలగించవలెనని అ.భా.కాం.సం. వారు ఇండియా ప్రభుత్వమును కోరుతూన్నారు. అట్టివారిలో ఈ కిందివారుకూడా కలరు:— శ్రీయుత వీరేంద్రనాధ చటోపాధ్యాయ, డాక్టర్ అవనీముఖర్జీ, శ్రీయుత మహేంద్రప్రతాప్, శ్రీయుత

పాండురంగ సదాశివఖంకోజీ, సర్దార్ అజిత్‌సింగు, మౌల్వీ ఒబీదుల్లా, మౌల్వీ అబ్దుల్లాఖాన్, డాక్టర్ తారకనాథదాస్, కాజీ అబ్దుల్‌వాలీఖాన్, శ్రీయుత వసంత కుమారరాయి, శ్రీయుత పృథ్వీసింగ్, లాలా హరదయాల్, శ్రీయుత రసవిహార్‌బోస్, దేశాంతరాలలోనున్న భారతీయులు తిరిగీ మాతృదేశానికి వచ్చేపక్షంలో తమ స్వాతంత్ర్యమునకు భంగంకలుగునని భయపడేవారందరికీ, వారిండియాకు తిరిగి వచ్చి నప్పుడు వారి పూర్వపు చర్యలకు నిర్బంధచర్య యేమీ తీసికొనబడదని అందరికీ ఒక హామీ ఈయవలెనని కూడా ఈ కమిటీ వారభిప్రాయపడుతూన్నారు".

అఖిల భారతదేశంలోని కార్మిక సమస్యలకు తగినంత ప్రాముఖ్యత యిదివరకు కాంగ్రెసు ఇచ్చియుండలేదు. అహమ్మదాబాదు నగరంలో ఒక శాశ్వత పరిపాలనా సంఘంతో అవర్ణపాత్రియమైన కార్మిక సంస్థ ఒకటి నిర్మింపబడినమాట నిజమే. కాని ఈసంఘంలోని వ్యక్తులకున్నంత ప్రతిష్ఠగల వ్యక్తులు తదితర ప్రదేశాలలోని సంస్థల పరిపాలకవర్గంగా లభించడం దుస్సాధ్యమయింది. అంతేకాదు భారతదేశపు పత్తి పరిశ్రమకు ప్రధాననగరంగా భావింపబడే అహమ్మదాబాదు నగరంలోని మిల్లు యజమానులవలె తక్కినచోట్ల మిల్లు యజమానులు అంత అనుకూలురైనవారుకారు. దీని ఫలితమేమంటే కార్మికవర్గాన్ని కూడగట్టేపని కమ్యూనిస్టులకు వదలివేయపడింది. లేదా వారి వారి సొంతకారణాలనుబట్టి అక్కడక్కడా కొంతమంది కాంగ్రెసు సేవకు లాపనికి ఉత్సాహంతో పూనుకొన్నారు. కాని కాంగ్రెసు మంత్రివర్గ స్వీకరణము కావించినవెంటనే ఈ ముఖ్య విషయాన్ని నిర్లక్ష్యం చేయడానికి వీలులేకపోయింది. బొంబాయిరాష్ట్రంలో ముఖ్యంగా ఈసమస్య జాతీయ జీవితంలో అత్యంత ప్రాముఖ్య స్థానం వహిస్తూన్నది. ఇంతకుపూర్వం కాంగ్రెసుచే నియోగింపబడిన లేబరుకమిటీవారు తమ కృషిఫలితంగా సమగ్రమైన కార్మిక సంస్కరణ ప్రణాళికను తయారుచేయగలిగిరి. అఖిలభారత కాంగ్రెసు సంఘం 1937 అక్టోబరు నెలలో దానిని అంగీకరిస్తూ ఈదిగువ తీర్మానం చేసింది.

## కార్యక్రమం

వివిధరాష్ట్రాలలోనూ ఒకేవిధమైన కార్యాచరణకు సావకాశం కలిగేటట్లు ఈసభ ఈదిగువ కార్యక్రమాన్ని అవలంబించవలెనని వివిధ రాష్ట్రీయ ప్రభుత్వా లకూ సిఫారసుచేస్తూన్నది. వివిధ విషయాలను గురించి విచారణచేసి పరస్పర సమాలోచనలను జరుపుకొని 1938 జూన్ 30 వ తేదీలోగా సూచనలను పంపవలెనని కూడా ఈసభ తీర్మానిస్తూన్నది.

(౧) లెక్కలను (Statistics) సుకరంగా తయారుచేయడాని కవసరమైన శాసనము ప్రవేశపెట్టవలెను.

(౨) నియమబద్ధం కాని సంస్థల విషయంలోకూడా ఫ్యాక్టరీస్ చట్టాన్ని విస్తరింప చేయవలెను.

(౩) కొన్ని ఋతువులలోమాత్రమే పనిచేసే ఫ్యాక్టరీల సందర్భంలో ఫ్యాక్టరీస్ చట్టమును యింకనూ ఎక్కువ కఠినముగా అమలుపఱచవలెను.

(౪) పిల్లతల్లులకూ, గర్భిణీ స్త్రీలకూ (Maternity Benefit) ఎనిమిది వారాలవరకూ మాతృత్వ ప్రయోజనమును (ఇదివరకది లేని రాష్ట్రాలలో), ప్రవేశపెట్టవలెను.

(౫) నియమబద్ధమైన పరిశ్రమల విషయంలో సరియైన జీతాలు ముట్టుతూన్నవో లేవో విచారించవలెను.

(౬) పనిని మార్పించుకోవడానికి హక్కుండవలెను.

(౭) జబ్బుగానున్న రోజులలో జీతంపైన సెలవీయవలెను.

(౮) కనీసపు జీతమును నిర్ణయించేటందుకుతగిన శాఖ ఉండవలెను.

(౯) తగాదాలను పరిష్కరించేటందుకుకూడా తగిన సంస్థ ఉండవలెను.

(౧౦) శాంతియుతము ధర్మబద్ధమూ అయిన పద్ధతులను అవలంబించే ట్రేడియూనియనులను, యజమానులూ ప్రభుత్వంవారుకూడా అంగీకరించవలెను.

(౧౧) కార్మికులకు గృహవసతులను కల్పించవలెను.

(౧౨) ఋణాలను చాలావరకు తగ్గించే యేర్పాట్లు చేయవలెను.

(౧౩) పనిచేసే గంటలను నిర్ణయించవలెను.

(౧౪) జీతంమీద ఈయవలసిన సెలవులను నిర్ణయించవలెను.

(౧౫) ఉద్యోగభీమా యేర్పాట్లు చేయవలెను.

(౧౬) కార్మికులను సరిగా చూచేటందుకు పరిశ్రమలకు ప్రభుత్వం సహాయంచేయడంలో కొన్నిషరతులను యేర్పాటు చేయవలెను.

ఈపై విషయాలలో సాధ్యమైనన్ని ఎక్కువ విషయాలనుగూర్చి రాష్ట్రీయ ప్రభుత్వాలు పరిపాలనా సంబంధమైనట్టియూ శాసన సంబంధములైనట్టియూ చర్యలను జరుపవలెనని ఈ మహాసభవారు తీర్మానిస్తూన్నారు.

## సమిష్టి సమావేశము.

కాంగ్రెసు కార్మిక మంత్రులప్పుడప్పుడూ సమావేశమవుతూ వచ్చే యెడల అన్ని రాష్ట్రాలలోను ఒకే కార్య విధానమునూ, కార్యక్రమమునూ అవలంబించడానికి సహాయకారిగా ఉండగలదని ఈ సమిష్టి సమావేశం అభిప్రాయ పడుతూన్నది. కాంగ్రెసువారు నియమించిన కార్మికోపసంఘ సభ్యులున్నూ, కాంగ్రెసు కార్మిక మంత్రులున్నూ, వారి పార్లమెంటరీ కార్యదర్శులున్నూ, కార్మిక కార్యక్రమమును అప్పుడప్పుడూ పరిశీలించేటందుకు సమావేశం కావలెననికూడా ఈ సభవారభిప్రాయ పడుతూన్నారు. కాంగ్రెసు కార్మికోపసంఘమువారు కూడా ఈ దిగువ తీర్మానములను చేసి కాంగ్రెసు మంత్రుల ఆలోచనకు పంపుకొని ఉన్నారు.

కార్మిక సమస్యతో సమానమైనదని గానీ, అంతకంటెనూ ఎక్కువైనదని గానీ చెప్పదగి కాంగ్రెసు ఆలోచించదగిన సమస్య మఱొకటున్నది. అది అల్పసంఖ్యాకుల సమస్య. 1931 లో లండనులో జరిగిన రెండవ రౌండు టేబిలు మహాసభనుగూర్చి పాఠకులకు జ్ఞాపకం ఉండవచ్చును. ఆనాడు రామ్సేమాక్డనాల్డు యిచ్చినతీర్పున్నూ, గాంధీజీ 1932 సెప్టెంబరులో ప్రపంచాన్ని కల్లోలపఱచే ప్రాయోపవేశమునకు పూనడమున్నూ, తరువాత ఆరురోజులకు హరిజనులను తిరిగీ హిందూసంఘంలో చేర్చడమున్నూ లోకం విస్మరించిఉండదు. సమిష్టి నియోజకవర్గము ఏర్పాటుచేయబడిన యెడల హరిజనులు సాధారణ నియోజకవర్గములలోకిచేర్చబడుతారనీ, అంతేకాక, బ్రిటిష్‌ప్రధాని ఏర్పాటు చేసిన ప్రత్యేకనియోజకవర్గములవలన,అనాదినుండికలసి మెలసి అవిచ్ఛిన్నమైనసంబంధం గల హిందూసంఘంనుండి, హరిజనులు వేరుచేయబడరాదనీ కాంగ్రెసు ఉద్దేశించింది. బ్రిటిష్ ప్రధాని నిర్ణయం, చాలావరకూ హిందూసంఘము యొక్క చిత్తప్రవృత్తిలో మార్పు చేకూర్చిందికూడా. ఈ సంగతులన్నిటినీ సర్వతోముఖంగా గ్రహించ గలిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ, బ్రిటిష్ ప్రధానియొక్క నిర్ణయమును ఔననికానీ కాదని కానీ చెప్పలేదు. కాబట్టి ఈ విషయం కాంగ్రెసు నిర్ణయమునకు వదిలివేయబడింది భారతజాతియొక్క భూతభవిష్యత్ ద్విషయములను అర్థం చేసుకొనిన తరువాత 1937 అక్టోబరు నెలలో కలకత్తాలో సమావేశమైన అ. భా. కాం. సం ఈ దిగువ తీర్మానం చేసింది.

"భారతదేశంలోని అల్పసంఖ్యాకుల హక్కుల విషయంలో హృదయపూర్వకంగా అవలంబించబోయే విధానమునుగూర్చి కాంగ్రెసు పదే పదే ప్రకటిస్తూ వచ్చింది. భారతజాతీయ జీవితమునకు ముఖ్యావసరములైన, ఆర్థిక,

రాజకీయ, వైజ్ఞానిక విషయములలో అత్యంతం. ఈ అల్పసంఖ్యాకులు పొగ్గొనే టందుకు వీలుకలిగించడమూ వీరి అభ్యుదయమునకు అత్యంత విశాలమైన సావకాశం కల్పించడమూ వీరి హక్కులను రక్షించడమూ తన విస్యుక్తధర్మమని కాంగ్రెసు భావిస్తూన్నది. అఖండ స్వతంత్రభారతదేశమే కాంగ్రెసు ఆదర్శం. స్వతంత్రభారతంలో, ఒకవర్గం మరొకవర్గాన్నీ ఒకమతా మరొకమతానూ, అధికసంఖ్యాకులు అల్పసంఖ్యాకులనూ, తమ స్వప్రయోజనాలకోసం వినియోగించుకొనే సావకాశం ఉండదు. జాతీయ జీవితంలోని అన్ని శక్తులూ (Elements) భారత ప్రజానీకముయొక్క సమిష్టి అభ్యుదయంకోసమూ శ్రేయస్సుకోసమూ ఏకీభావంతో సహకరించగలవు. సమిష్టి స్వాతంత్ర్యంకోసం పరస్పర సహకారమును సంఘీభావమును కలిగివుండవలెననీ ఈ ఉద్దేశానికి, అర్థం. భారతజాతీయ జీవితంలోని వివిధ సంస్కారములనూ, విభిన్న దృక్పథములనూ ఏదోవిధంగా అణచివేయవలెనని కాదు. వ్యక్తులకుగానీ సంఘములకుగానీ, వారివారి అభిరుచులనుబట్టి, సామర్థ్యములనుబట్టీ స్వాతంత్ర్యము సావకాశమూ కల్పిస్తూ వాటిని రక్షించడమే ఆశయం.

కాంగ్రెసు కార్యవిధానమునకు అపార్థాలు కల్పించే ప్రయత్నాలు జరుగుతూన్నందున తిరిగీ తన విధానమును అఖిల భారత కాంగ్రెసు సంఘం పునరుద్ఘాటిస్తూన్నది. కాంగ్రెసుయొక్క పౌరసత్వములనుగూర్చిన తీర్మానములో ఈక్రింది హక్కులుకూడా చేర్చబడుతూన్నవి.

(౧) తన అభిప్రాయమును స్వేచ్ఛగా ప్రకటించే హక్కు ప్రతి పౌరునికీ ఉంది. సమావేశ స్వాతంత్ర్యమూ సంఘ స్వాతంత్ర్యమూ కూడా ఉన్నవి. శాంతియుతంగా, ఆయుధములులేకుండా చట్టమునకూ నీతికీ విరుద్ధంగాని పద్ధతిని సమావేశంకావడానికి ప్రతి పౌరునకూ హక్కున్నది

(౨) ప్రతి పౌరుడూ ప్రజా వ్యవస్థకు, నీతికీ, భంగంకాని పద్ధతిని, తన మతము ప్రకారం ఆచరించడానికిగానీ, మాట్లాడడానికిగానీ తన అంతరాత్మకు అనుగుణంగా వర్తించేటందుకుగానీ హక్కున్నది.

(3) వివిధ భాషాప్రయుక్త ప్రదేశాలయొక్కయు, అల్పసంఖ్యాకులయొక్కయు, భాష, లిపి, సంస్కృతీ సంరక్షింపబడవలెను.

(౪) కుల, మత, లింగభేదములతో నిమిత్తంలేకుండా చట్టము అందటి పౌరులకూ సమానంగా వర్తిస్తుంది.

(౫) ప్రభుత్వోద్యోగముల విషయంలోగాని, అధికారముతోగాని, గౌరవములోగానీ కూడుకొన్న ఇతర ఉద్యోగముల విషయంలోగాని, కుల, మత, లింగ, సిద్ధాంత భేదములవలన ఎవ్వరు పనికిరానివారుగా పాటించబడరు

(౬) ప్రభుత్వ నిధులనుండిగానీ, స్థానిక నిధులనుండిగానీ పోషింపబడుతూన్నట్టియు. ప్రజాసాహాయ్యముయొక్క ప్రయోజనం నిమిత్తం ప్రత్యేకవ్యక్తులు సమర్పించినట్టియు నూతులు, చెఱువులు, రోడ్లు, పాఠశాలలు, ఇతర బహిరంగప్రదేశాలు సంబంధించినంతవరకు విధులూ, హక్కులూ అందఱి పౌరులకూ సమానమే.

(౭) ప్రభుత్వం అన్నిమతాలయెడా తటస్థభావం వహిస్తుంది.

(౮) వయోజనులందఱికీ వారూ వీరూ అనకుండా వోటింగుహక్కు ఉండాలి.

(౯) ఇండియాలో యెక్కడికైనాసరే వెళ్లడానికిగానీ, ఎక్కడైనా సరే ఉండిపోవడానికిగానీ, ఆస్తి సంపాదించుకోవడానికిగాని, ఇష్టమైన వ్యాపారంగానీ, వృత్తిగానీ చేసుకోవడానికిగానీ, చట్టసమ్మతంగా రక్షింపబడడానికిగానీ శిక్షింపబడడానికిగానీ అందఱితోపాటు ఇండియాలోని అన్నిభాగాలలోని ప్రతి పౌరునకూ హక్కున్నది.

పౌరుల ప్రధానసత్వములనుగూర్చిన ఈతీర్మానంలోనిషరతులు అంతరాత్మకూ మతానికీ సంస్కృతికీ సంబంధించిన విషయాలలో ఎట్టిజోక్యమూ ఉండదని విస్పష్టం చేస్తూన్నవి. వీటినిబట్టి అధిక సంఖ్యాకవర్గముయొక్క వత్తిడివలన అల్పసంఖ్యాకవర్గం తన వ్యక్తిగత నియమాలలో యెట్టిమార్పునూ చేసుకోవలసిన అవసరంలేదు.

బ్రిటిష్ ప్రధాని కావించిన సాంఘిక నిర్ణయాన్నిగూర్చి, కాంగ్రెసు అవలంబించవలసిన వైఖరి అనేక తీర్మానాలలో పదే పదే విస్పష్టం చేయబడింది. తుట్టతుదకు నిరుడు ప్రకటించబడిన ఎన్నికల ప్రణాళికలోకూడా విశదీకరింపబడినది. ఆపరిష్కారము జాతీయతకు ప్రజాస్వామ్యానికీ భారత స్వాతంత్ర్యమునకూ భారతీయైకమత్యమునకూ కూడా ప్రతికూలం కావడంచేత కాంగ్రెసు దానిని వ్యతిరేకిస్తూన్నది. అయినప్పటికీ ఈ సాంఘిక నిర్ణయాన్ని మార్చడంకానీ, రద్దుచేయడంకానీ, జరుగవలెనంటే అందుకు సంబంధించిన అన్ని పక్షాలవారియొక్కయు పరస్పరాంగీకారముపైననే జరుగవలెనని కాంగ్రెసు ప్రకటిస్తూన్నది. పరస్పరాంగీకారముతో అటువంటి పరిణామమును తీసికొని రావడానికి ఎటువంటి అవకాశం దొరికినా దానిని హృదయపూర్వకంగా కాంగ్రెసు వినియోగించుకోటానికి సంసిద్ధంగా ఉంది.

భారతీయుల అందరి ధ్యేయమూ అయిన భారత ప్రజానీకముయొక్క స్వాతంత్ర్యాభ్యుదయములకున్నూ అల్పసంఖ్యాకుల క్షేమమునకున్నూ సంబంధించినంతవరకు కాంగ్రెసువారి సహకార సుహృద్భావములతో పనచేయకోరుతూన్నది.

అల్పసంఖ్యాక సమస్యకతిసన్నిహితమైన మరొక సమస్య జాతీయగీతమునకు సంబంధించినది. దాదాపు నలభై సంవత్సరములనుండీ జాతీయగీతంగా పరిగణింపబడుతూన్న వందేమాతరం పాటతో కొన్ని శాసనసభల కార్యక్రమం ప్రారంభింపబడింది. బంకించంద్ర చటర్జీయొక్క ఈ గీతంతోపాటు ఇక్బాల్ పాటలుకూడా చాలా ప్రసిద్ధికి వచ్చినవి. కాని ఎందువల్లనో ఈ జాతీయగీతం ముస్లిములకు కోపకారణమై కాలక్రమేణా రాష్ట్రీయ స్వాతంత్ర్యములో కాంగ్రెసు పరిపాలనకు ప్రతికూలంగా ముస్లిములు చేసే నిందారోపణలలో యిదికూడా ఒక నేరంగా మోపబడింది.

ఈయేడు అఖిలభారత కాంగ్రెసు సంఘము తన దృష్టిని సారించిన విషయాలింకా కొన్నికలవు. చాలాకాలమునుండీ, అనగా ఒక పావుశతాబ్దమునకు పైగా ఆంధ్రులున్నూ పిమ్మట కర్ణాటకులున్నూ తమకు ప్రత్యేక భాషాప్రయుక్త రాష్ట్రములు కావలెనని తీవ్రంగా ఆందోళనచేస్తూవచ్చారు. 1937 అక్టోబరునెలలో కలకత్తా నగరమున జరిగిన అ. భా. కాం. సం. మొదటిసారి. "భాషలను ప్రధానంగా తీసికొని రాష్ట్రములను పునర్విభజనము కావింపవలెనని, పునరుద్ఘాటిస్తూ" ప్రత్యేకాంధ్ర కర్ణాటకరాష్ట్రముల నిర్మాణమువిషయమై ఆలోచించవలెనని మద్రాసు, బొంబాయి, రాష్ట్రీయ ప్రభుత్వాలకు సిఫారసుచేసింది. ఈ సిఫారసు ననుసరించి మద్రాసు శాసనసభ ప్రత్యేకభాషలకు సంబంధించిన ప్రత్యేక రాష్ట్రములను కోరుతూ తీర్మానించింది. తరువాత మద్రాసు ప్రభుత్వమునకూ భారతరాజ్యాంగ కార్యదర్శికీ చిరకాలం జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల ఫలితంగా భారతదేశ కార్యదర్శి ప్రస్తుతం ఆవిషయాన్ని ఆపివేశాడు. బొంబాయిలోకూడా కర్ణాటకరాష్ట్రం విషయం యిదే సమయంలో చర్చింపబడింది.

ఈ విషయాలను ఇంతకంటెనూ ప్రాముఖ్యమైన మాతృదేశ తదితర విషయాలనూ ఆలోచిస్తూన్నప్పటికీ, విదేశాలలోని భారతీయులనుగూర్చిగానీ ప్రపంచ మానవ సమస్యలను గూర్చిగానీ భారతదేశం విస్మరించియుండలేదు. ఇండియా ప్రభుత్వంలోని 'విదేశ' శాఖకు సంబంధించిన భారత సంస్థాన వ్యవహారములనుగూర్చి కాంగ్రెసు అత్యంత సన్నిహితంగా పరికిస్తూన్నది. 1937 లో మైసూరు సంస్థానమునందు నిర్బంధ విధానము మిన్నుముట్టుతూన్న సమయంలో, అఖిల భారత కాంగ్రెసు సంఘం, వారా విషయాన్నిగూర్చి విస్పష్టంగా తమ అభిప్రాయాన్ని ఈదిగువరీతిం వెల్లడించారు.

"మైసూరు సంస్థానములో అమలు జరుపబడుతూన్న రాజకీయ నిర్బంధాలూ నిషేధాజ్ఞలూ, నిరోధపుటుత్తరువులకున్నూ, వాక్స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యమూ సంఘ స్వాతంత్ర్యములలాంటిపౌరుల ప్రధానసత్వములనే భంగపరుస్తూన్న నిరంకుశ నిర్బంధ విధానమునకున్నూ ఈ సభవారు తమ తీవ్ర ప్రతిఘటనను ప్రకటిస్తూన్నారు

'మైసూరు ప్రజానీకమునకీసభవారు తమ భ్రాతృీయాభినందనాలను అందజేస్తున్నారు; వారి న్యాయబద్ధమైన అహింసాపూర్వక పోరాటంలో వారికి జయము కలుగవలెనని అభిలషిస్తూన్నారు; స్వయం నిర్ణయాధికారంకోసం ప్రభుత్వం వారితో డీకొంటూన్న మైసూరు ప్రజానీకమున కన్నివిధాలా ప్రోత్సాహ సహాయములు చేయవలెనని బ్రిటిష్ ఇండియా ప్రజనూ భారత సంస్థాన ప్రజనూ ఈ సభవారు ప్రార్థిస్తూన్నారు."

జంజీబారులోని భారతీయ స్త్రీపురుషులు వారికి ప్రతికూలంగా చేయబడిన నూతన శాసనములకు వ్యతిరేకంగా ధైర్యంతో పోరాడుతూన్నారు. ఆ దేశంలో చిరకాలమునుండీ నివసిస్తూన్న భారతీయ సంఘముయొక్క ఎగుమతి వ్యాపారానికీ, అంతరంగిక వర్తకమునకూ భంగం కలిగిస్తూ భారతీయ ప్రయోజనములను భగ్నపరుస్తూన్నవా శాసనాలు. జంజీబారు అభ్యుదయానికి చాలావరకు తోడ్పడింది భారతీయులే. ఆ పరిస్థితులలో, అక్కడి భారతీయ ప్రయోజనములను కాపాడి వారి పోరాటమునకు తగినదోహదం చేసేటందుకు, అక్కడి లవంగాలు భారతదేశంలోకి దిగుమతి కాకుండా నిషేధించవలసివచ్చింది. జంజీబారులో చేయబడిన నూతన శాసనాలుపసంహరించుకోనబడేవరకూ భారతదేశ ప్రజలక్కడినుండివచ్చిన లవంగాలను ఉపయోగించరాదని కోరబడిరి. భారతదేశమంతటా జంజీబారు లవంగ బహిష్కరణోద్యమం శ్రద్ధగా కొనసాగింపబడినందున జంజీబారు భారతీయులకు అనుకొన్న పరిహారం కలిగింది.

భారతీయులకు ప్రత్యక్షంగా సంబంధించక పోయినప్పటికీ మనకు సమీపంలోనున్న ఒకానొక దేశంలో బ్రిటిష్‌సామ్రాజ్య విధానముచే సంస్థాపింపబడిన భయంకర పరిపాలనమువలన ఘోరమైన అన్యాయాలు జరుగుతూండినవి. బ్రిటిష్‌వారి సంరక్షణ కింద (Mandate) ఉంచబడిన పాలస్తానం విషయంలో అరబ్బులకూ యూదులకూ మధ్య తీవ్ర వాదోపవాదాలు జరుగుతూ ఉండెను. ఆ విషయాన్ని గూర్చి విచారించడానికొక రాయల్ కమీషన్ నియమింపబడింది. దానికి పీల్ కమీషన్ అని పేరు. వారు జూలై 4వ వారంలో పాలస్తానమును అరబ్బులకూ యూదులకూ పంచిపెట్టవలెనని

చూచిస్తూ ఒక నివేదికను పంపారు. విషయాలను మనము సరిగా ఊహించగలిగినట్లయితే భారతదేశమును హిందూమహమ్మదీయులమధ్య విభజించే విధానంపైన ఆధారపడిన పాకిస్థానంవంటిదే ఈ పాలస్థానం విభజనకూడా. పాకిస్థానసమస్య 1932లోనే పుట్టింది కాని 1940-41 నాటికి అది సజీవమైన సమస్యగా పరిణతి పొందింది. పీల్ కమీషన్ వారు 1937 లో సిఫారసుచేసిన పాలస్థానపు విభజనకును మన భారతదేశ విభజనకూ చాలా పోలిక ఉంది. కాంగ్రెసు పాలస్థానంలోని భయంకర పరిపాలనమును గట్టిగా ప్రతిఘటిస్తూ తీర్మానించింది. పాలస్థాన విభజననుగూర్చిన సూచనలనుకూడా వ్యతిరేకించింది. జాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాడుతూన్న అరబ్బులతో భారత ప్రజానీకం ఏకీభవిస్తూన్నదని హామీకూడా యిచ్చింది.

పాలస్థానము విభజనవలెనే చైనాపైన జపాను దురాక్రమణకూడా భారత జాతీయ మహాసభకు ఆందోళన కారణమయింది.

"చైనాపైన జపాను బుద్ధిపూర్వకంగా క్రౌర్యంతో సామాన్యజనంపైన బాంబులువేస్తూ జరుపుతూన్న సామ్రాజ్య దురాక్రమణను అ. భా. కాం. సం. వారు తీవ్రాందోళనతో భయభ్రాంతులై గమనిస్తున్నారు.

"చైనాదేశ స్వాతంత్ర్యమునూ ఐక్యతనూ కాపాడుకొనేటందు కెట్టి ప్రతిరోధములనైనను పాటింపక, ధైర్యంగా వీరోచిత పోరాటమును నడుపుతూన్న చైనా ప్రజానీకమును ఈ కమిటీవారు హృదయపూర్వకముగా శ్లాఘిస్తూన్నారు. చైనా దేశమునకు తటస్థించిన అపాయకర పరిస్థితులలో దేశంలో ఐక్యతను సాధించినందుకు చీనా ప్రజను ఈ సభవారభినందిస్తూన్నారు.

"చైనాజాతికి తటస్థించిన ఆపత్తుకు ఈకమిటీవారు హృదయపూర్వక సానుభూతిని చూపుతూన్నారు. తమ దేశ స్వాతంత్ర్య రక్షణకోసం చీనా ప్రజలు చేస్తూన్న పోరాటంతో తాముకూడా ఏకీభవిస్తూన్నామని భారతప్రజానీకం పక్షాన ఈకమిటీవారు హామీ యిస్తున్నారు.

"చైనా ప్రజలతో తమకు సానుభూతి కలదని నిరూపించడానికి జపాను వస్తువులను ఉపయోగించకుండా ఉండవలెనని భారత ప్రజానీకమును ఈకమిటీ వారు కోరుతూన్నారు."

1937 వ సంవత్సరంలో భారతజాతి నిర్వహించిన పనులనుగానీ జాతీయ కార్యక్రమంలో ఒక్కుమ్మడిగా తటస్థించిన ముఖ్య సంఘటనలనుగానీ ఎంత సంగ్రహంగా ఉదాహరించవలెనని కోరినప్పటికీ ఇక్కడ సాధ్యం కావడంలేదు ఒక నూతన జాతీయ

దృక్పథం దేశమంతటా ఆచరించింది. అంతరంగిక క్రమశిక్షణము, బాహ్యస్వాతంత్ర్యమూ కాంగ్రెసు ముఖ్యంగా నిర్వహించవలసినవనుట. రాజభక్తిని గుర్తిస్తూయిచ్చిన బహుమానాల నేరభక్తికిగాను విధింపబడిన శిక్షలూ, అపరాధములు నైతికంగానూ వైజ్ఞానికంగానూ భారతీయులకు పరాజయం కలిగించే బ్రిటిషువారి ప్రణాళికలు నూతన సంవత్సరాదినీ, రాజుగారి జన్మదినోత్సవ సందర్భంలోనూ యేడాదికి రెండుసార్లు ప్రకటింపబడుతూన్న బిరుదావళులు, పరాయి ప్రభుత్వంవారి ఉద్యోగాలూ పదవులూ కంటెకూడా ఎక్కువగా భారతజాతిని నైతికంగా పతనం కావించి నిర్వీర్యం చేస్తున్న సంగతి అందరికీ స్పష్టంగా తెలిసిందే. కాబట్టి కాంగ్రెసు మంత్రులు పరిపాలిస్తున్న రాష్ట్రాలలో, బిరుదులీయడంకానీ, పతకాలూ మొదలగునవి సమర్పించడంకానీ ఇక ముందు కొనసాగించకూడదనీ, ఆ పద్ధతులను సహించనుకూడా సహించరాదనీ శాసన సభలు తీర్మానములు చేస్తూ, మంత్రులిక ముందట్టివి తాము సిఫారసు చేయజాలమనీ తమ రాష్ట్రంలో ఎవరికీ అవి ఇయ్యకోవడంలేదనీ రాజుగారికి తెలియపరచవలసిందిగా అ. భా. కాం. సం. సమాలోచన చేసి తీర్మానించింది.

ఇండియావంటి విశాలదేశంలో అన్ని కార్యకలాపాలనూ సమన్వయం చేసుకోవడంకానీ, క్రమశిక్షణకు భంగం రాకుండా కాపాడుకోవడంకానీ అంత తేలికయిన పని కాదు. ముఖ్యంగా భారతజాతి మొట్టమొదటిసారి అధికారమనగా ఏమిటో చవిచూస్తూన్నప్పుడది మరింతకష్టం. శాసనసభలలో పక్ష నాయకత్వమంటే మన కంటికి మొట్టమొదట కనపడిన దానికంటెకూడా చాలా ఎక్కువయినదనే సంగతి తరువాత అర్థమయింది. కాంగ్రెసులోని నాలుగణాల సభ్యత్వమనే చిన్న బీజంలో రాష్ట్రప్రధానత్వమనే మహావృక్షం ఇమిడివుందనే సంగతి మొట్టమొదటగా కాంగ్రెసు గ్రహించగలిగిందిప్పుడే. కనుక పక్షనాయకత్వమునుగూర్చి వ్యక్తులకున్నవనుకొనే హక్కులకూ పక్షనిర్ణయాలకూ భిన్నత్వమేర్పడినప్పుడు ఆ తగాదాలను తీర్చి నిర్ణయించవలసిన బాధ్యత కాంగ్రెసు వర్కింగుకమిటీమీద పడింది. పక్షనాయకత్వమంటే దాదాపు రాష్ట్రప్రధాన మంత్రిత్వమన్నమాటే. అవసరాన్నిబట్టి వర్కింగుకమిటీ ఆయా వ్యక్తుల హక్కులను సమన్వయం చేయడంకానీ నిరాకరించడంగానీ జరుపవలసివుంది. *

---

* బొంబాయిరాష్ట్ర నాయకత్వమునుగూర్చిన తగాదాయే యిందుకుదాహరణం. దాని వివరాలు కాంగ్రెసు కరపత్రాలలోనూ అందుకు సంబంధించిన తదితర పత్రముల లోనూచూడవచ్చును. శ్రీయుత నారిమన్ తనకు అన్యాయం జరిగినట్లుగా భావించిన కారణాన ఆ వ్యవహారమొక కమిటీకి పంపబడింది.

శ్రీయుత కె. యఫ్. నారిమన్ ఎత్తిన విషయాలనుగూర్చి, శ్రీ యం. కె. గాంధీ, శ్రీ డి. యస్. బహదూర్జీలు పంపిన నివేదికను వర్కింగు కమిటీవారు చిత్తగించారు. శ్రీ, యం. కె. గాంధి ఆ నివేదికతో పంపిన ఉత్తరాన్నీ విచారణ సంఘంవారి నివేదికనుగూర్చి శ్రీ. కె. యఫ్. నారిమన్ యిచ్చిన రెండు వాఙ్మూలములనూకూడా ఈ కమిటీవారు పరిశీలించారు. విచారణ కమిటీవారి నిర్ణయాలనూ, వాటిపైన ఆయన అంగీకారమునూ, తరువాత తిరిగీ ఆయనగారి ఉపసంహరణమునూ గమనించినతరువాత కాంగ్రెసు సంస్థలో ఆయన విశ్వాసపాత్రమూ బాధ్యతాయుతమూ అయిన యేఉద్యోగమునూ నిర్వహించడానికి తగిన అర్హతలేనివాడుగా ఆయన ప్రవర్తన ఋజువు చేస్తున్నదని ఈ కమిటీవారభిప్రాయ పడుతూన్నారు.

"ఈ పరిస్థితులలో విచారణ కమిటీవారి నివేదికయున్నూ దానికి సంబంధించిన ఉత్తరాలనూ పత్రికలలో ప్రకటించవలెనని వర్కింగు కమిటీవారాదేశిస్తూన్నారు.

1938 నాటి సంఘటనలను వివరించడానికీ, హరిపురా కాంగ్రెసు వ్యవహారాలను పరిశీలించడానికీ ముందు, 1930 నుండీ జరుపుతూవచ్చిన స్వాతంత్ర్య దినోత్సవాలనుగూర్చి ఉదహరించడం ఉచితమని తోస్తూన్నది. 1930 లో రచించబడిన స్వాతంత్ర్య ప్రమాణపత్రం, బ్రిటిష్‌సామ్రాజ్య తత్వంకింద భారతదేశానికి నైతికంగానూ భౌతికంగానూ తటస్థించిన హానినిగూర్చి కొంతసమగ్రంగా వివరించింది. 1930వ సంవత్సరంలో ఉప్పు సత్యాగ్రహం తలపెట్టిన రోజులలో తయారుచేయబడిన ప్రమాణ పత్రమే ప్రతి సంవత్సరమూ చదువుతూండడం అనవసరంగా భావించి 1938 జనవరి 26 వ తేదీన జరిగిన స్వాతంత్ర్య దినోత్సవాని కనుగుణంగా స్వాతంత్ర్య ప్రమాణపత్రం మార్పుచేయబడింది:—

"ప్రపంచంలోని తదితర ప్రజలకువలెనే భారతప్రజకుకూడా స్వాతంత్ర్యమునూ తాముచేసిన కృషికి తగిన ఫలితాలన్నీ, జీవితావసరములనూ పొందడానికి హక్కున్నది. ఆ హక్కును ఎవ్వరూ అపహరించజాలరు. అటువంటి హక్కున్నప్పుడే వారి అభ్యుదయమునకు తగినన్ని సంపూర్ణసావకాశాలు వారికి లభించగలవు. ఏ ప్రభుత్వమైనాసరే ప్రజలకున్న ఈ హక్కులను లాగివేసి వారిని తొక్కిపెట్టేయెడల అటువంటి ప్రభుత్వాన్ని ఆ ప్రజలు మార్పుచేయడానికిగానీ రద్దుచేయడానికిగానీ కూడా హక్కున్నది. ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వం భారతప్రజల స్వాతంత్ర్యమును అపహరించడమేగాక ప్రజా సామాన్యాన్ని దోచుకు తినడంమీద ఆధారపడి, భారతదేశాన్ని ఆర్థికంగా, రాజ

కీయంగా, వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా నాశనంచేసింది. కాబట్టి భారతదేశం బ్రిటిష్ సంబంధాన్ని తెగతెంపులు చేసుకొని పూర్ణస్వరాజ్యమును పొందవలెనని విశ్వసిస్తూన్నాము.

"భారత స్వాతంత్ర్య సంపాదనార్థం తిరిగి కొత్తగా ప్రమాణం స్వీకరిస్తున్నాము. పూర్ణ స్వరాజ్యం లభించేటంతవరకూ స్వాతంత్ర్య పోరాటాన్ని అహింసాయుతంగా నడపడానికి హృదయపూర్వకంగా నిశ్చయించుకొంటున్నాము.

---

# ౮ హరిపుర కాంగ్రెసు

## [1938]

ఇంతకుపూర్వం రెండు సంవత్సరాలనుండీ జాతీయభావంలో కలిగిన కల్లోలం గానీ సంక్షోభం కానీ చాలావరకు దేశంలోకి కొత్తగావచ్చిన సోషలిస్టు కమ్యూనిస్టు తత్వాల మూలంగా తటస్థించినవి. కాని 1938 లో చెలరేగిన పోరాటాలు చాలా వరకు కాంగ్రెసులో అంతకుపూర్వం కొన్ని సంవత్సరాలనుండీ రాజుతూవచ్చిన అంతః కలహాల ఫలితములని చెప్పవచ్చును. గాంధీ కాంగ్రెసులో ప్రాధమిక సభ్యుడు కాక పోయినప్పటికీ, మకుటంలేనిచక్రవర్తి, నిర్మాణాత్మక జాతీయభావపరంపరకు నిర్ఝరం హింసా సాగర తరంగములకు చెలియలికట్ట. ఆయనకు ప్రతిగానున్న యువక బృందం, అహింసతో అంటిపెట్టుకొని ఉన్న అభిప్రాయాలు ఎంతో నెమ్మదిగా అభి వృద్ధి పొందుతూండడంచూచి సహించలేకపోతున్నారు. వాండ్లకు రెక్కలు లేకుండానే ఆకాశంవరకూ ఎగురవలెననీ, సముద్రాలను ఉఱకవలెననీ ఉత్సాహం ఉంది. మంత్రివర్గ నిర్మాణము లట్టి ఘనకార్యాలను వేటినీ నెఱవేర్చలేకపోయినవి. ప్రజా ప్రభుత్వాలుకూడా సుదూరవృత్తముగా పరిగణింపబడుతూన్న కర్షకమోక్షమనే దైవసంఘటనమును వేగంగా ఆచరణలోకి తీసికొని రావడానికి సహాయపడలేకపోయినవి. జమీందారుల కెక్కడా చలనం కలుగలేదు. పోలీసుజులుం నిరంతరాయంగా సాగుతూనే ఉంది. రైతులనుభవిస్తూన్న కష్టనష్టాలకు ఇంకా పరిహారం కలుగలేదు. హింసానేరములకు శిక్షింపబడి వంగ, బీహారు, పంజాబురాష్ట్రముల ఖైదులలోనూ, అండమాను దీవులలోనూ ఉన్న రాజకీయ ఖైదీలు నిరసనవ్రతం మూలంగా అనుదినమూ అంతకంతకూ కుంగి కృశించిపోతూన్నారు. ఈ కల్లోలాంధకారములనుండి మినుకు మినుకు మంటూన్న ఆశాజ్యోతి ఒకటి, నాటి సందిగ్ధ వాతావరణాన్ని చీల్చుకొని తొంగిచూచింది. అంతకుపూర్వం కాంగ్రెసువాదులు తొక్కిచూడని జాతీయ నిర్మాణ మార్గములను ప్రజ్వలింపచేయ దానికావెలుగు సహాయపడ్డది. దౌర్జన్యంకానీ, ఘాతుకచర్యలుగానీ స్వాతంత్ర్య పోరాటంలో పరికరములుగా ఉపయోగపడగలవనే సిద్ధాంతాన్ని పూర్తిగా పరిత్యజిస్తూ వాటిలో తమకిక విశ్వాసంలేదని అండమాను ఖైదీలొక ప్రకటన చేశారు. వారికీ అభిప్రాయాలు భయం వలనకానీ ఆశవలనకానీ కల్గినవికావు. చరిత్ర పరిశీలనమువలననూ రాజకీయ శాస్త్రమునుగూర్చిన దీర్ఘాలోచనవలననూ మాత్రమే వారా నిర్ణయమునకు వచ్చారు. వెంటనే వారి అభిప్రాయాలను గాంధీజీకీ ప్రపంచానికీ తంతులద్వారా వెల్లడించారు. వీరు

కాక తమ అభిప్రాయాలను ప్రకటించిన పాపానికి ఎంతోకాలమునుండి జైళ్ళలో మగ్గిపోతూన్నవారుకూడా చాలామంది ఉన్నారు. వేయిమంది వంగ యువకులేయున్నారు. వారిలో ఏడుగురు స్త్రీలు. అండమాను దీవులనుండి భారతదేశపు జైళ్ళకు బదిలీచేయబడిన వారెంతమందో తామింకా అనుభవించవలసిన దీర్ఘకాలపు శిక్షలను గురించి యోచిస్తూ ఇక తమకు యేవిధంగానూ మోక్షం లేదని భగ్నాశులై పడి ఉన్నారు పంజాబు సఖులను అనుసరిస్తూ, హజరీబాగు కారాగారంలో, నిరసనవ్రతం పూనిన ఖైదీలు పదముగ్గురున్నారు. చిటగాంగులో 25,000 మంది మర్యాదగల కుటుంబాలకు చెందిన (భద్రలోగ్) యువకులు తమతో ఎల్లప్పుడూ ఆనవాలుచీట్లనుతీసికొని పోవలెనని నిర్బంధింపబడుతూన్నవారున్నారు. వీరందరూ హింసలో తమకు విశ్వాసం లేదని బహిరంగంగా ప్రకటించడం, వంగరాష్ట్రంలోనూ తక్కిన భారతదేశంలోనూ కూడా భయోత్పాదమోద్యమానికి (Terrorisum) సంపూర్ణంగా 'స్వస్తి' చెప్పడం కాక మరేమిటి? నిరసనవ్రతం పూనినవారందరినీ వెంటనే ఆపని మానివేయవలెనని కోరుతూ ఖైదీల విడుదలనుగూర్చి సకలప్రయత్నాలూ జరుపుతూన్నామనీ జరుపగలమనీ, హామీ యిచ్చింది కాంగ్రెసు. అండమాను ఖైదీలను ఇండియాకు తెచ్చిన పిమ్మటనూ వంగరాష్ట్రంలోని 1100 మంది డిటెన్యూలను విడిచివేసిన తరువాతనూ కొంతకాలం చలీ చప్పుడూ లేకుండా కడచినమాట నిజమే. ఇక సామ్రాజ్యవాదులొకే అడుగైనా ముందుకు సాగడానికి కిష్టపడక పోవడమే దీనికి కారణం. తక్కిన వారి విడుదలను అడ్డగించడానికి గవర్నర్లు తమ ప్రత్యేకాధికారాలను వినియోగించారు. పాంచాలంలోని ఇరవైమంది దేశభక్తు లొక్కబిగిని 30 రోజులు పూనిన నిరసనవ్రత ఫలితంగా ఈ నిస్తబ్ధత విచ్ఛిన్నమై తిరిగీ జాతీయహృదయం చైతన్యవంతమయింది.

ఒకపక్క జాతీయపోరాటంలో తమ నెత్తురు వోడ్చి పనిచేసినవారంతా అహింసా తత్వానికి అనుకూలంగా వస్తూంటే, అధమం హింసాతత్వానికి దూరంగా ఉండవలెనని ప్రయత్నిస్తూంటే కిసానుల గుంపులు పెద్ద పెద్ద ముఠాలుగా ఏర్పడి గ్రామాలవెంట వందలకొలదీ మైళ్లు, యాత్రలుచేస్తూ తమ పక్షాన్ని నిర్మించుకోడానికి ప్రయత్నిస్తూన్నారు. కాంగ్రెసును దాదాపు ప్రతిఘటించగల శక్తితోనూ ఉద్వేగంతోనూ, కిసానులు తయారవుతున్నారు. వారికొక నాయకుడు, ఒక జెండా, ఒక నిమిత్తమూ ఉన్నవి. కిసానుల నిమిత్తం కొత్తదికాదు. కాంగ్రెసు ఎంతకాలం నుండో అందుకోసం పనిచేస్తూన్నది. వారి జెండా సుత్తీ కొడవలి చిన్నెలుగల సోవియట్ల ఎఱ్ఱ జెండా. ఈజెండా అంతకంతకు కిసానులయొక్కయు కమ్యూనిస్టులయొక్కయు ఎఱ్ఱజెండా అని ప్రచారంలోకి వచ్చింది. జవహర్‌లాల్ నెహ్రూ అంత మనిషి

ఎన్నిసార్లో నెత్తిన నోరుపెట్టుకొని చెప్పినప్పటికీ ఆజెండా ఏ స్థానంలో ఏ స్థితిలో ఉండాలో, దానిని ఆ స్థానంలోనూ ఆస్థితిలోనూ ఉంచలేకపోయినాడు. దాదాపు ప్రతిచోటా ఆజెండాయొక్క యెత్తునుగూర్చి ప్రాముఖ్యతనుగూర్చి కాంగ్రెసువాదులకూ కిసానులకూ తగాదాలువచ్చినవి. త్రివర్ణపతాకాన్ని అసలులేకుండా చేయాలని ప్రయత్నించిన కిసానుల చర్య సోషలిజంకూ గాంధీజంకూ గల పోటీకి చిహ్నమని భావించాలి. నిజానికి సోషలిజంకంటెకూడా కమ్యూనిజమే ఎక్కువ వ్యాపకంలోకి వచ్చింది. కొన్ని రాష్ట్రాలలో సోషలిస్టులు కమ్యూనిస్టులతో కలసిపోయినారు. లేదా అధిక సంఖ్యాకులైన జాతీయవాదులతో ఆనవాలు పట్టలేనంతగా లీనమైపోయినారు. కిసాను ఉద్యమ నాయకులనేకమంది దేశమంతటా సంచారంచేసి జల్లించి ఊకను గింజలను వేరుచేసినట్లుగా అనుమానాస్పదులైనవారినీ అసలు సోషలిష్టులనూ, ఉపేక్షాభావంతో నున్నవారినీ, చురుకుగా పనిచేసేవారినీ విడదీసి వారిపక్షాన్ని బలిష్ఠంగా ఘనీభవింపజేసుకొని కాంగ్రెసును ప్రతిఘటింపచేశారు. అనేక రాష్ట్రాలలో ముఖ్యంగా కర్ణాటక, బీహారు, యు. పి. ఒరిస్సా, రాష్ట్రాలలోని రాష్ట్ర కాంగ్రెసు ఎన్నికలు, తగాదాలతోనూ కొట్లాటలతోనూ చిక్కులలో పడవలసిరావడం విచారకరం. ఆంధ్రదేశంలోమాత్రం సాధారణ కాంగ్రెసు వాదులకూ, వాలంటీర్లకూకూడా, అహింసలోఉన్న అపూర్వ విశ్వాసంవలన దౌర్జన్యం జరుగకుండా రాష్ట్రం రక్షించబడింది.

హింసా హింసల నడుమ జరిగే ఈ పోరాటాల మధ్యలో, జైళ్ళలో నడుస్తూన్న నిరసన వ్రతాలవలన తటస్థించిన విషమ పరిసితులలో, కాంగ్రెసు మంత్రివర్గాల అభ్యుదయ కార్యక్రమం జాగవుతూన్నదని అణచిపెట్టుకొన్న ప్రజల ఆగ్రహావేశంలో హరిపురా కాంగ్రెసు సమావేశం కావడం తటస్థించింది. హరిపురలోని విఠల్ నగరమున 1938 ఫిబ్రవరి 19, 20, 21 తేదీలలో సుభాస్ చంద్రబోస్ అధ్యక్షతకింద యాభై ఒకటవ కాంగ్రెసు మహాసభ సమావేశమయింది. ఈ సభ చాలా క్లిష్ట పరిసితులలో జరిగిందనడానికేమీ సందేహంలేదు.

హరిపుర అధ్యక్షుని ఎన్నిక అంత ప్రాముఖ్యమైనది కాదు. మహాసభ జరుగబోతుండనగా సుభాస్‌బాబు తన కార్యక్రమాన్ని ఈ విధాం విస్పష్టంచేశాడు.

"కాంగ్రెసు అధ్యక్షుడుగా నేనున్నంతకాలమునూ అక్రమమైన ఈ ఫెడరల్ ప్రణాళికను ప్రజా స్వామ్యమునకూ జాతీయతకూ ప్రతికూలములైన దాని సహజలక్షణాలతోసహా శాంతియుతమూ ధర్మ సమ్మతమూ అయిన అన్ని శక్తులతోనూ, అవసరమైతే అహింసాయుత సహాయ నిరాకరణోద్యమంతోకూడా నిరోధించడాని

కిన్నీ, అందుకుగాను దేశముయొక్క పట్టుదలను పెంపొందించడానికిన్నీ నాశక్తిని వినియోగించగలను”.

“ఈ సంవత్సరం ఫెడరల్ ప్రణాళికను భారత ప్రజానీకంపైన బలవంతంగా రుద్దే ఉద్దేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వంవారింతటితో జారవిడిచేటంతగా, ప్రజల నిరోధ శక్తులను బలిష్ఠంచేయడమే పెనుపని అనికూడా సుభాస్ బాబు అన్నాడు. ఈ ప్రయత్నంలో ప్రజలు అంతర్జాతీయ వ్యవహారములను తీక్షణంగా పరికిస్తూ అందుకుతగిన ఉపాయాల నవలంబించి వాటి సంపూర్ణ ప్రయోజనాలను పొందవలెనని వారి కాదేశించాడు.

బ్రిటిష్‌వారికి మందలింపు:

మంత్రిత్వాలు నిరాకరిస్తామని ప్రకటిస్తూనే వాటిని స్వీకరించినట్లుగానే, కాంగ్రెసువారు ఫెడరేషన్ వద్దంటూనే దానినికూడా అచ్చుకొంటారని బ్రిటిష్‌రాజకీయవేత్తలు వేస్తున్న అంచనా తప్పనీ, ఆ ఉదాహరణం ఈ సందర్భంలో వర్తించదనీకూడా సుభాస్‌బాబు బ్రిటిష్‌వారిని మందలించాడు.

జాతీయైక్య సంఘటనము.

సాంఘిక సమస్యను పరిష్కరించి జాతీయైక్య సంఘటనకు ప్రత్యేకం కాంగ్రెసు పాటుపడదలచుకొన్నదనీ, జాతీయతకు భిన్నంగాని పద్ధతిని ముసల్మానుల కోరికలను నెరవేర్చి వారితో సమాధానం కుదుర్చుకోవడానికి రాబోయే సంవత్సరం శక్తివంచనలేక ప్రయత్నిస్తుందనీకూడా సుభాస్‌బోసు ప్రకటించాడు. అల్పసంఖ్యాకసంఘమువారి న్యాయమైన కోరికలను తృప్తిపరచడానికి కాంగ్రెసు శక్తికొలదీ ప్రయత్నిస్తుందనీ, అయితే ఆ కోరికలు మాత్రం మాటి మాటికీ మారకుండా హామీ ఉండాలనీ ఈ సమస్యకు సంబంధించిన వారందరికీ సుభాస్‌బాబు విస్పష్టంచేశాడు.

ప్రతి కాంగ్రెసుకూ ఏదోకొంత విశిష్టతా ప్రాముఖ్యతా ఉన్నట్లు చెప్పుకొంటారు. అలాగే ప్రతి కాంగ్రెసులోని ప్రతి తీర్మానమునుగూర్చికూడా చెప్పవచ్చును. హరిపురాలో జరిగిన కాంగ్రెసుకు న్యాయంగానే కొంత ప్రాముఖ్యత ఉన్నది. అక్కడ జరిగిన 51 వ కాంగ్రెసు మహాసభలో మన మంత్రి వర్గాలకు చచ్చి బతికినంతపని జరిగింది. ఆ కాంగ్రెసునాటికి వారధికారంలోకి వచ్చి యింకా ఏడు మాసాలైనా నిండలేదు. వారు కుర్చీలలో సరిగా యింకా కూర్చున్నారో లేదో కూడా ప్రతి రాష్ట్రంలోనూ వారికీ వారి గవర్నరులకూ మధ్య కొన్ని ముఖ్య విషయాలలో తీవ్రమైన భేదాభిప్రాయాలు కలిగినందున వారి ఉనికియే విషమ స్థితిలో

పడింది. బీహారు సంయుక్త రాష్ట్రాల గవర్నర్లిద్దఱూ, హింసా నేరములకు శిక్షింప బడిన రాజకీయ ఖైదీల విడుదలకు అడ్డం తగిలినందున, ఆ రెండు రాష్ట్రాల మంత్రులు రాజీనామాలిచ్చారనే ప్రవాదం బాగా వ్యాపించింది. ఆ కారణాన హరిపురా కాంగ్రెసు ప్రతినిధుల బసలు అట్టుడికినట్టుడికిపోతూన్నవి. హరిపురా కాంగ్రెసు కోసం చేయబడిన ఏర్పాట్లన్నీ ఆదర్శప్రాయంగా ఉన్నవి. ప్రతినిధులకు కావలసిన పాలు సప్లయి చేయడానికి ప్రత్యేకం 500 ఆవులను కాంగ్రెసు శిబిరంలో ఉంచారు. శిబిరమంతా బహు జాగ్రత్త తీసుకొని పరిశుభ్రంగా ఉంచబడింది. అద్దెలు ప్రథమ శ్రేణికి చెందినట్లున్నప్పటికి ప్రతినిధులకూ ప్రేక్షకులకూ ఆహ్వాన సంఘంవారు చూపిన ఆదరణ శ్లాఘాపాత్రంగా ఉంది. కాని బీహారు, యు. పి ఒరిస్సా రాష్ట్రాలలోని సంఘటనలు ప్రతినిధులకు చిత్తక్షోభంకలిగిం డంచేత ఇవన్నీ అంతగా పాటించబడలేదు. సంస్థానాల యొక్కయూ, కిసానుల యొక్కయూ సమస్యలుకూడా ఉద్రేకోత్సాహములకు తావొసంగకపోలేదు. 1937 అక్టోబరు నెలలో కలకత్తాలో సమావేశమైన అ. భా. కాం. సం మైసూరును గూర్చి తాత్కాలికోద్రేకంలో చేసిన తీర్మానం యొక్క సిఫారసు అంతకు పూర్వం నుండీ కాంగ్రెసు బుద్ధిపూర్వకంగా అవలంబిస్తూన్న పద్ధతిని అతిక్రమించి నడిచింది. (1937 డిశంబరు కాంగ్రెసు బులిటన్) చదవండి. "స్వయం నిర్ణయాధికారం కోసం మైసూరు ప్రభుత్వానికి ప్రతికూలంగా ప్రజలు నడుపుతూన్న పోరాటానికి ప్రోత్సాహ సహాయ ములు చేయవలసిందని సంస్థానాల ప్రజనూ బ్రిటిష్ ఇండియా ప్రజనూ ప్రబో ధిస్తున్నాము". అని ఆతీర్మానములో ఉంది. అంతేకాదు కడచిన రెండేడ్లలో సంస్థాన ప్రజలలో అపూర్వ సంచలనమూ చైతన్యమూ కలిగింది. కాంగ్రెసు మహాసభాసమా వేశానికి ముందుగా నవసారీలో భారత సంస్థాన ప్రజామండలివారి ప్రచారకుల మహా సభ జరిగింది. వర్కింగుకమిటీవారి చిత్తుతీర్మానాలలో తిరిగీ కొన్ని సవరణలు చేయడం అవసరమైనట్లుగా తోచింది. కిసానులలో కలిగిన నూతన చైతన్యంవలన వారి కార్య కలాపముల ద్వారా పరిస్థితులు క్లిష్టదశకు వచ్చినవి. "వారి చర్యలు కాంగ్రెసు ప్రధా నాశయములకు భిన్నంగా ఉండడంచేత కాంగ్రెసు వాటితో ఏకీభవించలేకపోయింది. కిసాను సభలలో సభ్యులుగానున్న కాంగ్రెసువాదులు కొంతమంది కాంగ్రెసు సిద్ధాంత కార్యక్రమాలకు ప్రతికూలంగానుండే వాతావరణమును సృజించడానికి దోహదం చేయడంకూడా కాంగ్రెసు సహించలేకపోయింది."

అల్ప సంఖ్యాకుల విషయాన్నిగూర్చికూడా చిన్న సంచలనం కలిగింది. 1937 డిశంబరు 28 వ తేదీని కలకత్తాలోని మహమ్మదాలీ పార్కులో ముస్లిమ్ విద్యార్థి

షెపరేషనును ప్రోత్సహిస్తూ జిన్నా చేసిన ఉపన్యాసమే దానికి కారణం. కాంగ్రెసును సవాలుచేస్తూ "కాంగ్రెసు నాయకత్వానికి బుద్ధివచ్చేటట్టు చూడాల" న్నాడు. జిన్నా ఆ ఉపన్యాసంలో దీనికితోడు డిటెన్యూల విడుదలనుగూర్చీ నిరసనవ్రతం పూనిన తదితర రాజకీయ ఖైదీలనుగూర్చి కొంతకాలంనుండి దేశమంతా అట్టుడికినట్లుడికిపోతూంది. ఈ సమస్యను పరిష్కరించడానికి హరిపురామహాసభ ముగియగానే గాంధీ వంగరాష్ట్రమునకు ప్రయాణం కాదలచుకొన్నాడు. హరిపురా కాంగ్రెసు కార్యకలాపమును సునిశితదృష్టితో పరిశీలించబోయేముందు యాదృచ్ఛికంగా రెండు విషయాలను మనం గమనించవలసి ఉంది. ఆ కాంగ్రెసును ఆహ్వానించిన రాష్ట్రం గుజరాతు. ఆసభోపన్యాసాలుగానీ, తీర్మానాలుగానీ, ఇట్టి ప్రకటనలుగానీ, ప్రతినిధుల బసలు వగైరాలు తెలిపే బల్లలుగానీ అన్నీ ముఖ్యంగా గుజరాతుభాషలోనే ఉండినవి. రాష్ట్రీయ భాషకా ప్రతిపత్తి చూపడం తప్పనిసరీ సహజమూ కూడాను. ఈ అన్నిటిలోనూ జాతీయభాషయైన హిందూస్థానీకికూడా చోటు ఉండితీరాలి. ఆహ్వానసంఘంవారు ముద్రించిన ప్రకటనలలోగానీ, తదితర సాహిత్యంలోగానీ, హిందూస్థానీ భాష జాతీయభాషగా వ్యవహరింపబడడం విషయంలో ఎవరికీ యేమీ భేదాభిప్రాయం ఉండకూడదు. హిందూస్థానీభాష కుపయోగింపబడే రెండు లిపులూ దేవనాగరీలిపి, అరబ్బీ లిపికూడా సమాన ప్రతిపత్తిగలవిగా భావింపబడుతూన్నవి. అయినప్పటికీ, గుజరాతీ, ఇంగ్లీషుభాషల ప్రక్కను దేవనాగరలిపి హిందూస్థానీతప్ప అరబ్బీ లిపి ఎక్కడా కనపడలేదు. తరువాత ఈ విషయమునకు నేరంగా విచారణకువచ్చింది. ఇక్కడే మనమా విషయమునంత ప్రాముఖ్యంగా పరిగణించక పోవచ్చునుగానీ కేవలం తోసివేయవలసిన విషయం మాత్రం కాదు. అయితే ఉర్దూ పత్రికలలో చేయబడిన ఆరోపణలు మాత్రం న్యాయమైనవి కావు. ఎందువల్లనగా అన్ని ముఖ్య ప్రదేశాల లోనూ ఉర్దూభాషలో కాగితాలంటించబడి వున్నవి. మాంసాహారమునకు అవకాశం కల్పింపబడలేదనికూడా ఒక ఆరోపణ చేయబడింది. కాని మాంసాహారమును సప్లయి చేసే హోటళ్లు హరిపురాలో వున్నవి.

ఇక రెండవ విషయమేమంటే, చేతితో తయారుచేసిన కాగితం వాడడం ప్రారంభించిన కాంగ్రెసు హరిపురాకాంగ్రెసే. అ. భా. గ్రామ పరిశ్రమల సంఘం 1934 అక్టోబరులో బొంబాయి కాంగ్రెసుతో ప్రారంభమయింది. ఇంతతొందరలో హరిపురా కాంగ్రెసు ఆహ్వానసంఘంవారు తమ కార్యకలాపాలన్నిటికీ చేతితోతయారుచేసిన కాగితమునే వాడవలెననిగుర్తించడం కాంగ్రెసు చరిత్రలో గర్వించదగిన విషయం. హరిపురాలోని అఖిలభారతజాతీయ విద్యాసంఘ సంస్థాపనం జరగడంకూడా పైవిషయానికి

యింకా వస్నె తెస్తూన్నది. ఎప్పుడో నిర్మింపబడవలసిన ఈ సంస్థ జాతీయనిర్మాణ కార్యక్రమానికి మకుటాయమానంగా ఉండగలదు.

జాతీయ మహాపురుషులయొక్కయు, స్త్రీలయొక్కయు మరణములనుగూర్చి ప్రతి సంవత్సరమూ దురపిల్లవలసిరావడం దేశముయొక్క దురదృష్టం. కాని అది తప్పనిసరి. కీ॥ శే॥ పండిత మోతీలాలుని ధర్మపత్ని స్వరూపరాణీ మరణమునుగూర్చి హరిపురా కాంగ్రెసు చింతించవలసి వచ్చింది. ఆమెతోసహా ఆమె కుటుంబంలోనివారు ముగ్గురు దేశసేవను దినచర్యగా పెట్టుకొని త్యాగంచేశారు. ఆమె ఏక పుత్రుడు జవహర్‌లాలు నెహ్రూ ఇప్పుడే మూడవసారి కాంగ్రెసు అధ్యక్షపదవిని స్వీకరించి తన ఉద్యోగ కాలపరిమితిని పరిసమాప్తిచేశాడు. ఈకాలంలో ఆయన భారతదేశంలోని అన్ని రాష్ట్రాలేకాక, బర్మా మలయాదేశాలలోకూడా సంచారంచేశాడు. ఆయన తన ఉద్యోగాన్ని విడిచిపెట్టేముందు అస్సాంలో సంచారంచేసి, స్వయంగా అక్కడనూ, తరువాత హరిపురాలో కాంగ్రెసుద్వారానూ, 1932 లో అస్సాముఅడవులలో స్వాతంత్ర్య పతాకమును ధరించి వీరోచితంగా పోరాడిన నాగస్త్రీ గిడల్లో-(Guidallo) ను విడుదలచేయవలెనని పట్టుపట్టాడు. ఆమె 1932 నాటినుండి హరిపురా కాంగ్రెసువరకూ అంటే ఆరేండ్లనుండీ కారాగారశిక్ష అనుభవిస్తూనే ఉన్నది. చిరకాలం శ్రమించి పనిచేసి జవహరలాలునెహ్రూ తన అధ్యక్షపదవిని తనకన్న చిన్నవాడేకాక, కాంగ్రెసు అధ్యక్షులందరిలోకీ నిస్సందేహంగా చిన్నవాడైన సుభాస్‌చంద్రబోసుకు అప్పగింతపెట్టినాడు. సుబాస్‌బాబు చాలాకాలంనుండి జబ్బుగావుండి అప్పుడప్పుడే తేరుకొంటూన్నాడు. భారతదేశ చరిత్రలో ఏరాష్ట్రంలోని యువకులూ దేశభక్తులూ అత్యంతం బాధలుపడ్డారో, ఏరాష్ట్రం జాతీయ సంస్కారాభ్యుదయమునకు అత్యంతం పాటుపడ్డదో, ఏరాష్ట్రవాసులు భారతదేశ మోక్షమున కెక్కువగా కష్టనష్టాలు భరించారో ఆ వంగరాష్ట్రంనుండి సుబాస్‌బోసు కాంగ్రెసు అధ్యక్షుడుగావచ్చాడు. మిడ్నపూరుజిల్లా మన కాంగ్రెసు అధ్యక్షునకత్యంత ప్రియతమమైనది. వంగరాష్ట్రంలోని కాంగ్రెసేతర మంత్రివర్గము రాష్ట్రంలో మిగిలిపోయిన నిర్బంధవిధానము నా జిల్లాకు సంక్రమింపచేశారు. వంగరాష్ట్ర ప్రభుత్వంవారు ఆ జిల్లాలో జారీచేసిన 110 కాంగ్రెసు సంఘములపై నిషేధపుటుత్తరువులను ఇంకనూ కొనసాగిస్తూనందుకు హరిపురా కాంగ్రెసు తన అసమ్మతిని వెల్లడించింది. ఆ కాంగ్రెసు సంస్థలు, విప్లవకారుల సంస్థలకు (Terrorist Organisations) ఉపాంగములని ప్రభుత్వము వారు చెప్పేసాకుకు ఏంతమాత్రమూ ఆధారంలేదని కాంగ్రెసు తన నిశ్చితాభిప్రాయాన్ని ప్రకటించింది.

మనతో చిరకాలబాంధవ్యాలు గల తదితర దేశాలకన్నా మన భారతదేశానికెన్ని ఎట్టి సన్నిహితసంబంధం ఉండవలెనో వివరిస్తూ. నేటి అంతర్జాతీయ సామ్రాజ్యాంతర్గత పోరాటాలలో మన స్థానమెట్టిదో స్థిరపరచడం ప్రయోజనకరమని భావిస్తున్నాము.

ఆ దేశాలలోని భారతీయు లనుగూర్చిన విషయం ప్రతిసంవత్సరమూ చర్చకు వస్తూన్న ప్రధాన సమస్యయే. తక్కిన కాంగ్రెసులలోవలెనే హరిపురా కాంగ్రెసులో కూడా ఈ విషయం చర్చకువచ్చింది. దక్షిణఆఫ్రికా, తూర్పుఆఫ్రికాలలో "కెన్యా, ఉగాండా, టాంగనాయికా, జంజీబారులతో సహా, మారిషస్ ఫిజీ ద్వీపాలలోని భారతీయుల ప్రతిపత్తి, స్థితీ, హక్కులూ అన్నీ అంతకంతకు అతివేగంగా క్షీణదశకు వస్తూన్నవని హరిపురా కాంగ్రెసు భయోద్వేగంతో గమనించింది. జంజీబారులో లవంగాల పంటదార్లందరూ కలసి ఒక సంఘంగా ఏర్పడి లవంగాలు వారుతప్ప తక్కిన వారెవరూ పండించకూడదని ఏర్పాటు చేశారు. టాంగనాయికాలో 'నేటివ్ ప్రొడ్యూస్ బిల్లు' ఏర్పాటుచేయబడింది. తూర్పు ఆఫ్రికాలో రాకపోకలకు కొన్ని ఏర్పాట్లుచేయబడినవి. కెన్యాలోని మెరక భూములన్నీ తెల్లవారికోసం ప్రత్యేకించబడినవి. ఇవన్నీ ఆయా దేశాలలో బ్రిటిష్ సామ్రాజ్యం అవలంబిస్తూన్న నూతన ఆర్థిక విధానం. కెన్యాలో నివసించే బ్రిటిష్ ఇండియా ప్రజలక్కడి మెరక భూములను ఆక్రమించుకోకుండా అభ్యంతరపెట్టే అలవాటు చాలాకాలంనుండీ ఉన్నదా ప్రభుత్వానికి. కాని యూరపుఖండంలోని ఏదేశానికి చెందినవారైనా ఆ భూములను ఆక్రమించుకోవచ్చును. ఇది భారతీయులు చాలా అవమానకరంగానూ హైన్యంగానూ భావిస్తూన్నారు. ఆచరణలోనున్న ఈ భేదభావాన్నే చట్టరూపేణా శాశ్వతం చేయడానికి 'తెల్లవాళ్ళ మెరక భూములకు' (White High-lands) సరిహద్దులను నిర్ణయిస్తూ ఆర్డర్ ఇన్ కౌన్సిలు జారీచేయవలెనని ప్రయత్నాలు జరిగినవి. - ఇది 1923 లో ఇండియా గవర్నమెంటువారు చేసిన ప్రకటనకు విరుద్ధమైన చర్య.

తూర్పు, దక్షిణ ఆఫ్రికాలలోని ఆదిమనివాసుల యెడలకూడా కాంగ్రెసు తన వైఖరిని స్పష్టపరిచింది. ఆ దేశాలలో నివసిస్తూన్న భారతీయులు కోరేకోరికలు వారికి ప్రతికూలంగా కోరబడుటలేదని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమవారినీకూడా చేస్తూన్న దోపిడీ విధానాన్ని అరికట్టడానికే తామీ పద్ధతిని అవలంబించామనీ స్పష్టంచేశారు. జంజీబారులోని లవంగాలను భారతీయ వర్తకులు పూర్తిగానూ సంతృప్తికరంగానూ బహిష్కరించిరి. వారి విషయం సరిగా పరిష్కారంకావడానికి కూడా ఎంతో కాలం పట్టలేదు. సరిగా యిటువంటి పశుతుల్యమైన సామ్రాజ్యతత్త్వమే తూర్పున చైనాలోకి

తలయెత్తసాగింది. దాని భీషణస్వరూపముతోనూ ఘోరకృత్యములతోనూ పాటు, ప్రపంచశాంతికీ, ఆశియాఖండ స్వాతంత్ర్యమునకూ భంగం కలిగిస్తూ అకాండతాండవం చేయ ప్రారంభించింది. భారతదేశం చైనాయెడల చూపించిన సానుభూతి, జపాను వస్తువులను భారతీయులు బహిష్కరించవలెననే తీర్మానం చేయడంవరకూ పోయింది. పడమర పాలస్థానములో, ఆ ఆదేశమును విభజించవలెననే దుష్ట ప్రయత్నములకు దారితీసింది. పాలస్థానములో కేవలం భయంకర పరిపాలనము ప్రారంభమయింది. పరస్పర సమాధానమువలననే పాలస్థానవు సమస్య పరిష్కరింపబడవలెనని కాంగ్రెసు కోరింది. ఇక దక్షిణాన సింహళద్వీపంతో భారతదేశానికి చిన్న చిక్కు తటస్థించినది. సిలోన్ ప్రభుత్వం, భారతీయులను వేరుపరుస్తూ వారికి ప్రతికూలంగా శాసనం చేయ తలపెట్టింది. అందువలన స్థానిక పరిపాలనలో భారతీయులకు వోటింగుహక్కు లేకుండాపోతుంది. సిలోన్‌లోని భారతీయుల పౌరసత్వములు కుంచించబడుతవి. కాంగ్రెసు దృష్టిలో ప్రజలకు సంబంధించినంతవరకు, భారతదేశమూ సింహళద్వీపమూ ఒక్కటే. అవిరెండూ భిన్నదేశములు కావని వారి అభిప్రాయం.

హరిపురాకాంగ్రెసునాటికి ప్రపంచాన్ని ఆవరించి క్రమ్ముకొని వస్తున్న వినాశహేతుభూతములైన విశాలయుద్ధ మేఘాలను గమనించినప్పుడే పైన పేర్కొన బడిన సంఘటనలకూ లెక్కలోనివిగా పరిగణింపబడలేదు. యుద్ధమునుగూర్చిగానీ, భారతదేశంతో విదేశాలకుగల సంబంధ బాంధవ్యములనుగూర్చిగానీ భారతీయు లవలంబించవలసిన పైఖరి యిదివరకే విస్పష్టం చేయబడింది. కాని తిరిగీ ఆ విషయాన్ని పునరుద్ఘాటించడం ఉచితమని హరిపురాకాంగ్రెసు భావించింది.

“విదేశీయుల యాజమాన్యంకిందనూ పెట్టుబడికిందనూ “ఇండియా లిమిటెడ్” అని కానీ లేక అటువంటి మాటలుగల మరొక పేరుతో కానీ అవి నిజమైన భారతీయ సంస్థలేనని అపోహ కలిగించడానికి ఎన్నో కంపెనీలు త్వర త్వరగా అభివృద్ధి అవుతూండడం చూచి వర్కింగు కమిటీ వారెంతో ఆందోళన పడుతూన్నారు. భారతీయ పరిశ్రమల సంస్థాపననూ అభివృద్ధినీ ప్రోత్సహించడానికి, ఇండియా ప్రభుత్వంవారవలంబించిన ప్రత్యేక రక్షణ విధానాన్ని నిష్ప్రయోజనంగా చేయడమే ఇటువంటి కుహనా సంస్థల పరమప్రయోజనం.

“నూతన రాజ్యాంగ చట్టమును కాంగ్రెసు ప్రతికూలించడం కేవలమది భారత స్వాతంత్ర్యమును భగ్నం చేస్తున్నదనేకాదు; అందులో భారతీయ పక్షపాతమును ప్రతిరోధించేటందుకు, తగిన రక్షణలనే పేరుతో కొన్ని

నిబంధనలు చేయబడి ఉండడంకూడా కారణం. ఈ నిబంధనలు భారతదేశ క్షేమమున కనుకూలంగా లేవనీ, ఈ దేశంలోని ప్రకృతి సౌభాగ్యాన్నీ, సహజ సంపత్తినీ విదేశీయులు ముఖ్యంగా బ్రిటిషు పెట్టుబడిదార్లు తమ స్వార్థం కోసం శాశ్వతంగా వినియోగించుకోవడానికి వీలుగా దుర్దృష్టితో నిర్దేశింపబడినవనీ ఈ వర్కింగు కమిటీ వారభిప్రాయపడుతూన్నారు. భారత దేశ క్షేమానికి అవసరమైనప్పుడు అవసరమైన ప్రదేశాలలో విదేశీయుల ప్రయోజనాలకు ప్రతికూలంగా, భారతీయ పక్షపాత దృష్టి కలిగిఉండడానికి భారత దేశానికి హక్కున్నదని ఈ వర్కింగుకమిటీవారు నొక్కి వక్కాణిస్తూన్నారు.

"విదేశ పెట్టుబడిని కానీ, విదేశీయులశక్తి సామర్థ్యములను కానీ వినియోగించుకోవడానికి వర్కింగుకమిటీవారికెట్టి అభ్యంతరమూ లేదు. కాని ఇండియాలో అవి లభ్యం కానప్పుడున్నూ, ఇండియాకవి అవసరమైనప్పుడున్నూ మాత్రమే వాటిని వినియోగించుకోవలెను. అయితే ఆ పెట్టుబడికానీ, శక్తిసామర్థ్యములుకానీ భారతీయుల అధికారమునకూ పరిపాలనమునకూ యాజమాన్యమునకూ లోబడి భారతీయక్షేమమునకే వినియోగింపబడవలెను. "భారతీయుల పరిపాలనమునకూ అధికారమునకూ యాజమాన్యమునకూ లోబడని సంస్థలేవీ 'స్వదేశీ' సంస్థలుగా భావింపబడకూడదనికూడా వర్కింగుకమిటీ వారభిప్రాయపడి ప్రకటిస్తున్నారు. ప్రస్తుత భారతపారిశ్రామికాభివృద్ధికి ఫలితం భారతదేశపు సహజసంపత్తిని స్వప్రయోజనాలకోసం వినియోగించుకొనే విదేశీ పారిశ్రామిక సంస్థలు భారతదేశంలోకి ఒక్కుమ్మడిగా దిగుమతి కావడమే. అయితే దానిని కొంతకాలం ఆపి వుంచడంకూడా యుచితమేనని వర్కింగుకమిటీ వారభిప్రాయపడుతున్నారు.

"భారతదేశపు సహజసంపత్తీ భారతీయుల యాజమాన్యమూ, ఆధిపత్యమూ పరిపాలనములక్రింద జరిగే పరిశ్రమల నిర్మాణంద్వారా అభివృద్ధి కావలెననీ, అది భారతీయ ఆర్థిక స్వాతంత్ర్యమున కత్యవసరమనీ వర్కింగు కమిటీవారభిప్రాయపడుతూన్నారు.

ఈ ప్రపంచ సంక్షోభ కల్లోలములమధ్య హరిపురాలోని కాంగ్రెసు తన గృహచ్ఛిద్రాలను అంతఃక్లేశములనూ ఎదుర్కోవలసివచ్చింది. రాష్ట్రీయ స్వాతంత్ర్యం కేవలం కయ్యం తెచ్చుకోవలసిన తత్వంలో నడుస్తూన్నది. అప్పటికప్పుడే అనేక భేదభావాలు బహిరంగంగా చెలరేగి హరిపురాకాంగ్రెసుయొక్క పరిష్కారంకోసం

ఎదురుచూస్తున్నది. కాని కేంద్రప్రభుత్వంలో ఏమీ మార్పులేదు. నూరు సంవత్స రాలనాడెలా వుండేదో నేడూ అలాగే వుంది. నిరంకుశ వ్యక్తిపరిపాలనకు లోబడి వుంది. ప్రజలకు బాధ్యత వహించే స్థితిలోగాని, ప్రజాభిప్రాయాన్ని పాటించే స్థితిలో గాని లేదు. ఫెడరేషను నిర్మాణం కాంగ్రెసుకుగానీ, భారతీయ ప్రజకుగానీ, సిద్ధాం తంలో ప్రాతిపదికంగా కాకపోయినప్పటికీ అది భారత స్వాతంత్ర్యముపైన ఆధార పడి వుంటేనే పోషించేది. కాంగ్రెసు దానిని శాశ్వతంగా నిరాకరించింది. విదేశీయుల జోక్యం ఏమాత్రమూ లేకుండా, భారతీయులే తమ ప్రజాపరిషత్తుద్వారా భారత రాజ్యాంగపత్రమును నిర్మించుకోగలరని కాంగ్రెసు నిస్సందేహంగా విశ్వసించింది. రాష్ట్రీయ స్వాతంత్ర్యాన్ని అనుకూలించి పని చేయదలచుకొన్న కాంగ్రెసు, ప్రభు త్వము నిర్వర్తించవలసిన ప్రధాన ధర్మములకు తగిన బాధ్యత ఫెడరల్ ప్రణాళికలో స్పష్టం కానందుచేత, ఫెడరేషనును ప్రయత్నించి చూడడానికికూడా తలపెట్టలేదు. కేవలం బాధ్యత లేకపోయినందుకేకాక యింకా యితర కారణాలవల్లకూడా ఫెడరేషనును అంగీకరించడానికి వీలులేకపోయింది. ఫెడరేషన్‌లో చేర్చబడే భాగా లన్నీ స్వతంత్ర భాగాలుగా ఉండి దానాపు ఒకేరీతి స్వాతంత్ర్యాన్ని, పౌరసత్వము లనూ, ప్రజాస్వామ్య ప్రాతినిధ్య విధానమునూ కలిగిఉండాలి. అందు కనుగుణంగా ప్రాతినిధ్య సంస్థల నిర్మించడంలోనూ, బాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపించడం లోనూ, పౌరుల ప్రధాన స్వత్వములను రక్షించడంలోనూ, ఫెడరల్ శాసనసభల ఎన్నికలను జరుపడంలోనూ సంస్థానాలుకూడా రాష్ట్రాలకు సన్నిహితంగా ఉండే విధానాన్ని అవలంబించాలి. ఇందువలన సంస్థానాలనీ రాష్ట్రాలనీ భేద భావాలుపోయి సంస్థానాలకు అంతరంగిక కల్లోలములనుండీ బాహ్య సంక్షోభములనుండీ రక్షణకలుగు తుంది. అది లేక పోవడంవలన కాంగ్రెసు గత్యంతరంలేక, ప్రజాభిప్రాయానికి విరు ద్ధంగా ప్రవేశపెట్టబడే ఫెడరేషనును అన్ని విధాలా నిరోధించడానికి తీర్మానించింది.

ఫెడరేషనుకు సన్నిహితంగా సంబంధించిన సమస్యలు రెండు. అల్ప సంఖ్యా కుల హక్కులు, భారత సంస్థానాలు. కిందటి సంవత్సరం కాంగ్రెసులో చేరిన అల్ప సంఖ్యాక సంఘముల సంఖ్య అంతకంతకు పెరిగిపోయింది. వారందరూ భారత స్వాతంత్ర్య సంగ్రామమునకు సహాయంచేసి, ప్రజా సామాన్యమును స్వప్రయోజన పరుల దోపిడీ విధానమునుండి తప్పించడానికి కంకణం కట్టుకొన్నవారే కాంగ్రెసు మంత్రి వర్గాలు నిర్మింపబడిన తరువాత కాంగ్రెసు సభ్యులసంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. అందులోనూ ముఖ్యంగా అల్పసంఖ్యాక సంఘములవారి సభ్యత్వం ఎక్కువ కావడం గమనించదగిన విషయం. 1937 అక్టోబరులోనే వర్కింగు కమిటీద్వారా

ద్వారా కలకత్తాలో అల్పసంఖ్యాకుల హక్కులనుగూర్చి తన వైఖరిని కాంగ్రెసు విస్పష్టంచేసింది. భారత దేశంలోని అల్పసంఖ్యాకుల మతమునూ, భాషనూ, సంస్కృతినీ, మాత్రమే గాక, తదితర సత్వములను కూడా రక్షించడం తన ప్రధానకర్తవ్యంగా భావిస్తూ, తనతో సంబంధంగల ఏ ప్రభుత్వ ప్రణాళికలోనైనాసరే అల్పసంఖ్యాకుల అభ్యున్నతికిన్నీ దేశముయొక్క రాజకీయ ఆర్థిక వైజ్ఞానిక జీవితంలో సాధ్యమైనంత ఎక్కువగా వారు పాల్గొనడానికిన్నీ సావకాశము కల్పించబడునని హామీయిచ్చింది కాంగ్రెసు. అయితే రాజేన్ బాబు అధ్యక్షుడుగానున్న కాలమునుండే జరిగిన సంభాషణలుకానీ ఉత్తర ప్రత్యుత్తరాలుకానీ నిజానికి ఏవిధంగానూ ఫలప్రదములై ఆచరణలోకిరాలేను. కాబట్టి హిందూ మహమ్మదీయ సమాధాన సమస్యకు సంబంధించిన ఆ వివరాలను సమగ్రంగా ప్రత్యేకం మరొక అధ్యాయంగాకానీ లేదా మరొక గ్రంథంగాగానీ వ్రాయడం సముచితమని తోస్తుంది.

ఇక హరిపురా కాంగ్రెసులో ప్రఖ్యాతివహించిన మరొకసమస్య సంస్థానాల సమస్య సంస్థానాల సమస్యనుగూర్చిగానీ సంస్థాన ప్రజలలో కలిగిన రాజకీయ చైతన్యమునెడల కాంగ్రెసు అవలంబించవలసిన వైఖరిని గూర్చిగానీ, గాంధీకిన్నీ కాంగ్రెసులోని ఒక పక్షానికిన్నీ పొత్తుకుదరలేదన్న సంగతి విస్మరించకూడదు. 1934 ఏప్రిల్ 6వ తేదీనాడే సంస్థానాలనుగూర్చీ, సోషలిజమునుగూర్చీ, కాంగ్రెసు నిర్మాణమునుగూర్చీ కొన్ని అభిప్రాయములను వెల్లడిస్తూ గాంధీజీ ఒక ప్రకటనచేశాడు. ఇవి కాంగ్రెసులోనున్న ఒకపక్షానికి చెందినవారి అభిప్రాయాలకు కేవలం భిన్నంగావున్నవి. సంస్థాన ప్రజలు తమ సంస్థానాలలో జరిగే ఆందోళనకు బయటివారి సహాయాన్ని అపేక్షిస్తూన్నారనే అపోహకలగడం వలన కూడా కొంత చిక్కులేర్పడింది. వెంటనే సంస్థాన ప్రజామండలివారు తమయిల్లు చక్కబెట్టుకొన్నారు. తమ కమిటీలను సరిగా నిర్మించుకొని కరాచీలో 1936 జూలైలో అఖిల భారత మహాసభ జరుపుకొన్నారు. కాంగ్రెసు అవలంబించిన పద్ధతులకు సన్నిహితంగా పోలిఉన్న పద్ధతులపైన, సంస్థాన ప్రజ రాజకీయంగా పొందిన అభ్యున్నతికి నూతనాధ్యాయ ప్రారంభమిది. ప్రతిచోటా సంస్థాన ప్రజా సంఘములు స్థాపించబడి అఖిల భారత సంస్థకు శాఖలుగా ఏర్పాటయినవి. కొన్ని సంస్థానాల ప్రజామండలులు సంస్థాన ప్రజా సంస్థలకు వెలిగానున్న సంఘములతో సంబంధం పెట్టుకోకూడదనీ, అందులో ముఖ్యంగా కాంగ్రెసుతో అసలే యెట్టి సంబంధమూ కూడదని నిర్ణయించుకొన్నవి. కొన్ని సంస్థానాలలో సంస్థాన ప్రజా సంస్థలతోపాటు పక్కనే కాంగ్రెసు సంఘాలుకూడా పనిచేస్తూన్నవి. నిజానికి సంస్థాన ప్రజలు చాలా చిక్కులలోపడ్డారు.

కాంగ్రెసు నెడల వారికిగల భక్తి విశ్వాసములు దాచిపెట్టుకోవడానికి వీలులేనంత నిశ్చలమైనవి. కాని కాంగ్రెసుతో మిత్రత్వం పెట్టుకోవడానికి సహించని, వారి సంస్థాన ప్రభుత్వాలతో వారు పోరాటం పెట్టుకోవలసివచ్చింది. కొంతమంది సంస్థానాధిపతులు సంస్థాన ప్రజా సంఘాలను స్థాపించుకోవడానికికూడా యిష్టపడలేదు. 1921 నాటినరకూ కాంగ్రెసు నియమావళిప్రకారం సంస్థానాలలో కాంగ్రెసు కమిటీలు స్థాపించబడడానికి వీలులేకపోయినప్పటికీ, 1928 లో జరిగిన కలకత్తా కాంగ్రెసు నాటినుండీ ఒక నూతనాధ్యాయం ప్రారంభమయింది.

కలకత్తాలో చీమ దూరడానికి సందు సంపాదించుకొన్న సంస్థాన ప్రజలు తరువాత ఏనుగును దూర్చడానికి ప్రయత్నాలు చేయసాగించారు. సంస్థానప్రజల భారాన్ని యావత్తు కాంగ్రెసే వహించవలెనని కోరినారు. అధమం సంస్థాన ప్రజల రాజకీయ సంఘ నిర్మాణమునకు కాంగ్రెసే బాధ్యత వహించవలెనని ఆశించారు. అయితే కాంగ్రెసుకు ఈ కోరికను వ్యతిరేకించడానికి తగిన చిక్కులు లేకపోలేదు. సంస్థాన ప్రజలు సంస్థానాలకు బయటనున్న కాంగ్రెసు సంఘాలలో సభ్యులుగా చేరకూడదని నిషేధించినట్లయితే ఆ నిషేధం సంస్థానంలోని వ్యక్తులకూ సంస్థాన ప్రభుత్వానికీ సంబంధించిన సమస్య అవుతుంది. కాని మొదటినుండి చివరవరకూ అన్ని కాంగ్రెసు సంఘాలనూ క్రమానుగతంగా సంస్థాపించి వాటిని భారత జాతీయ మహాసభకు శాఖలుగా చేర్చి, దాని నియమావళిని అనుసరిస్తూ, దాని ఉత్తరువులను ఆచరిస్తూ దాని తీర్మానముల కనుగుణంగా ప్రవర్తిస్తూన్నప్పుడు, ఆయా సంస్థాన ప్రభుత్వాలకూ అచ్చటి స్థానిక కాంగ్రెసు సంఘాలకూ యేదైనా సంఘటన తటస్థమైతే, అది కాంగ్రెసు సంస్థలకూ సంస్థాన ప్రజలకుకూడా సంబంధించి తక్షణం పరిష్కరింపబడవలసిన ప్రధాన సమస్య అవుతుంది. మొత్తం 562 సంస్థానలలో స్థానికంగా అనేక విచిత్ర పరిస్థితులుండవచ్చును. సంస్థానాధి పతులలోకూడా విపరీత చిత్తవృత్తి కలవారనేకులుండవచ్చును. వీటిని గమనించకుండా కాంగ్రెసు నిర్మాణమును సంస్థానాలలో ప్రవేశ పెట్టడం లేనిపోని చిక్కులను తలకు చుట్టుకోవడమవుతుంది. అది కాంగ్రెసుకు ఆచరణయోగ్యంకానిపని, సంస్థానాలలో కాంగ్రెసు కమిటీలను స్థాపించవచ్చునాఅనీ, రాష్ట్రాలలోని కాంగ్రెసు కమిటీల నియమావళినే సంస్థానాల కాంగ్రెసు కమిటీలకుకూడా సమానంగా వర్తింపచేయకూడదా అనీ మరొక సమస్య వచ్చింది. హరిపురాలో హరిపురా కాంగ్రెసుకు కొద్దిగా పూర్వం, నవసారీలో సమావేశమైన "సంస్థాన ప్రజా సంఘం" వారీ సమస్యకు ఒక తేలికయిన పరిష్కారమార్గం సూచించారు. అదేమంటే కాంగ్రెసు నియమావళి ఒకటో సూత్రంలో 'ఇండియా' అనగా

సంస్థాన ప్రజానీకంతో కూడిన 'భారత ప్రజ' అని మార్పుచేస్తే చాలునని సూచించబడింది. సంస్థాన ప్రజానీకంతో కాంగ్రెసుకు సానుభూతి కలదనే విషయం స్పష్టం చేయడానికిన్నీ, కాంగ్రెసు, వారికి సహాయం చేసే వైఖరిలోనే ఉన్నదని మరొకసారి విశ్వాసం కలిగించడానికిన్నీ అ. భా. కాం. సం. సంస్థాన ప్రజల స్థితి గతులను విచారించేందుకు ముఖ్యంగా వారి ప్రాథమిక సత్వాలను గూర్చీ రాజ్యాంగ నిర్మాణమును గూర్చీ, భూములకు సంబంధించిన పరిస్థితులను గూర్చీ, ప్రభుత్వమువారి యాజమాన్యము కిందనడిచే పర్యాధికార వ్యాపారమును గూర్చీ, కొన్ని నిర్ణీత భారత సంస్థానాలలో విచారణచేసి రాబోయే కాంగ్రెసుకు ముందుగా నివేదికను పంపవలెనని ఒక ఉపసంఘాన్ని నియమించారు 1937 అక్టోబరు నెలలో కలకత్తాలో అ. భా. కాం సం. వారు చేసిన తీర్మానాన్ని గాంధీజీ ఆమోదించకపోవడమే గాక దానిని గాంధీజీ తీవ్రంగా విమర్శించాడుకూడా తాను అధ్యక్షుడుగా ఉండి ఆ తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి ఒప్పుకొన్నప్పటికీ, తన కళ్ల యెదుటనే అది అంగీకరింపబడినప్పటికీ, జవహరలాలు నెహ్రూకు కూడా ఆ తీర్మానం నచ్చలేదు. అయితే ఆయన అధ్యక్షతకింద జరిగినంతమాత్రంతో ఆ తీర్మానానికి ఆయనయొక్క హృదయపూర్వక సంపూర్ణామోదం ఉండితీరాలని అర్థంకాదు. కలకత్తాలో అ. భా కాం సం ముందు విచారణకువచ్చిన ఆ తీర్మానం తన కిష్టం లేదని హరిపురాలో జవహరలాలు స్వయంగా అన్నాడు. అంటే మైసూరు నిర్బంధ విధానాన్ని ఖండించడానికి ఆయన ప్రతికూలుడని వ్యాఖ్యానం చెప్పకూడదు. నిజానికి ఆయన హృదయపూర్వకంగా దానికి అనుకూలుడు. కాని దేశం చాలా పెద్ద పెద్ద సమస్యలనూ అత్యంత విషమస్థితినీ ఎదుర్కోవలసిన తరుణంలో, "కాంగ్రెసు పేరుకు సంబంధించినంతవరకు మన తీర్మానం కొంత మార్దవంగానూ, మన కార్యకలాపం కొంత మృదులంగానూ ఉండి, బ్రిటిష్ ఇండియాలోనేకాక సంస్థానాలలోకూడా పర్యటించుకొనేటందుకు తగినబలాన్ని మనం సంపాదించుకోవడం మంచిదని" ఆయన అభిప్రాయం. "ఈనాడు భారత సంస్థానాలతోసహా ఇండియా అంతటిలోనూ అపూర్వ చైతన్యం కలుగుతూన్నది. మనం దానికి దోహదంచేసి, పుష్టిచేసి మనబలాన్ని సరిగా కూడగట్టుకోగలగాలి" అన్నాడు నెహ్రూ. వర్కింగుకమిటీవారు తయారుచేసిన చిత్తు తీర్మానంలో, సంస్థానాలలో కాంగ్రెసు సంఘాల నిర్మాణమును నిషేధిస్తూ వ్రాయబడిన భాగం తీవ్ర వాదోపవాదాలకు గురియైనది. మైసూరులో ఇటీవల జరుగుతూన్న సంఘటనలను అక్కడ నడుస్తూన్న శాసనోల్లంఘనోద్యమమును గమనించిన తరువాత, సంస్థానాలకు వెలుపల కాంగ్రెసు అవలంబిస్తూన్న ప్రస్తుత విధానమంతుకు

భిన్నంగా ఉండడంచేత, మైసూరు శాసనోల్లంఘనములో తాను చిక్కుకొనేయెడల దేశంలోని తదితర భాగాలలో కలిగే అపోహలనూ పరివర్తనములను అవగాహన చేసుకొని కాంగ్రెసు అందుకు ఆమోదించలేదు శాసనోల్లంఘన విషయంలో సంస్థానాలలోవుండి సంస్థాన ప్రజకు కాంగ్రెసు సహాయం చేయజాలదనీ, నిర్మాణకార్యక్రమం విషయంలో అయితే కాంగ్రెసుయొక్క అఖిలభారత అనుబంధసంస్థలు, కాంగ్రెసునుండి దాదాపు స్వతంత్రంగా వ్యవహరించడానికి అక్కడ ఉండనే ఉన్నవనీకూడా విశదీకరించబడింది. కాబట్టి సంస్థానాలలోని ప్రజాసంఘములు, కాంగ్రెసుపేరును తగిలించుకోవడం వాటికి ఉపకారం కాకపోగా, పైపెచ్చు వాటి కార్యక్రమానికి అభ్యంతరం కూడా కాగలదు. కాలం త్వరలోనే మారిపోతుందనడానికేమీ సందేహంలేదు. ఐతే ఈలోగా సంస్థాన ప్రజలు తమ కాళ్ళమీద తాము నిలబడడం మంచిది. కాంగ్రెసు ఎప్పుడైనా తన నిర్ణయాన్ని మార్చుకోవచ్చును. కాని సంస్థాన ప్రజాపక్షంవారి నిర్ణయాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నారు. ఏదైనా ఒక బ్రిటిష్ రాష్ట్రం కోరినట్లుగానే మైసూరుకూడా శాసనోల్లంఘనం జరుపడానికి అనుజ్ఞకోరింది. ప్రజా సామాన్యంతో సన్నిహితసంబంధం ఎక్కువగాచేసుకోవలెననేఇటీవలి కాంగ్రెసుకార్యవిధానమని అందరికీ బాగా తెలిసిందే కాని వర్కింగుకమిటీవారినాటి చిత్తుతీర్మానం ప్రజలను ఆశ్చర్యచకితులనుగాచేసింది. ఒక్క సంస్థానాలలోని కమిటీలే నిషేధింపబడలేదు. మంచి కమిటీలు చెడ్డకమిటీలు అనేవి సంస్థానాలలోనూ ఉన్నవి. రాష్ట్రాలలోనూ ఉన్నవి. హిందూదేశంయావత్తూ ఒకసారి ముందుకునడవాలి. ఒకభాగం వెనుకపడి ఉండడం ఇంకో భాగం ముందుకు నడుగెత్తడం కూడదు. మనపక్కనున్న ౫౬౨ సంస్థానాలు, ఐర్లండులోని అల్స్టరువలె వేరుపడి ఉండడానికికూడా మనం ఒప్పుకోము. సంస్థానాలలో ప్రత్యేక సంఘాలు స్థాపించబడవలెనని కాంగ్రెసు ఇచ్చిన సలహావలన స్వార్థపరులా సంఘాలకు ప్రతిగా పోటీ సంఘాలను స్థాపించి అసలు సంఘాలను నిర్మూలించవచ్చునుకూడా. అనేక కులాలకూ కలాలకూ సంబంధించిన సంఘాలతో సంస్థానాలు చిందరవందరకాగలవు. కాబట్టి భారతదేశానికి మోక్షమిప్పించగలిగిన సంస్థ ఒక్క ఇండియన్ నేషనల్ కాంగ్రెసే. ఆ ఒక్క జాతీయసంస్థయే అన్నిశక్తులకూ జన్మస్థానం. జాతీయశక్తి అంతా అక్కడనుండియే విజృంభిస్తుంది. సంస్థానాలలో సరియైన కాంగ్రెసు బీజమును నాటితేనేతప్ప, లేకపోతే వాటిలో కులతత్వాలను పెంపొందించడం అవుతుంది. కనుక చిట్టచివరకు ఒక రాజీకుదిరింది. దాని ప్రకారం సంస్థానాలలో కాంగ్రెసు కమిటీల నిర్మాణాన్ని నిషేధించక వర్కింగు కమిటీవారి చిత్తుతీర్మానం ౫ వ పేరాలోనిచివరి వాక్యానికి బదులుగా ఈ కింది భాగం చేర్చబడింది

"కాబట్టి ప్రస్తుతం సంస్థానాలలోని కాంగ్రెసుకమిటీలు వర్కింగు కమిటీవారి యాజమాన్యముకింద వారి ఆదేశానుసారంగా వ్యవహరించవలెననీ, పార్లమెంటరీ కార్యక్రమంతోగానీ ప్రత్యక్షచర్యలోగానీ కాంగ్రెసు పేరుతో గానీ కాంగ్రెసు నాయకత్వం కిందగానీ అని జోక్యం కల్గించుకోకూడదనీ ఈ మహాసభ ఆదేశిస్తున్నది. సంస్థానాల ఆంతరంగిక పోరాటాలు కాంగ్రెసు పేరున జరుగకూడదు. ఇందుకు లోబడి కాంగ్రెసు నిర్మాణం ప్రారంభం కావలెను. కాంగ్రెసు కమిటీ నిర్మాణకే ఉన్నచోట్ల అవి కొనసాగవలెను"

అయితే యింతటితో ఈ విషయం సమాప్తి కాలేదు. కాంగ్రెసు మహాసభలో సంస్థాన ప్రజాసంస్థకు సంబంధంలేని కొంతమంది ప్రోత్సాహంతో ఈ రాజీని భగ్నం చేయడానికి ప్రయత్నాలు జరిగినవి కాని ఈ ప్రయత్నము సంస్థాన ప్రజాసభ పక్షాన గల శక్తులు గట్టిగా భగ్నంచేసి రాజీని గౌరవప్రదంగానూ జయప్రదంగానూ ఆచరణలోకి తేగలిగారు. ఆనాటినుండీ సంస్థాన ప్రజాసంఘాలలో పనిచేసేవారున్నూ కాంగ్రెసున్నూ ఎక్కువ సామరస్యంతోనూ దాదాపు ఐక్యదృక్పథంతోనూ వ్యవహరిస్తూన్నారని చెప్పాలి. ఈ ఉభయులకూ బాగా సన్నిహిత సంబంధం కుదిరింది. రెండు మార్గాల నడుస్తూన్న రెండు రైళ్లు ఒకటిగా కలసి ఒకే త్రోవను గాంధీజీ సారధ్యం కింద పరుగు పెడుతూన్నవి. సంస్థానాల విషయాలన్నింటికీ ఆయన ఒక్కడే మంచి సలహాదారు. తూర్పు యేజన్సీ సంస్థానాలలో జరుగుతూండిన అపూర్వనిర్బంధ విధానమున్నూ అభివృద్ధినిరోధక భయంకరచట్టాలున్నూ ప్రతికూల ప్రదర్శనాలకూ మూకదౌర్జన్యానికి దారితీయడమూ ఆ సంఘటనలో ఆ సంస్థానాల అసిస్టెంటు ఏజెంటు మిస్టరు బేజల్‌ఘట్ (Bazleghatt) హత్యచేయబడడమూ తరువాత ప్రభుత్వమువారు భీషణచర్యలకు భయభ్రాంతులై 20,000మంది ప్రజలు సమీపమునకల బ్రిటిష్ ఇండియా ప్రదేశంలోకి పారిపోయి రావడమూ- అత్యంత అభ్యున్నతికి వచ్చిన మైసూరురాజ్యం లోని విదురాశ్వథంలో పోలీసుల తుపాకీ కాల్పులవల్ల పదిమంది హతులై ఇరవైమందికి గాయాలు తగలడం ఇంకా అనేకచోట్ల కాల్పులు జరిగినప్పటికీ ఆవిషాద సంఘటనల స్వభావమునుగూర్చిగానీ కారణాలనుగూర్చిగానీ మామూలు విచారణలైనా జరిపి ఆందోళిత ప్రజాహృదయాలకు శాంతి చేకూర్చకపోవడమూ- రాజకోటలో సంస్థానాధిపతియున్నూ ఆయన దివానున్నూ చేసిన వాగ్దానాలను చెల్లించకపోగా సత్యాగ్రహసైనికులు బారులుతీర్చి ప్రత్యక్షపోరాటం సాగించిన చరిత్రాత్మక విషయమున్నూ రాజపుత్రస్థానంలోను, మధ్య ఇండియా సంస్థానములలోను, జయపురంలోవలెనే ప్రజామండలి సంస్థాపనకు క్షామనివారణ కార్యక్రమంవంటి మహోదాత్త సంఘసేవా

పరాయణత్వముకూ కూడా అడ్డంకులు కల్పించడమూ, పాంచాలములోని ఉత్తర హిందూస్థాన సంస్థానాలలోనూ, కాశ్మీరంలోనూ వందలకొలదీ వేలకొలదీ సత్యాగ్రహులను కారాగారశిక్షలకు గురిచేయడమూ, ఇటువంటి సంఘటనలు జరిగినప్పుడల్లా అందరికళ్ళూ గాంధీజీమీద ఉండేవి. దీనికితోడు 1939 ఫిబ్రవరిలో లూధియానాలో అఖిలభారత సంస్థాన ప్రజా మహాసభకు (All India States People's Conference) జవహరులాలు అధ్యక్షస్థానము నంగీకరించడంతో సంస్థానాల రాజకీయాలకూ రాష్ట్రాల రాజకీయాలకూ ఎక్కువ సన్నిహిత సంబంధం కుదిరింది. అంతటితో ఆంతరంగిక భేదాభిప్రాయాలూ అసంతృప్తులూ శాశ్వతంగా సమసిపోగలవని అందరూ ఆశించారు.

హరిపురా సంఘటనలకు అవసరమైనదానికంటెకూడా చాలా ఎక్కువగా సంస్థాన ప్రజాసమస్యనుగూర్చి ఇక్కడ చర్చించాము దీనికి కారణమేమంటే హరిపురాలో సంస్థాన ప్రజాసమస్య సందర్భంలో ఒక నూతనశకం ప్రారంభమయింది. కాబట్టి క్రొత్తగా ఉదయించే సమస్యల పూర్వాపర సందర్భాలను విచారించటానికి ఉచితమైన తరుణమిదే. మనలను కల్లోలపరుస్తూన్న మఱొక సమస్య దేశంలో వడుస్తూన్న కిసాన్ ఆందోళన. దీనివలన కలుగుతూన్న చిక్కులెటువంటివో వాటి వ్యాప్తి ఎట్టిదో సూచిస్తూ క్రిందటి అధ్యాయాలలో కొంత వివరించి ఉన్నాము. హరిపురాలో ఈ సమస్యనుగూర్చి కాంగ్రెసు యెట్టివైఖరి అవలంబించవలెనో స్పష్టంగా వివరించవలసివచ్చింది. వృత్తులకు, ప్రయోజనములకు, సంబంధించిన ఉపసంఘాల(Subsidiary Organisations)నిర్మాణమునకు కాంగ్రెసు ఎన్నడూ కాదనలేదు. ఇండియాలో నూటికి 75 మంది ముఖ్యంగా కిసానుల కష్టసుఖాలతో సన్నిహిత సంబంధమున్నవారే. కాంగ్రెసు సభ్యత్వంలో అత్యధికం కిసానుల ప్రోత్సాహంవలన కిసానుల శ్రద్ధవలనా చేర్చబడిందే. ఈ పరిస్థితులలో రైతు సంఘాలను నిర్మించుకోవడానికి కిసానులకుగల హక్కులను కాంగ్రెసు ఎల్లప్పుడూ పూర్తిగా గుర్తిస్తూనేవచ్చింది. కేవలం భూసంబంధమైన విషయాలలో పరిహారం లభించినంత మాత్రంతో చాలదు భారతప్రజలను స్వార్థంకోసం యెవరూ వినియోగించుకోకుండా ఉండే పద్ధతిమీద, భారత స్వాతంత్ర్య సంపాదనవంటి మహత్తర విషయంకూడా కిసానులకు సంబంధించినదే. అందువలన కిసానులు కేవలం తమంతట తాము సంఘాలుగా ఏర్పాటుకావడమేగాక కాంగ్రెసులో అత్యధిక సంఖ్యాకులుగాజేరి, తమవారినందరినీ కూడగట్టుకొని నిజంగా కాంగ్రెసు పతాకంక్రిందనే వారి ప్రత్యేకపోరాటాన్ని ంచవలసివుంది దీనికి బదులుగా చాలాచోట్ల కిసానులు ఎర్రజెండాలను ఎగుర

చేస్తూ కాంగ్రెసు ఎడల విరోధవైఖరిని అవలంబించ ప్రారంభించారు. కాంగ్రెసు ఆదర్శములలో వారంగీకరించక పోవడంవలనగాక, కాంగ్రెసు, వారిపనులను సమగ్రంగానూ తొందరగానూ నిర్వహించేస్థితిలో లేనందుననే వారావైఖరిని అవలంబించారు. ఇటువంటి వేగిరపాటువలననే కాంగ్రెసువాదులైన కిసానులుకూడా అక్కడక్కడా కాంగ్రెసు ప్రధాన సిద్ధాంతములకు ప్రతికూలములైన చర్యలకు కడంగి, కాంగ్రెసు సిద్ధాంత విధానములకు విరోధంగా ఉండే వాతావరణాన్ని కల్పించడానికి తోడ్పడ్డారు. కాబట్టి హరిపురా కాంగ్రెసు ఈ పైవిషయాలను జ్ఞాపకముంచుకొని అవసరమైన సందర్భాలలో తగినచర్య నడపవలెనని రాష్ట్రకాంగ్రెసు సంఘాలకు ఉత్తరువులు జారీచేసినప్పుడు, కాంగ్రెసు వర్కింగుకమిటీయొక్క క్షమా సహనములు హద్దులుచేరినవన్న ఊహించవచ్చును.

హరిపురా కాంగ్రెసునాడు భారతదేశం లోపలా వెలుపలాకూడా అనేక క్లిష్ట పరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చిందని యిదివరకే చెప్పిఉన్నాను. భారతదేశమునకు వెలుపలగల అనేక క్లిష్టసమస్యల స్వభావ లక్షణములను ఉదాహరించిఉన్నాముకూడా. ఇక నూతనరాజ్యాంగ శాసనమును అమలుపరచడం విషయంలో వచ్చిన తగాదాయే భారతదేశపు ఆంతరంగిక సమస్య. హరిపురా కాంగ్రెసు సమావేశంనాటికి నూతన రాష్ట్ర ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చి ఎనిమిది మాసములు మాత్రమే అయింది. అయితే ఈ అధ్యాయం ప్రారంభంలో చెప్పినట్లుగా బీహారు సంయుక్తరాష్ట్రాలలో కొన్ని తగాదాలు వచ్చినవి. కాంగ్రెసువాదుల ఉద్యోగ స్వీకరణమునకు ముందుగల కొన్ని రాజకీయ దశలను జ్ఞాపకం చేసుకొంటేనే తప్ప ఈ తగాదాలకు మూలం బాగా బోధపడదు. అవి కాంగ్రెసు తీర్మానంలో విపులంగా వ్రాయబడినవి. కాబట్టి ఆ తీర్మానాన్ని ఇక్కడ పూర్తిగా వుదహరిస్తున్నాను ఈ దిగువ తీర్మానములు రెండూ కిసాను సభలకు మంత్రివర్గాల రాజీనామాలకూ సంబంధించినవి.

## కిసాను సభలు

"ఇండియాలోని కొన్ని ప్రదేశాలలో కిసానుసభలనుగూర్చి,తదితరసంస్థలనుగూర్చి కొన్ని చిక్కులు కలిగినందున, వాటియెడల తానవలంబించదలచుకొన్న వైఖరిని విస్పష్టంచేస్తూ కాంగ్రెసు తన స్థితిని వ్యక్తపరచ కోరుతూన్నది. కిసానులు రైతు సంఘాలలో చేరి తమ బలాన్ని కూడగట్టుకోవడానికి గల హక్కును యిదివరకే కాంగ్రెసంగీకరించింది. అయితే కాంగ్రెస్సే, ప్రధానంగా రైతుల సంస్థఅనీ దానికి ప్రజా సామాన్యంతో

సన్నిహిత సంబంధం కలిగిన కోట్ల అసంఖ్యాకులైన కిసానులు కాంగ్రెసులో చేరి దాని కార్య విధానములో పరివర్తనం కలిగించారనీ జ్ఞాపకం ఉంచుకోవాలి. కిసాను ప్రజా సామాన్యముయొక్క ప్రయోజనాలకోసమే కాంగ్రెసు నిలబడాలి. నిజంగా అదిఅలాగే నిలబడి వారి హక్కులను బలపరుస్తూ, ప్రజా సామాన్యమును స్వార్థదృష్టితో ఎవ్వరూ వినియోగించుకోవడానికి వీలులేకుండాఉండే విధానంగల భారత స్వాతంత్ర్యానికి కృషి చేస్తూన్నది. ఈ స్వాతంత్ర్య సంపాదనమునకూ, కిసానులను బలపరచి వారి కోరికలను సిద్ధింపచేసేటందుకు, కాంగ్రెసును బలిష్ఠంగా చేయడం అవసరం. కిసానులింకనూ అత్యధిక సంఖ్యాకులుగా కాంగ్రెసులో చేరి తమ పోరాటాన్ని కాంగ్రెసు ఝండాకిందనే సాగించడానికి సంసిద్ధం కావలెనని కాంగ్రెసువారిని ఆహ్వానిస్తూన్నది. కాబట్టి భారతదేశంలోని ప్రతిగ్రామంలోనూ కాంగ్రెసుసంస్థను వ్యాపింపచేసి, దానిని దుర్బలపరచే యెట్టిపనినీ యేవిధంగానూ చేయకుండా ఉండడం కాంగ్రెసు వాదుల కర్తవ్యం.

“కిసానుసభలను నిర్మించుకొనే హక్కు కిసానులకు కలదని పూర్తిగా అంగీకరిస్తూన్నప్పటికీ, కాంగ్రెసుయొక్క ప్రధాన సిద్ధాంతములకు ప్రతికూలంగా ఉండే ఎట్టి కార్యకలాపములతోనూ కాంగ్రెసు ఏకీభవించజాలదు. కిసానుసభలలో సభ్యులైన కాంగ్రెసువాదులు కాంగ్రెసు సిద్ధాంతములకూ కార్యక్రమములకూ ప్రతికూలమైన వాతావరణాన్ని సృజించడానికి సహాయపడుతూండడం కూడా కాంగ్రెసు సహించజాలదు. కాబట్టి పై విషయాలను మనస్సులో పెట్టుకొని, వాటి కనుగుణంగా అవసరమైనచోట్ల తగినచర్య తీసుకోవలెనని, రాష్ట్ర కాంగ్రెసుకమిటీలకు, కాంగ్రెసు ఆదేశిస్తూన్నది”

బీహారు సంయుక్త రాష్ట్రాలలో మంత్రుల రాజీనామా “ఫైజ్‌పూరు కాంగ్రెసు ఆదేశానుసారంగా 1937 మార్చిలో అ. భా. కాం. సం. వారు, రాష్ట్రాలలో ఉద్యోగ స్వీకరణం చేయవలెనని నిర్ణయించారు. ఆప్రకారం, ప్రభుత్వంవారు స్వయంగాగాని వారిపక్షాన మరొకరుగాని కొన్ని హామీలిచ్చినట్లయితే కాంగ్రెసువాదులు మంత్రివర్గ నిర్మాణమునకు పూనుకోవచ్చునని అనుజ్ఞయిచ్చారు. ఈహామీలు రానందున రాష్ట్రీయ శాసనసభలలోని కాంగ్రెసుపక్ష నాయకులు మంత్రివర్గ నిర్మాణమును చేయనిరాకరించారు. తరువాత కొన్ని నెలలవరకూ ఈ హామీలనుగూర్చి కొంత వాద ప్రతివాదాలు జరిగినవి. ఈ సందర్భంలో భారతరాజ్యాంగ కార్యదర్శి, రాజప్రతినిధి రాష్ట్ర గవర్నర్లుకూడా అనేక ప్రకటనలుచేశారు. వాటిలో ఇతర సంగతులతోపాటు

బాధ్యతాయుత మంత్రులచే నడపబడుతూన్న రాష్ట్ర వ్యవహారాలకు సంబంధించిన రోజువారి పరిపాలనలో గవర్నర్లు జోక్యంకల్గించుకోరని స్పష్టంగా ప్రకటించబడింది.

రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రుల అనుభవమునుబట్టి అధమం రెండు రాష్ట్రాలలో - బీహారు సంయుక్తరాష్ట్రాలలో, రాష్ట్ర వ్యవహారాల దినసరి పరిపాలనలో గవర్నర్లు జోక్యం కల్గించుకొంటూన్నట్లు ఈకింది సందర్భములనుబట్టి స్పష్టపడుతూ వ్నది. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో రాజకీయఖైదీల విడుదల, కాంగ్రెసు కార్య క్రమమున ఒక ముఖ్యవిషయంగా పేర్కొనబడినట్లు మంత్రివర్గాల నిర్మాణమునకు కాంగ్రెసువారిని ఆహ్వానించినప్పుడే గవర్నర్లకు తెలుసును. దాని కనుగుణంగానే మంత్రులు రాజకీయఖైదీల విడుదలను ప్రారంభించారు. గవర్నర్లా విడుదలను అంగీకరించడంలో మంత్రులకు విసుగుకల్గేటంత ఆలస మవుతూవచ్చింది. ఈ ఆలస్యం నాటి మాటికి కావడం మంత్రుల ఆదర్శప్రాయమైన సహనమునకు ప్రత్యక్షనిదర్శనం రాజకీయఖైదీల విడుదల రోజువారీ పరిపాలనకు సంబంధించిన విషయమని కాంగ్రెసు అభిప్రాయం. అందువలన ఆ సందర్భంలో గవర్నర్లతో దీర్ఘసంభాషణలు జరుపవలసినంత అవసరం మంత్రులకు లేదు. మంత్రులకు మార్గదర్శకుడుగానూ, సలహాదారుడుగానూ ఉండడమే గవర్నర్ల పని. అంతేకాని మంత్రుల దినసరి కార్యనిర్వహణములో వారి స్వతంత్ర నిర్ణయంతో జోక్యం కల్గించుకోవడంకాదు. కాంగ్రెసు ప్రతినిధులకున్నూ, వారిని బలపరుస్తూన్న ప్రజాసామాన్యమునకున్నూ లేఖ సంవత్సర నివేదికను సమర్పించవలసిన సమయంలో, కాంగ్రెసు వర్కింగుకమిటీవారు, మంత్రులు ముందుగా తమబలాన్ని నిర్ణయించుకొని రాజకీయఖైదీల విడుదలకు ఉత్తరువులు జారీచేయవలసిందనీ ఆ ఉత్తరువులు ప్రతిఘటింపబడినప్పుడు వెంటనే రాజీనామా యియ్యవలసిందనీ వారిని ఆదేశించారు. బీహారు సంయుక్తరాష్ట్రాల మంత్రులు తీసుకొన్నచర్యను కాంగ్రెసు ఆమోదించి బలపరుస్తూ వారినావిషయంలో అభినందిస్తూన్నది కూడా.

ఆయా రాష్ట్రాల ప్రధాన మంత్రులు సాలోచనతో తీసుకొన్న చర్యతో గవర్నరు జనరలు జోక్యం కలిగించుకోవడం, పైన ఉదాహరింపబడిన హామీలకు విరుద్ధంగా ప్రవర్తించడమేగాక, భారతరాజ్యాంగ చట్టం 126(5) సెక్షనును దుర్వినియోగం చేయడంకూడాఅవుతుందని కాంగ్రెసు అభిప్రాయపడుతున్నది. ఈసందర్భంలో శాంతిభద్రతలకు భంగం కలుగుతుందనేవి శేషభయంకూడా లేదు. అంతేకాక యీరెండు రాష్ట్రాలలోని ప్రధాన మంత్రులూ, ఆయా ఖైదీలిచ్చిన హామీలతోనూ వారి చిత్తవృత్తిలో కలిగిన మార్పు కనుగుణంగా ఆ ఖైదీలవలంబించిన అహింసా విధానంతోనూ సంతృప్తులైనారు. నిజానికి గవర్నరు జనరలీ సందర్భంలో జోక్యం కల్గించు

పోవడంవలననే కాంగ్రెసుచేసే ప్రయత్నాలకు విరుద్ధంగా కూడా శాంతిభద్రతలకు భంగం కలుగవచ్చుననే పరిస్థితి నిస్సందేహంగా యేర్పడింది.

కాంగ్రెసువాదులు పదవులలోనున్న కొలదికాలంలోనే వారి స్వార్థత్యాగమునకూ పరిపాలనా సామర్థ్యమునకూ, నిర్మాణశక్తికీ ప్రత్యక్ష నిదర్శనంగా ఆర్థిక, సాంఘిక దురవస్థలను తొలగించేటందుకు అనేకశాసనాలను చేశారు. గవర్నరులు కూడా ఈ సందర్భంలో మంత్రులతో కొంతవరకు సహకారం చేశారని కాంగ్రెసు సంతోషంగా అంగీకరిస్తూన్నది. ఇండియా చట్టముద్వారా ప్రజలకు ఉపకారం చేయడానికెంతవరకు సావకాశమున్నదో దానిని వినియోగించుకొంటూ సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనా ప్రయత్నంలో భారత ప్రజానీకమును బలిష్ఠంగాచేసి భారత ప్రజాసామాన్యమును సామ్రాజ్యవాదుల దోపిడీవిధానమునుండి తప్పించడానికే కాంగ్రెసు చేస్తూన్న ప్రబల ప్రయత్నమంతాను.

కాంగ్రెసు సత్యాహింసల కనుగుణమైన దౌర్జన్యరహిత సహాయనిరాకరణమునకుగాని, మరొక ప్రత్యక్షచర్యకుగానీ, దిగి క్లిష్టపరిస్థితిని తీసికొనిరావలెనని ఇచ్ఛగించడంలేదు. కాబట్టి తదితర రాష్ట్రాలలోని మంత్రులు గవర్నరుజనరలు చర్యను ప్రతిఘటిస్తూ రాజీనామాలీయవలెనని కాంగ్రెసుఅభిలషించడంలేదు. గవర్నర్లు శాసనానుగుణంగా వ్యవహరిస్తూ రాజకీయఖైదీల విడుదల సందర్భంలో మంత్రుల సలహాను అంగీకరించడానికి వీలుగా తన నిర్ణయమును పునరాలోచన చేసుకోవలెనని గవర్నరుజనరలును కాంగ్రెసు ఆహ్వానిస్తూన్నది.

కేవలం ఖడ్గబలంతో నడిపించే పరిపాలనమును ఒకవిధంగా కనపడకుండా సాగించటానికి మాత్రమే బాధ్యతలేని మంత్రివర్గాలేర్పాటు చేయబడుతూన్నవని కాంగ్రెసు భావిస్తూన్నది. అటువంటి మంత్రివర్గాలు ద్వేషాన్నీ అంతరంగిక పోరాటములనూ ఎక్కువగా పురికొల్పి బ్రిటిష్ ప్రభుత్వమునెడల ఆగ్రహమును పెంపొందించడానికే ఉపయోగపడతవి. ఎంతో సంశయంతోనూ అయిష్టంగానూ పదవీస్వీకరణమును కాంగ్రెసు అంగీకరించినప్పుడు ఇండియా ప్రభుత్వ చట్టముయొక్క సహజ లక్షణాన్ని అది సరిగా అర్థం చేసుకోకపోలేదు. గవర్నరుజనరలు మరీ ఇటీవల తీసుకొన్న చర్యవలన కాంగ్రెసు భారత రాజ్యాంగ చట్టమునుగూర్చి వేసుకొన్న అంచనా సరియైనదేనని యింకా ధ్రువపడుతూన్నది. అది ప్రజలకు నిజమైన స్వాతంత్ర్యమును తీసికొనిరాకపోగా పైపెచ్చు బ్రిటిషు ప్రభుత్వంవారు ప్రజల స్వాతంత్ర్యమును విస్తరింపచేయడానికి బదులుగా దానిని అరికట్టడానికే ఆ చట్టాన్ని వ్యాఖ్యానం చేస్తూ

ఉపయోగించుకొంటూన్నట్లు కనబడుతూన్నవి. కాబట్టి నేటి విషమపరిస్థితియొక్క పర్యవసానమేమైనప్పటికీ ఈ చట్టం నిర్మూలింపబడి వయోజన నియోజకవర్గముద్వారా ఎన్నుకోబడిన ప్రజాపరిషత్తు దీనికి బదులుగా నూతన రాజ్యాంగచట్టమును నిర్మించే టంతవరకూ, భారతదేశానికి నిజమైన మోక్షంలేదని భారత ప్రజానీకం గ్రహించాలి. కనుక పదవులలో ఉన్నా లేకపోయినా, శాసనసభలలో ఉన్నా వాటికి వెలుపల ఉన్నా కాంగ్రెసువాదులందరూ ఆ ఆదర్శాన్ని అందుకోవడమే ప్రధానాశయంగా ఉండాలి. అయితే అందుకోసం ప్రయత్నించడంలో ప్రస్తుతం అనేక ప్రయోజనాలను త్యాగంచేయవలసి ఉంటుంది. అయినప్పటికీ లక్ష్యపెట్టరాదు.

కాకోరీ ఖైదీల విడుదల సందర్భంలో జరిగిన ప్రదర్శనాలున్నూ వారిలో కొందరుచేసిన ఉపన్యాసాలున్నూ, రాజకీయ ఖైదీలను క్రమక్రమంగా విడిచిపెట్టవలెననే ప్రభుత్వవిధానమున కడ్డంకు కల్గించిందని సంయుక్తరాష్ట్రముల గవర్నరు వాదిస్తున్నాడు. కాంగ్రెసెప్పుడూ అయుక్త ప్రదర్శనములనూ అనుచితచర్యలనూ నిరుత్సాహపరుస్తూనే ఉన్నది. సంయుక్తరాష్ట్రముల గవర్నరుచే పేర్కొనబడిన ప్రదర్శనాలనూ ఉపన్యాసాలనూ గాంధీజీకూడా గట్టిగా ప్రతికూలించాడు. కాంగ్రెసు అధ్యక్షుడు పండిత జవహరలాలుకూడా పైకి ఉప్పొంగిన ఆ అవినయాన్ని గమనించాడు. మంత్రులుకూడా వాటిని నిర్లక్ష్యము చేయలేదు. ఈ అన్ని ప్రతీకార చర్యలవలననూ ప్రజాభిప్రాయం వేగంగా పరివర్తనం చెందింది. అందువలన ఈ సంఘటనలకు సంబంధించినవారుకూడా తమ తప్పులను తాము తెలుసుకోగలిగారు. తరువాత రెండు నెలలకు ఆరుగురు ఖైదీలు విడుదలచేయబడి అందులో ఒకరు కాకోరీ ఖైదీలలో ప్రముఖుడై ఉన్నప్పటికీకూడా వారి గౌరవార్థం యేవిధమైన ప్రదర్శనాలుగానీ సన్మానాలుగానీ జరుగలేదు. పిమ్మట దాదాపు మరినాలుగు నెలలు జరిగింది. ఎప్పుడో ఆగస్టులో విడుదలయిన ఖైదీల సందర్భంలో జరిగిన ప్రదర్శనాలనో, ఉపన్యాసాలనో పురస్కరించుకొని మిగిలిన పదిహేనుమంది ఖైదీలవిడుదలనుగూర్చియింకా ఆలస్యంచేయడం ఎంతమాత్రం సమర్థనీయమైన పనికాదు. శాంతి క్రమాలను కాపాడే బాధ్యత మంత్రులది. వారి ధర్మాలను వారికి తోచిన విధాన నిర్వర్తించే హక్కు వారికుంది పరిస్థితులనుబట్టి సందర్భోచితంగా అన్ని సంగతులనూ గమనించి నిర్ణయించవలసిన పనికూడా వారిదే. ఒక్కసారి వారు నిర్ణయించగానే ఆ నిర్ణయాలామోదింపబడి అమలు జరిగితీరాలి మంత్రుల రోజువారీ పరిపాలనలో గవర్నర్లేవిధంగా జోక్యం కల్గించుకొన్నా వారి అధికారం దుర్బలమై వారిస్థితి క్షీణదశకు వస్తుంది. హింసాయుతములైన నేరముల విషయంలో తగిన చర్య తీసుకొంటామని కాంగ్రెసు మంత్రు

లనేకసార్లు చెప్పిఉన్నారు. ఖైదీలు హింసా మార్గమును విడిచిపెట్టినట్లు హామీ యిచ్చినప్పటికీకూడా, వారి విడుదలవలన ఆపత్తు ఉన్నదనడం కేవలం ఊహా జనితం.

కాంగ్రెసు యేర్పాటు చేసుకొన్న అహింసాస్మృతికి భిన్నంగా నడిచినవారిపైన క్రమశిక్షణచర్యను తీసుకోవడంలో ఆ సంస్థ ఎన్నడూ వెనుకపడలేదని నిరూపించడానికి, జరిగిన కొలది మాసాలలోనే అనేక ప్రత్యక్ష నిదర్శనాలు కనపడుతూన్నవి. అయినప్పటికీ, మాటలలోగానీ, క్రియలలోగానీ దౌర్జన్యాన్ని ప్రోత్సహించే పద్ధతివలన, దేశాభ్యుదయకరమైన ఆ పరమలక్ష్యాన్ని అందుకోవడానికి ఆటంకం కలుగుతుంది.

రాజకీయఖైదీల విడుదలను కొనసాగించడంలో, పదవులనుగానీ, అవకాశాలను గానీ, ప్రజాక్షేమమున కనుగుణంగా చేయదలచుకొన్న కార్యకలాపమునుగానీ త్యజించడానికి కాంగ్రెసెంతమాత్రమూ వెనుకంజవేయలేదు. కాని విడుదలకోసం చేసే ఆకలి సమ్మెలను (Hunger strikes) కాంగ్రెసు నిరసిస్తూన్న సంగతి గట్టిగా వెల్లడించదలచుకొన్నది. రాజకీయ ఖైదీల విడుదలకోసం కాంగ్రెసు చేసే ప్రయత్నాలకవి చిక్కులు కల్పిస్తూన్నవి. కాబట్టి పాంచాలలో, ఇంకనూ ఆకలి సమ్మెలను కొనసాగిస్తూన్న రాజకీయఖైదీలు తమ సమ్మెను నిలిపివేయవలెననీ కాంగ్రెసు కోరుతూన్నది. అంతేకాదు కాంగ్రెసువారు మంత్రులుగాఉన్న రాష్ట్రాలలోకానీ, తదితర రాష్ట్రాలలోకానీ, శాంతమూ ధర్మసమ్మతమూ అయిన సకల పద్ధతులచేతనూ, డిటిన్యూలయొక్కయు యితర రాజకీయ ఖైదీలయొక్కయు విడుదలనుగూర్చి, కాంగ్రెసువాదులు తమ ప్రయత్నాలను కొనసాగిస్తూనే ఉంటారు.

దేశంలో తటస్థించిన పరిస్థితినిబట్టి, అవసరమైన చర్యను నడపడానికీ, క్లిష్ట పరిస్థితి నెదుర్కోవలసిన తరుణంలో అవసరాన్నిబట్టి అఖిల భారత కాంగ్రెసు సంఘం యొక్క ఆదేశాన్ని పొందడానికీ, ఈ కాంగ్రెసు వర్కింగుకమిటీ కధికారమిస్తూన్నది

హరిపురా కాంగ్రెసు నిర్వహించిన మఱొక మహత్కార్యము నిక్కడ పేర్కొనవలసివుంది. అది నిర్మాణ కార్యక్రమమునకు సంబంధించినది బాల్యావస్థలోనున్న భారతజాతీయత కవసరమైనరీతిని జాతీయ విద్యా విధానమును పెంపొందించడమే అది. 1920 లో త్రివిధ బహిష్కారపద్ధతి ఆచరణలోకి తేబడినప్పుడు ప్రభుత్వంవారిచే ఆమోదింపబడినట్టియు, లేక విశ్వవిద్యాలయములకు చేర్చబడినట్టియు పాఠశాలలనూ, కళాశాలలనూ బహిష్కరించడం, కొంతవరకు జనాంగీకారంగాఉంది ఆనాటి వేగిరపాటులో, వాద ప్రతివాదములకూ పోరాటములకూ మూలమైన రాజ

కీయ వాతావరణంలో, ఉద్భవించిన జాతీయ పాఠశాలలు, పరిశీలనాదృష్టితో నిర్ణయింపబడిన సిద్ధాంతాలమీద యేర్పాటై, సక్రమ పద్ధతులతో ఐక్యభావం కలిగి నడుస్తూన్నవికావు. వాటి యిచ్ఛవచ్చినట్లవి కాలక్షేపం చేస్తూ వచ్చినవి. త్రివిధ బహిష్కారణోద్యమం విరమింపబడిన తరువాత ఈ సమస్యకు సంబంధించిన నిర్మాణ కార్యక్రమంలో పట్టుదల కూడా తగ్గిపోయింది. కాంగ్రెసు కార్య విధానంలో మార్పుకోరేవారికీ మార్పు కోరనివారికీ మధ్య జరిగిన రాజీ ఫలితంగా 1925 సెప్టెంబరులో ఆరులక్షల రూపాయల పెట్టుబడితో ఖద్దరు అభివృద్ధికోసం అఖిలభారత ఖద్దరు సంఘం స్థాపించబడింది. 1932 లో గాంధీజీ ప్రారంభించిన ప్రాయోపవేశ ఫలితంగా అస్పృశ్యతా నివారణోద్యమమున కెంతో ప్రోత్సాహం కలిగి అఖిలభారత హరిజనసంఘం యేర్పాటుచేయబడింది. తరువాత 1934 అక్టోబరులో అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘం నిర్మింపబడింది. ఇవన్నీ కాంగ్రెసుకనుబంధ సంస్థలుగానే పనిచేస్తున్నవి. కాని జాతీయ విద్యానిర్మాణ సమస్య మాత్రం నిర్లక్ష్యం చేయబడినట్లు కనిపిస్తున్నది. గాంధీజీ దృష్టికావిషయం తేబడినప్పుడల్లా ఆయన దానినిగూర్చి పనిచేసే తరుణం ఇంకా మనకు రాలేదని అంటూవచ్చారు. కాని ఆ తరుణం హరిపురాలోవచ్చింది బొంబాయి తీర్మానమున కనుగుణంగా చేతి పరిశ్రమలలో జరిగిన ప్రయోగ ఫలితములనుబట్టి దేశీయులు వాటిని జాగ్రత్తగా పరిశీలించవలసివచ్చింది. అందువలన జాతీయ ప్రణాళికలో ఒక భాగంగా గ్రహించి వాటిని మన యువకులు నేర్చుకోతగిన స్థితిలో ఉంచడం దేశీయుల కర్తవ్యమైనది. ప్రజలకసలే ర్పే విద్యావిధానంలో అనగా దాని ఉద్దేశంలో దాని సారాంశంలో దాని పద్ధతులలోనే దేశాభ్యుదయం యావత్తూ యిమిడివుంది. గనుక ప్రజాసామాన్యమునకు కావలసిన విద్యావిధానాన్ని యేర్పాటు చేయడానికి కాంగ్రెసు చాలా ప్రాధాన మిచ్చింది. జాతీయతకు సంఘసేయస్సుకు వ్యతిరేకమైన ఉద్దేశాలతో పాతపద్ధతుల మీద సంకుచిత దృక్పథంలో నడుపబడుతూన్న ప్రస్తుత విద్యావిధానం అపజయం పొందిందనే విషయం వేరుగా చెప్పనక్కరలేదు. కొత్తగా నిర్మింపబడిన మంత్రివర్గాల సహాయంతో ప్రభుత్వ విద్యావిధానాన్ని హద్దులలో ఉంచి దానిలో తగిన పరివర్తనం కలిగించడానికి కాంగ్రెసుకిప్పుడు వీలుకలిగింది. కాబట్టి అటువంటి విద్యావిధానానికి మార్గదర్శకంగా ఉంది. దానికి కావలసిన ప్రధాన సిద్ధాంతాలను యేర్పాటు చేయడానికి హరిపురాలోనే అవకాశం లభించింది. ఈ ప్రధాన విద్య తప్పనిసరిగా ఉండాలి. ఉచితంగా ఉండాలి. ఏడేళ్ళలో యిది పూర్తి కావాలి. మాతృభాషలోనే బోధింపబడాలి. శిక్షణకాలం యావత్తూ శరీరకష్టంతో

చేసే ఉత్పత్తి కార్యకలాపాలకు ప్రాధాన్యత ఈయబడాలి సాధ్యమైంతవరకు బాలుర పరిసరముల కనుగుణముగా ముఖ్యమగు చేతిపనులకు సంబంధించిన శిక్షణ ఉండాలి. తదితర ప్రయోజనకర వ్యవహారములలోకూడా ప్రావీణ్యత కలిగేటట్లు చూడాలి. ఇందుకోసం ఒక అఖిలభారత విద్యాప్రచారసంస్థ స్థాపింపబడింది. ఆసంస్థ తన ఉద్దేశములను నెరవేర్చుకోవడానికి కావలసిన నియమావళిని తానే తయారుచేసుకొని, ధనమును సేకరించుకొని, యింకా అవసరమయిన పనులను నిర్వహించుకోవడానికి అధికారమీయబడింది. యుద్ధకాలంలోనూ, యుద్ధము జరగడానికి ముందు యుద్ధమునుగూర్చిన ప్రవాదం విశేషంగా ప్రచారంలోనున్న ఏడాదిలోనూ తటస్థించిన సంఘటనలలో ప్రధానస్థాన మాక్రమించిన 'విదేశరాజనీతి - యుద్ధభీతి' అనే తీర్మానం,యుద్ధాన్నిగూర్చి భారత ప్రజలవలంబించవలసిన విధానమును వ్యక్తీకరిస్తూ హరిపురాలో మళ్లీ కొత్తగా చేయబడింది. "తమ యిరుగుపొరుగు దేశాలలోనే గాక తదితర దేశాలన్నిటిలోకూడా భారత ప్రజానీకం మిత్రభావంకలిగి శాంతంగా కాలక్షేపం చేయవలెనని కోరుతూన్నది. అందుకోసం వారికీ తమకూ మధ్యగల తగాదా కారణాలను నిర్మూలించవలెనని అభిలషిస్తూన్నది" అని ఆతీర్మానంలో ఉంది. "తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యములకోసం కృషిచేసే భారతప్రజలు ఇతరుల స్వేచ్ఛనుకూడా గౌరవించకోరుతూన్నారు. అంతర్జాతీయ సహకార సుహృద్భావములపైననే భారతీయులు తమకు బలం చేకూర్చుకొనదలచుకొన్నారు. అటువంటి సహకారం ప్రపంచ వ్యవస్థపైన ఆధారపడివుండాలి. స్వతంత్ర భారతదేశ మటువంటి వ్యవస్థతో సంతోషంగా సన్నిహితసంబంధం కలిగించుకొని, సమిష్టి సంరక్షణ (Collection security) ఆయుధవిసర్జనలనే పునాదులపైన నిలబడకోరుతూన్నది. కాని అంతర్జాతీయ వివాదములు వేళ్లునాటుకొని ఒకజాతి మఱొకజాతిపైన అధికారం చలాయిస్తూ, సామ్రాజ్యతత్వ విజృంభణకు దోహదం చేస్తూన్నంతవరకూ ప్రపంచ సహకార విధానం ఆచరణలోకి రావడం అసంభవం. ప్రపంచ శాంతిభద్రతలు శాశ్వతంగా నిలవాలంటే, ఒకజాతిని మఱొకజాతి దోచుకొని తినే సామ్రాజ్యవిధానం అంతం కావాలి.

కడచిన కొలది సంవత్సరాలలో అంతర్జాతీయ వ్యవహారము లంతకంతకతివేగంగా క్షీణదశకు వస్తూన్నవి. ఫాసిస్టుల దురాక్రమణ పెచ్చుపెరిగింది. అంతర్జాతీయంగా తాము నిర్వహించవలసిన ధర్మములను నిర్వహించక నిర్లజ్జగా నిరాకరించడమే ఫాసిస్టు ప్రభుత్వాలకు నిత్యకృత్యమైపోయింది. ఇదమిత్థమని నిర్ణయించజాలని బ్రిటిష్‌వారి కుటిల విదేశ రాజనీతి, జర్మనీ, స్పెయిన్,

మూర ప్రాచ్య దేశములలోని ఫాసిస్టు ప్రభుత్వాలను నిరంతరాయంగా ప్రోత్సహించింది. కాబట్టి ప్రాపంచక పరిస్థితులు ఇంతకింతకు క్షీణదశకు రావడానికి వారే ముఖ్యముగా బాధ్యులని చెప్పాలి. బ్రిటిష్ రాజనీతి ఇంకనూ నాజీ జర్మనీతో ఏదో ఒక విధంగా రాజీ చేసుకోవలెనని ప్రయత్నిస్తూ, స్పెయిన్ తిరుగుబాటుదారులతో సన్నిహిత సంబంధాలను పెంపొందించుకొంది. ప్రపంచ సామ్రాజ్య యుద్ధానికది దారి తీస్తూన్నది.

భారతదేశమటువంటి సామ్రాజ్య యుద్ధానికేమాత్రమూ బాధ్యత వహించజాలదు. బ్రిటిష్ సామ్రాజ్య తత్వక్షేమంకోసం తన మనుష్య బలమును సాధన సంపత్తినీ ఇండియా వినియోగించుకోనీయదు. ప్రజల అభీష్టం బహిరంగంగా తెలిస్తేనేగాని భారతదేశం ఎటువంటి యుద్ధంలోనూ జోక్యం కలిగించుకోజాలదు. కాబట్టి, భారతదేశంలో జరిగే యుద్ధ సన్నాహములకుగానీ, భారత దేశంలోకి యుద్ధం సమీపిస్తూన్నదని ప్రజలకు తోచేటట్లు విమాన దండయాత్రల రక్షణనుండి చేసే ప్రయత్నాలకుగానీ, సేనా విన్యాసములకుగానీ, కాంగ్రెసు పూర్తిగా తన, ప్రాతికూల్యము ప్రకటిస్తూన్నది. ఇండియాను యుద్ధంలోకి దించవలెననే ప్రయత్నం జరిగేయెడల అది విరోధింపబడుతుంది.

ప్లానింగు కమిటీ కార్యక్రమం చాలా బ్రహ్మాండమైన వ్యవహారంగా పరిణమించింది. రాష్ట్రప్రభుత్వాలు దాని ఖర్చుల నిమిత్తం రు 50,000 లు తమ బొక్కసములనుండి ప్రత్యేకించి యిచ్చారు. కమిటీ నిర్వర్తించవలసిన పని ఆరునెలలో పూర్తి కావలెనని నిర్ణయింపబడింది. కాని కమిటీకి అగ్రాసనాధిపతియైన జవహరులాలు నెహ్రూ, 1940 మార్చివరకూ వాయిదా యివ్వించవలెనని, ఈ లోగా పని పూర్తి కాదనీ కాంగ్రెసు అధ్యక్షునికి విన్నవించుకొన్నాడు. ఆ ప్రకారం 1940 మార్చి 31 వ తేదీకి పని పూర్తి అయ్యేటట్లు వాయిదా వేయబడింది.

## హరిపుర కాంగ్రెసు – ఆతరువాత

## [1938]

రాబోయే యుద్ధాపాయములను గూర్చి 1927 నుండీ కాంగ్రెసు మెలకువతోనే మెలగుతూవచ్చింది. యుద్ధాన్ని గూర్చిన భయంకరఘంటానినాదం మొట్టమొదట 1927 లో మద్రాసు కాంగ్రెసునాడే వినిపించింది మద్రాసు కాంగ్రెసునుండి హరిపురా కాంగ్రెసునాటికి ఒక దశాబ్దం గడిచింది. ఈలోగా అనేక సంఘటనలు జరిగినవి.

ఇప్పుడు హరిపురా కాంగ్రెసునాటికి యుద్ధమేఘాలు పశ్చిమాకాశ వీధులనుండి పుడమికి సన్నిహితంగా సంచరిస్తూన్నవి. అయితే యుద్ధాన్ని రాకుండా తప్పించే శక్తి తనకు గలదని కాంగ్రెసు తలంచడంలేదు. స్వర్గసీమలోని దేవతలకుకూడా ఆపని సాధ్యం కానట్లు కనిపించింది. కాని ఇండియాకు యేమాత్రమూ సంబంధం లేని ఈ యుద్ధానికి ఇండియా క్షేమమునకు తీరని నష్టం కలిగిస్తుందని కాంగ్రెసుకు తెలిసియున్న ఈ యుద్ధానికి ప్రజాభిప్రాయం ప్రతికూలంగా ఉండేటట్లు చేయవలెననియే కాంగ్రెసు వాంఛించింది. కాబట్టి కాంగ్రెసు నిరంతరమూ జాగరూకతతో ప్రవర్తించడము అవసరమయింది ఈ పనిలో కాంగ్రెసు తన స్వాతంత్ర్యమునుకూడా కోల్పోవలసి రావచ్చును ఇటువంటి అంతర్జాతీయ విషమస్థితిలో ఇండియా క్షేమమునకు భంగం కలిగించే క్లిష్టపరిస్థితులు సంభవింపనున్న సమయంలో విదేశ వ్యవహారములను చక్కబెట్టడానికొక ఉపసంఘం నియమింపబడింది. అది అంతర్జాతీయ పరిస్థితులను చక్కగా గమనిస్తూ వర్కింగు కమిటీకి తగిన సలహాలిచ్చి అంతర్జాతీయ వ్యవహారములలో కాంగ్రెసు వైఖరినీ అది అవలంబించే రాజనీతినీ హరిపురా కాంగ్రెసు తీర్మానాను సారంగా వివరిస్తుండడాని కుద్దేశింపబడింది. ఒకవిధంగా విదేశ యుద్ధాలనుగూర్చిగాని సైనిక దండయాత్రలను గూర్చిగానీ ఇండియా భయపడవలసిన అవసరమే లేదు. ఎందువల్లనంటే, బ్రిటిష్ వారియొక్కయు తదితర విదేశీయుల యొక్కయు వాణిజ్య దండయాత్రలకు ఇండియా లోనయ్యే ఉంది. రాష్ట్రీయ స్వాతంత్ర్యం స్థాపింపబడి సమవాయ ప్రభుత్వాలు (Federation) ఏర్పాటవుతుందనగానే, విదేశీయుల యాజమాన్యంకిందనూ పరిపాలనకిందనూ ఇండియా లిమిటెడ్ అనే పేరు తగిలించుకొని నిజంగా హిందూదేశపు సంస్థలేనని భ్రమ కలిగించేటట్లుగా అనేక కంపెనీలు పుట్టినవి.

భారత పరిశ్రమల రక్షణకోసం ఇండియా ప్రభుత్వంవారింతవరకూ అవలంబిస్తూ వచ్చిన ప్రత్యేక పక్షపాత విధానంవలన, ఇండియాకు కలిగే ఆ అల్ప ప్రయోజనాన్ని కూడా అపహరించడానికే ఈ కంపెనీలు పుట్టినవని కాంగ్రెసుయొక్క దృఢాభిప్రాయం. నూతన చట్టంలో చేర్చబడిన వాణిజ్య రక్షణలు 1935 వరకూ అనుభవించబడిన ప్రత్యేక సదుపాయాలకు కొంత పరిమితిని యేర్పాటు చేయడానికి మాత్రమే సహాయపడ్డవి పైగా భారతదేశపు ప్రకృతి సౌభాగ్యమున్నూ సహజసంపత్తిన్నీ విదేశీయులకోసం ముఖ్యంగా యునైటెడ్ కింగడంలోని పెట్టుబడిదారులకోసం అట్టే ఉంచడానికుద్దేశింపబడినట్లు స్పష్టపడుతూన్నది. కాంగ్రెసు విదేశీ పెట్టుబడికిగానీ, విదేశీయుల ప్రజ్ఞా విశేషములకుగానీ ప్రతికూలంకాదు. కాని వాటినిఉపయోగించే విధానంలోమాత్రం కాంగ్రెసుకు

ప్రతికూలాభిప్రాయముండింది. రాష్ట్రీయ స్వపరిపాలనలో నూతన పరిస్థితులేర్పడినవి. రాష్ట్ర వ్యవహారాలన్నిటినీ రాష్ట్రమంత్రులు తమ తమ రాష్ట్రముల ప్రయోజనముల ననుసరించి నడుపుకొనప్రారంభించారు. ఇంతకుపూర్వం ఇలా కాదు. ఇండియా ప్రభుత్వానికి బాధ్యత వహిస్తూన్న గవర్నరులూ రాష్ట్ర ప్రభుత్వాలూ వారికిష్టమైనవారికి పెద్ద పెద్ద ఉద్యోగాలిస్తూండేవారు. రాష్ట్ర స్వాతంత్ర్యం అమలులోకి రావడంతోనే మంత్రులు తమ రాష్ట్రాలలోనున్న సమర్థులనుకానీ, లేదా పరాయి రాష్ట్రములనుండి సమర్థులను రప్పించికానీ, ఉద్యోగాలీయ ప్రారంభించారు. ఈ పద్ధతి శాస్త్ర సమ్మతమూ సహజముకూడా. అయితే కొన్ని చిక్కులు తటస్థిస్తూవచ్చినవి. భారతదేశంలోని రాష్ట్రాలుఎప్పుడూ ఒకే తీరుగా లేవు. 1905కుపూర్వం, బెంగాల్, బీహార్, ఒరిస్సారాష్ట్రాలు కలసి ఒకే రాష్ట్రంగా వ్యవహరింపబడుతూవచ్చింది. అప్పుడు తక్కినవారికన్న బాగా చదువుకొని అభివృద్ధి పొందిన బెంగాలీలే ఈ మూడు ప్రదేశాలలోని పెద్ద పెద్ద ఉద్యోగాలను ఆక్రమిస్తూండేవారు. తరువాత యివి మూడూ మూడు ప్రత్యేక రాష్ట్రాలుగా విభజింపబడినవి. అప్పుడు బీహారులో చిరకాలంనుండీ వలసవచ్చి సక్రమంగా ఆ నియమాలను అనుసరిస్తూ ఉన్న బెంగాలీలను ఆ ప్రభుత్వం యేవిధంగా చూడవలెను? రాష్ట్రీయ స్వాతంత్ర్యంక్రింద యిది మఱొక నూతన సమస్యయైనది.

1937 - 38 సంవత్సరాలలో ఈ విషయం తీవ్రవాదోపవాదములకు కారణభూతమైన ఒక ప్రధాన సమస్యగా పరిణమించింది. బీహారు హైకోర్టు జడ్జీగా పనిచేసి విరమించిన, ఒక వంగీయుడిందులో ప్రముఖపాత్ర వహించాడు. ఈ విషయాన్ని సమగ్రంగా సమాలోచించిన పిమ్మట రాజేంద్రప్రసాదును ఈ శీర్షికలకింద విచారణ చేయవలసిందిగా వర్కింగుకమిటీవారు కోరినారు. 1. వలస 2. ప్రభుత్వోద్యోగాలు 3. విద్య 4. వర్తక వాణిజ్యాలు:— రాజేంద్రబాబు తీర్పు చెప్పడానికి కొంత ఆలస్యమయింది. ఈ లోగా డొమిసైలు సర్టిఫికేట్లు కావలెనని నిర్బంధిస్తూ వాటికి సంబంధించిన ఆచార నియమాలను అమలుపఱచవలదని వర్కింగుకమిటీవారు బీహారు ప్రభుత్వాన్ని కోరారు. రాజేంద్రబాబు పంపిన నివేదికమీద వర్కింగుకమిటీ, 11-1-39 వ తేదీని బార్డోలీలో ఈ దిగువ నిర్ణయానికి వచ్చారు:

"బాబూ రాజేంద్రప్రసాదు, బెంగాల్-బీహారు వివాదములనుగూర్చి పంపిన నివేదికనూ, పి. ఆర్. దాసుగారు పంపినవిజ్ఞప్తులతోసహా యింకా అనేకవిజ్ఞప్తులనూ వర్కింగు కమిటీవారాలోచించారు. రాజేంద్రప్రసాదు జాగరూకతతో సమగ్రంగా తయారుచేసిన నివేదికనుగూర్చి కమిటీవారు శ్లాఘిస్తూన్నారు. ఆయన నిర్ణయాలతో కమిటీవారు సాధారణంగా ఏకీభవిస్తూన్నారు. ఆ నిర్ణయాలు చాలావరకు సామాన్యంగా దేశ

మంతటా అనువర్తింపచేయడానికి వీలయినవి కావడంచేత వాటినిక్కడ పొందు పరుస్తూన్నారు.

1. భారతదేశపు వివిధ ప్రదేశాలలోని భారతీయుల సంస్కృతిలోనూ, జీవిత విధానంలోనూ గల విశిష్ట విభిన్నత్వమునందలి లావణ్యమును, కాపాడి పెంపొందించవలెనని ఈ కమిటీ వారభిప్రాయపడుతూన్నప్పటికీ, మన సంస్కృతికీ చారిత్రాంశమునకూ మూలం ఒక్కటేననీ, మనమొక్కటే జాతికి చెందినవారమనీ నిరంతరం స్మరించుకోనేటట్లు ప్రవర్తించాలని కోరుతున్నారు. అందువల్ల అన్ని విధములైన పృథక్భావాలను, సంకుచిత రాష్ట్రీయ దురభిమానాలనూ, ఈ కమిటీ నిరుత్సాహ పరుస్తూన్నది. అయినప్పటికీ ప్రభుత్వోద్యోగముల విషయంలోనూ, ఇంకా అటువంటి యితర విషయాలలోనూ, ఒక్కొక్క రాష్ట్రంలోని ప్రజలకు కొన్ని కొన్ని హక్కులు కలవనీ, వాటిని నిరాకరించడం తగదనీ ఈ కమిటీవారు భావిస్తూన్నారు.

2 ప్రభుత్వోద్యోగముల విషయంలో భారతదేశంలో యేభాగంలో నివసిస్తూన్నప్పటికీ భారతీయుడైనవాడు, యే యితర భాగంలోనైనాసరే ఉద్యోగం కోరడానికీ, సంపాదించుకోవడానికీ అభ్యంతరం ఉండకూడదు. పెద్ద పెద్ద ఉద్యోగముల విషయంలోనూ, ప్రత్యేక శాస్త్రజ్ఞానం, అనుభవము కావలసిన ఉద్యోగాల విషయంలోనూ ముఖ్యంగా సమర్థతా చాకచక్యమూ కావలసినమాట నిజమే, కాని వాటికితోడు ఈ దిగువ విషయాలనుకూడా గమనించాలి.

(౧) రాష్ట్రంలోని వివిధ సంఘాలకు న్యాయమైన ప్రాతినిధ్యముండాలి.

(౨) సాధ్యమైనంతవఱకు వెనుకపడివున్న తరగతులవారికి, సమూహములకు ప్రోత్సహమివ్వాలి. అందువలన వారు జాతీయ జీవితంలో సంపూర్ణ భాగస్వాములుగా వ్యవహరించడానికి వీలు కలుగుతుంది.

(3) సొంత రాష్ట్రంలోనివారికి ప్రత్యేకావకాశాలు కల్పించాలి. ఈ సందర్భంలో తగిన నియమాలనూ నిబంధనలనూ రాష్ట్ర ప్రభుత్వాలవారు నిర్మించాలి. వాటిని అనుసరించియే, ఆ ప్రత్యేక సదుపాయాలు ఉండాలి. అందువల్ల కొంతమంది ఉద్యోగుల వ్యక్తిగత అభిప్రాయాల ననుసరించి భిన్న ప్రమాణములను అవలంబించడానికి సావకాశముండదు. అన్ని రాష్ట్రాలలోనూ ఒకే విధమయిన నియమావళిని అవలంబించేటట్లు చూడడం కూడా మంచిది.

3. బీహారురాష్ట్రవిషయంలో, న్యాయంగా బీహారీలనిపించుకొంటూన్న వారికీన్నీ- బీహారు రాష్ట్రంలో పుట్టి వంగభాష మాట్లాడే వంగీయులకున్నూ, లేక బీహారు రాష్ట్రము మాతృభూమిగా చేసుకొన్న వంగీయులకున్నూ యేమీ భేదం చూపబడరాదు. బీహారీ అనే పదం వీరందరికీ సమంగానే వర్తించవలెను. కాబట్టి ప్రభుత్వోద్యోగముల విషయంలోవలెనే తదితర సందర్భాలలోకూడా వీరందరినీ సమానంగానే చూడవలెను. రాష్ట్రంలో నివసిస్తూన్న వీరందరికీ, ఇతర రాష్ట్రవాసులకంటె ఎక్కువ సదుపాయాలు చేయడం అంగీకరించతగిన విషయమే.

4. బీహారును మాతృభూమిగా చేసుకొన్న పరిశీలిత రాష్ట్రవాసులకు, డొమిసైలు సర్టిఫికేట్ల [నివాసపత్రము] నిచ్చే పద్ధతిని రద్దుచేయవలెను. ప్రభుత్వోద్యోగములకోసం దరఖాస్తులు పంపుకొనేవారు. తాము రాష్ట్రంలోనివారో లేక రాష్ట్రంలో నివాస మేర్పఱచుకొన్నవారో తమ దరఖాస్తులలో వ్రాయాలి. ఉద్యోగమిచ్చే ముందు దరఖాస్తులలోని సత్యాసత్యములను విచారించుకోవడానికి గవర్నమెంటు కధికార ముండాలి.

5 రాష్ట్రంలో నివాసమేర్పరచుకొన్న యితర రాష్ట్రవాసి, తాను నివాస మేర్పఱచుకొన్న రాష్ట్రాన్ని మాతృభూమిగా చేసుకొన్నట్లు సాక్ష్యం చూపించాలి. ఈ విషయాన్ని నిర్ణయించడంలో ఆయన ఎంతకాలంనుంచీ రాష్ట్రంలో వుంటూన్నాడుని ఆయనకు ఇల్లూ యితర ఆస్తీ యేమైనా రాష్ట్రంలో ఉందా? అనే విషయాలు, ఇందుకు సంబంధించిన తదితర విషయాలు కూడా విచారించబడును. వీటన్నిటినీ సమగ్రంగా విచారించిన పిమ్మటనే నిర్ణయం చేయుబడవలెను. అయితే ఏది ఎలావున్నప్పటికీ రాష్ట్రంలో జన్మించివుంటేకానీ, 10 యేండ్లు కాపురం వుంటేగానీ, ఆ పౌరుడు రాష్ట్రాన్ని మాతృభూమిగా భావిస్తూన్నట్లే తలంచవలెను.

6. ప్రభుత్వోద్యోగములలోనున్న వారందరినీ సమానంగానే చూడాలి. ఉద్యోగంచేస్తూన్న కాలపరిమితినిబట్టీ, సమర్థతనుబట్టీ వారికి జీతం హెచ్చుచేయడంకానీ పై ఉద్యోగాలివ్వడంకానీ జరగాలి.

7. రాష్ట్రంలో వర్తకంగానీ, వ్యాపారంగానీ, చేసుకోవడానికి ఎవరికీ యే విధమైన అభ్యంతరమూ ఉండకూడదు. ఏదైనా ఒకరాష్ట్రంలో వ్యాపారంచేస్తూన్న కంపెనీలుకానీ, ఫ్యాక్టరీలుకానీ, తాము వ్యాపారంచేస్తూన్న రాష్ట్రపౌరులతో సన్నిహితసంబంధం కల్గించుకోవడానికి సాధ్యమైనంతవరకక్కడి వారికే ఉద్యోగాలివ్వడం ఉచితం. అయితే ఫ్యాక్టరీలకూ, కంపెనీలకూ ఈసందర్భంలో రాష్ట్ర

ప్రభుత్వంవారిచ్చే సూచనలు కొన్ని అపోహలకు కారణంకావచ్చును గనుక, అసలు సూచనలను ఈయకుండా ఉండడమే మంచిది.

8. విద్యాసంస్థలలో చోటు పరిమితంగావున్నప్పుడు, రాష్ట్రంలోని వివిధ సంఘాలవారికి చోట్లు ప్రత్యేకం అట్టేవుండవచ్చును. కాని అవి న్యాయమైన దామాషాలో ఉండాలి. రాష్ట్రంలో నివసిస్తూన్న పౌరుల విషయం మొట్టమొదట ఆలోచించాలి.

9. బీహారురాష్ట్రంలో వంగభాష మాట్లాడేచోట్ల ప్రాథమికపాఠశాలలలో వంగభాషలోనే చదువుచెప్పాలి. అయితే ఆ ప్రదేశాలలో హిందూస్థానీ మాతృభాషగా గలవారికి - తగినంతమంది హిందూస్థానీ విద్యార్థులుండేయెడల - హిందూస్థానీలోనే చదువుచెప్పాలి. ఆదేవిధంగా హిందూస్థానీ మాట్లాడే ప్రదేశాలలో ప్రాథమిక పాఠశాలలలోని విద్యాబోధన మా రాష్ట్రీయ భాషలోనే ఉండాలి. రాష్ట్రంలోని యేజిల్లాలోనైనా నివసించే పౌరులు వేఱొకభాష మాట్లాడుతూ ఆభాషలోనే విద్యాబోధనము ఉండవలెనని కోరేయెడల ప్రభుత్వం అందుకు తగిన యేర్పాటు చేయవలెను.

10. ఈపై నిర్ణయాలను బీహారులోని అన్నిపక్షాలవారూ అంగీకరించి ఆచరించగలరనీ రాష్ట్రంలోని విషాదగ్రస్తములైన వాదోపవాదాలింతటితో సమసిపోగలవనీ, ఈ వర్కింగుకమిటీవారు హృదయపూర్వకంగా విశ్వసిస్తూన్నారు.

11. ఇక్కడ ఉదహరింపబడిన ఈ నిర్ణయములు ఇతర రాష్ట్రీయ ప్రభుత్వాల పరిపాలనా విధానమునకు కూడా మార్గదర్శకములుగా నుండవలెను.”

ఇటువంటి వ్యవహారమే మరొకటి కాంగ్రెసు వర్కింగుకమిటీలో చర్చకు వచ్చింది. రాష్ట్రాలలో నివసించే సంస్థాన ప్రజల అనర్హతలను, దౌర్భాగ్యాలనూ గూర్చిన సమస్య అది. రాష్ట్రాలలో నివాసమేర్పరచుకొన్న సంస్థానప్రజల ప్రభుత్వోద్యోగములనుగూర్చి, వోటింగుహక్కునుగూర్చి, కల అనర్హతలన్నీ తొలగింపబడవలెనని అఖిల భారత మార్వాడీఫెడరేషన్‌వారు, కాంగ్రెసుకూ, కాంగ్రెసు వర్కింగు కమిటీకి, విజ్ఞాపనలను పంపుకొన్నారు. భారత రాజ్యాంగచట్టం 262 సెక్షన్ క్రింద, పై కోరికను మన్నించడానికి తగినచర్య తీసుకోవలెనని వర్కింగుకమిటీవారు కాంగ్రెసు ప్రభుత్వాలను కోరారు.

రాష్ట్ర స్వాతంత్ర్యమునందుగల అధికారాలూ హద్దులు స్పష్టంగానే నిర్వచింపబడినప్పటికీ, అప్పుడప్పుడు పరిపాలనావ్యవహారములో కాంగ్రెసుకానీ, ప్రభుత్వం

వారు కానీ ఊహించడానికి వీలులేని కొత్త సమస్యలు కొత్త సంగతులూ బయట పడుతూవచ్చినవి. బీహారు సంయుక్త రాష్ట్రాలలోని ఒక తరగతి రాజకీయ ఖైదీల విడుదలనుగూర్చి చేకెత్తిన సమస్య వాటిలో ఒకటి. ఇంతకుపూర్వమీ విషయాన్ని గూర్చి సవిస్తరంగా చర్చించివున్నాము. ఒరిస్సా ఖాయపు గవర్నరు సర్ జాన్ హబ్బక్ సెలవు పెట్టడానికి సిద్ధంగావున్న సమయంలో, అనుకోకుండా మరొక కొత్త పరిస్థితి యేర్పడుయింది. అప్పటిదాకా ఆక్టింగు గవర్నరు ఉద్యోగం, మంత్రుల క్రింద ఎక్సైజు కమీషనరుగా పనిచేస్తూ ఒరిస్సాలో ప్రారంభించబడిన మద్యనిషేధ విధానమునకు అనేక అడ్డంకులు కల్పించిన మిస్టర్ డాన్ అనే ఐ. సి. యస్. ఉద్యోగికి ఇయ్యబడింది. కమిటీలో ఆయన ప్రవర్తన చాలా నిర్లక్ష్యంగా కనిపించేది. ఆయన మంత్రులకు కింది వుద్యోగిగావుండి మర్యాదలను అతిక్రమించి ప్రవర్తించడమేగాక మద్యనిషేధమును గూర్చి తన సొంత అభిప్రాయములను వెల్లడిస్తూ మంత్రులను దాదాపు అవమానపరి చాడుకూడా. అటువంటివాన్ని తిరిగీ మంత్రులపైన గవర్నరుగా వేయడం యెంత మాత్రం వాంఛనీయం కాదు. ఇతరదేశాలలోని మామూలు సాంప్రదాయాలకిది భిన్నం కూడా. ఈ పరిస్థితులలో ఒరిస్సా మంత్రులు తమ ప్రతికూలభావాన్ని వెల్లడిస్తూ తమ కప్పుడు ఉచితమైన చర్యను మాత్రమే తీసుకోవడానికి నిర్ణయించుకొన్నారు. కాంగ్రెసు వర్కింగు కమిటీవారా వుద్యోగమునుగూర్చి పునరాలోచన చేయవలసిందిగా అధికారులను కోరారు. అంతేకాక ఇతర దేశాలలో, యిటువంటి సందర్భాలు తటస్థించినప్పుడు ప్రధాన న్యాయమూర్తి ఆక్టింగు గవర్నరుగా నియమింపబడే సదాచారం వుంది. దానినే యిక్కడకూడా అవలంబించవచ్చునని యాదృచ్ఛికంగా వారు సూచించారు. చిట్టచివరి క్షణంలో, సర్ జాన్ హబ్బక్ తన సెలవును రద్దుచేసుకొన్నందువలన అప్పుడు తటస్థించిన ఆ విషమపరిస్థితి తొలగిపోయింది. ఆ సంఘటనకు సంబంధించిన ప్రభుత్వ ప్రకటన ఇలావుంది :— "ఒడుదుడుకులుగావున్న రాజకీయ పరిస్థితులను కొత్త గవర్నరుకు వదిలి తాను మొట్టమొదట అనుకొన్న ప్రకారం వెడుచుకోవడం సమంజసంగాలేదని ఘనతవహించిన గవర్నరుగారు భావిస్తున్నారు; రాష్ట్రముయొక్క క్షేమమును గమనించి తనకీయబడిన సెలవును రద్దుచేసుకోవడంకంటె గత్యంతరంలేనట్లు ఆయన యిప్పుడభిప్రాయపడుతున్నారు. గవర్నరు జనరల్ గారి ఆమోదంతో భారతరాజ్యాంగ కార్యదర్శి గవర్నరుగారి ఈ కోరికను మన్నించారు."

అవసరం వచ్చినప్పుడు మంత్రివర్గాలను మార్చుకొనే హక్కు శాసనసభలకుండడమే బాధ్యతాయుతప్రభుత్వం. భారతదేశపు రాష్ట్రాలన్నిటిలోకీ చిన్నరాష్ట్రమైన సింధులో మొట్టమొదటగా 1938 నాటికే మంత్రివర్గంలో మార్పు రావలసివచ్చింది. ఆయ-

కాంగ్రెసురాష్ట్రాలలోవలె, ఏ ఒక్క రాజకీయకక్షకూస్పష్టమైన మెజారిటీలేని రాష్ట్రాలలోమంత్రివర్గాలను దించడం తేలికే గాని, నూతనమంత్రులను నిర్మించడంమాత్రం, అందులోసగం తేలికకూడా కానట్లుంది. అధికారంతోపాటు ఎప్పుడూ అసంతృప్తికూడా బయలుదేరుతూనే ఉంటుంది. ప్రధానమంత్రి చేసిన యేదైనా పనివల్ల యెవడైనా ఒక్కడు స్నేహితుడు కావడం సందేహం కాని, పదిమంది శత్రువులయ్యేమాటమాత్రం నిశ్చయమని చెప్పినమాట అక్షరాల నిజం. కాని ప్రధానమంత్రికి నిశ్చలమైన అధిక సంఖ్యాక పక్షంవారి బలం. ఉన్నప్పుడు ఆయన నిర్ణయముల వలన కలిగే ప్రతికూల భావాలు సుడిగాలులవలె ఆయనను పెకలించేవిగా గాక, మలయమారుతములవలె ఆయనకు నూతనోత్సాహమును కల్పించేవిగా ఉంటవి. కాని అంత స్పష్టమైన అధిక సంఖ్యాకబలం ఆయనకు లేనప్పుడు, ఆయనకు విరోధులుగా ఉండే వారంతా యేపక్షానికి చెందినవారైనాసరే, ఏకమై ఆయనను సింహాసన భ్రష్టునిగా చేయగలరు. రాజకీయ స్నేహాలు సాధారణంగా సనిమిత్తంగా ఉంటయి. కాబట్టి సింధు మంత్రివర్గం పడిపోయి ప్రధాని రాజీనామా యీయగానే కొత్తగా మంత్రిత్వములుకోరేవారి అదృష్టం సింధు శాసనసభలో కాంగ్రెసు సభ్యుల వైఖరిమీద ఆధారపడి వుండవలసివచ్చింది, అప్పుడు సింధు గవర్నరు, సింధుశాసనసభలోని కాంగ్రెసుపక్ష నాయకుని పిలిపించి, ఆరాష్ట్రరాజకీయ విషమపరిస్థితులనుగూర్చి ఆయనవైఖరి యేమిటో తెలుసుకొనకోరాడు. ఇలాతటస్థిస్తుందని ఎవ్వరూ అనుకోలేదు. సింధుశాసనసభాసభ్యులు మొత్తం 60 మంది. వారిలో ఎనమండుగురు మాత్రమే కాంగ్రెసువారు. అయితే ఆ రాష్ట్రంలో ఏపక్షం వారికీ తక్కిన అన్ని పక్షాలవారూ కలిసినప్పుడుకూడా తామధికసంఖ్యాక పక్షంవారుగా ఉండే పరిస్థితిలేదు. కాబట్టి యెవరితోకలిసినైనా కాంగ్రెసు సభ్యులు ౮ మంది, మంత్రివర్గ నిర్మాణమునకు పూనుకోగలరనేమాట అసంభవం. అటువంటి మంత్రివర్గంయొక్క మనుగడ చాలా సంశయాస్పదం. ఇతర పక్షాలతో వారి కలయిక సుకరంకాదు సరిగదా వాంఛనీయంకూడకాదు పడిపోయిన మంత్రివర్గానికి బదులుగా నిర్మింపబడే నూతన సంయుక్తమంత్రి వర్గానికి కాంగ్రెసు సహాయం చేయడాని కంగీకరించింది. కాంగ్రెసు అవలంబించిన ఈవైఖరి సరియైనదే. అందుకు తగినట్లుగా ఈ నూతన సంయుక్త మంత్రివర్గనాయకుడు ఖాన్ బహదూర్ అల్లాబక్సు తాను ప్రధాని అయ్యేపక్షంలో తన మంత్రివర్గ మవలంబించే విధానమూ కార్యక్రమమూ సాధారణంగా కాంగ్రెసు కార్యక్రమ విధానముల కనుగుణంగా ఉండగలవని, కాంగ్రెసుపక్ష నాయకుని కొకజాబుకూడా వ్రాశాడు, ఈ పరిస్థితులలో కాంగ్రెసుపక్షం కొంతకాలం మంత్రివర్గంవారి పరిపాలనా విధానాన్ని శాసనసభాకార్యక్రమాన్ని గమనిస్తూ

వేచి ఉంటుందనీ, అంతవరకూ వారిని పడగొట్టే యేప్రయత్నానికీ తాము ప్రారంభ కులుంగా గానీ, ఆమోదకులుగాగానీ, ఉండమనీ, ఆ తరువాత తన అంతిమ నిర్ణయమును చేసికొంటుననీ, ఈలోగాకూడా తన కిష్టంలేని ప్రభుత్వ చర్యలనుగానీ, శాసనసభా కార్యకలాపములనుగానీ యెదిరించటానికి తనకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంచుకొంటూన్నామనికూడా కాంగ్రెసుపక్షనాయకుడు జవాబిచ్చాడు. ఈవిధంగా సంయుక్త మంత్రివర్గస్థాపనకొక దారి యేర్పడ్డది. తరువాత సరిగా సింధులో జరిగిన సంఘటనల వంటివే అస్సాములోగూడా తటస్థించినవి. అందువలన కొలదికాలంలో ఇండియాలో గల 11 రాష్ట్రాలలోని ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలుగానీ, కాంగ్రెసుతోగూడిన సంయుక్త మంత్రివర్గాలుగానీ ఏర్పడినవి. కాంగ్రెసు కార్యవర్గంవారు, పార్లమెంటరీ బోర్డువారూ, ప్రతిరాష్ట్రంలోనూ జరిగే వ్యవహారాలను ఎప్పటికప్పుడు తెలుసుకొంటూండేవారు. అంతిమ నిర్ణయాలను చాలావరకు పార్లమెంటరీబోర్డు చేస్తూండేది. కాంగ్రెసు వర్కింగుకమిటీ వాటిని ఆమోదిస్తూండేది. ఆరు రాష్ట్రాలలోని కాంగ్రెసు పరిపాలనములో కొన్ని చిక్కులు తటస్థించడం సహజం. అవి కాలక్రమేణా తటస్థిస్తూన్న కొన్ని సంఘటనలనుబట్టి కాని, మంత్రుల వ్యక్తిగత దోషముల వలనకానీ, సంభవించవచ్చును. అటువంటి విషాదసంఘటన మొకటి మధ్యరాష్ట్రాల మంత్రివర్గం సందర్భంలో జరిగింది. స్త్రీని చెరిచిన (Rape) నేరము నకు శిక్షింపబడిన ఒకానొక స్థితిమంతుడైన ఖైదీని న్యాయశాఖామంత్రి దయదలచి విడిచిపెట్టినందుకు విషమపరిస్థితులేర్పడినవి. అప్పుడామంత్రి క్షమాపణచెప్పి రాజీనామాపెట్టడాని కంగీకరించాడు. మధ్యరాష్ట్ర మంత్రివర్గమున్నూ రాష్ట్రంలోని కాంగ్రెసు పార్లమెంటరీపక్షంవారున్నూ ఆ క్షమాపణతో సంతృప్తి పడ్డారు కాని తాను తీసికొన్న చర్యలలోని ప్రాముఖ్యతను తాను సరిగా గ్రహించజాలకపోయినందున తక్కిన మంత్రులతో ఈవిషయాలు సంప్రతించివారి అంగీకారమును పొందలేదని తన రాజీనామాలేఖలో ఉదాహరించాడామంత్రి. దానినిబట్టి వర్కింగు కమిటీవారీ విషయాన్ని యింకనూ సమగ్రంగా విచారించి సరియైన నిర్ణయమునకు రావలెనంటే న్యాయానికి కేవలం వ్యతిరేకమయ్యే టంత ప్రమాద భూయిష్టమైనపనిని ఆమంత్రి చేశాడా అని యోచించవలసి ఉంటుందని నిశ్చయించారు. అలా చేసివుంటే నిజంగా అప్పుడు న్యాయంకోసం పరిపాలనా పవిత్రతకోసం, స్త్రీజాతియొక్క గౌరవం కోసం ఆయన రాజీనామా యీయడమే న్యాయమని భావించారు. అలాకాక న్యాయానికి కేవలం విరుద్ధమైన పని ఆయన చేయకనేపోతే రాజీనామా ఈయ నక్కరలేదు సరికదా క్షమాపణగూడ అనవసరమన్నారు. కాబట్టి ఈవిషయాన్ని

"ఇన్సూర్యరెన్సులో మోసంచేసినందుకు శిక్షింపబడ్డ సుధాకరనిగూర్చి విడుదలచేయ నుద్దేశించినందుకు ఆ విషయాన్ని ఈ రెంటినీ న్యాయశాస్త్రప్రవీణులద్వారా సమగ్రంగా విచారణజరిపించవలసివచ్చింది. సుప్రసిద్ధ న్యాయవాదిద్వారా విచారణ జరిపించి వర్కింగుకమిటీ వారీవిషయంలో, తను తుదినిర్ణయమును చేసేటంతవరకు ప్రజలు ఓపికపట్టి శాంతంగా వుండవలసిందని వర్కింగుకమిటీవారు ప్రార్థించారు. ప్రజాసామాన్యంకూడా తమ పౌరజాతీయ ధర్మాలను చక్కగా గుర్తించి వుద్రేకాన్ని అణచిపెట్టుకొని నెలల తరబడి ఎంతోశాంతంగా ప్రవర్తించారు యీ విషయం కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి పదవి నుండి విరమించి, పింఛను తీసుకొంటూన్న సర్ మన్మథనాథ ముఖర్జీగారికి విచారణనిమిత్తం పంపబడింది. ఆయన పంపిన నివేదిక ఈ సంఘటనకు సంబంధించిన మంత్రికి చూపగా ఆయన రాజీనామా యిచ్చాడు. ఈ విధంగా ఆయన కాంగ్రెసు గౌరవాన్ని కాపాడడంకోసం తన సొంత ప్రతిష్ఠనుకూడా వదులుకొని, ప్రజల దృష్టిలో ఒక విధంగా పెద్దమనిషి అనిపించుకొన్నాడు అత్యంత క్లిష్ట పరిస్థితులలో సాగించబడిన జాతీయ ప్రభుత్వపు తొలియేండ్లలో జరిగిన సంఘటనలను గూర్చిచేసిన నిర్ణయాలు, సరియైనవా కావా, ప్రజాక్షేమమును గుర్తించిచేసినవా లేక స్వప్రతిష్ఠకోసం చేసినవా అనే ప్రశ్నలకువచ్చే జవాబుపైననే జాతీయప్రభుత్వ చర్యలు భావి సంతానానికి గుణపాఠాలుగా గానీ ఉపదేశాలుగాగానీ పరిణమించగలవు.

## పౌర స్వాతంత్ర్యం

కాంగ్రెసు అధికారంకింద గానీ పలుకుబడికింద గానీ ఉన్న ఎనిమిది రాష్ట్రాలలోనూ, రాష్ట్రీయ స్వాతంత్ర్య ప్రణాళికకు వ్యతిరేకంగా పోరాడుతూ ఒక వంక నిరంకుశ ప్రభుత్వంవారు కలిగించే అనేక యిబ్బందులనుకూడా ఎదుర్కోవలసివచ్చింది. వీటికితోడు కాంగ్రెసులోని అతివాదులు కొందరు, ఆదర్శాలను అంటిపట్టుకొని అసలు పరిస్థితులను సరిగా అర్థం చేసుకోజాలకపోవడంవలన ఇంకా ఎక్కువ విషమస్థితి యేర్పడింది. జీవిత యదార్థ పరిస్థితులలో వారికిగల సంబంధమునుబట్టి, రాష్ట్రంలోని పౌర స్వాతంత్ర్య కార్యక్రమానికి కొంత పమను పెట్టాలని తోచడం సహజం. దక్షిణ హిందూస్థానంలో ఒకానొక కాంగ్రెసువాదిని 124 ఏ. ఇండియన్ పీనల్ కోడుకింద రాజద్రోహ నేరమునకు శిక్షించడం, ఈయువక మిత్రుల క్రోధాగ్నిని ముఖ్యంగా సోషలిస్టు మిత్రుల క్రోధాగ్నిని మరింత ప్రజ్వరిల్లచేసింది. ఈ సందర్భంలో 1937 అక్టోబరు నెలలో, అ. భా. కాం. సం, సమావేశమునకు వారొక తీర్మానమును పంపినారు.

అది 1938 ప్రారంభదశలో జరిగిన వర్కింగుకమిటీలో చర్చించబడి పరిష్కరింపబడింది. అప్పుడు వివిధ రాష్ట్రాలలోనూ గల పరిస్థితులను నాటి చిక్కులనూ సమగ్రంగా పరిశీలించి, కాంగ్రెసు మంత్రులంతేవరకూ, నిర్వహించిన కార్యకలాపములను ఆమోదిస్తూ, పౌరస్వాతంత్ర్యన్ని యింకనూ పెంపొందించడానికి కాంగ్రెసు కార్యక్రమాన్ని అమలుజరుపడానికి వారుచేసే తీవ్రప్రయత్నాలను అభినందించారు. అన్నిటికంటెనూ ముఖ్యమైన విషయమేమంటే "కాంగ్రెసుయొక్క అహింసా విధానమును అంటి పట్టుకొనియుండి దౌర్జన్యమును పురికొల్పే అన్ని వ్యవహారాలనూ నిరుత్సాహపరచవలసిందని" కాంగ్రెసు వర్కింగుకమిటీ వారప్పుడాదేశించారు. ఆప్రకారం దేశంలో శాంతివాతావరణమును చేకూర్చి, సక్రమ కార్య నిర్వహణమునకు తోడ్పడుతూ, యిందుకు భిన్నంగా నడుచుకునే కాంగ్రెసువాదులను ఖండించవలసిందని కాంగ్రెసు కమిటీలను కాంగ్రెసు నాయకులనూ వర్కింగుకమిటీ కోరింది. కాంగ్రెసు విధానమునకు భంగం కలిగించే కాంగ్రెసువారిపై తగిన క్రమశిక్షణ చర్య తీసుకోవలసిందనికూడా కాంగ్రెసువర్కింగు కమిటీ ఆజ్ఞాపించింది. కాంగ్రెసు మంత్రులు తమ పక్షాన పౌరస్వాతంత్ర్య నియమాలను సరిగా పాటించవలసిందనీ, తప్పుదోవను పడేవారిని నిర్బంధ పద్ధతులతోకంటె మంచి మాటలతో సరియైన మార్గాన పెట్టి ప్రజాస్వామిక విధానాన్ని కొనసాగించవలసిందనీ కోరబడ్డారు. నిర్బంధవిధానమే తప్పనిసరియైనట్లయితే "అది కేవలం దౌర్జన్యం జరిగే సమయంలోగానీ, దౌర్జన్యమూ, పోరాటమూ జరగడానికి ప్రోత్సాహం చేసినప్పుడు మాత్రమేగానీ" అటువంటి చర్య తీసుకోవడం ఉచితమని కాంగ్రెసు మంత్రులకు వర్కింగుకమిటీ సలహా యిచ్చింది

1938 జనవరిలో ఈ తీర్మానం అంగీకరించబడిన తర్వాతకూడా పరిస్థితులు ప్రస్తుతం అభివృద్ధికాలేదు. కాబట్టి 1938 సెప్టెంబరులో వర్కింగుకమిటీ తిరిగి ఈ విషయమును పునరాలోచన చేయవలసివచ్చింది ఈలోగా మామూలు పరిపాలనా వ్యవహారాలలో కాంగ్రెసు కమిటీలు తమ పలుకుబడితో ఉద్యోగస్థులను తమ యిచ్ఛవచ్చినట్లు వినియోగింప ప్రయత్నిస్తున్నట్టు తెలియవచ్చింది. కాంగ్రెసు కమిటీలు గానీ, తదితర కాంగ్రెసువాదులుగానీ ప్రజా క్షేమమునకు సంబంధించినంతవరకు ప్రభుత్వోద్యోగులతో సహకారం చేయవలసిన బాధ్యత ఉన్నమాటనిజమే. కాని మామూలు పరిపాలనా వ్యవహారాలలో కాంగ్రెసువాదులూ కాంగ్రెసుకమిటీలూ జోక్యం కల్గించుకొంటూండడం కూడనిపని. పౌరస్వాతంత్ర్యముల విషయంలో, జరిగిన ఎనిమిది మాసాలలో పరిస్థితులు అభివృద్ధి కాలేదుసరిగదా పైపెచ్చు క్షీణదశకు వచ్చినవి. అందువల్ల అ.భా.కాం.సం. స్పష్టంగా అసందిగ్ధములైన వాక్యాలలో ఈ దిగువ తీర్మానం చేయవలసివచ్చింది.

“పౌరస్వాతంత్ర్యం అనేపేరుతో జనం కాంగ్రెసు వాదులతోసహా, హత్యలు చేయడం, అగ్గిపెట్టడం, దోపిడీలు సాగించడం, హింసాయుతవర్గ పోరాటాలకు దోహదంచేయడం పత్రికలలో అబద్ధాలువ్రాసి మతకలహాలనూ దౌర్జన్యాన్నీ పురికొల్పడం మొదలగు అకృత్యాలను సమర్థిస్తున్నట్లు తెలియవచ్చింది. అందువలన పౌర స్వాతంత్ర్యమంటే దౌర్జన్య చర్యలకు పాల్పడడంకానీ, శుద్ధఅబద్ధాలను ప్రచారంచేయడంకానీ కాదని ప్రజలకు కాంగ్రెసు జ్ఞాపకంచేస్తున్నది. కాబట్టి పౌరస్వాతంత్ర్యమునుగూర్చిన కాంగ్రెసు విధానంలో యేమీ మార్పులేకపోయినప్పటికి, పౌరుల ఆస్తినీ ప్రాణమునూ రక్షించడానికి కాంగ్రెసు ప్రభుత్వాలు తీసుకొనే చర్యలను తన సంప్రదాయానుగుణంగా కాంగ్రెసు సమర్థిస్తుంది.”

రాష్ట్రీయ స్వాతంత్ర్యరంగంలో వివిధరాష్ట్రాలలోనూ అత్యాశ్చర్యకరములైన సంఘటనలు జరిగినవి. భారతజాతి యావత్తు ఇరుకు గల్లీలలోనుండీ, గుడి సందులలోనుండీ ప్రయాణం చేస్తున్నప్పుడు ఎక్కడా ఏ విధమైన అనర్థాలూ ప్రమాదాలూ తటస్థించకుండా ఉండడమంటే మిక్కిలి వింత కలిగిస్తుంది అవి చాలా తక్కువ కావడమే నిజంగా ఆశ్చర్యమనిపిస్తోంది. 1938 మే నెలలో 12 మొదలు 14 వ తేదీవరకూ ప్రధానమంత్రుల సమావేశం జరిగింది. కాంగ్రెసు ప్రధానమంత్రు లేడుగురూ తమ సహచరులు కొంతమందితో సహా ఆసమావేశానికి హాజరయ్యారు. కాంగ్రెసు రాష్ట్రాలలో పరస్పరసహకారానుబంధములను సమకూర్చడానికే ఆ సమావేశం ముఖ్యంగా ఉద్దేశింపబడింది. ఇండియా అఖండమూ అవిభాజ్యమూ అనేమాట ఎవ్వరూ కాదనజాలరు. కాని పరిపాలనా విషయములను కేంద్ర విషయములుగానూ రాష్ట్రీయ విషయములుగానూ విభజించడం కేవలం సౌకర్యం కోసం రాష్ట్రాలలో కాంగ్రెసు రాష్ట్రాలనీ కాంగ్రెసేతర రాష్ట్రాలనే విభజన తాత్కాలికం. కాలక్రమేణా జాతీయచైతన్యం ప్రజాసామాన్యంలో పెంపొంది ఒకరినొకరు బాగా అర్థంచేసుకోగలిగినప్పుడీ విభేదాలంతరించగలవు. పైన పేర్కొనబడిన ప్రధానమంత్రుల సభలో భూమివిధానము, కార్మికసమస్య, పారిశ్రామిక పునర్నిర్మాణము, విద్యుచ్ఛక్తియొక్క అభివృద్ధిచే సరఫరా, గ్రామపునర్నిర్మాణము, విద్యా, రెవిన్యూ, పన్నులు, ఆర్థికవిధానములనుగూర్చి చర్చలు జరిగినవి. నిర్మాణ కార్యకలాపములను కొనసాగించేనిమిత్తం కావలసిన ఆర్థిక సంపత్తిని సేకరించడానికి సావకాశాలను పరిశీలించేటందుకు సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వంవారు అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలను సమావేశపరచవలెనని నిర్ణయించుకొన్నారు. జైలు సంస్కరణనుగూర్చి చర్చించడానికి బొంబాయి మరొక సమావేశాన్ని ఆహ్వానిస్తానన్నది. ఒక్కొక్క

రాష్ట్ర మొక్కొక్క విషయాన్ని ప్రత్యేకంగా ఎందుకుపరిశీలన చేయరాదో తెలియడము లేదు. మద్రాసు మద్యనిషేధము హరిజన దేవాలయ ప్రవేశము, ఋణనివారణము మొదలగు సాంఘిక నైతిక విషయాలనూ, బొంబాయి - కార్మిక సమస్యలను, బీహారు సంయుక్తరాష్ట్రాలు, జిరాయితీచట్టములనూ, భూమి సమస్యలనూ, కొద్దికాలంలో కాంగ్రెసు రాష్ట్రాలలో చేరనున్న అస్సాం - ఖనిజసంపదలనూ, ఒరిస్సా - శిల్ప సౌభాగ్యంగల గృహపరిశ్రమలనూ, మధ్యరాష్ట్రాలు - పారిశ్రామిక ఖనిజసంపదలనుగూర్చి ఎందుకు ప్రత్యేకం పరిశీలించకూడదు? యివన్నీ ప్రసంగవశమున చేయబడిన సూచనలు. మద్రాసు జమీందారీ సమస్యను, బొంబాయి మద్యనిషేధమును, సంయుక్తరాష్ట్రాల జైళ్ళ సంస్కరణమునూ పరిశీలనచేయడానికి ప్రారంభించినవి కాలం గడచినకొలదీ అన్నిరాష్ట్రాలూ ఈ అన్నిసమస్యలనూ పరిష్కరించవలసిందే.

అమ్మకం పన్నులనుగూర్చి మద్రాసురాష్ట్రం ప్రత్యేకంగా పరిశీలనచేస్తే దాని ప్రయోజనం కాంగ్రెసేతర రాష్ట్రమైన పంజాబుకూడా పొందవచ్చునుగదా? ప్రధాన మంత్రుల సమావేశం పారిశ్రామిక ప్రణాళికకు దారితీసి కొద్దికాలంలోనే దానికి కావలసిన సన్నాహం చేయబడింది.

## అస్సాం

మొట్టమొదట ఆరురాష్ట్రాలలో మాత్రమే కాంగ్రెసు మంత్రివర్గాలేర్పాటుచేయబడ్డవి. 1938 ప్రారంభదశలో సింధు కలిసింది. ఆ సంవత్సరాంతంలోనే సింధులో వలెనే అస్సాంలోకూడా విషమస్థితి వచ్చింది, సెప్టెంబరు 13 వ తేదీని అస్సాం శాసన సభ్యులు ప్రధానమంత్రిపైన విశ్వాసరాహిత్యతీర్మానమును ప్రతిపాదింపనుండిరని ముందుగానే ఆయనకు తెలిసి తన సహచరులనేకమంది తన పక్షాన్ని విడిచి, ప్రతికూల పక్షంలో చేరినందున తాను గవర్నరుకు రాజీనామా పంపినట్లుగా ఆనాడే శాసనసభా మధ్యమున ప్రకటన చేశాడు. అప్పుడు కాంగ్రెసుపక్షనాయకుడు గవర్నరుచే ఆహ్వానింపబడి, కాంగ్రెసు అధికారవర్గంవారి సంపూర్ణాంగీకారంతో మంత్రివర్గ నిర్మాణమును పూనుకొని సంయుక్త మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశాడు. ఇటువంటి మంత్రివర్గం ఇండియాలో రెండవది. అయితే ఇది సంయుక్త మంత్రివర్గంగా పేర్కొనబడుతూన్నప్పటికీ ప్రధాని ఒక్కడే కాంగ్రెసుమంత్రి.

## ఆంధ్రరాష్ట్రం

రాష్ట్రీయ స్వాతంత్ర్యంలో, రాష్ట్రంలోని ప్రజల ఆచారాలూ అభ్యాసాల మూలమునసేగాక, రాష్ట్రీయ జనసమూహముయొక్క నిర్మాణం వలనకూడా ప్రతి

రాష్ట్రింతోనూ నూతన సమస్యలుద్భవించినవి. సంయుక్త రాష్ట్రాలవంటి రాజధానులు ఒకే భాష, ఒకే ఆచారవ్యవహారాలూ, గల జన సమూహంతో కూడుకొని ఉన్నవి. బొంబాయి, మద్రాసు, మధ్యరాష్ట్రాలవంటి రాజధానులు వివిధభాషలతో కూడిన జనసమూహం కలిగి ఉన్నవి. దక్షిణాదని వివిధభాషలవలన గలిగే చిక్కులనూ చర్చలనూగూర్చి చెప్పినప్పటికీ ఉత్తరాదివారికేవిధంగా అర్థంగాక విస్తుపోయి చూస్తారో, అలాగే ఉత్తరాదిని మతవిభేదాలవల్ల కలుగుతూన్న చిక్కులనుగూర్చి చెప్పినప్పుడు దక్షిణాదివారుకూడా తెలియక తెల్లమొగంమువేసి చూస్తారు. దక్షిణాదిని మద్రాసురాష్ట్రి శాసనసభలో నూరుమంది ఆంధ్రులకు తమిళంగానీ, కన్నడంగానీ, మలయాళీభాషకానీ రాదు. మరి నూరుమంది తమిళులకు, తెలుగు, కన్నడం, మలయాళీ భాషలు రావు. మరి 10 మంది మలయాళీలకు 10 మంది కన్నడిగులకూ వారి భాషలు తప్ప తక్కిన మూడు భాషలూ రావు. నూరుమంది సభ్యులకుపైగా అంటే శాసనసభలో దాదాపు సగంమందికి ఇంగ్లీషుభాషరాదు. ఇటువంటి పరిస్థితిని పరిష్కరించడానికి మిగతా రాజధానినుండి ఆంధ్రరాష్ట్రిమును విడదీసి, బొంబాయి మద్రాసు రాష్ట్రాలలోని కర్ణాటకులకు ప్రత్యేక రాష్ట్రిమును నిర్మించి, మలయాళ రాష్ట్రిన్ని వేరుచేయడమే సరియైనమార్గం. 1938 జూలై నెలలో ఇందుకోసమే, ఆంధ్ర కేరళదేశీయులు ప్రత్యేకరాష్ట్రిములుగా మద్రాసునుండి విడిపడవలెననిన్నీ, కర్ణాటకులు బొంబాయి మద్రాసు రాష్ట్రిములలోని వారందరూ సమ్మేళనం కావలెననీ వర్కింగు కమిటీవద్దకు రాయబారం వెళ్ళారు. వర్కింగుకమిటీవారీ విషయాలన్నీ సావధానంగా విని ఈ కింది తీర్మానంచేశారు.

"ఆంధ్రరాష్ట్రి కాంగ్రెసుసంఘంవారు, ఆంధ్రమహాసభవారూ, ఐక్య కర్ణాటక కమిటీవారు, కర్ణాటరాష్ట్రి సంఘంవారు, కేరళరాష్ట్రీయ సంఘంవారూ, పరిపాలనా సౌకర్యంకోసం, భారతదేశంలోని రాష్ట్రాలను భాషలను బట్టి పునర్విభజన చేయవలెనని పంపిన రాయబారాలను విన్నపిమ్మట మద్రాసు శాసనసభ భాషాప్రయుక్తరాష్ట్రిములను గూర్చినీ, బొంబాయి శాసనసభ కర్ణాటక రాష్ట్రమును విడదీయడమును గూర్చిన్నీ చేసిన తీర్మానాలు, ముందుగా పార్లమెంటరీ సబ్ కమిటీవారి సంపూర్ణాంగీకారంతోనూ ఆమోదంతోనూ చేయబడినవేనని ఈ కమిటీవారు ప్రకటిస్తున్నారు. కాంగ్రెసుకు తగిన అధికారం రాగానే భావిభారత రాజ్యాంగప్రణాళికలో ఈ సమస్య పరిష్కారమునకు పూనుకొనగలమని ఆయా ప్రదేశాలలోని ప్రజలకీకమిటీవారు హామీ యిస్తూ ఈ సందర్భంలో దేశంయొక్క ప్రధానసమస్యనుండి ప్రజల

దృష్టిని మరలించుటలయట్టి ఆందోళనకు యికముందు పాల్పడవద్దని వారిని కోరుతూన్నారు"

## మధ్యరాష్ట్రాలు

రాష్ట్రస్వాతంత్ర రంగంలో, కాంగ్రెసు మంత్రివర్గాలు నిర్మింపబడిన మొదటి దశలో మరొక అత్యంతప్రాముఖ్యమైన సంఘటనం జరిగింది. మధ్యరాష్ట్రాలలో ఒక తుపాను రేగింది. అక్కడి రాజకీయాకాశవీథులు కొంతకాలంనుండీ మేఘావృతములై ఊఱుములూ మెఱుపులూ చెలరేగి, తుట్టతుదకు తుపానువీచింది. ఒకమంత్రికీ మఱొక మంత్రికీ మనస్పర్థలు కలిగినవి. తన సహచరులకు తెలియకుండానే ప్రధానమంత్రి గవర్నరుకు రాజీనామానుపంపి రాజ్యాంగవ్యవస్థలో క్లిష్టపరిస్థితిని కల్పించాడు. నూతన మంత్రివర్గ నిర్మాణము కోఱకాయన తిరిగీ ఆహ్వానింపబడ్డాడు. ఇదంతా వర్కింగు కమిటీవారికి తెలియకుండాగాని వారు వ్యక్తీకరించిన అభిప్రాయానికి భిన్నంగా గానీ, జరిగింది. ఈ విషయం చాలా ప్రాముఖ్యమైనదీ చాలా సున్నితమైనది. కాబట్టి ఇందును గూర్చిన వివరాలను తెలుసుకోగోరువారు పార్లమెంటరీబోర్డు అధ్యక్షుని ప్రకటనను చూడదగును. అది 1938 ఆగస్టు 16 న ప్రకటింపబడిన కరపత్రం 4 లోని 17 మొదలు 29 పుటలలో లభింపగలదు. ఇక్కడమాత్రం ప్రధానమంత్రి రాజీనామా యిచ్చాడనీ, పార్లమెంటరీ పక్షంవారిచే కొత్తనాయకుడెన్నుకోబడ్డాడనీ, పూర్వనాయకుడు కూడా ఆ ఎన్నికలో పోటీచేయడానికి అవకాశం కల్పింపబడ్డదనీ చెబితే చాలు.

## (౨) ఆదాయవ్యయపట్టిక - సైన్యం

రాష్ట్రీయ ప్రభుత్వాలవారు అంతవరకెన్నడూ తామడుగుపెట్టి యెఱుగని నూతన రంగాలలో మిక్కిలి పట్టుదలతో పోరాటాలు సాగిస్తూన్నారు. అనుకోని చోట్లనుండికూడా వారికి ప్రాతికూల్యం వస్తూన్నది. అటువంటి సమయంలోనే వృద్ధమూర్తులైన వర్కింగుకమిటీ సభ్యులు కేంద్రప్రభుత్వంతో తీవ్రపోరాటం సాగించవలసి వచ్చింది. కేంద్రప్రభుత్వం సమిష్టిబాధ్యతలేనిది. ఆ ప్రభుత్వసభ్యులలో ప్రతి ఒక్కరూ వ్యక్తిగతంగా సర్వాధికారం చెలాయిస్తూఉండిరి. కాబట్టి ప్రజాభిప్రాయం గానీ, ప్రజాభీష్టంతోగానీ వారికి నిమిత్తంలేకుండాఉంది. అందువలన వర్కింగుకమిటీ వారి పోరాటం అంత ఫలప్రదంగా లేకపోయినా, పట్టుదలతోమాత్రం సాగుతూన్నది. భారతదేశపు సైన్యంలోని బ్రిటిష్‌సైనికులకు యంత్రసామగ్రిని యిచ్చేటందుకు ఇండియా గవర్నమెంటువారు చేసిననిర్ణయాన్ని నిరసిస్తూ కాంగ్రెసు పక్షంవారు ప్రతిపాదించిన వాయిదా తీర్మానంతో (Adjournment Motion) కేంద్రశాసనసభ యొక్క

బడ్జెటుసమావేశం ప్రారంభమయింది. రు 21,500,000 లతో అయిదు బ్రిటిష్ పటాలాలకు కావలసిన యంత్రసామగ్రిని సరఫరాచేయడానికి అంచనావేయబడింది. ఇందులో బ్రిటిష్ ప్రభుత్వం భరించేమొత్తం రు 8,000,000 లు మాత్రమే. ఇక మిగిలిన రు 13,500,000 లు ఇండియాదేశమే భరించవలెను. భారతదేశపు సైన్యంలోని బ్రిటిష్ పటాలాలకు మాత్రమే ఈ యంత్రసామగ్రిని సరఫరాచేస్తూ, భారతీయ పటాలాలను మినహాయించడమున్నూ, ఇందుకు ఇండియాదేశపు సొమ్మునే ఎక్కువగా వెచ్చించడమున్నూ ఘోరమైన అన్యాయం. భారతీయసైన్యంతో, కేంద్రశాసనసభలోని ఎన్నికసభ్యులకు సన్నిహితసంబంధం కల్పించవలెనని శ్రీయుత గాడ్గిల్ ప్రతిపాదించిన తీర్మానం శ్రీ అసఫ్‌ఆలీయొక్క ఈదిగువ సవరణతో అంగీకరించబడింది.

"ఆ కమిటీ గవర్నరు జనరలుగారు పంపినవిషయాలపైన గవర్నరు జనరల్ ఇన్ కౌన్సిలుకు సలహాయిస్తూండాలి. ముఖ్యంగా (1) భారతదేశపు వెలుపలకు సైన్యాలను పంపడం (2) అదనపుఖర్చులు కావలసిన కొత్తప్రతిపాదనలు (3) సైన్యాన్ని భారతీయంగాచేయడం - ఈ మూడువిషయాలలో సలహాయిస్తూండాలి.

28 ఫిబ్రవరి తేదీని ఆర్థికసభ్యుడు సర్ జేమ్సు గ్రిగ్గు కేంద్రబడ్జెట్టును ప్రవేశపెట్టాడు. దానిపైన సాధారణచర్చ ప్రారంభం కావలసివుంది. అప్పుడు ప్రభుత్వం వారు దురుద్దేశంతో ఒకయెత్తు యెత్తబోతూన్నట్లు కాంగ్రెసుపక్ష శాసనసభ్యులకు తెలియవచ్చింది. అదే, కేంద్రశాసనసభలు రెండూ నాటకరంగాలు కావడానికి సూచన అయింది. కేంద్రశాసనసభా బడ్జెటుసమావేశంలో "దేశసంరక్షణ" "విదేశవ్యవహారాలు" అనే ఈరెండు శీర్షికలకింద ను ప్రభుత్వవిధానం పైన తమ అభిప్రాయాన్ని శాసనసభ్యులు ప్రత్యక్షంగా వోటుచేసి వెల్లడిస్తూండేవారు. ఈ సత్సంప్రదాయం 1924 నుండీ అవలంబింపబడుతూ వచ్చింది. కాని 1938 బడ్జెటు సమావేశంలో ఈ సాంప్రదాయాన్ని ప్రభుత్వంవారు విరమించదలచుకొన్నట్లుగా తెలియవచ్చింది. ఈ చర్యను ప్రతిఘటిస్తూ ఆదాయవ్యయపట్టికనుగూర్చి చర్చ ప్రారంభమవడానికి ముందే ప్రతికూలపక్ష నాయకుడు శ్రీ భూలాభాయిదేశాయి, కాంగ్రెసుపక్షమూ, స్వతంత్రపక్షమూ, కాంగ్రెసు జాతీయవాదులు, ప్రజాస్వామ్యవాదులూ - ఈ అందఱమూ కూడా బడ్జెటుచర్చలో పాల్గొనబోవడంలేదనీ, ఆయాబడ్జెటు ప్రతిపాదనలు చర్చకు వచ్చినప్పుడల్లా యేవిధమైన చర్చా చేయకుండా వాటిని వోడించడమే పనిగాపెట్టుకొన్నామనీ ప్రకటనచేశాడు. నూతనచట్టం ప్రకారం "దేశసంరక్షణ" "విదేశవ్యవహారాలు" అనే ఈరెండు శీర్షికలనూ కేంద్రశాసనసభల వోటునుండి మినహాయించి తీరవలెననీ నూతనచట్టం ఆవిధంగా ఆదేశిస్తూన్నదనీ ఆర్థికసభ్యుడు బదులుచెప్పాడు.

సర్ జేమ్సు దిగుమతి పన్నులనుగూర్చి ప్రతిపాదన చేసినప్పుడు, ప్రతికూలపక్షంవారు కోతను ప్రతిపాదించకుండానే ప్రతిపాదనను వోటుకు పెట్టవలసిందని కోరారు. ఆర్థికసభ్యుని ప్రతిపాదనకు ప్రతికూలురు 64 మంది - అనుకూలురు 46 మంది. ఈ వోట్లలో ఆయన ప్రతిపాదన తలక్రిందులయింది. ఆర్థికసభ్యుని తక్కిన ప్రతిపాదనలకు కూడా యిదేగతిపట్టింది. సాధారణంగా పదిహేనురోజులు పట్టవలసిన 70 కి మించిన విషయాలు ఒక్కరోజున్నరలో త్రోసివేయబడ్డవి కాని ఆ బడ్జెటు ప్రతిపాదనల నన్నింటనీ గవర్నరు జనరలు పునరుజ్జీవింపచేశాడు. కేంద్రశాసనసభ అసలు ఆర్థికబిల్లునే పూర్తిగా త్రోసివేసి గవర్నరుజనరలుకు తగినప్రత్యుత్తరమిచ్చింది. శాసనసభ్యులఅభీష్టమూ కష్టను భగ్నపఱచినందుకు స్టేట్ కౌన్సిలు ఇంతకంటెకూడా ఎక్కువతీక్షణతరమైన ప్రతిఘటనను ప్రదర్శించింది. బడ్జెటునుగూర్చి సాధారణచర్చ ప్రారంభించగానే కాంగ్రెసు సభ్యులున్నూ, తదితరఅభ్యుదయపక్షాలకు సంబంధించిన సభ్యులున్నూ సభాభవనమును వదలి బయటికి వెళ్ళిపోయినారు

ఉద్యోగములనుండి విరమించి పించనుతీసుకొంటూన్న ప్రభుత్వోద్యోగులు కొంతమంది, అంతకుపూర్వం తాముఉద్యోగాలలోనున్నకాలంలో తమ శాఖలకు సంబంధంగలకొన్ని కంపెనీలలో తిరిగి ఉద్యోగులుగా చేరుతూన్నవిషయం, ఒకతీర్మానమునకు మూలమయింది. అటువంటి ప్రభుత్వోద్యోగుల పింఛనులు రద్దుచేయబడవలెనని భూలాబాయిదేశాయి వాదించాడు.

## (బి) కూలీలు

కేంద్రశాసన సభారంగంలో భావి సంసిద్ధతకు కావలసిన అనేక విషయాలను గూర్చి వెంటనే పనిచేయవలసి ఉంది. కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఇప్పుడు లేకపోవచ్చును. కాని ఇవ్వాళో రేపో అది రాక తప్పదు. అనుకొన్నదానికంటెకూడా తొందరగా రావచ్చును. అందుకు కాంగ్రెసు ఎంతో శ్రద్ధగా ప్రయత్నిస్తూన్నది. 1937 లోని రాష్ట్రీయ స్వాతంత్ర్యంకంటెకూడా ముందుగానే కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సంపాదించడానికి కాంగ్రెసు ప్రయత్నించింది. కార్మిక సమస్యా పరిష్కారం పరిపాలనలో ఒక ప్రధానాంగం. యాదృచ్ఛికంగా తటస్థించిన కార్మిక సమస్యలనన్నిటినీ పరిష్కరించడానికి రాష్ట్రీయ ప్రభుత్వాలకు కావలసినన్ని అధికారాలున్నమాట వాస్తవమే. కాని భారతదేశమంతటా ఈ విషయంలో ఒకే విధానం అవలంబింపబడవలెనన్నచో వివిధ రాష్ట్రాల అనుభవములను గుర్తెరిగి కేంద్ర ప్రభుత్వం ఎప్పుడో ఒకప్పుడీ సమ

స్యను సమగ్రంగా పరిష్కరించవలసి ఉంది. బొంబాయి ప్రభుత్వంవారు తమ రాష్ట్రానికితగిన కార్మిక శాసనాన్ని ఈవరకే తయారుచేశారు. కాని కాంగ్రెసు నియమించిన కార్మికోప సంఘంవారు 1938 మే నెలలో సమావేశమైనారు. కొన్ని రాష్ట్రాల ప్రధానమంత్రులున్నూ, మరికొన్ని రాష్ట్రాల ప్రధానమంత్రుల ప్రతినిధులున్నూ ఈ సమావేశమునకు హాజరై చర్చలలో పాల్గొన్నారు. బట్టలమిల్లులలోని కూలీలజీతాలను స్థితిగతులనూ,గూర్చి విచారించడానికి బొంబాయి సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వాలవారు కమిటీలను నియమించారు. కార్మిక స్థితిగతులనుకానీ, ట్రేడ్ యూనియను తగాదాలనుకానీ విచారించడానికి వేరే రాష్ట్రీయ ఉపసంఘాలలో, ప్రజాజీవితానికీ జాతీయోద్యమాలకూ సంబంధించిన మనుష్యులుమాత్రమే ఉండవలెనని చాలా వత్తిడి వచ్చింది. బొంబాయి వస్త్ర పరిశ్రమ, విచారణ సంఘంవారి సిఫారసులను బొంబాయి రాష్ట్రంలోని కాంగ్రెసు ప్రభుత్వం అంగీకరించడమున్నూ, ఆ రాజధానిలోని మిల్లుయజమానులందఱూ వాటిని సాధారణంగా అనుసరిస్తూండడమునూ ఎంతో సంతోషించదగిన సంగతి. బొంబాయి సంయుక్త రాష్ట్రాల అడుగుజాడలలోనే బీహారు రాష్ట్రంకూడా వర్తించింది. పంచదార పరిశ్రమ, ఖనిజ పరిశ్రమ, పత్తి పరిశ్రమ-ఇవన్నీ చక్కగా ఏర్పాటు కాబడిన తదితర పరిశ్రమలున్నూ విచారణకు తయారుగానున్నవి. ఈ విచారణలో, దుకాణాలలో పనిచేసే వాళ్ళపనినిగూర్చి వారి జీతాలనుగూర్చికూడా చర్చింపబడుతుంది. బొంబాయి రాష్ట్రంలోని కూలీలకు జబ్బుచేసినప్పుడు జీతంమీద శలవిచ్చే నియమాన్ని శాసనంలో చేర్చడానికి ఆ ప్రభుత్వం ముందడుగు వేసింది. బరోడా ప్రభుత్వం 1938 ఆగస్టు వకటో తేదీనుండి కార్మికులు రోజుకు 9 గంటలు మాత్రమే పనిచేయవలెనని ప్రకటన చేసి తక్కిన సంస్థానాలకు మార్గదర్శకమయింది. 10 మందిని కానీ అంతకంటె ఎక్కువ సిబ్బందినికానీ, నియమించే ఫ్యాక్టరీలన్నీ ఫ్యాక్టరీ చట్టం కిందకు వస్తవని బొంబాయి ప్రభుత్వం నియమించింది. బొంబాయి సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వాలం రెండూ కార్మికుల బిడ్డలకొరకు ప్రత్యేక శిశుపోషణాలయములుండి తీరవలెనని ఉత్తరువులు జారీచేసినవి. అహమదాబాదువంటి పారిశ్రామికనగరంలో మత్తుపదార్థాలను నిషేధించడం కేవలం నైతిక సంస్కరణమేకాక కార్మికశాసనంకూడా అని చెప్పవచ్చును.

## పారిశ్రామిక ప్రణాళిక

1937 ఆగస్టునెలలోనే అనగా ఆరురాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు స్థాపించబడిన మాసం రోజులలోనే అఖిలభారత పారిశ్రామిక ప్రణాళికను తయారు

చేయడానికి ఒక ప్రవీణుల ఉపసంఘమును నియమింపవలెనని కాంగ్రెసు వర్కింగు కమిటీ తలపెట్టింది. అందుకుగాను ఇండియాలోని పారిశ్రామిక మంత్రుల నందరినీ సమావేశపరచడానికి 1938 జులైలో కాంగ్రెసు అధ్యక్షుని కధికారమీయబడింది. ఆయన వివిధరాష్ట్రాలలో ప్రస్తుతం నడుస్తున్న పరిశ్రమలనుగూర్చినీ, క్రొత్త పరిశ్రమల అవసరాలనూ, అవకాశాలనూ గూర్చిన్నీ, నివేదికలు తయారుచేసి పంపవలసిందిగా ఆయారాష్ట్రీయ ప్రభుత్వాలనూ కోరినాడు. పారిశ్రామిక మంత్రుల సమావేశం 1938 అక్టోబరు 2, 3, తేదీలలో ఢిల్లీలో జరిగింది. జాతీయ పునర్నిర్మాణమునకూ సాంఘిక ప్రణాళికకూ సంబంధించిన యే పథకమైనను జయప్రదం కావలెనంటే కొన్ని ముఖ్యసమస్యలు తొందరగా పరిష్కారమయితీరాలి. వాటినిగూర్చి ఆలోచించడానికే ఈ సమావేశం ఆహ్వానించబడింది. అయితే ఆ పరిష్కారమునకు ఎంతో పర్యవేక్షణమూ ఎన్నో లెక్కలూ కావాలి. ఆయా ప్రదేశాలలోని సమాజముయొక్క ఆదర్శమేమిటో కూడా స్పష్టంగా నిర్ణయింపబడాలి. అన్ని సమస్యలను కేవలం రాష్ట్రీయ దృక్పథంతో సమగ్రంగా పరిష్కరించడానికి వీలులేదు. అవి పక్కనున్న రాష్ట్రాల ప్రయోజనాలతో సన్నిహిత సంబంధం కలిగివుంటవి. వినాశకరములైన వరదలు రాకుండాచేయడానికి, ఆ నీటిని సాగుకు సరిగా వినియోగించడానికీ, భూసారం ఉడిగిపోకుండా కాపాడుకోవడానికీ, మన్నెపు జ్వరాలను రూపుమాపడానికీ, జలపాతములనుండి విద్యుచ్ఛక్తిని ప్రసరింపచేయడానికి ఇంకా ఇటువంటి అనేక కార్యకలాపాలకు నదులను సమగ్రంగా పర్యవేక్షణం చేయడం అవసరం. ఈ పనులకు నదులు పుట్టిన చోటునుండి సముద్రంలో కలిసేచోటువరకూ కూడా పర్యవేక్షణ చేయాలి. అంతే కాదు వివిధ రాష్ట్రాల సమిష్టిసహకారములపై ఆధారపడిమాత్రమే ఇంత పెద్దఎత్తున నడిపే ప్రభుత్వ ప్రణాళికను సాగించవలెను. 1938 మే నెలలో అధ్యక్షుడు సుభాస్ చంద్రబోసు పిలిచిన ప్రధానమంత్రుల సమావేశంలో, పారిశ్రామిక పునర్నిర్మాణమును గూర్చీ, విద్యుచ్ఛక్తియొక్క ఉత్పత్తి సాధనాలనుగూర్చీ రాష్ట్రాల పరస్పరసహకారమునుగూర్చీ విచారణకు వచ్చింది. ఈ అన్ని సమస్యలమీదనూ కాంగ్రెసు మంత్రులకు తగిన సలహాలిచ్చే నిమిత్తమొక ప్రవీణుల ఉపసంఘముంటే బాగుంటుందని ఆసమావేశమునకు హాజరైన వారంతా నిర్ణయించారు. పారిశ్రామికమంత్రుల సమావేశములో సుభాస్ బాబిచ్చిన ప్రారంభోపన్యాసం చాలా విజ్ఞానప్రదంగా వుంది. ఆయన స్వతంత్ర భారతదేశంలో జాతీయ పునర్నిర్మాణం ఎలాజరగాలో వివరించి చెప్పినాడు. శాస్త్రీయంగా వ్యవసాయం ఎంతఅభివృద్ధి అయినప్పటికీ, వ్యవసాయ పద్ధతులలో ఎంత చాకచక్యం చూపబడినప్పటికి అదంతా ఎక్కువ వాకగా ఎక్కువ ఆహారం ఉత్పత్తి చేయడానికే

పనికివస్తుంది. కాని దానితోపాటు ఎక్కువమందికి పనిలేకుండా పోతుంది. కాబట్టి పేదరికమూ, పని దొరకకపోవడమూ పోవలెనంటేనూ, మంచిబట్టలూ, మంచియిళ్లూ, మంచిచదువు ఎక్కువ విరామమూ కావలెంటేనూ పారిశ్రామిక పునర్నిర్మాణం కాదు చేయవలసింది. దేశాన్ని పరిశ్రమలతో నింపివేయాలి పారిశ్రామిక పరివర్తనంవల్ల చెడుగులు కలవు. కాని అవి తప్పనిసరి. వాటిని సాధ్యమైనంత తగ్గించుకోవడం మన శక్తికిమించిన పనికాదు. అయితే ఆ పరివర్తనం ఇంగ్లండులోవలె క్రమానుగతంగా కాక రష్యాలోవలె అతి వేగంగా వచ్చేటట్లు పని చేయాలి. సుభాసుబాబుకు సంబంధించినంతవరకు కుటీర పరిశ్రమలకూ, భారీ పరిశ్రమలకూ యేమీ పోటీవున్నట్లు కనిపించదు. కాని భారతజాతి పారిశ్రామిక పరివర్తనమునకు సమాధానపడి యేవి కుటీర పరిశ్రమలుగా ఉండాలో యేవి భారీపరిశ్రమలుగా పెంపొందాలో నిర్ణయించుకోవాలి. సుభాస్‌బాబు జాతీయ ప్రణాళిక యే సూత్రాల ప్రకారం వుండవలెనో వాటిని ఈక్రింద సంగ్రహంగా చెప్పినాడు.

(1) మన ప్రధానావసరముల విషయంలో జాతీయ స్వాతంత్ర్యమున కనుగుణంగా వుండాలి.

(2) విద్యుచ్ఛక్తిని సరఫరా చేయగల ఖనిజములను ఉత్పత్తిచేయడం, యంత్రాలనూ పనిముట్లనూ తయారుచేయడం, ముఖ్య రసాయనికవస్తువులను, రహదారీలకురాకపోకలకూ కావలసిన పరిశ్రమలను నిర్మించడం.

(3) వృత్తి విద్యలకూ, శాస్త్ర పరిశోధనకూ సంబంధించిన సమస్యా పరిష్కారం.

(4) శాశ్వత జాతీయ పరిశోధనామండలి నిర్మాణము.

(5) నేటి పారిశ్రామిక స్థితినిగూర్చిన పర్యవేక్షణము.

ఈ సూత్రాలనుబట్టి ఈ దిగువ సమస్యలుత్పన్నం కాగలవు.

(1) ప్రతిరాష్ట్రముయొక్క ఆర్థికపరిస్థితులనూ సవ్యంగా పరిశీలన చేయవలెను.

(2) కుటీర పరిశ్రమలకుగానీ భారీ పరిశ్రమలకుగానీ అతివ్యాప్తి దోషం పట్టకుండా రెంటింటిని సమన్వయం చేయడం.

(3) ఏపరిశ్రమ యేప్రదేశాలలో అవసరమో ఆలోచించి వాటినా ప్రదేశాలలో యేర్పాటు చేయడం.

(4) ఇండియాలోనూ విదేశాలలోనూకూడా విద్యార్థులకూ పారిభాషిక విద్య నేర్పించడం.

(5) పారిభాషిక పరిశోధనలకు తగిన సూచనలు చేయుట.

(6) పారిశ్రామిక సమస్యలనుగూర్చి సలహాలిచ్చేటందుకు ప్రవీణుల సంఘమును నియమించడం.

స్థానిక కమిటీలోని సభ్యులపేర్లు వెంటనే ప్రకటించబడినవి. అప్పుడు తాత్కాలికంగా ఇంగ్లాండులోనున్న జవహర్‌లాలు నెహ్రూ ఆ కమిటీకి అధ్యక్షుడుగా పేర్కొనబడెను. ఈ కమిటీ తరగి 27 ఉపసంఘాలను నియమించింది. పిదప 1938, 1939, 40 సంవత్సరాలలో, అనగా 1940 నవంబరులో శాసనోల్లంఘనోద్యమం ప్రారంభింపబడే వరకూ చేసిన మహత్తర కృషిని మనము గ్రహించ గలిగినట్లయితే భారత దేశంలోని ఉత్తమోత్తమ పండితులు శాస్త్రజ్ఞులు రాజకీయ మహాశయులు, శిల్పశాస్త్ర ప్రవీణులు ఎంతమంది ఎంత శ్రద్ధతోనూ సహనంతోనూ చేసిన కృషి బోధపడ గలదు. ఆ కమిటీలు చేసిన చర్చలూ విచారణలు ఒక ఉద్గ్రంథంగా తయారయింది. దాని పరిశీలనము దేశక్షేమమును కోరేవారందరికీ ఎంతో ప్రయోజనకారికాగలదు. కొన్ని భేదాభిప్రాయాల వలన జె. సి. కుమారప్ప గ్రామ కుటీర పరిశ్రమల ఉపసంఘంనుండి రాజీనామా యిచ్చాడు.

## (సి) సంస్థానాలు

కాంగ్రెసుకు ముఖ్యంగా సంబంధించిన అఖిలభారత సమస్యలలో సంస్థానాల సమస్యఒకటి. అది నానాటికి ప్రాముఖ్యం వహించింది. రాష్ట్రీయ స్వాతంత్ర్యం, ప్రతి రాష్ట్రంలోనూ దినదిన ప్రవర్ధమానమవుతూవున్న సమయంలో సంస్థానాలలో కూడా రాజకీయ చైతన్యం విజృంభించి, కొలదికాలంలోనే గాంధీయొద్దకూ వర్కింగు కమిటీ యొద్దకూ మాటిమాటికీ పరిష్కారమునకు రావలసిన నూతన క్లిష్టపరిస్థితులు తటస్థించినవి. నేటి చరిత్రలో దక్షిణ హిందుస్థానములోని తిరువాన్కూరు మైసూరు రాజ్యాలేవిధంగా ప్రసిద్ధికి వచ్చినవో మనమిదివరకే గమనించివున్నాము. కొద్దికాలంలోనే హైదరాబాదు కూడా వీటితోపాటు చేరింది. తిరువాన్కూరులో ప్రారంభింపబడిన నిర్బంధ విధానం భారతదేశమంతటిలోను విమర్శకుపాత్రమై, 1938 సెప్టెంబరు నెలలో ఢిల్లీనగరమున సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు సంఘము విచారించవలసిన ప్రధానవిషయంగా పరిణమించింది. తిరువాన్కూరు ప్రభుత్వమునకూ, తిరువాన్కూరు సంస్థాన కాంగ్రెసుకూ మధ్య తిరువాన్కూరు కాంగ్రెసుయొక్క ప్రధానాశయమునుగూర్చి తీవ్ర వాదోపవాదములు చెలరేగినవి. సంస్థాన ప్రభుత్వ యాజమాన్యం క్రింద తిరువాన్కూరులో బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనకు ఎవరికీ యేవిధమైన అభ్యంతరమూ ఉండకూడదు. ఈ యేర్పాటు చేయడానికి తగిన సావకాశాలను విచారించేటందుకు ఒక కమిటీని

కూడా నియమించవచ్చును. సంస్థానానికి వెలుపల నిష్పక్షపాతియని పేరెన్నికగన్న న్యాయశాస్త్ర ప్రవీణునిచే 'ఇటీవల జరిగిన సంఘటనలనుగూర్చి అనగా కొంతమంది మృతికీ, మరికొందరి శరీరక్షతికీ కారణభూతమైన నిరాయుధ ప్రజపై పోలీసుల తుపాకి కాల్పులనుగూర్చి ప్రభుత్వమువారు దానిని సమర్థించుకొంటూచేసిన ప్రకటననుగూర్చి కూడా విచారణచేయించడం అవసరమని అ. భా. కా. సం. తీర్మానించింది. రాజకీయ ఖైదీలను విడుదలచేయవలసిందనిసైతం ఆ ఢిల్లీ సమావేశంలోనే కోరబడింది. తిరు వాన్కూరువిధంగా వ్యవహరిస్తూండగా హైదరాబాదు అవసరమైనదానికంటెకూడా ఎక్కువ అధికారాన్ని చలాయించడానికి ఆర్డినెన్సులను చేసింది. తాల్చేరు దక్ కెనాల్ లాంటి తూర్పు యేజెన్సీ సంస్థానాలలోనూ ఉత్తర హిందూస్థానంలో కాశ్మీర్ పట్టి వాల్ సంస్థానాలలోనూ తీక్ష్ణ నిర్బంధవిధానం సాగింది అయితే అన్నిటికంటెనూ ఎక్కువగా ప్రజల దృష్టిని ఆకర్షించి ప్రజల అంచనాలో ఎక్కువ అపఖ్యాతి పొందిన సంస్థానం మైసూరురాజ్యం. ప్రత్యక్షంగా నలభైయేళ్లు బ్రిటిష్ పాలనంక్రింద వున్న కారణంచేత బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రాల పరిపాలనముతో సరిపోలగల విధానము లను, ప్రమాణములను అవలంబించి ఈ రాజ్యం కొంత ప్రతిష్ఠ యిదివరలో సంపాదిం చింది. కాని పెద్దలు సంపాదించిన ఐశ్వర్యంమీద జీవించేవారి అందరివలెనే ఈరాజ్యం కూడా కొంతకాలమూ ప్రతిష్ఠను ఆధారంగా చేసుకొని బాగా బతికింది. కాని క్రమ క్రమంగా ఆ ప్రతిష్ఠ క్షీణించక తప్పిందికాదు అంతటితో రాజకీయరంగంలో ఆరాజ్య మున కున్న పరపతి పోయింది. స్వాతంత్ర్య దినోత్సవములను జరుపరాదని వాచా మందలించడం తరువాత వ్రాతపూర్వకంగా నిషేధపు టుత్తరువులు పంపించడం రాజ కీయ కార్యక్రమాలకు నిష్కారణం విప్లవచర్యలని సంగ్రహంగా పేరుపెట్టి వ్యక్తుల యొద్దనుండి హామీలడగడం నిరోధాజ్ఞలను జారీచేయడం, ఇవీ నాడు మైసూరులో జరుగుతూండిన పనులు. 1938 లో మైసూరు సంస్థానంలోని విదురాశ్వత్థంలో దేవుడి ఉత్సవం జరిగింది. అక్కడ నిరాయుధులైన ప్రజలపైన పోలీసులు తుపాకులుకాల్చారు. సత్యాహింసలనే సిద్ధాంతములపైన శ్రద్ధాభక్తులతో ప్రమాదరహితంగా పెంపొందించు కొన్న రాజకీయ చైతన్యమునగానీ, దినదిన ప్రవర్ధమానంగా ఉన్న దేశభక్తినిగానీ, ఓర్పుతో సహింపజాలని నిర్బంధవిధానమునకది పరమావధిగా పరిణమించింది. తరు వాత ఒక విచారణసంఘం నియమింపబడడం అది ఉద్యోగుల చర్యలను నిరసించడం కొంత కీడులో మేలు. అయినప్పటికీ అది నిజానికి 1938 ఏప్రిల్ లోని విదురాశ్వత్థం కాల్పులను సమర్థించిందనే అనాలి. సరిగా ఆసమయంలోనే పర్కింగుకమిటీసభ్యులైన వల్లభాయిపటేలు కృపాలనీలను గాంధీజీ పంపించాడు. ఇది యింకనూ సన్నిహితంగా

పరిశీలించవలసిన ముఖ్యవిషయం గనుక దీనిపైన కాంగ్రెసు అధికారరీత్యా చేసిన ప్రకటన నీ దిగువ ఉదాహరించదలచుకొన్నాను.

'జాతీయ పతాకమును కట్టరాదనీ, సమావేశాలు జరిప ఉపన్యాసాలీయరాదనీ జిల్లామేజస్ట్రేటు 144 వ సెక్షన్‌క్రింద ఉత్తరువులు జారీచేశాడు. కోలారు జిల్లాలో బెంగుళూరుకు 50 మైళ్ళదూరంలోనున్న విదురాశ్వత్థ గ్రామస్థులీ ఉత్తరువులను ధిక్కరించి సుమారు 10,000 మంది ఒక బహిరంగ సభలో సమావేశమైనారు. ఈ సభను అక్రమ సంఘంగా ప్రకటిస్తూ వెంటనే చెదరిపోవలసిందని జిల్లామేజస్ట్రేటు ఆజ్ఞాపించాడు. సభ చెదరిపోలేదు. పోలీసులు తుపాకులు కాల్చారు. దాని ఫలితంగా 32 మంది మరణించినట్లు 48 మందికి గాయాలు తగిలినట్లూ తెలియవస్తూన్నది. హతులైనవారినిగూర్చిన అధికారుల అంచనా యింకొక భిన్నంగా ఉంది. పన్నెండుగురుమాత్రమే మరణించారని కొంతమందికి గాయాలు తగిలినవనీ, వారంటున్నారు. విచక్షణ లేకుండా జరిగిన ఈ కాల్పులనుగూర్చి దేశంలో చాలామంది ఘోరం జరిగినట్లుగా భావించారు. మైసూరు స్టేటు కాంగ్రెసు వర్కింగుకమిటీవారు విచక్షణ లేకుండా జరిగిన ఈ పోలీసుకాల్పులను నిరసిస్తూ, పౌరుల ప్రాథమిక సత్వములను రక్షించుకొనేటందుకు, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకొనేటందుకు కాంగ్రెసువాదులయినవారు నిషేధపుటుత్తరువులను ఉల్లంఘించడానికి స్వాతంత్ర్యం కలదని ప్రకటించారు. ఈ విషాదసంఘటనమునకు సంబంధించిన యావత్తు ఉదంతమూ మైసూరు ప్రభుత్వపక్షాన ఒక కరపత్రంద్వారా వెల్లడించబడింది. మూకలు దౌర్జన్యం చేసినప్పుడు తుపాకులు కాల్చక తప్పదని ఆకరపత్రంలో సమర్థింపబడింది. అయినప్పటికీ ముగ్గురు జడ్జీలతో ఒక విచారణ సంఘాన్ని ప్రభుత్వం నియమించింది. మైసూరు స్టేటు కాంగ్రెసు మరియొక విచారణ సంఘాన్ని నియమించింది. మైసూరులో కలిగిన ప్రజాచైతన్యముయొక్క లక్షణాలను సరిగా అర్థం చేసుకొని ప్రభుత్వం తన నిరంకుశాధికారమును విరమించుకోవడం యుక్తమని గాంధీజీ పత్రికలలో ప్రకటనచేశాడు.

" పరిస్థితులను స్థానికంగా ఉండి విచారించి, సాధ్యమైతే మైసూరు సంస్థాన కాంగ్రెసుకూ మైసూరు ప్రభుత్వానికి రాజీచేసేటందుకే వల్లభాయి పటేలు కృపాలనీలు బెంగుళూరుకు బయలుదేరారు. మైసూరు కాంగ్రెసు నాయకులతో సమాలోచనలు జరిపినపిమ్మట మైసూర్ దివాన్ సర్ మీర్జాయిస్మాయిల్‌నుకూడా అనేకసార్లు వారుదర్శించి సంప్రదించారు. వీటన్నిటి ఫలితంగానూ

కుదిరిన రాజీ షరతుల నీకింద పొందుపరుస్తున్నాము. ఇవన్నీ ఇంతకుపూర్వం కొలదికాలం కిందట సీవపురా మహాసభలో స్టేటు కాంగ్రెసు కోరిన కోరికలే.

"(౧) మైసూరు కాంగ్రెసును గుర్తించుట, (౨) సంస్కరణల ఉపసంఘంవారు మైసూరు రాజ్యానికి బాధ్యతాయుత ప్రభుత్వమునుగూర్చి చర్చించి, సిఫారసు చేయడానికి అధికారం కలదని మైసూరు ప్రభుత్వం ప్రకటించవలెను (3) సంస్కరణల ఉపసంఘమునుంచి రాజీనామా యిచ్చిన నల్గురు కాంగ్రెసు సభ్యులను తిరిగీ నియమించడమేగాక అదనంగా మరి ముగ్గురను కూడా స్టేటు కాంగ్రెసు కోరుకొన్న వారిని ఆ ఉపసంఘంలో నియమించవలెను. (4) స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహమును విరమించవలెను. (5) రాజకీయ ఖైదీలందఱూ విడుదలచేయబడవలెను. అన్ని నిర్బంధాజ్ఞలనూ ప్రభుత్వంవా రుపసంహరించుకోవలెను. (6) అన్ని విద్యుక్త సమయాలలోనూ ప్రభుత్వ... జెండాతోపాటు కాంగ్రెసుజెండాకూడా ఎగురవేయవచ్చునని గాంధీజీ చేసిన సూచనను అంగీకరించవలసిఉంది. అయితే ప్రత్యేకం పార్టీ కార్యకలాపాలకు సంబంధించినంతవరకు కాంగ్రెసుజెండా ఒక్కటే ఎగురవలెను.

"మైసూరుస్టేటు కాంగ్రెసును గుర్తించడమును గూర్చీ దానికి సంబంధించిన మరికొన్ని విషయాలనుగూర్చి మైసూరు ప్రభుత్వవిధానము మే 17 వ తేదీని ప్రకటించబడింది. మైసూరుస్టేటులోని కాంగ్రెసుపార్టీని మైసూరు ప్రభుత్వం గుర్తించింది. రాజ్యాంగ సంస్కరణల ఉపసంఘానికి కాంగ్రెసు పార్టీవారెన్నుకొన్న ముగ్గురు అదనపు సభ్యుల నియామకమునకు ప్రభుత్వం అంగీకరించింది. జెండాసమస్యపై గాంధీజీ రాజీసూచన అంగీకరించబడింది. రాజకీయఖైదీల విడుదలనుగూర్చీ, నిషేధపుటుత్తరువుల ఉపసంహరణమును గూర్చి ప్రభుత్వం హామీయిచ్చింది. ఈ చర్యలు "మైసూరు రాజ్యంలో అభీష్టాభ్యుదయ పరంపరలకు నూతనశక ప్రారంభచిహ్నాలు" కాగలవని ప్రభుత్వం ఆసించింది.

మైసూరు రాజ్యంలోని ప్రభుత్వాధికారులతోనూ, జైళ్లలోనున్న రాజకీయ ఖైదీలతోనూ వివిధవిషయాలనుగూర్చి సంప్రదింపులుజరిపిన తరువాతనే ఈ పైరాజీ కుదిరింది. మైసూరు ప్రభుత్వానికిన్నీ స్టేటుకాంగ్రెసుకున్నూ, సర్దారుపటేలు, ఆచార్య కృపలానీలు చేసిన ఈరాజీని వర్కింగుకమిటీవారామోదించారు. ఈ రాజీని అమలు పరచడానికి మైసూరుప్రభుత్వంవారొక ప్రకటనచేశారు. మహారాజాయున్ను ఆయనసలహాదార్లున్నూ ఈ రాజీని బహువేగంగా అమలుపరచినందుకు 1938 జూన్ నెలలో

కాంగ్రెసు వర్కింగుకమిటీవారు వాటిని అభినందించారు. జాతీయపతాకము వివాద ప్రస్తవిషయాలలో ఒకటి. ప్రభుత్వ పతాకమునకుగానీ జాతీయ పతాకమునకుగానీ యేవిధమైన అగౌరవమూ జరుగకుండ జాగ్రత తీసుకోనవలెనని ఉభయపక్షముల వారికి గాంధీజీ సలహాయిచ్చాడు. జాతీయజెండాయొక్క ఉత్కృష్టగౌరవం నిర్బంధం పైన ఆధారపడిలేదు. కాంగ్రెసువాదుల సత్ప్రవర్తనపైననూ కాంగ్రెసు దేశానికిచేసిన అభ్యుదయకార్య పరంపరలపైననూ ఆధారపడిఉంది. కేవలం సత్యాహింసలద్వారా సంపాదించవలసిన జాతీయైకమత్యమునకూ అహింసకూ జాతీయపతాకం చిహ్నం. ఇక దక్షిణాన్నైన సంస్థానాల సమస్యనుగూర్చి మాట్లాడవలసినయెడల, కాంగ్రెసులో దిన దినాభివృద్ధి పొందుతూన్న ఒకపక్షం సంస్థానాలను, మధ్యయుగంనాటి స్మారక చిహ్నములుగా భావించి వాటిని పూర్తిగా నిర్మూలించవలెనని కోరేవారున్నారు. కాని మొత్తంపైన కాంగ్రెసుమాత్రం సంస్థానాలలో అంతవరకూ స్నేహంగానేఉంటూ సంస్థానాలు కాలపరివర్తనమును గమనించి తమరాజ్యాలలో బాధ్యతాయుత ప్రభుత్వ మును స్థాపించగలవనీ వారి సంరక్షణలోనున్న ప్రజల స్వాతంత్ర్యమును విస్తరింపచేసి రక్షించగలవనీ ఆశిస్తూవచ్చారు.

ఇండియా పరాధీనదేశమైనప్పటికీ, అఖిలభారత జాతీయమహాసభ తనకుగల అంతర్జాతీయ ప్రతిపత్తిని నిరంతరం గుర్తిస్తూనేవచ్చింది. దానికి రాజకీయంగా ఉండ దగినంత హోదా నేడులేకపోవచ్చును. కాని మానవజాతియొక్క అభ్యుదయమునకు సంబంధించి దానికితగినంత ప్రతిపత్తిని కల్పించేటందుకు దేశానికీ కాంగ్రెసుకూ కూడా శక్తిఉంది. మనకుపక్కనే చైనాదేశముంది. నాలుగేండ్లనుండి అంతరంగిక కల్లోలముల తోనూ విదేశదండయాత్రల భీతితోను చీకాకు పడుతున్న దేశమది. ప్రాచ్యఖండంలో నున్నదేశం గనుక ఏకఖండవాసులంగా మనకాదేశమునందు సానుభూతి చూపవలసిన బాధ్యత ఉండడమేగాక, మనకు పరిసరములలో నున్నదేశంకావడం వలనకూడా మన బాధ్యత ద్విగుణీకృతం అవుతూన్నది. కాబట్టి మన జాతీయమహాసభ మోటారు చికిత్సాదళమునొక దానిని అవసరమైనంతమంది వైద్యులతోనూ దాదులతోనూ చైనాజాతీయ ప్రభుత్వసహాయార్థం పంపించింది. చైనామీద జపాను దండయాత్ర ప్రారంభమైన 1937 నుండీ, చైనాప్రజలుచేస్తూన్న శాంతిస్వాతంత్ర్యముల పోరాటంలో వారిపక్షాన సంపూర్ణసానుభూతిని ప్రకటిస్తూవచ్చిన భారతకాంగ్రెసు నిర్వర్తించతగిన సముచితకార్యమేయిది. ఆనాడు చైనాపక్షాన యెన్నో ప్రదర్శనాలు, ఉత్సవాలు ఇండియాలో జరిగినవి. 8,000 రూపాయలు ధనం సేకరించబడింది. కాని ఇండియాదేశం ఐక్యభావంతో వైద్యదళాన్ని పంపించిప్రకటించిన సానుభూతిముందు, ఈమొత్తం ఒక

లెక్కలోదికాదు. చైనాకుపంపిన వైద్యదళానికి నాయకుడు డాక్టరు అట్టాల్. ఆయన తన కార్యనిర్వహణంలో ప్రదర్శించిన శ్రద్ధాభక్తులకు అన్నివైపులనుండీ అభినందనాలు వచ్చినవి. రెండేండ్లు నిరంతరశ్రమచేసి 1940 లో ఆయన ఇండియాకు తిరిగివచ్చాడు. చైనాలో ఆయన మిగిల్చివచ్చిన సహోదార కార్యభారమును ఆయన సహచరులు వహించారు. ఈ దళంలో సభ్యుడైన డాక్టరు కొట్నీస్ చైనాలోనే స్వర్గస్థుడైనాడు. జంజీబారు పరిస్థితులు కొంతమంచిగా మారినవి. 1938 జూన్ వరకూ ఇండియా సాగించిన జంజీబారు లవంగాల తీవ్రబహిష్కరణోద్యమం వలన మంచిప్రయోజనమే కలిగింది. జంజీబారు ప్రభుత్వం తిరిగివచ్చి అక్కడి ఇండియన్ ప్రజతో భారతజాతీయ మహాసభా మోదమునకు లోబడి ఒకరాజీచేసుకొన్నది. మే 4వ తేదీని జరిగిన ఈతాత్కాలికరాజీ మొదట వలసరాజ్య ప్రభుత్వమున్నూ, పిదప ఇండియాజాతీయ మహాసభయున్నూ ఆమోదించినవి. ఈలోగా లవంగబహిష్కరణోద్యమమునకు అధ్యక్షుడైన వల్లభాయిపటేలు ఈ దిగువ ప్రకటన చేశాడు

“ జంజీబారు ప్రభుత్వమునకున్నూ అక్కడి భారతప్రజకున్నూ గల లవంగ వివాదమునుగూర్చి జరిగిన రాజీని, ఇంగ్లాండులోని వలసరాజ్యకార్యాలయము వారామోదించినందున ఇప్పటికది స్థిరపడిపోయింది. భారతజాతీయ మహాసభా కార్యవర్గమువారు తమ ఆమోదమును యిదివరకే ప్రకటించారు. కాబట్టి లవంగ బహిష్కరణోద్యమమును నిలిపివేసేటందుకు కావలసిన షరతులన్నీ యిదివరకే నిర్వర్తింపబడినవి కనుక లవంగ బహిష్కరణోపసంఘం పక్షాన ఆ బహిష్కరణం విరమింపబడినదని అధికారరీత్యా నేను ప్రకటిస్తున్నాను నేటినుండీ జంజీబారు, మడగాస్కరు దేశాలతో లవంగ వ్యాపారం మామూలుగా సాగించవచ్చునని నేను వర్తకులను హెచ్చరిస్తున్నాను.

“ జంజీబారు రాజీనామాను గురించి చేసిన తీర్మానసందర్భంలో కాంగ్రెసు వర్కింగు కమిటీవారు, మనమంతా గుర్తుంచుకోవలసిన వాక్యం ఒకటి వ్రాశారు. బహిష్కరణోద్యమం జయప్రదం కావడానికి పనిచేసిన దుకాణదారులను మాత్రమే ప్రజలు ముఖ్యంగా చిల్లర వర్తకులు మొట్టమొదట ప్రోత్సహించ గలరని వర్కింగుకమిటీవారు తమ విశ్వాసమును వెల్లడించారు. ఈ విశ్వాసమున కనుగుణంగానే భారతప్రజలందరూ వ్యవహరించగలరని నానమ్మకము.

“ జంజీబారులోని భారతీయసంఘమున్నూ, ఈ దేశములోని ప్రజానీకమున్నూ ముఖ్యంగా బొంబాయి తదితర ప్రదేశములలోని లవంగ వ్యాపా-

గిస్తున్నా చేసిన త్యాగములకూ వారి త్యాగాల ఫలితంగా లభించిన విజయమునకూ అభినందనం. బహిష్కారోద్యమసంఘం పక్షాన వారందరినీ నేనభినందిస్తున్నాను. ఎన్ని కష్టాలైనా లెక్కచేయకుండా ఆరు వారాలు బొంబాయినగరములోని లవంగ వ్యాపారమును పికెటుచేసి దానిని స్తంభింపచేసినందుకు బొంబాయిరాష్ట్ర కాంగ్రెసుసంఘమునకు స్వచ్ఛంద సైనికులకు నా కృతజ్ఞతను వెల్లడిస్తున్నాను. బహిష్కారోద్యమసంబంధమైన పికెటింగుకూడా యిప్పుడు ఉపసంహరింపబడింది. దీనివలన మన ఉద్యమానికి అపరాధంచేసిన వారందరూ స్వేచ్ఛగా తప్పించుకుపోలేరని అర్థంకాదు. వారివిషయంలో యింతకుపూర్వమే చర్య తీసుకోబడ్డది. మిగిలినవారిని తమ అపరాధమునకు తగిన పరిహారంచేయవలసిందిగా కోరి వున్నాము. అలా చేయనివారి విషయంలో తగిన చర్య తీసుకోబడును.

"చిరకాలంనుండీ నడుస్తూన్న ఈ జంజిబారు వివాదం యింత సంతోషకరంగా అంతం అయినందుకు భారతీయ సంఘాన్ని నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఈ దేశంలోని ఇండియన్ నేషనల్ కాంగ్రెసు తన సంయుక్తప్రతిఘటనము వలన విదేశాలలోని భారతీయ ప్రయోజనములను రక్షింపగలదని వారెప్పుడు ధైర్యంగా ఉండవచ్చును."

1938 శరత్తులో తిరిగి యుద్ధమేఘాలు వ్యాపించదొడగినవి. మొట్టమొదటవి చాలా చిన్నవిగా కనిపించినవి. కాని రాను రాను ఆకాశమంతా క్రమ్ముకొని భూఖండలాన్ని చీకటికోటం చేయ ప్రారంభించినవి. కొంతమంది తమ క్రోధాగ్ని ప్రజ్వలించకుండా నిరోధిస్తున్నందుకు బ్రిటిష్ ప్రధానిని నిందించారు. మరికొందరు ప్రశాంతచిత్తమైన తన పోకడలో ఒక క్లిష్టపరిస్థితిని తొలగించగలిగినందుకా వృద్ధమూర్తిని ఎంతో కొనియాడారు. సెప్టెంబరులోని మ్యూనిచ్ సంధిపత్రానికి దారితీసిన సంఘటనలను బట్టి కాంగ్రెసు వర్కింగుకమిటీవారు రానున్న సంగ్రామ ప్రళయమును నిరీక్షిస్తూ చేయవలసిన ముఖ్యనిర్ణయములనుగూర్చి నిరంతరాందోళనలో విశ్రాంతిలేకుండా ఉన్నారు. జూన్ ౨వ తేదీని ఇండియానువిడిచి యూరపుకు ప్రయాణించిన జవహరలాలు నెహ్రూ బ్రిటను, జర్మనీ దేశాలలోని సైనిక రాజకీయ పరిస్థితులను గూర్చి వారం వారం నివేదికలు వర్కింగుకమిటీకి పంపుతున్నాడు. ఆయన మసావాలోని భారతీయ పత్రికలనూ, అలగ్జాండ్రియాలో నాహాస్‌పాషా మొదలుగాగల ఫాసిస్టు నాయకులనూ కలుసుకొని, వారిని ఇండియాకు, ముఖ్యంగా రానున్న జాతీయమహాసభకు ఆహ్వానించి, తిన్నగా బార్సిలోనా (స్పెయిన్)కు పోయి

స్పెయిన్ పరిస్థితులను సన్నిహితంగా పరిశీలనచేశాడు. ఆరోజులలో నిర్దాక్షిణ్యంగా పైనుండి బాంబులువేయడం ఆయన కన్నులారా చూచాడు. పిదప ప్యారిస్ నగరమును దర్శించి అక్కడ భారత జాతీయోద్యమమునుగూర్చి రేడియో ఉపన్యాసమిచ్చాడు. అందులో మన ఉద్యమానికి ఫ్రెంచి ప్రజానీకముయొక్క సహకార సుహృద్భావములు కావలెనని కోరాడు. తరువాత ఇంగ్లాండుకుపోయి అక్కడ అనేకవిధములైన కార్య క్రమాలలో అధ్యక్ష్యం వహించాడు. ట్రఫాల్గరుచౌకులో నెల్సన్ స్థూపంయొక్క విత్తర్థి పైన ఖద్దరుదుస్తులలో నిలబడి, స్పెయిన్ యుద్ధంయొక్క ద్వితీయ వార్షికోత్సవ సంద ర్భమున బ్రిటిష్ ప్రజాసామాన్యంచేసిన ప్రదర్శనము నుద్దేశించి యిలాప్రసంగించాడు.

"ఫాసిజంమాకుకొత్త. మాకంపలో 150 యేళ్ళ అనుభవముంది. కాబట్టే స్పెయిన్, చైనాదేశాల కష్టం మాకుబాగా అర్థమౌతుంది. ఈరెండుదేశాలూ ఫాసిజముకు వ్యతిరేకంగా చేస్తున్న పోరాటాలను మేము ప్రోత్సాహపరుస్తాము వారి అనుభవాలను మేము గ్రహిస్తాం. ఇండియాలోని, ఫాసిజమును నిర్మూలించడానికి కాక పచ్చినిరంకు శాధికారమును చలాయించడానికి పూనుకొన్న బ్రిటిష్ సామ్రాజ్యతత్వంతో మా కెక్కడా రాజీలేదు. 1938 జూలై మాసమున ప్యారిస్ నగరంలో జరిగిన అంతర్జాతీయ మహాసభలో, సైనికరక్షణకిందలేని పట్టణాలపైన విమాన దండయాత్రలుజరిపి బాంబులు వేయడం అక్రమమని జవహర్‌లాలు కరుణాపూరితంగా ఉపన్యసించాడు. ఢిల్లీలో 1938 సెప్టెంబరులో అఖిలభారత కాంగ్రెసు వర్కింగుకమిటీవారు యుద్ధపరిస్థితులనుగూర్చి చర్చించారు. యుద్ధాన్ని భారతీయులు తమస్వార్థంకోసం ఉపయోగించుకో దలచే పక్షంలో తానాఉద్యమానికి నాయకుడుగా ఉండజాలననీ, వర్కింగుకమిటీవారుమఱొక నాయకుణ్ని చూచుకోవచ్చుననీ గాంధీజీ విస్పష్టంచేశాడు. తరువాత యేడాదికి యుద్ధం రానేవచ్చింది. అప్పుడువిషయం యింకాబాగా ఋజువయింది.

ఈ సందర్భంలో బర్మానుగూర్చి కూడా యాదృచ్ఛికంగా కొంతచెప్పవలసి ఉంది బర్మా ఇండియానుండి విడిపోయినది గనుక అక్కడఉన్న ఇండియనులు విదే శాలలోనున్న ఇండియనులుగానే భావింపబడవలెనా అనేది చర్చించదగిన సమస్య. 1938 లో విషాదకరములైన కొట్లాటలు బర్మీయులకున్నూ ఇండియనులకున్నూ జరిగినవి. నెత్తురు వెల్లువిరిసింది. అనేకమంది చనిపోయినారు. ఎంతమందో గాయపడ్డారు. ఎంతో ఆస్తి నాశనమయింది. ప్రత్యక్షంగా కొంపలు రేగులపెట్టడం హత్యలుచేయడం జరిగింది. దూరానవున్న ఇండియన్ నేషనల్ కాంగ్రెసు ఈ సంఘటనలనుగూర్చి సక్రమవిచారణ చేయమని కోరడంకంటె ఇంకేమీ సహాయ పడజాలకపోయింది. నాశనముచేయబడిన పూజాస్థలాలను పునరుద్ధరించి నిరపరాధులకు జరిగినకష్టాలకు పరిహారమీయమని కోరడం

తింటే కాంగ్రెసు ఇంకఎక్కువకోరికలను కోరలేదు. బర్మాలో చిరకాలంనుండీకాపురం ఉంటూ బర్మాఅభివృద్ధికి ఎంతోతోడ్పడ్డ భారతీయులను పరాయివాళ్లుగా చూడవలదనీ, బర్మీయులూ భారతీయులూ పూర్వంవలెనే స్నేహితులుగావుండి అన్ని వ్యవహారాలలోనూ, న్యాయమునూ, సహనత్వమూ గుర్తించవలసిందనీ కాంగ్రెసు హెచ్చరించింది. కొన్నిసంవత్సరాలనుంచీ ఇండియాలో అంతరంగికంగా సాంఘిక విద్వేషాలు పెచ్చుపెరిగిపోతూన్నట్లు అనేక ఉదాహరణలు కలవు. ఇదేవిధంగా అభివృద్ధిపొందుతూ వచ్చినవి చారిత్రిక దృక్పథంతోనూ మనస్తత్వశాస్త్రరీత్యానూ పరిశీలిస్తూ, ప్రత్యేకం ఒక అధ్యాయంలో చర్చించడం సముచితమైనప్పటికీ, జవహర్లాలు నెహ్రూకూ జిన్నాకూ ఈ సందర్భంలోజరిగిన ఉత్తరప్రత్యుత్తరాలనుగూర్చి ఇక్కడఉదహరించక పోయినట్లయితే, 1938 నాటి కాంగ్రెసు చరిత్రలోని ఘట్టాలను సంపూర్ణంగా వివరించినట్లు కాదు. వీరి ఉత్తరప్రత్యుత్తరాలతి తీక్ష్ణంగా జరిగినవి. సుభాస్‌బాబు కాంగ్రెసు అధ్యక్షుడుగా చిటగాంగుకు సంచారంవెళ్ళినప్పుడు కొంతమంది ముస్లింలీగర్లు నిగ్రహం కోల్పోయి ఆయనగారికి ఊరేగింపుపైన రాళ్ళువిసరడంకూడా ప్రయత్నించింది ఇది అదివరకెన్నడూ జరగని విషాదసంఘటన అప్పుడు కాంగ్రెసు ఉద్యమానికన్నీ ఆయనతోఉన్న పదుగ్గురికిన్ని కొద్దిగాగాయాలుకూడాతగిలినవి. మూకలకోపాన్ని పోకిరీతనాన్ని, ద్వేషాన్ని ఎదుర్కొనడానికి, సహనమూ ఆత్మనిగ్రహమూ, ప్రేమాతప్ప వేరేమార్గం లేదని సుబాస్‌బాబు వెంటనే ఒక ప్రకటన చేశాడు. ఇందువల్లనే మన సిద్ధాంతాలైన సత్యాహింసలకు మనం నిజంగా కట్టుబడిఉన్నట్లు ఋజువుచేయవచ్చునన్నాడాయన. జిన్నాచేసిన ప్రతిపాదనలో ఒక్కఅక్షరంకూడా మార్చడానికి జిన్నా ఒప్పుకోలేదు. కాబట్టి కరాచీ నుండి 1938 అక్టోబరు 9 వ తేదీన ఆయనవ్రాసిన ఉత్తరం యెంతమాత్రమూ సహాయకారిగా లేదని డిశంబరులో సమావేశమైన కాంగ్రెసు వర్కింగుకమిటీవారభిప్రాయపడ్డారు. 1938 డిశంబరు 16 వ తేదీని ముస్లింలీగువారిచ్చిన రాయబారపు షరతులను అంగీకరించడానికి కాంగ్రెసుకు సాధ్యంకాలేదు గనుక ఆవిషయంలో ఇంకేమీ చేయడానికి వీలులేదని కాంగ్రెసు అధ్యక్షుడు జిన్నాకు తెలియపరిచాడు.

---

# * త్రిపురి కాంగ్రెసు

## [మార్చి 1935]

కలిమిలేములు కాలచక్రంతోపాటు పైకీ కిందకూ పరిభ్రమిస్తూనే ఉంటవని ప్రతీతి. అదృష్టాన సౌఖ్యమూ దురదృష్టాన దుఃఖమూ కలుగవచ్చును. జీవితమంటే అనేక సుఖదుఃఖాల సమ్మేళనమే. 1938 లో తప్పిపోయిన యుద్ధాన్ని 1939 లో తప్పించుకోగలమా? 1938 చాలా ప్రాముఖ్యమైన సంవత్సరం. రాష్ట్రీయ మంత్రులు నూతనోత్సాహంతో పని ప్రారంభించారు. ఫెడరేషనును అసలులోకి రాకుండా చేయవలెనని ప్రజలు కృతనిశ్చయులై ఉన్నారు. హిందూదేశములో వెనుకపడి వున్న సంఘములయొక్కయు నిరుపేదలయొక్కయు ఆర్థిక నైతిక సాంఘికాభివృద్ధికి వివిధ ప్రయత్నాలు జరిగినవి. అంతేకాక పరాయిదేశాల పరిస్థితులనుబట్టి భారతదేశంలో ఆశాభయములు రెండూ సమ్మిళితములై విజృంభింప సాగినవి. 1938లో తాత్కాలికంగా యుద్ధం తప్పిపోయినమాట వాస్తవమే కాని ఆ సంతోషమెన్నాళ్లు? దేశాలమధ్యవున్న శత్రుత్వం అప్పటికప్పుడు అణగిమణగి వున్నదేకాని అసలు నిర్మూలం కాలేదు. వేసవినాటి మండుటెండలలోనే పుడమిని సస్యశ్యామలం చేయగల వర్షఋతువునాటి నీటి చినుకులు గర్భీకృతమై వుండడం ప్రకృతి చిత్రం. కాంగ్రెసుకిప్పుడు మరొక సంవత్సరం గడచింది. తొలకరికిముందు రైతులకువలెనే ప్రతిసంవత్సరాంతమునా కాంగ్రెసుకు క్రొత్త ఉత్సాహోద్రేకములు కలుగుతూంటవి. తొలకరివానకు ముందుగానే వీచే చల్లనిగాడ్పు ఆశాపూరిత హృదయాలకు నూతనానందమును కల్పించి ద్విగుణీకృతోత్సాహంతో పని చేయడానికి శక్తి కలిగిస్తుంది. సాధారణంగా ఒక సంవత్సరం వర్షాలు బాగా కురిసి వరదలువస్తే మరొక సంవత్సరం ఎండలు బాగాకాచి పొలం నెఱలుకొట్టి పోతుంది. ఆయేటివాన నెఱలు నింపడానికికూడా చాలదు. కాలమానం సరిగా ఉండే సంవత్సరాలూ చాలా తక్కువ. కాంగ్రెసు విషయంలోకూడా అంతే. భూమిని దున్ని, చదును చేసి, నీరుపెట్టి, నారుపోసి, నాటి, కలుపుతీసి, కోసి, ధాన్యం నూర్చి, గాదెకెత్తిన రైతు కెంత వుత్సాహం సంతోషం వుంటుందో అంత ఉత్సాహంతోనూ ఉద్రేకంతోనూ కనిపించారు. కాంగ్రెసువాదులీ సంవత్సరాంతములో కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికనుగూర్చి వారి హృదయాలు ఉద్రేకోత్సాహములతో ఉప్పొంగి పోతూండినవి. ఎవరు అధ్యక్షులుగా ఉంటారు? నామినేషన్లు ప్రకటించబడినవా? పోటీ ఉంటుందా? ఎన్నికలు జరుగుతయ్యా? లేక ఆ పెద్దవాళ్లే నలు

గురూ ఎవరికైనా ఆశీర్వదించి కాంగ్రెసు సింహాసనంపైన కూచోబెడతారా? జవహర్‌లాలు ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు అధ్యక్షుడైతే సుభాస్‌బాబు రెండోసారి ఎందుకు అధ్యక్షుడు కాకూడదు? అనే ప్రశ్న పరంపరలతో ప్రకృతి నిండిపోయింది.

అంతే కాదు. కాంగ్రెసులోని అంతర్గత కల్లోలం మనస్సులకు చాలా చీకాకు కల్గిస్తూన్నది. దానికితోడు దేశంలోనూ దేశాంతరములలోనూ కూడా రాజకీయ వాతావరణం ద్విగుణీకృత విద్యుద్వేగంతో పరివర్తనం చెందుతూన్నది. మ్యూనిచ్ సంధికి దారితీసిన బ్రిటిష్ రాజ్యతంత్రం కాంగ్రెసుకు నచ్చలేదు. మ్యూనిచ్ సంధితోపాటు ఆంగ్లో ఇటాలియన్ ఒడంబడిక స్పెయిన్ తిరుగుబాటుదారులను గుర్తించడం ఇవన్నీ ప్రజాస్వామ్యానికి విద్రోహంచేయడంగా పదేపదే చేసిన వాగ్దానాలను భంగపరచడంగా సిద్ధాంతాలను త్రోసిపుచ్చడంగా, సమిష్టి సంరక్షణ విధానాన్ని నిర్మూలన మొనర్చడంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు బద్ధవిరోధులైనా ప్రభుత్వాలతో సహకరించడంగా భావిస్తూవచ్చింది ప్రజానీకం. ఈవిధంగా ప్రపంచమొక అంతర్జాతీయ అరాజకస్థితికిలోనయ్యేటట్లుంది. శాంతిస్థాపనపేరుతో కిందటిసారి జరిగిన యుద్ధంకంటె కూడా ఎక్కువ భయంకరమైన మహాసంగ్రామమొకటి సాగించడానికి పెద్దయెత్తున ప్రయత్నాలు నడుస్తూన్నవి. యూదీయులమీద దీక్షగా జరిగిస్తూన్న ఘోరకృత్యములనూ, నగరాలపైనా నగరాలలోని శరణాగతులపైనా నిరపరాధ ప్రజాసమూహంపైనా విమానాలతో బాంబులు వేయడమూ చూస్తే ప్రపంచనీతి యెంత నీచస్థితికి పోతూన్నదో గ్రహించవచ్చును. పాలస్థానంలో శాంతిక్రమాల పేరుతో బ్రిటిష్ సైన్యాల భయంకర పరిపాలనము నిరాటంకంగా కొనసాగుతూన్నది. దయాదాక్షిణ్యములులేక అమానుషంగా సాగింపబడుతూన్న ప్రాచ్య సామ్రాజ్యతత్వ విజృంభణమునకు వ్యతిరేకంగా చైనా వీరోచిత పద్ధతిని పోరాడుతూన్నది. బ్రిటిష్ కామన్‌వెల్తు అని పిలువబడుతూన్న దేశాలలోకూడా జాతికీజాతికీ పరస్పర ద్వేషములు పెచ్చుపెరిగిపోతూన్నవి. భారతీయులా దేశాలలో తమ న్యాయమైన ఆర్థిక, రాజకీయ, పౌరహక్కులను కాపాడుకోవడానికి పోరాడుతూన్నారు. బర్మాలోని భారతీయులు తమ మాన ధన ప్రాణములకోసం పోరాడవలసి రావడం, సింహళద్వీపంలో భారతీయులయెడ ప్రదర్శింపబడుతూన్న విరోధ భావం, కెన్యాలోని మెరకభూములను భారతీయులను మినహాయించి యూరోపియులకు ప్రత్యేకించి ఉంచడం, దక్షిణ ఆఫ్రికాలో భారతీయులను వెలిగా ఉంచేటందుకు అన్యాయ చట్టములనుచేయడం–ఇవన్నీ విదేశాలలోని భారతీయులకు సంబంధించిన సమస్యలు.

ఇవి ఇలావుండగా భారతదేశంలోని రాజకీయ వ్యవహారాలుకూడా అంత ప్రోత్సాహకరంగాలేవు. కొందరు సంస్థానాధిపతులు న్యాయసమ్మతమూ క్రమబద్ధమూ అయిన

సంస్థలను నిషేధించి, తదితర రాజకీయ కార్యక్రమములను సాగకుండా చేసి, కొన్ని సందర్భాలలో అమానుష ఘోరచర్యలకు కూడా దిగుతూ ప్రజా వుద్యమాలను తొక్కి-వేయ ప్రయత్నించడం వలన అక్కడ పోరాటం తీవ్రరూపం దాల్చింది. కొంతమంది సంస్థాన ప్రభువులు తమ ప్రజలను అణచిపెట్టేటందుకు బ్రిటిష్ గవర్నమెంటువారి సహాయాన్నికూడా అపేక్షించారు. ఇవన్నీ ఇలా వుండగా 1939 మార్చి మొదటివారంలో అనగా త్రిపురీకాంగ్రెసు జరుగబోయేముందు గాంధీ కాలపరిమితిని నిర్ణయించకుండా ఉపవాసం చేయవలసిన స్థితికి ఒకటి యేర్పడ్డది. రాజకోట ఠాకూరు సాహెబు ఆయన మంత్రులనున్నూ ప్రజాప్రతినిధియైన వల్లభభాయిపటేలునున్నూ మధ్యజరిగిన ఒడంబడికను రాజకోట ప్రభువు భగ్నంచేయగా దానిని అసలు జరిపించడం కోసమే గాంధీ ఈపనికి పూనినాడు. త్రిపురీ కాంగ్రెసునాడు ముఖ్యంగా రెండు విషయాలు ఇండియాలోనేగాక ప్రపంచమంతటనూ కల్లోల విషాదములను కలిగించినవి. ఒకటి కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక- రెండవది గాంధీజీ పూనిన రాజకోట ఉపవాసవ్రతం మామూలుగా కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక అంటే ఎక్కువ సందడి ఉండేదికాదు. 1934 అక్టోబరు నెలలో బొంబాయిలో మార్చబడిన కాంగ్రెసు నియమావళికిముందు రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలను అధ్యక్షుని పేర్లను సూచించవలసిందిగా కాంగ్రెసు వర్కింగుకమిటీ కోరుతూండేది. ఆ ప్రకారం సూచించబడిన పేర్లనుండి తిరిగీ రాష్ట్రీ కాంగ్రెసు సంఘాలే అధ్యక్షుణ్ని ఎన్నుకొంటూండేవి. ఇంతకుపూర్వం 1907 లో ఒక్కసారే కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికనుగూర్చి లాలాలజపతిరాయి ఉండాలా బాబూ రసవిహారీఘోష్ ఉండాలా అని వివాదం వచ్చింది. తరువాత 22 ఏండ్లకు 1929 లో లాహోరు కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఉండ నిరాకరించి గాంధీ ఒక క్లిష్ట పరిస్థితిని తీసికొనివచ్చాడు. అప్పుడు లక్నోలో సమావేశమైన అ. భా. కాం. సం. మరొకరిని ఎన్నుకోవలసివచ్చింది. అప్పటినుండి అధ్యక్షుని ఎన్నికలలో ఎప్పుడూ నిజమైన పోటీలేదు. అనుకోకుండా త్రిపురీ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలో ఒక తుపాను చెలరేగింది. కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండి మూగనోముపట్టినవారిలో సుబాస్ బాబు ఒకరు. ఆయన మొదటిసారి అధ్యక్షుడుగానున్నకాలంలో వర్కింగుకమిటీ సమావేశాలలో ఆయన మాట్లాడిన సందర్భాలు వేళ్ళమీద లెక్కపెట్టవచ్చును. పాపం అనారోగ్యం ఆయనను వెన్నంటి ఉంది- అది శరీరానికి మరింత శ్రమ కలిగించింది- కాని ఆయన మనస్సుకు శ్రమ అనేది ఎరుగడు- ఆయన ఉత్సాహానికి మేరలేదు. ఆయన వివిధరాష్ట్రాలలో సంచారం చేశాడు. 1928 సెప్టెంబరు నెలలో ఢిల్లీలో జరుగుతున్న అ. భా. కాం. సం. సమావేశానికి రావలెనని విమానంలో ప్రయాణమై మధ్య

కాన్పూరులో జబ్బువల్ల ఆగిపోవలసి వచ్చింది. సభాప్రారంభంలో ఆయన లేనేలేడు. మధ్యలో వచ్చి చేరగలిగాడు. ఢిల్లీలో ఆయన చూపిన ఓర్పు అందరికీ ఆశ్చర్యం కలిగించింది. మధ్యరాష్ట్ర ప్రధాని డాక్టరు ఖరే సంఘటనమునుగూర్చి ఆయన వ్రాసిన నివేదిక, భాషాశాస్త్రంలోనేమి, వాదబలంలోనేమి విషయవివరణం లోనేమి ప్రశంసాపాత్రంగా ఉంది. అనేక విషయాలలో ఆయనకు సొంత అభిప్రాయా లుండి ఉండవచ్చును. కాని ఎన్నడూ వాటిని పట్టుకొని వేలాడటం కానీ, వాటిని వాదంలో ప్రవేశపెట్టడం కానీ ఆయన కష్టంలేదు. ఒక పక్షాన్ని వహించినట్లాయన యెన్నడూ కనిపించలేదు. అంతమాత్రంలో ఆయనకూ ఇదివరలో నాయకులకూ భేదాభి ప్రాయాలు లేవనికాదు. కాని అభేదాలు ఎన్నడూ సంఘటనలకుగానీ, క్లిష్టస్థితులకు గానీ కారణభూతములు కాలేదు. ఆయన అధ్యక్షకాలం అంతా ప్రశాంతంగా నడి చింది. 1938 సెప్టెంబరు చివరలో మాత్రం ఆయనను త్రిపురీ కాంగ్రెసు అధ్యక్షుడు కావలెనన్న కోరిక ఉన్నట్టు స్పష్టమయింది. ఆయన చాలా సత్కార్యాలను నిలబెట్టినాడు. ముఖ్యంగా జాతీయప్రభుత్వానికి ఆయన తలపెట్టినాడు. జవహర్‌లాలు నెహ్రూగారిని దానికి అగ్రాసనాధిపతిగా పట్టం కట్టిందే ఆయన. వరుసగా రెండు సంవత్సరాలు అధ్యక్షు డుగా ఉండవలెననీ ఆయన కోరినంత మాత్రాన దానికేదో ప్రత్యేక కారణమున్నట్టు భావించవలసిన అవసరం లేదు. జవహర్‌లాలు మూడుసార్లు కాంగ్రెసు అధ్యక్షుడై నాడు. 1929 లో ఆయన తండ్రి మోతీలాలు నెహ్రూ, తన కొడుకు కాంగ్రెసు సర్వాధ్యక్షుడు కావలెనని గట్టిగా పట్టుపట్టడం వలననూ, 1936 లక్నో కాంగ్రెసుకు, ఆయన దుఃఖాన్ని ఉపశమింపచేయడానికి భారతజాతి ఆయనను అధ్యక్షుడుగా కోరు సంయుననూ, తరువాత ఎనిమిది నెలలకు ఫైజుపూరులో గాంధీజీ కోరికపైనను ఆయన అధ్యక్షుడైనాడు. జవహరుకు సొంతంగా అటువంటి కోరిక ఉన్నట్లెవ్వరూ ఆపాదింపజాలరు. కాబట్టి మొత్తంపైన గాంధీ ఆమోదమే కాంగ్రెసు అధ్యక్షపదవిని సంక్రమింపజేయ గలదని చెప్పాలి. హరిపురాలో సుభాస్‌బాబును కాంగ్రెసు సింహాసనమెక్కించింది. గాంధీజీ ఆశీర్వాదమే. ఈవిషయాన్ని ఇక్కడ వివరంగా వ్రాయడంలో కొంత మొగమాట పడవలసి వస్తోంది. జాతీయవాంఛను బ్రిటిష్ ప్రభుత్వంచేత అంగీకరింపచేయడానికి గల అవసరాలనుబట్టి భారతదేశం ఏకగ్రీవంగా సుప్రసిద్ధ ముస్లింనాయకుణ్ని కాంగ్రెసు అధ్య క్షుడుగా ఎన్నుకోవడం తప్పనిసరి అనిపించిందా సంవత్సరం. అందుకు సర్వథా తగిన మనిషి మౌలానాఅబుల్‌కలాం అజాద్. ఆయన 1923 సెప్టెంబరులో జరిగిన ప్రత్యేక కాంగ్రెసుకొక పర్యాయం అధ్యక్షుడైనాడు. కాని తరువాత డిశంబరులో మామూ లుగా యేటా జరిగే కాంగ్రెసు కాకినాడలో యేర్పాటు చేయబడింది. త్రిపురీలో

మౌలానాసాహెబు అధ్యక్షతక్రింద జరిగే కాంగ్రెసు మతకలహాలను శమింపచేసి శాశ్వతంగా మతసమస్యను పరిష్కారం చేయగలడని గాంధీజీకి తోచింది. అందువలన ఆయన సుభాష్‌బాబు అభ్యర్థిత్వాన్ని బలపరచలేదు. అయినప్పటికీ సుభాసు స్నేహితులు ఆయన అభ్యర్థిత్వానికి దరఖాస్తు చేశారు. తాను అధ్యక్షుడుగా నిలబడడానికి సుభాసుబాబు అంగీకరించారు. మౌలానాసాహెబు అభ్యర్థిత్వం సక్రమంగా ప్రకటించబడింది 19౩౯ జనవరి మధ్యలో జరిగిన కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశం ముగిసినప్పుడు మౌలానా అధ్యక్షుడు కావడం నిశ్చయమని ఆ పని మామూలుగానే జరిగిపోతుందని తోచింది.

మౌలానా అంగీకరించకపోతే, ఆ ముళ్లకిరీటం ఈ గ్రంథకర్త నెత్తిని ఉంచవలసి వస్తుందని బార్డోలీనుండి బయలుదేరి వచ్చేటప్పుడు గాంధీజీ ఈయనతో అన్నాడు. కాని అదృష్టవశాత్తు మౌలానా అంగీకరించి బొంబాయికి ప్రయాణమై వెళ్లాడు. కాని ఆ మరుసటిరోజుననే మౌలానా తన అభిప్రాయాన్ని మార్చుకొని తన అభ్యర్థిత్వమును ఉపసంహరించుకో నిర్ణయించుకొన్నాడు. అప్పటికి మూడు నామినేషనులు మాత్రం ఉన్నట్లు పత్రికలద్వారా తెలియవచ్చింది. సుభాస్‌బాబుది ఒకటి. మౌలానా సాహెబుది రెండు. ఈ గ్రంథకర్తది మూడు. మూడవది అభ్యర్థికి తెలియకుండానే వేయబడిన నామినేషన్ కావడంచేత ఆయన వెంటనే ఉపసంహరించుకొన్నాడు. కాని కొలదికాలంలో మౌలానా ప్రోత్సాహంవలన ఆ నామినేషన్ తిరిగీ పునరుద్ధరించబడింది. మౌలానా బొంబాయినుండి తిరిగీ బార్డోలీకి పరుగెత్తి తన నామినేషనును ఉపసంహరించుకొన్నట్లు ప్రకటించారు. అందువలన సుభాసుబాబూ, ఈ గ్రంథకర్తమాత్రమే రంగంలో ఉండిపోయినారు. ఈ పోటీ ఉద్దేశించకుండా, అనుకోకుండా తటస్థించింది. అధమం ఈ పోటీదార్లలో ఒకరి విషయంలోనైనా యిది యథార్థం. మౌలానా ఎందుకు తన అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకొన్నారో మౌలానాకే తెలియాలి గాంధీజీకికూడా తెలిస్తే తెలియవచ్చు. మౌలానాది వంగరాష్ట్రం కావడం కలకత్తాలోనే స్థిరనివాసమేర్పరచుకోవడం అందులో మరొక వంగీయునితో, ఆయన పోటీచేయడం బాగా ఉండదనిమాటా అనేక కారణాలవలన అది అనేకమందికి రుచించదనేమాటా మాత్రంనిజం. అంతేకాక మత వైషమ్యాల క్లిష్టపరిస్థితినిబట్టి తాను కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండడం కంటె విడిగా ఉండడంవలననే దేశానికి ఎక్కువ ప్రయోజనకారి కాగలడని మౌలానా అభిప్రాయపడ్డాడు. ఆ విధంగా మౌలానా పోటీనుండి విరమించాడు. పోటీయొక్క నిజస్వరూపం ఎన్నిక దగ్గరకువచ్చినకొద్దీ తేటతెల్లమవుతూ వచ్చింది తుదకు 95 వోట్ల ఎక్కువతో సుభాస్‌బాబు విజయం పొందాడు, ఈ విజయంవలన కొందరికి అత్యంతమైన సంతోషంకలిగింది మరికొందరికి చాలా ఆశ్చర్యంకలిగింది సుభాస్‌బాబుయొక్క

వ్యక్తిత్వమేగాక ఆయన ఎన్నికల ప్రణాళికలోని ఉత్కృష్ట సిద్ధాంతంకూడా ఆయన అభ్యర్థిత్వానికొక ఉచ్చస్థితిని చేకూర్చింది.

సుభాస్ బాబుయొక్క పోటీదారు ప్రకటనకోసం, ఆయన అభ్యర్థిత్వాన్ని బలపరుస్తూ, వర్కింగుకమిటీ సభ్యులలో దాదాపు సగంమంది ప్రకటన చేశారు

ఈపోటీగానీ పోటీయొక్క ఫలితంగానీ వ్యక్తులకుసంబంధించిందిగాగాక సిద్ధాంతాలకూ కార్యక్రమాలకూసంబంధించిందిగాపరిణమించింది. ఎన్నికల ఫలితంవచ్చినవెంటనే సుభాస్‌తో పోటీచేసిన అభ్యర్థియోటమి తనఓటమిగా భావిస్తున్నానని గాంధీజీఅన్నాడు. ఇది దేశంలో ఆందోళన కలిగించింది. ప్రతివారూ హృదయపరీక్ష చేసుకోవడం మొదలు పెట్టారు. పరిస్థితులు తారుమారయినవి. సుభాస్‌బాబుకు వోటుచేసినవారంతా తిరిగి గాంధీలోనూ గాంధీనాయకత్వంలోనూ తమకు విశ్వాసమున్నట్లు ప్రకటించుకొన్నారు. నిజానికది ఒక అసందర్భ పరిస్థితిగా పరిణమించింది. మొట్టమొదట అధ్యక్షుని ఎన్నిక 29 వ జనవరిని జరిగింది. ఒక వారంలో స్థితిగతులు తలకిందులైనట్లు తోచింది. అనినాటకు అధికసంఖ్యాకులుగానున్న పక్షం అల్పసంఖ్యాకపక్షంగా మారిపోయింది. అదేనిజంగా పెద్ద ప్రతిబంధకమయింది కాంగ్రెసు ప్రతినిధులధిక సంఖ్యాకులు ఒక అభ్యర్థికి వోటిచ్చినమాట వాస్తవమే. కాని తరువాత వారిలో ఎక్కువమంది పక్షాలు మార్చుకోవడం వల్లనూ. అఖిలభారత కాంగ్రెసు సంఘంలో గాంధీని బలపరచడంవల్లనూ, ప్రతినిధుల నుండి అధిక సంఖ్యాకబలంతో వచ్చిన అధ్యక్షుడు, కాంగ్రెసు కార్యక్రమాన్ని నడపవలసిన అ. భా. కాం. సం లో అల్పసంఖ్యాక పక్షంలో ఉండిపోయినాడు. ఇది ఆయనకొక క్లిష్టదశను కల్పించింది ఆయనకు కార్యనిర్వాహకవర్గము నిర్మించడం కష్టమయింది. ఆయన యేర్పాటుచేసిన కార్యవర్గమును అ. భా. కాం. సం. అంగీకరిస్తుందా? ఆయనపెట్టిన ప్రతిపాదనలను కాంగ్రెసు ఆమోదిస్తుందా? జల్పాయిగిరిలో *చేయబడిన నిర్ణయాలు త్రిపురీ కాంగ్రెసు మహాసభలో అంగీకరింపబడునా? కాంగ్రెసుమహాసభకు ముందు మామూలుగాజరిగే కాంగ్రెసు వర్కింగుకమిటీలో అధ్యక్షుడేమి చేయవలెను? కాంగ్రెసు వర్కింగుకమిటీ బ్రిటిష్‌సామ్రాజ్యానికి ఆరునెలలు వాయిదాయిచ్చి సమిష్టి శాసనోల్లంఘనమును చేయవలెనన్న తీర్మానానికి కేవలం వ్యతిరేకం. దురదృష్ట వశాత్తు ఈ ఆందోళనలన్నీ, అదివరకే అంతంత మాత్రంగా ఉన్న సుభాస్‌బాబు

* జల్పాయిగిరిలో వంగరాష్ట్ర ప్రతినిధులు సమావేశమై బ్రిటిషు ప్రభుత్వానికి ఆరు నెలలు వాయిదాయిచ్చి సమిష్టి శాసనోల్లంఘనం ప్రారంభించవలెనని తీర్మానించబడింది.

ఆరోగ్యం మరింత అధ్వాన్నం కావడానికి అవకాశం కలిగించినవి. మహాసభకు చిత్తు తీర్మానాలను తయారుచేయడానికి 1937 ఫిబ్రవరి 9 వ తేదీని సమావేశమైన వర్కింగు కమిటీకి, తీవ్ర జ్వర పీడితుడైన సుభాస్‌బాబు వార్ధా రాజాలకపోయినాడు. వర్కింగు కమిటీలోనున్న 13 మంది సభ్యులు రాజీనామా యిచ్చారు. ఇక మిగిలినవారు అధ్యక్షుడున్నూ ఆయన అన్నగారు శ్రీ శరశ్చంద్రబోసున్నూ. సుభాస్‌బాబు జబ్బు నెమ్మదించలేదు. మహాసభనాటికికూడా ఆయనజబ్బు అలాగేవుంది. మహాసభ జరిగిన అయిదారురోజులూ ఆయన జ్వరం 104 - 105 డిగ్రీలవరకూ ఉంటూ వచ్చింది. ముఖ్యంగా రెండోనాడు అనేకసార్లు అంత హెచ్చుగానూ కనిపించింది. ఆనాటిరాజకీయాలకు తోడు అయన జబ్బుకూడా మరింత దురదృష్ట పరిస్థితిని కల్పించింది.

త్రిపురీ కాంగ్రెసు సన్నాహాలన్నీ ఈవిధంగా అనేక కారణాలవల్ల భయ సంభ్రమాలమధ్య జరుగుతూండగా ఇండియా భవిష్యమునుగురించిన అనేక ముఖ్యసంఘటనలు తదితర ప్రదేశాలలోకూడా తటస్థించినవి. 1938 సెప్టెంబరు నెలలో ఢిల్లీనగరమున అఖిల భారత కాంగ్రెసు సంఘసమావేశము జరిగినప్పుడు సభ్యులలో ఉద్రేకం పెరిగి 1936 ఏప్రిల్ నుండి 1938 మార్చివరకూ కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యుడుగానున్న సంయుక్తరాష్ట్రముల నాయకుడు ఆచార్యనరేంద్రదేవు కొంతమందిని తీసికొని సభ వెలుపలికి వెళ్ళిపోయిన సంగతి పాఠకులు జ్ఞాపకముంచుకోవాలి. ఈ సంఘటనము కిసానులకు సంబంధించిన చర్చ సందర్భంలో తటస్థించింది. సంస్థానాల సమస్యకూడా ఆ సభను కల్లోలపరచినమాట నిజమే. కిసానులయొక్కయు సంస్థానాలయొక్కయు సమస్యలు రెండూ ఒకే పద్ధతిమీద నడుస్తూ వచ్చినవి. కాని హరిపురాలో సంస్థాన ప్రజానాయకులకున్నూ కాంగ్రెసు నాయకులకున్నూ బాగా మనస్సులు కలిసినవి. అప్పటినుండి కాంగ్రెసుమీద సంస్థాన ప్రజలకు ఎక్కువ విశ్వాస మేర్పడింది. సంస్థాన ప్రజలు కోరినప్పుడల్లా సలహా యీయడానకి కాంగ్రెసు హృదయపూర్వకంగా సంసిద్ధమయింది. మైసూరులో ఇటీవల వల్లభాయి కృపలానీలు చేసిన కృషి జయప్రదం కావడంచేత సంస్థాన ప్రజల హృదయాలలో నూతన విశ్వాసం రేకెత్తింది. కాంగ్రెసువాదులకు ఆత్మవిశ్వాసం పెంపొందింది. అప్పటినుండీ సంస్థానాలవిషయంకూడా కాంగ్రెసు కార్యక్రమంలో ఒకభాగంగానే ఉండవలెననే సూచనకు బలం చేకూరింది. అఖిలభారతదేశానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడంలో సంస్థానాలకు నిస్సందేహంగా సహాయం చేయవలసిన తరుణం ఆసన్నమైనదని కాంగ్రెసు వర్కింగు కమిటీ భావించింది. ఇటీవల కలిగిన అనుభవాన్నిబట్టి సర్దారుపటేలు సహాయాన్ని సంస్థానాలు కృతజ్ఞతతో స్వీకరించినట్లు తోచింది. పరిస్థితులనుబట్టి అవసరంకొద్దీ

ఆచరణలోకి వచ్చిన ఈ విధానాన్ని సక్రమ పంథాలో నడిపించవలెననే కోర్కెతో, భారతావని అంతటికీ సంబంధించిన సామాన్య సమస్యలను సంస్థానాలకు సంబంధించినంతవరకు పరిష్కరించడానికి సంస్థానాధిపతులకూ ప్రజకూ కూడా, కొన్ని హద్దులలో సలహాసహాయములను చేకూర్చేనిమిత్తం ఒక ఉపసంఘమును వర్కింగుకమిటీనుండియే నియమించవలెనని సూచనవచ్చింది. సంస్థానాధిపతులూ వారి సలహాదారులూకూడా యిటువంటి కమిటీ నియామకమును సంతోషంతో ఆదరిస్తారని, కమిటీవారుచేసే సహాయాన్ని స్వేచ్ఛగా స్వీకరిస్తారనీ కూడా కాంగ్రెసు ఆశించింది. కాని యేకారణంవల్లనో ఆ ఉపసంఘం నియమింపబడనేలేదు. కాంగ్రెసు అగ్రనాయకులవైఖరి తరువాత ఎందువల్లనో పూర్తిగామారిపోయింది తరువాతసంస్థానప్రజాసంఘలివారి రాజకీయచైతన్యానికి రాజకోట ఉదంతం అత్యంతం దోహదం చేసింది. రాజకోట పెద్ద సంస్థానం కాదు. కథియవాడు, భావనగరం, పోర్‌బందరు, లివ్డి, ఝూబ్వా, గోండాల్. నవనగర్. సంస్థ 260 సంస్థానాలలో అన్నిటికంటెనూ అది పెద్ద సంస్థానము కాదు. కాని అది ఏజంటు జనరలుకు నివాసస్థానం కావడంచేత పశ్చిమ భారత సంస్థానాలకు ప్రధాన నగరంగా పరిగణింపబడుతూన్నది. ఈ సంస్థానానికి గాంధీజీ తండ్రిగారు దివానుగా ఉండిన కారణానకూడా గాంధీజీ బాల్య యౌవన దశలలో ఈ సంస్థానం సన్నిహిత సంబంధం కలిగి ఉంది. ఈనాటి లోకోత్తర పురుషునితో కలహం తెచ్చిపెట్టి తన సంస్థానాన్ని ఒక తుపానుకు కేంద్రంగాచేసిన దురదృష్టదేవతచేతిలో కీలుబొమ్మయైన రాజకోట రాజు వివాహంనాడు అయన నుదుట కుంకుమ తిలకమును దిద్దినది శ్రీమతి కస్తూరిబాయిగాంధీ. కాబట్టి సంస్థానాలన్నిటిలో రాజ్యాంగ సంస్కరణములకు ముందంజవేయదగిన సంస్థానము రాజకోట అని అనుకోవడంలో యేమీ పొరపాటు లేదు. సంస్థాన ప్రజాసంఘములవారు కొన్ని ముఖ్య సంస్థానాలలో రాజ్యాంగ సంస్కరణములనుగురించి 1938 లో పనిచేస్తూ వచ్చారు. అన్ని ఉద్యమాలవలెనే మామూలుగా ఈ ప్రజా ఉద్యమంకూడా నిర్బంధ విధానాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. రాజకోటలో సత్యాగ్రహం తీవ్రంగా సాగింది. రాజకోట సంస్థానానికి విశ్వాస పాత్రుడైన దివాను వీరవాలా-దానిని అణచివేయడానికి కృతనిశ్చయుడై తీవ్ర నిర్బంధ విధానం సాగించాడు. 1938 ఫిబ్రవరిలో హరిపురాలోనూ 1938 సెప్టెంబరులో ఢిల్లీలోనూ చేయబడిన తీర్మానమును ఆసరా చూచుకొని కాంగ్రెసు వాదులింకా ఎక్కువగా చెలరేగారు. "కాంగ్రెసుకున్న సాధన సంపత్తిని బట్టి సంస్థాన ప్రజా ఉద్యమాలలో కాంగ్రెసు జోక్యం కల్పించుకోదని" అంటూనే, "వీలైనంతవరకు ప్రజలకు అన్ని విధాలా సహాయంచేయడమే కాంగ్రెసు ఆశయమనీ"

"కాంగ్రెసు ప్రత్యక్షంగా జోక్యం కల్గించుకోకపోవడం దాని సాధన సంపత్తి పరిమితంగా ఉండడమే"నని ఢిల్లీ తీర్మానంలో విస్పష్టం చేయబడింది. అందువలన కాంగ్రెసు సంఘాలు సంస్థలుగా, యే సంస్థాన సత్యాగ్రహోద్యమంలోనూ జోక్యం కల్గించుకోజాలకపోయినవి. కాని వ్యక్తులు చేతనైనంతసహాయం చేయడానికి కేమీ అభ్యంతరం లేకుండానే ఉంది. కాబట్టి రాజకోట అధికారుల పెంకెతనాన్ని ఎదుర్కొవడానికి ఎంతమందో సత్యాగ్రహులు గుంపులుగుంపులుగా సన్నద్ధులైనారు. అయితే అంతకంతకు పరిస్థితులు విషమించ సాగినవి.

"రాజకోట సత్యాగ్రహం త్వరలోనే చారిత్రక ప్రాముఖ్యత వహించింది. ఇండియాలోనూ ఇండియాలోని తదితర సంస్థానాలలోనూ కూడా రాజకోట సత్యాగ్రహం ఎక్కువగా ప్రజల దృష్టిని ఆకర్షించింది. అన్నిచోట్లులలో వలెనే రాజకోటలోకూడా బ్రిటిష్ అధికార వర్గంవారిచే సర్వవిధాలా ప్రోత్సహింపబడుతూన్న బాధ్యతారహిత నిరంకుశత్వమునకూ, ప్రజాచైతన్యంతో కూడిన అభ్యుదయ శక్తులకూ పోరాటం తప్పలేదు. రాజకోట పోరాటముయొక్క ప్రభావం రాజకోటలోనే కాక తదితర సంస్థానాల రాజకీయ పరిష్కారమునకు కూడా దారితీయగలదని విశ్వాసం కలిగింది. ఈ పోరాటంలో ఒక విస్పష్టమైన ఆర్థిక దృక్పథం యిమిడిఉంది. ప్రజల నిత్యజీవితావసరములైన ధాన్యము, నిప్పుపెట్టెలు వగైరాల పంపకంలో సంస్థానం సర్వాధికారం చలాయిస్తూన్నది. అందువల్ల పేదవాళ్ళు చాలాబాధలు పడుతూన్నారు.

ప్రజా ఉద్యమాన్ని అణచివేయడానికి ప్రభుత్వంవారు నిత్యమూ లాఠీలను ఉపయోగించి అరెస్టులుచేసి సమావేశాలనూ ఉత్సవాలనూ నిషేధించారు. ఈ బల ప్రయోగం సర్వసాధారణమైపోయింది. బ్రిటిష్ ఇండియాలోనున్న ఆరు గుజరాతీ పత్రికలు రాజకోట ప్రవేశించకూడదని నిషేధింపబడినవి. బొంబాయినుండివెళ్ళిన గుంపులకోలదీ సత్యాగ్రహులు, రాజకోట చేరగానే అరెస్టుచేయబడుతూ వచ్చారు. అఖిల భారత సంస్థాన ప్రజా మహాసభా సాధారణ కార్యదర్శి శ్రీ, బల్వంతరాయిమెహతాకూడా అరెస్టు చేయబడ్డాడు. రాజకోట పోరాటంలో తన సోదరీమణులకు సహాయం చేయడానికి పోయిన వల్లభాయిపటేలు కూతురు మిస్ మణిబేన్ కూడా అరెస్టు చేయబడ్డది. తన తల్లిద్వారా రాజకోటకు బంధువురాలైన మృదులాశరభాయి, మణిబేన్ తరువాత ఆమె స్థానాన్ని ఆక్రమించింది. ఆమెనుకూడా కొట్లోవేసి తాళం వేశారు.

ప్రజాఉద్యమం అంతకంతకు బలవత్తరమౌతూన్నదనడానికి గుర్తుగా కాబోలు. రాజకోట ప్రజాపరిషత్తును చట్టవిరుద్ధమైన సంస్థగా నిర్ణయిస్తూ రాజకోట ప్రభుత్వం

వారొక ప్రకటన చేశారు. దీనితో అక్కడి పోరాటం యింకాతీవ్రతరమై మరింత క్లిష్ట దశకువచ్చింది. ఈ స్థితిలో రాజకోట శాసనోల్లంఘనోద్యమంలో సంస్థానేతర ప్రజలు వచ్చి చిక్కుకోవడం వివేకం కాదేమోనని గాంధీజీకి సందేహం కలిగింది. ఈవిషయం వర్కింగుకమిటీవారి దృష్టికి తేగా వారు సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వ నిర్మాణంకోసం సాగింపబడుతూన్న ప్రజా వుద్యమాలకు సానుభూతి చూపిస్తూ, ఆ యా సంస్థానాలతో సంబంధంలేని ప్రజలక్కడి శాసనోల్లంఘనంవంటి ఉద్యమాలలో జోక్యం కల్గించుకోవడం ఉచితంకాదని సలహా యిచ్చారు. సంస్థానాలకు వెలిగావున్న వారు జోక్యం కల్గించుకొన్నందువలన ఆ ఉద్యమాలకు నిజమైన బలం చేకూరకపోగా, పైపెచ్చు సంస్థాన ప్రజానీకం తమ ఉద్యమాన్ని జయప్రదంగా నెరవేర్చుకోవడానికి వీలులేని పరిస్థితులుకూడా ఏర్పడవచ్చునని కాంగ్రెసు వర్కింగుకమిటీ సలహా యిచ్చింది.

పైన చెప్పబడిన ప్రభుత్వ ప్రకటన వెలువడిన కొద్దిరోజులకే ఠాకూరుసాహెబు వల్లభాయిపటేలును బొంబాయినుండి రాజకోటకు రావలసిందని ఆహ్వానించాడు. రాజకోట ప్రజలు ధైర్యంతో నడిపిన పోరాటం, ఠాకూరు సాహెబుగారున్నూ వల్లభాయి పటేలుగారున్నూ డిశంబరు 26వ తేదీని జరిగిన ఒడంబడికవలన జయప్రదంగాముగిసింది. ఈ విజయమొక్క రాజకోటప్రజలదేకాదు అఖిలసంస్థాన ప్రజానీకమునకూ సంబంధించిన విజయమని చెప్పవచ్చు. రాజకీయ దౌష్ట్యములకు ప్రతీకారంగా అహింస విజయం పొందిందనడానికిది మరియొక ప్రబలతార్కాణం. ఠాకూరు సాహెబున్నూ వల్లభాయిపటేలున్నూ ఎనిమిదిగంటలు దీర్ఘంగా చర్చించుకొని ఈ దిగువ ఒడంబడికకు వచ్చారు.

కొన్ని మాసాలకిందటనుండీ ప్రజలకు కలవనే కష్టాలను తొలగించుకోడానికి వారు పడుతూన్న విచారకరమైన బాధలను, అందువలన నానాటికి ప్రజానీకంలో పెరిగిపోతూన్న ఉద్వేగాన్ని, గమనించినతరువాత వల్లభాయి పటేలుతోనూ నాసలహా సంఘంతోనూ పరిస్థితులనన్నిటినీ సమగ్రంగా చర్చించగా ప్రస్తుత పోరాటమున్నూ ప్రజలు పడుతూన్న బాధలున్నూ తక్షణం తొలగించవలెననిమాకు తోచింది.

మేము పదిమంది పెద్దమనుషులతో ఒక కమిటీని నియోగించవలెనని నిర్ణయించాము వారంతా సంస్థాన ప్రజలుగాగానీ, సంస్థానోద్యోగులుగాగానీ ఉంటారు. అందులో ముగ్గురు సంస్థానోద్యోగులు, ఏడుగురు సంస్థాన ప్రజలుగానూ ఉంటారు. వారిపేరులు ముందు ప్రకటించగలము.

ఆ కమిటీకి అధ్యక్షుడు సంస్థానాధిపతిచేతనే నియమింపబడగలడు. కమిటీ వారు సరియైన విచారణలు జరిపి, బ్రిటిష్‌సార్వభౌమాధికారాలకూ మా ప్రత్యేక రాజ్యాధికారాలకూ భిన్నంలేని పద్ధతిని, సాధ్యమైనంత విశాలాధికారాన్ని మా ప్రజకు సంక్రమింపచేస్తూ, ఒకనివేదికను 1939 జనవరి చివరనాటికి మాకుపంపవలెను.

నరేంద్రమండలివారు (Chamber of Princes) జారీచేసిన సర్క్యులరు ననుసరించియే ఇంతటినుండి మా సొంతఖజానా ఉండవలసిన పద్ధతిని యేర్పాటుచేసు కొందుము. పైన పేర్కొనబడ్డ కమిటీవారు తయారుచేసె మాకుపంపే రిపోర్టును ఆచర ణలో పెట్టగలమని మా ప్రజకు మేము హామీయిస్తూన్నాము.

శాంతిసుహృద్భావములు తిరిగి నెలకొల్పబడడానికి ముందుగా శాసనవిరుద్ధమైన ఆందోళన యావత్తూ తక్షణం విరమింపబడుతుందని భావించి, పూర్తిగా రాజకీయ ఖైదీలందరిని విడుదల చేయవలసిందనీ, జరిమానాలు తిరిగియిచ్చివేయవలెననీ నిర్బంధ విధానమును రద్దుచేయవలెననీ ఉత్తరువులను జారీచేస్తూన్నాము.

రాజకోటలోని నిర్బంధవిధానమునకు చాలావరకు కారణభూతుడైన రాజకోట దివాను శ్రీ. పి. కెడేల్‌ను, దివాను ఉద్యోగమును వదులుకోవలసిందిగా ఠాకూరు సాహెబు కోరినట్లు పత్రికలు ప్రకటించినవి. ఆయన యిదివరలో ఒడంబడిక చేసు కొన్న ప్రకారము 1939 మార్చి చివరవరకూ దివానుగా ఉంటానని పట్టుబట్టి, ఆ విషయం రాజప్రతినిధికి విన్నవించుకొన్నట్లుకూడా తెలియవచ్చింది. కాని 1939 జనవరి నాలుగోతేదీని ఆయన రాజకోట సంస్థానం విడిచిపోతూన్నట్లు కట్టకడపటి వార్తగా పత్రికలలో ప్రకటించబడింది.

వెనుక రాజకోటలో తిరిగి సాహసోపేతమైన దారుణపోరాటం ప్రారంభ మయింది. 1938 వ సం॥ జనవరి 26 వ తేదీని ఒడంబడికకుదిరింది. దానిలోని షరతుల ప్రకారం సర్దారుపటేలు ఏడుపేర్లూ పంపించారు. అప్పుడు ఠాకూరుసాహెబున్నూ ఆయనసలహాదార్లున్నూ రెసిడెంటున్నూ సంప్రదించుకొన్నారు. ఆ సందర్భంలో రెసి. డెంటుకాంగ్రెసునుగూర్చీ, సర్దారునుగూర్చీ, కొంతచులకనగా మాట్లాటడం తటస్థించింది. ఠాకూరు సాహెబుకు సర్దారుజాబితా చేరకమునుపే, అందులోనిపేర్లు వెల్లడియైనవని ఒక అనవసర అభ్యంతరం కల్పింపబడింది. తన ప్రజలో ముఖ్యవర్గాలకు సంబంధించిన భయ్యాట్లు, ముస్లింకాన్ఫిలు, నిమ్నజాతులవారి కోరికలను మన్నించక ఠాకూరు సాహెబు ఉపేక్షించజాలడనికూడా ఒకవాదం బయలుదేరింది. సర్దారుపంపిన జాబి తాలో నాలుగుపేర్లనమాత్రం రాజకోట మహారాజాగారంగీకరించి తక్కిన మూడు

పేర్లను ఏదో వంకపెట్టి తోసివేశాడు. ఒడంబడిక ప్రకారం సర్దారు పంపిన పేర్లనన్నిటినీ రాజుగారు సాహెబు అంగీకరించవలసివుండగా అందులో నాలుగు పేర్లను మాత్రమే అంగీకరించడంచేత ఒడంబడిక భగ్నమయింది. ఇది విశ్వాసద్రోహంగా భావించి దానిని సరిచేయడానికే మహాత్ముడు రాజకోటలో ఉపవాసం చేయ తలపెట్టాడు. ఈ ఉపవాస వ్రతమునకు కాలపరిమితి లేనందున రాజప్రతినిధి వెంటనే జోక్యం కల్పించుకోవలసివచ్చింది. కానిఫలితంగా సర్ మారిస్ గ్వాయర్ మధ్యవర్తి పరిష్కారం చేశాడు. ఆయనతీర్పు గాంధీజీకి అనుకూలంగానే ఉంది. కాని తాను చేసిన ఉపవాసంలో కొంత నిర్బంధం ఉన్నట్లు, అందువల్ల అది కళంకితమైనట్లు భావించి, తనకు అనుకూలంగా వచ్చిన తీర్పుయొక్క ప్రయోజనాలను తాను పొందడానికి నిరాకరించాడు గాంధీజీ. గాంధీజీ యొక్క ఈ ఉపవాసం త్రిపురీ కాంగ్రెసు జరుగుతూండగానే ప్రారంభమై, ఆరోజుల లోనే అంతంకూడా అయిందని పాఠకులు గమనించాలి.

## త్రిపురీ జాతీయ మహాసభ

త్రిపురీ కార్యకలాపము యొక్కయు సమాలోచనలు యొక్కయు ఆనందం రెండు కారణాలవల్ల చాలావరకు భగ్నమయింది. ఒకటి అధ్యక్షుని ఎన్నిక ఫలితం వలనను, రెండు గాంధీజీ రాజకోటలో ప్రారంభించిన ఉపవాసం వలననూ. ఈ రెండు సంఘటనలవలన కలిగిన అనుకూల ప్రతికూల పరిస్థితులతోనే త్రిపురీ వాతావరణం నిండినిబిడీకృతమై ఉంది. మూడవ సంఘటనం అధ్యక్షుని అనారోగ్యం మహాకోసలంలోని త్రిపురీనగరమున ఒకానొక నదిఒడ్డున అత్యంత సుందర ప్రదేశంలో కాంగ్రెసునగరం నిర్మింపబడింది. దానికి విష్ణుదత్త నగరమని పేరు. త్రిపురీ రైలుస్టేషనునుండి ఈ కాంగ్రెసు నగరమువరకు యాభైరెండు ఏనుగులతో లాగబడు రథంలో అధ్యక్షుని ఊరేగింపుకు ఏర్పాట్లు జరిగినవి. కాని అనారోగ్యంవల్ల అధ్యక్షుడా ఊరేగింపులో ఉండజాలకపోయినాడు. గ్రామ పరిసరములలో అత్యంత సుందరంగా కనపడే ఈ త్రిపురీనగరం నిజంగా అచటి వనదేవతా ప్రసాదమని భావించవచ్చును. ఆ ఆరణ్యక సుందర భూములలో త్రిపురీ అధ్యక్షుని ఊరేగింపు ఆయన చిత్రపటమును పెట్టి జరుపవలసివచ్చింది. ఇండియాప్రభుత్వ చట్టంలో, భారతసమాఖ్య (ఫెడరేషను)కు సంబంధించిన భాగాన్ని, గాంధీయో, లేక ఆయన అనుచరులలో కొంతమందియో అంగీకరింపబోతున్నారనీ, బ్రిటిష్‌వారితో ఫెడరేషనును ఆచరణలో పెట్టి పనిచేయడానికి ఒడంబడిక చేసుకొన్నారనీ విపరీతంగా గాలివార్తలు బయలుదేరినవి. భారతస్వాతంత్ర్య సమస్యను శాశ్వతంగా పరిష్కరించగల అంతిమ పోరాటాన్ని తక్షణం తీసుకురావలె

నని, కాంగ్రెసులోని ఒక పక్షంవారు చాలా తొందరపడుతూన్నారు. త్రిపురీకాంగ్రెసులోని కలహాలు స్వస్వరూపంలో వెల్లడికావడానికి ముందుగా, కాంగ్రెసు ప్రతినిధులు నిర్వర్తించవలసిన కనీసధర్మ మొకటి ఉంది. జాతీయ కార్యక్రమంలో ప్రాణాలర్పించిన అనేకమంది యోధులు, తమ జీవితకాలమంతా దేశసేవకు వినియోగించి భారత రాజకీయాకాశమున జాతీయ పతాకమును ఉత్తుంగస్థితిలో ఉంచగలిగినందుకు, వారి గౌరవార్థం కాంగ్రెసు ప్రతినిధులందరూ ఐక్యహృదయంతో సంస్మరింపవలసి ఉంది. దేశసేవాతత్పరత్వంలో అసువులనుబాసిన మహాపురుషులు, మౌలానా షౌకత్ ఆలీ, సర్. మహమ్మద్ ఇక్బాల్, బేగం అన్సారీ, మద్రాసు మంత్రి కె. రామున్ని మీనన్. జి. యస్. కపాడియా, బి రాజారావు, డాక్టర్ రాజబాలి పటేల్, కె నాగేశ్వరరావు పంతులుగార్లు. త్రిపురీ మహాసభలో పరిష్కరించబడవలసిన సమస్యలనుగూర్చి దాదాపు అంతకు ముందుగానే తేల్చుకోవలసి ఉంది. మహాసభకు ముందు అఖిలభారతకాంగ్రెసు సంఘం సమావేశమై, అదే విషయ నిర్ధారణసభగా మారిపోవడం ఆచారం కాంగ్రెసుకు ముందుజరిగే అ భా. కాం. సం. సమావేశంలో సాధారణంగా మామూలు కార్యక్రమమే జరుగుతూ ఉంది. కాని త్రిపురీలో అలా జరుగక ఆసమావేశంలోనే కాంగ్రెసులోని ఇరుకక్షల బలాబలాలనూ పరీక్షించుకోవడం ఘటిల్లించింది. వార్ధాలో ఆ కిందటి నెలలో జరిగి: వర్కింగుకమిటీ సమావేశంలో, కాంగ్రెసు కార్యదర్శి సాంవత్సరిక నివేదిక చర్చకు వచ్చింది. కాని కాంగ్రెసు అధ్యక్షుడుగాఎన్నుకోబడిన సుభాసుబాబా సభకు రాజాలనందున కార్యదర్శి నివేదికనుగూర్చిన చర్చ ఆపుచేయబడింది. త్రిపురీకి ముందు జరిగిన అ. భా. కాం. సం సమావేశంలో తిరిగీ ఆనివేదిక చర్చకు రాగా, ముందుగా కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆమోదమును పొందని కార్యదర్శి నివేదిక, అ. భా. కాం. సం.లో అంగీకరించవచ్చునా? అనిప్రశ్న వచ్చింది.ముందుగా కాంగ్రెసు వర్కింగు కమిటీవారి అంగీకారమును పొందితేనేగాని ఆ నివేదికను అ. భా. కాం. సం. వారిముందుకు తేకూడదని కాంగ్రెసు నియమావళిలో ఎక్కడా నిర్బంధంలేదని అధ్యక్షులవారు అనుశాసించారు. తరువాత కార్యదర్శి నివేదికను ఆమోదించవలెనా లేక కేవలం రికార్డుచేయవలెనా అని ప్రశ్న వచ్చింది. కార్యదర్శి తన నివేదికను ఆమోదించనైనా ఆమోదించాలి, తోసివేయనైనా తోసివేయాలి. అంతేకాని గత్యంతరం లేదన్నాడు. అప్పుడాయన నివేదిక ఏకగ్రీవంగా అంగీకరింపబడింది. అది మొట్టమొదటి తగాదా. దానినిబట్టి గాలిపాటు ఎలాఉందో అర్థమయింది. రెండోది శ్రీ గోవిందవల్లభ పంతునూ, మఱి 160 మంది అ. భా. కాం. సం. సభ్యులునూ కలిసి తామీ దిగువ తీర్మానమును ప్రతిపాదింపనున్నట్లుగా అధ్యక్షునికి తెలియచేశారు. ఆతీర్మాన మిది:-

"అధ్యక్షుని ఎన్నికకు ముందున్నూ తరువాతనూ చెలరేగిన వివిధ వాద ప్రతివాదాల ఫలితంగా, కాంగ్రెసులోనూ దేశంలోనూ కలిగిన అనేక అపోహ లను తొలగించేటందుకు, అ. భా. కాం. సం. తన విధానాన్ని స్పష్టంగా నిర్వ చించి, ప్రకటించడం అవసరమని తోస్తున్నది

"కడచిన సంవత్సరాలలో మహాత్మాగాంధీ నాయకత్వంకింద నడచిన కాంగ్రెసు కార్యక్రమమునకు మూలములైన ముఖ్య విధానములను ఈ కమిటీ గట్టిగా అను సరించ దలచుకొన్నట్లు విస్పష్టం చేస్తున్నది అంతే కాకుండా ఆ విధానములలో ఎక్కడా విరామం ఉండకూడదనీ, ఇంకముందుకూడా వాటినిబట్టియే కాంగ్రెసుకార్య క్రమాన్ని కొనసాగించవలెననీ, ఈ కమిటీ అభిప్రాయపడుతూన్నది. నిరుడు పనిచేసిన కాంగ్రెసువర్కింగుకమిటీవారి కార్యకలాపములో ఈ అ. భా. కాం. సం. తన విశ్వాసాన్ని ప్రకటిస్తూన్నది. ఆ వర్కింగుకమిటీలోని కొంతమంది సభ్యులపైన నిందా రోపణలు చేయబడడం విషాదకరమని ఈసంఘం భావిస్తూన్నది.

"వచ్చేసంవత్సరంలో క్లిష్ట పరిస్థితులు రానుండడంచేతనూ, అట్టి విషమదశలో కాంగ్రెసునూ దేశాన్ని జయప్రదంగా నడపగల ఏకైక నాయకుడు గాంధియేగనుకనూ, కాంగ్రెసు కార్యవర్గం ఆయన విశ్వాసమునకు పాత్రమైనదిగా ఉండాలని ఈ కమిటీ అభిప్రాయపడుతూన్నది. కాబట్టి గాంధజీ కోరికల కనుగుణంగా వర్కింగుకమిటీ సభ్యులను నియమించవలెనని ఈ సంఘంవారు కాంగ్రెసుఅధ్యక్షుణ్ని ప్రార్థిస్తూన్నారు."

ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి అసలంగీకరించాలా అక్కరలేదా అనేదే మొదటిప్రశ్న. ఈ తీర్మానాన్ని చర్చించడానికే అ. భా. కాం. సం. కు అధికారం లేదని ఒకపక్షంవారి వాదం. ఈ తీర్మానం అ. భా. కాం. సం. లో చర్చకురాకూడ దని అధ్యక్షుల వారాదేశించారు. కాని యిది విషయనిర్ణాయకసభలో చర్చకు రావచ్చ నని వెంటనే ఆయనేఅన్నాడు త్రిపురిలో తటస్థించిన క్లిష్ట పరిస్థితులనుబట్టి చూచినా, త్రిపురీమహాసభలో నిర్ణయించవలసిన ఆనాటి ముఖ్యసమస్యలను గమనించినా, కాంగ్రెసు ప్రతినిధులుగా ఎన్నుకోబడిన 3319 మందికీ, 2285 మంది మాత్రమే సభకు హాజరు కావడం ఆశ్చర్యంగాఉంటుంది. దాదాపు ఎన్నుకోబడిన ప్రతినిధులలో మూడవవంతు ప్రతినిధులింత ప్రాముఖ్యమైన సమావేశానికి రాకపోవడాన్నిగూర్చి ప్రజాబాహుళ్యం బాగాఆలోచించవలసిఉంది. ఇందుకు కారణాలు ప్రతివారికీ వేరు వేరుగా తోచవచ్చును. కాని ప్రతినిధుల బాధ్యతకుమాత్రం అవి కళంకదాయకము లుగా ఉండకతీరదు. అధ్యక్షోపన్యాసం అతి సంగ్రహంగాఉంది. కాంగ్రెసు చరిత్రలో

అంతచిన్నదిగా ఉన్న అధ్యక్షోపన్యాసం ఇంకొకటి లేదు. కాని అందులోనే ఆయన హృదయం భారతజాతికి ప్రత్యక్షమయింది. అంతర్జాతీయ పరిస్థితులు మ్యూనిచ్ సంధి, ఈజిప్షన్ రాయబారం, గాంధీ ఉపవాసం, వర్కింగుకమిటీ సభ్యుల రాజీనామాలు, సంస్థాన ప్రజల సంక్షోభం - ఈ అన్నిటినిగూర్చి ఆయన ఉపన్యాసంలో చర్చించాడు. మనదేశంలోని రాజకీయాలను చర్చిస్తూ, మనం నిరాశ చెందవలసిన అగత్యం లేదన్నాడు. పైపెచ్చు పరిస్థితులన్నీ మనకనుకూలంగానే ఉన్నవన్నాడు. ప్రతివాడూ ఎక్కువ ఉత్సాహంగా ఉండవచ్చునన్నాడు. మనజాతీయవాంఛను విస్పష్టంచేస్తూ బ్రిటిష్ ప్రభుత్వానికి ఒక అంత్యసందేశాన్ని అందచేయవలెనని ఆయన అభిప్రాయం. కాంగ్రెసు నిర్ణయించిన వాయిదాలోగా ప్రభుత్వంవారు భారతజాతీయ వాంఛనుగూర్చి సంతృప్తికరమైన జవాబీయనియెడల, మనకోరికను సఫలంచేసుకోవడానికి మనచేతిలో ఉన్న శక్తిని - అనగా సమిష్టిశాసనోల్లంఘనము మొదలైన ఆయుధాలను ప్రయోగించవలెనని సూచించాడు. బ్రిటిష్‌ప్రభుత్వంవారు, అఖిలభారత సత్యాగ్రహోద్యమంలాటి బలిష్ఠములైన పోరాటాలను చాలాకాలం ఎదుర్కొనగలిగిన స్థితిలో లేరని ఆయన నమ్మకం. ఇంకచేతులు ముడుచుకొని చూస్తూవూరకొనేకాలం గడచిపోయిందనీ, అలా ఉంటే బ్రిటిష్‌ప్రభుత్వం ఫెడరల్ ప్రణాళికను మననెత్తిని రుద్దితీరుతుందనీ ఆయన ఘంటాపథంగా చెప్పినాడు. ఈజిప్టులోని వాఫ్దుపక్షంవారు త్రిపురీకాంగ్రెసుకు భ్రాతృభావంతో ప్రతినిధులను పంపడమూ ఈ త్రిపురీకాంగ్రెసు, వారినిసాదరంగా ఆహ్వానించడమూ ముఖ్యంగా సంతోషించతగిన విషయం. ఇది ఇండియా ఈజిప్టుదేశాల స్వాతంత్ర్యోద్యమాలను ఐక్యపఱచి బలంచేయడానికి తగినశుభసూచక సంఘటనమని చెప్పవచ్చును. కాని దురదృష్టవశాత్తూ యింత ముఖ్యసమయంలో - ఈజిప్టుఇండియాదేశాల ఐక్యసంఘటనమునుగూర్చి వేనోళ్ళ ఘోషిస్తూన్న సమయంలో - కాంగ్రెసులోని రెండుపక్షాలవారికీ అట్టి ఏకీభావము కుదరక పోవడం దురదృష్టంకాక మరేమి? కిందటి జూన్ నెలలో జవహరులాలు నెహ్రూ యూరోపుకుపోతూ, నాహస్ పాషాకు అందచేసిన హృదయపూర్వక ఆహ్వానాన్ని అంగీకరించి సుహృద్భావంతో అయిదుగురు సభ్యులుగల ఈజిప్టురాయబారవర్గం ఇండియాను దర్శించవచ్చినది. మన పొరుగునఉన్న చైనాదేశం, నిష్కారుణమూ అమానుషమూ అయిన ఒకానొక సామ్రాజ్య విధానంతో వీరోచితంగా పోరాడుతూన్నది. చైనాప్రజలనుభవిస్తూన్న కష్టనిష్ఠురములతో మనకు హృదయపూర్వకమైన సానుభూతిగలదని ప్రకటిస్తూ, ఆ దేశానికి మన అభినందనాలను అందచేయకుండా ఆగగలమా! వారిని అభినందించడం మనకు తప్పనిసరి. చైనాకు వైద్యదళమునుపంపే విషయ మిదివరకే స్థిరపడింది. వారుచేసేపని

ప్రజల సంపూర్ణ సహకారమునుపొందగలదనీ, చైనాతో ఇండియాకుగల స్నేహబం ధాన్ని యింకనూ దృఢపరచగలదనీ, విశ్వసిస్తూన్నాము. చైనా మనకు తూర్పున ఉన్నట్లే పాలస్థానం మనకు పడమరనుంది. పాలస్థానంలోని అరబ్బులు తమ జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో ప్రదర్శించిన ధైర్యం, సాహసం, సంకల్పబలం, త్యాగం, ఇవన్నీ సహజంగా భారతప్రజలకు స్తుతిపాత్రములైనవి. అందువలన వారు అరబ్బుల పోరాటం జయప్రదం కావలెననిత్రిపురీ కాంగ్రెసుద్వారా వారికి తమ అభినందన సుహృద్భావములను అందజేశారు.

"యూదులు కేవలం తమ ప్రత్యేకాధికారములకోసం బ్రిటిష్‌సాయుధ సైన్యాల పైన ఆధారపడి ఉండడంకంటె తమ హక్కుల రక్షణకు తగిన యేర్పాట్లను చేసుకొని పాలస్థానములో స్వతంత్ర ప్రజాస్వామ్య రాజ్యమును స్థాపించడమే ముఖ్యాశయంగా ప్రత్యేక సహకారమునకు కావలసిన స్థితికొఱకు ప్రయత్నించడం చాలా శ్రేయస్క రంగా ఉంటుందని" కాంగ్రెసు తన అభిప్రాయాన్ని విస్పష్టం చేసింది. ఇక విదేశ రాజనీతివిషయంలో కాంగ్రెసు విశాల దృక్పథంతో పరిస్థితులను అర్థంచేసుకొన్నది. బ్రిటిష్ రాజనీతి ఫాసిస్టు ప్రభుత్వాలకు నిరంతరం సహాయంచేస్తూ, ప్రజాస్వామ్య ప్రభుత్వాల వినాశనమునకు తోడ్పడుతూండడంచేత కాంగ్రెసు దానితో తన సంబంధ మును వదులుకొన్నది. కాంగ్రెసు దృష్టిలో ఫాసిజంకానీ సామ్రాజ్యవిధానం కానీ రెండూ ఒకటే. ఈ రెండూకూడా ప్రపంచ శ్రేయస్సుకూ శాంతిభద్రతలకూ భంగ కరములని కాంగ్రెసు అభిప్రాయం. అందువల్ల కాంగ్రెసీ రెంటినీ అంతమొందింపజేకోరు తూన్నది. కాబట్టి కాంగ్రెసు విదేశ రాజనీతి, స్వతంత్ర భారతదేశపు రాజనీతికి అనుగుణంగా ఉండేటట్టు యేర్పాటు చేయబడింది. కాంగ్రెసు ఫాసిస్టు తత్వమునూ సామ్రాజ్య తత్వమునూ కూడా రూపుమాపి, ప్రపంచంలో శాంతి స్వాతంత్ర్యములను స్థాపించవలెనని పట్టుపట్టింది. ఇక విదేశాలలో నివాస మేర్పరచుకొన్న భారతీయుల విషయ మాలోచించవలసి ఉంది. త్రిపురీకాంగ్రెసునాటికి బర్మా, సిలోను, కెన్యా మొదక ప్రదేశములలోని భారతీయ ప్రయోజనములకు గొప్ప విషమస్థితి తటస్థించింది. కాని కాంగ్రెసేమి చేయగలదు? విదేశాలలోనున్న దేశీయులకు, స్వేచ్ఛాస్వా తంత్ర్యముగల భారతదేశం మాత్రమే సరియైన సహాయం చేయగలదు. కాంగ్రెసు తన అభిప్రాయాన్ని ప్రకటించి, విదేశాలలోని భారతీయులకు శక్తివంచనలేకుండా భారత దేశంలోని యావత్తుప్రజా సహాయపడవలసిందని కోరింది.

భారత సంస్థానాలలోని ప్రజలుకూడా విదేశాలలోని భారతీయ ప్రజవలెనే నానాబాధలూ పడుతూన్నారు. భారత సంస్థానాలన్నీ అన్నివిషయాలలోనూ ఆచర

జాలో విదేశాలవలెనే భావింపబడుతూన్నవి. ఇండియా ప్రభుత్వశాఖలలో భారత సంస్థానాలశాఖ విదేశశాఖను చేర్చబడి ఉంది. దానికి యజమాని చక్రవర్తిగారిస్థానే ఇండియాలో పనిచేస్తూన్న రాజప్రతినిధి. హరిపురాకాంగ్రెసునుండి ఈవిషయంలో ఎంత ఎక్కువపని జరిగిందో అది అంత సంబరంగాకూడా జరిగింది. రాజకోట అనుభవము అంతా వ్రాస్తే అదే ఒక పెద్ద గ్రంథమవుతుంది. అయితే సంస్థానాలలోమాత్రం సర్వతోముఖచైతన్యం కలిగిందని చెప్పాలి. త్రిపురీకాంగ్రెసుకు వారం రోజులు ముందుగా మార్చి ౭ వ తేదీన ప్రారంభమైన గాంధీజీ ఉపవాసం, రాజకోటలో ఒడంబడిక కుదరగానే, ముగింపబడినది. ఆవార్త సరిగా కాంగ్రెసు జరుగుతూన్న సమయంలో త్రిపురీకి చేరింది. ఆరోజులలో ఒక రాజకోట సంస్థానాధిపతియేగాక, ఇంకా అనేకమంది సంస్థానాధిపతులు తాము తమ ప్రజకు చేసిన వాగ్దానాలనూ, హామీలను కూడా భగ్నం చేశారు. కాని హరిపురా కాంగ్రెసు తీర్మానం సంస్థాన ప్రజలు కలిసి గట్టిగా స్వాతంత్ర్యోద్యమాలను సాగించవలసిందని ప్రోత్సహించింది. ఇందువల్ల సంస్థాన ప్రజలకు హరిపురా కాంగ్రెసునుగూర్చి కలిగిన ఆశలు అడియాసలు కాలేదు. హరిపురా కాంగ్రెసు అంతకుమించి సంస్థాన ప్రజలవిషయంలో సహాయం చేయలేకపోవడం అప్పటి పరిస్థితులే కారణం. కాంగ్రెసు సంస్థానాలవిషయంలో సహాయం చేసితీరాలనే నిర్బంధమేమీలేదు. సంస్థాన ప్రజలను సరియైన పంథాలో నడుపుతూ, తన పలుకుబడితో వారికి తగిన సహాయం చేయడానికి కాంగ్రెసుకు హక్కున్నది. అది దాని కర్తవ్యం కూడాను. సంస్థాన ప్రజలలో రాజకీయ చైతన్యం పెంపొందిన కొలదీ, తనకు తాను నిర్ణయించుకొన్న నియమాలను కాంగ్రెసు రద్దుచేసుకొని, సంస్థాన ప్రజాసామాన్యముయొక్క ఉద్యమాలతో అది అంతకంతకు ఎక్కువగా ఐక్యం కావడానికి అవకాశం చాలా ఉంది. అందువలన కాంగ్రెసు ఆదర్శమైన సంపూర్ణ స్వాతంత్ర్యం ఒక్క బ్రిటిష్ ఇండియాకే కాక, అఖండ భారతదేశంలో విడదీయరాని భాగాలుగా ఎంచబడుతూన్న సంస్థానాలకు కూడా వర్తిస్తుందనీ, కాంగ్రెసు దృష్ట్యా తక్కిన భారతదేశంతో తులతూగగల రాజకీయార్థిక మత స్వాతంత్ర్యములు సంస్థాన ప్రజకుకూడా లభించవలెననీ, దాని అభిప్రాయం కావడంచేత అవసరం వచ్చినప్పుడల్లా సంస్థాన ప్రజకు తగిన ఉత్తరువులను జారీచేయడానికి కాంగ్రెసు వర్కింగుకమిటీ కధికారమీయబడింది. సంస్థానాల పరిస్థితులను బట్టి, కాంగ్రెసు సంస్థాన ప్రజోద్యమాలలో ప్రత్యక్షంగా జోక్యం కల్పించుకోవచ్చుననీ హరిపురా కాంగ్రెసులో విశ్వాసం కలగడమే ఈ మార్పుకు కారణం.

ఇక జాతీయవాంఛను గూర్చిన ప్రముఖ సమస్య విషయంలో హరిపురా

కాంగ్రెసు చెప్పవదానికంటె, త్రిపురికాంగ్రెసు ప్రత్యేకంగా ఏమీ ఎక్కువచెప్పలేదు. భారతదేశం స్వాతంత్ర్యం కోసం చేస్తూన్న దీర్ఘ ప్రయాణంలో సతీకాంతమార్గం నడిచింది. అంతే, భారత రాజ్యాంగ చట్టమును ప్రతిఘటించే ఉద్దేశంతో రాష్ట్రీయ మంత్రివర్గాలు పనిచేస్తూవచ్చినవి. హరిపురా కాంగ్రెసు తరువాత, గడచిన ఒక సంవత్సరంలోనూ, జాతీయోద్యమ సందువల్ల బలపడిన ప్రజాసామాన్యానికి కొంత పరిహారం కలిగినట్లు అనుభవం వల్ల తెలిసి వచ్చింది. కాని అప్పటి ప్రధాన సమస్య వయోజనులందరిచేతను ఎన్నుకోబడి విదేశీ యధికారులజోక్యం యేమాత్రమూ ఉండని రాజ్యాంగ పరిషత్తును నిర్మించుకోవడం. స్వయం నిర్ణయ సూత్రమును ఆచరణలో పెట్టడానికి కావలసిన రాజకీయ చైతన్యం, హిందూదేశ ప్రజానీకంలో సంస్థాన ప్రజలతో సహా సుస్థిరమైన జాతీయోద్యమం మూలమున వ్యక్తమవుతూనే ఉన్నది. కాబట్టి రాజ్యాంగ పరిషత్తుద్వారా స్వతంత్ర ప్రజాస్వామ్య రాజ్యమును స్థాపించుకోడానికి భారతదేశమునకు హక్కు కలదనీ వేరుగా చెప్పనక్కరలేదు. సంపూర్ణ స్వాతంత్ర్యం కావలెనని కోరడం జాతియొక్క ప్రతిష్ఠనూ, స్వతస్సిద్ధమైన హక్కునూ వ్యక్తపరుస్తుంది. సంపూర్ణ స్వాతంత్ర్యమును కలిగి ఉండడం ప్రతిజాతియొక్క ఆర్థిక మోక్షమునకూ, అత్యంతావశ్యకం. ఒకపక్క జాతీయ సంగ్రామ నినాదాలు ఆకాశంలో ప్రతిధ్వనిస్తూన్నవి. ఇంకొకవంక అంతర్జాతీయ యుద్ధమేఘాలు ప్రపంచాన్ని అంధకారబంధురం చేస్తూన్నవి. ఈ రెంటినీ జయప్రదంగా ఎదుర్కోవలెనంటే విచ్ఛిన్న శక్తులకు తావీయకుండా ఐకమత్యంతో రాష్ట్రీయ కార్యకలాపములను అఖిలభారత కార్యవిధానంతో సమన్వయం చేసుకొంటూ జాతీయసంస్థను బలిష్ఠం కావించడమే త్రిపురిలో నడవవలసిన ముఖ్యకర్తవ్యం. ఈవిషయం గమనించిన తరువాత భారతజాతికి తన లక్ష్యమును చేరడానికి మార్గం విస్పష్టంగా కనిపించింది. కాని దేశంలోనూ, దేశానికీ వెలుపలనూ కూడా అంతు కెటువంటి అడ్డంకులు కలవో భారతీయులకు తెలియక పోలేదు. ఇంటగెలిచి రచ్చగెలువ మన్నట్లు ముందు గృహకల్లోలాలను సద్దుకొంటేనే గాని బయటి వ్యవహారాలు పరిష్కారం కావు. కాంగ్రెసులో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తూన్న కల్లోలాన్ని ఎలా శాంతింప చేయవలెననేదే ప్రశ్న? ఇటువంటి క్లిష్టపరిస్థితులలో భారతజాతిని సరిగా నడపగల నాయకుడెవ్వడు? పూర్వకాలమున మోజెస్, ఆరన్ అను ఇరువురు కొండలను లోయలనూ గడచి, అరణ్యాలనూ నిర్జన ప్రదేశములనూ అతిక్రమించి యూదులనందరినీ కల్పవృక్షమూ, కామధేనువూ గల స్వర్గసీమకు కొంపోయినట్లు వింటూన్నాము. భారతదేశంలో అటువంటి మహాపురుషులు లేరా? గాంధీ రాజకోటలో కాల నిర్ణయంలేని ఉపవాసవ్రత మవలంబించి అదృష్టవశాత్తూ

జయప్రదంగా యిప్పుడే బయటపడ్డాడు. ఆయన శరీరం దూరాన రాజకోటలోనున్నప్పటికీ ఆత్మమాత్రం త్రిపురీలోనే సంచరిస్తూన్నది. కాని కష్టసుఖాలలో ఆయనసలహా సంప్రదింపులను పొంది తన ఆదర్శమును చేరగల దూరదృష్టి భారతజాతికి కలదా లేదా అనేదే ముఖ్యంగా విచారించవలసిన ప్రశ్న. త్రిపురీకాంగ్రెసు ప్రతినిధుల హృదయాలను ఆకర్షిస్తూన్నదాఒక్క సమస్యయే. గాంధీజీ నాయకత్వమునందు భారతజాతికి పరిపూర్ణ విశ్వాసం కలదని పునరుద్ఘాటన చేయవలెనన్నచో, ఆయన కోరికలకు వ్యతిరేకంగా ఆయన సిద్ధాంతానికి కార్యవిధానములకూ కూడా ప్రతికూలుడైన అధ్యక్షుని ఎన్నికవలన తనకు పరాజయం కలిగినట్లుగా గాంధీజీ కావించిన ప్రకటనను ఎలా సమన్వయ పరచవలెనో ప్రతినిధులకు బోధపడలేదు. దాదాపు జరిగిన ఇరవైసంవత్సరాలనుండీ కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులందరూ గాంధీచేతనే యేర్పాటుచేయబడుతూన్నారు. లేదా ఆయన సలహాతోనూ, ఆమోదంతోనూ అంగీకరింపబడుతూ వచ్చారు. ఈ సంవత్సరం (1939) అలా జరగడానికి వీలుందా?

కాంగ్రెసు మహాసభ జరుగుతూన్నంతకాలమూ సుభాస్‌బాబు జబ్బుగానే ఉన్నాడు. తరువాత చాలా కాలమువరకూ కూడా ఆయనకాజబ్బు నెమ్మదించనేలేదు. ఆయన మహాసభకు హాజరుకానేలేక పోయినాడు. అ. భా. కాం. సం. సభకుగానీ విషయ నిర్ధారణ సభకుగానీ ఆయనను డోలీలో కూర్చోపెట్టుకొని తీసికొని రావలసి వచ్చింది. వేదికపైన ఆయన సన్నిహిత బంధువులు విసనకర్రలతో విసురుతూ ఉపచారాలు చేస్తూన్నప్పుడు సుభాస్‌బాబు ఒక మనిషిగా కనిపించలేదు. చాలా కృశించి పోయినాడు. స్నేహితులాయనను డోలీలో తీసికొనిరావడం, తీసికొనిపోవడం చూచినప్పుడు చాలా దుఃఖం వస్తూండేది. కాని సిద్ధాంతంలో కానీ కార్యవిధానంలో గానీ ఇరుప్రక్కలా ఏమాత్రమూ లొంగుబాటు కనిపించలేదు. ప్రతినిధులలో ఒక పక్షంవారు తమ మాటను వినేటట్లుగా చేయవలెనని వేదికపైకి ఒకరితరువాత ఒకరువచ్చి చేసినంత హంగామా సూరతు కాంగ్రెసు తరువాతగానీ చిట్టచివరకు సూరతు కాంగ్రెసులోగానీ జరుగలేదని చెప్పవచ్చును. శరత్‌బాబు వేదికమీదనున్న పీఠంపైన నిలబడి మాట్లాడేసరికి ఆగల్లంతు కొంత శాంతించింది. ఈ కల్లోలం సర్దుమణిగేటందుకొక సూచన చేయబడింది. గోవిందవల్లభపంతు తీర్మానమును కాంగ్రెసు మహాసభకుగాక అఖిలభారత కాంగ్రెసు సంఘసభకు చర్చ నిమిత్తం పంపించడం మంచిదని సూచించబడింది. ఈ ప్రతిపాదనను ప్రతినిధులు తీవ్రంగా ఎదిరించారు. ప్రతిపాదన ఉపసంహరించుకోబడింది. కాని మహాసభకూడా వాయిదాపడింది. మరునాడు ప్రేక్షకులను రానీయలేదు. విషయ నిర్ధారణ సభామండపంలోనే ప్రతినిధులందరూ సమావేశమైనారు. పటం

టీమ్లు, పత్రికా విలేఖరులు, ప్రతినిధులూ అందరూకలసి మూడువేలమంది సమావేశం కావడానికి తగినంత విశాలంగా ఉండాసభా మందిరం. మంచి బందోబస్తుతో అత్యంత సక్రమంగా జరిగిందా మహాసభ. ఇంకా కొద్దికాలంలోనే విషయనిర్ధారణ సభా మందిరంలోని ఆ మహాసభ ప్రారంభంకాబోతుండగా, కొంతమంది మిత్రులు, ముఖ్యంగా వంగరాష్ట్ర మిత్రులు, కంపిటిగోజుల తోసివేయబడిన ప్రతిపాదనప్రకారం, పంతు తీర్మానం అ. భా. కాం. సం. నకు పంపమేనుంచిరని అభిప్రాయపడ్డట్లు కనిపించింది కాని ఆ తరుణం అదివరకే దాటిపోయింది మహాసభ చిత్తు కార్యక్రమము ననుసరించి అంతకు పూర్వమే సంగ్రహంగా వ్రాయబడిన తీర్మానలన్నిటినీ చర్చచప్పుడూ లేకుండా అంగీకరించింది.

## త్రిపురీ కాంగ్రెసు, ఆ పిమ్మట

కాంగ్రెసు మహాసభ ముగిసింది. మహాసభాధ్యక్షుల ఆగమనమెంత హృదయాకర్షకంగా ఉంటుందో, అంతకాకపోయినా ఆయన నిర్గమనంకూడా చాలామనసు చూడదగిన దృశ్యమే. అందులోకూడా ఉద్రేకోత్సాహాలకు చాలా అవకాశముంది. కాని త్రిపురీనుండి అధ్యక్షుని తిరుగుప్రయాణం చాలా నిరాడంబరంగా జరిగింది. ఆయనవెంట ఆయనకు ఉపచారాలు చేస్తూన్న కొద్దిమంది బంధువులున్నూ ఒకరిద్దరు డాక్టర్లున్నూ, ఇరువురు వర్కింగుకమిటీ సభ్యులున్నూ ఉన్నారు. ఆయనను మంచంమీద పరుండబెట్టి అంబులెన్సువ్యానులో చేర్చడానికి చాలాకష్టమయింది. దానిలోనే ఆయన చాలాదూరం ప్రయాణంచేశాడు. ఆయన ఝూరియాకు సమీపమునన్న ఒక ప్రదేశమునకు చిన్నగా చేరుకొని తన ఆరోగ్యాన్ని పునరుద్ధరించుకోవడాని కక్కడ ఒక నెలరోజుల పాటు కాలక్షేపంచేశాడు. సుభాసుబాబు తన వర్కింగుకమిటీ సభ్యులను నియమిస్తాడని ప్రతి రోజూ దేశం ఎదురుచూస్తూవచ్చింది. కాని అపని జరుగలేదు. ఈ పరిస్థితుల నన్నిటినీ సాకల్యంగా విచారించడానికి చిట్టచివరకు ఒక అ. భా. కాం. సం. సమావేశమును పిలువవలసివచ్చింది. కాంగ్రెసు వ్యవహారాలేవీ సాగకుండాపోయినవి. వర్కింగు కమిటీ లేని కాంగ్రెసు కాళ్ళూచేతులులేని మొండెంవంటిది. కార్యనిర్వహణాధికారులు లేని సంస్థ ఉన్నా లేనట్లే. సుభాస్‌బాబు వైఖరివల్ల యేర్పడిన పరిస్థితి 1939 ఏప్రిల్-మే నెలలలో సమావేశమైన అ. భా. కాం. సం. వారిచే మాత్రమే చక్కచేయబడింది.

(కరపత్రం 2. మే 19, పేజీలు 1-13)

సుభాస్‌బాబు కలకత్తా అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో రాజీనామా ఈయవలసి వచ్చింది. కాంగ్రెసు చరిత్రలో

యిటువంటి పరిస్థితులు తటస్థించడానికిది కొత్తకాదు. 1922 లో గయాకాంగ్రెసు జరిగిన తరువాత దేశబంధు చిత్తరంజనదాసుకూడా ఈలాగే రాజీనామా ఈయవలసి వచ్చింది. ఈ ఉదాహరణం సర్వవిధాలా సరిపోకపోవచ్చు. ఎందువల్లనంటే గయా కాంగ్రెసుకు, చిత్తరంజనదాసు ఏకగ్రీవంగా రెండవసారి అధ్యక్షుడయినాడు. అయితే ఈ రెండు సందర్భాలలోనూ, ఈ యిరువురు అధ్యక్షులూ యిచ్చిన రాజీనామాలు కేవలం విసుగుదలవల్ల యిచ్చినవిమాత్రంకావు కాంగ్రెసుచేసిన నిర్ణయాలు వారికి ప్రతికూలంగా ఉండడంచేత వారిభిన్నాభిప్రాయాలను వెల్లడించి తీవ్రంగానూ, సమ్యగ్విధానంలో ప్రచారంసాగించడానికే వారు రాజీనామాలిచ్చారు. సుభాస్ బాబు తక్షణం కత్తిదూశాడు. తరువాత జూన్ నెలలో బొంబాయి నగరమున జరిగిన అ. భా. కాం. సం. లో తీవ్రవాద ప్రతివాదాలకు గురియైన రెండు తీర్మానాలంగీకరించబడినవి. అవి తరువాతకూడా నిరంతరం నిరోధింపబడుతూనే వచ్చినవి. అందువల్ల ఆ సంవత్సరానికి ఎన్నుకోబడ్డ కొత్తఅధ్యక్షుడు రాజేన్ బాబు వర్కింగుకమిటీ పక్షాన ఒక ప్రకటన చేయవలసివచ్చింది. అదిచాలా సమంజసముగానూ సమగ్రంగానూఉంది. కాబట్టి పాఠకులు దానిని పూర్తిగాపరిశీలింతురుగాక!

(కరపత్రం నెం ?, 9-7 39 పేజీలు 1-7)

రాష్ట్రాలలో సత్యాగ్రహమునుగూర్చి, రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాలకూ కాంగ్రెసు మంత్రివర్గములకూ గల పరస్పర బాంధవ్యమునుగూర్చి, అఖిలభారత కాంగ్రెసు సంఘంలోని ఒక వర్గంలో తీవ్రమైన భావోద్రేకాలు కలిగినవి. వంగరాష్ట్రం నందలి జల్పాయిగిరిలో, ఆరునెలలలో భారతీయుల కోర్కెలను మన్నించనియెడల సమిష్టిసత్యాగ్రహం ప్రారంభించబోతూన్నట్లు బ్రిటిష్‌ప్రభుత్వానికి తెలియజేయునట్లు తీర్మానింపబడిన సంగతి జ్ఞాపకముండేఉంటుంది. వంగరాష్ట్రం చాలా ఉత్సాహవంతముగావుంది. అధమం ఈ తీర్మానానికి కారణభూతులైనవర్గంవారైనా ఉత్సాహంగా ఉండిఉంటారు. ప్రభుత్వంతో పోరాటాన్ని తొందరగా తీసికొనిరావలెననియే వారికోర్కె. కాంగ్రెసు ఏదో ఒకవిధంగా ప్రభుత్వంతో రాజీపడుదుర్చుకొంటుందేమోనని వారికి చాలాభయంగాఉంది. కాబట్టి వారునేరుగా బ్రిటిష్ ప్రభుత్వంతో ఢీకొనవలెనని వాంఛించారు. బెంగాలురాష్ట్రం తక్కినరాష్ట్రాలకన్న ముందడుగువేయవలెనని తలంచినప్పటికీ, ఆ రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ యాజమాన్యముకిందనే అపని జరగాలి. రైతులకూ జమీందారులకూ వచ్చేతగాదాల విషయంలోకూడా సత్యాగ్రహ ప్రసక్తివస్తూవచ్చింది. ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వంలోఉండగా యే ఒకటిరెండు రాష్ట్రాలలోని మంత్రివర్గాలో సత్యాగ్రహోద్యమమును ఎదుర్కొనవలసి

రావడం చాలా హాస్యాస్పదంగా ఉంటుందన్నమాట నిజం. కాబట్టి ఆయా రాష్ట్రములలో నడపబడే సత్యాగ్రహోద్యమాలు ఆయారాష్ట్రీయ కాంగ్రెసుసంఘాల యాజమాన్యమున వారి అనుజ్ఞలలో వారినిషేకి లోబడి నడపబడవలెనని తీర్మానించడం ఆపరిస్థితులలో చాలా అవసరమయింది. వర్కింగుకమిటీవారీవిషయంలో ఐక్యం కల్పించుకొని తన అధికారాన్ని చలాయించదలచుకోలేదు. అయినప్పటికీ 1938 జూన్ మాసాంతరమున బొంబాయిలోజరిగిన అ. భా. కాం. సం. సమావేశములో చేయబడిన ఈచిన్న తీర్మానమే చాలామందికి కంటకంగా పరిణమించింది. వారందరికీ సుభాస్‌బాబు నాయకత్వం వహించి తిరుగుబాటు లేవదీశాడు. ఇంతేకాక ఆసమావేశంలోనే శాసనసభలయందలి కాంగ్రెసుపక్ష సభ్యులకున్నూ, రాష్ట్రీయకాంగ్రెసు సభ్యులకున్నూ సలహాయిస్తూ మరొకతీర్మానం చేయబడింది. ఇదికూడా కాంగ్రెసులోని యిరుకక్షులవారి అభిప్రాయ భేదములనూ మరింత తీవ్రతరం చేసింది. రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు అధికారంలో ఉన్నంతవరకూ వారితో సహకారం చేయడం తప్పనిసరి. అలా కానినాడు లేనిపోని అపోహలు వ్యాపించి కాంగ్రెసు పలుకుబడికే ముప్పువస్తుంది. కాబట్టి పరిపాలనా వ్యవహారాలలో రాష్ట్రీ కాంగ్రెసు సంఘాలు మంత్రివర్గాలతో జోక్యం కల్గించుకోరాదనీ, ప్రత్యేకంగా యేదైనా అధికార దుర్వినియోగం జరిగినప్పుడుకానీ, చిక్కు లేటప్పించినప్పుడు కానీ వాటిని ప్రభుత్వ దృష్టికి తీసుకొనివచ్చేటందుకు రాష్ట్రీ కాంగ్రెసు కార్యవర్గము వారికెప్పుడూ అధికారముందనీ తీర్మానించబడింది. "పరిపాలనా విధానంలో మంత్రివర్గానికీ రాష్ట్రీ కాంగ్రెసు సంఘానికీ భిన్నాభిప్రాయం కలిగినప్పుడు ఆయా విషయాలను పార్లమెంటరీబోర్డుకు తెలుపవలెను. బహిరంగచర్చ పనికిరాదు" అని నిశ్చయింపబడింది. ఈనియమాలకు ప్రతికూలురైనవారు వీటిని ప్రజలన్యాయమైన హక్కులపైన దండయాత్రచేయడమని ప్రచారం సాగించారు.

అంతేకాక రాష్ట్రీకాంగ్రెసు సంఘాలు, మంత్రివర్గాలకూ శాసనసభా కాంగ్రెసు పక్షాలకూ లోబడిన సంస్థలుగా భావింపబడినవని కోపోద్రేక పరులైనారు. అనేకచోట్ల అ. భా. కాం. సం. వారు చేసిన ఈ తీర్మానాలను ఎదిరిస్తూ అధీనసంఘాలు తీర్మానాలుచేసి పంపినవి. అ. భా. కాం. సం. వారు ప్రజాస్వామ్య పద్ధతిప్రకారం అధిక సంఖ్యాక వోట్లతోనే ఈ తీర్మానాలను చేసినప్పటికీ అధీనసంఘాలవారు బహిరంగ సభలనుకూడా యేర్పాటుచేసి వీటిని ఖండించడం సాగించారు. అధీన సంఘాలు పైసంఘాన్ని ప్రార్థనాపూర్వకంగా యేదైనాకోరవచ్చును. లేదా సూచన చేయవచ్చును. అటువంటి అవకాశం ఉన్నప్పటికీ అ. భా. కాం. సం. వారుచేసిన ఈ పైతీర్మానా

లనుగూర్చి అసమ్మతి ప్రకటించడానికి జులై 9 వ తేదీని ఇండియా అంతటా సభలు జరుపవలసిందని సుభాస్ బాబూ, ఆయన అనుచరవర్గమూ ప్రకటించారు. ఈతిరుగుబాటుదార్లతో విచ్ఛిన్న కారకులైన యితర రాజకీయ ముఠాలూ, వర్గాలూ కూడా చేతులు కలిపినవి. దీనిని కాంగ్రెసు క్రమశిక్షణకు విరుద్ధమైన బహిరంగ చర్యగా భావించింది.

ఆ తరువాత జరిగిన సంఘటనలను సవిస్తరంగా తెలుపవలెనంటే, ఈ కథకు సంబంధించిన ఘట్టాలను నిరంతరాయంగా చెప్పుకుపోవడమే బాగుంటుంది. సుభాస్ చంద్రబోసున్నూ వామపక్షాల సమిష్టిసంఘమువారున్నూ కూడా జులై 9వ తేదీని అసమ్మతిని ప్రకటిస్తూ అనేకచోట్ల సభలుచేశారు కలకత్తా, కాన్పూరు, నాగపూరు, జబ్బల్ పూరు నగరములనుండి సమావేశములనుగూర్చిన నివేదికలు కాంగ్రెసు అధ్యక్షునకు చేరినవి. వంగరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గంవారు సమావేశమై ఈ విషయాన్నిగూర్చి సమగ్రంగా సమాలోచనచేశారు. కలకత్తాలో జరిగిన బహిరంగసభకు బెంగాలు కాంగ్రెసు సంఘంలోని సుప్రసిద్ధులనేకమంది హాజరయినారు. సరిగా ఈసమయంలోనే (జులై 9 ఆ పిమ్మట) గాంధీజీ అంతకుపూర్వ మెప్పుడో నిర్ణయించుకొన్న కార్యక్రమము ననుసరించి వాయవ్య సరిహద్దురాష్ట్రంలో పర్యటనం సాగిస్తున్నారు. వర్కింగు కమిటీవారి ఆదేశానుసారం జవహరలాలు సింహళ ప్రయాణం చేస్తూ మార్గమధ్యంలో ఉన్నారు. సింహళానికి వలసపోయిన భారతీయులకున్నూ, సింహళద్వీపవాసులకున్నూ సామరస్యం కలిగించి, ఈరెండు పురాతన దేశాలమధ్యనూ స్నేహబాంధవ్యములను పెంపొందించడానికి వర్కింగుకమిటీ జవహరలాలును సింహళానికి పంపింది. సుభాస్ బాబు చర్యనుగూర్చి విచారించడానికి 1939 ఆగష్టు రెండవవారంలో వార్ధాలో కాంగ్రెసు వర్కింగుకమిటీయొక్క అవసర సమావేశం యేర్పాటుచేయబడింది. సుభాస్ ను కాంగ్రెసు అధ్యక్షుడు సంజాయిషీ అడిగాడు. ఆయన ఆగస్టు 7 వ తేదీని రాజేంద్రబాబుకు పంపిన సంజాయిషీ ఉత్తరాన్ని యిక్కడ సమగ్రంగా ఉదాహరించడం న్యాయం :

“రంచినుండి మీరు 18 జులైని వ్రాసిన ఉత్తరానికి జవాబు వ్రాయడంలో జరిగిన ఆలస్యానికి చాలా చింతిస్తున్నాను. బొంబాయిలో అ. భా. కాం. సం. వారంగీకరించిన కొన్ని తీర్మానాలకు ప్రతికూలంగా అసమ్మతి తెలియజేస్తూ నేను తీసుకొన్న చర్యనుగూర్చి సంజాయిషీ ఈయవలసిందిగా మీరు నన్ను కోరినారు

“ఏదో ఒక తీర్మానానికి ప్రతికూలంగా అసమ్మతిని చూపించడానికీ, సరాసరి ఆ తీర్మానాన్ని ధిక్కరించడానికీ, లేక ఉల్లంఘించడానికీగల భేదాన్ని మొట్టమొదట

ప్రతివారూ గమనించాలి. ఇంతవరకూ నేను అ. భా. కాం. సం. వారి తీర్మానాలకు ప్రతికూలంగా అసమ్మతి చూపించడమే జరిగింది.

"అ. భా. కాం. సం. వారంగీకరించిన యేతీర్మానాన్ని గురించినైనప్పటికీ నాఅభిప్రాయాన్ని ప్రకటించడానికి నాకు శాస్త్రబద్ధమైన హక్కుంది. అ. భా. కాం. సం. సమావేశం ముగియగానే, ఆ సమావేశంలో అంగీకరింపబడిన తీర్మానాలనుగూర్చి నేను అభిప్రాయాలను వెల్లడిస్తూండడం కాంగ్రెసువాదులకు ఆచారమైన సంగతి మీరు బహుశా అంగీకరిస్తారనుకొంటాను. అ. భా. కాం. సం. వారిచే అంగీకృతములైన తీర్మానాలను గూర్చి అభిప్రాయమిచ్చే హక్కు కాంగ్రెసువాదులకుందని మీరంగీకరించేయెడల. కేవలం అనుకూలాభిప్రాయాల నీయడానికి మాత్రమే ఆ హక్కును ఆమోదిస్తారనీ ప్రతికూలాభిప్రాయాల విషయంలో నిషేధిస్తారనీ అనడానికి మాకు వీలులేదు. మా అభిప్రాయాలను మేము వెల్లడించడానికి మాకు శాస్త్రసమ్మతమైన హక్కు ఉన్నయెడల ఆ మా అభిప్రాయాలు ఆతీర్మానాలకు అనుకూలమా ప్రతికూలమా అనే విషయం అనవసరం. మీ ఉత్తరం ప్రతికూలాభిప్రాయ ప్రకటనమును మాత్రమే నిషేధిస్తూన్నట్లు స్ఫురింపచేస్తోంది.

"బ్రిటిష్ ప్రభుత్వంతో ఇంతకాలమునుండీ మనం పోరాడుతూన్న అనేక విషయాలలో పౌర స్వాతంత్ర్యంకూడా ఉంది. పౌరస్వాతంత్ర్యములోనే వాక్స్వాతంత్ర్యం కూడా యిమిడిఉందని నా అభిప్రాయం. కాంగ్రెసులోకానీ అ. భా. కాం. సం. లోకానీ అధిక సంఖ్యాకుల అభిప్రాయంతో ఏకీభవించజాలక పోయినప్పుడు మాకు వాక్స్వాతంత్ర్యం ఉన్నట్లుగా మేము భావింపరాదని మీఉద్దేశం. బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రతికూలంగా మాట్లాడడానికి స్వాతంత్ర్యం కలిగి కాంగ్రెసుకుగానీ, దాని అధీన సంస్థలకుగాని వ్యతిరేకంగా నోరెత్తడానికి హక్కులేకపడం వింతగా కనిపిస్తుంది. మా వుద్దేశంలో దేశశ్రేయస్సుకు హానికరములని భావింపబడుతూన్న అఖిలభారతకాంగ్రెసు సంఘమువారి తీర్మానాలకు ప్రతికూలంగా విమర్శించే హక్కు మాకులేనియెడల, అది ప్రజాస్వామ్యహక్కులకు భంగం కలిగించడం అవుతుంది. ప్రజాస్వామ్య హక్కులను ఆచరణలో పెట్టవలెనంటే కాంగ్రెసుకు వెలుపలనేకాని కాంగ్రెసులోపల వీలులేదా అని నేను మిమ్మలను గట్టిగా ప్రశ్నించవచ్చునా? ఒకానొక "అఖిలభారత కాంగ్రెసుసంఘ సమావేశంలో చేయబడిన తీర్మానాన్ని తరువాతి సమావేశంలో పునర్విచారణ చేయడానికిగానీ మార్పుచేయడానికిగానీ, సవరించడానికిగానీ, రద్దుచేయడానికిగానీ సభ్యులకు హక్కువుందనే విషయం మీరు ఒప్పుకొంటారనుకొంటాను. అ. భా. కాం. సం. చేసిన తీర్మానంపైన పైసంస్థకు అనగా కాంగ్రెసు మహాసభకు అప్పీలు చేసుకొనేహక్కు

కూడా మాకు కలదని మీరంగీకరిస్తారని తలుస్తూన్నాను. అధికసంఖ్యాకుల అభిప్రాయా లను మార్పుచేసి వారిని తమవైపుకు తిప్పుకోవడానికి అల్పసంఖ్యాకులకు ప్రచారంచేసే హక్కు ఉన్నదనికూడా మీరంగీకరిస్తారనుకొంటాను. అయితే ఈపని కాంగ్రెసువాదుల బహిరంగ సభలలో ఉపన్యసించకుండానూ, పత్రికలలో వ్రాయకుండానూ ఎలా జరుగు తుంది. ఈనాటి కాంగ్రెసు యేకొద్దిమంది వ్యక్తులకో నోచూచిన సంస్థకాదు. కాంగ్రెసు సభ్యత్వం ఈనాడు దాదాపు 45 లక్షలవరకూ పెరిగిఉంటుందని నావిశ్వాసం. కాంగ్రె సులోఉన్న యావన్మంది సభ్యులకూ మా అభిప్రాయాలను తెలిపి వారిని మావైపుకు తిప్పుకోవలెనంటే, మాకు బహిరంగ సభలలో ఉపన్యసించడానికీ పత్రికలలో వ్రాయడానికీ స్వేచ్ఛ ఉండాలి. అ. భా. కాం. సం. వారి తీర్మానములు వేదాక్షరా లనీ, అవి శాశ్వత బ్రహ్మకల్పంగా అలాగే ఉండాలనీ మీరనుకొనే యెడల వాటికి వ్యతి రేకంగా ప్రచారం చేయరాదనీ మీరు నిషేధించడంలో కొంత న్యాయం ఉంటుంది. కాని అఖిలభారత కాంగ్రెసు సంఘంవారుచేసిన ఒకానొక తీర్మానాన్ని పునర్విచారణ చేయడానికిగానీ, మార్చడానికిగానీ, సవరించడానికిగానీ, రద్దుచేయడానికిగానీ ఆ సంస్థకున్నూ, దాని పైసంస్థఅయిన కాంగ్రెసు మహాసభకున్నూ హక్కుకలదని అంగీక రించే యెడల, ఈనాడు మీరు ప్రయత్నిస్తూన్నట్లుగా, మేముచేసే విమర్శను యెలా నిషేధించగలరో తోచకుండా ఉంది.

“క్రమశిక్షణ” అనే పదానికి మీరుచేసే వ్యాఖ్యానాన్ని నేనంగీకరించజాలను. నేను బాగా క్రమశిక్షణకు అలవాటుపడినవాడిననియే నా అభిప్రాయం. అయితే క్రమ శిక్షణ అనేపేరుతో మీరు సక్రమమైన విమర్శనను నిరోధించడానికి ప్రయత్నిస్తూన్నా రేమోనని భీతికలుగుతూంది. శాస్త్రరీత్యా మానవునకుగల ప్రజాస్వామ్య హక్కును నిరాకరించడం క్రమశిక్ష అనిపించుకోదు.

“మాఉద్దేశప్రకారం దేశక్షేమానికి భంగకరంగా ఉన్నదని తోచే తీర్మానాలకు ప్రతికూలంగా అసమ్మతిని చూపించే హక్కు విషయం అలా ఉండనీయండి. ఈ రెండు తీర్మానాలనూ అమలులోపెడితే కలిగే ఫలితాలనుగూర్చి యిప్పుడాలోచిద్దాం. ఇవి కాంగ్రెసును శాసనబద్ధమైన ఆందోళనలోకి దింపుతాయి. కాంగ్రెసు సంస్థయొక్క ప్రతి ష్ఠకు భంగకరంగాకూడా రాష్ట్రీయమంత్రుల పలుకుబడినీ, ప్రాబల్యాన్నీ, అధికారాన్నీ అభివృద్ధిచేస్తాయి. కాంగ్రెసును ప్రజాసామాన్యానికి దూరంచేస్తాయి. అ. భా. కాం. సం. మును సామాన్య కాంగ్రెసు వాదులనుండి చీలదీస్తాయి. వీటన్నిటినీమించి కాంగ్రెసు లోని విప్లవభావాన్ని విచ్ఛిన్నం చేస్తాయి. కాబట్టి దేశశ్రేయస్సును గుర్తించి తక్షణం

ఈ తీర్మానాలను ఆచరణలోకి రాకుండా ఆపుచేయగాలి. తరువాత కమిటీలో తగిన మార్పులను చేసుకోవచ్చు. లేదా కమిటీని రద్దుచేసినా నేను సమ్మతిస్తాను.

"ఈ సందర్భంలో 1922 లో జరిగిన గయా కాంగ్రెసు సమావేశంలోనూ ఆ తరువాతనూ సంభవించిన కొన్ని సంఘటనలను మీ జ్ఞప్తికి తీసుకొని రావలసి ఉంది. ఆ రోజులలో స్వరాజ్యపక్షం వారేమిచేశారో దయచేసి జ్ఞప్తికి తెచ్చుకోండి. గయా కాంగ్రెసు తీర్మానాన్ని అ. భా. కాం. సం. నిర్వీర్యపర్చింది. మహారాష్ట్రీయ కాంగ్రెసు సంఘంవారు దానిని ధిక్కరించవలెనని తీర్మానించిన సంగతికూడా మరువకండి.

"ఇక అల్పసంఖ్యాకులు తిరుగుబాటు చేయడానికికూడా హక్కున్నదని మహాత్మా గాంధీ 'యంగిండియా'లో వ్రాసినట్లు నాకు జ్ఞాపకం. అది నిజమైతే ఆ సంగతికూడా మరువకండి! అధికసంఖ్యాకుల నిర్ణయాన్నిగూర్చి నిజంగా మేము తిరుగుబాటు చేసేటంతవరకూ ఇంకా పోలేదు. మేము వ్యతిరేకిస్తూన్నప్పటికీ అధిక సంఖ్యాకులచే ఆమోదించబడిన కొన్ని తీర్మానాలనుగూర్చి ప్రతికూలంగా విమర్శించే స్వాతంత్ర్యాన్ని మాత్రమే మేము వలంబించాము.

"మా న్యాయసిద్ధమైన హక్కునుకొంటున్నదానిని మేము చలాయిస్తాన్నందుకు మీరింతచేయడం నాకునిజంగా ఆశ్చర్యంవేస్తోంది. ఈ నా సంజాయిషీని మీరు సంతృప్తికరంగా ఆమోదించగలరనుకొంటాను. ఒకవేళ మీరిలా ఆమోదించక నాపైన క్రమశిక్షాచర్య తీసుకోవడానికే నిర్ణయించేయెడల నాకన్యాయమని తోచిన ఒకానొక ధర్మనిర్వాహణంకోసం నేనాచర్యను సంతోషంతో ఎదుర్కొంటాను.

"9 వ జులైనాటి సంఘటనలను గూర్చి యే కాంగ్రెసువాది పైనను మీరుశిక్షించ దలచుకొనేయెడల నామీదకూడా చర్యతీసుకోవలెనంటినే నాకేడసారి ప్రార్థన. 9 వ జులై తేదీని అఖిలభారత కాంగ్రెసు సంఘతీర్మానాల అసమ్మతి దినంగా గమనించడమే అపరాధమైతే ఆ అపరాధానికి మూలకారకుడను నేనేఅని అంగీకరించితీరాలి."

ప్రేమపూర్వక గౌరవాభివందనములతో
మీనిర్వ్యాజ మిత్రుడు.
(సం.) సుభాస్ చంద్రబోస్.

సుభాస్‌బాబుపంపిన ఈ దీర్ఘమైన సంజాయిషీని వర్కింగుకమిటీవారుఉద్విగ్న మనస్కులై పరిశీలించారు. కాని, కాంగ్రెసు అధ్యక్షుడు లేవదీస్తున్న ప్రధాన విష యాన్ని ఆయన పూర్తిగా విడచిపెట్టేటట్లు యిష్టంలేకపోయినా పిపాదహృదయాల లతో వారునిర్ణయించక తప్పిందికాదు. కాంగ్రెసు అధ్యక్షునియొద్దనుండి తుదిఉత్తరు

వులు రాగానే, వాటినిగూర్చి తనకు భేదాభిప్రాయం ఉన్నప్పటికీ జాతీయ సేవకుడుగా వాటికి విధేయత చూపించడం తన కర్తవ్యమని మాజీఅధ్యక్షుడు తెలుసుకొని ఉండవలసిందనికూడా వర్కింగుకమిటీ అభిప్రాయపడ్డది. అధ్యక్షుని నిర్ణయంవలన తనకు అన్యాయం జరిగినట్లుగా ఆయన భావించినట్లయితే వర్కింగుకమిటీకిగాని, అ. భా. కాం. సం. వారికిగానీ ఆయన అప్పీలు చేసుకోవచ్చును. కాని అంత వరకూ ఆయన అధ్యక్షుని ఉత్తరువులను విధిగా అనుసరించవలసిందే. ప్రపంచంలో కల్లా బలిష్ఠమైన సామ్రాజ్య ప్రభుత్వంతో పోరాడే కాంగ్రెసులో గట్టి క్రమ శిక్షణ ఉండడం ఎంత అవసరమో విస్పష్టంచేస్తూ, కాంగ్రెసు నియమావళిని యిష్టంవచ్చినట్లు వ్యాఖ్యానంచేయడానికి ప్రతిసభ్యునికీ స్వాతంత్ర్యం ఉన్నదనే సుభాస్‌బాబు వాదనను వర్కింగుకమిటీవారు ఖండించారు. ఆవాదనను అంగీకరించే యెడల కాంగ్రెసుసంస్థ అరాచకానికి ఆలవాలమై ఛిన్నాభిన్నంకావడానికి ఎంతో కాలం పట్టదని కాంగ్రెసు వర్కింగుకమిటీ అభిప్రాయపడ్డది. అందువల్ల సుభాస్‌బాబు వంగరాష్ట్రీ అధ్యక్షుడుగా ఉండడానికి అనర్హుడనీ, యేయితర కాంగ్రెసుసంఘంలోనూ 1939 ఆగష్టునెలనుండి మూడేళ్ళవరకూ ఎన్నికసభ్యుడుగా ఉండకూడదనీ నిర్ణయింప బడింది. "తన ధోరణిలోనున్న తప్పిదాన్ని సుభాస్‌బాబు గ్రహించి ఈక్రమశిక్షణ చర్యకు హృదయపూర్వకంగా విధేయతచూపిస్తాడని వర్కింగుకమిటీవారు విశ్వసించారు. కానీ వెంటనే ఆయన దక్షిణయిండియా యాత్రసాగించాడు. ప్రజాసమూహ మాయనను గుంపులుగుంపులుగా వచ్చిదర్శించింది ఆ వచ్చినవారంతా తన సిద్ధాంతాల కనుకూలురనీ వారంతా తాను రాజీనామాయిచ్చిన వెంటనే స్థాపించిన ఫార్వర్డుబ్లాకును బలపరచేవారేననీ సుభాస్‌బాబు ఆశాపూరిత హృదయంతో విశ్వసించాడు. కాంగ్రెసు మీద ఆయనచేసిన దండయాత్రలో, బొంబాయి మొదలైన ప్రరాష్ట్రీభుత్వాలుప్రారంభించిన మద్యనిషేధోద్యమంకూడా ఆయన తీవ్రవిమర్శకు గురికాక తప్పలేదు.

అ. భా. కాం. సం. సభ్యులు, కాంగ్రెసు కార్యక్రమంలోని వివిధ విషయాలను గూర్చి ఎక్కువగా శ్రద్ధ తీసుకొంటూండడమే 1939 లోని కాంగ్రెసు కార్యనిర్వహణములో ముఖ్యంగా గమనించతగిన విషయం ఆ సంవత్సరం అ. భా. కాం. సం. సమావేశం మూడు పర్యాయాలు జరిగింది. ఈ సమావేశాలకు మామూలుగా హాజరయ్యే సభ్యులకంటె ఎక్కువమంది హాజరు కాలేదు. కాని అనధికారసభ్యులు పంపిన తీర్మానాలతో ఎజెండా నిండిపోతూ వచ్చింది విషయవిస్తీర్ణతయేగాక, వివిధ దృక్పథాలతో కూడిన వింత వింత భావాలు కలిగిన తీర్మానాలు సభ్యుల దృష్టిని ఆకర్షించక తప్పిందికాదు. 1939 ఏప్రిల్ నెలలో జరిగిన కలకత్తా

సమావేశానికి 116 తీర్మానాలు అధికారేతర సభ్యులచే పంపబడినవి. 1939 జూన్‌లో బొంబాయి సమావేశానికి 177, 1939 అక్టోబరులో వార్ధా సమావేశానికి 33 అధికారేతర తీర్మానాలు పంపబడ్డవి. జూన్ సమావేశానికి అనధికార తీర్మానాలు రెండింటికి మాత్రమే అవకాశం కలిగింది. అందులో ఒకటి ఆంధ్రరాష్ట్రనికి సంబంధించిన తీర్మానం. అది బ్యాలట్టులో వచ్చింది. "ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కోసం అవసరమైన చర్యలు తక్షణం నవిపాలసించవని ఈ కమిటీ గట్టిగా అభిప్రాయపడుతూన్నది" అని ఆ సమావేశంలో తీర్మానింపబడింది. తరువాతి తీర్మానం దిగ్బాయి సమ్మెనుగూర్చినది. బ్యాలెట్టులో కాకపోయినప్పటికీ సభ్యులందరి అంగీకారంతోనూ ఈ తీర్మానాన్ని చర్చించడానికి అధ్యక్షుడు ఆమోదించాడు. కాని ఈ నిర్ణయం భావి అధ్యక్షులను యేమాత్రమూ బాధించకూడదని అప్పుడే ఆయన విస్పష్టం చేశాడు. దిగ్బాయి సమ్మెయొక్క లక్షణాన్నిబట్టీ, దానిలో ఇమిడిఉన్న వివిధ ప్రయోజనాలనుబట్టీ, విభిన్న సంఘటనలనుబట్టీ అది ప్రాముఖ్యత వహించింది. (ఈవిషయాన్ని సవిస్తరంగా తెలుసుకోదలెనంటే బులెటిన్ III 9-7-39, 33 మొదలు 39వ పేజీలవరకూ)

ఇంతకుపూర్వం జవహరలాలుని సింహళ ప్రయాణమునుగూర్చి ప్రసంగవశాత్తు చెప్పి ఉన్నాము. సింహళములో నివాస మేర్పరచుకొన్న భారతీయులకు, ఆ ప్రభుత్వం తీసికొన్న చర్యలు కొన్ని ఆందోళన కలిగించినవి. ఇరుగు పొరుగున ఉన్న ఈ రెండు దేశాలమధ్యనూ అనవసరంగా పోరాటం రాకుండా తప్పించుకోవడానికి వీలున్నదని భావించి, అ. భా. కాం. సం. జవహరలాలు స్వయాను సింహళద్వీపమునకు రాయబారం పంపుతూ వీలైతే ఈ విషయాన్ని పరిష్కరించడానికి కూడా ఆయనకే అధికారమిచ్చింది.

జులై 16వ తేదీని విమానంలో జవహరలాలు కొలంబోకు చేరుకొన్నాడు. భారతీయులు, సింహళీయులుకూడా ఆయనకు మనోజ్ఞమైన స్వాగతమిచ్చారు. సిలోన్ స్టేటు కౌన్సిలు నాయకుడు సర్ బ్యారన్ జయతిలక యేర్పాటుచేసిన ప్రత్యేక ఆహ్వానసంఘమునకు ఆయన అతిథి.

సింహళద్వీపంలోని మంత్రులతోను భారతీయులపక్షాన ప్రాతినిధ్యంవహిస్తూన్న రెండు ప్రముఖ సంస్థలూ - సిలోన్ ఇండియన్ కాంగ్రెసుయొక్కయు, సిలోన్ సెంట్రల్ ఇండియన్ అసోసియేషన్ యొక్కయు ప్రతినిధులతోనూ సంప్రదించడంతో ఆయనకు బొత్తిగా తీరికలేకపోయింది. అయినప్పటికీ ఆయన- జనం కిటకిటలాడుతూ ఉన్న- అనేక బహిరంగసభలలో ఉపన్యాసాలుచేశాడు. ఈ అన్ని సభలలోనూ

చారిత్రకంగానూ సాంస్కృతికంగానూ ఈ రెండు దేశాలమధ్యగల పరస్పర సన్నిహిత సంబంధాన్ని నిలబెట్టుకోవలెనని ఉద్ఘాటించాడు. ఈ రెండు దేశాల ఆర్థిక రాజకీయ కష్టాలకు కారణభూతమై, ఉభయులకూ సమానశత్రువైన సామ్రాజ్యవిధానాన్ని ఎదుర్కొనేటందుకు ఉభయులూ ఏకం కావలసిన అవసరాన్నిగురించి ప్రబోధించాడు.

సింహళంలో నివాస మేర్పరచుకొని, సింహళదేశమునే తల్లినేలగాభావిస్తూన్న భారతీయుల సమస్యను పరిష్కరించేటప్పుడు విశాలదృక్పథమూ, ఉన్నతాశయమూ, కలిగి ఉండాలని మంత్రులకాయన నచ్చచెప్పినాడు. ముందు ముందు ఎదుర్కోవలసిన పెద్ద పెద్ద సమస్యలను బట్టిచూస్తే ఇప్పుడు తాను పరిష్కరించడానికి వచ్చిన సమస్య చాలా స్వల్పమనీ, అపరిగణనీయమనీ సూచించాడు. కాబట్టి ఈ స్వల్పసమస్యను కొంచెం ఉదారంగా పరిష్కరించడం అవసరమని ఆయన ఆదేశించాడు. భారతీయులున్నూ వారి ప్రతినిధులున్నూ తమలో తమకు గల అంతరంగిక విభేదములను విస్మరించి, భారతదేశ గౌరవాన్ని రక్షించేటందుకు కంకణం కట్టుకొని ఆత్మగౌరవం గల పౌరులుగా ఏకీభావంతో బలిష్ఠంగా ఉండవలెనని వారికి ప్రబోధించాడు. భారతీయులు సింహళద్వీపమునుగూడా మాతృదేశంగా భావిస్తూ, అత్యంత భక్తిశ్రద్ధలతో ఆదేశాన్ని సేవించవలెననీ, దేశీయులందరితోనూ భ్రాతృభావం కలిగి వ్యవహరించవలెననీ, హృదయపూర్వకంగా ప్రార్థించాడు.

ఈ సమస్య యెంత ఉన్నతాశయముతో ప్రారంభించబడిన కారణాన సర్వతోముఖమైన అనుకూల వాతావరణం వ్యాపించింది. కాని భారతీయులను తిరిగి పంపివేయడంలో మంత్రులవలంభించిన విధానమునందెక్కువ మార్పులుచేయడానికి వారంగీకరించలేదు. వారి ప్రణాళికలలో కొలది మార్పులు చేయగలమనీ మాతృదేశ పునఃప్రమాణ సందర్భంలో భారతీయులకు కలిగే కష్టాలను సాధ్యమైనంతవరకు తగ్గించడానికి తగిన చర్య తీసుకొంటామనీ వారు వాగ్దానం చేశారు. కాబట్టి జవహరలాలు సింహళ ప్రయాణం ఇండియాకు సింహళద్వీపమునకుగల పరస్పర స్నేహసంప్రదాయములను తిరిగీ మనస్మృతిపథమునకు తేగలిగింది పరిస్థితులనుబట్టి సహజంగా తటస్థించిన ద్వేషభావాన్ని తగ్గించింది. కాని అసలుఉద్దేశంమాత్రం నెరవేరలేదు. సింహళప్రభుత్వం వారికింద పనిచేస్తూన్న భారతీయఉద్యోగులసమస్యలను అన్నిటినీన్యాయంగాన్నూ గౌరవప్రదంగానూ పరిష్కరించడమే ఆయన ప్రధానూద్దేశం. అయితే ఆయన సింహళం వెళ్ళినందువలన భారతీయులకూ సింహళద్వీప వాసులకూమధ్య పరస్పర సాంఘిక సన్నిహిత సంబంధం యేర్పాటైంది. వారుభయుల స్నేహబాంధవ్యములు పెంపొందినవి. అయితే

సింహళ ప్రభుత్వంమాత్రం పట్టినపట్టు విడవకుండా ఉండిపోయింది. వర్కింగు కమిటీవారు, ఈసమస్యల విషయంలో సింహళ ప్రభుత్వమవలంబించిన చర్య న్యాయానికీ, అంతర్జాతీయ శాంతికి తగినట్లుగా లేదని తీర్మానం చేయవలసివచ్చింది. ఇతర దేశాలయెడల ఇండియా అవలంబించే వైఖరినిబట్టి ఇండియనులయెడల కూడా ఆయా దేశాల ప్రవర్తన ఉంటుందని కాంగ్రెసు అభిప్రాయపడేయెడల, ఇండియా దేశం సామ్రాజ్యవ్యూహాన్ని అవలంబించ జాలదు. సింహళంవంటి చిన్నదేశానికి ఇండియా తన సానుభూతిని సహకారములను కార్యరూపేణా ప్రదర్శించి తీరాలి. అంతమాత్రాన ఎవ్వరూ ఆయా దేశాలవారి యిష్టానికి వ్యతిరేకంగా ఆ దేశాలకుపోయి వారి నెత్తి నెక్కవలెనని కాంగ్రెసు ఉద్దేశం కాదు. సింహళ ప్రభుత్వోద్యోగములను గానీ, విదేశ ప్రభుత్వసహాయములను గానీ ముందుగా పొందేహక్కు సింహళద్వీపవాసులకు కలదనే సంగతి వర్కింగుకమిటీ అంగీకరిస్తూనేఉంది. కాని సింహళానికి వలసపోయిన భారతీయులుకూడా ఆ దేశంలో ఇవ్వాళఉండి రేపు పోయేవాళ్లుకారు. వారు చిరకాలంనుండీ అక్కడఉండి సింహళాన్ని మాతృదేశంగా చేసుకొన్నారు. కాబట్టి వారి పౌరసత్వమును యేమాత్రమూ కొంచెపరచడానికి వీలు లేదు. ఇండియానుండి సింహళద్వీపమునకుపోయే వలస కూలీజనాన్ని వెంటనే ఆపుదల చేయడం మంచిదని వర్కింగు కమిటీవారి అభిప్రాయం ఈ సందర్భంలో ఇండియా ప్రభుత్వంవారు తీసుకొన్న చర్యను వారామోదించారు. ఈవిషయం ఈ తరువాతజరిగిన విషయాలుకూడా ముందుగానే కొన్ని చెప్పడం మంచిదనిపిస్తూన్నది 1940 వ సంవత్సరంలో సింహళప్రభుత్వంవారొక రాయబారవర్గము నిండియాకుపంపి, ఇండియా ప్రభుత్వంతో రాజీలు నడిపారు కాని ప్రయోజనం లేకపోయింది. 1941 జులై నెలలో కూడా సింహళప్రభుత్వం మరొకసారి ఈ సందర్భంలో ప్రయత్నించి చూడవలెనని భావించింది. సింహళద్వీపంలోని భూములను సాగుకంతగా చేయడమేగాక, సింహళం లోనే కాపురముండి, సింహళాన్ని తమ మాతృదేశంగా చేసుకొన్న భారతీయ కూలీలు సింహళ దేశీయులతో సరిసమానమైన పౌరులుగా పరిగణింపబడుతూ, ఆ పౌరులకున్న అన్ని హక్కులనూ బాధ్యతలనూ కలిగిఉండడానికి అధికారాన్ని సంపాదించుకొన్నారు. తాత్కాలికంగావెళ్ళిన భారతీయకూలీలు, ఆదేశానికి చేసిన సేవనుబట్టీ, శ్రమనుబట్టీ, వారి యెడల న్యాయంగానూ సఖ్యంగానూ ఆ ప్రభుత్వం ప్రవర్తించడం ఉచితం. ఇవన్నీ యిలా ఉండగా భారత, సింహళ దేశాల భవితవ్యములను ఐక్యంచేయగల చారిత్రిక, నైసర్గిక, సాంస్కృతిక, ఆర్థిక కారణాలు అనేకం ఉన్నవి. కాబట్టి ఈరెండు దేశాల శ్రేయస్సు కోసం యుగ యుగాలనుండీ, ఉన్నవాటి పరస్పర సంబంధములను బలిష్ఠం చేయడం కాంగ్రెసు తనవిధి అనుకుంది.

కాలం గడచినకొలదీ కాంగ్రెసులో క్రమశిక్షణ అంతకంతకు కఠినమవుతూ వచ్చింది. ఎన్నుకోబడిన కాంగ్రెసు సభ్యులు కానీ, ఎన్నికకు నిలబడిన అభ్యర్థులు కానీ నిరంతర ఖద్దరుదారులుకారని నిందారోపణ చేయబడుతూన్నందువలన ఈసందర్భంలో ఒక అధికార ప్రకటన అవసరమయింది. హరిపురాకాంగ్రెసు ముగియగానే కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశమై ఖద్దరనగా యేమిటో నిర్వచనంచేసింది. దాని ప్రకారం చేతితో వడికిన నూలుతో చేతితో మగ్గంపైన నేసిన బట్టమాత్రమే ఖద్దరు కాజాలదు. ఈబట్టను తయారు చేయడంలో నియోగింపబడిన పారిశ్రామికులందరూ అఖిల భారత చరఖా సంఘం వారిచే యేర్పాటు చేయబడి మజూరీ కూడా పొందవలెను అటువంటిబట్టను అఖిలభారత చరఖాసంఘంవారి అంగళ్లనుంచికాని లేదా వారిఅనుమతినిపొందిన తదితర దుకాణములనుండికానీ మాత్రమే కొనవలెను. హరిపురాలో ఈ తీర్మానము చేయబడడానికిపూర్వం చాలాకాలం కిందటనే ఈ సంగతి కాంగ్రెసు దృక్పథంలోకి వచ్చింది. మాజీకాంగ్రెసు అధ్యక్షుడు వల్లభాయిపటేలీ సందర్భంలో ఒకనిర్ణయంచేశాడు. 1934 డిశంబరులో పాట్నాలో సమావేశమైన వర్కింగుకమటీవారు దానిని ఆమోదించారు. 1935 ఏప్రిల్ నెలలో జబ్బల్పురమున సమావేశమైన వర్కింగుకమిటీవారీ సందర్భంలోనే మరొక తీర్మానం చేశారు. వీటన్నిటినీ కాంగ్రెసువారనుసరించి తీరవలెనని నిర్ణయింపబడింది.

వల్లభాయిపటేల్ నిర్ణయం:- 'పూర్తిగా చేతితోవడికి చేతితోనేసిన ఖద్దరును మాత్రమే నిరంతరం ధరించేవాడు, అని ఆర్టికిల్ v క్లాజ్ (b) (i) లో ఉదహరించబడిన మాటలకు నిర్వచనంచేస్తూ సర్దార్ వల్లభాయిపటేలు ఈదిగువ కావించిన నిర్ణయం కాంగ్రెసు వర్కింగుకమిటీవారి అభిప్రాయానికి అనుగుణంగానే ఉందని వారభిప్రాయపడుతూన్నారు.

1. "అలవాటుగా ఖద్దరుబట్టలను ధరించేమనిషి నిరంతర ఖద్దరుదారి అనిపించుకొంటాడు. ఎప్పుడైనా, సరియైనకారణం ఉన్నప్పుడు ఆయన ఖాదీధరించనంతమాత్రాన ఆయనను నిత్యఖద్దరుధారి కానట్లుగా భావించగూడదు.

2. కాని కాంగ్రెసు వ్యవహారములలో ఖద్దరుధరించరాని మనిషిని నిత్యఖద్దరుధారి కానట్లుగా భావించాలి.

3. నిత్యఖద్దరుధారిఅంటే, ఆపాదమస్తకం చేతితోవడికి చేతితోనేసిన వస్త్రములను ధరించినవాడే.

4. ఒకానొక కాంగ్రెసుమీటింగుయొక్క అధ్యక్షునకు స్వయంగాగానీ, లేక యితరులు చూపెట్టినప్పుడుగానీ ఆ మీటింగులోని ఒకానొక అభ్యర్థియో, వోటరో

ఖాదీదుస్తులను ధరించడంలేదని తెలియవచ్చినప్పుడు, ఆయన ఆమనిషి నిత్యఖద్దరుధారి కాదని నిర్ణయించితీరాలి. అందుకు ప్రతికూలంగా ఆమనిషి ఎంతవాదించినా ప్రయోజనం లేదు.”

## జబ్బల్‌పురం తీర్మానం

“సమకుచేరిన ప్రశ్నలకు ప్రత్యుత్తరంగా వర్కింగుకమిటీవారు, కాంగ్రెసు కమిటీలో ఒక సభ్యుడుగాగానీ, లేక ఒక ఉద్యోగిగాగానీ యెన్నుకోబడడానికిపూర్వం ఆరునెలలనుండి ఖద్దరుధరిస్తూన్నట్లు ఋజువుచేయగలిగిన వ్యక్తి నిత్యఖద్దరుధారిగా భావింపబడవలెనని రాష్ట్రకాంగ్రెసు సంఘాలకు ఆదేశిస్తున్నారు.”

ఈ ఖాదీనియమం శాసనసభ్యులకు వర్తించినట్లుగానే, లోకల్‌బోర్డులలోనూ, మునిసిపాలిటీలలోనూ కాంగ్రెసు టిక్కెట్టుమీద పోటీచేసేవారందరికీకూడా వర్తిస్తుందని నిర్ణయించబడింది.

1939 లోని సంఘటనలనుగూర్చి ముగించేముందు రెండు చిన్న విషయాలను గూర్చి ముచ్చటించవలసిఉంది. వాటిలో ఒకటి 1939 జూలై 26 వ తేదీని జరిగిన వంగరాష్ట్ర కాంగ్రెసు సంఘ సమావేశం శాస్త్రసమ్మతమా కాదా అనే వివాదమును గూర్చినది. రాజేంద్రబాబు విచారణచేసి ఆ సమావేశం అశాస్త్రీయమని నిర్ణయించి వేశాడు. రెండోది కాంగ్రెసుసంస్థయొక్క నియమావళిని, క్రమశిక్షను మరింత బిగువు చేయడాన్నిగురించినది. ఈ ముఖ్యవిషయాన్ని నిర్ణయించడానికి రాష్ట్రకాంగ్రెసు సంఘాలకార్యదర్శుల మహాసభ ఒకటి ఆహ్వానింపబడింది. కాంగ్రెసు నియమావళిలో బ్రహ్మాండమైన మార్పులు చేయబడడంచేత రాష్ట్రకాంగ్రెసు సంఘాలుకూడా తమతమ నియమావళులలో అందు కనుగుణమైన సవరణలను కాంగ్రెసు వర్కింగుకమిటీవారి ఆమోదంతో చేయక తప్పిందికాదు. కేంద్రకాంగ్రెసు సంఘంతో రాష్ట్రకాంగ్రెసు సంఘాలు సజీవ సంబంధం కలిగి ఉండడం అవసరమయింది. నూతన నియమావళిలో ఉద్దేశింపబడిన ప్రకారం కాంగ్రెసు న్యాయ విచారణ సంఘాలు (tribunals) తక్షణం అమలులోకి వచ్చినవి. కార్యాలయ నిర్మాణం మంచి ఆదర్శప్రాయంగా చేయబడింది. లెక్కలు వ్రాయడం విషయంలోనూ, నియమావళిని సరిగా పాటించడం విషయంలోనూ ఈక్రింది ఉత్తరువులు జారీచేయబడినవి.

(ఎ) లెక్కలు తయారుచేయడానికి ఫలానానెలనుండి ఫలానా నెలవరకు ఒక ఆర్థిక సంవత్సరమని నిర్ణయించవలెను.

(బి) తమ అధీనములోనున్న పట్టణ, తాలూకా, జిల్లా కాంగ్రెసు సంఘాల లెక్కలను తనిఖీచేయడం, పరీక్షించడం, ఆడిటుచేయడం, విషయంలో రాష్ట్ర

కాంగ్రెసు సంఘాలు తగిన యేర్పాట్లు చేయవలెను. ప్రతి మూడు నెలలకు ఆయా అధీనసంఘాల బ్యాలన్సు షీట్లను క్రమంగా తెప్పించుకొంటూండవలెను. రాష్ట్రకాంగ్రెసు సంఘాలు ప్రతి సంవత్సర లెక్కలను ప్రచురిస్తూ ఉండవలెను. వాటినిబట్టి కేంద్రకాంగ్రెసు ఒక సమగ్రమైన నివేదికను ప్రచురించడానికి వీలవుతుంది.

(సి) ముందుగా నిర్ణీతకాలంలో తయారుచేయబడి ఆయాకమిటీలచేత అంగీకరింపబడి ఆమోదింపబడిన బడ్జెటులను అనుసరించి మాత్రమే సొమ్ము వెచ్చింపబడవలెను.

(డి) అన్ని వోచర్లు కమిటీ కార్యదర్శిద్వారా ఆయన ఆమోదమునుపొంది రావలెను.

(ఇ) సొమ్మంతా బ్యాంకులోనే ఉండవలెను.

(యఫ్) పర్మనెంటు అడ్వాన్సులు వగైరా వివరాలు.

(జి) రశీదులు, వోచర్లు.

(హెచ్) నిర్ణీతకాలాలలో పంపే నివేదికలు.

(ఐ) చిల్లర క్యాష్‌పుస్తకం, జర్నల్‌లు, లెడ్జర్లు, జీతాలరిజిష్టర్లు, పోస్టల్ అక్కౌంటు, నిలవసరుకు, పర్నిచరు రిజిష్టర్లు, యివన్నీ జాగ్రతగా వ్రాస్తూ ఉండవలెను.

1939 వ సంవత్సరం సగం గడిచింది. ముప్పాతికలో పడ్డాము. దూరాన రణదుందుభులు వినవస్తూన్నవి. సరిగా యీసమయంలోనే బొంబాయి, మద్యనిషేధ మహోద్యమాన్ని తలపెట్టింది.

ఆగష్టు ఒకటవ తేదీ బొంబాయిచరిత్రలో విస్మరింపరానిరోజు. ఆనాడు అత్యంతోత్సాహంతో బొంబాయినగరంలోనూ పరిసరప్రాంతాలలోనూ మద్యనిషేధం ప్రారంభించబడింది. ఆనాటి ఉత్సవాలలోఒకబ్రహ్మాండమైనఊరేగింపుజరిగింది. ఆ ఊరేగింపుముగిసిన తక్షణం బహిరంగ సభ జరిగింది. ఆ సభకు ఆ నాడు వచ్చినంత జనం ఇదివరకెక్కడ జరిగిన యేసభకూ ఎన్నడూరాలేదు. రెండుమూడు లక్షల జనమైనా వచ్చి, ఉంటారని అంచనా వేయబడింది. పొంగిపొరలిపోతూన్నఆజన సమూహాన్ని ఉద్దేశించి శ్రీవల్లభాయిపటేల్ యిలా ఉపన్యసించాడు. 'ఈశుభదినం కోసం ఎన్నాళ్లనుండియో ఒక్క బొంబాయినగరమేకాక యావద్భారతదేశమూ యెదురుచూస్తున్నది. ఈ రోజెప్పుడు వస్తుందా అని అఖిల ప్రపంచమూ నిరీక్షిస్తూన్నది. ఆరోజు రానేవచ్చింది. త్రాగుడు అనే ఘోరపిశాచముయొక్క బానిస బంధములనుండి ఈనాడు ఈదేశంలోని సమస్త ప్రజానీకము మోక్షం పొందినట్లుగా భావిస్తూన్నది. బొంబాయినగరం ఈనాడు పాతచరిత్రను చింపివేసి నూతనాధ్యాయమును ప్రారంభించింది.'

ఈ సంస్కరణకు అత్యధిక సంఖ్యాకులయిన ప్రముఖ పార్సీ సంఘంవారు ప్రతికూలంగా ఉన్నప్పటికీ ప్రజల ఆనందోత్సాహాలకు భంగం కలిగించడం యిష్టంలేక నిగ్రహంతో యేవిధమైన వ్యతిరేక ప్రదర్శనమూ చేయకుండా ఉన్నందుకు నిజంగా వారి నభినందించాలి. కొంతమంది పార్సీలు ఆ ఊరేగింపులోనూ బహిరంగ సభలోనూ కూడా పాల్గొన్నారు.

ఈ ఉద్యమం ప్రారంభించినందుకు ప్రధాని బి. జి. ఖేరుకూ మద్యనిషేధ మంత్రి డాక్టరు గిల్డరుకూ దేశంలోని అన్ని భాగాలనుండీ ప్రజా సమూహం హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములను అందజేసింది. ఈ సంస్కరణకు మూలవిరాట్టు మహాత్మాగాంధీ ఈక్రింది సందేశం పంపించాడు.

“బొంబాయి రాష్ట్రీయులకు మంచి విచక్షణజ్ఞానం ఉందని ప్రసిద్ధి. కాబట్టి బొంబాయి మంత్రివర్గం ధైర్యంతో ప్రారంభించిన ఈ సంస్కరణము విషయంలో సమయానికది అక్కరకు వస్తుందనీ, దీనిని తగినంత జయప్రదం చేయడానికి ప్రజలందరూ ఏకీభవిస్తారనీ నావిశ్వాసం. మత్తుకలిగించే త్రాగుడుపిశాచాన్ని రూపుమాపినందున దేశానికి శాశ్వత ప్రయోజనం కలుగుతుందని నాకు గట్టిగా నమ్మకముంది.”

మరొక ముఖ్య సంఘటనాన్ని యిక్కడ పేర్కొనాలి. అది శ్రీ జమ్నాలాల్ బజాజు విడుదల. వర్కింగుకమిటీ సభ్యుడున్నూ జయపూరు ప్రజామండలి అధ్యక్షుడున్నూ అయిన జమ్నాలాల్ బజాజు, జయపూరు రాజ్యంలో ప్రవేశించరాదనే ఉత్తరువును ఉల్లంఘించిన కారణంగా జరిగిన ఫిబ్రవరినెలలో అరెస్టుచేయబడిన సంగతి పాఠకులకు తెలిసేఉంటుంది. జయపూరులోనున్న క్షామబాధితుల సహాయార్థమాయన అక్కడకు వెళ్ళుతూండెను. ఆయన ధిక్కారమునుగూర్చి న్యాయవిచారణ జరుగలేదు. కాని కాలపరిమితిలేకుండా అధికారులాయనను డిటెన్షనులో ఉంచారు. డిటెన్షన్‌లో కలిగిన నిర్బంధాలవల్ల ఆరోగ్యంచెడిపోయి అనేక జబ్బులతో ఆయన బాధపడవలసివచ్చింది. స్థానిక వైద్యులకా జబ్బులను కుదర్చడం చేతకానందువలన, ఆయన చికిత్సనిమిత్తం విదేశాలకు పోయేయెడల విడుదల చేయబడునని జయపూరు రాజ్యాధికారులు తెలియచేశారు. ఈ షరతులకు లోబడి జయిలులోనుండి విడుదలకావడం ఆయనకిష్టంలేకపోయింది. కాని పీడాకరమైన డిటెన్షన్‌లో ఆరునెలలకుపైగాఉంచి, 1939, ఆగష్టు 9 వ తేదీని జయపూరు ప్రభుత్వం వారాయనను బేషరతుగా విడిచిపెట్టారు.

తన విడుదలనుగూర్చి చేసిన ఒకానొక పత్రికాప్రకటనములో ఆయన యిలా అన్నాడు. “మన పోరాటంయింకా పూర్తికాలేదు. జయపూరు సంస్థానోద్యమంలో

యిప్పటికి మొదటిఘట్టం గడిచింది. సత్యాగ్రహోద్యమం ప్రజలశక్తిసామర్థ్యాలను వారికెఱుక పఱచింది అవసరమైనప్పుడా ఆయుధాన్ని ఎలా ప్రయోగించాలో కూడా వారికిబోధించింది. చేసినత్యాగాలెప్పుడూ వృథాపోవు. మనలక్ష్యం పూర్వంకంటెకూడా మనకెక్కువ సన్నిహితమయుంది. కాని యిప్పుడుమనం కోరేవి కనీసకోర్కెలు. అవి మితవాదకోర్కెలను మించినకోర్కెలుకావు. అవి ఫలించేటంతవరకు మనం మన ఆందోళనను సాగించవలసిందే ”

ఈ సంవత్సరమంతా జాతీయశక్తులన్నీ కేంద్రీకృత సంఘటనంతో ఐక్యంగా పని చేయడానికిబదులు కావలసినంత ఆత్మపరీక్షతో, హృదయపరిశోధనలతో పరస్పర నిందారోపణలతో మామూలుగా కాలక్షేపం చేయవలసివచ్చింది. 1936 నుండీ కాంగ్రెసు సోషలిస్టుపక్షం పనిచేస్తూనే ఉంది. ఇండియాప్రభుత్వంవారు కమ్యూనిస్టు పార్టీ ఉనికినే నిషేధించినప్పటికీ, ఆపక్షంకూడా అంతకంతకు బయటపడి పనిచేస్తూ వచ్చింది. వీటికితోడు కిసానుపక్షంఒకటిఉంది దానిలో రెండుశాఖలేర్పడ్డవి. ఒకటి కమ్యూనిస్టుపార్టీ వంకకూ, రెండవది కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వంకకూ మొగ్గుతూ వచ్చినవి. ఈ శాఖావిభేదము ఓహారుసంయుక్త రాష్ట్రాలలో అంతకంతకు చాలా ఎక్కువగానూ వంగరాష్ట్రంలో కొంతవరకూ ప్రస్ఫుటమవుతూ వచ్చింది. వీరందఱినీ మించి రాజకీయరంగంలో యం. యన్. రాయిగారు ఒకరున్నారు. భారతరాజకీయ రుగ్మతలన్నిటికీ తాను సాంతవైద్య మొకదానిని సూచిస్తున్నారాయన. సుబాస్ బాబుచుట్టూ మూగిన వామపక్షీయులతోనిండిన ఫార్వర్డు బ్లాకు ఒకటి ఉంది. ఫార్వర్డుబ్లాకులో, సోషలిస్టులో, కమ్యూనిస్టులో, కిసానులో, రాయిస్టులో మాత్రమే ఉన్నారని చెప్పడానికి వీలులేదు. ఈ వర్గాలలో యే వర్గం వారికిగానీ పక్క వర్గంవారితో సానుభూతి ఉండితీరాలనీ లేదు. యే వర్గాని కావర్గమే, కాంగ్రెసు కార్యవర్గంవారిని ఎదుర్కోవలసి వచ్చినప్పుడుమాత్రం వారంతా ఒక్కటిగానే వ్యవహరిస్తుండేవారు. తదితర సందర్భాలలో విభిన్నవర్గాలుగానే వ్యవహరిస్తుండేవారు. వారిఐక్య సంఘటనం కూడా సహజ సమ్మేళనంగాకాక కృత్రిమ సంయోగంగా ఉండేది. కాబట్టి 1939 సెప్టెంబరు ఒకటో తేదీని ప్రారంభమైన యుద్ధంలో మూడోతేదీని బ్రిటను ఇండియాదేశాలు చిక్కుకొన్నప్పుడు ఇండియాలో అప్పటి పరిస్థితులను ఎదుర్కోవలసిన రాజకీయపక్షా లనేకంగాఉన్నవి. ప్రతిపక్షానికీ ఒక ప్రత్యేక కార్యక్రమంవుంది. కాని అన్ని పక్షాలవారూ యుద్ధ ప్రతికూల కార్యక్రమాన్ని కొనసాగించడంలో ఏకీభవించారు. అయితే కాంగ్రెసు క్రమేణా జాగరూకతతో తీసుకొంటూవచ్చిన యుద్ధవ్యతిరేక చర్యలవల్ల ఆమహాసంస్థ

బ్రిటనుకు ప్రతికూలం కాదనీ, బ్రిటనుతో రాజీపడే ప్రయత్నాలు చేస్తూన్నదనీ, దాదాపు రాజీ పరిష్కారమయ్యే స్థితిలో ఉందనీ, నిందారోపణలు చేయబడ్డవి. ఈ నిందలకేమీ ఆస్కారంలేదు. ఈలోగా వంగరాష్ట్ర కాంగ్రెసు సంఘం వ్యవహారాలలో కొన్ని చిక్కులు వచ్చినవి. 1939 జూలై 26 వ తేదీన వంగ రాష్ట్ర కాంగ్రెసుసంఘం వారు నిర్వర్తించిన కార్యకలాపం విషయంలో, ఆ సంఘముయొక్క అధ్యక్షుడుగా సుభాసబాబు నిర్వహించిన పాత్రనుబట్టి, ఆయనమీద వంగ రాష్ట్ర కార్యవర్గంవారు తీసుకొన్న చర్యనుగూర్చిన్నీ రాష్ట్రీయ ఎన్నికల కోర్టు (Election tribunal) నియామకమునుగూర్చిన్నీ తన అభిప్రాయాలను తెలియచేయవలసిందిగా 1939 ఆగష్టు 10 వ తేదీని వంగరాష్ట్ర కాంగ్రెసుసంఘంవారిని అఖిల కాంగ్రెసు సంఘంవారి తాఖీదు పంపింది. వంగరాష్ట్ర కాంగ్రెసుసంఘంవారి తీర్మానంలోని ఉద్దేశపూర్వకమైన ధోరణినీ కాఠిన్యమునేగాక అందులోని విషయాలనుగూడ వర్కింగుకమిటీవారు విచారణీయంగా గమనించారు. ఆ తీర్మానములోని విషయాలెంతమాత్రమూ రాష్ట్ర కాంగ్రెసు సంఘముయొక్క గౌరవానికి తగినట్లుగా లేవనికూడా వర్కింగుకమిటీవారి నిశ్చలాభిప్రాయం. స్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్న సమయంలో ఆ స్వాతంత్ర్యసమరం ప్రపంచ సంగ్రామ ప్రారంభ కారణంగా విరమింపబడవలసినప్పుడు, శాంతిభద్రతలుకల వాతావరణం ఉండడం ముఖ్యావసరం. కాని అటువంటి వాతావరణమే అప్పుడు ఇండియాలో కొఱవడ్డది. అన్ని పరిస్థితులనూ సమగ్రంగా విచారించడానికి 1939 సెప్టెంబరు రెండవ వారంలో కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశం జరిగింది. (1939 ఏప్రిల్) కలకత్తాలో ఘటిల్లించిన క్లిష్టపరిస్థితితరువాత నెహ్రూ వర్కింగుకమిటీలో చేరలేదు. కాని ఆసభకు ఆయన ఆహుతుడైకూడా మార్షల్ చియాంగ్ కై షేకును చూడడానికి చైనా వెళ్ళిన కారణాన హాజరు కాలేకపోయినాడు. కాని సెప్టెంబరు 10 వ తేదీకి వార్ధాకుచేరుకొని వర్కింగుకమిటీచర్చలలో పాల్గొన్నాడు. ఈ సందర్భంలో ముస్లింలీగు అధ్యక్షుడు మహమ్మదాలీ జిన్నాకూడా వర్కింగుకమిటీ చర్చలలో పాల్గొనడానికి ఆహ్వానింపబడ్డాడు. గాని తన కార్యక్రమం మిదివరకే స్థిరపడి ఉన్నందున తాను వార్ధాకు రాజాలననీ, ముస్లింలీగు వర్కింగుకమిటీ సమావేశానికి 13 వ తేదీ ఢిల్లీకివెళ్ళినప్పుడు రాజేంద్రబాబుతో పరిస్థితులను సంతోషపూర్వకంగా చర్చించగలననీ ఆయన సమాధానం పంపినాడు. యుద్ధం సాగుతూన్న ఆ సమయంలో ఇండియా కర్తవ్యమును గూర్చి అయిదురోజులు ఆందోళనాపూరిత హృదయాలతో వర్కింగుకమిటీ సభ్యులు సమాలోచనలుచేశారు. రాజప్రతినిధి అంతకుపూర్వమే గాంధీని ఆహ్వానించి దీర్ఘంగా సంభాషించాడు.

# ౬ యుద్ధ ప్రారంభం

## [ సెప్టెంబరు 1939 ]

కడచిన 12 సంవత్సరాలనుండీ రెండవ ప్రపంచ సంగ్రామం ఎప్పుడో ఒకప్పుడు ఆకస్మికంగా ప్రారంభం కావచ్చునని కాంగ్రెసు అనుకొంటూ ఉండడంచేత, బ్రిటనుకు ధనరూపేణాకాని, మనుష్యుల రూపేణాకానీ, ఆయుధముల రూపేణాకానీ ఇండియా సహాయపడరాదని ప్రబోధిస్తూవచ్చింది. చిట్టచివరకు చిరకాలంనుండీ అనుకొంటూన్న యుద్ధం 1939 సెప్టెంబరు ఒకటో తేదీని రానేవచ్చింది. మూడవ సెప్టెంబరు తేదీని ఇండియా యుద్ధంలో ప్రవేశించినట్లుగా ప్రకటన జరిగింది. 1914-18 సంవత్సరాలలో జరిగిన యుద్ధానికీ, యిప్పుడు జరుగుతూన్న రెండవ యుద్ధానికీ పరిస్థితులలోనూ యుద్ధరీతిలోనూ పూర్తిగా భేదమున్నట్లు మొదటినుండీ స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఈ యుద్ధం మనుష్యులుద్వారా జరుగుతూన్న యుద్ధం కాదనీ యంత్రాలవల్ల జరుగుతూన్న యుద్ధమనీ మొట్టమొదట గ్రహించాలి. అందువల్ల ఈ యుద్ధంలో ప్రాణనష్టంకంటె ఆస్తినష్టం ఎక్కువగా ఉంటుంది. కొంతవరకిది సంతోషించదగిన విషయమే. వేలకొలదీ విమానాలువచ్చి ఒక్కసారిగా టన్నులకొలదీ బరువుగల బాంబులను వేస్తూన్నప్పుడు కలిగే వినాశనాన్ని పరికిస్తే కాలరుద్రుని ప్రళయతాండవం స్మరణకువస్తుంది భూమిమీద యుద్ధం జరుగుతూన్నా కందకాలక్కరలేదు సముద్రంలో సంగ్రామం నడుస్తూన్నా జలాంతర్గాములవసరం. ఆకాశంమీద సంకుల సమరం నడుస్తూన్నా, విమాన విధ్వంసక ఫిరంగు లనావశ్యకం. కందకాలు, జలాంతర్గాములు విధ్వంసక ఫిరంగులూకూడా ఉన్నవి. కాని అవన్నీ పాతపడిపోయిన సరుకు. అయితే బొత్తిగా పనికిరాకుండా పోలేదు. వీటన్నిటినీకూడా ఒక్కొక్క నూతన ఆయుధం అతిక్రమించింది కందకాలలో ఒకచోట చలనంలేకుండా జరుగవలసిన యుద్ధం, ఒకచోటనుండి మఱియొకచోటకు కదలిపోయే సంచలయుద్ధంగా మారింది దొంగతనంగావచ్చే జలాంతర్గాములు ఆకాశంమీదనుండిపడే బాంబులకు చోటిచ్చినవి. విమాన విధ్వంసక ఫిరంగులు కేవలం ప్రజలలో విశ్వాసమును కల్పించేటందుకుతప్ప విమానములను పడగొట్టడానికి పనికిరాకుండా పోయినవి. సంగ్రామ విమానములు వాటి స్థానము నాక్రమించినవి. విద్యుచ్ఛక్తితో నడపబడే గడియారం వలె ప్రతి అరగంటకూ క్రమంగా వార్తలను ప్రసారం చేయగల రేడియో ఈ యుద్ధంలో కనిపెట్టబడిన సరికొత్త పరికరం. దీనిద్వారా వార్తలకోసం ఎదురుచూస్తూన్న ప్రజానీకముయొక్క విగతనైతికబలము

పునరుద్ధరింపబడటం కొరవడని నైతికబలం కలవారు మరింత బలిష్టం కావడమూ తటస్థిస్తుంది. ఎన్నడూ ఆచరణలోకి రావడానికి వీలులేని ఆదర్శాలను ఉపన్యాసాలలో స్థాపిస్తూండడమూ, ఎప్పుడూ అతిక్రమించి జరగడానికి వీలులేని పరాగతాలను వర్ణిస్తూడటం, క్రియాసాధ్యం కాని దండయాత్రలకు ఎత్తులు వేస్తూండడం ఈ పరికరముయొక్క నిత్యకృత్యాలు. ఇందుకోసం ఎవరుముందుగా ఈ రేడియోవార్తలు వింటారోఅని జనం పోటాపోటీ పడుతూండడం మామూలయిపోయింది. ఇంగ్లాండుదేశపు రాజుగారి రేడియోఉపన్యాసం మొట్టమొదట వినిపించింది. తరువాత రాజప్రతినిధి వుపన్యాసం వినిపించింది. రెండుమూడురోజులపాటూ అప్పుడప్పుడూ ఈ రెండు ఉపన్యాసాలు వినిపిస్తూనే వచ్చినవి. అసలుసంగతి యేమిటో తెలుసుకొందామనే కోరికగల అనేకమంది ప్రజలు, యుద్ధంలోకి బలవంతంగా యీడ్వబడిన ఇండియాయొక్క స్వాతంత్ర్యమునుగూర్చి ఈ ఉపన్యాసాలలో యే మూలనైనా ఒక్కమాటయినా ఉన్నదా అని గుచ్చి గుచ్చి విచారించడం ప్రారంభించారు. కాని ఎలా ఉంటుంది? నీళ్లుమోసేవాళ్ళకూ, కట్టెలు కొట్టుకొనేవాళ్లకూ రాజస్థానములలో ఎక్కడయినా చోటు ఉంటుందా? బానిసకు సింహాసనంపైన ఆసీనుడు కావడానికి అర్హత ఉంటుందా? మహామహులందరూ ఒకరితరువాత ఒకరు ప్రసంగించడం ప్రారంభించారు. ముందురాజుగారు; తరువాత రాజప్రతినిధి, పిమ్మట గవర్నర్లు, భారత రాజ్యాంగ కార్యదర్శి, ఇంగ్లాండు ప్రధాని, ఇండియాకు మాజీ రాజప్రతినిధిగానైన ఇంగ్లాండు విదేశాంగ శాఖామంత్రి ఈ అందరూ ప్రసంగించారు. ఇండియా, అమెరికా, దక్షిణఆఫ్రికా, ఈ అన్నిదేశాలూకూడా మాట్లాడినవి. వీరందరినీ మించిన రాజకీయ ధురంధరుడు తత్వజ్ఞాని జనరల్ స్మట్సుకూడా ప్రసంగించాడు. కాని ఈ తత్వజ్ఞానులు, ఈరాజకీయ ధురంధరులు రాజ్యాంగ విశారదులు, రాజనీతి చతురులు, గవర్నరులు, రాయబారులు- వీరెవ్వరూకూడా ఇండియానుగూర్చి ఒక్కమాటయిన అనలేదు. అయిదు అక్షరాలుకల ఆపేరునుకూడా ఎక్కడా స్పష్టంగా ఉచ్చరించలేదు. ఈ సందర్భంలో ఇండియా కర్తవ్యమేమిటి? ఈ యుద్ధంలో ఇండియా యెటువంటి పాత్రను నిర్వహించవలెను? తనను సంబంధించని కార్యంలో తన పతాకాన్ని అధఃపతితం చేసిన పతాకంకింద, తన నాయకులతో సంప్రతించని నాయకుల యాజమాన్యమున, ఇండియా నేకరించగల నైతికోత్సాహంకానీ భౌతికసహాయంకానీ యేపాటిది? యుద్ధంప్రారంభమయినవెంటనే ఇండియాలోని పదకొండురాష్ట్రాలూ రాష్ట్రీయ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ ఉన్నవి. ఇండియా యుద్ధంలో భాగస్వామిగా చేర్చబడుతూన్న సంగతి యేఒక్కరాష్ట్రంతోనూ యెవ్వరూసంప్రతించలేదు. భారతశాసనసభలో తగినంతమంది

ఎన్నికసభ్యులున్నారు. వారినికూడా యిటువంటి తీవ్రమైన చర్యతీసుకోనేముందు యెవ్వరూ ఆలోచించలేదు. 1938 వ సంవత్సరంలో ఇండియా కేంద్రశాసనసభలో బడ్జెటుచర్చ జరుగుతూన్న సమయంలో ఆసభకు తెలియపరచకుండా యెన్నడూ ఇండియా సైన్యాలు విదేశాలకు పంపబడవని ఇండియా ప్రభుత్వంవారు స్పష్టంగా వాగ్దానం చేశారు. కాని యుద్ధం ప్రారంభించడానికి పూర్వం చాలాకాలం కిందటనే భారతదేశసైన్యాలు ఈజిప్టుకు, సింగపూరుకూ పంపబడడమే కాక, ఇండియా సరిహద్దుల ఉత్తరాన ఉన్న కొండలనీ, తూర్పు, పడమర, దక్షిణాన ఉన్న సముద్రమునీ మాత్రమే భావించక ఇండియాకు ఒకపక్క మధ్యధరాసముద్రంలో ఎక్కడో ఒకచోటనూ, మరొకపక్క సింగపూరులోనూ సరిహద్దులు ఉన్నట్లుగా అనుకోవలెనని బ్రిటిషు అధికారులు వాదించడం మొదలుపెట్టారు. "గడ్డపలుగులు గాలికి కొట్టుకుపోతూంటే గడ్డిపోచల గతేమిటో?" అన్నట్లు స్వతంత్రదేశాలకే గతిలేకపోతే ఇండియాకు జరిగిన అన్యాయాన్ని ఆలించేదెవరు ? పాలించేవెవరు ? ఇండియా అంటే ఏమిటి ? అంతులేని ఆహారపదార్థాలకు పుట్టినిల్లు. కావలసినన్ని ముడిసరుకులను సరఫరాచేయగల విపణివీధి. ఇతరులకోసం యుద్ధం చేయడానికి ఎంతమందినైనా కానిసయోధులను పంపించి తన నెత్తినెక్కి తొక్కుతూన్న విదేశీపాలకుల స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి ప్రాణు కొనే పరాధీనజాతి! దాస్యానికీ నీచత్వానికీ పుట్టినిల్లు. "జోహుకుములకు" "హుకుంకే తాబేదారులకూ" జన్మభూమి. తనస్వాతంత్ర్యాన్ని విధ్వంసంచేసి తనప్రజలనుదోచుకొనితింటూన్న వాళ్ళకు తన గౌరవాన్నికూడా అమ్ముకొనే అభాగ్యురాలు. పాదుషా సింహాసనాలకడనూ చక్రవర్తుల పర్యంకముల సమీపముననూ పాదపీఠముగా ఉపయోగపడుతూన్న దురదృష్టదేశం. అందువల్ల అధినివేశరాజ్యాలను సంప్రతించినట్లుగా ఇండియాను ఎవ్వరు ఎన్నడూ సంప్రతించలేదు. కాని గాంధీతో సంభాషించే నిమిత్తము రాజప్రతినిధి ఆయనను ఆహ్వానించాడు. దక్షిణఆఫ్రికా యూనియను ఒక వోటు మెజారిటీతో యుద్ధంలో పాల్గొనవలెనని నిర్ణయించింది. ఐర్లండు ఫ్రీస్టేటు తటస్థంగా ఉండడానికి నిశ్చయించుకొంది. గాంధీజీ రాజప్రతినిధి దగ్గరకు వెళ్ళడం భారతదేశం ఈ యుద్ధంలో ఫలానా విధంగా ప్రవర్తించదలచుకొన్నదని చెప్పడానికికాదు. రాజప్రతినిధి గాంధీని పిలవనంపిందికూడా అందుకుకాదు. గాంధీకి అటువంటి అధికారమూ లేదు. ఆయన రాజప్రతినిధికడకువెళ్లి యుద్ధంలో తనకుగల వ్యక్తిగత సానుభూతిని వెల్లడించి సహాకరిస్తానని చెప్పినాడు. కాంగ్రెసు తన అభిప్రాయాన్ని ప్రత్యేకం చెప్పవలసి ఉంటుందని కూడా ఆయన అప్పుడే అన్నాడు. వెస్టుమినిస్టరుయాబీ, పార్లమెంటుహౌస్ సెంటుపాల్సుకెథిడ్రలులవంటి తొలినాటి చరిత్ర ప్రసిద్ధ నిర్మాణములు

పైన శత్రువిమానవళులు బాంబులను వర్షింప చేస్తున్న దృశ్యాన్ని తలచుకొన్నప్పుడు గుండె జలదరిస్తూన్నదని గాంధీజీ రాజప్రతినిధితో సంభాషించేటప్పుడు తన మనో వైకల్యాన్ని వెల్లడించారు. ఇంగ్లండుకే జయం సహాయపరిస్తానని చెప్పింది. కాని ఆ సహా కారం కేవలం నైతిక సహకారం మాత్రమే. తరువాత కొద్దిరోజులాని వర్కింగుకమిటీ వార్ధాలో సమావేశమై యుద్ధసమస్యనుగురించి చారిత్రిక నిర్ణయం చేసింది. వర్కింగు కమిటీచేసిన తీర్మానం తొందరపడి అనాలోచితంగా చేయబడింది కాదు.

కాంగ్రెసు 1927 సంవత్సరం నుండి యుద్ధపరిస్థితులనుగూర్చి మహాసభలలోనూ కమిటీలలోనూ గూడా దీని దృష్టిలో ఉంచుకొని అవసరమైనప్పుడు తీర్మానాలు చేస్తూనేవచ్చింది. ఈ 12 సంవత్సరాలలోనూ ఒక్కొక్కసారి ఒక్కొక్కవిధంగా ప్రపంచ పరిస్థితులు మారినా అంచనా వేస్తూన్న సంగతి కాంగ్రెసు వర్కింగు కమిటీ గమనిస్తూనే ఉంది. 1938 ఆగష్టు నెలలోనే 1939 నాటి పరిస్థితులు దాదాపు సమీపించినవి. అయితే 1939 సెప్టెంబరు మూడవ తేదీనాటి పరిస్థితుల కనుగుణంగా యుద్ధసమస్యలను గూర్చి కొత్తగా పునరాలోచనచేయడం విధి. నిజంగా యుద్ధం ప్రారంభం కాకముందే ఇండియా యూరోపుదేశాల రాజకీయాకాశములలో సంగ్రామచిహ్నాలు స్పష్టంగా కనపడుతూవచ్చినవి. 1939 ఆగష్టు రెండవ వారంలో అంతర్జాతీయ పరిస్థితులు చాలా క్లిష్టదశకు రావడమేగాక ప్రపంచమునకు యుద్ధాపాయం తప్పదనిపించింది. ఒకప్రక్క ప్రజాస్వామ్యమునకూ, స్వాతంత్ర్యమునకూ నిల బడ్డ దేశాలున్నూ మరొకప్రక్క ఫాసిస్టు ధృక్పథంతో దురాక్రమణకు పాల్ప డుతూన్న దేశాలున్నూ ఎదురుపడ్డవి. ఈ యిరుపక్షములలోనూ కాంగ్రెసుకు మొదటి పక్షంతో సానుభూతి ఉంది. కాని, యుద్ధమే తటస్థించేయెడల కాంగ్రెసు నిర్వర్తించవలసిన కర్తవ్యమునుగూర్చి ఇదివరకే విస్పష్టంచేయబడింది. ఇండియాను బలవంతంగా యుద్ధంలోకి దింపడానికి కాంగ్రెసు ఎంతమాత్రమూ సహించదని యిది వరకే ఆమహాసంస్థ తీర్మానించింది. యుద్ధం యింకా మూడు వారాలలో ప్రారంభ మవుతుందనగా ఆగష్టు రెండవ వారంలో కాంగ్రెసు పైనఉదహరింపబడిన నిర్ణయానికే కట్టుబడి ఉంటుందనీ, సామ్రాజ్యవాద ప్రయోజనాలకోసం, ఇండియా సాధన సంపత్తి వినియోగపడకుండా నిరోధించడానికి ఆ నిర్ణయాన్ని ఆచరణలోకి తేగలదని కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానించింది.

[బులెటిన్ 4. ది 7-9-39 పుట 8. తీర్మానం 8.]

1939 మే ఒకటో తేదీని కలకత్తాలో సమావేశమైన అ. భా. కాం. సం. కాంగ్రెసుయొక్క సామ్రాజ్యవాద యుద్ధ ప్రతికూల విధానాన్ని పునరుద్ఘాటించి

భారత సైన్యాలను పరాయి దేశాలకు పంపకూడదని ప్రకటించినప్పటికీ భారతీయ ప్రజాభీష్టమునకు వ్యతిరేకముగా బ్రిటిష్ ప్రభుత్వంవారు ఇండియాదేశపు సైన్యాలను ఈజిప్టు, సింగపూరులకు పంపించిగాని, పంపిస్తూగానీ, ఉండడంవల్ల, క్లిష్టపరిస్థితులు తట స్థించినట్లు కాంగ్రెసు గమనించింది. అంతేకాదు; యుద్ధ పరిస్థితులమాట అలాఉండగా తమ అంగీకారంలేకుండా భారత సైన్యాలను బయటకు పంపకూడదని ఇండియా శాసన సభ యింతకుపూర్వం ఒకసారి తీర్మానించింది కాని బ్రిటిష్ గవర్నమెంటువారు కాంగ్రెసుయొక్కయూ కేంద్ర శాసనసభయొక్కయూ ప్రకటనలను సగకుగొనక, ఇండియాను తప్పకుండా యుద్ధంలోకి దించడానికి తగినట్లు వ్యవహరిస్తూన్నమాట వాస్తవము. ప్రజాభిప్రాయాన్ని యింత నిర్మొగమాటంగానూ, నిర్లజ్జగానూ తృణీకరిస్తూన్న బ్రిటిష్ ప్రభుత్వచర్యలకు ప్రతీకారంగా, రాబోయే కేంద్ర శాసనసభ్యులాసభకు హాజరు కాకూడదని కాంగ్రెసు వర్కింగుకమిటీ ఆదేశించింది. అంతేకాక, బ్రిటను యొక్క యుద్ధసన్నాహాలకు యే విధంగానూ, రాష్ట్ర ప్రభుత్వాలు మంత్రులు రాజీనామా యియ్యవలసి వచ్చినప్పటికీకూడా సహాయపడరాదని ఆ వర్కింగుకమిటీయే నిర్ణయించింది.

1939 ఆగష్టు 24 వ తేదీని రష్యా జర్మన్ ఒడంబడిక సంతకం అయింది. పోలాండు బ్రిటను దేశాలమధ్య పరస్పర సహకార సంధి జరిగినట్లుగా బ్రిటిష్ విదేశ రాజ్యాంగశాఖవారు ఆగస్టు 25 వ తేదీని అధికారరీత్యా ప్రకటించారు. ఇందువలన రాజకీయ సంఘటనలతివేగంగా తటస్థిస్తూన్న సంగతి విదితమయింది. పోలాండు బ్రిటన్ దేశాలమధ్య జరిగిన పరస్పర సహకార సంధి ఫలితంగా పోలాండులోనుండి జర్మన్ సైన్యాలనన్నిటినీ తక్షణం ఉపసంహరించుకొని, పోలాండు దురాక్రమణను పూర్తిగా విరమించుకొంటూ, బ్రిటనుకు సంతృప్తికరమైన హామీలను జర్మను ప్రభుత్వం ఈయని యెడల బ్రిటను 1939 సెప్టెంబరు మూడో తేదీని ఉదయం 11 గంటలనుండి (G. M. T.) జర్మనీతో యుద్ధం చేస్తూన్నట్లుగా భావించవలెనని బ్రిటిష్‌ప్రభుత్వం ప్రకటన చేయక తప్పిందికాదు. జర్మనీనుండి తాము కోరిన హామీ రానందున బ్రిటన్ జర్మనీపైన యుద్ధం ప్రకటించినట్లుగా ఆ రోజునే బ్రిటిష్ ప్రధాని ఛేంబర్లేన్ ప్రపంచానికి వెల్లడిచేశాడు. "ఇది మనకిందరికీ చాలా దుర్దినం. ఇంతకంటె ఎక్కువ దురదృష్టపురోజు నేనెఱుగను. ఇంతవరకు నా ప్రజా జీవితంలో నేను చేసిన కృషి, నేను పడ్డ శ్రమ, నేను నమ్మినదీ, నేనభిలషించినదీ అంతా నేటితో పటాపంచలై పోయింది. ఈ యుద్ధంలో విజయం పొందేటందుకు కావలసిన యావచ్ఛక్తినీ ధార పోయడమే నాకు మిగిలినది. నేను ముందేపాత్రను నిర్వహించడానికి నాకవకాశం

కల్పించబడుతుందో నాకు తెలియడంలేదు. కాని హిట్లరిజం నాశనమై, ఐరోపా ఖండంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పునరుద్ధరింపబడేవరకూ నేను, సజీవంగా ఉంటాననే విశ్వాసంమాత్రం నాకుంది" కామన్సు మహాసభలో చేయబడిన ఈ ఉపన్యాసంలోని ప్రతిమాట ఎంతో అర్థవంతంగా ఉందో పరిశీలించవలసి ఉంది. పాపం ఎందువల్లనో ఆయన ఈ సందర్భంలో ఏ పాత్రను నిర్వహించడానికి సావకాశం కల్పింపబడుతుందో అని సందేహించాడు. అలాగే యుద్ధం ప్రారంభమైన ఏడాదిలోనే ఆయన రాజీనామా ఇయ్యవలసివచ్చింది. ఆ స్థానాన్ని చర్చిల్ ఆక్రమించాడు. సుభిక్షమైన ప్రపంచాన్ని చూడవలెననే కోర్కె ఆయనకు చాలా ఉండేది. కాని హిట్లరిజం అణగిపోయే లోగానే ఆయన మరణించాడు. కాని స్వేచ్ఛా స్వాతంత్ర్యములతో పునరుద్ధరింపబడిన యూరోపుఖండపు పునర్నిర్మాణమే ఆయన ఆశయం. భారతదేశ సమస్యకు విషమస్థితి అక్కడనే ఉంది.

సెప్టెంబరు మూడో తేదీన ఘనత వహించిన చక్రవర్తిగారు తన సామ్రాజ్యంలోని దేశాలన్నిటికీ ఒక సందేశాన్ని రేడియోద్వారా ప్రసారంచేశారు. అంతర్జాతీయ సంఘాలనూ వాగ్దానాలనూ అన్నిటినీ ధిక్కరించి యితర రాజ్యాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను భగ్నపరచే బల ప్రదర్శనంతో భయపెడుతూగానీ, నిజంగా బల ప్రయోగంచేస్తూగానీ ఉన్న ఒకానొక దేశంయొక్క స్వార్థ పరత్వాన్ని నిరసించాడాయన తన సందేశంలో. బలంగలవాడిదే న్యాయం అనే సిద్ధాంతంపై ఆధారపడిఉన్న ఆ విధానము ప్రపంచంలో ఒక్కసారి స్థాపించబడినయెడల, అది బ్రిటనుయొక్కయు బ్రిటిష్ కామనువెల్తుయొక్కయు స్వాతంత్ర్యానికి హాని కలిగిస్తుందని ఆయన అన్నారు. అంతేకాదు "ఇంతకంటెకూడా ఎక్కువ అపాయం కలుగుతుంది. యావత్ప్రపంచ ప్రజానీకమూ భయభ్రాంతులై పరాధీనులవుతారు. ప్రపంచంలో న్యాయధర్మాలూ, శాంతి భద్రతలూ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, అనే మాటలకు తిలోదకాలీయవలసి వస్తుంది" అన్నాడాయన. తరువాత రాజప్రతినిధి ప్రకటనలో ప్రపంచానికి వచ్చిన ఆపత్తును వెల్లడిస్తూ, బలప్రయోగంవలన సాగించే పరిపాలనకు ప్రతికూలంగా ఇండియా మానవ స్వాతంత్ర్య రక్షణకోసం పోరాడగలదని తన విశ్వాసాన్ని ఉద్ఘాటించాడు. రాజప్రతినిధి యింకా యిలాఅన్నాడు "మనం పరిష్కరించవలసిన సమస్యలు స్పష్టంగా కనిపిస్తూనేఉన్నవి. మానవభవిష్యత్తుకు అవసరమైన ముఖ్యసిద్ధాంతాలనూ, అంతర్జాతీయ నైతిక సూత్రాలనూ, జాతికీజాతికీ మధ్యకలిగే తగాదాలనూ, దౌర్జన్యంతో గాక న్యాయసమ్మతంగా పరిష్కరించుకోవలెననీ, మానవ వ్యవహారములలో, న్యాయ స్వత్వాలతో నిమిత్తంలేకుండా, మృగములవలె బలిష్ఠులయిన వారి యిష్టం సాగి

పోనీయకూడదనీ" - మనం పరిష్కరించవలసిన సమస్యలుగా వైస్రాయి విస్పష్టం చేశాడు. "బలవంతంగా దౌర్జన్యంతో చేసే పరిపాలనకు ప్రతికూలంగా ఇండియా మానవ స్వాతంత్ర్యంకోసం పోరాడుతుందనీ, ప్రపంచ నాగరిక చరిత్రలో ఉత్కృష్ట స్థానంగల జాతులలో తన గౌరవానికి తగినట్లు ఇండియా తన పాత్రను నిర్వహిస్తుందనీ, విశ్వసిస్తూ న్నాను" అన్నాడు వైస్రాయి. ఎంత హాస్యాస్పదము? ఒక బానిస యితర జాతులను కూడా బానిసలుగా తయారుచేసే ఉత్తమ పాత్ర-లేక-ఇతర జాతులకు మోక్షమిప్పించి ప్రపంచ జాతులలో తానుమాత్రం అనామకజాతిగా వరిల్లే పాత్ర-ఏమనాలి వైస్రాయి మాట్లాడిన ఈ మాటలను? ఇంతకంటె బాధాకరములైన మాటలు భారతీయులు విని ఉంటారా?

రాజప్రతినిధి మొట్టమొదట చేసిన పని గాంధీజీని సిమ్లాకు ఆహ్వానించడం. వారి రువురి సంభాషణలను గాంధీగారి వాక్యాలలో వ్రాయడం మంచిది.

"ఈ విషయంలో వర్కింగు కమిటీవారు నన్ను ఫలానావిధంగా ప్రవర్తించమని చెప్పలేదనే విషయం నాకు తెలుసు. తంతిద్వారా వచ్చిన అహ్వానాన్ని అంగీకరించి నాకందిన మొదటి రైలులో ప్రయాణంచేశాను. అణచుకొందామన్నా అణగిపోక ఆపాద మస్తకం వ్యాపించిన నా అహింసతో, నేను జాతీయ హృదయాన్ని సరిగా ప్రతిబింబిం పచేయలేననికూడా నేనెఱుగుదును. ఒకవేళ నేనందుకు ప్రయత్నించినా నవ్వులాట్లు కావడమేకాని లాభంలేదు. ఈ సంగతి నేను రాజప్రతినిధికి మనవిచేశాను. కాబట్టి నాతో రాయబారం నడపడం, రాజీచేసుకోవడం అనేమాట అసలుకోవడానికే వీలులేదు. ఆయన నాతో రాయబారం చేయడానికి రమ్మన్నట్లుగూడా నేనర్థం చేసుకోలేదు. నేను వైస్రాయి భవనంనుండి వట్టిచేతులతో వచ్చాను. రహస్యంగా గానీ బహిరంగం గాగానీ, నామధ్య ఆయనమధ్య ఏవిధమైన రాజీ జరుగలేదు. ఏదైనా రాజీ జరగడమే ఉంటే ఆ రాజీ ప్రభుత్వంమధ్య కాంగ్రెసుమధ్య జరగాలి.

"నాస్థితీ, కాంగ్రెసుస్థితీ. స్పష్టంగా వైస్రాయికి తెలియచెప్పినతరువాత, కేవలం మానవ హితైషిగా నాసానుభూతి ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాలమీదనే ఉన్నదని రాజ ప్రతినిధికి స్పష్టీకరించాను. ఇంతవరకు దుర్గమంగా భావింపబడుతూన్న లండను నగరం యొక్క వినాశనాన్ని తలచుకొన్నప్పుడు ఒళ్ళు జలదరిస్తూన్నదన్నాను. పార్లమెంటు భవనమూ, వెస్టుమినిస్టరు యాబీనీ, అవి విధ్వంసం చేయబడనున్న దృశ్యమునూ వైస్రాయి ముందు వర్ణిస్తూన్నప్పుడు నాకు పట్టరాని దుఃఖంవచ్చింది. నేను దానిని అపు కోలేకపోయినాను. ఇటువంటి దురాగతాలను జరుగనిస్తూన్నందుకు నాఅంతరంగంలో

సాహూ దైవానికీ నిరంతర కలహం జరుగుతూన్నది. నా అహింస బాహాపు నిర్వీర్యమై పోయిందనుకొన్నాను. కాని ప్రతిరోజూ జరిగే ఈనిత్య పోరాటంలో, దేవుడు కాని అహింస కానీ, దుర్బలులు కాగనీ, మనుష్యులలోనే దౌర్బల్యం ఉందనీ చిట్ట చివరకు తేలుతూ ఉంది. నేను నా ప్రయత్నంలో పరాజయం పొందినప్పటికీ విశ్వాసంతో కృషి చేయాలి.

“రానున్న తీవ్రవేదనను ముందుగానే గమనించానా అన్నట్లు 23 వ జులైని అబటాబాదునుండి హెర్ హిట్లరుకు ఈదిగువ ఉత్తరాన్ని పంపించాను.

‘మానవ హితైషులైన స్నేహితులు నన్ను ఉత్తరం నీకు వ్రాయవలసిందని ప్రోత్సహిస్తూన్నారు. కాని నేను నీకు ఉత్తరం వ్రాయడం అహంకారమనిపించుకొంటుందేమోనని వారి కోరికను నేనిన్నాళ్లు మన్నించలేదు. కాని ఇంక నేను మీనమేషాలు లెక్కపెడుతూ కూచోకూడదనీ, దానికెంత విలువ ఉన్నప్పటికీ నేను నా విజ్ఞప్తిని నీకు తెలియపఱచితీరాలనీ, నా మనస్సులో ఏదో ఒక సంకల్పం కలిగింది.

‘మానవ సమాజాన్ని రాక్షసస్థితికిదింపే మహాసంగ్రామమును ఆపగలవాడవీప్రపంచంలో నేడు నీవొక్కడవేనన్నమాట కేవలం నిజం. నీకెంత విలువగలదిగా యిది కనిపించినప్పటికీ దీనికింత మూల్యమూ నీవు చెల్లించవలసిందేనా? యుద్ధ విధానమును బుద్ధిపూర్వకంగా త్యజించి కొంతవఱకు విజయంపొందిన వీరి విజ్ఞప్తిని నీ వాలకించవా? ఏమైతేనేమి? నేను నీకు వ్రాయడంలో యేదైనాతప్పిదంచేసి ఉంటే నీవు నన్ను క్షమిస్తావని తలుస్తూన్నాను.

“ఇప్పుడైనానరేజర్మన్ ప్రజా సామాన్యంతోసహా యుక్తాయుక్త వివేకజ్ఞానంగల సమస్త మానావనీకమూ చేస్తూన్న ప్రార్థనను ఆయన ఆలకించి, ఉచితజ్ఞుడు కావలెనని వాంఛిస్తూన్నాను. మానవుని అమానుష వైపర్త్యంవలన, లండన్ వంటి మహానగరాలు విధ్వంసం చేయబడతవనే భయంతో వాటిని కాళీచేయడం వలచుకొని జర్మనులు నిబ్బరంగా ఉండగలరని నేను నమ్మజాలను. తామూ తమ పురాతన నిర్మాణములనూ విధ్వంసం చేయబడే యెడల జర్మనులకట్టి చిత్తస్థయిర్యం ఉండదు. కాబట్టి నేనిప్పుడు ఇండియా స్వాతంత్ర్యమునుగూర్చి ఆలోచించడమే లేదు. అది రాకతప్పదు. కాని ఇంగ్లాండు ఫ్రాన్సుదేశాలు ఓడిపోయినా, శిథిలీభూతమై అవమానితమైన జర్మనీపైన ఆరెండు దేశాలూ విజయం పొందినా ఇండియాకు స్వాతంత్ర్యం లభించి మాత్రమేమి ప్రయోజనం?

"దాదాపు హెర్ హిట్లర్ యిప్పటికి పశుబలాన్ని తప్ప దేవుణ్ణి ఎరుగనే ఎరుగడన్నట్లుగా కనిపిస్తూన్నది. ఆయన యింక దేనినీ ఆలకించడంటాడు ఛేంబర్లేన్. నిరుపమానమైన ఈ మహోపద్రవమును గమనించి కాంగ్రెసువాదులున్నూ బాధ్యతగల తదితర భారతీయులున్నూ వ్యక్తులుగానూ సమిష్టిగానూ కూడా ఇండియా నిర్వహించ వలసిన పాత్రను నిర్ణయించవలసి ఉంది."

గాంధీ వ్యక్తిగా చేస్తానన్న నైతిక సహాయంమీదనే ఆధారపడి, ఆదుర్దాతో వేచి ఉన్న ప్రపంచానికి, ముప్పయి ఐదుకోట్ల భారతీయుల సహకారమూ బ్రిటనుకు లభించినట్లుగానే విశ్వాసపూరిత గంభీర వాగ్ధోరణిలో వైస్రాయి ఉపన్యసించి ఉన్నట్లయితే, ఆయన ప్రపంచజాతులను ముఖ్యంగా శత్రుదేశాలవారిని ఆశ్చర్య చకితులనుగా చేసి ఉంటాడు. ఎందువల్లననగా యుద్ధం ప్రారంభం కాగానే బ్రిటన్, స్నేహితుడనేవాడు లేక ఏకాకిగా నిలపడవలసివచ్చింది. బ్రిటిష్ సామ్రాజ్యంలోని అధినివేశ రాజ్యాలే తలోదోవా తీసినయి. ఐర్లండు యుద్ధంలో జోక్యం కల్గించుకోకుండా తటస్థంగా ఉంటానన్నది దక్షిణ ఆఫ్రికా ఒక్కవోటు మెజారిటీతో బ్రిటనుకు సహాయపడడాని కంగీకరించింది. ఆస్ట్రేలియా ముందు తన స్వార్థం ఆలోచించుకొనే స్థితిలో ఉంది. కెనడా చూపిన స్నేహభావం దూరగతవృత్తంగా తోచింది. ఈపూర్వ చరిత్ర తెలిసినవారికి ఇండియా సహాయసంపత్తిని బ్రిటను సంపాదించగలగడం చూస్తే ఆశ్చర్యం కాక మరేమి కలుగుతుంది? అయితే లిన్‌లిత్‌గో ప్రభువుకూ బ్రిటనుకూ మరొక సమస్య తటస్థించింది. గాంధీజీ యేవిధమైన షరతులు పెట్టకుండా, అప్పటి కప్పుడు తన సహజ ప్రకృతి కనుగుణమైన హృదయపూర్వక నైతిక సహాయాన్ని చేస్తానన్నాడు. గాంధీ చేస్తానన్న ఈ నైతిక సహాయాన్ని నమ్ముకొని ఊరుకోవడమా? లేక అసంఖ్యాకులైన జనులతోనూ, శౌర్యమునకూ త్యాగమునకూ పేరుపడిన వివేకమూ, బలమూ, ధైర్యమూ, సాహసమూ, సహనమూ గల లక్షలాది యోధులతోనూ ఉన్న ఇండియాయొక్క భౌతికసహాయమును సంపాదించడానికి ప్రయత్నించవడమా? దరిద్రంతో ఆకలితో వెనుకబడి ఉన్న పారిశ్రామిక విధానంతో కుంగికృశిస్తూ తనకు సంబంధంలేని యుద్ధంలో తాను జోక్యం కల్గించుకోడానికి యిష్టపడని ఇండియాయొక్క భౌతిక సహాయాన్ని బ్రిటను యెలా పొందడం? ఒకవంక బ్రిటనుకు సంపూర్ణ సానుభూతిని చూపవలెనని భారతదేశాన్ని ఎలుగెత్తి ఆహ్వానిస్తున్న గాంధీ, మరొకవంక లక్షలాది మనుష్యులనూ, కోట్లకొలది ద్రవ్యాన్నీ సేకరించగల సావకాశమూ ఉండగా ఈరెంటిలో ఏది కోరుకోవలెనో నిర్ణయించవలసివచ్చింది బ్రిటనుకు. సహజంగా బ్రిటను రెండోదే కోరుకొన్నది. కురుక్షేత్రసంగ్రామందాదుకూడా అర్జును

నకు దుర్యోధనునకూ మధ్య నైతిక భౌతిక సహాయములలో దేనిని కోరుకోవడమూ అనే సందిగ్ధ స్థితిని ప్రతిష్ఠించింది.

పాండవులు పన్నెండేండ్లు అరణ్యవాసమునూ, ఒక యేడు అజ్ఞాతవాసమునూ పూర్తి చేసి. వారింకనూ విరాటరాజు ఆస్థానంలో ఉండగానే. ద్రుపదరాజు, సర్వవిధాలా శాంతిస్థాపనకు సకల సన్మార్గముల ప్రయత్నించుటకు తన పురోహితునిద్వారా దుర్యోధనునికడకు ఒక ప్రేమసందేశాన్ని పంపించాడు. అప్పటికప్పుడే దుర్యోధనుడు తన పరివారంతోసహా కృష్ణునికడకుపోయినాడు. ఆయన కృష్ణభగవానుని మందిరం ప్రవేశించగానే కృష్ణుడు నిద్రిస్తున్నట్లు గమనించాడు. కృష్ణుని తలవైపునున్న ఉన్నతాసనంమీద దుర్యోధనుడు కూర్చున్నాడు. తరువాత కొంతసేపటికి అర్జునుడువచ్చి సవినయంగా కృష్ణుని పాదాలకడ నిలబడ్డాడు. శ్రీకృష్ణుడు నిద్రమేల్కొని పాదాల కడనున్న అర్జునుని ముందుగాచూచాడు. తరువాత పక్కకుతిరిగి తలవైపున ఉన్న దుర్యోధనుని గమనించాడు. ఎమ్మట వారిద్దరూ యేమిపనిమీద వచ్చారో అడిగి తెలుసుకొన్నాడు.

“ మా యిరువురిమధ్య యుద్ధమిప్పుడు తప్పనిసరి అయింది. అందులో నీసహాయమపేక్షించి మేమిరువురమూ వచ్చాము. పాండవులుగానీ మేముగానీ నీకు సమాసమే. యిరువురమూ సన్నిహితులమేకదా ! అయితే నేను ముందుగా వచ్చానిక్కడకు. సత్పురుషులు ముందుగా తమ సన్నిధానానికి వచ్చినవారిని చూడగానే ఆదరిస్తారు. నీవు మహోదార పురుషుడవు. మహోత్కృష్టస్వభావం కలవాడవు. ప్రపంచ రీతిని గుర్తెరిగి నీవు మా పక్షాన ఉండాలి,” అన్నాడు దుర్యోధనుడు. ఈమాటలువిని కృష్ణుడిలా జవాబు చెప్పినాడు. “ నీవిక్కడకు మొట్టమొదట వచ్చినమాట వాస్తవం. కాని నేను మొట్టమొదట చూచింది అర్జునుణ్ని. కాబట్టి మీ ఉభయుల ప్రతిష్టకూ తగినట్లుగా నేను మీకు సహాయం చేయవలసి ఉంది. ఇందు కనుగుణంగా యిప్పుడే నాకొక ఉపాయం తోస్తున్నది. యుద్ధశాస్త్రంలో నైపుణ్యాం సంపాదించిన 10,000 మంది వీరగోపాలురదండు ఉంది నాదగ్గర. బాణాలనుగానీ తదితర ఆయుధాలనుగానీ ఉపయోగించడంలో వారారితేరినవారు. నారాయణుని పేరుతో వారంతా ఒకపక్షాన యుద్ధం చేయడానికి నిలబడతారు. ఆయుధంచేతపట్టకుండా చూస్తూ నేనొక పక్కను ఉంటాను. కాని నేనున్నపక్షానికి హృదయపూర్వక శ్రేయోభిలాషిగా మాత్రం ఉంటాను. మాయిరువురిలో మీకెవరు కావాలో కోరుకోండి. చిన్నవాడు ముందుగా కోరుకోవాలి” అంటూ శ్రీకృష్ణుడు కిరీటివంక చూచి “నీకోరికను ముందుగా నీవు చెప్పడం మంచిదన్నాడు. వెంటనే విజయుడు శ్రీకృష్ణుడు కావాలన్నాడు.

అందువలన దుర్యోధనుడికి చాలా ఆనందం కలిగి శ్రీకృష్ణుని దండును కోరుకొని వెంటనే పట్టజాలని సంతోషంతో బలరాముని మందిరానికి వెళ్ళినాడు. శ్రీకృష్ణుని నైతిక బలాన్నీ సహాయ సహకారములనూ కోరుకొన్న అర్జునుడు యుద్ధంలో విజయం పొందినాడు. శ్రీకృష్ణుడాయనకు సారధిగా, గురువుగా, మార్గదర్శకుడుగా, నెచ్చెలిగా పనిచేశాడు. లిన్‌లిత్గోకూడా గాంధీజీని, గురువుగా, ఉపదేశకుడుగా, మార్గదర్శిగా, మిత్రంగా ఉపయోగించుకొని ఈయుద్ధంలో అసత్యంపైన సత్యానికీ, హింసపైన అహింసకూ విజయం కలిగేటట్టు చూడలేడా?

1939 సెప్టెంబరు 14 వ తేదీని పరిస్థితులను సమగ్రంగా సమాలోచన చేయడానికి కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశమయింది. పశుబలానికి ఆహుతియైన పోలాండు దుర్దశను చూచి వర్కింగు కమిటీ తన హృదయపూర్వక సానుభూతిని వెల్లడిచేసింది. ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాలు చేస్తూన్న యుద్ధం సామ్రాజ్యవాద శక్తులకూ, ఫాసిస్టు ప్రభుత్వములకూ వ్యతిరేకంగా ప్రజాస్వామ్య రక్షణకోసం చేస్తూన్న యుద్ధమని అంగీకరించింది. పోలాండుపక్షాన యేప్రజా స్వాతంత్ర్యమును రక్షించడానికి ఇంగ్లాండు కంకణం కట్టుకొని పోరాడుతూన్నదో ఆప్రజా స్వామ్యం తమ దేశానికి నిరాకరింపబడడం మూలాన బ్రిటిష్ సామ్రాజ్యవాదానికది బలి అవుతూన్నట్లుకూడా వర్కింగు కమిటీ అభిప్రాయపడ్డది. అంతేకాక అధినివేశ రాజ్యాలీ యుద్ధంలో పాల్గొనవలెనా లేదా అనేవిషయం ఆయా పార్లమెంటులలో నిర్ణయించుకొంటూండగా, ఇండియా యుద్ధంలో పాల్గొనడం ఖాయమైనట్లే. బ్రిటిష్‌వారు నిర్ణయించడం వర్కింగు కమిటీ వారాశ్చర్య విషాదములతో గమనించారు. అనగా ఇండియాకు ప్రత్యక్షంగాగానీ పరోక్షంగాగానీ యుద్ధంలో సంబంధం లేకపోయినప్పటికీ, ఇంగ్లాండుదేశం తన యుద్ధాన్ని ఇండియామీద బలవంతంగా రుద్దినట్లు కాంగ్రెసు వర్కింగు కమిటీ అర్థం చేసుకొన్నది. ఫెడరేషను యొక్క ఆదర్శానికేమీ ముప్పంలేకుండా, ఫెడరేషనును ప్రవేశపెట్టేటందుకు చేయబడుతూన్న సన్నాహాలనన్నిటినీ ఆపివేసినట్టు సెప్టెంబరు 11వ తేదీని రాజప్రతినిధి చేసిన ప్రకటనను వర్కింగుకమిటీ సంతోషంతో గమనించింది. కాని ఇంతవరకూ ఆలోచనలోవున్న ఫెడరల్ ప్రణాళికను కాలపరిమితిలేకుండా ఆపివేయడంవల్లనూ, కేంద్రంలో చిరకాలంనుండీ బాధ్యతాయుత ప్రభుత్వం ప్రవేశపెట్టబడక పోవడంవల్లనూ, రాష్ట్రీయప్రభుత్వాలన్నీ యుద్ధవ్యవహారాలలో బాధ్యతారహితమైన కేంద్ర ప్రభుత్వం యొక్క అదుపాజ్ఞలలో మెలగుతూండడం చూచి స్థయిర్యంతో నోరుమూసుకొని ఉండడానికి సాధ్యంకాని పరిసితులు కాంగ్రెసుకు తటస్థించినవి.

2 రాష్ట్రీయ ప్రభుత్వాలు కేవలం రాష్ట్రీయ స్వాతంత్ర్యమును అనుభవించడం లో నేకాక, పర్యవసానాకి నూతన యుద్ధసన్నాహాలకు తోడ్పడి కార్యాచరణకు కడంగ వలసిన కేంద్రస్థానములు కావడం వాటికన్నీ ఇండియా ప్రభుత్వమునకున్నూ కల సంబంధబాంధవ్యములుకూడా విస్పష్టం చేయవలసి ఉంది.

3. లోగడ అనుభవమునుబట్టీ, గతయుద్ధంలో ముఖ్యంగా కలిగినఅనుభవమునుబట్టీ బ్రిటిష్ ప్రభుత్వంవారుగానీ ఇండియా ప్రభుత్వంవారుగానీ చేసే యుద్ధప్రకటనలలోను మనం విశ్వాసముంచకూడదని తేలింది. కాబట్టి భావిభారతదేశంలో బ్రిటిష్‌ప్రభుత్వానికి ఉండబోయే సంబంధబాంధవ్యాలను వివరిస్తూ, అందుకనుగుణంగా ఆ సిద్ధాంతాలను వెంటనే ఆచరణలోకి తేవలెనని బ్రిటిష్‌ప్రభుత్వం వారిని కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు కోరినారు.

ఈ విషయంలో స్పష్టమైన ప్రకటన చేస్తేనేగాని భారతదేశ ప్రజలను సంపూర్ణ సహకారం చేయవలసిందని తాము కోరజాలమని కాంగ్రెసు వర్కింగు కమిటీవారు ప్రకటించారు”

ఇక సత్యాగ్రహ విషయం ఉంది. సత్యాగ్రహం దేశకాలపరిస్థితుల కనుగుణంగా నడపవలసిన ఉద్యమం ఇప్పుడు సత్యాగ్రహం ప్రారంభించడమంటే సైనిక శాసనం కింద, అరాచకమునుకూడా ఎదుర్కొని సాగించవలసిఉంది. పోరాటం కావాలని కోరే వారంతా ఈ విషయం గమనించితీరాలి. నాయకులు జైళ్లలో ఉంచబడేమాటవాస్తవం. అయినప్పటికీ దేశం ఉద్యమాన్ని కొనసాగించాలి. గ్రామదుర్గం, తాల్ చేరీ ఉదంతాల వంటివి, పల్లీ తటస్థించవచ్చును. వాటికి మనం బాధ్యత వహించజాలం సైనికశాసనం ప్రకటింపబడేమాట వాస్తవం. ధనవంతులు మనకు అండగా ఉండరు. ప్రజాభిప్రాయం మనకు ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ, బహిరంగంగాగాని, రహస్యంగాగానీ అనుకూలంగా ఉంటుందనడానికి ఎంతమాత్రమూ వీలులేదు. కాబట్టి మన ఉద్యమం వినాశనానికి దారి తీస్తుంది. అయితే యేమీచేయకుండా చేతులు ముడుచుకొని ఊరక కొందామా అంటే మరొక చిక్కు ఉంది. అప్పుడు మనమంత్రులు, తమ ఉద్యోగాల లోనేఉండి కాంగ్రెసువారినే నిర్బంధించవలసిన పరిస్థితులు రావచ్చును. అదే తటస్థించిన యెడల యుద్ధానంతరం కాంగ్రెసు రాజకీయ సంస్థగా తుడిచిపెట్టుకొని పోయేమాట వాస్తవం. కాబట్టి ముందుకుపోతే నుయ్యి, వెనుకకుపోతే గొయ్యి అన్నట్లున్న పరిస్థితు లలో యేది ఉచితమో నిర్ణయించుకోవలసిన స్థితి కాంగ్రెసు కేర్పడ్డది.

మన నైతిక సహాయమును బ్రిటిష్‌వారికిస్తూ, మన మంత్రులను ఉద్యోగాలలోనే ఉండనిచ్చినయెడల, పూర్ణ స్వరాజ్యమునుగానీ, అధినివేశ ప్రతిపత్తినిగానీ ప్రకటింప

చేయవచ్చునని గాంధీజీ విశ్వాసం. రాయబారాల ద్వారా యిదే స్థితిని సంపాదించ వచ్చునని జవహరులాలు ఆలోచన. ఈ రెండు సందర్భాలలోనూ కూడా బ్రిటిష్‌వారు తమ వాగ్దానమును చెల్లించకపోవచ్చుననే అనుమానం లేకపోలేదు. కాని గాంధీజీ సూచించిన పద్ధతిలో, తాననుకొన్న ప్రకటన జరిగేటట్లు చూడడానికి ఎక్కువ అవ కాశం ఉన్నదనేమాట నిశ్చయం. కాని అందులో బ్రిటిష్‌వారికి నైతికబాధ్యత ఉన్నదే కాని రాయబారాలద్వారా అనుకొన్నప్రకారం వాగ్దానాన్ని చెల్లించవలసిన బాధ్యత లేదు ఈ సందర్భంలో గాంధీజీ రాజభక్తిపరాయణుడుగా వ్యవహరించడం లేదు. మన శక్తిసామర్థ్యాలను గమనించి నిజపరిస్థితుల కనుగుణంగా వ్యవహరిస్తున్నాడు. గాంధీ సూచించిన విధానమునుబట్టికూడా మంత్రులు తమ ఉద్యోగాలను విడిచి రావచ్చును. అయితే అఖిలభారత కాంగ్రెసుసంఘం దీనితో ఏకీభవిస్తుందా? అలా ఏకీభవించకపోయే యెడల మనం రాజీనామాయిచ్చి రాబోయేకల్లోలానికీ, హింసా కాండకూ మన ఎదిరిపక్షం వారినే బాధ్యతవహించనీయండి అని అనుకొందాం. అప్పు డేమి జరుగుతుంది? "మన ఉద్యమానికి గాంధీజీ ఆశీర్వాదం లేకపోవడమే కాకుండా ఆయన మనకెదురుగా నిలబడి పనిచేస్తే ప్రజలలో మనమాట ఎంతవరకు సాగుతుందనీ కూడా మనం ఆలోచించాలి" అయితే గాంధీజీ మనకు ప్రతికూలంగానిలబడి వ్యవ హరించడని మనమనుకోవచ్చును. కాని ఆయన సేవాగ్రామంలో మూకీభావంవహించి ఊరుకొన్నప్పటికీ మనఉద్యమం చల్లబడి చచ్చిపోతుంది.

వర్కింగుకమిటీవారు వివిధవిధములైన అనేక సమస్యలను ఆలోచించారు. అవన్నీ వారి మనస్సులకు విస్పష్టంగా కనిపిస్తూవచ్చినవి. వర్కింగుకమిటీ వివిధదృక్పథ ములనుండి యుద్ధసమస్యను సుదీర్ఘంగా పరిశీలించి చర్చించినపిమ్మట, బ్రిటిష్‌వారి యుద్ధాశయములను విస్పష్టంచేయవలసిందని కోరిన కోరిక అత్యంత సహజమైనకోరిక. కమిటీముందుకువచ్చిన చిత్తుతీర్మానముల నన్నింటినీ గాంధీజీ వెంటనే ఆమోదించలేక పోయినందుకు కారణాలను ఊహించడం చాలా తేలిక. బ్రిటిష్‌వారితో అప్పుడు రాయ బారాలు జరపడానికిగానీ, అప్పటికప్పుడే ఒక ప్రకటన చేయమనికోరడానికి గానీ ఆయనకు నిజంగాయిష్టంలేదు. ఏపరిస్థితులలోనూ, కాలపరిమితిని నిర్ణయించడానికికూడా ఆయన యిష్టపడలేదు. ఏదైనాయిచ్చినాకూడా అప్పుడు స్వీకరించడానికాయన సంసి ద్ధంగాలేడు. ఇదంతాయిలాఉండగా శాసనోల్లంఘనం చేయడానికికూడా ప్రతికూ లంగా ఉన్నాడు. తీర్మానంలోని అధికభాగం జవహరలాలు వ్రాసినట్లుగా తెలుసు కోవచ్చుననేమాట వేరుగా చెప్పనక్కరలేదు. ఆతీర్మానాన్నిబట్టి జవహరలాలు అధ్య క్షుడుగానుండి, ఆయన తన వర్కింగుకమిటీని నియమించుకొని వ్యవహరించడం ఉచిత—

మని గాంధీజీ అభిప్రాయపడ్డాడు. ఒక స్థితిలో రాజేంద్రబాబు తన అధ్యక్షస్థానానికి రాజీనామాయిచ్చి, వర్కింగుకమిటీలో చేరడానికి అప్పుడేనిశ్చయించుకొన్న జవహరలాలును ఆపదవికి నియమించవలెననికూడా నిర్ణయం జరిగింది. కాని కాంగ్రెసు నియమావళిప్రకారం అలాచేయడానికి వీలుకలుగలేదు. తాత్కాలికంగా మధ్యేర్పడ్డ కాళీలో అధ్యక్షుణ్ని ఎన్నుకోవడానికి వర్కింగుకమిటీకి అధికారం లేకపోయింది. అఖిలభారత కాంగ్రెసు సంఘానికికూడా అట్టిఅధికారంలేదని కలకత్తాలో తీవ్రంగా ప్రశ్నింపబడినసంగతి చదువరులకు జ్ఞాపకం ఉండేఉంటుంది. గాంధీ అప్పుడు జవహరలాలును తనవెంట కొనిపోవలెనని ఆశించాడు. కాని అదిసాధ్యపడనందున తానే జవహరలాలును బుద్ధిపూర్వకంగా అనుసరించాడు. తక్కిన వర్కింగుకమిటీ సభ్యులకిది సులభంగా తోచలేదు. గాంధీవంటిమనిషి తనకూ జవహరలాలుకూ ఒక మధ్యమార్గాన్ని ఆలోచిస్తున్నప్పుడు, జవహరలాలును ముఖాముఖిని ఎదిరించడం అనవసరంగా చిక్కులు కలిగించడం అవుతుంది. ఎదిరించకుండాఉంటే అహింసావిధానమునకు గాంధీజీ ఉంచుకోదలచుకొన్నంత పలుకుబడిని ఉంచుకోవడానికి వీలులేకుండా చేయడమవుతుంది. ఈవిధంగా మూడుశక్తులూ మూడుమార్గాలను పట్టినవి. ఈమూడు శక్తులకూ సమాధానం కుదర్చగల మార్గాన్ని అన్వేషించడం అంతతేలికగా లేదు. "దేవుని దయ వలన జీవించిఉంటే బ్రిటిష్‌వారితో మనం తీవ్రమైనపోరాటం సాగించే రోజులు రాగలవు. ప్రస్తుతంవారితో సాగించవలసిన తీవ్రపోరాటానికి తగినసామగ్రి యిప్పుడు మనదగ్గరలేదు ఆసామగ్రి బ్రిటిష్‌వారి బాంబులకు భిన్నమైనసామగ్రి. మనంఎంతో తీవ్రంగా మాట్లాడవచ్చు. వ్రాయవచ్చు, బెదిరించవచ్చు, కాని మనలో యిప్పుడు పోరాటానికి కావలసిన క్రమశిక్షణ చాలాతక్కువగాఉంది శాసనోల్లంఘనమునకు అనుకూలమైన వాతావరణమిప్పుడులేదు ఇటువంటి క్లిష్టదశలో కాంగ్రెసు తీర్మానంలోని ప్రతిమాటా ప్రతిఅక్షరమూ ఆలోచనా పూర్వకంగా తూచినట్లు ఉండాలి. ఇండియాకు వెలుపలనున్న శక్తులనుకూడా మన తీర్మానం కదిలించకలిగి ఉండాలి. కాబట్టి జవహరలాలు తీర్మానమును ఆయన బాధ్యత వహించి యావత్తుభారమునూ మోయతలచుకొంటేనే ఆమోదింపవలెను. అంతేకాని ఆయన వెలుపలనుండి వస్తూ పోతూ యెంతవిలువగల సలహా యిస్తున్నప్పటికీ ఈతీర్మానాన్ని ఆమోదించడానికి వీలులేద"ని గాంధీజీవాదం. గాంధీజీ యెప్పుడు కాంగ్రెసుకు సహాయపడడానికీ సంసిద్ధమే కాని ఆయన జవహరలాలూ రాజప్రతినిధులమధ్య, మధ్యవర్తిగా రాయబారాలు నడపడానికి మాత్రమే సంసిద్ధంగా ఉన్నాడు. అహింసా సిద్ధాంతాన్ని ఆయన విడనాడజాలడు. ఆయన మధ్యవర్తిగా మాత్రం

వ్యవహరించగలడుకాని, కార్యనిర్వాహకుడుగా నుండడానికంగీకరించలేదు. ఆయుధ చట్టాన్నిగూర్చి ఆయన అవలంబించిన విధానమునే నేడీయుద్ధ సమయంలోకూడా అవలంబిస్తూన్నాడు. ఈ సందర్భంలో ఆయన స్థితి బాగా అర్థమవుతూనేఉంది. నిజానికాయన 'ఒకప్పుడు సైనికులనుకూడా సమకూర్చాడు. ఆయన ఉద్దేశించిన అహింసా సిద్ధాంతాన్ని కాంగ్రెసువారిలో అత్యధిక సంఖ్యాకులు అవగాహన చేసుకోలేకపోయినారు. ఆయన అహింస ప్రపంచానికి ఆదర్శప్రాయంగాఉండే అహింస యావద్భారత దేశానికీ మోక్షమిప్పించగల అహింస. అహింసలోకూడా అనేక అవస్థాభేదాలు లేకపోలేదు. మనోవాక్కాయ కర్మలలో అహింసా విధానమును అవలంబిస్తూన గృహంలోని పిల్లలనూ, సంఘంలోని పెద్దలనూకూడా సుశిక్షితులనుగాచేసి, నూతన వాతావరణమునూ నూతన సాంప్రదాయములనూ కల్పించి కొలదికాలంలోనే అహింసా పూర్వక రాజ్యాన్ని స్థాపించడానికి వీలుకలిగించే వ్యక్తిగత అహింస ఒకటి. బ్రిటను స్వాధీనంలోనున్న ఇండియా స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికవలంబించే అహింస రెండవది. అంతర్జాతీయ వ్యవహారాలలో దేశాలకుదేశాలకూ వచ్చేతగాదాలను పరిష్కరించడానికి అంతిమ నిర్ణేతగాఉండే అహింస మూడవది. అటువంటి పరిస్థితులలో తన సిద్ధాంతాన్ని మొట్టమొదటిసారి ప్రపంచానికి బహూకరించతగిన సావకాశం కలిగినప్పుడు, దానిని జారవిడిచి కాంగ్రెసు తన నోటితోనే, భారతీయ యోధులను, మనకు సంబంధంలేనట్టిన్నీ, నైతికంగా సమర్థించడానికి సాధ్యంకానట్టిన్నీ యుద్ధంలో పాల్గొనవలసిందని యేవిధంగా ప్రబోధించగలదు? బ్రిటిష్‌వారు విజయంపొందే పక్షంలో మనమూ యుద్ధంలో పాల్గొనడం సమంజసంగానే ఉంటుందని కొందరనుకొంటారు. కాని అందువలనకలిగే ఫలితాలు మనం సహించలేనివిగా ఉంటవనీ, అదికారణంగా కాంగ్రెసు యొక్క ప్రతిష్ఠకు భంగం వాటిల్లుతుందనీ మాత్రం మనం స్పష్టంగా గ్రహించాలి. సాంఘిక సమస్యా పరిష్కార (Communal award) సందర్భంలోవలె కాంగ్రెసు సంస్థ ఈయుద్ధ విషయంలో తటస్థభావం వహించిఉండజాలదు. మంత్రులందరూ రాజీనామాలిచ్చి వచ్చినతరువాత తటస్థంగా ఉండడంవారికి సాధ్యమా? దేశానికి సరియైన మార్గం చూపెట్టవలసిన అవసరంఉంది. ఆమార్గం ఆచరణయోగ్యంగానూ ఉండాలి. నీతికీ కార్యనిర్వహణకూ అనుగుణంగా ఉండాలి. అది మత విషయికంగా ఉండరాదని చాలామంది ఆతురతపడుతూండడంకూడా సహజమే. కాంగ్రెసుయొక్క రాజకీయ లక్షణాన్నిబట్టి, ఈ యుద్ధసమస్యను రాజకీయ దృక్పథమునుండి మాత్రమే పరిష్కరించవలసియున్నది. ఒక భారతీయ పటాలం వచ్చి "మమ్మల్ని ప్రభుత్వంవారు సింగపూరు పొమ్మంటూన్నారు. పోవాలా అక్కరలేదా" అని ఒకానొక

వర్కింగు కమిటీ సభ్యుణ్ని అడిగితే ఆయన యేమి చెప్పాలి? తగిన ప్రత్యుత్తరం ఈయాలా అక్కరలేదా అని ప్రశ్న వచ్చింది. పని పెట్టుకొని ప్రచారం చేయకపోయినా అభిప్రాయమైనా చెప్పడం మన ధర్మం కాదా అనిపించింది. కేవలం అభిప్రాయం మాత్రమే ప్రకటించడం అయితే, ప్రమాదం లేకుండా తప్పించుకొని బయటపడడానికి చేస్తున్న ప్రయత్నమని విమర్శ బయలుదేరింది. మద్యపాన నిషేధమును మనం ప్రబోధిస్తున్న మాత్రాన నిరంతరం దుకాణాల దగ్గర పికెటింగు చేస్తున్నామా, అలాగే యిదిన్నీ అని ఆ విమర్శకు తేలికగా ప్రత్యుత్తరం చెప్పవచ్చును. "అసలు సమస్య, హింసా అహింసా అని కాదు. అసలు సమస్య యేదో దానినే జాగ్రత్తగా పట్టించాలి. నీవు నెమ్మదిగా చెప్పు; బిగ్గరగా చెప్పు; బ్రిటిషువారు పన్నిన యీ వలలో మనం చిక్కుకోరాదని అసందిగ్ధమైన భాషలో బహిరంగంగా, ఎవరైనా అడిగినా అడగకపోయినా సరే నీవు గట్టిగా చాటించి తీరాలి" అని కొందరి వాదం.

మనం యుద్ధంలో సహకారం చేయాలా లేక రాజకీయ హక్కులు మాట్లాడి కోరవలెనా అనేవి రెండే సమస్యలు. ముందు రెండో విషయాన్ని గురించి ఆలోచిద్దాం. రాయబారాలు జరపడానికి తగిన వాతావరణం అప్పట్లో లేదని గాంధీ నిశ్చయించుకొన్నారు. అధమం ఆయన కార్యవిషయంలో నమ్మకం లేనట్లు స్పష్టంగా ప్రకటించారు. గాంధీ వెనుకబడి దేశానికి తగినట్లుగా వినియోగపడడం లేదని కాంగ్రెసులోని యువకులంటూ గునియడం సాగించారు. యువకులలో వచ్చిన చిక్కు అదొకటి. "నీవు సరేనను తక్కిన పని అంతా మేము చేసుకొని వస్తాము." అంటారు యువకులు. చివరికి గాంధీజీ ఈ రాయబారాలు నడపడానికి తనకు సామర్థ్యం లేదనీ ఈ భారం జవహరలాలే వహించాలనీ అన్నాడు. ఇంతకాలంనుండీ గాంధీని అంటుపెట్టుకొని ఉన్న పాత అనుచరుల నేకమంది పూర్తిగా గాంధీనిగానీ, పూర్తిగా జవహరులాలునిగానీ అనుసరించలేని స్థితిలో ఉండడంచేత ఒక విచిత్ర పరిస్థితి యేర్పడ్డది. కాబట్టి జవహరులాలు నాయకత్వం వహించేయెడల ఈ పాతనాయకులాయనకు భారం కావచ్చును. కనుక గాంధీ జవహరలాలు లిద్దరూ యేకాభిప్రాయానికి వచ్చి నాయకత్వం వహించనైనా వహించాలి. లేదా జవహరలాలుకు సర్వాధికారాలూ సమర్పించి ఆయనను నియంతగా చేసి, ఆయన యిష్టం వచ్చినవారిని కార్యవర్గసభ్యులుగా నియమించుకోనిచ్చి పట్టి 'మూక' ను కార్యవర్గంలో లేకుండా చూడాలి. ఇదే ఆచరణయోగ్యమైన మార్గం. కాని సిద్ధాంతరీత్యా ఆలోచిస్తే బ్రిటిష్‌వారితో మనం పోరాటం పెట్టుకోవలసివచ్చే యెడల అది అహింసాయుతమైనదిగా ఉండాలి. దానికి తగిన నాయకుడు కావాలి. సోషలిస్టులుకూడా గాంధీయే నాయకుడుగా ఉండాలంటున్నారు. ఈ క్లిష్టదశలో

గాంధీ జవహరలాలుల మిశ్రమ నాయకత్వం క్రిందనే అది సాధ్యపడుతుంది. జర్మను లతో మనకేమీ విరోధం లేదు. మనం స్వతంత్రులమై ఉంటే వారితో వారికి ప్రతికూలంగా మనమెప్పుడూ యుద్ధంచేసి ఉండేవాళ్ళము కాము. కాని మనం స్వతంత్రుల మన్నట్లుగా భావించుకొని వ్యవహరించడం సాధ్యంకాని పని. ఏదో ఒక ఉద్రేకం లోనో ఒక ఉత్సాహంలోనో, మమ్మల్లను సంతృప్తి పరిస్తే మేము అన్నివిధాలా సహాయం చేస్తామని మాటలుచెప్పడం తేలికే. కాని అటువంటి సహాయాన్ని అపేక్షించి రాజప్రతినిధి 'ఆత్మహత్య' చేసుకొంటాడనుకొని ఇకముందు రాజప్రతినిధి ఉండకూడదనీ, రాష్ట్రీయ ప్రభుత్వం పైన సంపూర్ణాధికారమున్నా, కేంద్రప్రభుత్వంలోకూడా కొంత అధికారమున్నా మనకు ఉంటేనే కాని మనం సంతృప్తిపడజాలమనీ చెప్పే సరికి- రాయబారాలు రాజీపరతులు మాట్లాడవలసిన స్థితి యేర్పడుతుంది. ఆనాడు తక్షణం పోరాటం కావలెననేవారు రాబోయే పోరాటానికి ఆయత్తం కావలెననే వారూ రెండు తెగలుగా ఉన్నారు ఈ రెండు సందర్భాలలోనూకూడా ఈదిగువ రెండు ప్రశ్నలకూ సావకాశం కలుగుతూన్నది.

(౧) మనం కోరింది మనకు లభిస్తే బ్రిటిష్‌వారికేమి సహాయం చేయగలం?

(౨) మనం కోరింది మనకు లభించకపోతే బ్రిటిష్‌వారితో పోరాటానికి మనమేమి చర్యతీసుకోవాలి?

కాంగ్రెసు నాయకులు సార్జెంటు ఒనరలుగా పనిచేస్తారని యెప్పుడూ అనుకో లేదన్న సంగతి యిక్కడ ప్రత్యేకం చెప్పనక్కరలేదు. మనకు సైనిక వ్యవహారాలతో సంబంధం లేకపోవచ్చును. ఆహారం మొదలగు వ్యవహారాలతో సంబంధం ఉంటుంది. వర్కింగుకమిటీ ముందు ఉన్న చిత్తు తీర్మానాన్ని బట్టి రాయబారాలు జరపడం అసంభవమని కొందరి అభిప్రాయం. యుద్ధారంభంలోనే మన కోర్కెలను అప్పటికప్పుడు నెరవేర్చితీరాలని తీర్మానంలో ఉండడం వల్లనే కాక ఇండియా బ్రిటనుదేశాలకు సామరస్యం కుదర్చడంకూడా కష్టసాధ్యమైన పనికావడంచేతకూడా ఆవిధంగా తలంపబడింది. మన మంత్రులింకా ఉద్యోగాలలోనే ఉన్నారు. వారుసహకారం చేయాలా సహాయనిరాకరణం చేయాలా అనే విషయం సాధ్యమైనంత తొందరలో నిర్ణయించాలి. ఇండియా సంరక్షణచట్టం అంగీకరింపబడే స్థితిలో ఉంది. బ్రిటిష్‌వారు శాసనాలకు, రాజ్యాంగ చట్టాలకు లోబడి ఉంటారు. అప్పుడు వార్ధాలో ఉన్న సర్ స్టాఫర్డు క్రిప్సు, బ్రిటిషు పార్లమెంటు వారిండియాకీయ దలచుకొన్న రాజ్యాంగమును మాత్రమే తాను వాగ్దానము చేయగలననీ, అంతకు మించి చేయజాలననీ అంటూన్నాడు "స్వతంత్రం - మీఅంతటమీరు సంపాదించుకోవలసిందే" అన్నాడు.

పర్యవసానానికి అప్పటి పరిస్థితులలో మనం కొంత వెనుకకు తగ్గవలసిన స్థితిగతులు యేర్పడ్డవి. సుభాస్‌బాబు పక్షంగా పోరాటం కావలెనన్నా, జవహర్‌లాలు రానున్న పోరాటానికి సంసిద్ధం కావలెనన్నా, బ్రిటిష్‌ప్రభుత్వాన్ని లొంగదీసుకోవలెనన్నా నే యేకాభిప్రాయంతోనే వారలా అంటూన్నారు. సుభాస్‌బాబు వర్కింగుకమిటీ సమావేశానికి ప్రత్యేకాహ్వానంపైన వచ్చి కొంతసేపుండి వెళ్ళిపోయినాడు. ఇండియాగానున్నా కాంగ్రెసునున్నా, ఐక్యకంఠంతో ఒకేతాటిమీద నడిస్తే ఈసమయంలో యెంతో బాగుంటుందని ఆయనకు అందరూ నచ్చచెప్పడం ప్రారంభించారు. కాని ప్రయోజనం లేకపోయింది. జవహర్‌లాలు కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండి యావత్తు కార్యక్రమమూ నడిపించవలెనని గాంధీజీ పదేపదే నొక్కి చెబుతూవచ్చాడు. కాని మధ్యలో హఠాత్తుగా నాయకత్వం మార్చడంవలన, కాంగ్రెసులో చీలిక లేర్పడ్డవని అపోహపడటానికి ఆవకాశం ఉంది. కనుక ఇప్పుడు అధ్యక్షుణ్ణి మార్చడం సంచితంకాదని వర్కింగు కమిటీ వారభిప్రాయపడ్డారు. వారంరోజులపాటు రహస్యాలోచనలు జరిగిన తరువాత వర్కింగుకమిటీలో నిజానికి యేవిధమైన చీలికకూ ఆస్కారం లేకుండా పోయింది. అయితే రహస్య సమావేశాలలో జరిగిన విషయాలెంతమాత్రమూ బయటికిరాలేదు. ఈ తీర్మాన సందర్భంలో తానేమిజోక్యం కలిగించుకోనని చెప్పడమేకాక, తీర్మానాన్ని తిరిగి వ్రాయడానికికూడా గాంధీ అంగీకరించలేదు "మిత్రులారా! మీకు అహింసలో నమ్మకంలేదు. ఈ సంగతి కిందటినెలలో నాతీర్మానం ఓడిపోయినప్పుడే స్పష్టంగా తెలిసిపోయింది," అని గాంధీ అభిప్రాయపడ్డట్లు ఆయన ప్రకటన కనిపించింది.

1939 సెప్టెంబరులోకూడా యించుమించుగా యిలాగే జరిగింది. వర్కింగు కమిటీవారితో తనకు పొత్తుకుదరదని తెలుసుకొన్నాడాయన. అయితే వోట్లు లెక్కపెడితే అధికసంఖ్యాకులాయనకు అనుకూలంగా ఉండేరని అర్థంకాదు. గాంధీ చేతుల లెక్కకోసం చూడడు. హృదయపరీక్ష చేస్తాడు. కాబట్టి జవహర్‌లాలు తీర్మానాన్ని ఆధారంగా చేసుకొని కాంగ్రెసు వ్యవహరించాలనీ, తానుమాత్రం దానికనుగుణంగా నడుచుకోజాలననీ, బ్రిటనుతో రాయబారాలు నడపవలసిన యావత్తు బాధ్యతను జవహర్‌లాలే వహించవలెననీ, అందువలన ఆయనే అధ్యక్షుడుగా ఉండడం సముచితమనీ గాంధీజీ విస్పష్టం చేశాడు. ఈసూచన చాలా వింతగా తోచింది. కాని నిజానికి ఇంతకుపూర్వం మూడురోజుల కిందటనే రాజేంద్రబాబు సేవాగ్రాంసంఘోయి తన అధ్యక్షపదవికి రాజీనామా యిస్తానన్నాడు. ఇందుకనేక కారణాలుండ వచ్చును. రాజకీయపు యెత్తులు ఎత్తడంలో తనకు స్వతస్సిద్ధమైన చాకచక్యం లేదనుకొన్నాడా? కిందటి వారంలో జరిగిన సంఘటనలు తనకు తెలియకుండా జరిగినందుకేమైనా మనస్సులో బాధపడ్డాడా?

—ముఖ్యంగా సుబాస్‌బాబును ఆహ్వానించడం కానీ, గాంధీజీ రాజప్రతినిధిని సంప్ర ర్శించడం కానీ ఆయనకు తెలియకుండా జరిగినవి. ఎలా అయితేనేమి జవహరలాలును అధ్యక్షుడుగా చేయడమనే సంగతి కాంగ్రెసు నియమావళిలో యేర్పడిన చిక్కుతో జరగకుండాపోయిందని యిదివరకే చెప్పిఉన్నాము. అందువలన జవహరలాలు అధ్యక్షతకింద ఆయన యిష్టంవచ్చిన సహచరులతో ఒక యుద్ధ కమిటీని నియమించవలెననే సూచన చేయబడి వెంటనే వర్కింగు కమిటీ ఆమోదమును పొందింది. జవహరలాలు వల్లభాయిని, అబ్దుల్‌కలాంఅజాదును లను సహచరులుగా నిర్ణయించుకొన్నాడు. తరువాత జవహరలాలువ్రాసిన చిత్తుతీర్మానం మరొకసారి చదువబడి, కొన్ని మాటల మార్పులతో అంగీకరించబడింది.

గాంధీజీ యిటువంటి వైఖరిని అవలంబించి తటస్థంగా ఉండదలచుకొన్న కారణమేమైఉంటుంది? సమాధానకర్తగా గాంధీజీ చాలా అపాయకరమైన మనిషి అనీ తానుమాత్రం అందుకు బాగాపనికివస్తాననీ వైస్రాయి నిశ్చయిస్తున్నట్లుగా గాంధీజీకి తెలుసు. కాబట్టి ఆనాడు వర్కింగు కమిటీచేసిన ఈ తీర్మానాన్ని అక్టోబరు నెలలో వార్ధాలో జరుగనున్న అ. భా. కాం. సం. అంగీకరించవలసి ఉంది. కాంగ్రెసు శాసన సభ్యులద్వారా ఈ తీర్మానంలోని కోర్కెను రాష్ట్ర శాసన సభలలో ప్రతిపాదింప చేయవలసి ఉంది. వర్కింగు కమిటీ సమావేశం సెప్టెంబరు 9-15 తేదీలలో జరిగింది. సెప్టెంబరు 11 వ తేదీని రాజుగారు సందేశమిచ్చారు. అందులో ఉభయులకూ తటస్థించిన ఈ సంగ్రామాపాయాన్ని ఎదుర్కోవడంలో ఇండియాలోని యావన్మంది ప్రజల సానుభూతి సహకారాలూ ఉంటవని ఆయన ఆశిస్తున్నట్లు ప్రకటించాడు. "బ్రిటను స్వార్థపరత్వంతో పోరాడటంలేదు. మానవజాతియొక్క భవిష్యత్తుకు అత్యవసరమైన ఒకానొక సిద్ధాంతాన్ని నిలబెట్టటానికి పోరాడుతూన్నది." అన్నాడాయన. భారత దేశపు కేంద్ర శాసనసభల రెండింటి సమిష్టి సమావేశ ప్రారంభంలో, రాజప్రతినిధి చక్రవర్తిగారి సందేశాన్ని చదివేముందు, ఫెడరేషనుకోసం చేయబడుతూన్న సన్నాహాలన్నీ నిలుపుదల చేయబడినవనిన్నీ, ఫెడరేషనును నిర్మించవలెననే ఆదర్శంమాత్రం చెక్కుచెదరకుండా అలాగే ఉన్నదనిన్నీ ప్రకటించాడు. ఇది జరిగిన కొలదికాలానికే వర్కింగు కమిటీవారి ప్రకటనపైన గాంధీజీ విమర్శచేశాడు. ఆ విమర్శను సంగ్రహంగా వ్రాయడం అసాధ్యంకావడంచేత పూర్తిగా ఈదిగువ నుదహరిస్తూన్నాము.

"ప్రపంచ క్లిష్టదశనుగూర్చి వర్కింగు కమిటీవారుచేసిన ప్రకటన అంతిమ రూపం తాల్చడానికి పూర్తిగా నాలుగురోజులు పట్టింది. కమిటీవారి కోరికపైన జవహరలాలు తయారుచేసిన ఆ ముసాయిదానుగూర్చి వర్కింగు కమిటీలోని ప్రతిసభ్యుడూ తన అభిప్రా

యాన్ని స్వేచ్ఛగా వెల్లడించాడు. బ్రిటిషువారికి మనం చేయదలచుకొన్న సహకారం యావత్తూ బేషరతుగా చేయవలెనని అనుకొన్నవాణ్ని నేనొక్కడనే అయినందుకు నాకు చాలా విచారంవేసింది. ఈసహకారం కేవలం అహింసాపూర్వకంగా ఉండవలెననికూడా నాఅభిప్రాయం. కాని వర్కింగుకమిటీవారు నిర్వర్తించవలసినబాధ్యత చాలా మహత్తరమైనది. కాబట్టి వారు కేవలం అహింసాయుత వైఖరిని అవలంబించలేకపోయినారు. ప్రతిపక్షియొక్క కష్టదశను తన ప్రయోజనంకోసం ఉపయోగించుకోకుండా ఉండగలిగిన అహింసాతత్వాన్ని దేశం యింకా ఆత్మగతం చేసుకోలేదని వర్కింగు కమిటీవారు తలంచారు. కాని తమ అంతిమ నిర్ణయానికి, సరియైన కారణాలను వెల్లడించడంలో, ఇంగ్లీషువారియెడల యింకా దాక్షిణ్యం చూపవలెనని వాంఛించారు. ఈ ప్రకటనను వ్రాసిన రచయిత మంచిశిల్పి. సామ్రాజ్యవాదం యేరూపంలో తలెత్తినా దానిని ప్రతిఘటించడంలో యెవ్వరూ ఆయనను అతిక్రమించలేరు. అయినప్పటికీ ఆయన ఇంగ్ల ప్రజలమిత్రుడు. స్వభావంలోనూ ఆచారవ్యవహారాలలోకూడా ఆయనను భారతీయునికంటె ఆంగ్లేయునిగా పేర్కొనడం ఉచితం. ఆయన నా దేశీయులకంటెకూడా ఇంగ్లీషువారితోనే ఎక్కువ చనువుగా మెలగగలరు. తనస్వేచ్ఛకు [illegible] ఉన్నా ఆయన ఓర్చుకోలేరు. అందువలన ఆయనను సర్వమానవ శ్రేయోభిలాషి అనాలి. ఆయన తీవ్రమైన జాతీయవాది అనేమాటనిజమే. అయినప్పటికి ఆయన జాతీయవాదం చక్కని అంతర్జాతీయ తత్వంతోకలసి మరింత వన్నెకెక్కింది. కాబట్టి ఈ ప్రకటన తన దేశీయులకూ బ్రిటిషు ప్రభుత్వానికీ బ్రిటిష్‌ప్రజకేగాక, భారతదేశంవలె పరాధీన స్థితిలోఉన్న ప్రపంచంలోని తదితర పీడితజాతులకోసంకూడా ఉద్దేశించి వ్రాయబడింది. భారతదేశం తన స్వాతంత్ర్యాన్నే కాకుండా ప్రపంచంలోని తదితర పీడితజాతుల స్వాతంత్ర్యాన్నిగూర్చి కూడా ఆలోచించేటట్లు వర్కింగుకమిటీద్వారా ఆయన చేయగలిగారు.

“వర్కింగుకమిటీవారు ఈ ప్రకటనను ఆమోదించడమే గాక, కాలానుసరణంగా తటస్థింపనున్న పరిస్థితులకనుగుణంగా వ్యవహరించేటందుకు, ఆయన యిష్టంవచ్చిన సభ్యులతో ఆయన అధ్యక్షతకిందనే ఒక ఉపసంఘాన్ని కూడా నియమించారు ఈ ప్రకటనను కాంగ్రెసులోని అన్నిపక్షాలవారూ ఏకగ్రీవంగా బలపరుస్తారని ఆశిస్తున్నాను. వారిలో అత్యంత బలిష్టమైన పక్షంవారుకూడా ఈ ప్రకటన దుర్బలంగా ఉన్నదనజాలరు. చరిత్రలో అత్యంత ప్రాముఖ్యమైన ఈసమయాన కార్యరంగంలోకి దిగవలసివస్తే తమకు తగినంత బలమున్నదని కాంగ్రెసువాదులందరూ విశ్వసించాలి. కాంగ్రెసు వాదులు చిన్నచిన్న తగాదాలతో కాలక్షేపంచేస్తూ ఉండడం విచారకరం. వర్కింగుకమిటీవారు నడిపిన చర్యవలన యేదైనా చెప్పుకోదగిన మహోద్యమం తటస్థించవలెనంటే ప్రతి

కాంగ్రెసువాదీ మారుమాట చెప్పకుండా ఏకగ్రీవంగా వారిఆజ్ఞలకు లోబడాలి. భారత దేశంలోని తదితర రాజకీయపక్షాలూ, సంఘాలూ అన్నీకూడా, బ్రిటిష్‌ప్రభుత్వంనుండి కాంగ్రెసు వర్కింగుకమిటీవారు కోరిన విస్పష్టప్రకటనవెంటనే జరగాలనీ యేకీభవిస్తూ అందుకనుగుణంగా ఈ యుద్ధపరిస్థితులలో తమకు సాధ్యమైన చర్యజరుపగలరనికూడా ఆశిస్తూన్నాను. ఇండియా దేశమునేగాక బ్రిటిష్‌ప్రభుత్వాధికారముక్రిందనున్న తదితర దేశాలనుకూడా స్వేచ్ఛాస్వాతంత్ర్యములుకల దేశాలుగా పరిగణించడం నేడు బ్రిటిష్ వారు ప్రజాస్వామ్యమునుగూర్చి చేస్తూన్న ప్రకటనలకు స్వభావానుగుణంగా ఉంటుం దని నాఅభిప్రాయం. ఇలాజరుగకపోయినట్లయితే పరాధీనదేశాల సహకార అహింసాయుతమైనదైతేనేతప్ప స్వచ్ఛందంగా యెన్నడూ లభించనేరదు. బ్రిటిషు రాజకీయ దురంధరులలో మానసిక పరివర్తనం కలగడమే యిప్పుడు జరుగవలసిన పని. ఇంకావిస్పష్టంగా చెప్పవలెనంటే, యుద్ధంప్రాంభంకాగానే బ్రిటిషుప్రభుత్వంవారు ప్రజాస్వామ్యంలో తమకుగల విశ్వాసాన్ని వెల్లడిస్తూ చేసిన ప్రకటనను, బ్రిటనులోని ఉపన్యాసవేదికలనుండి అనుదినమూ వినిపిస్తూన్న మాటలనూ ఆచరణలో పెట్టడానికి తగిన న్యాయమయిన చర్యతీసుకోవడమే ఇప్పుడు మనకు కావలసింది. గ్రేటు బ్రిట నిప్పుడు ఇష్టంలేని ఇండియాను యుద్ధంలోకి యీడుస్తుందా లేక నిజమైన ప్రజాస్వామ్య రక్షణకోసం ఇండియాను సమాధానపఱచి తనకుమిత్రంగా చేసుకొంటుందా? ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాల యుద్ధసన్నాహాలకు అనుకూలంగా కాంగ్రెసు చేసే సహాయాన్ని ఆ దేశాలురెండూ ఒక ఉత్కృష్టమైన నైతికభాగ్యంగా భావించాలి. ఎందువల్లనంటే యుద్ధంలోకి పంపేటందుకు కాంగ్రెసుకు సైనికులులేరు. కాంగ్రెసు హింసాపరికరముల తోగాక అహింసావిధానంతో పోరాడుతుంది. ఆ అహింసావిధానం ఆదర్శప్రాయమైన ఉత్కృష్టతను పొందకపోయి ఉండవచ్చు. ఇంకా అపరిణతంగాకూడా ఉండిఉండ వచ్చు."

దీని తరువాత క్రొత్తగా నియోగింపబడిన యుద్ధఉపసంఘంవారు రాష్ట్రకాంగ్రెసు సంఘాలకు ఒక సర్క్యులరును పంపినారు. అందులో "సరియైన సమయంరాక మునుపే వ్యవహారం శ్రుతిమించిపోయేటట్టుగా, మనం వ్యక్తులుగాగానీ సమిష్టిగాగానీ యేమీ మాట్లాడరాదు; యేమీచేయరాదు." అనిఉంది.

ఈయుద్ధ ఉపసంఘం కొద్దికాలముమాత్రమే ఉంది. ఈకొద్దికాలంలోకూడా యేమీ చెప్పుకోతగిన పనిచేయలేదు. ఇది 1939 సెప్టెంబరు 16 వ తేదీని నిర్మింపబడి రాఙ్ఘుర్ కాంగ్రెసు జరిగేవరకూ అనగా 1940 మార్చి 19 వ తేదీవరకూ ఉంది. రాం ఘురులో ఈ ఉపసంఘం పునరుద్ధరింపబడలేదు. సెప్టెంబరు 26 వ తేదీని అప్పుటిభారత

రాజ్యాంగ కార్యదర్శి మొట్టమొదటి ప్రకటనచేశాడు. ఈయన 1940 ఏప్రిల్ వరకూ యిటువంటి ప్రకటనలు చేస్తూనే వున్నాడు. 1940 ఏప్రిల్ లోది ఈయన చేసిన చిట్టచివరి ప్రకటన. తరువాత ఈయన స్థానాన్ని యల్. యస్. అమెరీ ఆక్రమించాడు. ఈ ప్రకటనలన్నీ ఒకటే మూసలో తయారయిన అచ్చులులాగా, ఒకే విధానంలో బయట పడుతూండేవి. వాటికి తగిన జవాబులు కూడా అప్పటికప్పుడే ప్రకటింపబడుతూండేవి. కాని వీటివలన ఇండియాకు కలిగిన ప్రయోజనం యిసుమంతైనా కూడా లేదు. ప్రతి ప్రకటనా అభివృద్ధినిరోధకంగా ఉండటమే కాక కోపకారణంగాకూడా వుండేది. అందువల్ల కాంగ్రెసు యుద్ధంతోనూ పరిపాలనాధికారాలతోనూకూడా జోక్యంకల్గించుకోకుండా వైదొలగవలసిన స్థితి యేర్పాటయింది. ఇండియాలోని అన్ని వర్గాలవారూ ప్రభుత్వానికి చేస్తూన్న సహాయాన్ని శ్లాఘిస్తూండటమే ఆ ప్రకటనలన్నిటిలోనూ కనపడే సారాంశం. సంస్థానాధిపతులందరూ, సైనికులనూ ధనమునూ సరఫరా చేయుటమే గాక వారుకూడా స్వయంగా చేస్తూన్న సేవను కొనియాడడమున్నూ, వ్యక్తులు పంపిన సహాయసానుభూతులనూ శుభసందేశాలనూ ప్రశంసిస్తూండడం, పం. సింధురాష్ట్రాల ప్రధాన మంత్రులు బేషరతుగా బ్రిటనుతో సహకారం చేయడానికి కంకణం కట్టుకొన్నందుకు వారిని ప్రత్యేకం స్తుతించడమూ - ఇవివారి ప్రకటనలలో ముఖ్యంగా కనబడే విషయాలు. చిట్టచివరకు ఇండియాలోని అన్ని రాష్ట్రాల గవర్నర్లతోనూ ఆ యా రాష్ట్రీయ మంత్రులు సంపూర్ణంగా సహకరిస్తూన్నందుకు ఘనతవహించిన రాజుగారి ప్రభుత్వం చాలా సంతోషిస్తూన్నట్లు ఆ ప్రకటనలో విస్పష్టం చేయబడేది. ఇవి మన మంత్రులు పనిచేస్తూన్న కాలంలో చేయబడిన ప్రకటనలలోని ముఖ్యాంశాలు. ఇక భారతజాతీయమహాసభ వారి పక్షాన మాట్లాడడానికి అధికారం గలవారు చేసిన ప్రకటనలో భారతదేశం యుద్ధంలో పాల్గొని బ్రిటనుకు సహాయపడవలెనంటే ఇండియా బ్రిటనుదేశాల రాజకీయ బాంధవ్యంలో మార్పు కలిగితేనే తప్ప సాధ్యంకాదని వ్రాయబడిన వాక్యాన్ని పురస్కరించుకొని ఆమరునాడు జెట్లండు ప్రభువేమన్నాడో పరిశీలిద్దాము. ఈ విషయంలో ఆయన ప్రత్యుత్తరం చెబుతూ లార్డు స్నెల్ చెప్పిన వాక్యాలను ఉదాహరించి యిలా అన్నాడు. "ఇది సమయంకాకపోవచ్చును కాని, కాంగ్రెసు నాయకులు తామిప్పుడనుభవిస్తూన్న దానికంటె ఇంకా ఎక్కువ స్వపరిపాలనము కావలెనని పునరుద్ఘాటించడానికి అవకాశం తీసుకోవడం సహజం" ఈ మాటలన్నీ అంతటితో ఊరుకోక ఎంతో అనుగ్రహం కనుపరుస్తూ ఇంకా యిలా అన్నాడు. "చాలామంది కాంగ్రెసు నాయకులను నేనెరుగుదును. వారు చాలా దేశభక్తులు. కాని వారికొక్కొక్కప్పుడు

పైచూపేకాని కిందిచూపు ఉండదు. తమ కాళ్ళదగ్గర ఉన్న అడ్డంకులనుకూడా వారు గమనించలేరు." అని 'కాంగ్రెసు నాయకులు తమ హక్కులను పునరుద్ఘాటించే టందుకీ అవకాశం తీసుకొన్నందుకు వారిని గట్టిగా మందలించాడు. సమయానుకూలం గానూ గౌరవ ప్రదంగానూ ప్రవర్తించడంవల్ల బ్రిటిష్‌వారి చిత్తవృత్తిలో పరివర్తనం కలగడం సహజమన్నాడు. బ్రిటిష్‌జాతి చావుబ్రతుకులలో ఉండి పోరాడుతూన్న సందిగ్ధసమయంలోనే కోపోద్రేకంతో తమ హక్కులనుగూర్చి చెప్పడంకంటె మరొక మంచిసమయంలో చెప్తే వారింకొకంటె బాగా వినగలరన్నాడు. నేటి పరిపాలనా వ్యవహారాలలో దక్షులయి ప్రసిద్ధజాతీయవాదులెందరో భారతదేశంలో ఉండడం ఆదేశముయొక్క గొప్ప అదృష్టమని అంటూ అటువంటివారంతా ఈ కష్టసమయంలో రాష్ట్రప్రభుత్వాలనుండి రాజీనామాలిచ్చి వచ్చివేయడం విషాదకర విషయమని విల పించాడు. భారతజాతీయవాదులు తమ రాజకీయ హక్కులను గూర్చి సమయంకాని సమయంలో పునరుద్ఘాటింప పూనుకొన్నందుకు గట్టిగా మందలించడమే ఆయన ఉప న్యాసంలోని ముఖ్యోద్దేశం.

జెట్లండు ప్రభువు ఉపన్యాసంచేసిన కిందటిరోజే గాంధీజీ రాజప్రతినిధిని రెం డవసారి దర్శించి సుదీర్ఘంగా సంభాషించాడు. తరువాత 28 వ తేదీని లార్డు జెట్లండు కీవిధంగా ప్రత్యుత్తరమిచ్చాడు.

" హిందూదేశ వ్యవహారాలపైన ప్రభువులసభలో జరిగిన చర్చనుగూర్చి రాయిటరు పంపిన సంగ్రహ కథనం ముందుగా నాకు చూపబడింది. ఈ సమయంలో నేను మూకీభావం వహించడం ఇండియాకూ ఇంగ్లండుకూ కూడా అపకారం చేయడమే అవుతుందేమో. కాంగ్రెసుకు గౌరవప్రదములుకాని పోలికలతో ప్రభువుల సభలో తిరిగీ పాతపాటలే పాడతారని నేననుకోలేదు. కాంగ్రెసు యావన్మంది భారతీయులకూ సంబంధించిన సంస్థ అని యిప్పటికీ నా నమ్మకం. ఒక అర్ధశతాబ్దానికిపైగా కులమత వర్గ విచక్షణలేకుండా భారతదేశ ప్రజానీకంలోని అత్యధికసంఖ్యాకులకది ప్రాతినిధ్యం వహిస్తూన్న ఏకైక సంస్థ అని చెప్తే ఎవ్వరికీ కోపం రానక్కరలేదు. ముసల్మాను లకుగానీ సంస్థాన ప్రజా సమూహమునకుగానీ ప్రతికూలమైన ప్రయోజనం కాంగ్రెసు కేమీలేదు. కాంగ్రెసు సంస్థాన ప్రజల ప్రయోజనములకుగూడా ప్రాతినిధ్యం వహించ గలదని ఇటీవల నిస్సందేహంగా ధ్రువపడింది. అటువంటి కాంగ్రెసు సంస్థయే బ్రిటిష్ వారి ఉద్దేశమునుగూర్చి స్పష్టమైన ప్రకటన చేయవలసిందని కోరింది. బ్రిటిష్ ప్రపంచం లోకి సమస్త ప్రజానీకముయొక్క స్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్నట్లయితే వారి సంగ్రామోద్దేశాలలో ఇండియా స్వాతంత్ర్యంకూడా తప్పకుండా ఇమిడి ఉన్నదని

-వారి ప్రతినిధులు స్పష్టమైనభాషలో ప్రకటించవచ్చును. అయితే ఆస్వాతంత్ర్య స్వరూపం ఎలా ఉండాలో భారతీయులే నిర్ణయించుకోవలసి ఉంటుంది. బ్రిటిష్‌వారు చావుబ్రతుకుల పోరాటంలో చిక్కుకొని ఉన్నప్పుడు వారి సంగ్రామోద్దేశాలను గూర్చి స్పష్టమైన ప్రకటన చేయవలసిందని భారతీయులు కోరడం, కూడని పని అని జెట్లెండు నిందారోపణ చేయడం యెంతమాత్రం తగదు. కాంగ్రెసు అటువంటి ప్రకటన చేయమని కోరడంలో అగౌరవంగానీ అశ్రద్ధగానీ లేదని నేనంటాను. స్వతంత్రభారతదేశపు సహాయానికిమాత్రమే యేమైనా విలువ వుంటుంది. యుద్ధానంతరం ఇంగ్లాండుదేశపు స్వాతంత్ర్యం మాట యెంతనిశ్చయమో ఇండియా స్వాతంత్ర్యం విషయంకూడా అంత నిశ్చయమని ప్రజలకడకుపోయి చెప్పడానికి ధైర్యం కలగవలెనంటే కాంగ్రెసు బ్రిటిష్‌వారి సంగ్రామోద్దేశాలను తెలుసుకొనితీరాలి. ఇంగ్లాండుదేశపు మిత్రుడుగా ఆంగ్లరాజకీయ ధురంధరులకు నా ప్రార్థన. యేమంటే, సామ్రాజ్యవాదుల పరిభాషను మరచిపోయి సామ్రాజ్యవాదులలోచిక్కుకొని ఉన్న ప్రజానీకముకొరకు నూతనాధ్యాయమును ప్రారంభించవలసిందని."

కాంగ్రెసు సంగ్రామోపసంఘాధ్యక్షుడు ఇంకొక అడుగు ముందుకుపోయినాడు. వర్కింగు కమిటీవారి ప్రకటన ఒక్క ఇండియా పక్షమునసేగాక నిరాశాపూరితములైన మానవ హృదయాలలో ఆశాజ్యోతిని ప్రజ్వలింప చేసేటందుకు ప్రపంచ ప్రజానీకములోని అత్యధిక సంఖ్యాకుల పక్షానకూడా ఉద్దేశింపబడ్డదన్నాడు. అంతేకాదు "లార్డు జెట్లండు పాతకాలపునాటి మాటలు మాట్లాడాడు. ఆయన యిప్పుడిచ్చిన ఉపన్యాసం ఇరవైయేళ్ళకింద యిచ్చి ఉండవలసింది." అని నెహ్రూ అన్నప్పుడు జెట్లండుకు తలతిరిగి ఉంటుంది. "మేము కోరిన కోరికలు కోమటిబేరాలలాంటివి కావు" అని సగర్వంగా ఎత్తిపొడిచాడు నెహ్రూ. "ప్రపంచ స్వాతంత్ర్యం చేకూరుతుందనీ, అందులో ఇండియాకూడా ఇమిడి ఉంటుందనీ మాకు నమ్మకం కలిగించాలి. అప్పుడే ఈ యుద్ధంలో మాకు అర్థం కనిపిస్తుంది. మాకొరకేకాకుండా సమస్త ప్రజానీకం కొరకూ నడపబడుతూన్న ఈ ఘనకార్యంలో మామనస్సులనూ హృదయాలనూ లీనంచేసి పాల్గొనడానికి సావకాశం కలుగుతూంది. బ్రిటిష్ ప్రజానీకంలోని అధిక సంఖ్యాకులు ఇండియాలోని మాలో అనేకమందికిలానే ఒకే ప్రపంచ ఆదర్శములను కలిగిఉన్నారని అనుకోడంచేతనే ఆ ఆదర్శాలను అందుకోవడం కోసం మా సహకారాన్ని వారికి వాగ్దానం చేశాం. ఈఆదర్శాలే అక్కడ లేనపాతే మేమెందుకొరకు యుద్ధంచేయాలి? బహిరంగంగా ప్రకటింపబడి ఆచరణలోకి తేబడుతూన్న ఆదర్శాలకోసం యిచ్ఛాపూర్వకంగా స్వతంత్ర భారతదేశం మాత్రమే సంపూర్ణసహకారం చేయగలదు."అన్నాడు

కాంగ్రెసు యుద్ధ ఉపసంఘానికి అధ్యక్షుడైన జవహరలాలు నెహ్రూ. వైస్రాయిని సందర్శించడానికి ఆయన భవనానికి వెళ్ళినవారు ౫౨ మంది అనీ, అందులో గాంధీ, రాజేంద్రప్రసాదు, జవహరలాలు నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేలు, సుభాస్ బాబు, జిన్నా, ఇంకా కొంతమంది ముస్లిం లీగు సభ్యులు సంస్థానాధిపతుల సభాధ్యక్షుడు మాత్రమే గాక భారత జాతీయ జీవితంలో ప్రాముఖ్యస్థానం వహించిన వారింకా అనేక మంది ఉన్నారనీ రాజప్రతినిధి ప్రకటించాడు.

తరువాత కొంతకాలానికి అక్టోబరు 9, 10 తేదీలలో అ. భా. కాం. సం., వార్ధాలో సమావేశమై వర్కింగు కమిటీవారుచేసిన ప్రకటనను స్థిరపరుస్తూ ఒక అత్యవసర సంగ్రామోపసంఘాన్నికూడా యేర్పాటుచేసింది. వలస దేశాలన్నిటికి ప్రజా స్వామ్య సిద్ధాంతాన్ని వర్తింపచేస్తూ, స్వయంనిర్ణయ సూత్రమును ఆచరణలోకితెచ్చి, సామ్రాజ్య వాదుల యాజమాన్యమును తొలగించవలెననికూడా ఆ సభవారు కోరారు. ముఖ్యంగా ఇండియాను స్వతంత్రదేశంగా ప్రకటించి ఆస్థితి కనుగుణంగా వెంటనే సాధ్యమైనంత ఎక్కువ రాజకీయాధికారములను ఆచరణలోకి తేవలెననికూడా వారు తీర్మానించారు.

భారతదేశమంతా ఏక ఖండం. అది అవిభక్తం. సంస్థానాలులేని భారతదేశం పక్షవాతంతో అంగవైకల్యం పొందినట్టు కనిపిస్తుంది. ఈ సందిగ్ధ స్థితిలో 562 సంస్థానాలుగల ఇండియన్ ఇండియాయున్నూ, పదకొండు రాష్ట్రాలుగల బ్రిటిష్ ఇండియాయున్నూ ఒకేఒక సమగ్ర నాయకత్వంకింద నడపబడుతూండడం చాలా అదృష్టమని చెప్పాలి. 1939 ఫిబ్రవరి నెలలో లూధియానా నగరంలో జరిగిన, సంస్థాన ప్రజా మహా సభకు జవహరలాలు నెహ్రూ అధ్యక్షత వహించాడు. అదే సంవత్సరం అక్టోబరు నెలలో ఇండియన్ నేషనల్ కాంగ్రెసు నియమించిన యుద్ధ సంఘానికి అధ్యక్షుడైనాడు. ఈ విధంగా ఆయన ఒక్కడే యుద్ధ సంఘాధ్యక్షుడుగానూ, సంస్థాన ప్రజా మహా సభాధ్యక్షుడుగానూకూడా వ్యవహరించాడు. కాంగ్రెసు వర్కింగు కమిటీవారి ప్రకటనతోనూ అ. భా. కాం. సం. వారి తీర్మానంతోనూ "ఇండియా దేశముయొక్క ఐక్యతయందును సమస్త ప్రజానీకముయొక్క స్వాతంత్ర్యమునందునూ విశ్వాసం కలిగిన తాము యేకీభవిస్తున్నామని" సంస్థానప్రజా స్థాయిసంఘంవారు అక్టోబరు 11వ తేదీని ప్రకటించారు. అంతేకాక "ప్రజాస్వామ్య స్వాతంత్ర్యములకోసం భారతప్రజానీకముయొక్క వాంఛను కాంగ్రెసు విస్పష్టంగా వెల్లడించినందుకు" వారు తమ సంతృప్తిని వెలిబుచ్చుతూరాబోయే స్వాతంత్ర్యంలో సంస్థానప్రజలు సమాన భాగస్వాములుగా నుండి సమాన బాధ్యతను వహించడానికి సంసిద్ధపడాలనికూడా ఉద్బోధించారు. కాబట్టి బ్రిటిష్ వారి యుద్ధోద్దే

శాలనూ శాంతి ఉద్దేశాలనుకూడా సంపూర్ణంగానూ అసందిగ్ధంగానూ ప్రకటించవలసిందని కాంగ్రెసు కోరినకోరికతో సంస్థాన ప్రజాసంఘాల స్థాయిసంఘంకూడా యేకీభవించిందన్నమాట. సంస్థానాధిపతులు తమ సంస్థానాలలో అచ్చమయిన నిరంకుశ ప్రభుత్వమును చలాయిస్తూ యుద్ధప్రయత్నంలో ప్రజాస్వాతంత్ర్యమును నిలబెట్టడానికి సక్రమమైతేని సహాయమూ చేస్తామని వాగ్దానాలు చేయడంకంటె హాస్యాస్పదమైన విషయం మరొకటి ఉండబోదని సంస్థానప్రజల స్థాయిసంఘంవారి ప్రకటనలో ఉపహరించారు. సంస్థాన ప్రభుత్వాలు ప్రజా ప్రతినిధులతోకూడి ప్రజాభిప్రాయానుసారంగా నడుచుకొంటూ, ప్రభుత్వ విధానంలో ముఖ్యమైన మార్పులను చేస్తేనేగాని ప్రజల సహకారం ఉండబోదనికూడా స్థాయిసంఘం ఒకసారి విస్పష్టంగా విశదీకరించింది.

యుద్ధం ప్రారంభమైన నెలాపదిహేను రోజులవరకూ రాజప్రతినిధి ఒకరితరువాత ఒకరిని ఆహ్వానిస్తూనే ఉన్నాడు. అందుమూలాన అనేకమందికి రాజప్రతినిధి భవనానికి ఆహ్వానింపబడవలెననే పిచ్చిభ్రమ ఒకటి వ్యాపించింది. దాని ఫలితంగా భారతజాతి తన సహనాన్ని కోల్పోయేస్థితి తటస్థించింది. తనను చూడవచ్చిన వారు చెప్పినదంతా తలవంచుకొని వ్రాసుకోవడమే రాజప్రతినిధిని లిన్‌లిత్‌గో ప్రభువు చేసినపని. ఇది అందరికీ తెలిసిన సంగతే. ఆయన పూర్తిగా నిష్కపటంగా చర్చించిన ౫౦ మంది పెద్ద మనుష్యుల సంభాషణ ఫలితంగా "వివిధాభిప్రాయాలుగల ప్రతినిధులందరూ విభిన్న దృక్పథములు విభిన్నవాంఛలూ, విభిన్నసమస్యలు, విభిన్నపరిష్కారాలూ వెల్లడిస్తూన్నారనీ, ఒకరితో వకరికి పొత్తు కలియడంలేదనీ, కొంతమందికి ప్రత్యేకరక్షణలు కావాలనీ, మరికొంతమందికి ప్రత్యేకస్థానాలు కావాలనీ వాదిస్తూన్నారనీ, ఇందుకు పరిహారంగా ఇంకా కొందరు రాజ్యాంగ శాసనంలో మరికొన్ని ఎక్కువ మార్పులు జరగాలంటూన్నారనీ" తేలింది. 'ఇండియావిషయంలో బ్రిటను అవలంబించదలచుకొన్న రాజనీతిని'గూర్చి అక్టోబరు 18 వ తేదీని రాజప్రతినిధి చేసిన ప్రకటనను ఈ వాక్యాలతోనే ప్రారంభించాడు. 'రాజప్రతినిధి ఇంకా కొంత శ్రమచేసి మరికొంతమందితో సంభాషించి ఉన్నట్లయితే ఇంకా మరికొన్ని భేదాభిప్రాయాలు వెల్లడియైయుండేవి. ఆయన సంభాషణలకు అంతులేనట్లే భిన్నాభిప్రాయాలకుకూడా అంతుఉండదని ఆయనకు తెలిసేఉండేది. ఆయన ఈ అభిన్నదృక్పథాల సారాంశమును గ్రహించడానికి బదులుగా ఆయానాయకులలో పాతుకొనిపోయిన భేదాభిప్రాయాలను మనస్సులో పెట్టుకొని కంగారైనాడు. ఆదృష్టితోనే సారాంశాలను వివరించి తీర్పుచెప్పినాడు. ఆయన దృష్టిలో వివరించిచెప్పడానికి వీలులేనివిగా తోచిన ముఖ్యవిషయాలు మూడు.

(౧) ఈ యుద్ధంలో బ్రిటిషుప్రభుత్వంవారి ఆశయాలేమిటి? పురాతన చరిత్రా ఉత్కృష్ట సంప్రదాయాలూ గల భారతదేశం ఆ ఆశయాలతో ఎంతవరకు ఏకీభవించి హృదయపూర్వకంగా పనిచేయడానికి సావకాశముంటుంది?

(౨) బ్రిటిష్ కామన్ వెల్తుకు సంబంధించి ఇండియా పొందవలసిన పరమావధిని దృష్టిలో ఉంచుకొని, భరతఖండానికి భవిష్యత్తులో ఎటువంటి రాజ్యాంగమును నిర్ణయించాలి?

(3) యుద్ధాన్ని కొనసాగించడానికి కలసిమెలసి ప్రయోజనకరంగా పనిచేసే టందుకు, ఇండియా యొక్కయు, ఇండియా ప్రజాభిప్రాయముయొక్కయు వాంఛితమును యేవిధంగా సంతృప్తిపరచాలి?

ఈ విషయాలన్నిటికి వెంటనే ప్రత్యుత్తరం చెప్పేశాడు రాజప్రతినిధి. "యుద్ధం కొనసాగిస్తూన్న బ్రిటిషుప్రభుత్వంవారే యుద్ధాశయాలనుగూర్చి వివరంగా తమ అంతిమ నిర్ణయాలను చెప్పలేదు. అటువంటివివరణం యుద్ధంసాగుతూండగా రావచ్చును. అది సహజంకూడాను. కాని అది వచ్చినప్పుడు మిత్రమండలివారిలో యేఒకరి ఆశయం గానూ ఉండదు. యుద్ధంసమాప్తమయ్యేలోగానూ యుద్ధంమధ్యలోనూకూడా, ప్రపంచ స్థితిలోగానీ, యుద్ధములో చిక్కుకొనిఉన్నవారెదుర్కోవలసిన పరిస్థితులలోగానీ అనేకం మార్పులురావచ్చును. కాబట్టి యుద్ధం సమాప్తమయినప్పటి స్థితిగతులను బట్టీ, యుద్ధంమధ్యలో తటస్థించిన పరివర్తనాలనుబట్టి, యుద్ధాశయాలనుగూర్చిన ప్రకటన ఉంటుంది." అన్నాడు. తరువాత ప్రతివిషయం పరిష్కరించుకోవడానికీ తప్పనిసరిగా యుద్ధంచేయవలసిన అవసరంలేని మంచిఅంతర్జాతీయ విధానమును సృజించడం యుద్ధాశయాలలో ఒకటిగా, బ్రిటిష్ప్రధానిచెప్పిన సాధారణయుద్ధాశయాలలోనుండి, రాజప్రతినిధి ఉదహరించాడు.

పిదప ఇండియా భవిష్యత్తునుగూర్చి వన రాజ్యాంగనిర్మాణ పరిణామములను గూర్చి మాట్లాడాడు. మాంటుఫర్డు సంస్కరణలు మొదలుకొని 1919 చట్టంలోని ఉపోద్ఘాతమును, "ఇండియా సహజంగా అధినివేశ ప్రతిపత్తిని పొందడమే ఆదేశము యొక్క రాజకీయాభివృద్ధినిగూర్చి తాముద్దేశించిన విషయం" అని ఇర్విన్ప్రభువు ఆఉపోద్ఘాతానికి చేసిన వ్యాఖ్యానమును ఉదహరించాడు. పిమ్మట "వనసామ్రాజ్యంలోని తక్కినఅధినివేశాలతోపాటు తగినస్థానం ఇండియాకూడా ఆక్రమించుకోవడానికివీలుగా ఇండియా యునైటెడ్ కింగ్డంలకుగల సంబంధబాంధవ్యాలను పెంపొందించాలి." అని ఇన్స్ట్రుమెంటు ఆఫ్ ఇన్స్ట్రక్షన్సులో ఉన్నసూచనను రొత్తిచూపించాడు.

చివరకు "1935 వ సంవత్సరపు ఇండియాచట్టం తయారయ్యేనాటికి వీలైనంతమంది అత్యధిక సంఖ్యాకులచే అంగీకరించబడిన అభిప్రాయాలను అనుసరించే ఆచట్టం వ్రాయబడ్డదన్నాడు. కాని "ఇండియాదేశపు భవిష్యత్సమవాయప్రభుత్వ (Federal Government) ప్రణాళికనుగూర్చి పునరాలోచన చేయవలసి వచ్చినప్పుడున్నూ పార్లమెంటువారుచేసిన వాగ్దానాలకు అనుగుణమైన ప్రణాళికను విచారించి ఆచరణలో పెట్టవలసివచ్చినప్పుడున్నూ, అప్పటి పరిస్థితులనుబట్టి 1935 చట్టంలోని విషయాలు యెంతవరకిప్పుడు తగివుంటవో ఆనాడు తిరిగి ఆలోచనచేయబడును" అని రాజప్రతినిధి అంగీకరించాడు. ఇండియాచట్టంలో అవసరమైన మార్పులు చేయవలసివచ్చినప్పుడు, దేశంలోని వివిధసంఘాల యొక్కయు, రాజకీయపక్షాల యొక్కయు ప్రత్యేక ప్రయోజనాలు కలవారి యొక్కయు సంస్థానాధిపతుల యొక్కయు సహకార సహాయములను పొందేటందుకు వారి ప్రతినిధులతో సమాలోచనములను జరుపగలననికూడా రాజప్రతినిధి వాగ్దానం చేశాడు. అనగా భారతీయుల అభిప్రాయములనుబట్టి ఇండియా చట్టమును యుద్ధానంతరం మార్పుచేయడానికి రాజుగారి ప్రభుత్వం అంగీకరించిందనే ఈ వైఉపన్యాసంయొక్క సారాంశం. అయితే ఇండియాచట్టమును సంస్కరించే సందర్భంలో అల్పసంఖ్యాకుల అభిప్రాయాలకు సంపూర్ణంగా విలువ ఈయవలెనని వారుచేస్తూన్న ఆందోళననుగూర్చికూడా వైస్రాయి ఉదహరించాడు. కొందఱు రాజుగారి ఉద్దేశాలనుగూర్చి విపులంగా విశదీకరించవలెనని, మఱికొంతమంది "ఇంతకంటె విశాలమైన ప్రణాళిక" ఉండవలెననీ వాంఛిస్తూన్నట్లుకూడా తనకు తెలుసునన్నాడు రాజప్రతినిధి. "కాని ఈ సందర్భంలో ముఖ్యంగా రెండు విషయాలను గమనించవలసిఉంది. ఒకటి ప్రపంచరాజకీయాలను దృష్టిలోఉంచుకొని, దేశంలోని రాజకీయ పరిస్థితులనుగమనిస్తూ కాలానుగుణంగా వ్యవహరించాలి. రెండు - ఇటువంటి ముఖ్యవిషయాలలో - అనగా లక్షలాది ప్రజల జీవితములకు ప్రధానసంఘాల పరస్పర సంబంధబాంధవ్యములకు భారతసంస్థానాధిపతులకూ, అనేకవాణిజ్య పారిశ్రామిక సంస్థలకూ, [అవి భారతీయులవీకావచ్చును ఐరోపియనులవీకావచ్చును.] సంబంధించినవిషయాలలో సాధ్యమైనంత అత్యధిక సంఖ్యాకుల ఆమోదం పొందితీరవలసిన అవసరంఉంది." అని అన్నాడు తరువాత యుద్ధవ్యవహారములకనుగుణంగా ప్రజాభిప్రాయమును సంఘటితపరచేటందుకొక ఆలోచనాసంఘమును నిర్మించవలెనని చెప్పినాడు." కానివైస్రాయిఉద్దేశించిన ఈఆలోచనాసంఘం పిమ్మట ఇరవైనెలలకు అనగా 1941 జులై 22వ తేదీనిగాని నిర్మింపబడలేదు.

"కొన్నికొన్ని పదాలకోసం భారతదేశముయొక్క ఐక్యతను భంగపరచవలసిన తరుణమిది

కాదని, ఇంతకంటెనూ పెద్దపెద్ద భేదాలు ఉన్నప్పటికీ, భారతదేశపు ఐక్యతనే మన ఆదర్శంగా ఉంచుకొని వ్యవహరించడం ఉచితమనీ, నేను గట్టిగా మిమ్మలను కోరుతున్నాను.” అన్నాడు రాజప్రతినిధి తుదిమాటగా. రాజప్రతినిధికి పదజాలమంటే పడనిమాట నిజమే కాని ఆయనకు సుదీర్ఘ వాక్యాలంటే చాలా యిష్టం లాగున కనిపిస్తోంది. ఇండియా స్వరాజ్యములో ఆకెంత దీర్ఘమైన పరిణామావస్థను పొందవలసి ఉందో అంత దీర్ఘమైన వాక్యాలను ఆయన వ్రాస్తాడు. ఈసందర్భంలో 126 మాటలు గలిగి వ్యాకరణాన్ని సాహిత్యాన్నీ కూడా చికాకుపరచగలిగిన వాక్యాన్ని ఆంగ్లంలో రచించాడాయన. దానికి తెలుగిది.

“రాజ్యాంగ నిర్మాణం విషయంలో నిజంగా ఎంతవరకు ఏకీభావం ఉన్నదో దానినీ, భారతదేశం పొందవలసిన సంపూర్ణస్థితిని త్వరగా పొందేటందుకు చేయదగిన యేర్పాట్ల ప్రాముఖ్యతనూ చిక్కులనూ గమనిస్తూన్న నేను, సాధారణంగా మాటిమాటికి ప్రయోగింపబడుతున్న ఈపదజాలం, నేటి రాజకీయపరిస్థితులలో ఆచరణయోగ్యం కాదనీ, ఇండియాదేశం తన చరిత్రకూ భవితవ్యమునకూ తగిన అభ్యుదయ మార్గమును అనుసరించి అర్హస్థానమును పొందడానికి కావలసిన వివిధసంఘాలయొక్కయు వివిధరాజకీయ పక్షాలయొక్కయు ఐక్యసంఘటనకు తోడ్పడజాలదనీ గట్టిగా విశ్వసిస్తూన్నాను.” ఇది ఎంత దీర్ఘంగా ఉందో దీనికి గాంధీజీ యిచ్చిన ప్రత్యుత్తరం అంత సంగ్రహంగా ఉంది. ఇది ఎంత వాగాడంబరములతో నిండి ఉందో అది అంత సంక్షేపంగా ఉంది.

“విభజించి పాలించమనే పాతవిధానం ఇంకా అలాగే జరుగుతూన్నది. కాంగ్రెసు అన్నం కావాలంటే సున్నం వచ్చింది. కాంగ్రెసు తన ఆదర్శాన్ని అందుకోవడానికి మరొకసారి అడవులపాలు కావాలి. అప్పుడుకాని అది యింకా పవిత్రతను పొంది బలిష్ఠంకాదు. కాంగ్రెసు అధ్యక్షుడైన రాజేంద్రబాబు రాజప్రతినిధి ప్రకటన అత్యంతం ఆశాభంగం కలిగిస్తూన్నది. కాని ఏమాత్రమూ ఆశ్చర్యం కలిగించడం లేద”న్నాడు. “భారతదేశం జాతీయంగానూ అంతర్జాతీయంగానూ ఏ ఆదర్శాలకోసం నిలబడ్డదో అవన్నీ సంపూర్ణంగా తృణీకరింపబడ్డవి. ఇరవైసంవత్సరాలకిందటనే ఈ ప్రకటన కాలదోషం పట్టి ఉంటుంది. ఈనాటి నిజపరిస్థితులకూ యీ ప్రకటనకూ యెక్కడా పొత్తులేదు” అన్నాడు యుద్ధసంఘాధ్యక్షుడు.

ఇండియాలో రాజప్రతినిధి, బ్రిటిష్ పార్లమెంటులో భారతరాజ్యాంగ కార్యదర్శి- ఈ యిద్దరు ఏకకాలమందు ప్రకటన చేయడం బ్రిటిష్ ప్రభుత్వం యింతకాలంనుండీ అవలంభిస్తూన్న రాజనీతివిధానం. బ్రిటిష్ పరిపాలనా విధానాని కనుగుణంగా తాళం వేస్తూన్న కారణంచేత ఇండియా ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి లోబడి ఉన్న. ఒక

శాఖగా వర్ణింపబడుతూవచ్చిన మాటకూడా వాస్తవం. ఈసంగతి యిలా ఉండగా దిగువనుండి ప్రజలుచేస్తూన్న ఆందోళనా ఫలితంగాగానీ, పైనుండిభారతరాజ్యాంగకార్యదర్శి పంపుతూన్న ఉత్తరువుల ననుసరించిగానీ భారతదేశ సంస్కరణలు జరుగుతూండలేదనీ, ఇండియా ప్రభుత్వంవారే వాటికి మూలపురుషులని అనేకసార్లు ప్రకటనలు వెలువడుతూవచ్చినవి. త్రాసు ముల్లు ఒకసారి కుడివైపుకూ మరొకసారి యెడమవైపుకు ఒరిగినా తుట్టతుదకు మధ్యలో నిలబడినట్లు మొత్తంమీద రాజప్రతినిధి ప్రకటనయున్నూ భారతరాజ్యాంగ కార్యదర్శి ప్రకటనయున్నూ ఏకకాలమందు జరుగుతూండడమే అలవాటు. కొన్ని ముఖ్యసమయాలలో మాత్రం రాజప్రతినిధి మాట్లాడిన ఆరురోజులకు భారతరాజ్యాంగ కార్యదర్శి ఉపన్యసించడం సంభవించింది. * అక్టోబరు 18 వ తేదీని లార్డు జెట్లండు ప్రభువులసభలో ఒక ప్రకటన చేశారు. అందులో పోలాండుపైన జర్మనీ దండయాత్ర చేయబోతూన్న సమయంలోనూ చేసినతరువాతనూ ఇండియాలో జరిగిన సంఘటనలను వివరిస్తూ "అత్యధిక సంఖ్యాకులుగల అత్యంత శక్తివంతమైన రాజకీయపక్షం భారతజాతీయ కాంగ్రెసు గ్రేటుబ్రిటను చిక్కుకొన్న యుద్ధం తటసించేయెడల ఎలా ప్రవర్తించవలెనో విస్పష్టంచేస్తూ అంతకుపూర్వమే ఒక తోవతొక్కింది." అన్నాడు. ఇండియానుండి సరిహద్దు రక్షణసైన్యాలను ఈజిప్టుకూ ఏడెనుకూ సింగపూరుకూ పంపినందుకు తమ ప్రతికూలభావమును ప్రకటించడానికి కేంద్ర శాసన సభాసభ్యులను రాబోయే శాసనసభకు హాజరుకావలదని కాంగ్రెసువర్కింగు కమిటీ పంపిన ఉత్తరువులను ఆయన ఉదాహరించాడు. "మన సైనిక విన్యాసములను గూర్చి ముందుగానే శాసనసభాచర్చల ఫలితంగా ప్రపంచానికి వెల్లడించడం ఎంతో ప్రమాదకరంగా పరిణమించి ఉండేది. అయినప్పటికీ కేంద్రశాసనసభలోని రాజకీయ పక్షనాయకులను, కాంగ్రెసు పక్షంతో సహా కలుపుకొని పోవడానికి నేనూ రాజప్రతినిధికూడా చాలా ఆందోళనపడ్డాము." అన్నాడు జెట్లండు ప్రభువు. అయితే ఆయన సైనికులను ఫలానాచోటికి పంపుతూన్నామని శాసనసభాపక్షనాయకులకు చెప్పినంత మాత్రంతో వారితో ఆలోచించి వారిఆమోదమునుపొందినట్లుగా భావించవలెనంటాడా? అలా భావించడానికి వీలులేదని అందరికీ తెలుసు. అటువంటప్పుడు ఈ నాయకులందరూ పత్రికలలోనూ సభలలోనూ గందరగోళం చేయనందుకా! ఆయన విచారం? భారతసేనలను సముద్రాలు దాటించి విదేశాలకు పంపుతూన్నామని రాజకీయనాయకు

* భారతదేశ సంస్కరణలనుగూర్చి రాజప్రతినిధి అగష్టు 8 వ తేదీని చేసిన సుప్రసిద్ధ ప్రకటన తరువాత ఆగస్టు 14 వ తేదీని భారతరాజ్యాంగ కార్యదర్శి ప్రకటన జరిగింది.

లకు తెలిపినంతమాత్రంలో వారు నిందారోపణ చేయకుండా ఊరుకోవలసిన అవసరం లేదు. కాని రాజకీయనాయకులకు రాజప్రతినిధి చెప్పిన మాటలు రహస్యంగా చెప్పబడినవనీ, వాటిని రహస్యంగానే ఉంచడం ఆయన ఉద్దేశమనీ జెట్లండు ప్రభువుకూడా ఒప్పుకొని తీరాలి. మాటవరుసకీ సంగతి చెప్పవలసివచ్చింది. ఇక జెట్లండు ప్రభువు యుద్ధ ప్రారంభమునుగూర్చి మాట్లాడుతూ ఈవిషయంలో రాజప్రతినిధి నాయొక్క తోనూ నా సంప్రార్థాంగీకారంతోనూ భారత రాజకీయరంగంలో అత్యంత ప్రముఖపాత్రవహిస్తూన్న మహాత్మా గాంధీతో సన్నిహితసంబంధం పెట్టుకొన్నాడు. భారత ప్రజానీకమునకు బాగా లిపి వారిచే అత్యంతం ప్రేమింపబడుతూన్న ఆ గాంధీమహాత్ముడు, కాంగ్రెసుయొక్క దృక్పథాన్నీ వాంఛలనూ మాకు తెలియచెప్పడమే కాక, మా దృక్పథాన్నీ మా చిక్కులనూ, తెలుసుకోడానికి తానుకూడా సంసిద్ధంగా ఉండి, వాటిని అతిక్రమించేటందుకు హృదయపూర్వకంగా ఆయన మాకు వాగ్దానం చేసిన సానుభూతి సహకారములకు నేనిప్పుడాయనను వ్యక్తిగతంగా అభినందించవలసి ఉంది" అన్నాడు. తరువాత జెట్లండు ప్రభువు గాంధీజీకీ రాజప్రతినిధికీ జరిగిన సమావేశ సంభాషణ ఫలితములను ఉదాహరించడం సహజం.

'గాంధీకి కాంగ్రెసు తరఫున మాట్లాడడానికి అధికారం ఇయ్యబడనందున కేవలం వ్యక్తిగతంగా మాట్లాడుతూ, మన దేశం పాల్గొంటూన్న పోరాటంలో ఇండియా బేషరతుగా మనకు సహాయం చేయవలెనని ఆయన అభిప్రాయం వెల్లడించాడు, అన్నాడు లార్డు జెట్లండు.

కాంగ్రెసు సెప్టెంబరు 15 న చేసిన సమగ్రప్రకటనయున్నూ, ముస్లింలీగు సెప్టెంబరు 18 న చేసిన ప్రకటనయున్నూ రాజప్రతినిధి ప్రకటనకు అనుబంధాలుగా చేర్చబడినవనీ చెప్పినాడు. "జర్మను ప్రభుత్వపద్ధతిని అసందిగ్ధంగా ఖండిస్తూ, తామీ యుద్ధంలో పాల్గొనేముందు మన యుద్ధాశయాలేవో, ముఖ్యంగా అవి ఇండియాకేవిధంగా వర్తింపచేయబడతవో తెలియపరచవలెనని కాంగ్రెసు ప్రకటించింది." అన్నాడు జెట్లండు ప్రభువు. ముస్లింలీగుకూడా కాంగ్రెసుతోపాటు నాజీదురాక్రమణను నిస్సందేహంగా ఖండించినమాట వాస్తవమే. కాని భారతదేశపు ఆంతరంగిక రాజకీయ పరిస్థితులనుగూర్చి కాంగ్రెసుకూ ముస్లింలీగుకూ కావలసినంత విభేదమున్నదన్నాడు. తరువాత మరికొన్ని విషయాలనూ సంఘటనలనూ వివరించిచెప్పి రాజ్యాంగ సమస్యమీద యిలా మాట్లాడాడు. "లిఖితపూర్వకమైన రాజ్యాంగ శాసనములోని నిబంధనలు కేవలం అస్థిపంజరం వంటివి. దినదినమూ దానిని ఆచరణలో పెట్టేవారే దానికి జీవమూ, శక్తీ ఈయగల రక్తమాంసాలను చేకూర్చగలవారు. శాసనమనేపాదు, ఆచరణ అనే

వేరూని సంప్రదాయాలనే శాఖోపశాఖలతో వృక్షం కావాలి. రాజ్యాంగచట్టం జీవాణువులతో పెంపొందే ప్రాణివంటిది. వాతావరణాన్నిబట్టి రూపొంది పుష్టివహిస్తుందది... ఇండియా ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి యింకనూ తీవ్రంగా ఉన్న మతవైషమ్యాలను మాత్రం గుణం లేకుండా చేసుకోవాలి.........భారతీ రాజకీయ రంగంలో ఇంక వెనుకడుగనేది మాత్రముండదు." ఇక సమాలోచన సంఘనిర్మాణమును గూర్చి మాట్లాడుతూ అవి ప్రభుత్వ నియోజిత సంఘములుగా ఉండరనీ రాజకీయ పక్షాలచే ఎన్నుకోబడినవిగాగానీ, నియోగింపబడినవిగాగాని ఉంటవనీ" అన్నాడు జెట్లండు ప్రభువు.

రాజప్రతినిధి ప్రకటన "అసంతృప్తికరంగానూ నిరుత్సాహకరంగానూ ఉన్నదని" వర్కింగుకమిటీ వెంటనే ప్రకటించింది. "అది కేవలం పాతబడ్డ సామ్రాజ్యవిధానాన్ని పునరుద్ఘాటించడంకంటె వేరుకాదు. కాంగ్రెసు యొక్క నిజోద్దేశాలను మరుగు పరుచుకోవడానికి వివిధరాజకీయపక్షాల మధ్యనూ గల విభేదాల కంచాలుగ మాత్రము ఉపయోగపడుతూన్నవి అల్పసంఖ్యాకుల హక్కులను నిలుపడం కాపాడడానికి కాంగ్రెసు కావలసినన్ని హామీలీయడలచుకొంది. ఏవిధంగా చూచినా రాజప్రతినిధి ప్రకటన విషాదకరంగా ఉంది. ఈ పరిస్థితులలో వర్కింగుకమిటీ కాంగ్రెసు ఏవిధమైన సహాయమూ చేయజాలదు. ఇప్పుడేదైనా సహాయముచేస్తే కాంగ్రెసు యింతకాలమూ నిర్మూలించదలచుకొన్న సామ్రాజ్యవిధానాన్ని ఆమోదించినట్లవుతుంది. అంటూ వర్కింగుకమిటీవారు చాలా తీవ్రమైన నిర్ణయాలనుచేశారు. కాంగ్రెసుమంత్రులు రాజీనామాలీయవలెననీ, అంతరంగికపోరాటములకిక స్వస్తిచెప్పి కాంగ్రెసు కమిటీలన్నీ రానున్న సంఘటనలకు సంసిద్ధంగా నుండవలెననీ, భారతదేశ గౌరవానికి కాంగ్రెసు సిద్ధాంతాలకూ భంగం కలుగనిపద్ధతిని వాచా కర్మణా నిగ్రహం కలిగిఉండవలెననీ తీర్మానింపబడింది. కాంగ్రెసువాదులు తొందరపడి శాసనూల్లంఘనము సమ్మెలు వగయిరాలేమీ చేయరాదనీ, అవసరమైనప్పుడు తామే దేశానికి తగిన మార్గమును సూచించడానికి వెనుదీయమనీ కూడా వర్కింగుకమిటీవారు నిర్ణయించారు.

కాంగ్రెసు రాష్ట్రాలలోని కాంగ్రెసు పక్షాలకూ మంత్రివర్గాలకూ మార్గదర్శకంగా ఉండేటందుకు పార్లమెంటరీ సబ్‌కమిటీవారు వర్కింగుకమిటీవారి ఆమోదంతో ఈ దిగువ తీర్మానం చేశారు:—

"రాష్ట్రీయ ప్రభుత్వాలను రాజీనామా పెట్టవలసిందని కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానం ఆదేశిస్తూన్నది. మిగిలిఉన్న అత్యవసర విషయాలను చర్చించడాని కేర్పాటుచేయబడిన శాసన సభా సమావేశములు ముగియగానే

ఈ రాజీనామాలను పంపవలెను కాని 1939 అక్టోబరు 31 వ తేదినాటికి రాజీనామాలు పంపబడవలెనని వర్కింగు కమిటీవారి ఆకాంక్ష.

"ఒరిస్సా, మధ్య రాష్ట్రాల శాసన సభలు నవంబరు మొదటి వారంలో సమావేశం కానున్నవి. ఈ రాష్ట్రాలలోని ప్రభుత్వాలీ సమావేశం ముగిసేవరకూ అధికారంలో ఉంటాయి.

"అస్సెంబ్లీల స్పీకర్లూ డిప్యూటీ స్పీకర్లున్నూ, సభ్యులున్నూ, కౌన్సిలుల అధ్యక్షులూ సభ్యులున్నూ, తమ తమ ఉద్యోగాలనూ స్థానాలనూ విడిచి రాకూడదని వర్కింగుకమిటీవారా కాంక్షిస్తూన్నారు. మంత్రులు పార్లమెంటరీ కార్యదర్శులుమాత్రమే ప్రస్తుతం రాజీనామా ఇయ్యవలెనని వారి ఉద్దేశం.

"యుద్ధాశయాలనుగూర్చి అస్సెంబ్లీలలో ప్రతిపాదింపబడనున్న తీర్మానాలకు నూతన పరిస్థితుల కనుగుణంగా మార్పులు చేయబడవలెను."

మద్రాసు, మధ్యరాష్ట్రాలు, సంయుక్తరాష్ట్రాలు, బొంబయి, ఒరిస్సా పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రాల అస్సెంబ్లీలలో ఆయా ప్రధానమంత్రు లీదిగువ తీర్మానాన్ని ప్రతిపాదించారు:—

"బ్రిటను జర్మనీలమధ్య జరుగుతూన్న యుద్ధంలో భారతీయుల ఆమోదంలేకుండానే భారతదేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వంవారు భాగస్వామిగా చేయడమేగాక భారత ప్రజాభిప్రాయాన్ని యేమాత్రమూ సరకుగొనక రాష్ట్రీయ ప్రభుత్వాల అధికారాలనూ కార్యకలాపాలనూ తగ్గించే చట్టములనుచేసి అవలంబిస్తూన్న చర్యలకు ఈ శాసనసభవారు తమ విషాదమును వెలిబుచ్చుతూన్నారు.

"ఇంతవరకు పేర్కొనబడిన ప్రస్తుత యుద్ధాశయాలకు అనుగుణంగా ముస్లిములు వగైరా అల్పసంఖ్యాకులకు తగిన రక్షణలను యేర్పాటుచేస్తూ ప్రజాస్వామ్య సిద్ధాంతములను భారతదేశానికి వర్తింపచేసి, భారత ప్రజానీకమువలననే భారత రాజ్యాంగ విధానమును నడిపించడం, భారతీయుల సహకారాన్ని పొందడానికి అవసరమని, రాష్ట్రప్రభుత్వంవారు ఇండియా ప్రభుత్వానికీ, వారి ద్వారా బ్రిటిష్ ప్రభుత్వానికీ తెలియపరచవలసిందిగా ఈ సభవారు సిఫారసు చేస్తూన్నారు.

"తన రాజ్యాంగ శాసనమును తాను తయారుచేసుకోవడానికి అధికారం గల స్వతంత్రదేశంగా ఇండియాను ప్రకటిస్తూ భారతదేశ ప్రస్తుత పరిపాలన సందర్భంలో తక్షణం ఆ సూత్రమును అమలుపరచడానికి వీలున్నంతవరకు తగు చర్య తీసుకోవలెననికూడా సభవారి ఈఅభిప్రాయం.

"ఇండియానుగూర్చి రాజుగారి ప్రభుత్వం పక్షాన చేయబడిన ప్రకటనను అధికారమీయడంలో భారతదేశ పరిస్థితులను ఆ ప్రభుత్వం సరిగా అర్థం చేసుకోనందుకీ సభవారు తమ విచారమును వెలిబుచ్చుతున్నారు. బ్రిటిష్ ప్రభుత్వాల వారు ఇండియా కోరికలను మన్నించకపోవడంవలన బ్రిటిష్ సింహాసనంతో ఈ ప్రభుత్వంవారు పొత్తుపెట్టుకోజాలరనీ ఈ సభవారభిప్రాయ పడుతున్నారు."

యూరపులో యుద్ధం ప్రారంభమైనదిమొదలు ఇండియాలో ఈ క్లిష్ట పరిస్థితి తటస్థించేవరకూ వర్కింగుకమిటీ వారప్పుడప్పుడూ చేస్తూవచ్చిన తీర్మానాలను దృష్టిలో పెట్టుకొని, రాష్ట్ర శాసనసభలలో ప్రతిపాదింపబడిన తీర్మానాలలోని అంతరార్థమును రాష్ట్రప్రధానులు విపులంగా వివరించారు. ముస్లిం లీగు పక్షంవారు ప్రతిపాదించిన సవరణను అసెంబ్లీ సభ్యులు వోడించారు.

ముస్లిం లీగు సవరణ యిది:—

"యుద్ధం మధ్యలోగానీ యుద్ధం ముగింపబడిన తరువాతగానీ ఇండియా రాజ్యాంగ నిర్మాణములనుగూర్చి యోచించే సమయంలో, ప్రస్తుత రాజ్యాంగ పద్ధతికిందనున్న ప్రజాస్వామ్య పార్లమెంటరీ విధానం, భారత ప్రజానీకము యొక్క బుద్ధికుశలతకూ స్థితిగతులకూ యేమాత్రమూ తగినట్లుగా లేనందున అపజయం పొందినసంగతి మఱచిపోకుండా, 1935 నాటి ఇండియా చట్టము మాటలావుంచి భారతదేశ భవిష్యద్రాజ్యాంగమును గూర్చి పూర్తిగా మొదటినుండీ పునర్విమర్శ చేయవలెననీ, భారతీయ ముసల్మానులందరికీ ప్రాతినిధ్యంవహించి వారిపక్షాన మాట్లాడగల ఏకైకసంస్థయైన అఖిలభారత ముస్లింలీగుయొక్కయు ఇంకా ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గములయొక్క ప్రయోజనములయొక్కయూ, అంగీకారమూ ఆమోదమూ లేనిదే, సిద్ధాంతంలోగానీ మఱొక విధంగాగానీ ఇదమిత్థమని బ్రిటిష్ ప్రభుత్వం తేల్చి చెప్పకూడదని యీ సభవారిండియా ప్రభుత్వమునకున్నూ తద్వారా ఘనతవహించిన రాజుగారి ప్రభుత్వమునకున్నూ తెలియజేయడమునకీ ప్రభుత్వానికి సిఫారసు చేస్తున్నారు."

మొట్టమొదట ప్రతిపాదింపబడిన తీర్మానం ఏడు కాంగ్రెసు రాష్ట్రాలలోనూ అధికసంఖ్యాక సభ్యులచే ఆమోదింపబడింది మధ్యరాష్ట్రాలయొక్కయు, సంయుక్త రాష్ట్రాలయొక్కయూ అసెంబ్లీలలో కాంగ్రెసు పక్షంవారంగీకరించిన అల్పసవరణలతో ఆమోదింపబడింది.

ఈ ఆదేశాల కనుగుణంగా రాష్ట్రీయమంత్రి వర్గాలొకటి తరువాతఒకటి ఒకపక్షం రోజులలో పూర్తిగా రాజీనామాలు దాఖలుచేసినవి. మొట్టమొదటగా అక్టోబరు 28 వ తేదీని మద్రాసు మంత్రివర్గం రాజీనామాయిచ్చింది. వివిధ కాంగ్రెసు శాసనసభలూ కాంగ్రెసు ఆదేశించిన తీర్మానాలను ఆమోదించిన సంగతి వేరుగా చెప్పనక్కరలేదు. మద్రాసుమంత్రివర్గం రాజీనామా యిచ్చినరోజునే కామన్సుసభలో ఇండియాను గూర్చిచర్చజరగడం తటస్థించింది. భారతరాజ్యాంగ కార్యదర్శిగా పూర్వంపనిచేసిన కెప్టెన్ కమాండరు వెడ్జి ఉడ్ బెన్ ఈ చర్చను ప్రారంభించాడు. ఇంకొక మాజీభారత రాజ్యాంగ కార్యదర్శి సర్ శామ్యుయల్ హోర్ చర్చలో ప్రముఖపాత్రవహించి మాట్లాడాడు. "రాజకీయ ప్రతిపక్షులు సహావేశమైనప్పుడు ప్రభుత్వం కేవలం పూర్వాచార పరాయణులు మాత్రమే ప్రవేశింపతగిన పవిత్రస్థలమని భావించరాదు." అని మొదట్లోనే ఆయన చక్కనిసూత్రాన్ని ప్రతిపాదించాడు ఎటువంటి కష్టాలనైనా అతిక్రమించగల పండిత నెహ్రూనుగూర్చి ఉదాహరించాడు. "భారతదేశంలో తల యెత్తిన పదకొండు ప్రజాస్వామ్యప్రభుత్వాలూ ప్రపంచప్రజాస్వామ్య వాదులతో చేతులుకలుపుతూన్నందుకు" తన సంతోషమును వెల్లడించాడు. "మన ఆశలుకొన్ని అబద్ధాలుగాపరిణమించినా మన భయాలుకూడా అటువంటి వేనని తెలిసివచ్చినందుకూ, ఇటీవల రాజ్యాంగనిర్మాణములనుగూర్చి ప్రపంచంలో జరుగుతూన్న అనేకపోరాటాలలో ఇండియాలోని రాష్ట్రీయ స్వాతంత్ర్య మింతజయప్రదంగా సాగినందుకూ నాకుచాలా సంతోషంగాఉంది." అన్నాడాయన. తరువాత ఇండియాలో నిస్సందేహంగా అన్ని రాజకీయ పక్షాలలోకి పెద్దరాజకీయపక్షమైన కాంగ్రెసు, "సమాలోచన సంఘం" (Consultative Committee)ను గూర్చిన సూచనను యెలా త్రుణీకరించిందో వివరించాడు. "ఇండియా రాజ్యాంగ చట్టమునుగూర్చి జరిగిన చర్చలలో చాలాభాగం భారతరాజ్యాంగముయొక్క ఉద్దేశములనుగూర్చి అధినివేశ ప్రతిపత్తి ఈయబడునని చేయబడిన వాగ్దానమునుగూర్చిమాత్రమే జరిగినవి." "కొంతమంది అనుకొంటూన్నట్లుగా రెండురకాల అధినివేశ ప్రతిపత్తులులేవు" అన్నాడు సర్ శామ్యుయల్ హోరు..."అధినివేశ ప్రతిపత్తిఅనేది అర్హతనుబట్టి ఇచ్చే బహుమతికాదు. నిజపరిస్థితులను అంగీకరించడమే"......మధ్యలో యేమైనా చిక్కులుంటే అవి మావలన తటస్థించినవికావు..... ఈ విభేదాలను నిర్మూలించుకోవడం భారతీయుల ఆదర్శంగా ఉండాలి; వారికి తోడ్పడడం మాఆదర్శం కావాలి.......సాంఘిక పరిష్కారమునుగూర్చి మేము తీర్పు చెప్పడంలో మా సదుద్దేశాన్ని ప్రకటించాము...మాతీర్పు అయినతరువాతకూడా ఆవిభేదాల లాగే ఉన్నాయి...అవి పోయేటంతవరకూ అల్పసంఖ్యాకులయెడ గల మా బాధ్యతను.

మేము విడిచిపెట్టుకోజాలము...బ్రిటిష్ ఇండియావారు తమపైన అధికారంచలాయిస్తారని సంస్థానాధిపతులకు భయంగావుంది కేంద్రప్రభుత్వంలో అధిక సంఖ్యాకులయిన హిందువులధికారంలో వుండడానికి ముస్లింములు ప్రతికూలంగా వున్నారు. బాధ్యతాయుత ప్రభుత్వమంటే హిందువు లధిక సంఖ్యాకులుగా వుండే ప్రభుత్వమనీ, అందువలన తమ ప్రయోజనాలకు భంగం కలుగుతుందనీ నిమ్నజాతులవారు నిశ్చయంగా విశ్వసిస్తున్నారు. ఈసందేహాలన్నీ ఇంకాఅలాగేవున్నవి. అవి వున్నంతకాలం కేంద్రంలో ఫలానా తేదీనాటికి సర్వసంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని స్థాపించవలెననే కోరికను మన్నించడం ప్రభుత్వానికి సాధ్యపడదు.

"రాజప్రతినిధి ప్రతిపాదించిన సమాలోచన సంఘంలో యేమీలేకపోయినా రాజ్యాంగ నిర్మాణాభివృద్ధిని కొంతకాలం నిలిపవుంచడానికి పన్నినపన్నుగడ అని కాంగ్రెసు చాలా తొందరపడి ఊహించిందని నాఅభిప్రాయం.....ఈపథకమును తిరస్కరించడంలో కాంగ్రెసు చాలా తొందరపడ్డదనుకొంటున్నాను" "చేమ్స్‌ఫర్డు మాంటేగు సంస్కరణలు జరిగిన నాటి సమాలోచనలవంటి సమాలోచనలను జరపడానికికూడా ఈయుద్ధం జరుగుతూన్న ఈ తరుణంలో వీలులేదు. అవి మొదటి యుద్ధం ప్రారంభమైన మూడు సంవత్సరాలకు జరిగినవి. ప్రస్తుత పరిస్థితులలో ఆ విధమైన సూచనను అంగీకరించడానికి వీలు లేదని నాకు దృఢంగా తోస్తూన్నది." అన్నాడు సర్ శామ్యుయల్ హోర్. "ఇక తరువాత జరుగవలసినది సహాయ నిరాకరణం. అందువల్ల భారత రాజకీయాభివృద్ధి కొన్ని సంవత్సరాల వెనుకకు పోతుంది......అది శాసనోల్లంఘనమునకు దారి తీస్తుంది. అందువల్ల చట్టమునకూ క్రమమునకూ భంగం వాటిల్లుతుంది. అప్పుడు కొట్లాటలు వస్తవి. ఆపైన నిర్బంధశాసనాలు ప్రయోగింపబడుతవి-ఇవన్నీ ఎప్పటికీ రాకుండా చూడవలెనని మాఆశ"అని అంటూ తుది మాటగా యిలా అన్నాడు.

> "మేము సామ్రాజ్యకాంక్షను ఎన్నడో వదులుకొన్నాము. ఇతరులను పరిపాలించడానికి గాక, ఇతరులు తమను తాము పరిపాలించుకొనేటందుకు సహాయపడడమే ఈప్రపంచంలో మేము నిర్వర్తించవలసిన పని అని మానమ్మకం"

ఈ వాక్యాలు సమాధానపరుస్తూ వున్నట్లూవున్నయి; బెదిరిస్తూన్నట్లువున్నయి. వీటినిగూర్చి గాంధీ యిలాఅన్నాడు. "అధినివేశ ప్రతిపత్తికూడా స్వతంత్రంతో సమానం కాకపోతే ఇండియాకు సంబంధించినంతవరకామాట కేమైనా అర్థముందా? సర్ శామ్యుయల్ మనస్సులోవున్న ఇండియాకు కామన్‌వెల్తునుండి విడిపోవడానికధికారముందా? ......బ్రిటిష్‌వారు సామ్రాజ్యకాంక్షను విడిచిపెట్టుకొన్నట్టయితే; చట్టం ప్రకారం

ఇండియాను స్వతంత్రదేశంగా ప్రకటించకమునుపే ఆసంగతి ఋజువుకావాలి." అధ్యక్షుడైన రాజేంద్రబాబు అన్నమాటలుకూడా యింత గట్టిగానూ యింత సమంజసంగానూ ఉన్నవి. ఆయన యిలా అన్నాడు. "బయటివారి జోక్యం యేమాత్రమూ లేకుండా అందరికీ అంగీకారంగాఉండే రాజ్యాంగ చట్టమును నిర్మించుకొనే బాధ్యతను భారతీయులకే వదలి దానిని శాసనంద్వారా ఆచరణలోకి తేగలమని బ్రిటిష్ ప్రభుత్వంవారు వాగ్దానం చేయాలి. లేనియెడల అల్పసంఖ్యాకుల రక్షణ అనేదంతా పాతపద్ధతిని కొనసాగించడానికొక నెపం అనవలసివస్తుంది."

# ౭ మంత్రుల రాజీనామా తరువాత

మన స్వాతంత్ర్య గమనంలో కాంగ్రెసు పతాకదశ గడించింది. ఒక్కసారిగా ఎనిమిది రాష్ట్రాలలోని మంత్రులందరూ రాజీనామాలిచ్చారు. ఈ మంత్రివర్గాలను స్థాపించడానికి ఎన్ని సంవత్సరాలు కష్టపడవలసివచ్చిందని; ఎంత పోరాటం చేయవలసి వచ్చింది; ఎన్ని రాయబారాలూ ఎన్ని ఒప్పందాలూ చేసుకోవలసివచ్చింది! గడచిన అర్థ శతాబ్దంనుండీ ఎంతో జాగ్రత్తగా శిల్పకళా వస్తువుగా మంజుల రేఖలతో తీర్చి దిద్దబడిన కార్యకలాపం ఒక్కసారిగా దగ్ధమై బూడిద పాలయినది. కాంగ్రెసు ఇక ఎప్పుడయినా దానిని పునర్నిర్మాణం చేయగలదా? కాంగ్రెసు మళ్ళీ అధికారంలోకి వస్తుందా? ఎప్పుడు? అని కాంగ్రెసుకు స్నేహితులు కానీ విరోధులు కానీ ప్రతివారూ అడుగసాగినారు. కొంతమంది మంత్రులు మాత్రం తాము మూడు నెలలు సెలవుమీద వెళ్ళుతున్నామని ఎగతాళీగానూ, ఆటకాయితనంగానూ చెప్పడం ప్రారంభించినారు. కాని ప్రతి సరసంలోనూ కొంత సత్యముంటుంది. కాని కాంగ్రెసుమాత్రం అంత తొందరగా మంత్రులు మళ్ళీ తిరిగివస్తారని యెప్పుడూ అనుకోలేదు. రాబోయే కష్టనిష్ఠురాలు కాంగ్రెసుకు స్పష్టంగా తెలుసు. గాంధీకి బ్రిటిష్ ప్రభుత్వాన్ని గూర్చి అంతగా పట్టనే లేదు. రెండు ఆంతరంగిక సమస్యలాయనను బాధిస్తూండినవి. కాంగ్రెసుకు ఏమాత్రమూ స్నేహభావంగాలేని ముస్లింలీగు వైఖరినిగూర్చి యేమి చేయాలి, కాంగ్రెసువాదులే సరిగా ఆచరించరేమోనని అనుమానపడవలసిన ఆ అహింసా ప్రమాణమును ఆచరణలోకి ఎలా తీసికొనిరావాలి అనే సమస్యలే ఆయనకెక్కువ బాధాకరంగా తోచినవి. మంత్రుల రాజీనామాలు ఎవ్వరూ అనుకోకుండా జరిగినవి. కొందరు అనవసరమనుకున్నారుకూడాను. అందువలన తేలికగా కొంత ఉద్రేకమూ, కొంత ఆశా కలిగితే కలిగి ఉండవచ్చును. కాని ఈపని జరిగిన తరువాత గాంధీజీ దృష్టిలోకూడా రాజకీయభవిష్యత్తు అంధకారంగా తోచింది. పార్లమెంటరీ చర్చలో సర్ శామ్యూయల్ హోరు చేసిన ఉపన్యాసం పరుషంగానూ విషాదకరంగానూ ఉంది. ఆ సందిగ్ధ సమయంలో గాంధీ ఈ దిగువవిధంగా తన అభిప్రాయాలను వెల్లడించాడు.

## పిమ్మటిచర్య

మంత్రులు రాజీనామాలిచ్చిన తక్షణం, నవంబరు ఒకటో తేదీని రాజప్రతినిధిని దర్శించడానికి గాంధీజీ ఆహ్వానింపబడ్డాడు. యుద్ధం వచ్చిన తరువాత గాంధీ వైస్రా-

యని దర్శించడమిది మూడవసారి ఈతడవ ఆయన రాజేంద్రబాబుతోకలిసి దర్శించాడు. జిన్నాసాహెబుకూడా రాజప్రతినిధి మందిరంలోనే ఉన్నాడు. గాంధీ జిన్నా లిరువురూ ప్రత్యేకంగాకూడా సమావేశమైనారు. వీరి సంభాషణలు ఫలప్రదం కాలేదు సరికదా మరికొన్ని కొత్తసమస్యలు రేకెత్తి కొత్తచిక్కులు తటస్థించినవి. వీటిని సాకుగా చెప్పడానికి రాజప్రతినిధికి మంచి అవకాశం కుదిరింది. తనను దర్శించవచ్చిన వారి కాయన స్పష్టంగా ఈ దిగువ ప్రతిపాదనను చేశాడు. “కేంద్రంలో పరస్పర సుహృద్భావంతో పనిజరుగవలెననే ప్రధానాశయంతో రాష్ట్రీయ ప్రభుత్వాలలో యేదైనా ఒక పద్ధతిమీద కలిసి పనిచేయడానికి వీలుంటుందేమో మీలోమీరు చర్చించుకొని ఒక ఒడంబడికకు రాగలిగితే, మీ ఉభయసంస్థల ప్రతినిధులూ కేంద్ర ప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యులుగా తక్షణం పాల్గొనడాని కనుకూలమైన సూచనలను చేయడానికి నాకు సావకాశం కలిగించినవారవుతారు. ఈ సంగతి ఆలోచించడానికే కాంగ్రెసు ముస్లింలీగు నాయకులుగా యిక్కడ హాజరైన మిమ్ములను నేనాహ్వానించాను” ఈ ప్రతిపాదనతో రాజప్రతినిధి అసలు సమస్యను పూర్తిగా మార్చివేశాడు. ఇంతకుపూర్వం చర్చలలో అల్పసంఖ్యాక సమస్యలు, ప్రత్యేక సంఘాలకు ప్రత్యేక ప్రయోజనాలకూ సంస్థానాలకూ సంబంధించిన సమస్యలులేవనికాదు. కాని ఇంతవరకూ ఒక కేంద్ర ప్రభుత్వ నిర్మాణమును గూర్చియే జరుగుతూన్నదనుకొన్న చర్చ, నెమ్మదిగా “రాష్ట్రములలోకూడా ఒడంబడిక” కుదరవలెననే ధోరణికి వచ్చింది. అనగా ఎనిమిది కాంగ్రెసు రాష్ట్రాలలోకూడా సంయుక్తమంత్రివర్గాలుండవలెనని దాదాపుగా చెప్పడమే. తరువాత కేంద్రప్రభుత్వంలో జరుగవలసిన యేర్పాట్లనుగూర్చి రాజప్రతినిధి సంగ్రహంగా చెప్పినాడు. యుద్ధం ముగిసేటంతవరకూ ఆ యేర్పాటు తాత్కాలికంగా ఉంటుందనీ, ఇతరపక్షాలనుండికూడా ఒకరిద్దరు ప్రతినిధులు ఉంటారనీ, కొత్తసభ్యులుసైతం పాతసభ్యులతో సమాన ప్రతిపత్తి కలిగిఉంటారనీ, ఈ యేర్పాటంతా ప్రస్తుత చట్టమున కనుగుణంగా మాత్రమే జరుగుతుందనీ వైస్రాయి అన్నాడు. యుద్ధానంతరం సకాలంలో ఇదివరకుచెప్పిన ప్రణాళిక ననుసరించి నూతనంగా సమాలోచనలు జరుగగలవని పునరుద్ఘాటించాడు. దీనికి జవాబుగా తాను సంభాషణలో వైస్రాయితో ముఖాముఖిని వివరించినమాటలనే కాంగ్రెసు అధ్యక్షుడు తిరిగిచెప్పినాడు. జిన్నాతో పూర్తిగ మాట్లాడిన తరువాతకూడా కాంగ్రెసు ఇంతకుపూర్వం చెప్పిన జవాబుకు భిన్నంగా యేమీ చెప్పవలసిన అవసరం లేకపోయిందన్నాడు రాజేంద్రప్రసాదు. యుద్ధాశయాలనుగూర్చి వివరించవలసిందిగా కాంగ్రెసు కోరిన ప్రధాన నైతిక సమస్య విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం మూకీభావం

వహించడమే ఇందుకు కారణమన్నాడాయన. ఇండియాలో ఇప్పుడు తటస్థించిన పరిస్థితి మతవిషయికమైనదికాదనీ కేవలం రాజకీయ సంబంధమైనదనీ స్పష్టీకరించబడింది. సెప్టెంబరు 14 న కాంగ్రెసు కోరిన విషయాలివి :-

(౧) యుద్ధాశయాలను ప్రకటించాలి.

(౨) ఇండియాకవి యేవిధంగా వర్తింపజేయబడతవి ?

(3) పరాయివారి జోక్యంలేని రాజ్యాంగ పరిషత్తును నిర్మించాలి.

(౪) ఇండియాను స్వతంత్రదేశంగా పరిగణించి అస్థితికి తగినట్లుగా వెంటనే ఆచరణ జరగాలి.

(౫) ఇండియా స్వాతంత్ర్యం భారతదేశైక్యతకూ ప్రజాస్వామ్య సిద్ధాంతమునకూ అనుగుణంగా ఉండడమేగాక అల్పసంఖ్యాకుల అందరి హక్కులనూ గుర్తించి వాటికి రక్షణ యిచ్చేదిగాకూడా ఉండాలి.

సాంఘిక వివాదములకు సంబంధించిన అన్ని విషయాలనూ పరస్పరాంగీకారముతో పరిష్కరించుకోవడానికి కాంగ్రెసు హృదయపూర్వకంగా కోరుతూండినప్పటికీ, ఈ సందర్భంలో సాంఘిక సమస్యను అనవసరంగా పైకి లాక్కొనివచ్చాడు రాజప్రతినిధి. ఐరోపా మహాసంగ్రామంలో మరీ ఇటీవల జరిగిన సంఘటనలనుబట్టిచూచినా ఇండియాస్వాతంత్ర్యాన్ని ప్రకటించవలసిన అవసరం ఇంకా ఎక్కువగా కనిపించింది.

జిన్నామాత్రంచాలా హుషారుగాఉన్నాడు. 1939 నవంబరు నాలుగోతేదీన రాజప్రతినిధికొక ఉత్తరం వ్రాశాడు. అందులో నవంబరు రెండోతేదీని వైస్రాయి వ్రాసినఉత్తరంలోని విషయాలనుగూర్చి కాంగ్రెసు చర్చించడానికంగీకరించలేదని వివరించాడు. "గవర్నరు జనరల్ కార్యనిర్వాహకవర్గమును పెంచి అందులో కొంత మంది రాజకీయనాయకులను చేర్చుకోవడం మూలంగా యుద్ధకాలమునందు కేంద్ర ప్రభుత్వంలో నిర్మాణయుతమైన అభివృద్ధికి తగినసూచనలు చేయడానికి కావలసిన పరస్పరాంగీకారంకోసం జరిగిన సంభాషణలు జయప్రదం కానందుకు ముందుగా "అత్యంత విషాదమును" వెల్లడిస్తూ రాజప్రతినిధి నవంబరు ఐదోతేదీని ఒక ప్రకటన చేశాడు. అంతకుపూర్వమే అత్యంతక్రోధోద్రిక్తమైయున్న ప్రజాభిప్రాయం, వైస్రాయి వెల్లడించిన 'అత్యంత విషాదము' వలనకూడా శాంతించలేదు.

రాజప్రతినిధి 'అత్యంతవిషాదాన్ని' ప్రకటించడమేగాక, ఇండియా ప్రభుత్వ చట్టంలో చేర్చబడినకొన్ని అత్యవసరాధికారాలను ప్రయోగించవలసి వచ్చినందుకు

‘అత్యంతమైన ఆశాభంగమును’ కూడా వెల్లడించాడు. “అవసరాన్నిబట్టి వాటిని ప్రయోగించవలసివచ్చింది కాని అవి శాశ్వతం కా”దన్నాడు. అందుకనుగుణంగా ఫత్తేపూరు సిక్రీద్వారంపైన వ్రాసిఉన్న ఈ వాక్యాలను ఉదహరించాడు. “జీవితమొక సేతువు. దానిమీదుగా దాటిపోవలసిందే. దానిమీద ఇల్లుకట్టుకోరాదు” ఇదేఇంకొక చోట కొంచెంమార్పుగా ఉంది.

“ఈ ప్రపంచము ఒక వంతెన. దానిమీదుగా దాటిపో కాని దానిమీద యిల్లు కట్టుకోబోకు” - అన్నాడు శాంతిమూర్తి జీసస్.

ఇంతవరకు ఉభయపక్షాలవారూ యేయేస్థితిలో ఉన్నారో సమీక్షచేదాం. బ్రిటిష్‌వారి యుద్ధాశయాలేమిటో ఇండియాకు ఎలావర్తింపచేస్తారో వివరిస్తూ, ప్రస్తుతం కేంద్రప్రభుత్వంలో అందుకనుగుణంగా ఎలా ఆచరిస్తారో తెలియచెప్పమని కాంగ్రెసు కోరింది.

బ్రిటిష్‌ప్రభుత్వంవారి యుద్ధాశయాలనుగూర్చి బ్రిటిష్‌ప్రజకే వివరింపబడలేదన్నారు వారు. కాబట్టి ఇండియాకు అసలే వివరించడానికి వీలు లేదు. ఇండియాకుగానీ బ్రిటనుకుగానీ యుద్ధాశయాలనుగూర్చి ఏమీ చెప్పబడనేలేదు గనుక ఆచరణలో పెట్టేది అంతకంటేనూ లేదు. ఇక కేంద్రంలో బాధ్యతాయుత ప్రభుత్వంమాట అప్రస్తుతం. అయినప్పటికీ ఒక సమాలోచనసంఘం (Consultative Committe) ఉండవచ్చును. అది ఒక చిన్న రౌండుటేబిల్ సమావేశంలాంటిది అయితే అది రాజప్రతినిధిపిలిచిన ౫౨ మంది పెద్దమనుష్యుల సమావేశంవలె ఒక్కసారి జరిగేదికాదు. అప్పుడప్పుడూ వరుసగా జరుగుతూంటుంది. ఇందుకు కాంగ్రెసు అంగీకరించలేదు. మేము మంత్రివర్గాలకు రాజీనామాయిస్తామనిచెప్పి రాజీనామాలు పెట్టివేసింది కాంగ్రెసు. “ఓహో మీరుచాలా తొందరపడుతూన్నారు. మిమ్ములను కేంద్రకార్యనిర్వాహకవర్గంలో పాల్గొనేటట్టు చేయాలని మా నిజమైన ఆశయం. రాజప్రతినిధి చెప్పిన సమాలోచనసంఘాన్నిగురించి మీరుసరిగా అర్థంచేసుకోలేదు. కంబళిపురుగు గూడులోనుండి సీతాకోకచిలుక పుట్టినట్లు దీనిలోనుండియే బాధ్యతాయుత కేంద్ర ప్రభుత్వం బయలుదేరుతుంది. కాని ఈ పరిణామావస్థకుతగిన వాతావరణమునూ పరిస్థితులనూ మీరు కల్పించుకోవాలి. రాష్ట్రాలలోఉన్న సంఘవైషమ్యాలను మీరుముందుగా సరిచేసుకోవాలి. అలాచేసుకోగలరా?” అంటూన్నది బ్రిటను. నాయకులందరూ మరొకసారి ఆహ్వానింపబడ్డారు. వారితో ప్రచ్ఛన్నంగా కొన్నిమాటలు రాజప్రతినిధి చెప్పినాడు. కాని అవి అప్పుడే అందరికీ తెలిసిపోయినవి. “సంఘసామరస్యం” మాట

మాకువదలివేయండి. అది మా బాధ్యత. మీరు యుద్ధాశయాలనుగూర్చి ఎందుకు చెప్పరని చెప్పండి! దూరశ్రవణయంత్రం దగ్గర చెప్పండి! పార్లమెంటులో చెప్పండి! ఎక్కడచెప్పడం ఉచితమనుకొంటే అక్కడచెప్పండి! మీరు యిప్పుడు చెప్పితీరాలి! ఈమాటికే చెప్పితీరాలి" అన్నది కాంగ్రెసు. రాజప్రతినిధి ఇంగ్లండుకీ విషయంలో కేబిల్ పంపి జవాబుకోసం ఎదురుచూస్తూన్నాడు. ఈలోగా రాష్ట్రాలలోని ఉద్యోగుల్ని, ఫతేపూరు సిక్రీద్వారంపైన వ్రాసిఉన్నదని వైస్రాయిచెప్పిన వాక్యాలకు విరుద్ధంగా "దాటిపోవలసిన వంతెనమీద ఇళ్ళువేసికొంటూన్నారు." గ్రేటుబ్రిటని అప్పుడే లేక కాదన్నది. కాంగ్రెసు కోరినకోరిక సంగతైనదని గ్రేటుబ్రిటనుకు తెలుసు. కాని పరిస్థితిను ఉద్ధరించడంకోసం ఆమె ఇండియాను మరచిపోగలదా? ఆమె శక్తి, సంపత్తికీ దానికీమధ్య ఉన్నట్లుగాఉంది. కాని దెబ్బలు మిక్కిలిమెత్తగానూ నెమ్మదిగానూ తగులుతూండడంచేత చాలాసుఖంగా ఉన్నాననుకొంటూన్నది.

కిందటిపుటలో వర్ణింపబడిన సంఘటనలన్నీ నవంబరు ఐదోతేదీని రాజప్రతినిధిచే అధికారరీత్యా సంగ్రహంగా వివరింపబడినవి. రాజప్రతినిధి ప్రకటననూ గాంధీజీ జవాబునూ కూడా ఈ దిగువను పూర్తిగా ఉదాహరిస్తూన్నాము.

## రాజప్రతినిధి ప్రకటన

( 1939 - నవంబరు 5 )

"మూడోసెప్టెంబరున యుద్ధంప్రకటింపబడినది. దానిని కొనసాగించడానికి సహకరించవలసిందని భారతదేశంలోని అన్ని సంఘాలకు అన్నివర్గాలకూకూడా ఆరాత్రియే రేడియోలో విజ్ఞప్తిచేశాను. మరునాడు సిమ్లాలో గాంధిజీనిమాచి, పరిస్థితులన్నీ ఆయనతో స్వేచ్ఛగా ముఖాముఖిని పర్చించాను. అలాగే ముస్లింలీగుకు ప్రాతినిధ్యం వహిస్తూన్న జిన్నానుకూడా చూడడానికి వెంటనేతగుచర్య తీసుకొన్నాను. సంస్థానాధిపతుల సమితి అధ్యక్షుణ్ణికూడా నేనుచూడకుండా పోలేదు.

"తరువాత కాంగ్రెసు ముస్లింలీగుల వర్కింగుకమిటీలు యుద్ధవిషయాన్నిగూర్చి చర్చించినవి. కాంగ్రెసు వర్కింగుకమిటీ సెప్టెంబరు 15వ తేదీని సమావేశమయింది. నాజీ దురాక్రమణను వారసందిగ్ధంగాఖండించారు. ఈయుద్ధంలో పరిష్కారం కానలసిన సమస్యలనుగూర్చి, యుద్ధాశయములనుగూర్చి, ఆఇండియాకు యిప్పుడున్నా ఇకముందున్నా ఎలా వర్తింపచేయబడతవో ఆ సంగతినిగూర్చి, అసందిగ్ధంగా వివరించవలసిందని బ్రిటిష్ ప్రభుత్వమును వారు కోరుతూ తుది నిర్ణయం చేయకుండా వాయిదా వేశారు. వర్కింగుకమిటీవారి ప్రకటనతో గాంధీజీ తన సంపూర్ణామోదమును వెల్లడిస్తూ-

బ్రిటిష్‌వారికి చేయబోయే సహాయమేదైనప్పటికి అది బేషరతుగా ఉండవలెనని అంగీకరింపచేయ ప్రయత్నించిన మనిషి. తానొకడే అయినందుకు చాలావిచారపడుతూన్నానన్నాడు.

“సెప్టెంబరు 18 వ తేదీని సమావేశమైన ముస్లింలీగు వర్కింగుకమిటీవారు కూడా ఈలాగే షరతులు పెట్టారు. ముసల్మానులనుండి గౌరవప్రదమూ, ప్రయోజనకరమూ అయిన సంపూర్ణసహకారం కావలెనంటే వారికి న్యాయం ఉన్నదనే విశ్వాసమూ సంతృప్తి కలిగించాలి అంటూ ముఖ్యంగా కాంగ్రెసు రాష్ట్రాలలోని ముసల్మానుల స్థితినిగూర్చి ప్రస్తుత రాజ్యాంగశాసనములో ఏదైనా మార్పుచేసేయెడల ముసల్మానులతో పూర్తిగా ఆలోచించి వారి ఆమోదమునూ అంగీకారమునూ పొందవలసిన అవసరమును గూర్చి వివరించారు.

“నేను తిరిగి యిప్పుడు గాంధీనీ, జిన్నానూ, సంస్థానాధిపతుల సభాధ్యక్షుణ్ని కలుసుకొన్నాను. ఇండియాలోని రెండు ప్రముఖరాజకీయ పక్షాలకూ గల అభిప్రాయభేదాల విస్తృతినిగూర్చి నాకు వివరింపబడినప్పటికీ నాఅంతట నేను స్వయంగా ప్రజలేమనుకుంటూన్నారో తెలుసుకొని సంతృప్తిపడవలెననుకొన్నాను. ఆ ఉద్దేశంతోనే అన్నిపక్షాలకూ అన్ని సంఘాలకూ, అన్ని ప్రయోజనాలకూ ప్రతినిధులైనవారిని ౫౦ మందిని కలుసుకొని సంభాషించాను. ఆ సంభాషణలు జరుగుతూండగానే అక్టోబరు 10 వ తేదీని ఘనతవహించిన రాజుగారి ప్రభుత్వంయొక్క యుద్ధోద్దేశాలనూ శాంతి ఉద్దేశాలనూ వివరిస్తూ ప్రకటనచేయవలసిందని వర్కింగుకమిటీ అంగీకరించిన తీర్మానాన్ని పునరుద్ఘాటిస్తూ అ. భా. కాం. సం కూడా తీర్మానించింది. ఇండియాను స్వతంత్రదేశంగా ప్రకటిస్తూ అందు కనుగుణంగా ఆ ప్రకటనను సాధ్యమైనంత త్వరగా ఎక్కువగా ఇప్పుడే ఆచరణలోకి తీసుకొని రావలసిందని వారు కోరారు.

“ఎంతో పనితొందరలో ఉండికూడా భారతదేశ సమస్యలనుగూర్చి అత్యంత జాగరూకతతో ఆలోచిస్తూన్న ఘనత వహించిన రాజుగారి ప్రభుత్వంవారికి నా సంభాషణలనుగూర్చి విపులంగా నివేదికను పంపుతూన్నాను. గంభీరంగా ఆలోచించి దీర్ఘంగా చర్చించిన పిదపనే రాజుగారి ప్రభుత్వం పక్షాన నేను అక్టోబరు 18 వ తేదీని ప్రకటన చేసి ఉన్నాను. అందులో ఒకటి భారతదేశపు లక్ష్యం అధినివేశ ప్రతిపత్తి అనీ, రెండవది యుద్ధానంతరం భారతదేశనాయకులతో సంప్రతించి ప్రస్తుత రాజ్యాంగచట్టమునుగూర్చి పునరాలోచన చేయడానికి రాజుగారి ప్రభుత్వం సంసిద్ధంగా ఉందనీ, మూడవది యుద్ధాన్ని కొనసాగించడంలో భారతప్రజాభిప్రాయాన్ని కలుపుకొనిపోవ

డానికి రాజుగారి ప్రభుత్వం ముఖ్యంగా ఆదుర్దాపడుతూన్నది గనుక, అందుకోసం వారొక సమాలోచన సంఘాన్ని నిర్మించదలచుకొన్నాననీ దాని వివరాలు నేను పక్ష నాయకులతో మరొకసారి సంప్రతించిన తరువాత వెలువరించగలననీ విస్పష్టంచేసి ఉన్నాను.

"నా ప్రకటనలో స్పష్టీకరించబడిన ఈ విషయాలన్నీ చాలా ప్రాముఖ్యమైనవి. వాటి ప్రాముఖ్యతను కొందరు కొంచెపరుస్తూన్నారు. కాని అవి అసలు విషయానికి సంబంధించినవి. నా ప్రకటన తరువాత జరిగిన పార్లమెంటు చర్చలలో మరొక ముఖ్యవిషయంకూడా బయటపడ్డది. కొన్ని షరతులు పూర్తి చేయబడేయెడల గవర్నరు జనరలు కార్యనిర్వాహక వర్గమును తాత్కాలికంగా పెంచి యుద్ధాన్ని నడిపించే టందుకు ఇంకా యెక్కువ బాధ్యతతో యెక్కువ సన్నిహితంగా భారతప్రజాభిప్రాయాన్నికూడ కట్టుకొని రావడానికి రాజుగారి ప్రభుత్వం సంసిద్ధంగా ఉన్నదనికూడా తేలింది. కాని నా ప్రకటననుగురించి తరువాత జరిగిన పార్లమెంటరీ చర్చలనుగూర్చి భారతీయాభిప్రాయం కాంగ్రెసుకు సంబంధించినంతవరకు ప్రతికూలంగా ఉన్నదనేమాట స్పష్టం. కాంగ్రెసు వర్కింగుకమిటీవారు అక్టోబరు 22 వ తేదీని సమావేశమై నాప్రకటన అత్యంతం అసంతృప్తికరంగా ఉందని తీర్మానిస్తూ రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రులను రాజీనామా ఈయవలసిందని కోరారు. ఆరోజుననే కొన్ని సందేహాలను నివృత్తిచేయవలసిందనీ, ఇంతవరకుచేసిన ప్రకటనలన్నిటినీ విస్పష్టం చేయవలచిందనీ కోరుతూ, తమ అధ్యక్షుడు సంతృప్తి పడినయెడల భారతీయ ముసల్మానులు యుద్ధములో బ్రిటిష్ ప్రభుత్వానికి సహాయసహకారములను చేయగలరని వారిపక్షాన హామీ ఈయడానికి ముస్లింలీగు వారాయనకు అధికారమిచ్చారు.

"తరువాత నవంబరు ఒకటో తేదీని గాంధీ, రాజేంద్రప్రసాదు, జిన్నాలను వచ్చి నన్ను చూడవలసిందిగా ఆహ్వానించాను. వారితో ఉన్న విషయాలన్నీ ముఖాముఖిని చర్చించాను. దాదాపు నన్ను చూడవచ్చిన వారందరితోనూ గవర్నరు జనరల్ కౌన్సిలును పెద్దదిగాచేసే అవకాశమునుగురించి వివిధపక్షాలనుండే ఇంతకుపూర్వం సంభాషణలలోనే చర్చించి ఉన్నాను. అలాగే ఈ ముగ్గురితోకూడా చర్చించాను. కేంద్రంలో సమాలోచనసంఘమును మించిపోవడానికి వీలులేని కారణం ప్రధాన సంఘాలలో సమాధానంకుదరక పోవడమేననీ, ఆసమాధానం కుదిరితేనేగాని కేంద్రప్రభుత్వం ఒడుదుడుకులు లేకుండా నడవడం సాధ్యంకాదనీ వారికిప్పుడు చెప్పినాను. కాంగ్రెసు వర్కింగుకమిటీయున్నూ, ముస్లింలీగున్నూ, అక్టోబరు 22 వ తేదీని చేసిన ప్రకటనలవల్ల ఆరెండు ప్రధానపక్షాల దృక్పథాలకూ ఉన్నవిభేదంమాత్రం స్పష్టంగానే తెలుస్తూన్నది.

"ఈపరిస్థితులలో కేంద్రంలో గవర్నర్ జనరల్ కౌన్సిలును పొడిగించడానికి వీలైన సూచనలను ఏకగ్రీవంగా చేసేటందుకు నన్నుచూడవచ్చిన వారందరూ సమావేశమై రాష్ట్రపరిస్థితులనుగురించి చర్చించుకోవలసిందని వారిని నేను ప్రార్థించాను.

"రాష్ట్రాలలో వారికిగల ప్రతిబింబ భేదాభిప్రాయమూ తొలగిపోవలసిన అవసరం ఉందని నేననుకోవడంలేదనికూడా వారికి స్పష్టం చేశాను. కేంద్రప్రభుత్వం ఒడుదుడుకులు లేకుండా నడిపడానికి కావలసిన ప్రణాళికను ఏర్పాటుచేసేటందుకు వీలుగా రాష్ట్రాలలో భేదాభిప్రాయాలు తొలగిపోతే చాలునని నా అభిప్రాయం రాజీకుదుర్చుకోవడానికి ప్రయత్నంలోప మేమాత్రమూ చేయవలదని వారినెంతో ప్రార్థించాను. ఈ విషయం ముఖ్యంగా భారతీయులకు సంబంధించిందేనని, వారిలో వారికి ఒడంబడిక కుదరాలనియే నేను ముఖ్యంగా ఆదుర్దాపడుతున్నాననికూడా వారికెరుకచేశాను. నేనేకాకుండా రాజుగారి ప్రభుత్వంకూడా ఈ ఒడంబడికకోసం చేయవలసిన కృషి అంతా చేయవలెనని ఆందోళన పడుతూన్నట్లు పదే పదే చెప్పాను.

" నేను సూచించిన చర్చలు జరిగినవి. కాని ఫలితం మాత్రం అత్యంతం ఆశాభంగకరంగా ఉంది. ముఖ్యవిషయాలనగురించి ప్రధాన రాజకీయపక్షాలమధ్య నేడు ఏమాత్రం ఏకీభావంలేదు. కాని నేనుమాత్రం అపజయం పొందినట్లుగా అంగీకరించడం లేదు. అది ఒక్కటే నేనిప్పుడు చెప్పేసంగతి. కొంతకాలం ఆగి ఈ ప్రధానపక్షాల నాయకులతోనూ సంస్థానాధిపతులతోనూ సంప్రతించి, యిప్పుడైనా ఏకీభావం కుదరడానికి సావకాశం ఉన్నదేమోనని మళ్లీ ప్రయత్నం చేయడమే నా అభిప్రాయం. నేను ఇండియాలో ఉంటూన్నంతకాలమూ ఐకమత్యంకోసం ఆందోళన పడుతూండడమే సరిపోతూన్నది. ఇండియాకు కావలసిన వాటన్నింటికంటెను ముఖ్యమైనది ఐకమత్యమే. కాని ఆసంగతి చాలమంది ఎప్పుడూ గ్రహించినట్లులేదు. భారతీయులు ఏసంఘానికి చెందినా, ఏపక్షానికి చెందినా బ్రిటిష్ ఇండియా ప్రజలైనా సంస్థాన ప్రజలైనా అందరూ కలసి ఒకే రాజకీయ ప్రణాళికకింద పనిచేయడంకూడా ఐకమత్యమనిపించుకొంటుంది. ఆ పరిస్థితులను కల్పించేటందుకు చేసే ప్రయత్నంలో ఎంతయినా విలువఉంది. అందులో ఇంతవరకు నేను సఫలీకృతుడను కాకపోయి ఉండవచ్చును. కాని నేను తిరిగి ప్రయత్నించగలను. నేను తిరిగి కృషిచేసేటప్పుడు నా కష్టాలను గుర్తించి నిజమైన నా సుహృద్భావానికీ సహాయంచేయవలెననే స్వచ్ఛమైన నాకోరికకూ తగిన విలువ ఈయవలెనని ఇండియాను నేను అర్థిస్తాను. ఈ దేశంలోని మహత్తమసంస్థలన్నీ ఏకమై చేసిన ప్రయత్నాలను అపజయం పొందించిన సమస్యలను పరిష్కరించడానికి చూస్తూన్నాము మనము. అనేక క్లిష్టవిషయాలనూ

విభేదాలనూ గమనించి సమన్వయం చేయవలసిఉంది. ఎన్నాళ్ల నుంచో పరిష్కారం కానిపోయి ఉన్న గొప్పగొప్ప ప్రయోజనాలు కలవారున్నారు; వారినిగూర్చి ఆలోచించాలి; వారంకటి అభిప్రాయాలనూ తేలికగా కొట్టిపారేయడానికి వీలులేదు. చారిత్రకం గానూ సాంస్కృతికంగానూ కూడా ప్రముఖపాత్రవహిస్తు విశేషమైన ప్రత్యేకత్వాన్ని సంఘాలవారున్నారు. ఇవన్నీ సమగ్రంగా ఆలోచించవలసిన ముఖ్యవిషయాలు. ఈ సమస్యలన్నీ చిక్కుసమస్యలే కావచ్చునుకాని పరిష్కరించడానికి వీలులేని సమస్య లని నేను భావించను. సుహృద్భావంతో సహనంకలిగి చర్చించుకొనే యెడల తక్కిన మానవ సమస్యలన్నింటివలెనే యివికూడా పరిష్కారమునకు లొంగకపోవని నా విశ్వాసం. రాజకీయ పక్షనాయకులతో సంప్రతించేటప్పుడు వారుచూపిన స్నేహ భావమును బట్టి ఈ నావిశ్వాసం మఱింత ప్రబలమయింది. ఈ చిక్కులన్నిటినీ తరించి మనమందరమూ నిజంగా కోరుతూన్న ఫలమును పొందవలెనంటే ప్రజలున్నూ, ప్రజలవిశ్వాసమునకు పాత్రులై వారిని సహనంతో నడుపుతూన్న రాజకీయ పక్షనాయ కులున్నూ నాకు కావలసిన సహాయమును చేయవలసినదని నేను వారిని అర్థిస్తూ న్నాను.”

ఢిల్లీ సంభాషణలపైన రాజప్రతినిధి చేసిన ప్రకటనను గూర్చి విమర్శలు.

## మ హా త్మా గాం ధీ

„రాజప్రతినిధి చేసిన రేడియో ప్రసంగమున్నూ, ఆయనకూ రాజేంద్రబాబుకూ, జిన్నాసాహెబుకూ మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరములను గూర్చి ఆయనచెప్పిన ఉపోద్ఘాత వాక్యములున్నూ. ఆయనచే ప్రకటింపబడగా నేను వాటిని గౌరవభావంతో చదివాను. పరిష్కారానికే వీలుకానట్లు కనిపించే సమస్యను తాను పరిష్కరించ పూను కొని అపజయాన్ని అంగీకరించ నిరాకరించినందుకు రాజప్రతినిధిని నేను అభినందిస్తూ న్నాను. ఈ సమస్యను పరిష్కరించడానికి ఆయన పడుతూన్న ఆందోళనను నేను కూడా పూర్తిగా అనుభవిస్తూన్నాను. కాబట్టి అందఱికీ కావలసిన (యుద్ధ) విష యంలో సహాయంచేసేదాకా వేచిఉండేబదులు, యుద్ధాశయములను గూర్చి భారత దేశమునకు సంబంధించి సర్వజనాంగీకృతమైన ప్రకటన వెలువడేటంతవరకూ ఈ సమస్య పరిష్కరింపబడదని నా సూచన. ఇంతవరకూ ఇండియాలోనూ గ్రేటుబ్రిటను లోనూ చేయబడిన ప్రకటనలన్నీ పాతపద్ధతినే అనుకరిస్తూ, స్వతంత్ర వాంఛాపరులైన ఇండియా ప్రజలచే అనుమానింపబడి అపఖ్యాతికి గుఱియైనవి. నిజంగా సామ్రాజ్య విధానం నశించి ఉండినయెడల పూర్వవాసనలకు పూర్తిగా స్వస్తిచెప్పాలి. నూతన

శకారంభమునకు తగిన భాషనే వాడాలి. ఈ ప్రధానసత్యాన్ని గుర్తించతగిన తరుణమింకా రానియెడల, ఈ సమస్యను పరిష్కరించేటందుకు చేస్తూన్న ప్రయత్నాలు నింకటితో ఆపివేయవలెనని నేను కోరుతూన్నాను. ఈ సందర్భంలో బ్రిటిష్ రాజకీయ ధురంధరులకు నేనొకమాట చెప్పదలచుకొన్నాను. ఇండియా కోరికలేవైనప్పటికీ, భారత రాజ్యాంగవిధానం విషయంలో బ్రిటను ఉద్దేశిస్తూన్నదేమిటో ప్రకటించడం వారి కర్తవ్యమని నా విజ్ఞప్తి. బానిసవ్యాపారంచేసే మనిషి తానావృత్తిని త్యజించదలచుకొన్నప్పుడు తన బానిసలందరితో వారికి స్వాతంత్ర్యం కావలెనా అక్కరలేదా అని సంప్రతించడు.

“పరాధీనములో నున్న భారతదేశం, క్రమానుగతంగా కాక, తక్షణం స్వతంత్ర దేశంగా ప్రకటింపబడినయెడల, ఆ స్వాతంత్ర్యము ఆచరణలోకి వచ్చేలోగా నిర్వర్తించవలసిన కార్యవిధానం తేలికగా పరిష్కరింపబడగలదు. అల్పసంఖ్యాకుల హక్కులసంరక్షణ అప్పుడు చాలా సులభమవుతుంది. కోటా పోటీలకప్పుడు తావుండదు. అల్పసంఖ్యాకుల రక్షణకూడా అంతేపివులుగా కాక ఒక్కసారిగానే పూర్తిగా జరగాలి. అధిక సంఖ్యాకులకూ అల్పసంఖ్యాకులకూ ఒకేరీతిగాలేని స్వాతంత్ర్యం స్వాతంత్ర్యమనిపించుకోదు. భారతరాజ్యాంగ నిర్మాణంలో అల్పసంఖ్యాకులు పూర్తి భాగస్వాములుగా ఉండాలి. రాజ్యాంగమును తయారుచేసే పవిత్రధర్మమును నిర్వర్తించవలసిన ప్రతినిధుల బుద్ధికుశలతపైన ఈపని ఆధారపడిఉంది. ఇంతవరకూ అధిక సంఖ్యాకులని చెప్పబడేవారికి ప్రతికూలంగా అల్పసంఖ్యాకులను ప్రయోగించి, ఇండియాలోని వివిధ వర్గాల ప్రజలకూ ఒడంబడిక దాదాపు అసంభవం చేసింది బ్రిటను. (సామ్రాజ్యవిధానంలో యిది తప్పనిసరి) అల్పసంఖ్యాకుల రక్షణకు కావలసిన సూత్రమును తయారుచేసే బాధ్యత వివిధపక్షాలవారికి విడిచివేయవలెను. ఈ బాధ్యత తన నెత్తిమీదనే ఉన్నట్లుగా బ్రిటను అనుకొంటూన్నంతకాలమూ, ఆదేశానికి ఇండియాను పరాధీనంలో ఉంచవలసిన అవసరం కనిపిస్తూనే ఉంటుంది. స్వాతంత్ర్యంకోసం తహతహలాడుతూన్న దేశభక్తులు పోరాడకతప్పదు. నాచేతనైతే వారంతా నా నాయకత్వంకింద అహింసాయుతంగా పోరాడుతారు. నేనపజయంపొంది నశించినయెడల దౌర్జన్యయుతంగానైనా పోరాడక తీరదు వారికి. బ్రిటనీయుద్ధాన్ని సమర్థించుకోవడానికీ, త్వరలో దానిని ముగించేటందుకూ ఒకేఒక మార్గముంది ఇండియావంటి మహత్తరమైన ప్రాచీనదేశాన్ని తన బానిసత్వమునుండి తొలగించి స్వతంత్రంగా చేయడమే ఆమార్గం. అప్పుడే దేవుడిచ్చిన ఈ యుద్ధమనే శాపం వరంగా మారుతుంది. రాజప్రతినిధి నిజాయితీగల మనిషి అని నానమ్మకం. కాబట్టి నాసోదర కాంగ్రెసు

వాదులను ఓర్పుపట్టమని కోరుతున్నాను. ముఖ్యంగా రాజప్రతినిధి సహాయ ప్రయత్నాలింకా కొనసాగిస్తూనున్నాము. కాబట్టినన్ను తెలుసువారు ముస్లింలీగు అవరోధం కల్పిస్తున్నందువలనూ, కాంగ్రెసులో నికరమైన ప్రతినిధ్యాన్ని ఉండాలనే పట్టుదలనూ యిప్పుడు సాత్విక నిరోధం విషయం వలలో పట్టడానికి వీలులేదు

"ముస్లిం స్నేహితులకు కష్టం కలిగించకూడదనే సంగతికూడా ఉన్నదికదా. ముస్లిం లీగుతో కలసి పనిచేయడానికి తగిన సమాధానం చేసుకుంటూ ఉండగా మనం ప్రారంభించిన పోరాటం సాత్విక నిరోధం ముస్లిం లీగుకుకూడా వ్యతిరేకంగా చేయవలసి ఉంటుంది. ఏ కాంగ్రెసువాడూ యిందుకంగీకరించడు. నేను "హరిజన్"లో వ్రాసిన వ్యాస సంగ్రహం జిన్నాసాహెబుకు ఆశ్చర్యం కలిగించినట్లు తెలిసింది. నాకెందుకని ఆశ్చర్యం వేస్తున్నది. కాని ఈ సమయంలో నన్ను నేను నమ్ముకున్నట్లు లేను. అయినప్పటికీ మౌలానా సాహెబూ నెహ్రూగారూ మధ్య జరుగుతూన్న రాయబారాలను చూసి సంతోషం నాకేమీ కాదు. అవి తిరిగీ వెంటనే ప్రారంభమై సంతృప్తికరంగా సాగగలవని ఆశిస్తూన్నాను.

"ఈ వైస్రాయి ప్రకటన చేసిన తరువాత నిన్న ప్రభుత్వ సభలో భారత రాజ్యాంగ కార్యదర్శి చేసిన అవనవు ప్రకటనకూడా చదివాను. దానివలనకూడా పరిస్థితిలో యేమీ మార్పు కలుగలేదు"

గాంధీజీ ఈ విధంగా మిత్రభావంతో చేసిన ఆశీర్వచనమైనా, జవాబుకు తోడుగా కాంగ్రెసు అధ్యక్షుడున్నూ, యుద్ధకమిటీ అధ్యక్షుడున్నూ తమ అభిప్రాయాలనుకూడా జోడించారు. రాజేంద్రబాబు అసలు విషయాన్ని ఒక్క వాక్యంలో చెప్పివేశాడు "నిజమైన అల్పసంఖ్యాకులందరితోనూ కలసి, అల్పసంఖ్యాకుల రక్షణ విషయంలో కావలసిన హామీలతో సహా. భారతీయులు వ్రాసిపెట్టిన రాజ్యాంగచట్టమును అంగీకరించి న్యాయశాస్త్రానుగుణంగా ఆచరణలోకి తెచ్చేటందుకు బ్రిటిష్ ప్రభుత్వానికిష్టంలే''దని నిందారోపణ చేశాడాయన. జవహరలాలు ప్రకటనకూడా యింతగట్టిగానూ యింత సంగ్రహంగానూ ఉంది. "ఢిల్లీలో జరిగిన దానినిబట్టీ, ప్రముఖ రాజకీయ పక్షాలవారితో తాను కలుసుకొని మాట్లాడినప్పుడు తనకు తెలిసిన విషయాలనుబట్టీ తనకు తోచిన అభిప్రాయాలనూ, రాజప్రతినిధి ప్రకటనకూ యేమీ పొత్తు కుదరనందున'' దానినిగూర్చి ఆయన ఆశ్చర్యం వెల్లడించాడు. "రాజప్రతినిధి యావత్తూ సాంఘిక సమస్యగా మార్చివేశాడు. ప్రముఖ రాజకీయ కక్షుల ప్రతినిధులకు ప్రధాన విషయాలలోగల పూర్తి విభేదాలను గూర్చిరమే మాట్లాడడం సాగించాడు.''

"సాధ్యమైనంత తొందరలో సాంఘిక విషయాలనుగూర్చి పూర్తిగా చర్చించుకోవడానికి నేనూ జిన్నాసాహెబుకూడా అంగీకరించాం రాజకీయంగాఉండే చిక్కులు

తొలగిపోనందున ఈ మా ఒడంబడికవలన రాజప్రతినిధిని చేయదలచుకొనిన ప్రతిపాదనల కేమీ అభ్యంతరం కలుగలేదు. కాబట్టి ఈ సందర్భంలో ఆ విషయాన్నిగూర్చి మేము చర్చించనేలేదు.'' అన్నారు నెహ్రూ. నిజానికి ఈఒక్క విషయమే ముఖ్యంగా తేలవలసి ఉంది. కాబట్టి 4 11 39 తేదీన అన్నా రాజప్రతినిధికి వ్రాసిన ఉత్తరంలోని విషయాన్ని ఈ జవాబు ఖండించింది. మరొకసారి దేశంలో క్లిష్ట పరిస్థితి తటస్థించింది. అప్పుడు అఖిలభారత కాంగ్రెసు సంఘమును అంతర్యంలోకి తీసుకొని ఆ సంస్థద్వారా జరిగిన విషయాలన్నీ చెప్పి భావికార్యక్రమమును ప్రజలకు తెలియచేయవలసిన అవసరం వచ్చింది. భవిష్యత్కార్యక్రమం విషయంలో గాంధీ నిస్సందేహంగానే ఉన్నాడు. ఈకష్టదశనుండి తప్పించుకొని బయటపడడానికి రాజ్యాంగ పరిషన్నిర్మాణ మొక్కటే సరియైన మార్గమని ఆయన అభిప్రాయం. దీనినిగూర్చి యింతకుపూర్వం ఆయన ఎలాగో సరిపెట్టుకొన్నాడు కాని యిప్పుడుమాత్రం దానికోసం ప్రతిదినమూ తహతహలాడుతూన్నమాట నిజం. ఈసంగతి 1939 నవంబరు 19వ తేదీని ఆయన వ్రాసినదానినిబట్టి తెలిసింది. ఈ రాజ్యాంగ పరిషత్తులో ముస్లిములకుమాత్రం ప్రత్యేక వోటింగు పద్ధతి ఉంచి 'నిజమైన తదితర అల్పసంఖ్యాకులకు ప్రత్యేక స్థానాలను వారి సంఖ్యాబలమునుబట్టి నిర్ణయించవలెనని ఆయన ప్రతిపాదన. 'ముస్లింలకు ప్రాతినిధ్యం వహిస్తూన్న సంస్థలన్నిటిలోకీ ముస్లింలీగు గొప్పదన్నమాట నిజమేకాని అప్రసిద్ధములు కాని అనేక ముస్లిం సంస్థలు తమకు ముస్లింలీగు ప్రతినిధి అనే విషయాన్ని అంగీకరించడం లేదు'' అన్నాడు గాంధీ. ''రాజ్యాంగ పరిషత్తు అందరికీ ప్రాతినిధ్యం వహిస్తుంది. దేశంలోని ప్రజలందరికీ నిజంగా సంపూర్ణ ప్రాతినిధ్యం వహించి దేశానికనుగుణమయిన రాజ్యాంగమును రచించగల సంస్థ అది ఒక్కటే.'' కాని ఈనూతన ప్రయత్నంలో ఆపదలులేకపోలేదు. ముఖ్యమైన అడ్డంకు బ్రిటిష్‌ప్రభుత్వం; తరువాత సంస్థానాధిపతులు. ఇక యూరోపియనుల ప్రయోజనాలు-''ఇండియా ప్రయోజనాలకు'' అభ్యంతరంగా ఉండనంతవరకు వీటికేమీ భంగంరాదు. రాజ్యాంగ పరిషన్నిర్మాణానికి సర్వప్రయత్నాలూ చేసి విఫలులమైన తరువాతనే ప్రత్యక్షచర్యమాట మనం తలపెట్టాలి. రాజ్యాంగ నిర్మాణమునకు నాందిగా కూడా ప్రత్యక్షచర్య అవసరమయ్యేస్థితి రావచ్చును. ఆస్థితి యిప్పటికిలేదు.'' అన్నాడు గాంధీ చివరకు. కాంగ్రెసు వర్కింగు కమిటీ, అ. భా. కాం. సం. ల పేరుతో భారతదేశ ప్రతినిధులు మరొకసారి నవంబరు 19న తేదీని అలహాబాదులో సమావేశమైనారు. రాజకీయ సూక్ష్మదర్శినిని సాంఘిక నిర్ణయమనే విషమకేంద్రమునుండి స్వాతంత్ర్యమనే సమకేంద్రమునకు హఠాత్తుగా మార్చినప్పుడు ఒక్క క్షణం ఆమార్పు, దృష్టిని చీకాకుపరిచింది. సాంఘిక సమస్యను పరిష్కరించుకొనే భారం మనమీద పడుతుందని ముందే

మనం గ్రహించి ఉండవలసిందనే అభిప్రాయమొకటి బయలుదేరింది. కాకపోతే ఈ విషయం విచారించడం మొదలుపెట్టిన వర్కింగు కమిటీ సమావేశానికి జిన్నా గాంధీని ఆహ్వానించవలసి వచ్చింది? ఈ విషయంలో సమాధానం సరిగా తెలవనేవారు గానీ యెవ్వరూ కాదనలేరు. ఇందుకు కాంగ్రెసు యింతవరకూ ప్రయత్నాలు చేస్తూనేఉంది. రాజ్యప్రతినిధితో జరిగిన ఉత్తరప్రత్యుత్తరాల మూలకంగా ఈప్రయత్నాలింకా ఎక్కువ ప్రముఖంగా కొనసాగవలసి ఉండెను. కాంగ్రెసెన్నడూ ఈ విషయాన్ని నిర్ణయం చేయలేదని ప్రభుత్వంవారు దానిమీద నిందవేయడంమాత్రం కాంగ్రెసు ఒప్పుకోలేదు. అయితే యీసారి సమాధాన ప్రయత్నంలో అపజయం పొందవచ్చును. అందుమూలాన బ్రిటిష్ ప్రభుత్వం వారు తప్పుచేశారని ఒప్పించడం కష్టం కావచ్చును; ఒకప్పుడసంభవంకూడా కావచ్చును. అయితే కాంగ్రెస్సువిషయంలో ఎన్నిసార్లు అపజయం పొందినప్పటికీ అది బ్రిటిష్ వారికి సంబంధించింది కాదని సమాధానం చెప్పవచ్చును. అది తర్కానికి బాగుండవచ్చును కాని ప్రపంచంలో యితరదేశాలకామాట ఎలాతోస్తుంది? ఇది వివరించిచెప్పడానికి కావలసినంత ప్రచారం చేయాలి. ఈప్రచారం ప్రత్యక్షంగాపరాయిదేశాలలోనే చేయనక్కరలేదు. ఇండియాలోచేసే ప్రచారంకూడా పరాయిదేశాల కెక్కుతువస్తుంది. "ఇతరదేశాలు మనను గురించి ఏమనుకొంటవి అనే మాట అలా ఉండగా కాంగ్రెసు ముఖ్యంగా ఆలోచించే విషయం 'మనంవేసిన అడుగు సరియైనదేనా?' అని. త్రాసు సరిగా పట్టిఉంచడానికి బ్రిటిష్‌వారన్నమాట నిజమే-కాని వారొక వైపు మొగ్గుగా తూస్తూన్నారు-రాజకీయంగాగానీ సాంఘికంగాగానీ సమాధానం కుదరడానికది సమయం కాదంటున్నారు—కాని బ్రిటిష్ వారెప్పుడైనా సమాధానం కుదురుస్తారా? కాంగ్రెసు సరియైన సమయాన్ని నిర్ణయించనిమాట నిజమే. బ్రిటిష్‌వారేదో విధంగా సరిపెట్టుకొని పోతూన్నంత మాత్రంచేత ఈ సమస్యను పరిష్కరించవలసిన తొందర తగ్గిపోలేదు. అసలు సమస్య ఎప్పుడూ అలాగేఉంది అయినప్పటికి సమయం కాని సమయంలో దానినిగూర్చి నొక్కిచెప్పడం, కొత్త కష్టాలను తెచ్చుకోవడానికీ పాతవాటికి దోహదమీయడానికిమాత్రమే తోడ్పడుతుంది. కాంగ్రెసు అవలంబించిన పద్ధతి స్పష్టంగానేఉంది. ఇండియాయొక్క సాధనసామగ్రిని బ్రిటను తన యుద్ధంలో ఉపయోగించుకోవడానికి చేసినప్రయత్నమే హిందూదేశ సమస్యకు మూలకారణమయింది. సరియైన కారణంకోసం న్యాయమైన ఉద్దేశంతోనే యుద్ధం చేయబడుతూన్నదని తనకు సంతృప్తికరంగా ఋజువయితేనేగాని ఇండియా అందుకంగీకరించ జాలకపోయింది. అందుకు బ్రిటనిచ్చిన ప్రత్యుత్తరమున్నూ, అవలంభించిన విధానమున్నూ తీవ్రంగా ఖండింపతగిఉన్నవి. ఛెంబర్లేను ప్రధానిమొక్కయూ తదితర ఉన్నత రాజ

కీయ దురంధరులయొక్కయూ ప్రవర్తనగానీ ప్రత్యుత్తరములుగానీ ఇండియాయొక్క సహాయ సానుభూతులను దూరం చేసుకొనేవిగా ఉన్నవి. ఛేంబర్లేను ప్రభుత్వం మారిపోవడం తటస్థిస్తే, దానితోపాటు కాంగ్రెసు వైఖరికూడా మారిపోవచ్చునని పించింది ఒకానొక క్షణంలో. కాని ఈ యుద్ధం అవినీతికరమైన కార్యంకోసం కాదని కాంగ్రెసుకు సంతృప్తి కలుగనంత కాలమూ ప్రభుత్వానికది సహాయం చేయజాలకపోయింది. ఒకతప్పుడు యుద్ధంలో లేదా ఒక అవినీతికరమైన యుద్ధంలో ఇండియా చిక్కుకోవడం కాంగ్రెసు కెన్నడూ అంగీకారంకాదు. కాని కాంగ్రెసు ఈ యుద్ధ ప్రయత్నాలను ప్రతిఘటిస్తుందా లేక చేతులు ముడుచుకొని కూర్చుంటుందా అనేదే ప్రశ్న. అలహాబాదు ఈ నిర్ణయం ఈవిధంగా ఉంది. యుద్ధం నడుస్తూన్న విధానమునుబట్టి బ్రిటిష్ ఫ్రెంచి ప్రభుత్వాలవలంభిస్తూన్న పద్ధతినిబట్టీ, ముఖ్యంగా ఇండియావిషయంలో బ్రిటిష్ ప్రభుత్వం వారుచేసిన ప్రకటనలనుబట్టీ, 1914—18 నాటి ప్రపంచ సంగ్రామం వలెనే ఈయుద్ధంకూడా సామ్రాజ్య కాంక్షాపరత్వంతోనే నడుపబడుతూన్నదనీ, ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్యం వేళ్లుపాతుకొని ఉండడానికే నిశ్చయించుకొందనీ అనుకోవలెను. కాబట్టి యిటువంటి యుద్ధంతోగానీ, ఇటువంటి రాజనీతితోగానీ కాంగ్రెసు కేమాత్రమూ జోక్యంలేదు. ఇందుకోసం ఇండియాయొక్క సాధనసామగ్రిని వినియోగించడం కాంగ్రెసెంతమాత్రమూ సహించజాలదు. బ్రిటిషువారిప్పుడు లేకెత్తించిన సాంఘిక సమస్యకానీ సంస్థానాల సమస్యకానీ ప్రధానవిషయానికి సంబంధించినవికావు. కేవలమొక నైతిక విషయంపైన బ్రిటిష్ ఉద్దేశాలనుగూర్చి ప్రకటన చేయవలసిందని కోరినప్పుడు, వారసందర్భంగా యితర సమస్యలను లేకెత్తించి వాటి చాటున తలదాచుకోడం, ఇండియాలో అభివృద్ధినిరోధకుల తోడ్పాటుతో తమ సామ్రాజ్యాధికారమును నిలబెట్టుకోడానికే. ఈ అభిప్రాయంతోనే, కాంగ్రెసు అధ్యక్షుడు 1939 నవంబరు నాలుగో తేదీని పంపిన ప్రత్యుత్తరం కాంగ్రెసుయొక్క ఆమోదమునూ అంగీకారమునూ పొందింది. బ్రిటిషు రాజనీతికి కళంకం తెస్తూన్న సామ్రాజ్యతత్వమును తొలగించడానికీ, కాంగ్రెసు యింకనూ సహాయం చేయడానికి వీలుగానుండేటట్లు, సాంఘికంగానూ తదితరంగానూ ఉన్న చిక్కులను పరిష్కరించేటందుకు రాజ్యాంగపరిషన్నిర్మాణం ముఖ్యావసరమని అ. భా. కాం. సం. ప్రకటించింది. కాని అంతమాత్రంతో సాంఘిక సమస్యాపరిష్కారమునకు వలయు ప్రయత్నముల విషయములో కాంగ్రెసు అశ్రద్ధ వహిస్తూందని అర్థంకాదు. కాంగ్రెసు మంత్రుల రాజీనామాతో ప్రారంభమైన సహాయనిరాకరణ విధానం కొనసాగుతూనే వుంటుంది. కాని ప్రతి సత్యాగ్రహ విధానంలోనూ, ప్రతిపక్షితో గౌరవప్రదమైన సమాధానం కుదుర్చు

పోవడానికి నిరంతరం ప్రయత్నం జరుగుతూండడం సహజమునే సంగతి కాంగ్రెసు వాదులు గమనించవలెనని విజ్ఞప్తి చేయబడ్డది. అహింసాయుత పోరాటం రావలసివస్తే కాంగ్రెసువాది యెప్పుడూ సంసిద్ధంగానే ఉంటాడు కాని శాంతి పరిస్థితులు కల్పించే టందుకు అవసరమైనన్నడూ ప్రయత్నలోపం చేయడు" తరువాత శాసనోల్లంఘనమునకు కావలసిన సన్నాహములు చేయవలెనని గట్టిగా హెచ్చరించడమైంది. కాంగ్రెసువాదులు మిల్లుబట్టలను మినహాయించి స్వయంగా [illegible] స్వదేశ [illegible] గా ఖాదీ ఉత్పత్తికి ప్రోత్సాహమూతో వివిధసంఘాలమధ్య సమైక్యము [illegible] కూడా శాసనోల్లంఘన సన్నాహంలో ప్రధానస్థానం ఆక్రమించాలని హెచ్చరిక చేయబడెను. దీనినిబట్టి బ్రిటిషువారి ప్రవర్తన [illegible] గా ఉన్నప్పటికీ వారి ప్రకటనలలో ఆశాభంగాలు [illegible] రాజీ [illegible] చీకాకుకలిగిస్తూ వచ్చినప్పటికీ, కాంగ్రెసు [illegible] దృక్పథాన్ని [illegible] స్పష్టం [illegible] అదు. ఒక్కొక్క ప్రత్యేక [illegible] నాన్ని [illegible] పోయినా [illegible] పరిష్కరించటానికి కూడా వీలులేకపోలేదు. ఈ సంకట పరిస్థితిలో [illegible] ప్రభుత్వ [illegible] మధ్యస్థుడు కాంగ్రెసు అలహాబాదులో చేసిన ప్రకటనలోని వాక్యాలను ఉదాహరించడం చూస్తే కొంత ఉత్సాహకరంగా ఉంటుంది. అయితే అంతమాత్రంతో ప్రయోజనం లేకపోవచ్చును. ఇండియాగవర్నమెంటు చట్టంలోని 93 వ సెక్షన్ ఎనిమిది రాష్ట్రీయ ప్రభుత్వాలకు వర్తింపచేయబడిన పిమ్మటనూ, కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామాచేయగానే ముస్లింలీగు నవంబరు 22 వ తేదీ 'మోక్షదినం' (Day of Deliverence) గానూ, ప్రార్థనదినంగానూ (Thanks giving) జరిపిన తరువాతనూ, అలహాబాదులోని అ. భా. కాం. సం. తీర్మానమూ మోదింపబడినదని పాఠకులు జ్ఞాపకముంచుకోవలెను. జెట్లండు ప్రభువు పార్లమెంటులో మాట్లాడేనాటికి (డిశంబరు 14,1939) అస్సాములో పూర్వప్రధాని ఒకరు కాంగ్రెసు ప్రభుత్వానికి బదులుగా మరొక ప్రభుత్వాన్ని స్థాపించాడు. జెట్లండు ప్రభువు, భారత సంస్థానాధిపతులూ, వ్యవసాయకులూ, యిచ్చిన బహుమతులను ఎంతో హుషారుగా ఏకరువు పెట్టాడు. సంస్థానాధిపతు లనేకమంది స్వయంగా యుద్ధంలో సేవ చేయవలెనని కోరి నప్పటికీ "ప్రస్తుత పరిస్థితులలో వారిసేవను ఉపయోగించుకోడానికి వీలులేకపోతూ న్నదన్నాడు." రాజకీయరంగంలోని చిక్కులింకా అలాగే ఉన్నందుకాయన చింతి ల్లాడు. కాంగ్రెసు మంత్రుల రాజీనామాల వలన ఇండియా రాజకీయాభివృద్ధి మింటో మార్లే సంస్కరణలకు ముప్పది సంవత్సరాలు వెనుకకు పోయిందనీ, అయినప్పటికీ తరువాత వచ్చిన నడమంత్రపు మార్పుకూడా మృదువుగానే జరిగిందనీ ఆయన అన్నాడు.

'అయితే ఏ ముఖ్యవిషయంలోనూ కాంగ్రెసు మంత్రులవలంబించిన విధానమునకు భిన్నంగా జరగటంలేదనీ, వారు రాజీనామాలీయక మునుపు తలపెట్టినట్టియు శాసన సభలచే అంగీకరింపబడినట్టియు కార్యకలాపాలన్నీ చాలావరకు గవర్నరులే యిప్పుడవలు జరుపుతున్నారనీ' కూడా పట్లండు ప్రభువన్నాడు. ఆ మాటలలోని యధార్థాన్ని కాంగ్రెసు ఒరిసి చూసింది. చాలా సందర్భాలలో కాంగ్రెసు విధానానికి భిన్నంగా అభివృద్ధి నిరోధక పంథా అవలంబించబడిందని చెప్పకతీరదు * "ప్రతికక్షితో గౌరవప్రదమైన రాజీ చేసుకోవడానికి అన్ని ప్రయత్నాలూ జరగడం ప్రతి సత్యాగ్రహ విధానంలోనూ ఉండే సహజ స్వభావమే" అని ఉన్న అలహాబాదు తీర్మానంలోని వాక్యాన్ని జెట్లండు ప్రభువెంతో శ్లాఘిస్తూ అంతటితో ఊరుకోక యింకా యిలా అన్నాడు. "అయితే సమాధానం కుదుర్చుకోవడానికింకా అభ్యంతరమేమిటి?- కాంగ్రెసుకు ముస్లిం లీగుకూ మధ్య ఉన్న భిన్నాభిప్రాయమే కదా?"—ఇంతటితోనైనా చాలించక అలహాబాదు తీర్మానంలో "కాంగ్రెసు కోరికలను నెరవేర్చడానికి సాంఘిక విషయాలడ్డురావని ఈ కమిటీ వారభిప్రాయ పడుతూన్నారు" అనే వాక్యాన్ని ఉదాహరిస్తూ కాంగ్రెసు కిటువంటి అభిప్రాయం నిజంగా ఉంటే ఉండవచ్చును గాని తనకుమాత్రమా విశ్వాసంలేదని నొక్కి చెప్పాడు. తరువాత అల్ప సంఖ్యాకులనుగూర్చీ, సంస్థానాధిపతులనుగూర్చీ పాడే పాత పాట మళ్లీ యింకోసారి పాడాడు. ఆ సందర్భంలో గాంధీజీయే నవంబరు 25 వ తేదీ 'హరిజన్' పత్రికలో "అల్పసంఖ్యాకులు సంతృప్తికలోబడి" రాజ్యాంగ పరిషత్తును పిలవవలసిందని చెప్పినమాటను జ్ఞాపకంచేశాడు. ఈవిషయం నిజమే. కాంగ్రెసు అల్ప సంఖ్యాకుల ఉనికినీ కాదనియెప్పుడూ అనలేదు. ఒక్కొక్కప్పుడు 'నిజమైన అల్ప సంఖ్యాకులు' అనేమాట వాడితే వాడిఉండవచ్చును. కాని సంస్థానాధిపతులున్నూ అల్ప సంఖ్యాకులున్నూ ప్రధానసమస్యను పరిష్కరించడానికి అభ్యంతరాలుగా ఉన్నారనే మాటనుమాత్రం కాంగ్రెసంగీకరించదు. "ఇండియాలో అత్యంత శక్తివంతమూ అత్యంత విశాలమూ అయిన కాంగ్రెసు సంస్థకు నాయకులుగా ఉండేవారు, ముస్లింలీగు వైఖరికి కారణభూతములైన చిక్కులను అర్థం చేసుకోవలసిందనీ" 'కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా యిచ్చివేసినందుకు, నవంబరు 22 వ తేదీని మోక్షదినంగానూ (Day of Deliverence) ప్రార్థన దినంగానూ (Thanks Giving) పరిగణించవలసిందిగా' ముస్లింలీగు అధ్యక్షుడు కొద్దిరోజులకిందట విజ్ఞప్తి చేయడంవలనకూడా ఈ అవసరం

* రాష్ట్రాలలో అవలంబించబడిన అభివృద్ధినిరోధక విధానాన్ని వివరించిన అధ్యాయంలో చూడండి.

ఇంకా యెక్కువయింపనీ, జెట్లండ్ ప్రభువు చెప్పినమాటలు ఆయన ఉపన్యాసమునకు మకుటాయమానములుగా ఉన్నాయి. ఏది ఏలాఉన్నా ప్రతి శాసనసభ్యుడూ 'ముందు తాను భారతీయుడననీ తరువాత హిందువననిగానీ ముసల్మానుననిగానీ భావించవలెనని' ఆయన సలహాలిచ్చారు. ఇక, ఆయన తరువాత భారత రాజ్యాంగ కార్యదర్శిగా వచ్చిన ఆమెరీ, 'హిందూదేశం మేల్కొంది' అని యిచ్చిన ఉపన్యాసానికి నాందీ వాక్యంగా ఉంది. దీనికి చివర 'భారత దేశ రక్షణ, సంస్థానాధిపతులు సంధుల తాము నిర్వర్తించవలసిన కర్తవ్యములు, [illegible] తాము చేయవలసి, అల్పసంఖ్యాకుల'. వీటినిగూర్చి మామూలు ప్రకారమే తన ఉపన్యాసాన్ని ముగించాడాయన

దీనికి జవాబుగా, ఈ చిక్కులన్నిటినీ పరిష్కరించడానికి ఒక్క రాజ్యాంగ పరిషత్తే తగిన సంస్థఅని, భేదాభిప్రాయాలను స్వతంత్రమైన మధ్యవర్తి పరిష్కారానికివదిలివేయడం ఉచితమనీ జవహర్‌లాలు నెహ్రూగారు అన్నారు. అలాచేసినట్లయితే అధిక సంఖ్యాకుల అభిప్రాయాలను అల్పసంఖ్యాకులపైనగాని, అల్పసంఖ్యాకుల కోర్కెలను అధిక సంఖ్యాకులపైనగాని పరస్పరాంగీకారం లేకుండా బలవంతంగా రుద్దడానికి వీలుండదు. జెట్లండు ప్రభువిసంగతులు గమనించకుండా ఇంకా పూర్వపద్ధతులలోనే ఆలోచిస్తూండడం తొలినాటి సామ్రాజ్యవాదతత్వం ఇంకా ఉండవలెనని అనుకోవడం దురదృష్టం. ఇండియా సమస్యలన్నీ ముఖ్యంగా ఆర్థిక సమస్యలు. కాని జెట్లండు మహాప్రభువు వాటిని జాతి సమస్యలుగా, అల్పసంఖ్యాకుల సమస్యలుగా కనపడేటట్లు చేస్తున్నారు. సంస్థానాధిపతులందరూ వారసత్వంవల్ల ప్రసన్నులైనట్లున్నా రాజపుత్రులు మొదలైన తరగతులవారు సహజంగానే సైనికవర్గాలవారైనట్లున్నా ఆయన భావిస్తూండి ఉండవచ్చును. రాజ్యాంగ పరిషత్తు బ్రిటిష్ సామ్రాజ్యానికి స్వస్తి చెప్పవల సంస్థ కాబట్టి దానికి బ్రిటను ప్రతికూలంగా ఉండడం సహజం. అయితే దానికి ప్రత్యామ్నాయంగా జరిగేపని యేమిటి? "ఇండియాలో అక్కడక్కడ గానీ, పూర్తిగాగానీ సోవియట్ తత్వం అభివృద్ధి పొందడమే"

1939 సంవత్సరాంతంలో రాజకీయ పరిస్థితులనుగూర్చి వర్కింగు కమిటీ సమగ్రంగా పరిశీలనచేసింది ఆనాడు రాజకీయ వాతావరణమెంత క్లిష్టదశలో ఉందో తేలికగా తెలుసుకోవచ్చును. అల్పసంఖ్యాకుల సమస్య అత్యంత ప్రాముఖ్యత వహించింది. వారిని సంతృప్తిపరచడం కాంగ్రెసుకు ప్రధాన కర్తవ్యమయింది వారు చాలా అనుమాన గ్రస్తులుగా ఉన్నారు. వారి అనుమానం కాంగ్రెసు ప్రభుత్వాలపైన చేయబడే నిందారోపణలవలన ఉత్పన్నమయింది. కాంగ్రెసు ప్రభుత్వాలక్రింద అల్పసంఖ్యాకుల ప్రయోజనాలు రక్షింపబడగలవని ముందుగా ప్రకటన చేయనిదే తిరిగీ తాము మంత్రి

త్వాలు తీసుకోబోవడం లేదని కాంగ్రెసు చెప్పగలదా? మహమ్మదీయుల ప్రతేక
ప్రయోజనాల-ఆర్థిక, సాంఘిక, మతసంబంధమైన ప్రయోజనాల రక్షణకోసం
న్యాయంగా వారు కోరే హామీలను ఇయ్యడానికి కాంగ్రెసు నిజానికి సంసిద్ధంగా ఉంది.
కాని నిజంగా ఆ ప్రకారం ప్రకటన చేస్తే ఆశాపాతకులైన అల్పసంఖ్యాకులను బలపర్చ
డమే కాక, ఇంకా కొంచెము కొత్త వాళ్లనుకూడా కొనితెచ్చుకోవడమవుతుందేమోనని ఒక
భయం. తిన్నకొద్దీ యింకా తినవలెననియే ఉంటుందిగదా? అయితే యికమరేమిచేయాలి?
కాంగ్రెసు 1935 ఇండియాచట్టాన్ని నిర్మూలం చేయుస్తానంటున్నది. అయితే తాను పాత
చట్టంకింద మంత్రిత్వాలు తిరిగి పుచ్చుకోదలచుకోలేదనీ ఆచట్టాన్ని రద్దుచేయునవలెననీ
ప్రకటన చేయగలదా కాంగ్రెసు? అలా కాంగ్రెసు అంటే, వంగ, పాంచాల, సింధు,
అస్సాం రాష్ట్రాలేమంటవి? మహమ్మదీయులు పొందుతూన్న ప్రయోజనాలను పాడు
చేయడానికే కాంగ్రెసు ఈపద్ధతిని అవలంబిస్తూన్నదని అనదా? అలాకాకుండా పైప్రకారం
అల్పసంఖ్యాకుల రక్షణలకు హామీయిస్తూ ప్రకటనచేస్తే కాంగ్రెసు సంయుక్త ప్రభు
త్వాల కంగీకరించినట్లర్థం కాదా? కనుక ఇందులో ఉన్న సాధకబాధకాలను స్పష్టంగా
తెలుసుకొని వ్యవహరించడం ఉచితం. కాబట్టి వర్కింగు కమిటీ అటువంటి ప్రకటన
చేయతలచుకోలేదు.

అయితే ఇక ఏంచేయాలి? తాత్కాలికంగానైనా అల్పసంఖ్యాకుల సమస్యను
గురించి యేమీ ప్రసంగించకుండా ఊరుకోవడం. కాలమెంత వేగంగా మారుతూన్నదో
పరిస్థితులుకూడా అంత వేగంగానూ మారుతూన్నవి. కాంగ్రెసు తీర్మానాలన్నీ అల్ప
సంఖ్యాకుల ప్రత్యేకప్రయోజనాలను-అనగా మత, సాంఘిక, ఆర్థిక, సంబంధమైన ప్రయో
జనాలను రక్షించడమునుగురించి ఉదాహరించి ఉన్నవి. అంతేకాని రాజకీయప్రయోజనాలనే
మాట ఎక్కడా లేదు రాజ్యాంగ నిర్మాణసభలోకూడా మనం అంగీకరించవలసిన రక్షణ
లవే కాని రాజకీయరక్షణలు కావు. హిందూమహాసభవంటి సంస్థ అటువంటి రక్షణ
లంగీకరిస్తే అంగీకరించవచ్చును. కాని కాంగ్రెసుమాత్రం మంత్రివర్గాల విషయంలోనూ
వుద్యోగవిషయంలోనూ అటువంటి రక్షణలంగీకరిస్తే స్వరాజ్యంలో ఇండియాను పెడదో
వపట్టించడమవుతుంది. ఎందువల్లననగా స్వరాజ్యంలో శాసనసభలలోని అధికసంఖ్యా
కుల సమిష్టినియోజకవర్గాలద్వారా ఎన్నుకోబడిన మిశ్రమసభ్యులుగా ఉండాలి. అంటే
అందులో హిందువులు ముసల్మానులు, క్రైస్తవులు, పార్సీలు, సిక్కులు, జైనులూ
కూడా ఉంటారు వీరంతా జాతీయవాదులుగా ఎన్నుకోబడతారుగాని మతాలవారీగా
ఎన్నుకోబడరు. అలా కాకపోయినట్లయితే కాంగ్రెసు దిద్దుకోవడానికి వీలులేని గొప్ప
తప్పిదమును చేసినట్లవుతుంది. కాంగ్రెసు కటువంటి నమ్మకమేలేకపోతే అది ఎన్నిక

ఖలో పాల్గొనక నోరుమూసుకొని ఉండడమే ఉచితం. అలా కాక మతాలవారీగా రాజకీయ రక్షణలు కూడా ఉండవలసినయెడల, కొంతమంది మిత్రులు సదుద్దేశంతోనే హిందువులలో కులాలవారీగా కూడా అటువంటి రక్షణలు కావలెననవచ్చును. కాబట్టి యిది యిలా ఉండాలి అని, లక్షణం, శాశ్వతంగా ఒక విధానాన్ని అవలంబించడం కష్టం. కాంగ్రెసు స్వాతంత్ర్యానికీ, ప్రజాస్వామ్యానికీ సంబంధించిన శాశ్వతమైన ప్రధాన సిద్ధాంతాలను మనస్సులో పెట్టుకొని వ్యవహరిస్తుంది. అంతేకాని వివరాలకు సంబంధించినంతవరకు క్షణక్షణమూ మారిపోతున్న రాజకీయపరిస్థితులలో, పదిహేను రోజులతరువాత కాంగ్రెసువైఖరి ఎలా ఉంటుందో చెప్పడానికి వీలులేదు. కాంగ్రెసు రాజకీయ సమస్యనుగురించియే నొక్కి చెప్పాలి. ముఖ్యంగా బ్రిటిష్ ప్రభుత్వమున్నూ జిన్నాసాహెబున్నూ రాజకీయ సమస్యను సాంఘిక సమస్యగా మార్చడానికి ప్రయత్నిస్తూన్నప్పుడు కాంగ్రెసు అవలంబించవలసిన వైఖరి అదే. లేదా కాంగ్రెసు చిరకాలం వేచి ఉన్నప్పటికీ బ్రిటిష్‌ప్రభుత్వంవారు సరియైన ప్రత్యుత్తరమివ్వజాలరు. కాబట్టి మనం పోరాటానికి సంసిద్ధం కావలెనని తనవాళ్ళందరికీ చెప్పి వారిదృష్టి పోరాటంవైపుకి మరలించవలెను. అయితే కాంగ్రెసు తన ప్రధాన నాయకుణ్ని విడిచి ఈపని చేయజాలదు. తాను పోరాటానికి సంసిద్ధంగా ఉన్నానని గాంధీ చెప్పగలిగిన స్థితిలోలేడు. తాను సంసిద్ధంగా ఉంటేనే కాని యితరులను సంసిద్ధంగా ఉండవలసిందని ఆయన చెప్పడు. తాను సంసిద్ధంగా ఉన్నప్పుడు తక్కినవారుకూడా పోరాటానికి సిద్ధపడతారని ఆయనకు తెలుసు. పోరాటం విషయం వచ్చేసరికి తిరిగీ కాంగ్రెసు రాజకీయ, సాంఘిక సమస్యలలో ప్రధాన సమస్యను నిర్ణయించవలసివచ్చింది. సాంఘిక ఐకమత్యమునుగూర్చి కాంగ్రెసు యేమీ తడవకుండా విడిచిపెట్టడానికి వీలవుతుందా అని ప్రశ్న వచ్చింది. అలా విడిచిపెడితే కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలోని మూడు ముఖ్యాంశములలో ఒకదానిని పూర్తిగా మినహాయించడమే అవుతుందికదా? అప్పుడు జిన్నా కానీ మరొకరుగానీ తప్పు పట్టితే కాంగ్రెసేమి జవాబు చెప్పగలుగుతుంది? వివరాలలో స్థితిగతులు మారవచ్చును. రాజ్యాంగ నిర్మాణసభలో చిక్కుపరిస్థితులు తటస్థించి ప్రతిష్టంభనం వచ్చేయెడల నిష్పక్షపాతమైన న్యాయవిచారణసంఘం ద్వారా దానిని పరిష్కరించుకోవచ్చునని కాంగ్రెసు సూచించింది. జిన్నాగారు కాంగ్రెసు ప్రభుత్వాల చర్యలను విచారించడానికి రాయల్ కమీషనును నియమించవలెనని కోరినందున కాంగ్రెసిప్పుడా న్యాయవిచారణ సంఘంమాట తలపెట్టకుండా జారవిడుస్తుందా? నిజానికి జిన్నా కాంగ్రెసుచేసిన వాగ్దానాన్ని గమనించకపోవడమేగాక, రాయల్ కమీషన్‌ను నియోగించమని కోరడంలో చాలా అతిగా ప్రవర్తించాడుకూడా.

ఒకవైపున జిన్నాయున్నూ రెండవవైపున రాజప్రతినిధీ, జెట్లండు ప్రభువులున్నూ ఘటింపచేసిన చిక్కులను తొలగించుకోవడానికి బదులుగా కాంగ్రెసు పెడదారినిపట్టడం బాగా ఉంటుందా అని ముఖ్యంగా ఆలోచించవలసి ఉంది. అలా పెడదారిని పట్టినట్లయితే జిన్నా వేసిన వలలో కాంగ్రెసు చిక్కుకోవడమేకదా? ముస్లింలీగు కాంగ్రెసులు ఒకప్పుడు మిత్రభావంతో ఉన్నప్పటికీ యిప్పుడుమాత్రం మలాలేవు. రాయల్ కమీషనునుగూర్చి పునరాలోచించకుండా ఉండడమే ఉచితం. కాని సాంఘిక సమస్యను పరిష్కరించడానికి వీలులేకపోవడం శాశ్వతంగా లొంగిపోవడం. నిర్మాణకార్యక్రమంలో యేమీ లోపం లేదు. కాని అక్కడనే ఆగిపోవడం- అనగా దేశాన్ని పోరాటానికి తయారుచేయక బ్రిటిష్ ప్రభుత్వంతో కాంగ్రెస్సెలాగో అలా రాజీ చేసుకొంటుందిలే అనే అభిప్రాయంలో ఉండడం- మధ్యలో దిగజారడం అవుతుంది. కాంగ్రెసుకు అడ్డంకుగా ఉంటారనేవారినిగూర్చి ఆ సంస్థ నిర్లక్ష్యం చేయజాలదు. జిన్నా అంబేత్కారులవంటి మంత్రులకు ఎక్కువమంది అనుచరులు ఉన్నారని మాఅభిప్రాయం కాదు. ప్రజలలో వారికెంతో పలుకుబడి ఉన్నట్లుగా అభిప్రాయం కలుగజేయాలని వారు ప్రయత్నిస్తున్నారు. వారి పలుకుబడి ఎంత అల్పమైనప్పటికీ కాంగ్రెసుమాత్రం వారిని నిర్లక్ష్యం చేయజాలదు. 'గాంధీవంటి మనిషి మనం వ్యక్తులుగా వారితో స్నేహం చేయవలెనని చెబితే చెప్పవచ్చును. కాని తక్కినవారది అసంభవమని భావిస్తారు. వారు సృజించిన వాతావరణం వలన ప్రతివాని హృదయంలోనూ ఒకవిధమైన కళంకమేర్పడ్డది. ఇదికూడా ఆ ప్రసిద్ధపురుషులవలన కల్పించబడిన భ్రమయే. కాంగ్రెసు యేపక్షానిగానీ యేఒక్కడినిగానీ పరిగణించకుండాఉండజాలదు.- అలా ఉండకూడదు కూడా. కాబట్టి కాంగ్రెసు తిరిగీ చెప్పినమాటనే చెప్పవలసివచ్చినప్పటికీ అల్పసంఖ్యాకులనుగూర్చి తానవలంబించదలచుకొన్న వైఖరిని మరొకసారి స్పష్టంచేసింది. ఒకప్రక్క ప్రజలకూ, మరొకప్రక్క రాజప్రతినిధికీ, భారతరాజ్యాంగ కార్యదర్శికి, ఇంకొకప్రక్క జిన్నా అంబేత్కారులకూ జవాబు చెప్పవలసిన బాధ్యత కాంగ్రెసుకుండడంచేత కాంగ్రెసు తన వైఖరిని పునరుద్ఘాటించక తప్పిందికాదు. అసలు సమస్యను గూర్చి ఆలోచించినకొద్దీ తమ నాయకునికే స్పష్టమైనమార్గం యింకా తోచనట్లు కాంగ్రెసు అభిప్రాయపడ్డది. కాని ఒకసంగతి మాత్రం నిజం. బ్రిటిషువారిని తప్పుదోవలో పెట్టాలనీ, ఆతప్పు ప్రపంచానికీ మహమ్మదీయులకూ కూడా స్పష్టంగా కనిపించేటట్లు చేయాలనీ గాంధీజీ కోరుతూన్నట్లు కాంగ్రెసు తెలుసుకొన్నది. ముస్లిములు వ్రాసినదంతా- మంచిగానీ చెడుగానీ గాంధీదగ్గర ఉంది. ఆయన యెప్పుడూ "స్వతంత్రం స్వతంత్రం" అని అరిచే స్వభావంకలవాడుకాడు. 1930 జనవరి ఒకటో తేదిని 11 షరతులను ఉదా-

హారిస్తూ ఇర్విన్ ప్రభువుకు ఉత్తరం వ్రాసినపుడు గాంధీని మోతీలాలు నెహ్రూగారంటి మహామేధావికూడా ఎదిరించిన సందర్భం చరిత్రలో లేదు. గాంధీ వ్రాసే వ్రాతలలో గానీ, మాట్లాడే మాటలలోగానీ, చేసే చేతలలోగానీ, మానసిక భావాలలోగానీ. 'స్వాతంత్ర్య' చిహ్నాలు కనిపిస్తూనేఉంటాయి. ఇర్విను మనసులో ఆయన పట్ల సద్భావం ఏర్పడింది. 'స్వాతంత్ర్యం' అనే మాట మాత్రం వదిలేస్తే . ఆనాటి అ. భా. కాం. సం. శాసనోల్లంఘనసమయంలో కాంగ్రెసు కార్యకర్తలను వేధించే కార్యక్రమము చేపట్టిన జెట్లండు ప్రభువును గమనించవలసి ఉంటుందని చెప్పారు. ఎంపైర్లు - ఇంపీరియలిస్టు ప్రభుత్వ విధానమంతా ఆయనలో మూర్తీభవించింది. గాంధీని సర్ స్టాఫర్డ్ క్రిప్సుతో దీర్ఘసంభాషణలు జరిపేటప్పుడుకూడా ఈ సంగతి ఆయన మనస్సులో ఉంచుకునే ఉండేవారు.

ఈ సందర్భంలో సర్ స్టాఫర్డ్ క్రిప్సు వార్ధాకు వచ్చి వెళ్ళిన సంగతి ప్రస్తావించ చేయడం సముచితం. ఆనాడా విషయానికి ప్రాముఖ్యంగా ఎవ్వరికీ అనుకోలేదు. కాని తరువాత జరిగిన సంఘటనలనుబట్టి అది ఎక్కువ ప్రాముఖ్యం వహించవలసి ఉంది. క్రిప్సు ఇండియానుండి తిరిగి వెళ్ళగానే, మాదాపు సిమ్యాకోరిక మీద ఆయన ఆ దేశానికి రాయబారిగా వెళ్ళారు. బ్రిటిష్ ప్రజాసామ్రాజ్యంలో సుప్రసిద్ధ న్యాయశాస్త్రజ్ఞులే ప్రముఖస్థానాలాక్రమిస్తారు. లార్డు రీడింగు, లార్డు బర్కెన్ హెడ్, సర్ జాన్ సైమన్, ఆస్క్విత్, లాయిడ్ జార్జి, లార్డు శాంకీ - వీరంతా వారికాలంలో ప్రసిద్ధి వహించిన లాయర్లు. సర్ స్టాఫర్డు క్రిప్సుకూడా ఆ శ్రేణిలోవాడే. 1939 వరకూ అనగా ఆయన వార్ధాకు వచ్చివెళ్ళేవరకూ లాయరువృత్తిలో ఆయన ఉచ్ఛస్థితిలోనే ఉన్నారు. లండనునుండి బయలుదేరడానికి ఒకవారంముందా వృత్తిని విడిచి తనశక్తి సామర్థ్యాలను పూర్తిగా ప్రజాజీవితములో వినియోగించడానికి పూను కొన్నాడు. సర్ స్టాఫర్డు చాలా స్వతంత్రాభిప్రాయాలు కలవాడు కావడంచేత లేబరుపక్షం వారితోనే ఆయనకు తీవ్ర విభేదాలు తటస్థించినవి. 1938 లో పార్టీ ఆదేశాలను ఆయన ఉల్లంఘించినాడని లేబరు పక్షంవారు ఆయనపైన క్రమశిక్షణచర్య తీసుకొన్నారు. అయి నప్పటికీ ఆయనంటే స్వతంత్రకార్మిక పక్షానికేగాక నాటి - ప్రపంచకార్మిక పక్షానికి కూడా యిష్టమే.

సరిగా ఈ సమయంలోనే సర్ స్టాఫర్డు క్రిప్సు ఇండియాకు రావడం ఆయన గడపదలచుకొన్న నిరంతర ప్రజాజీవితమునకు నూతన శకారంభంగా పరిణమించింది. ఆయన రాకకు కొంతరాజకీయ ప్రాముఖ్యతను అంటగట్టినవారు కూడా చాలామంది లేకపోలేదు. కాంగ్రెసు ప్రారంభదశలో డ్యూక్ ఆఫ్ ఆర్గిల్ లాంటి కన్సర్వేటివుల పైన కూడా ఆనాటి కాంగ్రెసువాదులకు కొంత ఆశ ఉండేది. తరువాత ఇరవయ్యో శతా

బ్రమలోని భారతీయ మితవాద నాయకులు, బ్రిటిష్ లిబరల్ పక్షంవారియందు నమ్మకం కలిగి ఉండేవారు. అందువల్లనే ఇండియాలోని తమపక్షానికికూడా లిబరల్ పక్షమని పేరు పెట్టుకొన్నారు. అప్పటికప్పుడే బ్రిటిష్ రాజకీయాలలో అక్కడి లిబరలుల ప్రభావమంతా క్షీణించి ఆ పార్టీయే అంత్యదశలోకి వచ్చింది. తరువాత సోషలిస్టులు, కాంగ్రెసులోని తదితర అభివృద్ధికాముకులూ కూడా ఇంగ్లాండులోని లేబరుపార్టీకి అనుగుణంగా తమ కార్యవిధానాన్ని సాగించవలెనని అనుకొన్నారు. ఈమార్పు నిజంగా లోకమాన్య తిలకు కాలంలోనే ప్రారంభమయింది. ఆయన 1918-19 సంవత్సరాలలో సర్ వాలంటైల్ మీరాలు పైన వేసిన దావాసందర్భంలో ఇంగ్లాండుకు వెళ్ళినప్పుడు లేబరుపార్టీకి మూడు వేలపౌనులు విరాళమిచ్చాడు. 1920 మొదలు జరిగిన కొన్ని సంఘటనలు మనకు కనువిప్పుగా పరిణమించినప్పటికీ, ఇండియానుగూర్చి ఇంగ్లాండులోనూ ఇతరదేశాలలోనూ కూడా ప్రచారం సాగిస్తే ప్రయోజనం ఉంటుందనే విశ్వాసం యింకా కొద్దోగొప్పో మనవాళ్ల మనస్సులలో వుండనే ఉంది ఇండియా దేశపు రాజకీయాలలో సర్ స్టాఫర్డు కొంత ఉత్సాహం చూపుతున్నమాట నిజమే. అంతేకాదు; ఆయన జవహరలాలుకు వ్యక్తిగతంగా స్నేహితుడు కావడంవలనకూడా ఇండియాకు ఆయన రావడం తటస్థించిందని కొందరినమ్మకం.

కాని సర్ స్టాఫర్డుయొక్క ప్రథమదర్శనంలోనే అనుకోని విషయాలు కొన్ని తెలిసివచ్చినవి. బ్రిటిష్ రాజకీయాలలో కనపరచే నిక్కచ్చిగానీ, నిజాయితీగానీ, ఇండియా దేశపు రాజకీయాలలో బ్రిటిష్ రాజనీతిజ్ఞులు ప్రదర్శిస్తారని నమ్మకోవడానికి వీలు లేకపోయినప్పటికీ, క్రిప్సుమాత్రం ఏవో కల్లిబొల్లిమాటలుచెప్పి ఎలాగో అలా భారతీయుల ప్రేమకు పాత్రుడు కావలెననే కోరికగలవాడు కాడు. హిందూదేశీయుల ఆదర్శములకూ అభిలాషలకూ అనుగుణంగా వారిని సంతృప్తిపరచవలెననే అభిప్రాయం, ఇంగ్లాండులో ఇటీవల ప్రబలంగాఉన్నట్లు క్రిప్సు చెప్పినాడు. ఈతరుణంలో ఇండియాను విరోధిగాచేసుకోవడం ఇంగ్లాండు కిష్టం లేదన్నాడు. ఇండియాలోని పరిస్థితులను స్వయంగా తెలుసుకోవడానికి ఇంగ్లాండునుండి అఖిలపక్ష రాయబారవర్గంవారు రానున్నారనేసంగతి ఒకటి కొత్తగా ఆయన వెల్లడించాడు. అయితే అది ఇక్కడి సంగతులను సమగ్రంగా తెలుసుకోవలెనని నియమింపబడ్డ కమీషనా ఏమిటి? నిష్కపటంగా చెప్పవలసివస్తే కాంగ్రెసు కిటువంటి రాయబారవర్గాలంటే అపనమ్మకమూ సందేహమూను. సర్ స్టాఫర్డు క్రిప్సు కుండబద్దలుగొట్టినట్లు ఉన్నదున్నట్లుగా చెప్పగలడని కాంగ్రెసు ఆయనకు ఆహ్వానమిచ్చింది. అఖిలపక్ష రాయబారవర్గంవారలా కాక నిజాన్ని కప్పిపుచ్చుతారనీ, తుది పంచాయతీ చేస్తారనీ, అందువల్ల వారితోప్ప 'ఆయన అందకుండా పోకను పొందకుండా

ఉంటుందనీ కాంగ్రెసుకు అపనమ్మకం. క్యాడొగార్లు, ఆట్లీలవంటివారితో కూడుకొని ఉన్న సైమన్ కమీషను వివిధపక్షాలకూ ఏమినాటి సైమన్ కమీషను నాటికే నేను కూడా విభిన్నదృక్పథాలుకల వివిధపక్షాల ప్రతినిధులతో అఖిలపక్షరాజ్యాంగం ఇండియాకు రాస్తున్నదట! ఎందుకో అందరూ ఊహించగలరు. ఇందువల్ల కాలహరణం తప్ప మరేమీ ప్రయోజనం లేదు. ఇండియాకు కావలసింది పరిపూర్ణ స్వాతంత్ర్య ప్రకటనను; దానికి తగినట్లుగా ఆచరణలో 'తూ' 'చ' తప్పకుండా వ్యవహరించవలసియున్నారు. కాని బ్రిటిషువారు ఉద్దేశించిన ఈ అఖిలపక్ష రాజ్యాంగ ప్రణాళిక పార్లమెంటులో సర్ శామ్యుయల్ హోరు అవలంబించిన విధానానికి అనుగుణంగా ఉంది. ఆయన ఇండియా కోరికను మన్నించనూలేకపోయినారు; తిరస్కరించనూలేకపోయినారు. ఇంగ్లాండ్ సందర్భంలో ఇదమిత్థమని స్పష్టంగా చెప్పదలచుకొనలేదు. ఇందుకు కారణం ఇండియాయొక్క సహృద్భావాన్ని ఇంగ్లాండు పోగొట్టుకోదలచుకోనూలేదు, దానిని సంపాదించడానికి తగిన త్యాగమూ చేయదలచుకోలేదు.

సర్ స్టాఫర్డు, గాంధీ, నెహ్రూ, పటేలులతో చాలా పెద్ద సంభాషణలు జరిపాడు. గాంధీజీ వివరంగా తయారుచేసిన ఒక పెద్ద ప్లానునికూడా సర్ స్టాఫర్డు ఇంగ్లాండుకు తీసుకొని వెళ్ళాడు. ఇందుతో సర్ స్టాఫర్డు ఆకస్మికంగా ఇండియాకు ఆగమనంచేసిన విషయం అంతమయింది. ఇక ఆనాడు గాంధీజీ ఆలోచనలు భావాలూ ఎలా ఉన్నవో విచారిద్దాం.

ఏదోవిధంగా బ్రిటిష్‌వారితో రాజీచేసుకోగలమని అనుకొన్నా, ఆ రాజీ కేవలం హింసవాదులకూ బ్రిటిష్‌వారికీ మధ్యజరిగే రాజీగా ఉండకూడదనీ, అది హింస అవుతుందనీ గాంధీజీ అభిప్రాయం. అందువల్లనే జవహర్‌లాలు కాంగ్రెసుముందు ప్రతిపాదించినట్లుగాగాక గాంధీజీ వేరువిధంగా రాజ్యాంగ సభనిర్మాణమునుగూర్చి ఆలోచించాడు. శాసనోల్లంఘనం విషయంలో ప్రజాసామాన్యం కేవలం మంత్రముగ్ధులవలెగాక హృదయపూర్వకంగా కాంగ్రెసును అనుసరించేటట్లు చేయవలెనని ఆయన భావం. దురదృష్టవశాత్తూ దేశం ఈ సంగతి గుర్తించలేకపోయింది. కాంగ్రెసు సభ్యులు అసెంబ్లీకిపోయి అక్కడ పనిచేయడం ఉచితమనికూడా ఆయన తలంచాడు. కాంగ్రెస్ సభ్యులందరూ ఏకాభిప్రాయంతో వ్యవహరించాలని ఆయన కోరిక. యుద్ధంమూలాన ఎన్నికలాపివేయవలెనని కొందరు సూచించినప్పటికీ అవి జరిగితీరవలెననియే ఆయన కోరాడు. కాంగ్రెసు మంత్రిత్వాలను విడిచిరావడం, బ్రిటిష్ ప్రభుత్వంవారు తమ ప్రయోజనాలకోసం మన మంత్రులను ఉపయోగించుకొంటూన్న కారణాన కాంగ్రెసు బలం పడిపోతూన్నదని భావించిగాని మరొక ఉద్దేశంతో కాదు. కేంద్రశాసనసభలో

కూడా మనకు బలం రావడానికి బదులు పోతూన్నదని గ్రహించినప్పుడే విడిచివచ్చాం. ప్రతిదాన్ని నిషేధించడం కాదు మనపని. పైగా అందరితోనూ మిత్రభావం కలిగిఉండాలని గాంధిజీ కోరిక. ఇతరులు మనతో అమిత్రభావం కలిగి విషప్రచారం చేస్తే వారిదే తప్పు. వారే శాసనోల్లంఘనోద్యమాన్ని కొనితెచ్చుకొన్నవారవుతారు. వారి కంత కోరికఉంటే శాసనోల్లంఘనం ప్రారంభించడానికి మనకేమీ అభ్యంతరం లేదు. సిపాయి అధికారాలి ఇదికావాలని వేచిఉండరు. జిన్నాను మనంచేసిన వాగ్దానం ఆయన తిరస్కరించినట్లయితే ఆదరియనతప్పు ప్రపంచదృష్టిలోనూ భారతమహమ్మదీయులదృష్టిలోనూ కూడా ఆయన తప్పుచేసినవాడవుతాడు. ఇంగ్లీషువాళ్లు తొందరగా వ్యవహరిస్తేమనమూ తొందరగా వ్యవహరించాలి. మంత్రులను ఢిల్లీ కుర్చీలలో కూర్చోపెట్టవలెనని గాంధీజీ అనుకోవాగాలేదు. ఇండియాను స్వతంత్రంగా చేయడం అవసరమని బ్రిటిష్ ప్రభుత్వానికి తోచేశక్తి రావాలి. అందుకోసం కాంగ్రెసు పనిచేయాలి. ఇదీ గాంధీ ఆలోచించింది రాజ్యాంగపరిషత్తుయొక్క అధికారాలను చూచి ఎవ్వరు అనుమానపడవలసిన అవసరంలేనట్లుగా ఉండాలది. ఇవే 1939 చివరలో భారతదేశాన్ని నడుపుతూన్న నాయకుల హృదయాలలో ప్రతిబింబించిన భావాలు. డిశంబరు 18 వ తేదీని కాంగ్రెసు వర్కింగుకమిటీవారు సమావేశమైనారు. భారతరాజ్యాంగ కార్యదర్శి హిందూదేశ స్వాతంత్రమునుగూర్చి బ్రిటిష్ యుద్ధాశయములను వివరించడానికి బదులు దానిని మఱుగుపఱచి సాంఘిక సమస్యలకు ప్రాధాన్యమిస్తూ చేసిన ప్రకటనలనన్నిటినీ సమగ్రంగా పరిశీలించి వారు తమ విచారమును వెలిబుచ్చారు. పరాయివారు దేశంలో ఉన్నంతకాలమూ, వారిసహాయంతో, దేశానికి నష్టంవచ్చినప్పటికీకూడా, తమ తమ పక్షాలకు, ప్రత్యేక ప్రయోజనాలను సంపాదించవలెనని వివిధపక్షాలవారూ కోరుతూన్నంతకాలమూ సాంఘికసమస్య సంతృప్తికరంగా పరిష్కారంకావడానికి వీలులేదు. పరాయి ప్రభుత్వమంటే దేశంలో అనేక విభాగాలేర్పడడం కాంగ్రెసానివిభాగాలను ఐక్యంచేయడానికే పనిచేస్తూన్నది. పరాయిప్రభుత్వం పూర్తిగా పోతేనేగాని శాశ్వతమైన ఐక్యత చేకూరదు. బ్రిటిష్ ప్రభుత్వానికి ఈదేశంనుండి వెళ్లిపోవలెనని కానీ, ఈదేశంపైన తన అధికారాన్ని వదులుకోవలెననికానీ యిష్టంలేదు. అందువల్ల మనలో మనకు తగాదాలు పెట్టడానికి సాంఘిక సమస్యను లేవదీసింది. రాజ్యాంగ పరిషత్ నిర్మాణముకటే ఈసమస్యను శాశ్వతంగా పరిష్కరించదగిన మార్గం. అల్పసంఖ్యాకుల హక్కులన్నీ వారికి సంతృప్తికరంగా ఉండేటట్లు రక్షింపబడతవని, ఇంకా విభేదాలేవైనా ఉంటే అవి నిష్పాక్షికమైన మధ్యవర్తిసంఘంద్వారా పరిష్కరించుకోవచ్చునని కాంగ్రెసు అనేకసార్లు స్పష్టంగా చెప్పింది.

కష్టపడి పనిచేయకుండా స్వాతంత్ర్యం లభించదు. మా అవశ్యమైన స్వాతంత్ర్యం లోనూ మన సాధనమైన అహింసలోనూ కూడా అవిభాజ్యంగా ఇమిడిఉంది. ఈ రెండింటికీ వెనుకఉన్న బలం సాత్వికనిరోధం. అంటే అది సత్యాగ్రహంలో ఒకభాగమే. అసలా అంశతికి అందరూ ముఖ్యంగా ప్రతినిధులు అందరియెడ సుహృద్భావం కలిగిఉండడం. కాబట్టి కాంగ్రెసు వ్యక్తులు సుహృద్భావంకోసం ప్రయత్నించేసి దానిని పెంపొందించాలి. సుహృద్భావమంటే పేదలయెడ అభిమానమూ, తక్కినవారియెడ దాక్షిణ్యమూ కలిగిఉండడం. ఖద్దరు అభిమానమునకూ సాంఘికసమత్వమూ దాక్షిణ్యమునకూ చిహ్నాలు. అవసరం వచ్చినప్పుడు కాంగ్రెసు పిలుపును అందుకోవడానికి ప్రజలకు కావలసిన అహింసా సిద్ధాంతమిది

“1939 సంవత్సరాంతంలో కాంగ్రెసు వర్కింగుకమిటీవారు దేశానికిచ్చిన అంతిమసందేశం, ఈకింద సంగ్రహంగా స్పష్టమైనభావంలో వివరించబడింది. అది బంధములు బిగించి దేశస్వాతంత్ర్యంకోసం పోరాడటానికి సంసిద్ధంగా ఉండమని ఇచ్చిన సందేశం. భారత స్వాతంత్ర్యదినోత్సవం జరుపవలసిందని చేసిన ప్రకటనలోనూ, జనవరి 26 వ తేదీని మళ్ళీ కొత్తగా చదువవలసిన ప్రమాణపత్రంలోనూ కూడా అదే సందేశం ప్రస్ఫుటమయింది.

“ప్రస్తుత రాజకీయ క్లిష్ట పరిస్థితులనుబట్టీ, బ్రిటిషుప్రభుత్వంవారు మన కోరికల యెడ అవలంబిస్తూన్న వైఖరినిబట్టీ కొద్దికాలంలోనే, మనకిష్టంలేకపోయినా, తప్పని సరిగా రానున్న పోరాటానికి దేశాన్ని సంసిద్ధపఱచడం అత్యవసరమైనందున, 1940 వ సంవత్సరంనాటి స్వాతంత్ర్యప్రమాణపత్రం ఆసన్నావసరాలకు సహాయకారిగా ఉండేటట్లు తయారుకావాలి. అందువలన ఈ దిగువతీర్మానం అంగీకరించబడింది.

“1940 జనవరి 26వ తేదీని స్వాతంత్ర్యోద్యమమును సక్రమంగానూ, విధియుక్తంగానూ జరుపవలసిన అవసరమును గుర్తించవలసిందిగా దేశాన్నీ, కాంగ్రెసు కమిటీలనూ కాంగ్రెస్‌వారలనూ ఈ వర్కింగుకమిటీవారు కోరుతూన్నారు. 1930 నుండీ ఈ ఉత్సవం దేశమంతటా సక్రమంగా యేటేటా జరుగుతోంది. అది మన స్వాతంత్ర్య పోరాటంలో ఒక ప్రధానఘట్టంగా కూడా పరిణమించింది. ఇండియాకూ ప్రపంచానికీ తటస్థించిన యీక్లిష్ట దశలో, మన స్వాతంత్ర్య పోరాటమింకనూ తీవ్రతరంగా సాగేసావకాశం కనబడుతూన్నప్పుడు, రాబోయే ఈ దినోత్సవం జరపడంలో ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. ఈ దినోత్సవం, మన స్వాతంత్ర్య వాంఛా ప్రకటనమునకేకాక మన పోరాటానికి సన్నాహంగానూ, మన సుశిక్షిత కార్యావలంబనమునకు దీక్షగానూ కూడా ఉపకరించాలి.

"కాబట్టి అరోజున ఏర్పాటుచేయబడిన బహిరంగ సమావేశములలో, ఈదిగువ ఉదాహరింపబడిన ప్రమాణమును స్వీకరించవలసిందని కాంగ్రెసు కమిటీలనూ వ్యక్తులను కూడా కాంగ్రెసు వర్కింగు కమిటీవారు కోరుతూన్నారు. అనారోగ్యంవలనగానీ, లేక యితరమైన శారీరక దౌర్బల్యంవలనగానీ, లేక ఎక్కడో మారుమూలనుఉన్న కారణానకానీ ఎవరైనా కాంగ్రెసువాదులు బహిరంగ సమావేశమునకు హాజరుకాలేనియెడల. వారి యిండ్లలోనే ఉండి వ్యక్తిగతంగానో ఒక గుంపుగానోచేరి ఈప్రమాణమును తీసుకో వలెను. వ్యక్తులున్నూ సంస్థలున్నూ ఆయాచోట్ల జరిగిన సమావేశములగురించీ, వ్యక్తులు గానూ, గుంపులుగానూ తీసికొనిన ప్రమాణములనుగూర్చీ ఆయారాష్ట్రీ కాంగ్రెసు కమిటీలకు తెలియచేయవలెననికూడా వర్కింగు కమిటీవారు సలహాయిచ్చారు. ఈ ప్రమాణపత్రంలోని విషయాలను విశ్వసించనివారెవ్వరూ, కేవలం లాంఛనంకోసం దీనిని స్వీకరించరని ఈ కమిటీ వారాశిస్తున్నారు. ఈప్రమాణ పత్రంలో సమ్మతించలేని కాంగ్రెసు వాదులు వారి అసమ్మతికి కారణాలను తెలియచేస్తూ, వారిపేర్లు చిరునామాలతో సహా ఆయా రాష్ట్రీకాంగ్రెసుకమిటీలకుపంపవలెను. ఈసమాచారము క్రమశిక్షణచర్యజరిపే నిమిత్తంగాకి ఈప్రమాణ పత్రములోనున్న యే విషయాన్నైనా ఆమోదించనివారి సంఖ్య యెంతఉన్నదో తెలుసుకోవడానికిమాత్రమే ఉద్దేశింపబడినది. ఇష్టంలేని కాంగ్రెసువాదులపైన ఈప్రమాణ పత్రమును బలవంతంగా రుద్దవలెనని వర్కింగు కమిటీవారి అభిలాష కాదు. అహింసాత్మకమైన సంస్థలో బలవంతానికి తావులేదు. ఇందులోని ప్రధాన విషయాలను సుశిక్షణతో నిర్వహించడంపైననే, శాసనోల్లంఘన ప్రారంభం ఆధారపడిఉంది.

## ప్రమాణం

"తమ అభ్యుదయానికి కావలసిన సమస్తావకాశాలనూ కలిగిఉండడానికి వీలుగా స్వాతంత్ర్యమును పొంది తమ కష్టార్జితముల ఫలమనుభవించడానికీ, తమ జీవితావసరములను సంపాదించుకోవడానికీ అందటి ప్రజలకువలెనే భారతప్రజలకుకూడా తొలగించరానిహక్కున్నదని మా విశ్వాసం. అంతేకాక, ఏప్రభుత్వమైనా ఏప్రజలకైనా ఈహక్కులను లేకుండాచేసి వారిని అణిచివేస్తూన్నయెడల, ఆ ప్రభుత్వాన్ని మార్చడానికీ లేదా దానిని రద్దుచేయడానికీ ఆప్రజలకు హక్కున్నదనికూడా మానమ్మకం. ఇండియాలోని బ్రిటిష్‌ప్రభుత్వం ప్రజలస్వాతంత్ర్యాన్ని అపహరించడమేకాక ప్రజాసామాన్యమును స్వార్థంకోసం వినియోగించుకొంటూ, ఇండియాను ఆర్థికంగా, రాజకీయంగా, వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా నాశనంచేసింది. కాబట్టి ఇండియా బ్రిటిష్ సంబంధమును విడిచిపెట్టుకొని, పూర్ణస్వరాజ్యమును పొందవలెనని మా నిశ్చయం.

“మేము మా స్వాతంత్ర్యమును పొందడానికి అత్యంత ప్రయోజనకరమైన మార్గం దౌర్జన్యంకాదని గ్రహించాం. ఇండియా శాంతియుతమూ న్యాయసమ్మతమూ అయిన పద్ధతుల ననుసరించడం వల్లనే ఆత్మవిశ్వాసమూ బలమూ కలిగి స్వరాజ్య మార్గాన చాలాదూరం నడిచింది. ఈపద్ధతుల నవలంబించడం మూలానే మన దేశం స్వాతంత్ర్యమును పొందగలదు.

## బహిరంగ సభలలో తీసుకోవలసిన ప్రమాణం

“భారత స్వాతంత్ర్య సంపాదన నిమిత్తం [illegible] ప్రమాణం చేస్తున్నాము. పూర్ణస్వరాజ్య సంపాదనకూ అహింసావిధానమే [illegible] స్వాతంత్ర్య [illegible] సాగించడానికి వ్యూహాత్మకంగా [illegible] న్నాము.

“ అహింసావిధాన [illegible] ప్రత్యక్షచర్యకు కావలసిన సన్నాహంగానీ సాగాలంటే రాట్నం, ఖాదీ, సాంఘిక సమన్వయమూ, అస్పృశ్యతా నిర్మూలనమువంటి నిర్మాణ కార్యక్రమం [illegible] ప్రదంగా కొనసాగాలని మా విశ్వాసం. కులమతాల [illegible] సుహృద్భావమును వ్యాపింపచేయడానికి ప్రతి అవకాశమునూ వినియోగించుకుంటాము. దిక్కులేనివారిని అజ్ఞాన దారిద్ర్యములనుండి ఉచ్ఛస్థితికి తీసుకురా ప్రయత్నిస్తాము. వెనుకపడి ఉన్నవారినీ, అణచిపెట్టబడి ఉన్నవారినీ [illegible] అభివృద్ధికి అన్ని విధాలా పాటుపడతాం. మేము సామ్రాజ్య విధానాన్ని ధిక్కరించేటందుకు పూనుకొన్నప్పటికీ ఇంగ్లీషువారితో, అధికారులతోగానీ, అనధికారులతోగానీ మాకు విరోధం లేదు. సవర్ణహిందువులకూ హరిజనులకూ మధ్య ఉన్న భేదాన్ని అంతరింపచేయవలెననీ, హిందువులు వారి నిత్య ప్రవర్తనలో ఈ భేదమును విస్మరింపవలెననీ మేమెరుగుదుము. ఇటువంటి భేదాలు అహింసా ప్రవర్తనకు అడ్డంకులు. మా మత విశ్వాసాలలో భేదాలున్నప్పటికీ పరస్పర సంబంధబాంధవ్యములలో మాత్రం ఒకే జాతీయత ఒకే ఆర్థిక రాజకీయ ప్రయోజనములూ గల భారతమాత బిడ్డలుగా వ్యవహరించగలం.

“రాట్నమూ ఖద్దరూ ఈరెండూ మన నిర్మాణకార్యక్రమంలో ప్రధానాంగాలు. అవి భారత ప్రజానీకమును పీల్చి పిప్పిచేస్తూన్న దారిద్ర్యమును నిర్మూలించుటానికి ఇండియాలోని ఏడులక్షల గ్రామాలను పునరుజ్జీవింపచేయడానికీ తోడ్పడగలవు; కాబట్టి మేము ప్రతిరోజూ నూలు వడకగలము మాకు కావలసినంతవరకు ఖాదీనే వాడగలము. మాకు సాధ్యమైనంతవరకు గ్రామాలలో తయారైన వస్తువులనే వాడుతూ ఇతరులు కూడా అలా చేసేటట్లు ప్రోత్సహించగలం.

"కాంగ్రెసు సిద్ధాంతాలనూ కార్యక్రమాన్నీ క్రమశిక్షణతో అనలంబిస్తూ భారతస్వాతంత్ర్యపోరాటం కోసం కాంగ్రెసు పిలిచినప్పుడు ఆపిలుపును అందుకోవడానికి మేమెప్పుడూ సంసిద్ధంగా ఉంటాము. ఇది మా ప్రమాణము."

కేంద్రశాసనసభ్యులు తమ స్థానాలను నిలబెట్టుకోవడానికి మాత్రం హాజరుకావలెననీ తక్కిన సందర్భాలలో హాజరు కానక్కరలేదనీ కాంగ్రెసు వర్కింగుకమిటీ నిర్ణయించింది.

కాంగ్రెసు వర్కింగుకమిటీవారు తమ వైఖరిని తెలియజేస్తూ ప్రకటించినప్పుడల్లా దానికి జవాబుగా రాజప్రతినిధిగానీ, భారతరాజ్యాంగ కార్యదర్శిగానీ, లేక యిద్దరూగానీ మరొక ప్రకటనచేస్తూవచ్చారు. ఒక్కొక్కప్పుడు కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశానికి ముందుగా వారొక ప్రకటనచేసి ఉన్నప్పటికీ వారి సమావేశానంతరం తిరిగి మరొక ప్రకటన చేస్తూండేవారు. రాజప్రతినిధిగానీ భారత రాజ్యాంగకార్యదర్శిగానీ. కానియెప్పుడూకూడా ప్రభుత్వ ప్రకటనలు కాంగ్రెసుతీర్మానాలకు తిన్నని జవాబులు కాలేదు. ఒకప్పుడుకఠినంగానూ మరొకప్పుడు పదాడంబరంతోనూ ఎల్లప్పుడూ ఒకే ధోరణిలో మాట్లాడుతూండడం బ్రిటిష్ప్రభుత్వ ప్రతినిధులకు తీరని దురభ్యాసమైపోయింది 1940 జనవరి 10 వ తేదీని బొంబాయి ఓరియంటుక్లబ్బులో రాజప్రతినిధి చేసిన ఉపన్యాసం పూర్వాకంటె మార్దవంగా ఉన్నదని ఒప్పుకోనితీరాలి. గతమాసాలలో తటస్థించిన సంఘటనలనూ జరిగిన తీవ్రపరివర్తనములనూ వివరిస్తూ రాష్ట్రీయ స్వాతంత్ర్యంలో కలిగిన అవాంతరం తాత్కాలికమనీ, కొద్దికాలంలోనే సాధారణ రాజ్యాంగయంత్రం సవ్యంగా నడపడం సాధ్యపడుతుందనీ ఆయన నమ్మకాన్ని వెల్లడించాడు. అంతేకాక కేంద్రప్రభుత్వంలో మంత్రులను నియోగించలేకపోయి నందుకూ, సంస్థానాలను అందులో కలుపుకొని రాలేకపోయినందుకూ, ఒక నిర్ణీతపద్ధతిమీద అల్పసంఖ్యాకుల ప్రాతినిధ్యమును పొందలేక పోయినందుకూ ఇండియా ఐక్యతను చేకూర్చలేకపోయి నందుకూ దురపిల్లుతూ 'వెస్టుమినిస్టరు చట్టమును' పోలిన అధినివేశ ప్రతిపత్తిని ఇండియాకు ప్రసాదించడమే తమ ఆశయమైనట్లున్నూ, ఈ లోగా ప్రభుత్వచక్రం ఒడిదుడుకులు లేకుండా నడపడానికి సాధ్యమయ్యేటట్లు పెద్దసంఘాల ప్రతినిధులు స్థానికభేదాలను సమన్వయం చేసుకోగలిగేయెడల, తమ నిశ్చయానికనుగుణంగా తక్షణం కొంతమంది రాజకీయ నాయకులను చేర్చుకొని రాజప్రతినిధి కార్యనిర్వాహక వర్గమును పెద్దది చేయగలమనీ వైస్రాయి పునరుద్ఘాటించాడు." మన సమస్యలు చాలా వేగంగానూ ఎక్కువ ప్రయోజనకరంగానూ పరిష్కరించవలెనని ఎంతోమంది పట్టుపడతున్నారనీ, అవి పైకి చాలా తేలికగా కనిపిస్తున్నప్పటికీ తీరా లోతుకు దిగి

విచారించేటప్పటికి వాటిని పరిష్కరించడంలో అనుకోని చిక్కులను తలవని తలంపుగా పెద్ద పెద్ద చిక్కులను ఎదుర్కోవలసివస్తూన్నదనీ ఆయన వాపోయినాడు. చాలా దగ్గర దోవలను కొన్నిమార్గాలను పోయినప్పుడు, కాలయాపనతప్ప మఱొక ప్రయోజనం కలగడంలేదని అనుభవమువలన తరచుగా తెలియవస్తూన్నదని అంటూ అల్పసంఖ్యాకుల హక్కులనుగూర్చి, ముఖ్యంగా మహమ్మదీయులయొక్కయు షెడ్యూల్డు తరగతులయొక్కయు హక్కులనుగూర్చి మఱొకసారి జ్ఞాపకం చేశాడాయన. వివిధపక్షాలకూ న్యాయం కలుగచేయడానికి రాజుగారి ప్రభుత్వం నిశ్చయించుకొందనీ, వివిధ పక్షాల నాయకులు సమావేశమై యేదో ఒక సమాధానానికి రావడానికి వీలుందేమో ఆలోచించవలసిందనీ మిత్రులను కోరుతూన్నా నన్నాడు. ప్రస్తుత పరిస్థితులను కడచి సాధ్యమైనంత తక్కువకాలంలో ఇండియా అధినివేశ ప్రతిపత్తినిపొందే యేర్పాటు చేయగలందులకు తానున్నూ రాజుగారి ప్రభుత్వమున్నూ ప్రయత్నలోపం చేయమని హామీయిచ్చాడు. ఆయన ఉపన్యాసం ముగిస్తూచెప్పిన మాటలు ఉద్రేకపూరితములుగా నుండడమేగాక జాలికరములుగా నుండినవి". "మావాగ్దానం విన్నారుకదా? ప్రధాన రాజకీయ పక్షాలపైననూ వారి నాయకులపైననూ చాలా ఎక్కువ బాధ్యతఉంది. ఇంతకు పూర్వం వారు నాకు చాలా సహాయం చేశారు. తిరిగీ వారిని నాకున్నూ భారతదేశానికిన్నీ సహాయం చేయవలెనని కోరుతూన్నాను. సక్రమ రాజ్యాంగ విధానాభివృద్ధిలో విశ్వాసమున్న ప్రతిమనిషీ విచారపడవలసిన ఈ దురదృష్ట పరిస్థితులను వెంటనే తొలగించేటందుకు వారి సహాయ సహకారములను నే నభిలషిస్తూన్నాను. ఇండియాను ప్రేమించే ప్రతివ్యక్తీ, ఇండియా క్షేమాన్ని పెంపొందించ దలచుకొన్న ప్రతివాడూ, అత్యంత విషాదం పొందవలసిన ఈవిషమ పరిస్థితులను రూపుమాపవలసిందని నావిజ్ఞప్తి."

రాజప్రతినిధి మాటలలో ఎంతో మార్దవమూ మాధుర్యమూ కనిపిస్తూన్నప్పటికీ విషయంలో కాఠిన్యం లేకపోలేదు. అల్పసంఖ్యాకులు, ముస్లిములు, షెడ్యూల్డు తరగతులు, గవర్నమెంటు హామీలు, రాజకీయ పక్షాలకు న్యాయం, పరస్పర సమాధానము ఆయన ఉపన్యాసంలో మొదటినుంచి చివరవరకూ పాడినపాట యిదే. అంతా ఒక్కటే రాగం, ఒక్కటేపల్లవిని. రాజప్రతినిధి ఓరియంట్ క్లబ్బులో మాట్లాడిన తరువాత వెంటనే బరోడాలో మాట్లాడిన సంగతి జ్ఞాపకముండి ఉంటుంది. అందులో ఫెడరల్ ప్రణాళిక తాత్కాలికంగా నిలుపుచేయబడ్డదనీ సాధ్యమైనంత తొందరలో ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించడమే బ్రిటిష్ ప్రభుత్వోద్దేశమనీ, ఇందుకు అన్ని పక్షాల వారూ అంగీకరించే పక్షంలో చాలా సమస్యలు పరిష్కారం కావడానికి వీలుంటుందనీ రాజప్రతినిధి అన్నాడు. వెంటనే జనవరి 14 వ తేదీని కాంగ్రెసు అధ్యక్షుడు, ఇండియా

యొక్క ఆశయం సంపూర్ణ స్వాతంత్ర్యమనీ, వెస్టుమిన్స్టరు అధినివేశ ప్రతిపత్తికికూడా తామంగీకరింపజాలమనీ, వైస్రాయి పదేపదే ఉదాహరిస్తూన్న పక్షనాయకులు యావత్ప్రజానీకమునకూ ప్రతినిధులుకారనీ, ఈ పరిస్థితులలో రాజ్యాంగ పరిషన్నిర్మాణంద్వారానే ఈక్లిష్ట సమస్య పరిష్కారం కావలెననీ, కాంగ్రెసు దూరాలోచనతోనే చెప్పిందనీ, విస్పష్టం చేశాడు. ఈ విధానం నిజంగా దగ్గరదోవని చెప్పడానికి వీలులేదు. ఇందుకవలంబింపవలసిన కార్యకలాపాన్ని బట్టిచూస్తే యిది చాలా దూరమార్గమనికూడా చెప్పాలి. తరువాత నాలుగోసారి రాజప్రతినిధి గాంధీని ఆహ్వానించాడు. ఉభయులకూ ఫిబ్రవరి అయిదోతేదీని ఢిల్లీలో సమావేశం జరిగింది. పరస్పరం మనసువిప్పి మాట్లాడుకొన్నారు. తరువాత వారిద్దరి అంగీకారంతోనూ ఈ దిగువ ప్రకటన వెలువడింది.

రాజప్రతినిధి ఆహ్వానాన్ని అంగీకరించి గాంధీజీ ఆయనను చూడవచ్చాడు. ఉభయులూ పరస్పర సుహృద్భావంతో అన్నివిషయాలూ సమగ్రంగా చాలాసేపు చర్చించుకొన్నారు. కాంగ్రెసు వర్కింగుకమిటీవారు తనకేమీ అధికారమీయలేదని గాంధీజీ మొట్టమొదట్లోనే చెప్పాడు. కాబట్టి తాను వ్యక్తిగా సంభాషిస్తూన్నాననీ కాంగ్రెసువర్కింగుకమిటీ పక్షానకాదనీ విస్పష్టం చేశాడు.

రాజప్రతినిధి, ఘనతవహించిన రాజుగారి ఉద్దేశాలనూ సూచనలనూ మొదట్లోనే వివరించాడు. ఇండియా సాధ్యమైనంత త్వరలో అధినివేశ ప్రతిపత్తిని పొందవలెనని వారి ఉద్దేశమైనట్టున్నూ, అందుకు కావలసిన యావత్తు కార్యకలాపమునూ తాము నడపదలచుకొన్నట్టున్నూ, ఆయన స్పష్టంగా చెప్పాడు. ఆ సందర్భంలో తటస్థించే కొన్ని చిక్కులను పరిష్కరించవలసిఉందనీ ముఖ్యంగా అధినివేశ సంరక్షణకు సంబంధించిన సమస్యవిషయం, తేల్చుకోవలసిఉందనీ ఆయన అన్నాడు. సమయంవచ్చినప్పుడు ఇండియాలోని వివిధ రాజకీయపక్షాలతోనూ, వివిధ ప్రయోజనాలుకలవారితోనూ సంప్రతించి అన్ని విషయాలనూ సమగ్రంగా పరిశీలించడానికి రాజుగారి ప్రభుత్వం సంసిద్ధంగా ఉందనికూడా ఆయన విస్పష్టం చేశాడు. ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించేటందుకు ఇప్పటినుండీ వేగిరపడుతూ, అందుకు కావలసిన కార్యకలాపాలను సాధ్యమైనంత చాకచక్యంగా కొనసాగించడానికీ రాజుగారిప్రభుత్వం ఆందోళనతో ఉందనికూడా ఆయన వివరించాడు.

ఇటీవల బరోడాలో రాజప్రతినిధి పునరుద్ఘాటించిన రీతిని తాత్కాలికంగా నిలుపుదలచేయబడిన ఫెడరల్ ప్రణాళికను అందఱూ కలసి అంగీకరించేయెడల అదే అధినివేశ ప్రతిపత్తికొక సోపానం కాగలదనీ, అందువలన మనను ఎదుర్కొంటూన్న చాలా సమస్యలు పరిష్కారం కాగలవనీకూడా ఆయన తెలియచెప్పాడు.

గవర్నరుజనరల్ కార్యనిర్వాహక వర్గమును పెద్దదిచేయడానికి నవంబరులో తానుచేసిన వాగ్దానమింకా అలాగేఉన్నదనీ, అప్పుడుచెప్పిన షరతులకులోబడి బ్రిటిష్ ప్రభుత్వంవారా వాగ్దానాన్ని చెల్లించుకోవడానికి సంసిద్ధంగా ఉన్నారనీకూడా ఆయన ఉదాహరించాడు

ఫెడరల్ ప్రణాళికతో సంబంధంగల రాజకీయపక్షాల ఆమోదమునకు లోబడి ఇండియాకు అదినివేశ ప్రతిపత్తిని తక్షణం లభింపచేయడానికనుకూలంగానూ యుద్ధమూలంగా తటస్థించిన నూతనసమస్యలను యుద్ధానంతరం పరిష్కరించడానికి వీలుగానూ, ఫెడరల్ ప్రణాళికను పునర్విచారణ చేయడానికి కూడా రాజుగారి ప్రభుత్వంవారు సంసిద్ధంగా ఉన్నారు.

ఈ సూచనలు యేఉద్దేశంతో చేయబడినవో ఆఉద్దేశాన్నిమాత్రం గాంధీజీ కొనియాడుతూ కాంగ్రెసుపక్షంవారి కోరికకివి పూర్తిగా అనుగుణంగా లేవనిమాత్రం విస్పష్టం చేశారు. కాబట్టి ఈ పరిస్థితులలో చిటిచిక్కులను పరిష్కరించుకోవలెననే ఉద్దేశంతో ఇంకనూ చర్చలు సాగించడాన్ని ప్రస్తుతం విరమించుకోవడం మంచిదని గాంధీజీ సూచించగా వైస్రాయి ఆమోదించాడు.

ప్రజలూ ప్రభుత్వమూకూడా భారతస్వాతంత్ర్యసమస్యా పరిష్కారంకోసం లోతుకుదిగి విచారించినకొద్దీ ఆ సమస్య క్లిష్టంగా తోచింది. స్వాతంత్ర్య పిపాసను సంతృప్తిపరచగల జలధారలకోసం ఉభయులూకలసి బావిని త్రవ్వుతూ, యేపొరలోనైనా అటువంటి ఊటకనిపిస్తుందా అని ఆశిస్తూన్నట్లు తోచింది కొంతకాలం. కాని ఆ ఆశ వమ్మై క్రింద ఒక చట్టు తగిలింది. అయినప్పటికీ గాంధీజీమాత్రం అట్టడుగున దాగిఉన్న నీటిసోనను వైస్రాయికి ప్రత్యక్షం చేయగలిగాడు. ఆయన 1940 ఫిబ్రవరి 6వ తేదీని ఒక ప్రకటన చేశాడు. "ఇండియా పొందవలసిన ప్రతిపత్తినిగూర్చి తామే తుది నిర్ణయం చేయగలమని బ్రిటిష్ప్రభుత్వంవారు వాగ్దానంచేశారు. కాని ఇండియా స్వయంనిర్ణయమును కోరుతూన్నది." అన్నాడాయన. స్వాతంత్ర్యమనేమాటకు స్వయంనిర్ణయ సిద్ధాంతమే నిజమైన ఒరిపిడి రాయి. అదే బ్రిటిష్వారి దృక్పథానికీ కాంగ్రెసు దృక్పథానికీగల ముఖ్యభేదం ఈభేదం తొలగిపోతేనేగాని ఇండియా సమస్య శాంతంగానూ గౌరవప్రదంగానూ పరిష్కారంకాదు. అప్పుడు దేశరక్షణ, అల్పసంఖ్యాకులు, సంస్థానాధీశులు, యూరోపియనుల ప్రయోజనాలూ- ఈ అన్నీకూడా వాటంతటవే పరిష్కారం కాగలవు. ఈ సందర్భంలోనే ఆయన ఇంకా కొన్ని విషయాలను విస్పష్టంచేశాడు. రక్షణలు ఉభయుల శ్రేయస్సుకూ సంబంధించినవి. నిజమైన అల్పసంఖ్యాకులకు సంతృప్తికరమైన రక్షణలులేనిచో యేమే రాజ్యాంగచట్టమూ చిరకాలంనిలువదు అయితే ఈవిషయంలో

భేదాభిప్రాయాలు కలిగేయెడల మానవబుద్ధి భావించగలిగిన నిష్పాక్షిక మధ్యవర్తి సంఘంద్వారా వాటిని పరిష్కరించుకోవచ్చును. ఇక దేశరక్షణ విషయంలో ఇండియా అమోఘంగా పనిచేయవలసిఉంది. అయితే బ్రిటిష్ వారందుకు సహాయంచేసే యెడల దానిని పొందడానికి ఇండియా ఇష్టపడుతుంది. కాని వ్యక్తిగతంగా గాంధీకి ఇందులో యేమీ జోక్యంలేదు. గాంధీజీ చెప్పినట్లుగా ఇండియా నడచుకొనే పక్షంలో బంది పోట్లూ మొదలైన దుష్టులను నిరోధించడానికి కావలసిన పోలీసుసిబ్బంది తప్ప మరేమీ అక్కరలేదంటాడాయన. శాంతియుతంగా ఉండే ఇండియా నిరాయుధంగా ఉండికూడా ప్రపంచ సుహృద్భావంమీద సుస్థిరంగా కాలక్షేపం చేయగలదని ఆయన భావం. కాని అటువంటి పరిస్థితి నేటి స్థితిగతులను బట్టి స్వప్నవృత్తాంతమనాలి. ఈ సంగతికూడా ఆయన అంగీకరించాడు. యూరోపియనుల విషయంలో ఇండియాలోని పెట్టుబడిదారులూ, జమీందారులు ఏవిధమైన హక్కులు కలిగివుంటారో అటువంటి హక్కులే వారికీ ఉంటవన్నాడు. భారతజాతికి అపాయకరములు-గాని నిజమైన హక్కులకు తగిన రక్షణఉంటుందనీ, ఆ హక్కులను ప్రభుత్వంవారు స్వాధీనపఱచుకొనే యెడల న్యాయమైన నష్టపరిహారమీయబడుతుందనీ ఆయన స్పష్టీకరించాడు. ఇండియా భవితవ్యమును నిర్మించవలసిన రాజ్యాంగపరిషత్తులో సంస్థానాధీశులు వ్యక్తులుగా గాక ప్రజాప్రతినిధులుగా చేరడానికి హక్కున్నది. సంస్థానాధీశులు బ్రిటిష్ చక్రవర్తికి సామంతరాజులు కాబట్టి చక్రవర్తికి మించిన అధికారాలుగానీ, ఆయనకులేని అధికారాలుగానీ, వీరికేమీ ఉండవు. అసలు చక్రవర్తియే తన అధికారాన్ని వదులుకొంటూన్నప్పుడు ఆయన అధికారాలు వారసులకురావడం సహజం. ఆ వారసులే నేటి ఇండియాప్రజలు. కాబట్టి సంస్థానాధీశుల దృష్టి ఇక ప్రజలవైపుకు మారాలి. కనుక ఈసమస్యలన్నిటిని గూర్చి గాంధీ రాజప్రతినిధితో చర్చించి గౌరవప్రదమైన సమాధానం కుదుర్చుకోవడానికి ప్రయత్నించాడు. అయితే ఈ యిరువురి దృక్పథాలమధ్యా ఒకపెద్ద అఖాతం ఏర్పడింది. కాని యిరువురూ స్నేహభావంతో సెలవు తీసుకొన్నారు. బీహారు రాష్ట్రమునందలి రామఘరులో జరుగబోయే కాంగ్రెసు అంతకంతకు దగ్గరకు వస్తూన్నది. మామూలు ఆచారంప్రకారం కాంగ్రెసుకు ముందు జరుగవలసిన వర్కింగుకమిటీ సమావేశం, మహాసభకు బాగా ముందుగా 1940 ఫిబ్రవరి 28 వ తేదీని పాట్నాలో జరిగింది. ఈ యుద్ధసమయంలో జరిగే ఈ కాంగ్రెసు ఎక్కువ ప్రాముఖ్యంగా ఉండక ఒక చిన్న సంఘటనగా పరిణమిస్తుందని కొందఱభిప్రాయపడ్డారు. కాని అలా కాలేదు. కాంగ్రెసులోని వివిధశాఖలు - ప్రచారశాఖ, అల్పసంఖ్యాకులశాఖ, హరిజనశాఖ - ఖద్దరుశాఖ వీటన్నిటినీ పునర్నిర్మాణం

చేసుకొని రాబోయే సత్యాగ్రహోద్యమానికి దేశాన్ని సంసిద్ధపరచడానికి పూను కొన్నది. ఈ క్లిష్టపరిస్థితులనుండి కాంగ్రెసు బ్రతికి బయటపడడానికది ఒక్కటే మార్గ మని అందరూ అంగీకరించారు. గాంధీ తన అహింసాతత్త్వమును గూర్చి ఎంతో వ్రాశాడు. దేశస్వాతంత్ర్యంకోసం దానిని ఎలా ఉపయోగించాలో కూడా చక్కగా వివరించాడు.

## యుద్ధ మేఘాలు

యుద్ధం ప్రారంభమైన తరువాత అనేక వర్కింగుకమిటీ సమావేశములు జరిగి నవి. వాటన్నిటిలోనూ రామఘర్ కాంగ్రెసుకు ముందుగా జరిగిన వర్కింగుకమిటీ సమా వేశమత్యంత ప్రాముఖ్యమైనది. బ్రిటిష్ ప్రభుత్వమున్నూ కాంగ్రెసున్నూ ఎత్తుపై ఎత్తులు వేసుకొంటూ రాజకీయచతురంగం ప్రారంభించారు. కాంగ్రెసు కేవలం ఆదర్శాల కోసం పెనగులాడుతుంది గాని నిజపరిస్థితులను గమనించదన్నాడు జెట్లండు ప్రభువు. 'స్వాతంత్రమ'నే మాటకు అభ్యంతరం చెప్పి, బ్రిటిష్ సామ్రాజ్యసంబంధమనే సంకెళ్లను తగిలించుకోవలసిందని ఇండియాను ఆయన కోరుతూన్నట్లు గాంధీజీయున్నూ ప్రజలున్నూ నిర్వచనం చేశారు. బ్రిటిష్‌వారు యుద్ధరంగంలోని యోధులవలె ప్రవర్తించక పట్టి కపటనాటకం ఆడుతూన్నారన్నాడు గాంధీజీ. ఇండియా సమస్యలను శాశ్వతంగా పరిష్కరించవలెనని వారు కోరుటలేదు. వారేదోవిధంగా కాలయాపన చేయవలెననే ఉద్దేశంలో ఉన్నారు. ఎందుకోసం అలా చేస్తున్నారో తేలికగా గ్రహించ వచ్చును. విరోధాసంగ్రామం హఠాత్తుగా అంతంపొందవచ్చునని వారనుకొని ఉండ వచ్చును. అటువంటప్పుడు తమ చేతులలోనుండి వృథాగా వారెందుకు ఇండియాను పోగొట్టుకోవలెను ఈ యుద్ధానంతరం బ్రిటిష్‌కాలనీలు కొన్ని ఎలాగో వారు వదులు కోవలసివస్తుంది. యుద్ధంమూలాన బ్రిటిష్‌వారిండియాను వదులుకోవలసివస్తే వారికి యుద్ధంవలన లాభించేదేమీ లేదనిచెప్పాలి. అయితే కాలయాపన జరిగినందువల్లన ఇండియా విచారపడవలసిన అవసరంలేదు. భారతీయ యువకులలో స్వాతంత్రవాంఛ దినదిన ప్రవర్ధమానమయింది. తన భవిత్యమునుగూర్చి ఇండియా తీవ్రంగా ఆలోచించు కోవలసిన స్థితి యేర్పడ్డది. సత్యాగ్రహ తత్వమునుగూర్చి దాని వైశాల్యతనుగూర్చి అది జయప్రదం కావడానికి తగిన పరిస్థితులనుగూర్చి గాంధీ యింకా వివరంగా ఆలోచించు కోవడానికి సావకాశం కలిగింది. గాంధీ రాజప్రతినిధిని అనేక పర్యాయములు దర్శించి పట్టిచేతులతో మరలి వచ్చినప్పటికీ, యుద్ధం ప్రారంభమైన ఆరునెలల వరకూ భారత రాజకీయాలలో తీవ్రపరివర్తనాలు కలుగకపోయినప్పటికీ కాంగ్రెసుకు పోయిందేమీ లేదు. ఇండియాకూ బ్రిటనుకూ యెప్పుడోఒకప్పుడు తీవ్రమైన పోరాటం రాకతప్పదనే

అభిప్రాయం భారతప్రజానీకంలో బాగా వ్యాపించింది. కాలంగడచినకొద్దీ విషయాలింకా చక్కగా వెల్లడిఅవుతూ వచ్చినవి. కాంగ్రెసు మంత్రులవలంబించిన విధానాని కనుగుణంగానే తామునడుచుకోగలమనీ వారి ఆదర్శాలకో తమకు సంపూర్ణసానుభూతి ఉందనీ బహిరంగంగా అడ్వయిజర్లు చెబుతూరావడంచేత కాంగ్రెసువారు తిరిగీ మంత్రిత్వాలను చేపట్టడానికెంతో కాలంపట్టదని ప్రజలు భావించారు. కాని తరువాత అడ్వయిజర్ల ప్రభుత్వంలో మార్పుకలిగింది. వారిదివరకు చెప్పిన మాటలకది భిన్నంగా ఉంది. బ్రిటిష్ ప్రభుత్వంవారు అర్దినెన్సు పరిపాలనను బలపరచడం, అధికాదాయపు పన్నులను గూర్చిన శాసనాన్ని తొందరపడి ప్రవేశపెట్టడం, మద్రాసులో కాంగ్రెసు అభ్యర్థులకు పనుపుగంగు పోలింగు పెట్టెలను ఈయడానికి నిరాకరించడం, మద్యనిషేధం విషయంలో కాంగ్రెసుమంత్రుల విధానాన్ని అడ్వయిజర్లు మారుస్తారని వాడుక పుట్టడం; యివన్నీ కాలాన్ని వెనుకకులాక్కొని పోతూన్నట్లు కనిపించినవి. ప్రజల అసమ్మతి ప్రకటనలుకూడా అంతగా ప్రయోజనకరములుగా లేకపోయినవి. కాని ఈ చిల్లర మల్లరపనులే రానున్న సంఘటనలను సూచిస్తూ వచ్చినవి. ఇరుపక్షాలవారు యేవిధంగా యుద్ధసన్నద్ధులవుతున్నారో యివి స్పష్టంగా తెలియచేసినవి. ఇండియాయొక్క ఆత్మ గౌరవం పెరిగినకొద్దీ ఇంగ్లాండుయొక్క న్యాయబుద్ధి సహజంగా సన్నగిల్లుతూవచ్చింది. అంతేకాదు. ఇండియా సహనం చూపించినకొద్దీ, సమాధాన ప్రయత్నాలు చేసేకొద్దీ, పూర్వాపర సందర్భాలను గమనించి తత్త్వవిమర్శ చేస్తూన్నకొద్దీ, యిదంతా యిండియా యొక్క దౌర్బల్యంగానూ, కార్యనిర్ణయం చేయలేని అసమర్థతగానూ భావిస్తూవచ్చింది ఇంగ్లాండు. ఇంగ్లాండు అలాభావించడం ఎంత తప్పిదమో తెలుసుకోడానికెంతో కాలం పట్టలేదు. హింసా యుద్ధానికిన్నీ, అహింసా పోరాటానికిన్నీ, పద్ధతులలోనూ ఉపాయాలలోనూ చాలా భేదముంది. మొదటిదానిలో మాటకు ప్రతిమాటా దబాయింపు కెదురు దబాయింపు, అంతిమసందేశం, యుద్ధప్రారంభము- ఇవి జరుగుతవి. రెండవది నెమ్మదిగా నడుస్తుంది. కాని న్యాయమైన కారణం కోసం జరిగే అహింసా పోరాటానికి జయం నిశ్చయం.

భావికార్యక్రమమంతా గాంధీకిమాత్రం కన్నులకుకట్టినట్లు కనిపిస్తూన్నది. శాసనోల్లంఘనము సత్యాగ్రహోద్యమాలకు కావలసిన త్యాగమునకు సంసిద్ధం కావడానికే నిర్మాణకార్యక్రమమొక శిక్షణ. అహింస ఆచరణలో ఉన్నంతకాలమూ యిట్టి శిక్షణ అవసరం. అందువల్లనే తక్షణం శాసనోల్లంఘనం ప్రారంభం కావలెనన్న వారికీ, నిర్మాణ కార్యక్రమం కొనసాగించవలెనన్న గాంధీకీ కాంగ్రెసులో అంతః కలహాలు తప్పనిసరి అయినవి. పాట్నాలోకూడా శాసనోల్లంఘనానికింకా దేశం సంసి

ర్థంగా లేనట్లే గాంధీ భావించాడు. కాంగ్రెసులో అనేక విభేదాలున్నట్లు ఎంతో క్రమశిక్షణ లోపించినట్లు ఆయన కనిపెట్టగలిగాడు. దీని పర్యవసానమేమో ఆయనకు తెలుసును. కాని శాసనోల్లంఘనం ప్రారంభింపబడినయెడల యివన్నీ ఆ ప్రవాహంలో కొట్టుకొని పోగలవని కొందరభిప్రాయమిచ్చారు. గాంధీ అంగీకరించలేదు. పైగా ఈ విభిన్నశక్తులన్నీ కాంగ్రెసునాయకత్వంకింద కలసి పోరాటంలో పనిచేస్తామని వాగ్దానం చేసినప్పటికీ, శాసనోల్లంఘన పంథాకు వైదొలగి నడచుకొనే మాట వాస్తవం. ఈసంగతి తరువాత అనుభవంవల్ల నిజమని ఋజువయిందికూడాను. ఉద్యమ ప్రారంభదశలోనూ అంతకు పూర్వమూకూడా కమ్యూనిస్టులు తమ యిచ్ఛానుసారం రహస్య ప్రచారం సాగించారు. శాసనోల్లంఘనోద్యమాన్ని తొందరపడి ప్రారంభించినంతమాత్రంచేత ఇటువంటి శక్తులన్నీ నిజంగా ఆ ఉద్యమ మహాప్రవాహంలో లీనమయిపోగలవని నమ్మడానికి వీలులేదు. ఉద్యమం నడుస్తూన్నకొద్దీ. ఈ శక్తుల నన్నింటినీ స్వాధీనంలోకి తీసుకొని రావచ్చునన్నే మాటలో గాంధీకి నమ్మకంలేదు. ఉద్యమ ప్రారంభంలోనే యివన్నీ కాంగ్రెసు స్వాధీనంలో ఉండాలంటాడాయన. తత్క్షణం ప్రజాసామాన్యాన్ని సమీకరించి పోరాటం సాగించాలని ఆయన కోరిక. అయితే అందుకు కావలసిన క్రమశిక్షణను సృజించడం అసాధ్యమని తోచిందాయనకు. ఇప్పుడు నిశ్చయం కాని విషయాలు భవిష్యత్తులో వాటంతటవి నిశ్చయం కావచ్చునని విశ్వసించే స్వభావం కలవాడు కాడు గాంధీ. ఇప్పుడొక నూతన వాతావరణము అలముకొన్నదనికానీ. ఒక నూతనానుభవం తటస్థించిందనికానీ ఆయన అనుకోవడం లేదు. కాంగ్రెసులో పనిలేకపోవడంవలన ఈ తగాదాలు ఈ కక్షలూ వచ్చినవని ఆయన నమ్మడంలేదు. కాంగ్రెసులో వివిధాభిప్రాయాలూ కలవారుండడమే ఈ కక్షలకు కారణమని ఆయన విశ్వాసం. శాసనోల్లంఘనం ప్రారంభిస్తే అంతా బాగుపడుతుందనే వారూ కొంతమంది ఉన్నారు "అమ్మో! అంతా ప్రమాదకరంగా ఉంది కదలకుండా మెదలకుండా ఊరుకోవడమే మంచిది యిప్పుడు" అనేవారూ మరికొందరున్నారు. ఈ రెండురకాలవారిమధ్యా నిజంగా కాంగ్రెసుయొక్క దృక్పథము నిప్పుడు విస్పష్టం చేయవలెననే మూడవరకంవారున్నారు. వారిలా అంటారు. "శాసనోల్లంఘనంమాట అలా ఉండనీయండి! మన మేమికోరుతున్నామో ప్రజలకు సందేహంగా ఉంది. మనం మాటి మాటికీ మన కోరికలను మారుస్తూన్నట్లుగా ప్రజలకు తోచరాదు. మన తుది ఆశయమేమిటో వారికి తెలిసేటట్లు విస్పష్టం చేయాలి. అలా చేయకపోవడం మనకు అపాయం. అది మనకు దౌర్బల్యాన్ని చేకూరుస్తుంది. మిన్నువిరిగి మీదపడ్డాసరే ఈ స్థితినుండి మనం జారిపోమనే విశ్వాసం కలగాలి ప్రజాసామాన్యానికి. అలా కానట్లై

యితే ప్రజాహృదయంలో విశ్వాసం నశిస్తుంది. అది శాసనోల్లంఘనోద్యమానికికూడా పెద్ద దెబ్బ. ఇంతకుపూర్వం మూడునెలలకుముందు దేశం ఇంతకంటె సంసిద్ధంగా ఉందని ఈనాడే దేశపరిస్థితులంతకంతకు మరీ అధ్వాన్నంగా పరిణమిస్తూన్నవనీ తోచినందువలననే వారలా భావించడం తటస్థించింది "మనం చెప్పినపని వెంటనే ఈవేళనే చేయకపోవచ్చు. రేపు చేయకపోవచ్చు. కాని ప్రజాహృదయంలో కలిగిన అపనమ్మకాన్ని పోగొట్టాలి. మన ఈ మాటకిక తిరుగులేదు అనే విశ్వాసం వాళ్ళకు కలిగించాలి. మనం కోరేది స్వాతంత్ర్యమో రాజ్యాంగ నిర్మాణపరిషత్తో కూడా ప్రజలకు తెలియదు. మనం చాలా పెద్దపెద్దమాటలు చెబుతామనీ చివరకేదోవిధంగా రాజీ చేసుకొంటామనీ వారి అభిప్రాయం. లిన్‌లిత్‌గో ప్రభువుయొక్క ఋజువర్తనమునుగూర్చి కాదు, మన మాలోచించవలసింది. ఆయన ఋజువర్తనమునుగూర్చి మనం సందేహించనక్కరలేదు. ఔదార్యంతో కాకపోయినా స్వార్థపరత్వంతోనయినా ఆయన ఋజువర్తనం కలిగి ఉండాలి. మన నిర్ణయమేమిటో మనమిప్పుడు చెప్పాలి. అని మధ్యరకంవారి అభిప్రాయం. ఇందుకు కారణం లేకపోలేదు. మంత్రులు రాజీనామాలీయగానె తక్కినదేశాలలోవలెనే మన దేశంలోకూడా యేదో ఒక విప్లవం (మన దేశానికనుగుణమైనదే కావచ్చునుగాక) వస్తుందని చాలామందికి మనస్సులో పెద్దగా ఆశ ఉంది కాని అటువంటిదేమీ జరగలేదు. ఉద్రేకం చల్లారిపోయింది. రాజకీయ పరిస్థితులంతకంతకు క్షీణగతికి వస్తూన్నవేకాని అభివృద్ధికావడంలేదు. అందువలన చాలామందికి ఔదాసీన్యం నిరుత్సాహం కలిగినవి. సంకల్పబలంకల యిరువురు పెద్ద మనుష్యులు సమావేశమైనంత మాత్రంతో పరిష్కారం కాదగిన సమస్యకాదిది. మోసమునకు తావలమైన విషయాలు చాలా ఉన్నవి. కాంగ్రెసు వాటన్నిటినీ సమగ్రంగా సమాలోచనచేసి యేవిధమైన చెడుగుకూ తావులేకుండా చేయడం దాని ధర్మం. ఇప్పటి నుండీ రెండు నెలలకు, లేదా మూడు నెలలకు, కాకపోతే ఆరునెలలకు, కాంగ్రెసు చేయదలచుకొన్న పనియేదో అది స్పష్టంగా నిర్ణయించుకోవాలి. యుద్ధంవలన క్లిష్టదశ వచ్చింది. ఈ క్లిష్టదశలో తమ సామ్రాజ్యాన్ని పెంపొందించుకోవడంగానీ లేదా బలిష్ఠముగా చేసుకోవడంగానీ మాత్రమే బ్రిటిష్‌వారి ఆశయం. అందుకోసం భారతదేశ సహాయం బ్రిటనుకందకుండా చేయవలెనని కాంగ్రెసు కోరిక. భారతదేశ సాధనసంపత్తికోసం బ్రిటను నిరంతర దండయాత్ర సాగిస్తూన్నది. ముఖ్యంగా దాని నిప్పుడు నిరోధించవలెను. మంత్రులు రాజీనామాయిచ్చిన తరువాత నిజంగా మనబలం తగ్గిపోలేదు. అంతకంతకు హెచ్చిపోతూనే ఉంది. కాని మత సమస్య తలయెత్తి కాంగ్రెసు పురోభివృద్ధికి ఆటంకం కలిగిస్తూన్నది. అయితే కాంగ్రెసు

అవలంబించిన సహన స్వభావంవలననే అది రంగంలోనుండి క్రమక్రమంగా అదృశ్యమవుతూవచ్చింది. హింసాభావాన్ని అవలంబించిన మురాలవారు తమంతట తామేమీ స్వతంత్రంగా చేయజాలకుండా ఉన్నారు. పైగా పైచ్చు తన యిష్టంవచ్చినట్లు కాంగ్రెసు చేయడానికికూడా వారంగీకరించడంలేదు.

రామఘర్ కాంగ్రెసు మహాసభకు కార్యప్రణాళికను తయారుచేయడానికి పాట్నాలో వర్కింగుకమిటీ సమావేశమైనప్పటికి గల పూర్వగాథ యిది. జరిగిన ఇరవై సంవత్సరాలలోనూ జాతీయమహాసభయొక్క కార్యప్రణాళిక కొన్ని ముఖ్య తీర్మానాలతో మాత్రమే నిండి క్రమ క్రమంగా చిన్నదవుతూవచ్చింది. ఇటీవల మహాసభ తీర్మానాలన్నీ కలిసి 10,12 కంటె ఎక్కువ ఉండడంలేదు. పూర్వం ఇంతకు రెండురెట్లూ, మూడురెట్లూకూడా తీర్మానా లుంటూండేవి. పాట్నాలో సమావేశమైన వర్కింగుకమిటీవారు రామఘర్ మహాసభకు ఒకేఒక తీర్మానాన్ని తయారుచేశారు. అది యుద్ధపరిస్థితులకూ, ఇండియాకూ సంబంధించిన తీర్మానం. అందులో నిజానికి కొత్తసంగతి యేమీలేదు. తరువాతి పేరాలలో ఉదాహరింపబడిన సందేహాలూ చిక్కులూ కొత్తగా అప్పటికప్పుడు తటస్థించినవి కావు. యుద్ధం వచ్చిన తరువాత మొట్టమొదట సమావేశమైన కాంగ్రెసు మహాసభ యిదే కావడంచేతనూ, యుద్ధకాలంలో మరొక సమావేశం జరుగకపోవచ్చుననే భావంతోనూ ఒక్కసారిగా భూత వర్తమాన భవిష్యద్వ్యవహారములను సమగ్రంగా విశదీకరించి సింహావలోకనచేసి, ఊహించడానికి తగినసమయమిదేనని తలంపబడింది. అందువలన అన్ని సంగతులూ మరొకసారి మొదటినుండి తుదివరకూ చెప్పడమే ఈ రామఘర్ కాంగ్రెసుచేసినపని.

---

# ౮ రామఘర్ కాంగ్రెసు

## [ మార్చి 1940 ]

పదమూడుసంవత్సరాలనుండి కాంగ్రెసు యుద్ధం యుద్ధం అని కేకలు వేస్తూ వచ్చింది. చిట్టచివరకా యుద్ధం రానేవచ్చింది. ఆనాటినుండి సస్యశ్యామలములైన భూఖండాలు కల్లోలభూయిష్ఠములైన హింసాక్షేత్రములుగానూ, కలకలలాడే జనపదములు సాయుధప్రాణులు తిరిగే శ్మశానవాటికలుగానూ తయారయినవి. సత్యాగ్రహోద్యమం భారతజాతీయ భావిభాగ్యమును తీర్చిదిద్దడం ప్రారంభించిన తరువాత, యుద్ధం నడుస్తూంటగా జరిగిన మొదటి కాంగ్రెసు రామఘర్ కాంగ్రెస్సే. యుద్ధప్రయత్నాలలో జోక్యం కలిగించుకోవద్దని దేశాన్ని ఆదేశిస్తూ కాంగ్రెసు అనేక తీర్మానాలను యిదివరకే చేసింది. భారతజాతీయ కాంగ్రెసు రామఘర్‌లో సమావేశమయ్యే నాటికే ప్రపంచ భయంకర కల్లోల వినాశపరిస్థితులను ఆరునెలలనుండి అనుభవిస్తూంది భారతదేశం ఈ సందర్భంలో తన అహింసా సిద్ధాంతానికనుగుణంగా ఏవిధంగా నడుచుకోవలెననే విషయాన్ని గురించి దీర్ఘాలోచనచేస్తూ ఉంది. ఇలా ఉండగా రామఘర్ కాంగ్రెసునగరమే తరువాత కొంతకాలానికి ఇటాలియన్ యుద్ధఖైదీల శిబిరంగా మారిపోవడం ఒక వింత విధిచోదితమని చెప్పాలి. రామఘర్ కాంగ్రెసు ప్రారంభమైననాటికే చాలా గ్రంథంనడిచి ఉండడంచేత మామూలుగా ప్రతిఏటా జరిగే కాంగ్రెసుకూ ఈ కాంగ్రెసుకూ నిర్మాణంలోనే యెంతో భేదం కనిపించింది. రామఘర్ గుట్టలూ, లోయలూ, అడవులూ, సెలయేళ్లమధ్యవుంది. అక్కడికి దాదాపు రణదుందుభులు ప్రతిధ్వనిస్తూన్నవని చెప్పవచ్చును. రామఘర్ అధ్యక్షుడు మామూలుగానే ఎన్నికోబడ్డాడు. ఆయన త్రిపురీ అధ్యక్షస్థానానికి 'అధికారరీత్యా యేర్పాటు చేయబడిన అభ్యర్థి, కాని త్రిపురి అధ్యాయంలో ఉదహరించబడిన పరిస్థితులలో ఆయన అప్పుడు తన అభ్యర్థిత్వాన్ని విరమించుకొన్నాడు. తరువాత తటస్థించిన మొదటి అవకాశంలో కాంగ్రెసు అధ్యక్షస్థానానికి ఆయన పేరును తిరిగి సూచించడం సహజం. కాబట్టి రామఘర్ కాంగ్రెసుకు మౌలానా అబుల్ కలాం అజాదు అధ్యక్షత వహించాడు. 1940 మార్చిలో రామఘర్‌లోని 53 వ కాంగ్రెసు అధ్యక్షస్థానానికి జరిగిన పోటీ నామమాత్రం. 1940 ఫిబ్రవరి 15 వ తేదీని రాష్ట్రాలలోని ప్రతినిధులందరూ అధ్యక్షుని ఎన్నికలో పాల్గొన్నారు. ఎన్నికోబడిన మౌలానాసాహెబుకు 1864 వోట్లున్నూ ఆయన ప్రత్యర్థి యం. యన్. రాయికి 183 వోట్లున్నూ వచ్చినవి.

# రామఘర్ కాంగ్రెసు 

రామఘర్‌లో అప్పటికప్పుడు కాంగ్రెసు నగరం నిర్మింపబడింది. దానికి మజర్ నగర్ అని నామకరణం చేశారు. మామూలు కార్యకలాపాలన్నింటినీ జయప్రదంగా నిర్వహించడానికి తగిన యేర్పాట్లు చేయబడినవి. విషయనిర్ధారణసభ, వస్తుప్రదర్శనోత్సవం, బహిరంగసమావేశాలు అన్నీ సలక్షణంగా జరిగినవి. మహాసభ మాత్రం ఆ ఫీఠభూమియందలి ఒక సుందరదృశ్యంగల లోయలో యేర్పాటు చేయబడింది. కాని ఆనాడు ప్రకృతి కోపం పూనింది. సరిగా మహాసభ ప్రారంభమయ్యే వేళకు పెద్దతుపానువర్షం ప్రారంభమయింది. కుండలతో ఎత్తిపోసినట్లు పైన వానకురుస్తూంటే కింద తొడలలోతువరకూ నీరు పొంగింది. కాంగ్రెసు పెద్దలిదంతా ధైర్యంతో ఎదుర్కొన్నారు. ఎవ్వరికీ ఎక్కడా తలదాచుకోవడానికి చోటులేదు. అంతా బంగరబయలు. ఒక్కక్షణంలో మహాసముద్రంవంటి జనసమూహం - చంటిబిడ్డలను ఎత్తుకొని నిలబడ్డ స్త్రీలూ, పురుషులూకూడా కూర్చోవడానికి వేయబడిన చాపలను నెత్తిపైన కప్పుకోవడంచేత మహాసభ అంతా చిన్న చిన్న గుడిసెలుగా కనిపించింది. తుపాను యింకా చెలరేగింది. వేలకొలదీ ప్రతినిధులూ ప్రేక్షకులు నెత్తిపైన గొడుగులూ చాపలూ వేసుకొని తరంగాయితంగా కదలడం ప్రారంభించారు. పిల్లలు తల్లులవడులలో ఉన్నట్లే ఉండి నానిపోయినారు. ఈ ప్రళయకల్లోలంలోనే, ఆహ్వాన సంఘాధ్యక్షులు అధ్యక్షులూ తమ కార్యకలాపాలను నిర్వహించారు. వారి ఉపన్యాసాలు చదివినట్లుగానే భావించబడినవి. అనాటితీర్మానం ఆ సమయంలోనే జవహరలాలుచే ఉపపాదింపబడి మఱునాటికి వాయిదా వేయబడింది. మఱునాడు కాంగ్రెసు అదృష్టం బాగావుంది. కాంగ్రెసు వ్యవహారాలన్నీ ఆనాడు మంచి హుందాగానూ తాపీగానూ జరిగినవి. కాంగ్రెసు మహాసభ జాతీయపతాకచ్ఛాయలలో సమావేశమయింది అక్కడ భూమి మెరకగావుంది. పొడిగా ఉంది. గాంధీ చరిత్రప్రసిద్ధమైన ఉపన్యాసం చేశాడు. పతాకం చుట్టూ కూర్చున్న ప్రజానీకమంతా శ్రద్ధాభక్తులతో ఆనాటి చరిత్రాత్మకతీర్మానాన్ని ఆమోదించారు. మజరునగరుకు ముందుగా ముప్పయి అడుగుల ఎత్తుగల అశోకస్తంభం పైన కట్టబడిన జెండాకఱ్ఱచుట్టూ సమావేశమైన మహాసభలోనే ఈ సమగ్ర కార్యకలాపం నిర్వర్తింపబడింది. రామఘర్ జాతీయమహాసభ రామఘర్ రాజాగారికి సంబంధించిన అరణ్యంలో ఎప్పటివలెనే గ్రామపరిసరములమధ్య జరిగింది. రామఘర్ రాజా గొప్పదేశభక్తుడు; యువకుడు; నిరాడంబరుడు; కొంత ఔదార్యంకలవాడు. ఆయన ఔదార్యానికి తగినట్లు అ. భా. కాం. సం. సభ్యులకు విందుచేసి తన ఉత్సాహాన్ని వెల్లడించాడు. ఆ మహాసభకు పలుప్రాంతములనుండి వచ్చిన ప్రతినిధులను ఆహ్వానించడానికి శ్రీ రాజేంద్రప్రసాదును ఎన్నుకోవడం మఱీ సమంజసంగా ఉంది.

ఆయన ఉపన్యాసం వాదపటిమగలిగి, చక్కని ఉపాఖ్యానాలతో చాలా రసవత్తరంగా ఉండి ఎన్నిసార్లయినా చదవవలెననిపించింది. బీహారు మతధర్మాల కధిష్ఠానమై మనోహర గాధాపరంపరలకాలవాలమైన రాష్ట్రం. బుద్ధునియొక్క జన్మస్థానం. ఆయన సచివమండలి సంచరించిన పవిత్రభూమి. బుద్ధునిపాండిత్యమున్నూ; ఆయన బుద్ధివైశద్యమునూ ప్రతిఫలింపచేసేగాధా పరంపరలు ఆదేశంలో సంచారంచేస్తూన్న ప్రతివారికీ అనుయాయికముగా స్మృతికి వస్తూంటవి. తాళ్లలోని ధర్మప్రవచనాలు, నిర్ఝర తరంగములలోని గ్రంధాలు అనే వాక్యాలు కేవలం కవుల ఊహాజన్యములుకావనీ, ఆ రాజర్షి గౌతమ బుద్ధుని త్యాగ జీవితంలోని నిజమైన ఘట్టాలనీ తెలుసుకొన్నట్లయితే, అవి మనకు బీహారులోనే లభించగలవు. అందులో ఒక ధర్మప్రవచన గాథను రాజేంద్రబాబు తన ఉపన్యాసంలో ఉదహరించాడు. అది ఈక్రింద పొందుపఱుపబడుతూన్నది.

## జరిగినకధనుండి తార్కాణం

మనమెుక్కొక్కప్పుడు పూర్వగాథలను స్మరించి వాటినుండి నూతనోత్సాహమును పొందుతూంటాము. అటువంటి పూర్వసంఘటనమొకటి చెప్పి నా ఈ ఉపన్యాసాన్ని ముగిస్తాను. దక్షిణ బీహారును ఒకప్పుడు అజాతశత్రువనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఉత్తరబీహారులో వజ్జీల ప్రజాస్వామ్యం మంచి ఉన్నతస్థితిలో ఉండవప్పుడు. వజ్జీలను జయించి ఉత్తరబీహారును తనరాజ్యంలో కలుపుకోవాలని అజాతశత్రుకు బుద్ధి పుట్టింది. అజాతశత్రువు రాజధానియైన రాజగిరికి గౌతమబుద్ధుడు వేంచేసి గీధాకూట్ గుట్టమీన మకాం పెట్టాడు. అజాతశత్రువు వజ్జీలకు వ్యతిరేకంగా తాను తలపెట్టిన పనిని గురించి గౌతమబుద్ధుని అభిప్రాయమేమిటో కనుక్కొని రావలసిందని మంత్రి భాస్కుని (Bassaka) పంపించాడు. అజాతశత్రుని అభిప్రాయం బుద్ధుడు తెలుసుకొని, తన శిష్యుడైన ఆనందుణ్ణి ఏడుప్రశ్నలు వేసి, వాటికి సమాధానం వచ్చిన తరువాత అజాతశత్రుడి ప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చాడు. బుద్ధుడిలాఅడిగాడు. "ఆనందా! వజ్జీలు తరచుగా పరిషత్తులను సమావేశ పరుస్తారా? ఆ పరిషత్తులకు బాగా జనం వస్తారా? నీవేమి వింటున్నావు?" దానికానందుడిలా అన్నాడు, "ప్రభూ" వజ్జీలు సభలు తఱచుగా జరుపుతూన్నారనీ జనం బాగా వస్తూన్నారనీ నేను వింటున్నాను" అంతట బుద్ధుడిలా అన్నాడు. "అలాగా? అయితే వజ్జీల సభలు తఱచుగా సమావేశమవుతూ జనం బాగా వస్తూన్నంతవరకూ, వారభివృద్ధికే వస్తారు. అంతేగాని క్షీణదశకు మాత్రం రారు." ఇటువంటివే యింకా ఆరుప్రశ్నలడిగి వాటికి తగు సమాధానాలువచ్చిన తరువాత బుద్ధుడిలా జవాబుచెప్పినాడు. "వజ్జీలుకలసి కూర్చుండి, కలసి పనిచేసి వారి జాతీయ

కర్మాలను సమిష్టిగా నిర్వహించు కొంటూన్నంతవరకూ, శాసనాలు చేయక నోటికి వచ్చిన ఉత్తర్వులను జారీ చేయకుండా ఉన్నంత వరకూ, వారి శాసనాలను వారే ఉల్లంఘించకుండా ఉన్నంతవరకు, వారు చేసుకొనిన నియమావళి ననుసరించి వారు సమిష్టిగా వ్యవహరించుకొంటూన్నంతవరకు, వారి పెద్దలను వారు గౌరవిస్తూన్నంతవరకు, వారిని మన్నిస్తూన్నంతవరకు, వారి సలహాలను అంగీకరించతగిన మేరకు అంగీకరిసూన్నంతవరకు, తమ స్త్రీల యెడల మొరటుగానూ అమర్యాదగాను ప్రవర్తించనంతవరకు, తమ దేవాలయాలను గురుపీఠాలనూ (చైత్యములు) గౌరవిస్తూన్నంతవరకు, న్యాయంగా ఆసంస్థలకీయబడిన ఈనాములను తొలగించకుండా ఉన్నంతవరకు, త్యాగమూర్తులయిన తమ విద్వాంసులకు (అర్హంతులను) రక్షణ యిస్తూన్నంతవరకు, బయటి అర్హంతులను తమ దేశంలోకి రానిస్తూ తమ అర్హంతులను సురక్షితంగా కాలక్షేపం చేయనిస్తూన్నంతవరకు, వజ్జీలు దినదిన ప్రవర్ధమానంగా ఉన్నత స్థితికి వస్తారు. వారికి ఎవరూ అపకారం చేయలే." అజాతశత్రువు మాటవిని తన సైన్యాలతో వజ్జీలను జయించడం అసాధ్యమని అంగీకరించాడు.. ఈ రోజున కూడా ఈ ఏడు ధర్మసూత్రాలూ ఎంత నిజంగా నడుస్తూన్నవి? రెండువేల అయిదు వందల యేండ్లకిందట చెప్పిన ఈ ధర్మ సూత్రాలే; జాతుల ఔన్నత్యమునకూ పతనమునకూ నేటికి కూడా హేతుభూతములుగా పరిణమిస్తూన్నవి. రాజగిరి కొండలలోని గీధ్కుట్ గుట్ట మనకీ కథను నేటికీ జ్ఞాపకం చేస్తూఉంటుంది. చైతన్యంగల సంఘంలో అభిప్రాయ భేదాలుండడం సహజం వాటిని పరిష్కరించగల శక్తిసామర్థ్యాలు కలిగిఉండడం సుసంఘటితమైన సమాజానికి గురుతు. నేడు మనమంతా కలిసి కూర్చొని ఐక్యకంఠంతో మాట్లాడి సమిష్టిగా వ్యవహరించుకోగలమని మన కాంగ్రెసునుగూర్చి మనం చెప్పుకొనే స్థితిలో ఉన్నామా? మన నియమావళిని మనం ఉలంఘించడంలేదనీ, మనమేర్పాటు చేసుకొన్న సూత్రాల కనుగుణంగా మనం ఒక్కటిగా వ్యవహరిస్తూన్నామనీ మన మన గలమా? మన పెద్దలను మనం గౌరవించి వారి సలహాలను అంగీకరించవలసిన మేరకు అంగీకరిస్తూన్నామనీ మనం నమ్మకంగా చెప్పగలమా? వజ్జీల బలం ఈ ప్రధాన విషయాలలోనే ఉంది. ఈపై ప్రశ్నలకు అవునని జవాబీయగల స్థితిలో మనముంటే మన బలంకూడా పెరుగుతుంది. బుద్ధుడు వజ్జీల సభలను తన భిక్షులకుచూపి ఒక సారి యిలా అన్నాడు:—

“ఈ సభ చూడండి! దేవతల సభ యెలా ఉంటుందో మీకు అర్థమవుతుంది” అన్నాడు. మహాత్మాగాంధీ మనలోని అవకతవకలనూ, హింసను వేలు పెట్టిచూపడానికి వీలులేనట్లుగా మనం మన జాతీయ మహాసంస్థను నిర్మించు

కాని, బుద్ధుడు వజ్జీలనుగూర్చి భిక్షులకు చెప్పిన రీతిగానే, మననుగూర్చి గాంధీజీ తన ఆశ్రమ బాలికలకు చెప్పేటట్లు మనం ప్రవర్తించకూడదా?

అధ్యక్షోపన్యాసం అత్యుత్కృష్టంగా ఉంది. మౌలానాసాహెబు ఈజిప్టులోని ఎలిజిర్ విశ్వవిద్యాలయంలో శిక్షణపొందిన సుప్రసిద్ధ పండితుడు. వేదాంత విద్యలో ఆయనకున్న పాండిత్యం, సంస్కృతిలో ఆయనకుగల ఔన్నత్యం, విషయ విమర్శనలో ఆయన ప్రదర్శించే విస్పష్టత, ఆయన భాషాపటుత్వం, ఆయన మేధాసంపత్తి, ఆయన వాచకౌశలం, ఆయన తీక్ష్ణదృష్టి, మాటకుమాటు చెప్పడంలో ఆయనకుగల నేర్పు-ఇవన్నీ ఉండి ఆయనతో తులతూగగలవారిండియాలో యే కొద్దిమంది మాత్రమో ఉన్నారు. మహమ్మదీయ మతశాస్త్రజ్ఞానంలో ఇస్లాం ప్రపంచంలో ఆయనకు సాటిలేరు. ఆ రూపురేఖలు, ప్రకాశవంతమైన ముఖవర్చస్సు, ఎడతెగని ఆచిరునవ్వు-ఇవన్నీ ఆయన కీర్తిప్రతిష్ఠలాయనకెంత నున్ననను చేకూరుస్తున్నవో అంత ఎక్కువగా ఆయనను ప్రేమాస్పదుని చేయగలుగుతూన్నవి. ఒకప్పుడాయన హింసాసిద్ధాంతానికి చెందినవాడు. 1914-18 సంవత్సరాలలో జరిగిన మహాసంగ్రామ సందర్భంలో 1915 మొదలు 1919 డిశంబరువరకూ ఆలీసోదరులతోసహా ఆయనకూడా, ప్రవాసశిక్షకు (Internment) గురియైనాడు. అసహాయోద్యమంలో ఆయన సంపూర్ణహృదయంతో పాల్గొని 1921 లో దేశబంధుదాసుతో తోడి ఖైదీగా ఉన్నాడు. 1922 లోని గయా కాంగ్రెసు జరిగిన తరువాత శాసనసభా ప్రవేశమునకు అనుకూలురకూ, ప్రతికూలురకూ మధ్య సమాధానం కుదర్చడానికి ఆయన పలుకుబడిని వినియోగించాడు. ఒడిదుడుకులులేని ఆయన నిర్ణయమూ, శ్రమ యెఱుగని ఆయన పరిశ్రమ, నిష్కళంకమైన ఆయన దేశభక్తి-ఇవన్నీ 1923 సెప్టెంబరులో జరిగిన ప్రత్యేక కాంగ్రెసుకాయనకు అధ్యక్ష పదవిని చేకూర్చినవి. తరువాత పదిహేడు సంవత్సరాలకు భారత రాజకీయ సాగరం కల్లోలితమై ఉన్న సమయంలో మరల ఒకసారి మన జాతీయ కాంగ్రెసు అనే నౌకకు కర్ణధారిగా ఉండడానికి, ఆయనను అధ్యక్ష పదవికి ఆహ్వానించిన గౌరవం ఇండియాకు ఇంకొకతూరి లభించింది. ఆనాడు కాంగ్రెసు నౌకను సురక్షితంగా ఆయన ఎలా ఒడ్డుకుచేర్చగలిగాడో ప్రపంచానికి సువిదితమే. ఇంతకాలమూ ఆయన పోరాటానికి సంసిద్ధంగా ఉన్నట్లు చాటుతూవచ్చాడు. పోరాటం ప్రారంభించవలసిన తరుణ వచ్చిందనుకొన్నప్పుడాయన రామఘర్ కాంగ్రెసు అధ్యక్ష స్థానాన్ని స్వీకరించడం తన ధర్మంగా భావించాడు.

"ఈరోజున మన రాజకీయ రథం ఒడిదుడుకులుగా నడుస్తున్నది. పరస్పరవిరుద్ధ పరిస్థితులలో మనం ప్రయాణం సాగించవలసిరావడంలోనే మనకు ప్రధానమైన క్లిష్టదశ

యేర్పడింది. మనమిప్పుడు సరియైన అడుగు వేస్తే మన లక్ష్యానికి చేరువగా పోగలం. లేక తప్పటడగు వేశామా కొత్త కష్టాలూ కొత్త చిక్కులూ తటస్థించక తప్పదు." అన్నాడు. రామఘర్‌లో 1940 వ కాంగ్రెసుకు అధ్యక్షస్థానం అలంకరించిన అబుల్ కెలాం ఆజాదు తన అధ్యక్షోపన్యాసంలో.

ఆయన ఉపన్యాసమంతా ఈ క్రింది రెండు ప్రశ్నలమీద ఆధారపడి ఉంది. "1939 మూడవ సెప్టెంబరు తేదీన యుద్ధం ప్రకటింపబడిన తరువాత మనం తీసికొన్న చర్య ఎక్కడికి దారి తీస్తూన్నది? మనమిప్పుడెక్కడున్నాము" అనే ఈ రెండు ప్రశ్నలను గూర్చియే ఆయన ఉపన్యాసంలో చర్చింపబడింది.

## సామ్రాజ్యవాదం పైన విసుగుపుట్టింది

అభివృద్ధి నిరోధక తరంగాలను చెలియలికట్టగా నిలచి స్వేచ్ఛా స్వాతంత్ర్యముల కోసం పోరాడే ప్రజలలో సంపూర్ణ హృదయంతో కలసి పనిచేయడానికి ఇండియా సంసిద్ధంగా ఉన్నట్లు పునరుద్ఘాటిస్తూ మౌలానా అజాద్ ఇంకా యిలా అన్నారు:—

"ఇండియా నాజీతత్వముయొక్కగాని ఫాసిస్టు తత్వముయొక్క గాని అభివృద్ధిని సహించలేదు. కాని బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో అది విసిగి వేసారి పోయింది. స్వాతంత్ర్యమును పొందడానికి ఇండియాకు సహజమైన హక్కుంది. ఆ హక్కును నిరాకరించడమంటే బ్రిటిష్ సామ్రాజ్యం తన సహజ లక్షణ సంప్రదాయాలతో పెంపొందుతూన్నదని అర్థం. బ్రిటిష్‌సామ్రాజ్య విజయంకోసం సహాయం చేయడానికి ఇండియా యేమాత్రమూ సంసిద్ధంగా లేదు."

"సామ్రాజ్యంలోని ఇతర దేశాలకు స్వతంత్రంగా నిర్ణయించుకొనే అధికారమీయబడింది గదా? ఈ బ్రిటిష్ కామన్‌వెల్తులో ఇండియాకుగల స్థానమేమిటి?" అని కాంగ్రెసు అధ్యక్షుడు ప్రశ్నించాడు. ఎప్పుడో తెలియదు కాని కొద్దికాలంలోనే మహోదారమూర్తులైన బ్రిటిష్‌వా రిండియాకు అధినివేశ ప్రతిపత్తి అనే అమూల్య పారితోషికమును ప్రసాదించగలరని వినవస్తూన్నది. ప్రపంచంలో జరిగిన మహాసంగ్రామాలలో బహుశా ఒకటిగా పరిగణింపబడుతూన్న నేటి యుద్ధం ప్రారంభమైనప్పుడు, తాను యుద్ధంలోకి చేరుతూన్నట్లు తెలియకుండానే ఇండియా బలవంతంగా యుద్ధంలోకి నెట్టబడింది. దీనినిబట్టే గాలి యేవైపుకు వీస్తున్నదో తేలికగా తెలుసుకోవచ్చును.

## కాంగ్రెసు కోరికపై బ్రిటిషు ప్రత్యుత్తరం

తరువాత అధ్యక్షుడు మౌలానా అజాద్ కాంగ్రెసు కోరికనుగూర్చి, దానిమీద బ్రిటిష్‌వారి ప్రత్యుత్తరమునుగూర్చి, కాంగ్రెసు తరువాత తీసికొన్నచర్యనుగూర్చి విపులంగా విమర్శించాడు.

"నిజాన్ని ఎదుర్కోవలసి వచ్చిన తక్షణం. యిదివరకాడిన కపటనాటకమంతా తునాతునకలైపోయింది. జరిగిన నాలుగు సంవత్సరాలనుండీ స్వేచ్ఛా స్వాతంత్ర్యములనే నినాదాలతో ప్రపంచం మారుమ్రోగింది. ఈ సందర్భంలో ఇంగ్లాండు ఫ్రాన్సుదేశాలలోని బాధ్యతగల ప్రముఖనాయకుల ప్రకటనలు మన స్మృతిపథమునింకా వీడిపోలేదు. కాబట్టి వాటిని మరల జ్ఞాపకం చేయవలసిన అవసరం లేదు. కాని ఇండియా ఈ విషయాన్ని ఎత్తేసరికే, ఈ ప్రకటనలో నిజమెంత ఉందో నిగ్గుతేలింది. జాతుల స్వాతంత్ర్యాన్ని సంరక్షించడమే నేటి యుద్ధాశయమనడానికేమీ సందేహం లేదు. అయితే ఆ స్వాతంత్ర్యరక్షణ యూరోపుఖండంలోని దేశాలకు మాత్రమే ఉద్దేశింపబడినదని మనకు చెబుతూన్నారు. కాబట్టి ఆశియా, ఆఫ్రికా ఖండాలలోని ప్రజానీకం సాహసించి అటువంటి ఆశలు పెట్టుకోకూడదు"

## ఇండియా హక్కు

"ఇండియాకు స్వాతంత్ర్యం ప్రసాదించే విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం వారికెంతవరకు కోరిక ఉన్నదీ అనే విషయంతో మాకు నిమిత్తంలేదు. ఇండియాకు స్వాతంత్రం పొందేహక్కు ఉన్నదా లేదా అనే ప్రశ్నే మాకు కావలసింది. మేము చెప్పేది స్పష్టంగా చెబుతూన్నాము. బ్రిటిష్ సామ్రాజ్యవాదం విజయం పొంది యింకా బలవత్తరం కావలెననీ మా పరాధీనత యింకా కొంతకాలం కొనసాగించుకోవలెననీ కోరిక మాకులేదు. మేము పూర్తిగా అందుకు వ్యతిరేకిస్తున్నాము. మా మార్గం కేవలం దీనికి విరుద్ధం.

"తాత్కాలికంగా కొంతవరకు సహకరించడానికి 1937 లో మేము చర్యతీసుకొన్నాము. యుద్ధం ప్రారంభం కాగానే మేమాచర్యను ఉపసంహరించుకొన్నాము. ఇంకా సహాయనిరాకరణమునకు సంబంధించిన తదితర చర్యలు తీసుకోవడం కూడా మేము తప్పనిసరి అనుకొంటూన్నాము. ఈ రోజున మా పరిస్థితులనుబట్టి ముందుకుసాగిపోవాలా లేక ఒక అడుగు వెనుకకు వేయాలా అని ఆలోచించి నిర్ణయించుకోవలసి

ఉంది. ఒకసారి అడుగు వేస్తే ఇక ఆగడమనేది ఉండదు. ఆగిపోవడమంటే వెను కడుగు వేయడమే. వెనుకడుగు వేయడానికి కొప్పుకోము. కాబట్టి ముందుకుపోయి తీరాలి, మనము ముందుకుపోయి తీరాలి అని నేను చాటినప్పుడు నాతో మీరందరూ ఏకీభవించి తీరుతారని నాకు గట్టినమ్మకం.

## ఇంకా సావకాశం లేదా?

ఈ పరిస్థితులలో చరిత్ర తన పూర్వ సంప్రదాయాలకు విరుద్ధంగా నూతన పంథాను అవలంబించడం సాధ్యంకాని విషయమా? కొన్ని సంఘటనలనుబట్టి పాలక పాలితులుగా సంబంధం కలిగిన రెండు ఉత్కృష్టజాతులకు చెందిన మానవులు హేతువు పైనా, న్యాయంపైనా, శాంతిపైనా, ఆధారపడి ఉన్న నూతన బాంధవ్యాన్ని కల్పించు కోవడం జరగడానికి వీలులేనిపనా? ఇలా జరిగి ఉన్నట్లయితే ప్రపంచ యుద్ధం మూలాన తటస్థించిన దుఃఖం, ఒక కొత్త ఆశా జ్యోతికి సావకాశం కల్పించి ఉండేది. బ్రిటిష్ వారట్టి కొత్త ఉదాహరణం ఒకటి చరిత్రకు కల్పించగలిగామని సగర్వంగా చాట గలిగి ఉన్నట్లయితే మానవానీకాని కది సాటిలేని మహావిజయంగా పరిణమించి ఉండేది. నిజానికది అసాధ్యమైన విషయం కాదు. కాని ఆచరణలో ఆశ్చర్యకరమైన కష్టం ఉంది.

## మహాత్ముని విశ్వాసం

"ఈ అంధకార బంధురంలో మానవస్వభావమునందు మహాత్మునికి గల విశ్వా సమే ఆయన గొప్ప ఆత్మను పోషిస్తూన్నది. పరస్పర సమాధానమునకు ఏ మాత్రం సావకాశం లభించినా దానిని వినియోగించుకొనవలెననియే మహాత్మ డాతురపడు తూన్నాడు. అందువలన ఆయన అప్రతిహతస్థితికి ముప్పం వస్తుందేమోననే భయం ఆయనకెక్కడా లేదు."

## రామఘర్‌లోని విషయనిర్ధారణ సభ

రామఘర్ కాంగ్రెసులోని ప్రధానతీర్మానం పాట్నాలో జరిగిన వర్కింగు కమిటీ సమావేశంలోనే తయారయి ఉండడంచేత రామఘర్ కాంగ్రెసు మార్దవంగా జరిగిపోతుందనుకొన్నారు. కాని అక్కడి నడక అనుకొన్నంత మార్దవంగా లేదు. పాట్నాకూ రామఘరుకూ ఉన్న కొద్దికాలంలోనే అభిప్రాయాలు చాలా వేగంగా పరుగెత్తసాగినవి. జిన్నాగారి రెండుజాతుల సిద్ధాంతం ఆయన మనస్సులో ఒక రూపం తాల్చి పాకిస్థాన్ పేరుతో బయటపడ్డది. శాసనోల్లంఘనం ప్రారంభిస్తే మత

కలహాలు రావచ్చునని భయపడ్డాముకదా? అవి అప్పటికప్పుడే ప్రారంభమై, సుక్కూరు-షికార్పూరులలో 400 మందికి ప్రాణాలు పోవడం, వేలకొలదీ జనానికి గాయాలుతగలడం తటస్థించింది. నిష్కారణంగా అక్కడ జరిగిన పశుకృత్యాలకూ, రక్తపాతానికీ ఇండియాచరిత్రలో ఇదివరకెక్కడా తార్కాణం కనిపించదు. తరువాత ఒక సంవత్సరానికి జరిగిన ఘోరకృత్యాలు ఇంకా విషాదకరంగా ఉన్నవి. 1941 మార్చి మధ్యభాగంలో ప్రారంభమై జూలైవరకు ఢక్కాలోనూ, 1941 జూలైవరకూ అప్పుడప్పుడు బొంబాయి అహమ్మదాబాదు నగరాలలోనూ, అంతకంటె కొంచెంతక్కువగా లక్నో, కాన్పూరు, కాశీనగరాలలోనూ జరిగినభయంకర హత్యాకాండలు సుక్కూరు మతకలహాలను మరిపించినవి. జిన్నా ప్రచారానికనుగుణంగా ఇండియా విభజనను ఆందోళన జరుగుతూన్నప్పుడు పరస్పర మత వైషమ్యములు పెచ్చుపెరిగినప్పుడు యుద్ధకాలంలో శాసనోల్లంఘనమును ప్రారంభించే విషయం స్థిమిత బుద్ధితో ఆలోచించడం అంత తేలికయిన పని కాదు. అదే రామఘర్‌లో తటస్థించిన క్లిష్ట పరిస్థితి. అంతేకాదు, కాంగ్రెసులోని ఆంతరంగిక వ్యవహారాలు అంతఉత్సాహకరంగాలేవు. కాంగ్రెసువాదులు ప్రతిసందర్భంలోనూ కాంగ్రెసు ఎన్నికలలోనేమి, మునిసిపల్ వ్యవహారములలోనేమి, తదితర ప్రజాజీవితంలోనేమి క్రమశిక్షణకు విరుద్ధంగా ప్రవర్తించడం గాంధీజీ గమనిస్తూన్నాడు. రాజకోట సంఘటనలలోఎంతో కృత్రిమమూ, కపటనాటకమూ ఆయనకు తెలియవచ్చింది. సత్యాగ్రహులవలె నటిస్తూ రహస్యంగా ఠాకూరు సాహెబుదగ్గరకు వెళ్ళి ఆయనకు స్వస్తివాక్యాలనుచెప్పి వచ్చేవారి ననేకమందిని ఆయన గమనించాడు. అందువల్లనే రాజకోట సత్యాగ్రహోద్యమాన్ని ఆయన విరమించింది. సత్యాగ్రహంలో ౨౦ యేళ్ళు శిక్షణపొందిన తరువాత ఫలితమింత అధ్వాన్నంగా ఉన్నయెడల ఆతప్పు శిక్షణ యిచ్చిన వారిలో ఉంది కాని పొందిన వారిలో లేదని ఆయన అన్నాడు. గాంధిజీ సత్యాగ్రహులని పిలవబడుతూన్న వారిలోని కృత్రిమ భావాన్ని సరిచేద్దామనుకొన్నకొద్దీ వారిమంచి, చేతలలో కంటే మాటలలో ఎక్కువ ప్రదర్శింపబడుతూవచ్చింది. గ్రామాలలోనుండి ఇరవైలూ, యాభైలూ, వందలూ ఉద్యమంలోకి దుముకుతూన్నారన్న సంగతి ఆయనకు తెలిసీ అందులో కూడా ఋజువర్తనం లేనివారున్నట్లయితే ఒక చిన్నముఠాను యేర్పాటుచేసుకొని పోరాడడమే ఆయన సూచించిన విధానం. ఆయన తన కోరికను బలిష్టం చేసుకొంటూ ఇతరులు వంకబెట్టడాని కాస్కారం లేకుండా నడపదలచుకొన్నాడు ఉద్యమాన్ని. ఒక్కొక్కప్పుడు తనను విడిచిపెట్టి తక్కినవారు నడుపుకొనిపోతే బాగుండుననిపించే దాయనకు. ఆయన జీవించి చురుకుగా పనిచేయగలిగినంతకాలమూ ప్రజాహృదయం [illegible] నాయకత్వం కింద ఉత్తేజితం కావడం కష్టసాధ్యమైన పని. విసుగువలననో

అవిశ్వాసం వలననో కొత్త నాయకత్వం కావలెనని లోకులు కొందరు తేలికగా అంటే అనవచ్చును. కాని ఆయన సహచరులుగాని ఆయనతో కలసి పనిచేసేవారుగాని ఆయనను విడిచిపెట్టే స్థితిలో లేరు. కేవలం శాసనోల్లంఘనమే ప్రారంభించితీరవలెననీ కాదు. దానిని ప్రారంభించడానికి తగిన శక్తిసామర్థ్యాలు ప్రస్తుతం కాంగ్రెసుకు లేకపోయినట్లయితే, కాంగ్రెసు తన ప్రస్తుత శక్తికి తగినట్లుగానే కోరికలను కోరడం ఉచితమని కూడా ఒక అభిప్రాయం ఉంది. అయితే ఈ అభిప్రాయాన్ని బలపరచినవారు లేరు. హిందూస్థానంలోని యితర ప్రజానీకం ఇంక శ్రమకు ఓర్చుకోలేని స్థితిలో ఉన్నారనుకొనేటట్లయితే, గుజరాతులో తనకు సంపూర్ణ సహకారం లభించగలదనే నమ్మకంతో తానక్కడ ఈ శాసనోల్లంఘనోద్యమాన్ని ప్రయత్నిస్తానని గాంధీజీ అన్నాడు ఆయనకు వచ్చిన పెద్దచిక్కు కాంగ్రెసులో క్రమశిక్షణ లేకపోవడం. 'ఈ కాంగ్రెసు నిర్మాణంతో నేనెలా పోరాడడం' అనేదే ఆయనకు నిరంతరం ఒక పెద్ద ఆలోచనతో కూడిన సమస్య అయింది. ఎప్పుడూ చర్చలలో అదే ప్రశ్న వేస్తూండేవారు. అదే విషయాన్ని యోచిస్తూండేవారు. కాంగ్రెసు సంస్థలోని సంగతులను గమనిస్తున్నకొద్దీ ఆయన ఆ సంస్థను నమ్ముకొని పోరాటం సాగించజాలననీ, అందువలన చాలా అపాయమున్నదనీ తన అనుచరులకు చెబుతూండేవారు. ఇక చాంపరాన్ అహమ్మదాబాదులలో తన అనుచరులైన రాజేంద్రబాబు వ్రజకిశోరబాబులకు ఊరూ పేరూలేని రోజులలో కాంగ్రెసుపేరుతోగాక దాదాపు తాను ఒంటరిగా ఉద్యమం ప్రారంభించినట్లే, నేడుకూడా ఆయన ఈ ఉద్యమాన్ని ఒంటరిగా మొదలుపెట్టవలెను. కాని ఈ నాయకత్వమునుండి వైదొలగడం ఉచితమని ఆయనకు గట్టిగా తోచింది. పాట్నాలో వర్కింగుకమిటీ సమావేశమైనప్పుడాయన ఈ అభిప్రాయంలో లేడు. రామఘరులో ఆయనకీతలంపు కలగడం చాలా కొత్తగా తోచింది. సుభాస్‌బాబును చూచి భయపడి ఆయన బలవంతంగా ఉద్యమాన్ని తీసుకొని వస్తున్నట్లున్నదని అనేకమంది ఆయనకు ఉత్తరాలు వ్రాశారు. ఆయనకు కలిగిన ఈ మనోపరివర్తనానికి అటువంటి ఉత్తరాలేమైనా కారణమా? రెండు పరస్పర విరుద్ధాభిప్రాయాలు ప్రబలంగా ఉన్నప్పుడు కొంతకాలం ఒక అభిప్రాయాన్ని వ్యతిరేకించి నిరోధించడం జరుగవచ్చును. కాని ఒకానొక విసుగుదలలో తాను నిరోధిస్తున్న అభిప్రాయాన్నే హఠాత్తుగా అంగీకరించడంకూడా జరుగుతూంది. గాంధీకూడా అటువంటి మానసిక తత్వానికి బలియైనాడా! గాంధీ భయపడుతూన్నాడని లోకులనడం యిది మొదటిసారికాదు. ఒకప్పుడు లాలాలజపతిరాయిని చూచి భయపడ్డాడన్నారు. నిజానికి గాంధీ తాను వైదొలగుతాననడానికి మరొక కారణముంది. ప్రజలు చాలా తొందరపడుతూన్నారు. కాని తనకు తొందరపడి-

ఉద్యమం ప్రారంభించవలెనని లేదు. కాబట్టియే రామఘరు తీర్మానం తిరిగీ సరికొత్తగా తన సహచరులను వ్రాయవలసిందని ఆయన కోరాడు. వారే వ్రాయవలసి వచ్చేమొదల అది పాట్నా తీర్మానానికి భిన్నంగా ఉండేమాట నిజం. పాట్నాలో ప్రజలు త్వరగా సంసిద్ధం కావలెనని కోరబడింది. అయితే యిప్పుడా తీర్మానాన్ని మార్చివేసుంటే దేశాన్ని భిన్నమార్గాన్ని పెట్టడంకాదా అని మరొకప్రశ్న రావచ్చును. "ఎప్పుడు మీరు ఉద్యమాన్ని ప్రారంభిస్తారు?" అని ప్రజలు గాంధీని అడుగుతూంటే గాంధీ "మీరెప్పుడు తయారవుతారు?" అని ఎదురు ప్రశ్న వేస్తూన్నాడు. గాంధీ పాట్నాలో తానవలంభించిన స్థితికెప్పుడూ వెనుకకు పోనేలేదు. "దేశానికి తగినంతబలం లేదు గనుక మన కోరికకూడా అందుకు తగినట్లు తగ్గించడం మంచిదని యెవరైనా సూచిస్తే గాంధీ వెంటనే 'కాదు' అని గట్టిగా ప్రత్యుత్తరం చెప్పేవాడు ఆమాట వినగానే చాలా మందికి గాంధీ ముందుకూపోడు వెనుకకూరాడనిపించేది. కాని గాంధీకి తన మనస్సులో ఉన్న విషయం స్పష్టంగా తెలుసు. పోరాటాన్ని తీసుకొనిరావడం అవసరమని తెలుసు. ఇండియా కోరికను కుదించడం తప్పని తెలుసు. ఇండియా కోరికను మార్చడానికి యేలా వీలులేదో అలాగే పోరాటంకూడా రాకతప్పదు అందుకోసం దేశాన్ని తయారు చేయాలి. ప్రభుత్వాన్నికూడా అందుకు సంసిద్ధంచేయాలి. ప్రభుత్వంవారు వాగ్దానం చేసింది మనం కోరే స్వాతంత్ర్యానికి ఎంతో దూరంగాఉంది. ఆ వాగ్దానంలో అధినివేశ ప్రతిపత్తికూడా లేదు. అయితే నిజానికి కాంగ్రెసిప్పుడు స్వసంరక్షణ చేసుకొనేస్థితిలో ఉంది. పోరాటానికి తయారయ్యే ప్రశ్న లేనేలేదు. పోరాటం చేయవలెనంటే కాంగ్రెసు నియమబద్ధంగా ఉండాలి. తగిన శిక్షణ గాంధీజీ నాయకత్వమూకూడా కావాలి. సత్యాగ్రహ సమరంలో నిపుణుడనని చెప్పుకొనే గాంధి తర్వాత దానినుండి విరమించుకోవడం జరగదు. పైగా రామఘర్ కాంగ్రెసుకు నాలుగునెలలు ముందుగానే యావత్తు అధికారమూ గాంధీకి సమర్పిస్తూ ఒక తీర్మానం ప్రతిపాదింపబడి దాదాపు అంగీకరించబడింది కూడాను.

అయితే గాంధీ నిజానికి ఆచరణలో నాయకుడు కావచ్చును. కాని శాస్త్రప్రకారమాయన నాయకుడుకాడు. గాంధీ త్వరలోనే శాసనోల్లంఘనమును ప్రారంభించపోతున్నాడనే అపోహను తొలగించడానికే ఆయన చేసిన కృషి అంతా. ఆయనకు శాసనోల్లంఘనం ప్రారంభించడానికి తగిన పరిస్థితులుగానీ, పరికరాలుగానీ తగిన మనుష్యులుగానీ కనిపించలేదు. తుదకు రామఘర్‌లోకూడా పాట్నా తీర్మానమే ఖాయమయింది. గాంధీ తనను క్షమించి ఎలాగైనా ఈ నాయకత్వంనుండి తప్పించవలసిందని

కోరినప్పుడు మౌలానా సాహెబు, తనను అధ్యక్షుడుగా ఉండమని ఆహ్వానించిన గాంధీ యిలా తప్పుకొని పోవడం న్యాయమా అని అడిగాడు.

ముఖ్యంగా సామ్రాజ్య ప్రయోజనాలకోసం చేసే యుద్ధంలో ఇండియా ప్రజలకు చెప్పనైనా చెప్పక భారతదేశాన్ని భాగస్వామి గాచేయడం అవమానకరమని కాంగ్రెసు భావించింది. అటువంటి యుద్ధంలో కాంగ్రెసు యేవిధంగానూ జోక్యం కల్గించుకో చాలకపోయింది. కాబట్టి ఇండియా సైన్యాలను గ్రేటుబ్రిటను కోసం పోరించే విధానాన్ని కాంగ్రెసు ఆమోదించలేదు. ఈ యుద్ధంకోసం మనుష్యులను సామగ్రినీ ఇండియానుండి తీసుకొనిపోవడం కూడా కాంగ్రెసు కేమాత్రమూ గిట్టలేదు. ఈ అభిప్రాయంతో, ఆరితేరిన రాజకీయ ధురంధరులలో ఒకరైన స్టేట్స్మన్ మాజీ సంపాదకుడు మిస్టర్ యస్. కె. రాచ్ఫీ (Rat-hte )కూడా ఏకీభవిస్తూ 'క్యాతలిక్ హెరల్డు' అనే పత్రికలో ఈ దిగువ వ్యాసాన్ని రచించాడు.

## సత్యాగ్రహం

"భారత శాసనసభతో సంప్రతించకుండానే ఇండియా యుద్ధంలోకి దిగినట్లుగా రాజప్రతినిధి లిన్‌లిత్‌గో ప్రభువు ప్రకటించి మొట్టమొదటి తప్పిదం చేయకుండా ఉన్నట్లయితే, 1940 లో జరిగిన విషాదసంఘటనలు - నాయకుల నిర్బంధాలు కూడా జరుగకుండా ఉండేవి. ఇదే ఇండియా పక్షాన చేయబడే వాదంలో మొట్టమొదటిది.

అయితే ఈ చర్యను ఉపసంహరించుకోవడం కష్టం. కాని 1940 నాటి క్లిష్టపరిస్థితులలో రాష్ట్రస్వాతంత్ర్యం అనుభవిస్తూన్న కాంగ్రెసు మంత్రులు రాజీనామాలీయకుండా ఉన్నట్లయితే, తిరిగీ ఆ ప్రమాదమునుండి తప్పరిల్లడం అంతకష్టమై ఉండేది కాదేమోనని అనుకోవలసివస్తూంది. అటువంటి క్లిష్టదశలో బాధ్యతను విడనాడి రావడంవలన సమాధానంగానీ సహకారంగాని కుదరడం దాదాపు అసంభవమవుతుంది. ఇంతలో గాంధీ కల్పించుకోవడం వలన మరింత చిక్కు వచ్చింది. ఆయన వ్యక్తిసత్యాగ్రహం చేయవలసిందని సలహా ఈయడమో ఆమోదించడమో జరిగింది. ఇది పరస్పరవిరుద్ధంగా కనిపిస్తూన్నది. కాంగ్రెసు తన సంపూర్ణస్వాతంత్ర్యాశయాన్ని మరొకసారి ఎలుగెత్తిచాటింది. సామ్రాజ్యాంతర్గతమైన అధినివేశ ప్రతిపత్తికానీ మరొక ప్రతిపత్తికానీ ఇండియాను వర్తింపచేయరాదనియూ, అలా వర్తింపజేసే యెడల ఇండియా బ్రిటిష్ రాజనీతికీ ఆర్థిక వ్యవహారనీతికీ కట్టుపడి ఉండవలసివస్తుందనియూ కాంగ్రెసు విస్పష్టంచేసింది. రాజ్యాంగనిర్మాణ పరిషత్తుద్వారా స్వయంనిర్ణయ విధా

సమున్నవలంబించడంవలన ఇండియాసమస్య పరిష్కారం కాగలదు. అప్పుడే మతసామరస్యం కలుగుతుంది. ఇండియా రాజ్యాంగ ప్రణాళికలో సంస్థానప్రజలను సైతం కూడగట్టుకొని, జాతీయైక్యత, ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యములనే పునాదులను నిర్మించవచ్చును. ఇండియాలోని రాష్ట్రాలలోకానీ సంస్థానాలలోకానీ ప్రజలదే సర్వాధికారంకాని, సంస్థానాధీశులదికానీ విదేశీపాలకులదిగానీ స్వప్రయోజనపరులదికానీ కాదు. వారెవరికీ భారతస్వాతంత్ర్యమున కడ్డుతగిలే అధికారంలేదు. యుద్ధంతో ఇండియాకు సంబంధంలేదని నిరూపించడానికి కాంగ్రెసు మంత్రుల ఉపసంహరణ కాంగ్రెసు పక్షాన తీసుకోబడిన మొట్టమొదటి చర్య. కాలక్రమేణా శాసనప్రారంభం కావలసి ఉంది. కాంగ్రెసులో తగిన కట్టుదిట్టం చేకూరిందనీ, నిర్మాణకార్యక్రమం తాననుకొన్నప్రకారం నడుస్తున్నదనీ గాంధీకి తోచినప్పుడాయన శాసనోల్లంఘనమును ప్రకటించే జవాబుదారీ వహించగలడు.

విషయనిర్ధారణసభలోనూ, మహాసభలోనూ తరువాత ఒకవారం రోజులను దేశాన్ని ప్రబోధిస్తూనూ, గాంధీచేసిన ఉపన్యాసపరంపరలు ఒక సాహిత్యంగా పరిణమించడమేగాక ఆధునాతనచరిత్రలో విస్మరించడానికి వీలులేని అంశాలుగా పరిగణింపబడుతూన్నవి (మార్చి ఆఫ్ ఈవెంట్సు 122-123 పేజీలు)

"బొంబాయిలో నేను కాంగ్రెసునుండి వెళ్లిపోయిన తరువాత వర్కింగుకమటీ నేనూ కలసి ఒకమాట అనుకొన్నాము. అ. భా. కాం. సం. సమావేశాలలోకానీ విషయనిర్ధారణ సభలలోకానీ నన్ను మాట్లాడమని వారు కోరకూడదు. నా శక్తికొలది నాకు తోచినరీతిని నన్ను దేశసేవచేయనియాలి. నేను మామూలుగా వర్కింగుకమిటీ మీటింగులకు హాజరవుతూనే ఉన్నాను. ఈ సందర్భంలో నాఅంతట నేనే విషయనిర్ధారణసభలోనూ, కాంగ్రెసు ప్రతినిధుల మహాసభలోనూ ఉపన్యసిస్తానని సూచించాను. వర్కింగుకమిటీ ఇందుకంగీకరించింది. ఈ తీర్మానం మీరంగీకరించకమునుపే నేను మాట్లాడుతానని చెప్పినాను. కాని ఈ తీర్మానాన్ని మీరంగీకరించిన తరువాత మాట్లాడవలసిందని వర్కింగుకమిటీవారు సూచించారు.

"నేను మిమ్ములను కలిసికొని మీపరిచయాన్ని పునరుద్ధరించుకొందామనీ నన్ను మీరు కలుసుకొని నాలో యేమైనా మార్పు వచ్చిందేమో తెలుసుకోవడానికి మీకవకాశం కల్పిద్దామనీ నేను మీకడకు వచ్చాను. నేను పూర్తిగా యాభైసంవత్సరాలనుండి ప్రజాజీవితం నడుపుతూన్నాను; అనేక సంస్థలు నా యాజమాన్యంకింద నడుస్తూ

వ్వవి. లక్షలాది ప్రజలతో నాకు సన్నిహితత్వం లభించింది, కాబట్టి మిమ్ములను జ్ఞాపకం ఉంచుకోవడం నాకు కష్టంకాదు.

“అయినప్పటికీ మీతో నాకు ప్రత్యక్షసంబంధం కావలెననీ, మనం ఒకరికొకరం ఎంతదూరంలో ఉన్నామో తెలుసుకోవలెననీ నాకు కోరిక కలిగింది. వాద ప్రతివాదాలలో మీరు చాలా అభివృద్ధిపొందినట్లు నేను గమనించాను. అందుకు నా అభివందనాలు. ప్రజాస్వామ్యసంస్థ జయప్రదంగా కొనసాగవలెనంటే, ప్రజలు తమ మనోభావములను స్పష్టంగా వెలిబుచ్చగలిగి తమ వాదాన్ని ఉన్నతస్థాయిపైన నడపగలవారుగా ఉండాలి, సవరణల సంఖ్యకూడా పెరిగిన సంగతి నేను చూచాను. అదికూడా మంచిదే. కొత్తకొత్త అభిప్రాయాలు బయటపడుతూంటవి. ప్రజలకనేక దృక్పథాలనుండి విషయాలను తెలియపరచడంలో గుణం ఉంది. ఈ నాడామోదింపబడని అభిప్రాయాలు రేపామోదింపబడవచ్చును.

“ఈ తీర్మానాన్ని దాదాపు మీరేకగ్రీవంగా అంగీకరించారు. మీలో యే యేడెనిమిది మందియే మాత్రం దీనికి వ్యతిరేకంగాఉన్నారు. అలా ఉండడానికి వారికి హక్కుంది. ఈ తీర్మానం చర్చ జరిగేటప్పుడు నేనిక్కడనే ఉండడంచేత, యిది అంగీకరింపబడిన తరువాత నా బాధ్యత యింకా ఎక్కువయింది. నేను కోరినట్లయితే నా అభిప్రాయంకూడా మీకు ముందుగా చెప్పి ఉండేవాణ్ని. కాని మీరీతీర్మానాన్ని అంగీకరించకపూర్వం నన్ను మాట్లాడవద్దని వర్కింగుకమిటీవారాదేశించగా నేనందు కంగీకరించాను.

“ఈ తీర్మానం చర్చిస్తూన్న సమయంలో మీలో కొంతమందిచేసిన ప్రసంగానికి నేనిప్పుడు జవాబుచెప్పదలచుకోలేదు. నేను పెట్టిన షరతులు కొన్ని నిర్వర్తింపబడకపోయినప్పటికి నేను ఉద్యమం ప్రారంభించిన సందర్భాలు పూర్వం కొన్నిఉన్నవి. కాని ఈ పర్యాయం నేను చాలా గట్టిగా ఉండదలచుకొన్నాను. అంటే నేను కాఠిన్యంగా ప్రవర్తించవలెనని నా ఉద్దేశం కాదు. పోరాటం సాగించవలసిన సేనానాయకుని షరతులు సైనికులు ముందుగా తెలుసుకొని ఉండవలెనని నా కోరిక.”

“ఈ తడవ మీరెదుర్కోవలసిన కష్టాలింతకుపూర్వం మీరెదుర్కొన్న కష్టాలన్నిటికంటెనూ ఎన్నో మడుగు లెక్కువని తెలుసుకోవాలి. ఈ కష్టాలు రెండు తరహాలు. బయటికష్టాలు, లోపలికష్టాలూ. మనకేమి కావాలో మనం స్పష్టంగా చెప్పనే చెప్పాము. అంతకన్న స్పష్టంగా చెప్పడానికి వీలుకానంత బాగా చెప్పాము. అదే విధంగా బ్రిటిష్ ప్రభుత్వంవారుకూడా వారి అభిప్రాయాన్ని విస్పష్టంగా చెప్పారు.

బ్రిటను ప్రపంచ సంగ్రామంలో చిక్కుకొని ఉంది. మనం దాని నిప్పుడు ఎదిరించే యెడల కష్టాలువచ్చేమాట నిజం. ఇది మొట్టమొదటి చిక్కు. కాని నిజమైనచిక్కు ఆంతరంగిక మైనచిక్కు. శాసనోల్లంఘనోద్యమం సరియైన పంధాలో నడపబడేయెడల బయటవచ్చే కష్టాలనుగూర్చి భయపడనక్కరలేదని నే ననేకసార్లు వ్రాసి ఉన్నాను.

"కాంగ్రెసు రిజిష్టరులో అసంఖ్యాకులుగా కాంగ్రెసు సభ్యులు చేరడమే మన సంస్థకువచ్చినచిక్కు. కాంగ్రెసుకు అధికారం వచ్చిందని తెలుసుకొని చాలామంది మనలో చేరుతూన్నారు. ఇంతకుపూర్వం కాంగ్రెసులోచేరని వారనేకమంది కాంగ్రెసులో నేడు చేరుతూన్నారు. వారు స్వార్థపరత్వంతో చేరడంచేతనే కాంగ్రెసుకు హానిచేస్తున్నారు. ప్రజాస్వామ్య సంస్థలో అటువంటివి చేయకుండా చేయడానికి వీలు లేదు. అయితే మన సంస్థ బలిష్టంగా ఉండి ప్రజాభిప్రాయాన్ని ప్రస్ఫుటం చేయగలిగినయెడల వారిని దూరంగా ఉంచడానికి వీలవుతుంది.

"మనకూ ప్రాథమిక కాంగ్రెసు సభ్యులకూ వోటింగువచ్చినప్పుడు తప్ప తదితర సందర్భాలలో సన్నిహితత్వం లేనంతవరకూ అది సాధ్యం కాదు. కాంగ్రెసులో క్రమశిక్షణలేదు. చాలా ముఠాలున్నవి. చిన్న చిన్న తగాదాలు పేచీలూ కనబడుతూన్నవి. మన సంస్థయొక్క ఆంతరంగిక వ్యవహారాలకు సంబంధించినంతవరకు మనవారికి అహింసలో నమ్మకమున్నట్లు కనబడడంలేదు. నేనెక్కడకు వెళ్ళినా మనపైన యిదే ఆరోపణ. అసలు సంస్థకే మోసం వచ్చేటట్లుగా ముఠాలుకట్టి ఒకరితో ఒకరు పోట్లాడుకోవడమే ప్రజాస్వామ్యమని నేననుకోవడంలేదు. అదీకాక మన సంస్థ, కేవలం ప్రజాస్వామ్య సంస్థయేకాదు. పోరాటం నడపవలసిన సంస్థ కూడాను. మన పోరాటం యింకా పూర్తికాలేదు. మనం పోరాటంలోనికి నడవవలసి వచ్చినప్పుడు ప్రజాస్వామ్యం ఉండదు. సేనానాయకుని ఆజ్ఞలకు ఎదురుచెప్పక నడచుకోవలసిన సైనికులవలెనే మన నాయకుని ఆదేశాన్ని మాఱుమాటాడక శిరసావహించాలి. ఆయనమాటే మనకు శాసనం. నేను మీ సర్వసైన్యాధిపతిని. అనగా నా మనోభావాలను మీకు తెలియకుండా దాచిపెట్టవలెనని అర్థంకాదు. చరిత్రలో యెక్కడైనా నావంటి శక్తిహీనుడు సర్వసైన్యాధిపతిగా ఉన్నాడేమో నాకు తెలియదు. నాకు వెనుక బలంలేదు. ప్రేమయే నాబలం. ఒకవిధంగా అది గొప్పవిషయమే. మఱొకవిధంగాచూస్తే అది నిరుపయోగంకూడా కావచ్చు. అందరినీ నేను హృదయపూర్వకంగా ప్రేమిస్తూన్నానని చెప్పగలను. స్వాతంత్ర్య ప్రమాణంలో ఉన్న షరతులన్నీ మీరు నిర్వర్తించితీరాలి. మీరా షరతులను నిర్వర్తించకపోతే పోరాటం ప్రారంభించటం నాకు సాధ్యంకాదు. అప్పుడు మీరు మఱొక సేనానాయకుణ్ణి చూచుకోవలసి ఉంటుంది. నా యిష్టానికి వ్యతిరే

కంగా నన్ను మీరు నాయకుడుగా ఉంచుకోలేరు. నన్ను మీరు నాయకుడుగా నియో- గించుకొంటే నా ఆజ్ఞలను మీరు శిరసావహించితీరాలి. దానినిగూర్చి యిక వాద ప్రతి వాదనలతో పనిలేదు. నాకున్న బలం ప్రేమయే గనుక ప్రేమతోను సహనంకూడా ఉండవలెనని నేను మిమ్ములను కోరుతూన్నాను. కొంతమంది మిత్రులు చర్ఖానుగూర్చి విమర్శించారు. మీరందరూ జైళ్ళకు పోవడానికి సంసిద్ధంగా ఉన్నారని నాకు తెలుసు. కాని అందుకు తగిన త్యాగంచేసి జైళ్ళకుపోయే హక్కును సంపాదించాలి. మీరేవో తప్పుడుపనులుచేసి జైళ్ళకు పోవడంలేదు.

"చర్ఖా, ఖాదీలనుగూర్చిన నా మతం 1920 నుండీ అమలులోనే ఉంది. తరువాత మీకీవిషయాలలో ఏమైనా ఎక్కువ తెలిసిందేమో నేను మాత్రం మునుపటి మోస్తరు గానే ఉన్నాను. అహింసనుగూర్చి నేనాలోచించిన కొద్దీ దానిలో ఎక్కువ సుగుణాలు కనిపిస్తూన్నవి.

"నేను 1918 నుండీ చట్టాలను ధిక్కరిస్తూనే ఉన్నాను. అంతకు పూర్వం నేను సామ్రాజ్య భక్తుడుగా ఉండేవాణ్ణి. బ్రిటిష్ వారికి తన హృదయంలో ఎంత సామ్రాజ్య భక్తి ఉంటుందో నాకుకూడా అంత సామ్రాజ్యభక్తి ఉండవలెనని నేను వాంఛిస్తూన్నట్లు ఒకప్పుడు ఛెమ్స్‌ఫర్డ్ ప్రభువుకు వ్రాశానుకూడా. నేను సత్యంలో నమ్మకం కలవాణ్ణి కావడంచేత నేనా మాటలువ్రాశాను. సత్యమే నా దేవుడు. నా మనస్సులోఉన్న నిజం చెప్పవలెనంటే నేనంతకంటె వేరుగా వ్రాయలేకపోయినాను. సత్యాహింసలకు భిన్నమైన మార్గాలు మీ కనేకం ఉండవచ్చును. నాదిమాత్రం ఆ పురాతన మార్గమే. కాని నేనూ మీవంటి మానవమాత్రుణ్ణే కావడంచేత నేనుకూడా తప్పులు చేస్తూంటాను. నేను మహాత్ముడనని కలలోకూడా అనుకోవడంలేదు. దేవుడి దృష్టిలో మనమంతా ఒక్కటే. నాకు హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు, హరిజనులూ అందరూ సమానమే. ఖాయిదే ఆజమ్ జిన్నానుగూర్చి నేను మలకనగా మాట్లాడజాలను. ఆయన నా సోదరుడు. ఆయన నన్ను నిజంగా తన జేబులో ఉంచుకోగలిగితే నేను సంతోషిస్తాను. నాలో విశ్వాసం లేని మహమ్మదీయుడు లేడని నేను చెప్పగలిగినకాలం పూర్వం ఒకటి ఉంది. అటువంటి స్థితి నేడు లేకపోవడం నాదురదృష్టం ఉర్దూ పత్రికలలోపడే విషయాలన్ని నేను చదవడంలేదు. బహుశా వాటిలో నన్నుగురించి చాలా తిట్లు ఉండే ఉంటవి. అందుకు నేను విచారపడను. హిందువులకూ మహమ్మదీయులకూ మధ్య సమాధానం కుదరందే స్వరాజ్య స్థాపన సాధ్యంకాదని నేనిప్పటికీ నమ్ముతూన్నాను. అయితే పోరాటం పోరాటం అంటూ మాటిమాటికి ఎందుకు కేకలు పెడతారని మీరు నన్ను అడుగవచ్చును. నేననే పోరాటం

రాజ్యాంగనిర్మాణ పరిషత్తుకోసం. ముస్లిమ్ వోట్లవల్ల ఎన్నుకోబడిన ముస్లీములు, హిందువులకూ, ముస్లీములకూ ఏ సందర్భంలోనూ పొత్తుకుదరదని స్పష్టంగా చెప్పినప్పుడు మాత్రమే నేను పూర్తిగా నిరాశ చేసుకొంటాను. అప్పటికూడా నేను వారితో వాదించగలను. వారు ఖురాను చదువుతూంటారుగదా! నేనుకూడా ఆ పుణ్య గ్రంథాన్ని కొంతవరకు పఠించాను. హిందువులను వేరుగా మహమ్మదీయులను వేరుగా దేవుడు భావించిడంలేదని నేను వారికి మనవి చేస్తాను. జెట్లండు ప్రభువుకు గాయం తగిలినప్పుడు నాకు చాలా బాధ కలిగింది ఆ గాయం నాకే తగిలిందనుకొన్నాను నేను. మీకు నేను కావలెనంటే ఇందులోని అంతరార్థాన్ని మీరు గ్రహించాలి ప్రతిపక్షుల హృదయంలో సుహృద్భావాన్ని కలిగించడమే నా నిరంతర ప్రయత్నం. నేను బ్రిటిష్ సామ్రాజ్య తత్వంతో పోరాడుతూనే ఉంటాను. కాని ఆ సామ్రాజ్య యంత్రమును నడిపే వారితో నాకేమీ విరోధంలేదు. వారు నాశనం కావాలని నేను కోరను. వారిలో మార్పు రావాలని కోరుతాను.

"సమాధానం కుదుర్చుకోవడం నా స్వభావమనే సంగతి మీరు గుర్తించాలి. అవసరమైతే నేను రాజప్రతినిధి సన్నిధానానికి యాభైసార్లయినా పోతాను. జనరల్ స్మట్సుతో నేను పోరినప్పుడు, పోరాటం తప్పించుకోవడానికి వీలుంటుందేమో చూడమని తుది క్షణంలో ఆయనకు టెలిఫోనువార్త పంపినాను. ఆయన కోపంతో నావార్త వినడానికికూడా నిరాకరించారు. అందువలన ఆయన నన్నవమానించినదేమీలేదు, కాబట్టి నేనేమీ విచారపడలేదు. ఇప్పుడు మేమిద్దరమూ చాలా గొప్ప స్నేహితులమనే సంగతి మీకందరికీ తెలుసు. నేను రాజీ పడతానని మీకనుమానముండవచ్చును. కాని నారాజీ దేశానికి నష్టదాయకంగా ఉండదనిమాత్రం నమ్మండి. ఇండియాను నేను అమ్మివేయను. నేనుచేసే ప్రతి పనీ మనదేశం బలిష్టం కావడానికే చేస్తాను. ప్రతిపక్షి యెడల ప్రేమ గలిగిఉండడమే నా పోరాటానికి పునాది; ఇంగ్లీషువారి యెడల, నచ్చివారియెడల, నా హృదయంలో ప్రేమలేకపోయినట్లయితే దక్షిణ ఆఫ్రికాలో వారితో నేను పోరాడగలిగి ఉండేవాణ్ని కాదు.

"తీర్మానంలోని. శాసనోల్లంఘనమునకు సంబంధించిన భాగంలో సమిష్టి (Mass) అనేమాట లేదని ఒకరన్నారు. అది సమిష్టి శాసనోల్లంఘనమే కాకపోయినట్లయితే నేను మీకడకు రావలసిన అవసరమేముంది? వేళ్ళమీద లెక్కపెట్టగలిగిన యే కొద్దిమందో చేయదగిన సత్యాగ్రహమైనట్లయితే నేను మీతో వాదిస్తూ యిక్కడ కూర్చోనక్కరలేదు. ఈ విషయాలను మీరు బహుశా అంతశ్రద్ధగా గమనిస్తూండకపోవచ్చు. నా మనస్సులో ఈ విషయంతప్ప మరొక ఊహ లేనే లేదు. మీ సహాయ

-సహకారములతో ఈ మహాప్రయోగమును ఆచరణలో పెట్టి చూడవలెననే అభిప్రాయంతోనే నామనస్సంతా లగ్నమయి ఉంది. ఈ నా ప్రయత్నం జయప్రదమైనట్లయితే ఇది ఇండియాకేగాక ప్రపంచానికంతకూ కూడా శ్రేయస్కరంగా ఉంటుంది.

"కాబట్టి ప్రతికాంగ్రెసు సంఘమూ ఒక సత్యాగ్రహకేంద్రంగా ఉండాలి. అప్పుడిక ప్రజాస్వామ్యం ఉండదు. సత్యాగ్రహానికి సంబంధించినంతవరకు ప్రజాస్వామ్యసంస్థ అయిన మన కాంగ్రెసు నేను చెప్పినట్లు స్పష్టంగా వినితీరాలి. అలా జరగక పోయినట్లయితే మనను అనుగమించే లక్షలాది ప్రజలు ఆహుతి అయిపోతారు. అది నేను జరుగనీయను. ఇండియాకు లభించే శక్తిని నిలబెట్టడానికి నేను నా ప్రాణాలను కూడా ఒడ్డవలసి రావచ్చును. అవి యేవో మీరు నేడు వివరించి చెప్పలేక పోవచ్చును. కాని ఇండియాకాశక్తి ఉన్నది అది అహింసాశక్తి.

"ఎవరైనా పోరాటం ప్రారంభించగలిగిన వారున్నట్లయితే నేనందులోకి రాదలచుకోలేదు. అటువంటివారు కాంగ్రెసుకు వెలుపల తమ పోరాటాన్ని సాగించవచ్చును. వారు కాంగ్రెసులోనే ఉండదలచుకొన్నయెడల కాంగ్రెసు నీతినీ, కార్యక్రమాన్నీ అనుసరించాలి. అయితే కాంగ్రెసులో ఉండికూడా కాంగ్రెసును ధిక్కరించడానికి సావకాశముంది. కాని అది సత్యాగ్రహ పంథా కాదు. సత్యాగ్రహాయుధాన్ని ప్రయోగించిన వారికెవరికీ అది అపకారిగా పరిణమించదు. ఈ తీర్మానాన్ని మీరామోదించినంత మాత్రాన మీరు దీనికిప్పుడప్పుడే బద్ధులైఉన్నట్లు భావించనక్కరలేదు. దీనిని రద్దుచేయించడానికింకా మీకవకాశముంది. మీకు వేరేపద్ధతి యేదైనాఉండిఉండవచ్చును కాని నాకు సంబంధించినంతవరకు మాత్రం ఒకటేపద్ధతి ఉంది. అది పాతపద్ధతే. దానిని అనుసరించిన వారికెప్పుడూ అపకారం జరగలేదని నాకు తెలుసు. ఈ నాడుకూడా మీ సంపూర్ణసహాయ సహకారములున్నట్లయితే ఒక నెలరోజులలో యేమి జరుగుతుందో మీకు నేను ప్రత్యక్షం చేయగలను."

## మహాసభ

## 20-3-1940

"సవరణలను ప్రతిపాదించిన వారు మాట్లాడుతూండగా వినే అవకాశం నాకు లభించినందుకు చాలా సంతోషం. వారి పెదవులపైన సత్యాగ్రహం అనేమాట నృత్యం చేస్తూన్నది. ఇది విన్నప్పుడు నాకు, "ప్రభూ! ప్రభూ! అని కేకలు వేసినవారుగాక జీవుని యిష్టానుసారం ఆచరించినవారే ఆయనను చూడగలరు." అని బైబిలులో చెప్పిన

సుభాషితం జ్ఞాపకం వస్తూన్నది. (హర్షధ్వనులు) మీ హర్షంతో నాకు నిమిత్తంలేదు. మీహృదయాలూ మీ విజ్ఞానమూ కావాలి. ఈ హర్షధ్వనులు జేజేలూ వాటిని సంపాదించి పెట్టజాలవు. కాబట్టి 'సత్యాగ్రహం' 'సత్యాగ్రహం' అని కేకలు పెట్టిన వారంతా సత్యాగ్రహం చేస్తారని అనుకోవద్దు. సత్యాగ్రహంకోసం కృషిచేసినవారే సత్యాగ్రహం చేయగలరు. అంతేకాదు. మీరెన్నుకొన్న నాయకుని ఆజ్ఞలను 'తూ' 'చా' తప్పకుండా నడచుకోగలిగిఉండి ఆయన నిషేధించిన పనులను మానుకోగలిగి ఉండడమే సత్యాగ్రహముయొక్క సారం. సరియైన భావంతో సత్యాగ్రహాన్ని నడపక పోయినట్లయితే విజయం కలుగదు; స్వరాజ్యం రాదు.

"బానిసత్వమును విదల్చివేసి స్వాతంత్ర్యమును పొందడం మన కర్తవ్యమని మీలో కొందఱన్నారు. వారిని నేను విశ్వసిస్తూన్నాను. అయితే మనమా పని యెలా నిర్వహించాలి. కొంతమంది బందిపోటు దొంగలు మనయింట్లో చొరబడి మనను బయటకు వెళ్లగొట్టినప్పుడు వాళ్ళతోపోరాడి మనయింటిని మళ్లీ మనం లాక్కోవడం మన ధర్మమనేమాట నిజమే. కాని ఆపని ఎలాచేయడం? మనం దానికొక ఉపాయంపన్ని ఆ ప్రకారం పనిచేయాలి. అందువలన, మనమంతా సంసిద్ధంగా ఉన్నామని చెప్పిన ఉపన్యాసకుణ్ని ప్రోత్సహిస్తూ మీరు హర్షధ్వనులు చేసినప్పుడు నేనాశ్చర్యచకితుణ్ని అయినాను. మనం సిద్ధంగాలేమని నాకు తెలుసు. తెలిసిఉండికూడా పోరాటం ప్రారంభించండని నేను మిమ్ముల నెలా కోరగలను? మీవంటివాళ్లతో పోరాటం ప్రారంభిస్తే అపజయంతప్పదని నాకు తెలుసు. నేనెప్పుడూ అపజయాన్నికోరను అపజయమంటే యేమిటో నేనెఱుగను. రాజకోటలోకూడా నాకపజయం కలుగలేదు. రాజకోటనుగూర్చి మీరన్యథా అనుకొంటే అనుకోవచ్చును. నా నిఘంటులో అపజయమనే మాట కనిపించదు. నా సైన్యంలో చేర్చుకోవడానికి మేము నిర్ణయించుకొన్న ప్రతిమనిషీ సత్యాగ్రహికి అపజయమనేది లేదని నిశ్చయించుకోవచ్చును.

"చర్ఖాతో తనకేమీ విరోధంలేదంటూనే సత్యాగ్రహంతో చర్ఖాకు సంబంధం లేకుండా చేయవలసిందని ఒకానొక ఉపన్యాసకుడు సెలవిచ్చాడు. అయితే నేనొక మాట చెప్పాలి మీకు. ఆ మాట ఇరవైసంవత్సరాలనుండీ నేను చెబుతూన్నమాటే. చర్ఖాకు సత్యాగ్రహానికి అత్యంత సన్నిహిత సంబంధమున్నదని నేను చెబుతూన్నాను. అది కాదని ఇతరులు అంటూన్నకొద్దీ ఆ సిద్ధాంతంలో నా కంతకంతకు విశ్వాసమెక్కువవుతూన్నది. కాకపోయినట్లయితే గ్రాంతింబవళ్లు, ఇండ్లలోనూ, రైళ్లలోకూడా, వైద్యులు వద్దంటూన్నప్పటికీ, యింత నిష్ఠగా చర్ఖాతిప్పడానికి నేను మూర్ఖుణ్ని కాదు. మీరందరూకూడా మీ అంతశ్శక్తి శ్రద్ధలతో చర్ఖా తిప్పవలెనని కోరుతున్నాను. ఈ

పని మీరు చేయకపోతే, మీరు నిష్ఠగా ఖద్దరు ధరించకపోతే నన్నూ ప్రపంచాన్నికూడా మోసం చేసిన వారవుతారు.

"అహింసను ప్రబోధిస్తూనే నేను మరణించడం సహజం కాని అహింసను నేను బద్ధుడనయినట్లుగా మీరు బద్ధులు కారు. కాబట్టి మీయిష్టంవచ్చిన మరొక కార్యక్రమాన్ని చేబట్టి మన దేశాన్ని స్వతంత్రంచేయడానికి మీకధికారం ఉంది. కాని మీరీపనిచేయక, రాటమూతిప్పక నన్ను పోరాటం ప్రారంభించమంటే అది అసాధ్యమైన విషయం.

"నేను మీతో కలిసి వస్తేనేగాని మీరు పోరాటం సాగించరని నాకు తెలుసు. అయితే నేనెవరికోసం జీవిస్తూన్నానో ఎవరికోసం నా ప్రాణాలనుకూడా ఒడ్డదలచుకొన్నానో ఆ నోరూ వాయీలేని కోట్లాది ప్రజల ప్రతినిధిగానే నేనిక్కడ ఉన్నాననీ వారి పక్షానే నేను పోరాటం సాగిస్తాననీ మీరు తెలుసుకోవాలి. వారమీద నాకున్న విశ్వాసం యింకెవరిమీదా లేదు. మీరు నన్నువిడిచిపెట్టినాసరే, హత్యచేసినాసరే నేనుమాత్రం వారికోసం చర్ఖాను విడిచిపెట్టజాలను. చరఖాకు సంబంధించిన షరతులను నేనేమాత్రం జారవిడిచినా, ఏ మూగప్రజ పక్షాన నేను దేవుడికి జవాబు చెప్పవలసి ఉందో ఆ మూగప్రజను నాశనం చేసిన వాణ్ణవుతానని నాకు తెలుసు. కాబట్టి చర్ఖాయందు నాకెటువంటి నమ్మకం ఉందో అటువంటి నమ్మకం మీకు లేనట్లయితే నన్నింతటితో విడిచిపెట్టమని నా ప్రార్థన. రాటం సత్యాహింసల బాహ్యచిహ్నం. మీ హృదయాలలో సత్యాహింసలకు స్థానంలేకపోతే మీరు చర్ఖాను చేపట్టజాలరు. కాబట్టి మీరు ఆంతరంగిక షరతులను బహిరంగషరతులనూ కూడా సక్రమంగా నిర్వహించవలెననేమాట జ్ఞాపకం ఉంచుకోండి. ఆంతరంగిక షరతులను సరిగా నిర్వర్తించినట్లయితే మీ ప్రతిపక్షులను మీరు ద్వేషించడం మానివేస్తారు. వారు నాశనం కావలెనని కోరరు; అందుకోసం పనిచేయరు. వారిపైన దేవుడు దయకలిగి ఉండవలెననీ కూడా కోరతారు. కాబట్టి గవర్నమెంటువారి దుశ్చేష్టలను బయటపెట్టడంలోనే మీశక్తిని వినియోగించకండి. ప్రభుత్వయంత్రాన్ని నడిపేవారికి హృదయపరివర్తనం కలిగించి మనం వారిని స్నేహితులనుగా చేసుకోవాలి. ఇంతా అయితే ఎవ్వడూ సహజంగా దుర్మార్గుడై ఉండడు. ఇతరులు దుష్టులయినట్లయితే మనంమాత్రంకామా? ఇటువంటి దృక్పథం సత్యాగ్రహసిద్ధాంతంలో స్వతస్సిద్ధంగా ఉంది. అది మీరంగీకరించకపోతే అప్పుడుకూడా మీరు నన్ను వదలివేయవచ్చు. నాకార్యక్రమంలో మీకు విశ్వాసం లేక నే పెట్టిన షరతులను మీరంగీకరించకపోతే మీరు నన్ను నాశనంచేస్తారు. మీరు నాశనమవుతారు. మన పని పాడవుతుంది.

## ప్రతికాంగ్రెసు సంఘమూ ఒక సత్యాగ్రహ సంఘం

రామఘర్ కాంగ్రెసు విషయనిర్ధారణసభలో ప్రతికాంగ్రెసుసంఘమూ సత్యాగ్రహ సంఘంకావలెనని ఎంత ఆలోచించిఅన్నానో, నేను చెప్పిన తక్కినమాటలన్నీ కూడా అంత ఆలోచించియే చెప్పినాను సత్యాగ్రహ సేనలోచేరి సేవచేయదలచుకొన్న ప్రతికాంగ్రెసువాదీకూడా నేను రామఘర్ లో యిచ్చిన రెండు ఉపన్యాసాలనేగాక హరిజన్ లో అప్పుడప్పుడూ సత్యాగ్రహుంకోసం వ్రాసే విషయాలను కూడా చదువుతూండాలని నాకోర్కె.

"పోరాటమే వచ్చేటట్లయితే ఆ రానున్న పోరాటంలో సగం సగం శ్రద్ధయే మాత్రమూ పనికిరాదు. అనుమానంతో అసంసిద్ధంగా ఉన్న సైన్యంతో దండయాత్ర చేస్తే యేమవుతుందో ఆలోచించండి! అది తప్పకుండా అపజయానికే దారితీస్తుంది. అటువంటి వినాశకరమైన పని నేనెప్పుడూ తెలిసి ఉండి చేయను. ఈ నామాటలు కాంగ్రెసువాదులను భయభ్రాంతులనుగా చేయడానికి నేను చెప్పడంలేదు వారికి యిష్టముంటే నా ఉత్తరువులను అనుసరించడం వారికెంతమాత్రమూ కష్టంకాదు. చరఖాలోగాని, నాలోగానీ విశ్వాసం లేకపోయినప్పటికీ క్రమశిక్షణను పాటించే ఉద్దేశంతోనే వారు రాటం తిప్పుతూన్నామని కొందఱు నాకు ఉత్తరాలు వ్రాస్తూన్నారు. ఈ వాక్యాలు నాకర్థం కావడంలేదు. సైనికులకు తనపైన నమ్మకం లేదని తెలిసీ ఆ సైన్యంతో యే సేనానాయకుడైనా పోరు సాగించగలడా? నాకీ ఉత్తరాలు వ్రాసే వారి మాటలవలన వారికి సమిష్టి సత్యాగ్రహంలో విశ్వాసం ఉన్నదనీ, కాని అది అహింసాత్మకంగా ఉండవలెనంటే దానికీ చరఖాకూ గల సన్నిహిత సంబంధంలో విశ్వాసం లేదనీ,స్పష్టంగా అర్థమవుతూన్నది. నాకు ప్రజాసామాన్యంపైన పలుకుబడి కలదనికూడా వారు నమ్ముతూన్నారు. కాని నా కా పలుకుబడి యెందువలనవచ్చిందని నేననుకొంటూన్నానో, ఆవిషయాలలో వారికి నమ్మకంలేదు. వాళ్లు నన్నుపయోగించుకొని (వారనుకొనే ప్రకారం) నా మొండి పట్టుదలవలననో అజ్ఞానం వలననో నేను కోరే కోర్కెలను ముక్కుతూ మూలుగుతూ నిర్వర్తించదలచుకొన్నారని దీనికర్థం. దీనిని క్రమశిక్షణ అనను నేను. హేతువాదానికి సంతృప్తికరంగా ఉండకపోయినప్పటికీ పైవారి ఉత్తరువులను ఉత్సాహంతో అనుసరించడమే నిజమైన క్రమశిక్షణ అవుతుంది; నాయకుణ్ణి ఎన్నుకొనేటప్పుడు స్వచ్ఛందసైనికుడు తన హేతువాదాన్ని ఉపయోగించవచ్చును. కాని ఒకసారి ఎన్నిక జరిగినతరువాత పై అధికారి యిచ్చిన ప్రతి ఉత్తరువునూ అనుసరించేముందు విమర్శించి తన హేతువాదానికది అనుకూలంగా

ఉందా లేదా అని పరిశీలిస్తూ ఆయన కాలయాపన చేయను. ఇక నాయకుల ఉత్తర్వులనుగురించి ప్రశ్నించే పని యెవ్వరికీ లేదు. ఇవి నా ఆదేశాలు :-

“ప్రతి కాంగ్రెసు సంఘమూ సత్యాగ్రహ సంఘంగా తయారుకావాలి. కాంగ్రెసువాదులుగా ఉండే ప్రతివారియెడల సుహృద్భావం కలిగి ప్రవర్తించకలవారినీ ఏ రూపంలోనూ అస్పృశ్యతను పాటించనివారినీ, ప్రతిరోజూ తప్పకుండా నూలువడికే వారినీ ఇతరవస్త్రములను వేటినీ ఉపయోగించక నిత్యమూ ఖద్దరును మాత్రమే ధరించేవారినీ సత్యాగ్రహుల పట్టీలో చేర్చుకోవాలి. ఎవరైతే తమ కమిటీదగ్గర తమ పేర్లను సత్యాగ్రహుల పట్టీలో చేర్పించుకొని ఉంటారో వారందరూ తీరిక సమయంలో నిర్మాణ కార్యక్రమం కొనసాగించగలరని ఆశిస్తున్నాను. ఈ విధంగా శ్రద్ధగా పనిచేస్తే ఈ సత్యాగ్రహ సంఘాలన్నీ నిరంతరాయంగా కొనసాగే వసుకుమాలు పరిశ్రమాలయాలు కాగలవు. వీరంతా అ. భా. కాం. సం. యొక్క శాఖలన్నిటితోనూ సంబంధం పెట్టుకొని వాటి నాయకత్వం కింద అనుకొన్న ప్రకారం పనిచేసినట్లయితే సత్యాగ్రహ సంఘాలన్నీ ఖాదీతప్ప మరొక వస్త్రము దేనినీ ధరించని వారితోనే నిండి ఉండగలవు. సత్యాగ్రహ కమిటీలు చేస్తూన్న పనినిగూర్చి ఎప్పటికప్పుడు రాష్ట్రాలనుండి అఖిలభారతకాంగ్రెసుసంఘానికి సక్రమమైన నివేదికలు పంపబడవలెను. సత్యాగ్రహుల పట్టీలో పేర్లు చేర్పించుకోవడం కేవలం స్వచ్ఛందంగా జరుగవలసిన పనిగనుక, కాంగ్రెసు కమిటీలలో సత్యాగ్రహులుగాచేరిన సభ్యుల పేర్లున్నూ చేరని సభ్యుల పేర్లున్నూకూడా నివేదికలందు చూపబడవలెను. పట్టీలో చేర్చుకోబడిన సత్యాగ్రహులు ప్రతిరోజూ తాము చేసేపనులను తెలియచేసే దినచర్య పుస్తకం ఒకటి ఉంచవలెను. వారు నూలు వడకడమేగాక, ప్రాథమిక సభ్యుల దగ్గరకు పోయి వారిని నూలువడికేటట్లు, ఖద్దరునే ఉపయోగించేటట్లు సత్యాగ్రహ జాబితాలో పేర్లను చేర్పించుకొనేటట్లు ప్రోత్సహించవలెను వారీ పనులు చేసినా చేయకపోయినా వారితో సత్యాగ్రహులు సన్నిహిత సంబంధం కలిగిఉండవలెను.

“హరిజనుల యిండ్లకుపోయి వారి కష్టములను సాధ్యమైనంతవరకు సత్యాగ్రహులు తొలగించవలెను.

“బుద్ధిపూర్వకంగా కారాగార శిక్షను అనుభవించగలిగిన వారుమాత్రమే సత్యాగ్రహుల పట్టీలో చేర్చుకోబడవలెనని వేరే చెప్పనక్కరలేదు.

“తమకుగానీ తమపైన ఆధారపడి ఉన్నవారికిగానీ, ఆర్థికసహాయం లభిస్తుందని సత్యాగ్రహ ఖైదీలాశించకూడదు.

"ఇది కార్యతత్పర సత్యాగ్రహులకు (Active Satyagrahis) సంబంధించినది. ఇంకా ఇంతకంటే చాలా ఎక్కువమంది స్త్రీలు పురుషులు మరొక తరగతివారున్నారు. వారు నూలు వడకకపోయినా, జైలుశిక్షను కోరకపోయినా, అనుభవించకపోయినా, సత్యాగ్రహంలోని ప్రధాన సిద్ధాంతాలను రెంటినీ నమ్ముతారు. వారీఉద్యమానికి శుభంకోరుతూ యిది కొనసాగాలని వాంఛిస్తారు. వారికీ నేను సాత్విక సత్యాగ్రహులని (Passive Satyagrahis) పేరుపెడుతూన్నాను. వారు తాము స్వయంగా కారాగార శిక్షను కోరితెచ్చుకొని జరుగుతూన్న సత్యాగ్రహ సమరంతో జోక్యం కల్పించుకోకుండానూ, కూలీలయొక్కయు విద్యార్థులయొక్కయు సమ్మెలకు సహాయ ప్రోత్సాహములు చేయకుండానూ ఉంటే వారు కూడా కార్యతత్పర సత్యాగ్రహులతో పాటే సత్యాగ్రహ సమరానికి దోహదంచేసిన వారవుతారు. ఎవరైనా అత్యుత్సాహంతో గానీ, మరేకారణంతోగానీ, ఈ నా సూచనలకు వ్యతిరేకంగా నడచుకొనేయెడల, మన పోరాటానికి వారు హానిజేసిన వారవుతారు. అందువల్ల నేను ఉద్యమాన్ని ఆపవలసివస్తే కూడా రావచ్చు, ప్రపంచమంతా హింసాశక్తులు విజృంభిస్తూన్నప్పుడు, ఉత్కృష్టసభ్యతాజాతులని పేరుమోగినవారే తమలోతమకు తటస్థించిన వివాదాలను పరిష్కరించుకోవడానికి ఆయుధ బలమును మించిన మరొక బలాన్ని ఊహించలేకుండా ఉన్నప్పుడు, ఇండియాదేశం శాంతిపద్ధతులతో స్వాతంత్ర్య సమరాన్ని సాగించి జయం పొందిందని చెప్పుకోవడానికి సావకాశం కలుగగలదని ఆశిస్తూన్నాను.

"ఇండియాలోని రాజకీయ చైతన్యంకలవారు నాతో సహకరిస్తే నిష్కళంకమయిన అహింసద్వారా భారత స్వాతంత్ర్య సంపాదనం పూర్తిగా సాధ్యపడుతుందని నాకు స్పష్టంగా తెలుసు. ప్రపంచంమాట అలా ఉంచండి. మన హృదయాలలో దౌర్జన్యభావాలు కలవనీ, మన ఆంతరంగిక వ్యవహారాలలోగూడా పరస్పరం దౌర్జన్యయుతంగా ప్రవర్తిస్తూన్నామనీ, నాయకుడనని పిలుచుకొంటూన్న నేనే ఒప్పుకొంటూన్నాను. మనలో దౌర్జన్యం ఉన్నంతకాలమూ మనం పోరాటం సాగించజాలమని నేనంగీకరించక తప్పదు. అయినప్పటికీ నేను సూచించిన పట్టీని న్యాయంగా తయారుచేసి ఉంచేను, ధైర్యంతో మన ఉద్యమానికి దూరంగాఉన్నవారు సవ్యంగా సాగిపోతూన్న పోరాటానికి అభ్యంతరం కలిగించకుండా వుంచేనూ, నేను తప్పక విజయం తీసుకొనిరాగలను.

"అహింసాచర్య అంటే ప్రపంచ సుహృద్భావం మనయందు ఉండేటట్లు ప్రవర్తించడం. ప్రపంచంలో ఆలోచనాపరులైన అనేకమంది స్త్రీ పురుషులు యుద్ధంఅంటే విసిగి వేసారి ఉన్నారు. వారు శాంతిస్థాపనకోసం వాంఛిస్తూన్నారు! ఇండియా ఆ మార్గం చూపగలదని ఎదురు తెన్నులు చూస్తున్నారు. మనం నిజంగా అహింసాతత్పరులం కాని

యెడల వారి మనస్సులు మనకనుకూలంగా ఉండవు. నిజమైన సత్యాగ్రహులు ఏ కొద్ది మందితోనైనా నేను పోరాటం సాగించగలను. కాని నాకు విశ్వాసంలేని బ్రహ్మాండమైన సైన్యం పెట్టుకొని, వారి ప్రవర్తనయెట్టిదో నాకుసరిగా తెలియకుండానే పోరాటం సాగించడం అంటే నాకెంతో బలహీనంగానూ చీకాకుగానూ తోస్తుంది.

"అఖిలభారత కాంగ్రెసుసంఘం సత్యాగ్రహ కమిటీలను నిర్మించి వాటి క్రమాభివృద్ధినిగూర్చి అప్పుడప్పుడు నివేదికలు పంపవలెనని నా కోరిక. ఈ విషయంలో ఒక నెలలో జరిగినపని ప్రోత్సాహకరంగా ఉన్నట్లయితే సత్యాగ్రహకమిటీలను సరియైన కార్యనిర్వహణంలోకి తీసికొని రావడానికి యెంతకాలం పడుతుందో ఊహించవచ్చును."

యావద్భారతదేశంలో గాంధీజీ 71 వ జన్మదినోత్సవాలు జరిగిన విధానమును గూర్చి ముచ్చటించకుండాపోతే 1939 నాటి చరిత్ర పూర్తి అయినట్లుకాదు. 1939 అక్టోబరు రెండునాటికి మన ఉపనిషద్వాక్యాలలో చెప్పినట్లు గాంధీకి 70 యేళ్లు నిండి 71 వ సంవత్సరం వచ్చింది. అయినప్పటికీ ఆయన ఆరోగ్యం యెప్పటివలెనే ఉంది. ఆయన కొంత బలహీనంగా ఉన్నాడు. అందువలన ఆయన మామూలుగా చేసే సంచారాలు కొంత తగ్గించవలసివచ్చింది. కాని కూర్చొనిచేసే పని కాయనకు ఎక్కువ సావకాశం కలిగింది. యూరపులో నడుస్తూన్న భయంకర సంగ్రామంయొక్క విషాదసంఘటనకు ప్రతిగా ఆయన అహింసాసందేశం ధ్రువనక్షత్రంవలె వెలుగొందింది. గాంధీజీకి ప్రియమైన నిర్మాణ కార్యకలాపంలో నిమగ్నమై దేశం మామూలుగా ఒక పక్షం రోజులాయన జన్మదినోత్సవాన్ని జరిపింది. ముఖ్యంగా ఖద్దరు ప్రచారమూ, ఖాదీ అమ్మకంలో భారతజాతి అత్యంత శ్రద్ధవహించింది. ఖాదీ ప్రచారకులు దేశమంతటా అంతకుపూర్వం నిలవ ఉన్న ఖాదీ బేళ్ళను విరివిగా అమ్మివేశారు. బహిరంగ సభలలో గాంధీజీ జీవితమునుగూర్చి, ఆయన సందేశాలనుగూర్చి, ఆయన తత్వోపదేశమునుగూర్చి ప్రజలకు విపులంగా యెంతమందో నాయకులుపన్యసించారు. ఆయనను అభినందిస్తూ తీర్మానాలుకూడా చేయబడ్డవి. అనేక పత్రికలు గాంధీ జయంతికి ప్రత్యేక సంచికలను వేసినవి. కొన్ని పత్రికలు ఆయన జీవితమునుగూర్చి, ఆయన కావించిన ఘన కార్యములనుగూర్చి మంచి మంచి వ్యాసములను ప్రకటించినవి. కాశీ విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు సర్. సర్వేపల్లి రాధాకృష్ణ, గాంధీకి సంబంధించిన వ్యాసరాజములతోనూ, వ్యాఖ్యానములతోనూ ఒక సుప్రసిద్ధ సంపుటమునుకూర్చి గాంధీ జన్మదినోత్సవ సందర్భమున ఆయనకు బహూకరించాడు. ఆ పుస్తకం వివిధరంగాలలో ప్రఖ్యాతి వహించిన ప్రసిద్ధపురుషులు ప్రపంచంలోని పలుతావులనుండి గాంధీనిగూర్చి వ్రాసిన

ప్రశంసావాక్యములకూర్పు. గాంధీజీ చిరంజీవిగా నుండవలెననీ, ఆరోగ్యవంతుడుగా నుండవలెననీ ఆయన అహింసా' శాంతి' సుహృద్భావ సందేశములు విజయం పొందవలెనని కోరుతూ ప్రపంచంలోని అనేక సంస్థలూ ప్రముఖులూ ఆయనకు అభినందనములను అందజేశారు. ప్రతి కాంగ్రెసులోనూ అప్పటికి జరిగిన సంఘటనల నన్నిటినీ అంచనా వేసి లాభనష్టములను పరిశీలించడం సహజం. 1940 వ సంవత్సరానికి క్రొత్తగా వ్రాయబడిన స్వాతంత్ర్య ప్రమాణంలో ఖద్దరునుగూర్చి కొత్తగా కొంత చేర్చబడింది. వెంటనే రానున్న 26 వ జనవరి తేదీని చదువవలసిన ఈ ప్రమాణపత్రంలో ఖద్దరునుగూర్చి చేర్చబడిన భాగమునకు అభ్యంతరంవచ్చింది. ఈ భాగంలోని అభిప్రాయం పాతదే. కొత్తదికాదు. అందువలన కొత్త అభిప్రాయమేమీ ఈ ప్రమాణపత్రమునకుచేర్చబడలేదు. ఇదివరకున్న పాతవిషయమే మఱికొంచెం నొక్కిచెప్పబడింది. కాంగ్రెసు ఆర్థిక కార్యక్రమంలో ఖద్దరుమీద చేయబడుతున్న దండయాత్రకది రక్షణగా నుద్దేశింపబడింది. దీనినాధారంగా తీసికొని ఖద్దరునుగూర్చి నిష్కపటంగా తమతమ అభిప్రాయాలాను వెల్లడించిన సోషలిస్టులనూ రాయిస్టులనూ తదితరులనూ వెంటనే అభినందించడానికి గాంధీ వెనుదీయలేదు. ఆనాడు దేశం క్లిష్టపరిస్థితుల నెదుర్కోవలసి ఉంది. గాంధీజీ ఒక్కసారి శాసనోల్లంఘనమును ప్రారంభించినయెడల సరియైన సమాధానం కుదరనిదే దానిని ఆపివేయడమనే మాటకల్ల. గాంధీజీ ప్రారంభించదలచుకొన్న అహింసాత్మక పోరాటంలో యేమాత్రమూ కత్తిపనికిరాదు. పోరాటం జయప్రదం కావలెనంటె మన సైనికులు కొన్ని అర్హతలు కలిగిఉండాలి. ఆ అర్హతలులేని సైనికులను నేను నడపజాలను. హృదయపూర్వకమైన విశ్వాసం లేనివారితో పోరాటం సాగించడం దుస్తరం. అటువంటి అవిశ్వాసపరులవల్ల మనకపజయం వస్తుంది. నా అంతట నేనే నాయకత్వం కావలెనని దేశాన్ని బలవంతపెట్టలేదు. నన్ను నియంత అనడంకంటె కా్రరం మఱొకటిలేదు" అన్నాడాయన. నిజానికి మనదేశానికి మొదటి సేవకుడైన గాంధీజీని మఱొకపేరుతో పిలవడం తప్పు. ఒకవేళ ఆయనను సర్వసైన్యాధిపతిగా చేసినను, ఎవ్వరూ అధికారంతో చేసినదికాదు. ఆయనకూ ఆయన అనుచరులకూ ఉన్న ప్రేమానుబంధమువలననూ, పరస్పర విశ్వాసంవలననూ మాత్రమే ఆయన సర్వసైన్యాధిపతి అయినాడు. పోరాటం కావలెనని మాటిమాటికీ ఆత్రపడుతూన్నవారు తమ సొంత బాధ్యతపైన పోరాటాన్ని సాగించవచ్చును. గాంధీ కార్యక్రమం కొన్ని ప్రధాన సిద్ధాంతాలపైన ఆధారపడి ఉంది. ఒకటి నూలువడకడం - రెండోది - ఇంగ్లీషువాణ్ణి ఇండియానుండి వెళ్లగొట్టడంకాక ఆయనను ఇండియాకు సేవకుడుగా మార్పుచేయడం. దీనినిబట్టి ఆయన సామ్రాజ్యతత్వాన్ని సహిస్తూన్నాడని అర్థంకాదు. 'నా ప్రేమ

పూవుకంటె మృదులంగానూ, వజ్రంకంటె కఠినంగానూ ఉంటుంది' అన్నాడాయన ఆయన పెద్దకుమారుడూ ఆయన భార్య, ఈ రెండోరకపు ప్రేమను అనుభవించారు. "నేను సుబాస్ బాబును శాశ్వతంగా పుత్రప్రేమతో చూడగలననుకొన్నాను. కాని నాకా సౌజన్యం కొఱవడింది. ఆయనపైన తీసుకోబడిన క్రమశిక్షణచర్యకు నా సంపూర్ణాంగీకారమీయవలసిన బాధ నాకు తప్పలేదు." ఇదే విధంగా ఖరే పైననూ వీరనారిమన్ పైననూ తీసుకోబడిన క్రమశిక్షణ చర్యల కాయన దిగపిల్లినాడు. ఇంగ్లీషు వాళ్లపైన కూడా ఆయన ఇదేవైఖరి అవలంబిస్తాడు. ఆయన ప్రేమ పూరిత కార్యక్రమంలోన రాటమొకభాగం. "హింసను హింసతోనే ఎదుర్కో దలచిన సంఘం ఎప్పుడూ వడుదుడుకులుగా బ్రతుకవలసిందే లేదా ఆయుధాగారములను మహానగరాలను తన రక్షణకోసం నిర్మించుకోవలెను." అని గాంధీజీ అభిప్రాయం. ఇంతకుపూర్వంనుండీ ఇండియాలో సాగుతూవచ్చిన గ్రామపాలనాపద్ధతి పరిపక్వస్థితిని పొందకపోయినప్పటికీ అహింసాయుత నాగరికతకు చాలా సన్నిహితంగా ఉంటూ వచ్చింది. చర్ఖాలోని అంతరార్థమిదే. సోషలిస్టు నాయకులైన జయప్రకాశనారాయణ, సంపూర్ణానందులు రాటమునుగూర్చి కొత్తగా ప్రమాణపత్రంలో చేర్చినందుకెంత విచ్చలవిడిగా మాట్లాడారో ఒక వారంరోజులైన తరువాత గాంధీ ఉదాహరించాడు. తన స్థితిని సోషలిస్టుపార్టీ స్థితిని వివరిస్తూ జయప్రకాశనారాయణ నిర్మాణ కార్యక్రమమునుగూర్చి హాగా చెప్పాడన్నాడు గాంధీ. జయప్రకాశ్ ఇలాఅన్నాడు. "మనపోరాటానికిది ఒక్కటే ఆయుధమనిగానీ లేక యిది తగిన ఆయుధమనిగానీ కూడా మేమెన్నడూ అంగీకరించలేదు. ఈ సందిగ్ధ స్థితిలో జాతీయ నాయకత్వము ప్రదర్శించిన నిస్సహాయతవలన మా అభిప్రాయాలను సంస్కరించుకొన్నాము. ఇటువంటి అభిప్రాయాలు గలిగిన కాంగ్రెసువాదులను వెంటవేసుకొని జయప్రదంగా పోరాటం సాగించజాలనని గాంధీ స్పష్టంగా చెప్పనేచెప్పాడు." కాంగ్రెసు నాయకత్వంలోగాని కార్యక్రమంలోగానీ జయప్రకాశకు విశ్వాసంలేదు. గాంధీజీ జయప్రకాశ్ విమర్శనునుగూర్చి యిలా అన్నాడు. "జాతీయ నాయకత్వం కోరింది కాబట్టి నేనీకార్యక్రమాన్ని అనుసరిస్తానని జయప్రకాశ అనడంవలన ఆయనకు తెలియకుండానే జాతీయ కార్యక్రమానికి న్యూనత తీసుకొనివచ్చాడని నా అభిప్రాయం. తమ ఆయుధాలలోగానీ తమ సేనా నాయకులలోగానీ విశ్వాసంలేని సైన్యం యుద్ధానికిపోతే యెంత లక్షణంగా ఉంటుందో ఆలోచించండి. అటువంటి సైన్యంవలన సైనికులకుగానీ నాయకులకుగానీ యుద్ధాశయాలకుగానీ యేమీ ప్రయోజనంలేదు. సర్వనాశనమే దాని ఫలితం. నేను జయప్రకాశ్ స్థానంలో ఉండి క్రమశిక్షణకు భంగంకాకుండా ప్రవర్తించవలెనని అనుకుంటే నాపక్షంవారిని తలు

పులు విగించుకొని లోపలకూర్చోండని సలహా యిస్తాను. అలా చూస్తూ ఊరుకోలేక పోతే, బహిరంగంగా తిరుగుబాటు చేయించి ఈ అసమర్థపు నాయకత్వంయొక్క వ్యూహాలను భగ్నంచేస్తాను. విద్యార్థులంతా పాఠశాలలూ కళాశాలలూ విడిచిరావలెననీ, కార్మికులు-పనిముట్లెక్కడవక్కడ పారేసి ఫ్యాక్టరీలను వదలి రావలెననీ జయప్రకాశ్ ప్రబోధిస్తూన్నాడు. ఇది క్రమశిక్షణ లేదనడానికి గుఱుతు. నాయిష్టం వచ్చినట్లు నన్ను చేయనిస్తే ప్రతివిద్యార్థి కళాశాలలనుకానీ పాఠశాలలనుగానీ సెలవుంటే తప్ప విడిచిపెట్టవద్దని ఆదేశిస్తాను. జయప్రకాశ్ చివరకు యింకా యిలా అన్నాడు". "మామట్టుకు మేమొక కొత్తకార్యక్రమం యిస్తూన్నాము. ఆ కార్యక్రమం ప్రకారం కార్మికకర్షకులను కూడగట్టాలి. అది విప్లవాత్మక ప్రజాఉద్యమానికి పునాది అవుతుంది" ఇటువంటి భావ చూస్తే నాకు చాలా భయం........ఈ కూలీలనూ రైతులనూ కేవలం శాంతిపద్ధతులమీద నడిపించకపోతే, మన ఉద్యమానికి పెద్దదెబ్బ తగులుతుంది. రౌలట్ సత్యాగ్రహం కాలంలోనూ, వేల్సు యువరాజు రాక సందర్భంలో బొంబాయిలో జరిగిన హర్తాళం సందర్భంలోనూ అలాగే దెబ్బతగిలింది......ఈ యేడు స్వాతంత్ర ప్రమాణమునకు చేర్చిన కొత్తసంగతులు ఉండడం అవసరమని నా విశ్వాసం" అని గాంధీజీ ప్రకటించారు. చర్ఖానుగూర్చి సందిగ్ధంగా మాట్లాడడంవలన సంపూర్ణానంద్ వంటి నాయకులు ప్రజాసామాన్యంయొక్క చిత్తవృత్తిలో సంక్షోభం కలిగిస్తూన్నారు. సంపూర్ణానంద్ సోషలిస్టు. ఆయన యంత్రోత్పత్తికి వ్యతిరేకంగా గ్రామపరిశ్రమలను ప్రోత్సహించడానికి అంగీకరించడు. అయితే చర్ఖానుగూర్చి యెందుకు సందిగ్ధంగా చెప్పాలి? గాంధీ యెక్కడమాటక్కడ చెప్పి కాలంవెళ్లబుచ్చుకొనే పద్ధతి ఒప్పుకోడు. శాసనోల్లంఘనం ప్రారంభంకాగానే, కార్మికకర్షకులు వెంటనే సమ్మె చేస్తారని జయప్రకాశ్ ఖచ్చితంగా చెప్పినందుకు కూడా గాంధీ కంగారుపడ్డాడు. అయితే అటువంటి సమ్మె జరిగేయెడల తనకు చాలా చీకాకు కలుగుతుందనీ తన కార్యక్రమమంతా తలకిందులైపోతుందనీ గాంధీ దాచకుండా చెప్పివేశాడు. నిజమైన అహింసాతత్వమునకు అలవాటుకాకుండా ఎలాగో అలా నామమాత్రంగా స్వాతంత్రం సంపాదించినప్పటికీ, తప్పక అరాచకం వస్తుందనీ, చివరకు అరాచకంలోకీ, రక్తపాతంలోకీ పరిణమించే పోరాటాన్నిదేనినీ తాను బుద్ధిపూర్వకంగా ప్రారంభించడనేమాట అందఱూ తెలుసుకోవలసిందనీ గాంధీ అన్నాడు. రామఘర్ కాంగ్రెసు జరిగేవరకూనూ, ఆ తరువాతనూ కూడా, శాసనోల్లంఘనోద్యమ ప్రారంభమునకు గాంధీ యెందుకు సందేహిస్తూవచ్చాడో ఈ మాటలనుబట్టి అర్థం చేసుకోవచ్చును. స్వాతంత్ర్యదినము కార్యకలాపం అక్కడక్కడా కొంత క్రమశిక్షణకు భంగంగా నడిచినమాట

వాస్తవం. అయితే ఎన్నిచోట్ల క్రమశిక్షణకు భంగం జరిగిందనే ప్రశ్న అనవసరం. అసలు క్రమశిక్షణలేకుండా నడుచుకోవడమనే ఉద్యోగం కాంగ్రెసు వాదులలో ఉన్నదనే విషయమే మనకిప్పుడు కావలసింది.

రామఘర్ కాంగ్రెసు సమీపించినకొలదీ అనేక రకాలైన వాడుకలు పుట్టినవి. కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రచారం జరుగుతుందనీ, కాంగ్రెసు నగరాన్ని ఎవరో తగలబెడతారనీ కూడా వదంతులు బయలుదేరినయి. అయితే ఢక్కా జిల్లాలోని యాలికందలో ఇంతకుముందు జరిగిన గాంధీసేవాసంఘ సమావేశమప్పుడు కూడా యిటువంటి అనుభవమే కలిగింది. సభలో సేవాసంఘ ప్రచారకులకు గాంధీ ఉపన్యసిస్తూండగా ఒక ఫర్లాంగుదూరంలో గాంధీతత్వం అడుగంటుగాక అనే కేకలు వినిపించినవి. కొంతమంది యువకులు గుడిసెలు తగులబెడుతూండగా పట్టుబడడం కూడా తటస్థించింది. అయితే గాంధీ వారియెడల సహనంచూపి అన్ని సంగతులూ సమగ్రంగా ఆలోచించవలసిందని కోరాడు. "డబ్బు పుచ్చుకొన్నవాడైనా అక్కడకువచ్చి ఆ ప్రకారం ప్రవర్తించవలసిన అవసరమేమివచ్చింది? అంతవరకు వారు చేసేపని మంచిదని నమ్మి ఉండాలి. కాబట్టి వారు వేసిన కేకలకు మీరు కోపం తెచ్చుకోకూడదు. మహాత్మాగాంధీకీ జై! అని కేకలువేసి వారి కేకలను వినబడకుండా చేయవలెనని మీరు ప్రయత్నించకూడదు. వారి నినాదాలకు ప్రతి నినాదాలు చేయకపోవడం మీరు మంచిపని చేశారు. ఆ విధంగా మీరు వారి ప్రయత్నాలను భగ్నంచేశారు. అందువల్ల చాలా తక్కువ గల్లంతుమాత్రమే జరిగింది. ఈ మీ ఓర్పుకు అహింస మూలమైనట్లయితే వారి నోళ్లు మీరు కట్టివేయగలరనేమాట నిశ్చయం." అన్నాడు గాంధీ. అదృష్టవశాత్తూ మేము భయపడ్డట్లుగా అక్కడి వదంతులు నిజంకాలేదు. మేము అగ్నిని ఎదుర్కోవలసిరాలేదు. వాన నెదుర్కోవలసివచ్చింది.

కమ్యూనిస్టులు, సోషలిస్టులు, జాతీయ ప్రజాస్వామ్య వాదులు (National Democrats) కిసానులు ఫార్వర్డుబ్లాకు పక్షంవారు అనే పేర్లతో వ్యవహరింపబడుతూన్న వివిధ కక్షల ప్రతికూల భావమునుగూర్చి కొంత చెప్పవలసి ఉంది. వీరిలో చివర రెండు పక్షాలవారూ కలసి కాంగ్రెసుకు వ్యతిరేకంగా సుభాస్‌బాబు అధ్యక్షత కింద, కిసాన్ నగరమనే స్థలంలో ఒక సభ సమావేశపరిచారు. పాట్నాలో కాంగ్రెసు వర్కింగుకమిటీ వారామోదించినట్టియూ, రామఘర్ కాంగ్రెసులో అంగీకరింపబడనున్నట్టియూ తీర్మానము, బ్రిటిష్ ప్రభుత్వంతో సమాధాన పడడానికి వ్యతిరేకంగానున్నదనే అభిప్రాయం గలవారికి జవాబు చెప్పడమే ఈ సమావేశకర్తల ప్రధానాశయం. ఆ తీర్మానంయొక్క చివరభాగంలో అసలు తీర్మానంలోని ముఖ్యాశయాన్ని భగ్నం

చేయుగలిగిన పదజాలమున్నట్లు వారు దానిలో లోపాలు కనిపెట్టారు. ఈ తీర్మానం అంగీకరింపడిన తక్షణం బ్రిటిష్‌వారితో సమాధానం కుదుర్చుకోవడానికింకా సావకాశ ముందని గాంధీమహాత్ముడు చేసిన ప్రకటనను సుబాస్ బాబు ఉదాహరించాడు. శాస నోల్లంఘనమునుగూర్చి మహాత్మాగాంధీచేసిన దీర్ఘప్రకటన తనకు నచ్చలేదన్నా డాయన. అందువల్లనే కాంగ్రెసుచెప్పే మాటలను బ్రిటిష్‌గవర్న్‌మెంటు లక్ష్యం చేయడం లేదట. ఎక్కువగా పట్టుదలతో పనిచేసి ఈ రాజీ ప్రయత్నాలను సాగనీయకుండా చేయడమే తమపని అనీ, సామ్రాజ్య తత్వంతో రాజీకూడదనే వారంతా కలసి తమ అభిప్రాయాలను ఒక అఖిలభారతమహాసభద్వారా ప్రకటించవలెననీ ఆయన ప్రబో ధించాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో సమాధానపడినయెడల సామ్రాజ్య వ్యతిరేక జాతీయపోరాటం భారత ప్రజానీకంలో అంతర్యుద్ధంగా పరిణమిస్తుందనీ ఆ పరిస్థితి ఎంతమాత్రమూ వాంఛనీయం కాదనికూడా సుబాస్ బాబు అన్నాడు. అంతటితో ఆగక ఆయన యింకా యిలా అన్నాడు:

“ఇండియాలోని సామ్రాజ్యవాదులతో కాంగ్రెసుకు రాజీయే కుదిరేపక్షంలో ఇకముందీదేశంలోని వామపక్షీయులు సామ్రాజ్యవాదులతోనేకాక వారితో క్రొత్తగా సంపర్కం కలిగించుకొన్నవారితో సహవాసపరులతోకూడా పోరక తప్పనిసరి అవు తుంది. అనగా సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటం దేశంలో అంతర్యుద్ధంగా పరిణామం పొందుతుందని భావం.”

సుబాస్ బాబు అధ్యక్షతకింద నడిచిన ఈ సభ కాంగ్రెసు మహాసభకు ముందు గానే జరిగింది. చాలా ఎక్కువమంది జనం హాజరైనారు. పోరాటానికి సంసిద్ధంగా ఉన్నారా అని అడిగినప్పుడు వారంతా అవునని చేతులెత్తారు.

సమాధాన ప్రతికూల భారతీయ మహాసభ బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీ కూడదనే వారందరూ కలసి సమాధాన ప్రయత్నాలను నిరోధించే ఉద్దేశంతో ఈ మహాసభను జరిపారు. ఒకపక్క కాంగ్రెసుచేసిన ఉద్రేక పూరితములైన తీర్మానములూ, వాటిపైన వర్కింగుకమిటీ సభ్యుల ప్రకటనలూ, మఱొకపక్క గాంధీమహాత్ముని యొక్కయు యితర మితవాద నాయకులయొక్కయు వ్యాఖ్యానములూ వివరించి, వాటిలోని పరస్పర వైరుధ్యములను నిరూపిస్తూ అవన్నీ మామూలు మనిషికి పూర్తిగా ఎటువంటి ప్రతికూలాభిప్రాయాన్ని కలిగించగలవో విస్పష్టం చేశాడు సుబాస్ బాబు. కాంగ్రెసులోని వామపక్షీయులు అలజడి చేయకుండా ఉన్నట్లయితే పాట్నాలో వర్కింగుకమిటీ వారంగీకరించిన తీర్మానం రామఘర్ కాంగ్రెసు ఆమోదాన్ని పొంది ఉండేదికాదనికూడా సుబాస్ బాబు సంశయించాడు. రాజ్యాంగ నిర్మాణ పరిషత్తును

ప్రత్యేక నియోజకవర్గమునుండి నేటి శాసనసభ్యులను ఎన్నుకొనే వోటర్లే ఎన్నుకో వలెననే పద్ధతి కాంగ్రెసు మితవాద నాయకత్వం అంగీకరించడం న్యాయంగా లేదనీ కూడా ఆయన అన్నాడు. తన పోరాటాన్ని సాగించడానికి అఖిలభారత కార్యా చరణసంఘమొకటి స్థాపింపబడవలెనని ఆ మహాసభలో తీర్మానించబడింది. ఆ మహా సభాధ్యక్షుడు, ఆహ్వాన సంఘాధ్యక్షుడు, ఆహ్వాన సంఘసభ్యులు, ఆ సంఘ స్థాపనకు కృషిచేయవలెనని కోరబడ్డారు. ఏప్రిల్ నెలలో ఉద్యమం ప్రారంభం కావలెనను కొన్నారు. ఒకసారి పోరాటం ప్రారంభమైతే ఇక విశ్రాంతిగానీ, విరమణంగానీ, పెడతోవలు పట్టడంగానీ ఉండకూడదు. 1932 లో హరిజనోద్యమాన్ని ప్రారంభించి శాసనోల్లంఘనమును పెడమార్గాలను పట్టించినట్లు ఈ తడవచేయకూడదని వారు నిశ్చ యించుకొన్నారు. "1933 లో శాసనోల్లంఘనం విరమింపబడిన పిమ్మట శాసనసభల వైపుకు కాంగ్రెసువారి దృష్టి మరలింది; ప్రజలలో యెక్కడలేని రాజకీయచైతన్యమూ కలిగింది. యుద్ధం రావడం వలన పూర్వంకంటె ఎక్కువగా పౌరస్వాతంత్ర్యం నిరో ధింపబడడమూ, భారతప్రజానీకాన్ని ఇంకా విశేషంగా కొల్లగొట్టడం, జరిగింది. వాటితో పాటు వర్గచైతన్యంకూడా ఎక్కువగా ప్రస్ఫుటమయింది. కాంగ్రెసుమంత్రులు రాజీ నామా యిచ్చిన పిమ్మట మఱొక అడుగు ముందుకు వేయడానికి బదులు తరువాత జరిపిన చర్యలు మామూలు ప్రజాహృదయాన్ని కల్లోలపఱచి ఏమీ తోచకుండా చేసి నవి". నూలు వడకవలెననీ, నిర్మాణ కార్యక్రమాన్ని సాగించవలెననీ, మాటిమాటికీ చెప్పడం ఈ మహాసభవారు నిరసించారు.

'రాజ్యాంగ నిర్మాణపరిషత్తును కోరడం ఒక తమాషాఅనీ, అందువలన యెవ్వరూ మోసపోయి పొరపడవద్దనీ ఆ సభవారు మందలించారు. పౌరసత్వములు పైన దాడిచేసేవారిపై ఎదురుదాడులు నడుపడానికి, స్వాతంత్ర్య ప్రియులందఱూ భారత ప్రజానీకంలో ఆర్థిక స్వాతంత్రంకోసం పోరాడే కార్మికకర్షకులతో చేతులు కలిపి, మనకు పనిచేయవలెననీ తీర్మానించబడింది. ఆలోచిస్తూ ఆలస్యంచేసినకొద్దీ తమ బలాబలాలో దౌర్బల్యమూ నైతికపతనమూ కలుగవచ్చునని కూడా వారనుకొన్నారు. స్థానికపోరాటాలను బాగా రెచ్చగొట్టి, అవసరమైనచోట్ల సాధ్యమైనంతవఱకు కొత్త పోరాటాలను ప్రారంభించవలెనని తలపెట్టారు. ఆ తీర్మానాలను ఆచరణలో పెట్ట డానికి సంసిద్ధంగా ఉండవలెనని, చిట్టచివరకు సుభాస్ బాబు హెచ్చరించాడు.

## గాంధీ సేవాసంఘం

ఈ మహాసభ 1940 ఫిబ్రవరి 20 వ తేదీని ఢక్కాలోని మాలికండలో సమావేశమయింది. గాంధీ ఖాదీ గ్రామపరిశ్రమల ప్రదర్శనాన్ని బహిర్గతంచేశాడు. గాంధీ ఉపన్యాసం ప్రారంభించకముందే వ్యతిరేకనినాదాలు చేయబడ్డవి. గాంధీకి వ్యతిరేకమైన కరపత్రాలనేకం పంచిపెట్టబడ్డవి. ఈ సంఘటనను గమనించి గాంధీ యిలా అన్నాడు. "నామాటలు మీకు వినిపిస్తూన్నవను కొంటాను. దయచేసి నిశ్శబ్దంగా వినండి. 'గాంధీతత్వం నిర్మూలంకావాలి;' అని కొందఱు కేకలువేస్తూండగా యిప్పుడే విన్నాను. గాంధీతత్వాన్ని రూపుమాపాలి అనుకొన్నవాళ్లకలా అనే హక్కు సంపూర్ణంగా ఉంది. వ్యతిరేక నినాదాలవల్లనగాని ప్రతినినాదాలవలనగానీ ఉద్రేకులు కాకండి. వాటిని మాట్లాడకుండా సహించండి, గాంధీతత్వానికి ప్రతికూలంగా ఏదైనా అనదలచుకొన్నవారిని అననీయండి. అటువంటి వారిపైన దురుద్దేశంగానీ కసిగానీ పెట్టుకోకండి. మీ ప్రతికూలురను మీరు శాంతంగా సహించగలిగి ఉంటేగానీ మీరు అహింసను అర్థంచేసుకోలేరు. గాంధీతత్వమంటే యేమిటో నాకే అర్థంకాదు. నేను కొత్తగా యేమీ చెప్పడంలేదు. ఇదివరకున్న విషయాలనే నేను కొత్తరూపంలో ప్రత్యక్షంచేశాను". "గాంధీ సేవాసంఘంవారు 'వ్యవహారతంత్రం' అనేమాటను మఱచిపోవాలి. సంఘసభ్యులుగా రాజకీయాలలో జోక్యం కల్గించుకోవడం మానాలి. ఈ సంఘంలో సభ్యుడుగా ఉన్నవాడు కాంగ్రెసు సంఘంలో సభ్యుడుగా ఉండకూడదు. వల్లభాయిపటేలు రాజేంద్రప్రసాదులు మాత్రం ఉండవచ్చును.! అని గాంధీ సలహా యిచ్చాడు. గాంధీయున్నూ ఆయన మిత్రులున్నూ కలకత్తానుండి తిరుగుదోవపట్టారు. కలకత్తాను రెండవస్టేషనులో గాంధీ కూర్చొన్నబండిలోకి ఎవరో ఒక చెప్పు విసిరివేశారు.

---

# ౯ రామఘర్ కాంగ్రెసు - ఆ తరువాత

రామఘర్ కాంగ్రెసు తరువాత కూడా కిందటి యేడాదిలోవలెనే పెద్దపెద్ద అధికారాలలో ఉన్నవారు మామూలు పాట పాడడం సాగించారు. జెట్లండు ప్రభువు కొద్దికాలంలోనే తన ఇండియా రాజ్యాంగ కార్యదర్శిపదవిని అమెరీకి అప్పగించి పోనున్నాడు. భారతదేశంనుండి సెలవుతీసుకొని పోతూపోతూ, ఇండియా రాజ్యాంగ వ్యవహారాలను చక్కబెట్టడంలో బ్రిటనుకు నియంతృత్వాధికారం చలాయించే ఉద్దేశంలేదనీ, రాయబారాలద్వారా పరిష్కరించవలెననియే ఉన్నదనీ, తన మామూలు ధోరణిలో ఆయన మాట్లాడాడు. ఇండియాకు తగిన రాజ్యాంగ శాసనమును రచించుకోవడంలో ఇండియా ప్రజలే ప్రముఖపాత్ర వహించవలెను. కాని గత 200 సంవత్సరాల చరిత్రకారణంగా నాటుకొనిపోయిన తన బాధ్యతలను మాత్రం బ్రిటను పూర్తిగా విడనాడజాలదనీ సూచించాడు. సంస్థానాధిపతులు, దేశరక్షణ, అల్పసంఖ్యాకులు, బ్రిటిష్ ప్రయోజనాలు, 8 కోట్ల ముస్లిములూ ఈ అన్నివిషయాలను గూర్చి మామూలు ప్రకటనలను తిరిగీ మరొకసారి వల్లించిన తరువాత రామఘర్‌లో తీర్మానించినట్లు కాంగ్రెసు శాసనోల్లంఘనమును ప్రారంభించే యెడల దానిని ప్రతిరోధించడానికి ప్రభుత్వంవారు పూర్తిచర్యలను తీసుకొంటారనికూడా ఆయన ఆ తీర్మానానికి ప్రత్యుత్తరంగా చెప్పినాడు. అంతటితో ఊరుకోక చివరకిలా ప్రశ్నించాడు. "భారతదేశ సమైక్యతకోసం ఎంతో తీవ్రంగా వాంఛిస్తున్న కాంగ్రెసు ఆ విషయంలో ఇంక రాయబారాలు గూడదని నిషేధించదుగదా? ఈ ప్రశ్నకు కాంగ్రెసు చెప్పే జవాబుపైన భారతదేశపు భవిష్యత్తు ఆధారపడిఉంది" అన్నాడు. ఈ ఉపన్యాసమంతా ఇండియా రాజ్యాంగచట్టం 93 సెక్షన్ క్రింద ప్రకటింపబడిన రాష్ట్ర ప్రభుత్వాలను కొనసాగించడంకోసం పార్లమెంటు అనుమతినిపొందే సందర్భంలో ఈయబడింది. తరువాత జెట్లండుప్రభువు రంగంనుండి విరమించాడు; అమెరీ ప్రవేశించాడు. జెట్లండుకు సెలవు చెప్పేలోగా రామఘర్ కాంగ్రెసులో చేయబడిన మరొక తీర్మానాన్ని గూర్చి యిక్కడ ఉదాహరించడం సముచితం. సర్ మైకేల్ ఒడయర్ హత్యనుగూర్చి, కాక్స్టన్ హోలులో భారతీయుడని పేర్కొనబడిన ఒకమనిషి మార్క్విస్ ఆఫ్ జెట్లండును గాయపరచిన విషాద సంఘటనమునుగూర్చి రామఘర్ కాంగ్రెసు తన గాఢానుతాపాన్ని వెల్లడించింది. ఈ దురదృష్టపు హింసాచర్యకు వర్కింగుకమిటీ యే విధమైన రాజకీయ

ప్రాముఖ్యతా ఈయలేదు. అయినప్పటికీ అటువంటి చర్యలన్నీ జాతీయోద్యమాని హానికరములని ఈ కమిటీ పునరుద్ఘాటించ దలచుకొన్నది.

సత్యాగ్రహం యిక తప్పనిసరి అయింది. రామఘర్ కాంగ్రెసుకు పిమ్మట, దేశ పరిస్థితులలో తటస్థించిన పరివర్తనములను పూర్తిగా విచారించి, సత్యాగ్రహోద్యమానికి దేశాన్ని సంసిద్ధం చేసేటందుకు కాంగ్రెసు అవసర చర్యలను తీసుకొన్నది. గాంధీజీ ఆదేశాల ప్రకారం రాష్ట్రకాంగ్రెసు సంఘాలు చురుకుగా పనిచేయ సాగినవి. అవి సత్యాగ్రహ కమిటీలుగా మారిపోయి కార్యాచరణ సత్యాగ్రహులయొక్కయు సాత్విక సత్యాగ్రహులయొక్కయూ జాబితాలను తయారుచేయ దొడగినవి ఆంతరంగిక వ్యవహారములను సరిగా ఉదాహరిస్తూ నిర్మాణ కార్యక్రమములను శ్రద్ధగానూ సమగ్రంగానూ కొనసాగించడం వాటి కర్తవ్యంగా యేర్పాటు చేయబడింది. కాంగ్రెసు కార్య నిర్వాహక సంఘములలోనున్న సభ్యులెవరైనా సత్యాగ్రహ ప్రమాణపత్రంమీద సంతకం చేయడానికిగానీ, కాంగ్రెసు అధ్వర్యంక్రింద నియమబద్ధంగా పోరాటం సాగించడానికిగానీ బాధ్యత వహించజాలనివారు వెంటనే రాజీనామాలీయవలెనని ఉత్తరువులు జారీ చేయబడినవి. శాసనోల్లంఘన ప్రారంభమునకు ముందుగా ఈ షరతులు పూర్తి కావలెనని శాసింపబడినది.

## వెనుకకూపోలేదు ముందుకూవెళ్ళలేదు

1940 ఏప్రిల్ నాటి పరిస్థితులనుబట్టి భారత రాజకీయ నౌక ఆనాడు నట్టనడి సముద్రంలో ఉండిపోయిందంటే అతి యేమీలేదు. కేవలం నీళ్ళమీద తేలుతూఉంది ఆ ఓడ. ఎక్కడకు వెళ్లాలో సరంగుకే తెలియదు. అన్ని రాజకీయ పక్షాలవారూ స్వసంరక్షణ కోసం తంటాలు పడుతూన్నారు. ఎవ్వరూ ముందెత్తువేసే స్థితిలోలేరు. కేవలం అది పిటికితనమనిగానీ, భయమనికానీ, భీరుత్వమనిగానీ అనడానికి వీలులేదు. ప్రతివారు ఎలాగైనా పోరాటం రాకుండా చూడవలెనని వాంఛించారు. పోరాటంవలన ద్వేషం, కక్షి, నిరంతర శత్రుత్వం యివన్నీ హెచ్చుపెరుగుతాయనీ, వీటినుండి తప్పించుకోవాలనీ ప్రయత్నించారు. బ్రిటిష్‌వారిండియాలో అధికారాన్నికానీ, ఇండియా వ్యవహారములలో జోక్యంకానీ కల్పించుకోకుండా ఉండేయెడల వారితో స్నేహంగా ఉండడానికేమీ అభ్యంతరంలేదని కాంగ్రెస్ స్పష్టంగా చెప్పింది. వారీదేశంలో ఉండి నిర్భయంగానూ నిష్పక్షపాతంగానూ తమ వ్యాపారం తాము చేసుకోవచ్చుననికూడా విశదం చేసింది.

ఇందుకు ప్రతిగావారు ఇండియా స్వాతంత్ర్యాన్ని అంగీకరించి, ఆ స్వాతంత్ర్య లాంఛనా లను ఆచరణలోకి తీసికొనిరావాలి_అనగా ఇండియాలో వారికిగల రాజకీయాధికార మును వాణిజ్య రక్షణలను, ప్రత్యేక రాజకీయ హక్కులను వదులుకోవాలి. ఇవి కేవ లం చిన్నచిన్న త్యాగాలుకావు. కాని భారతీయులమధ్యనూ బ్రిటిష్‌వారిమధ్యనూ శాంతి సుహృద్భావములను నెలకొనవలెనంటేనూ, ప్రభుత్వ నౌక ఆంతరంగిక శాంతి అనే నౌకాశ్రయమునకు సురక్షితముగా చేరవలెనంటేనూ, కాంగ్రెసువారూ బ్రిటిష్ ప్రభుత్వంవారూ ఒకచో సమావేశమై అన్ని సంగతులూ మాట్లాడుకోవాలి. కాని అప్పటి పరిస్థితులలో ఏమి జరుగుతుందో చూదామని ఎవరంతట వారేమీ చేయకుండా కూర్చున్నారు. ఎవరికి వారు ఎదిరి పక్షం వారిని బట్టి ఎత్తువేదామను కొంటూన్నారు. అనగా రాజకీయనౌక గాలెటు కొడితే అటు నడుస్తోంది. అంతేకాని నావికుని యిష్టప్రకారం కాదు. ఈలోగా ఫార్వర్డుబ్లాకువారు పంపిన అంతిమ సందేశాలనుబట్టి ఒకవిధంగా ప్రభుత్వానికి తొందర కలిగింది. ఈ సందేశాలవలన ఏమిజరుగుతుందో చూడడానికి ప్రభుత్వంవారు కొంత వేచి ఉండవచ్చు. కాని అందుకు బదులుగా పోరాటం అనేది పైకి కనబడ కుండానే చేదామని తలంచి, ఫార్వర్డుబ్లాకు సభ్యులను కొందరిని ప్రవాసానికి పంపి, కొంతమందిని వారి స్వస్థలాలలోనే బంధించి, అనేకవిధాల వారిపైని నిర్బంధపుటుత్తరు వులను జారీచేశారు. అందువలన కేవలం తమ ఆత్మగౌరవమును నిలబెట్టుకోడానికి వారా ఉత్తరువులను ఉల్లంఘించవలసి వచ్చింది. దాని ఫలితంగా జాతీయవార ప్రారంభోత్సవమూ, దేశంలో ఒకపక్షంవారు తిప్పనిసరిగా పోరాటం సాగించవలసి రావడమూ ఏకకాలమందు తటస్థించినవి. అటువంటి క్లిష్టసమయంలో కాంగ్రెసు వర్కింగుకమిటీవారి ఆజ్ఞలను శిరసావహించ పూనుకొనిన అత్యధిక సంఖ్యాకులైన కాంగ్రెసువాదులు తమ కర్తవ్యమును నిర్ణయించుకోవడమొక సమస్యగాపరిణమించింది. వారికొక నాయకుడున్నాడు. ఒక సంస్థ ఉంది. ప్రత్యేకం కొన్ని ఉత్తరువులున్నవి. గాంధీగారు నిర్ణయించిన షరతులను 'తూ, చా' తప్పకుండా పూర్తిచేసి స్త్రీ పురుషులను పోరాటానికి తయారుచేయవలసిందని ఆ ఉత్తరువుల సారాంశం. ఈ తరుణంలో తొందరపాటువలన పని పాడవుతుంది. సత్యాగ్రహం విషయంలో ఒకరికన్న ఒకరు ముందు ప్రారంభిద్దామని పోటీపడకూడదు. అది అసలు సత్యాగ్రహ తత్వమేకాదు. సత్యాగ్రహ పోరాటంలో పాల్గొనేవారి పరస్పర సహకారభావంపైన దాని విజయం ఆధారపడి ఉంటుంది. సముచితమైన సమయంకోసం వేచి ఉండడం తొట్రుపాటు కాదు. అలాగే తొందరపాటు పురోగమనమూకాదు.

నీటిలో నడుస్తూన్న పడవలో మనమందరమూ బాటసారుల మనుకొండి! చుక్కానిపట్టే మనిషి; తెడ్లువేసే మనుష్యులు మంచి మెలకువతో ప్రవర్తిస్తూన్నారు. చుక్కానిదగ్గర గాంధీ ఉండి, కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు తెడ్లు వేస్తూండగా తక్కిన కాంగ్రెసువాదులందఱు ఆనౌకలో ప్రయాణం చేస్తున్నారు. పడవ నెమ్మదిగా పోతూన్నదని వెనుక కూర్చొన్న బాటసారి యెవరైనా గల్లంతుచేస్తే యేమైనా ప్రయోజనముందా? అందువలన పడవలో ఉన్నవాళ్ళలో సంచలనం కలిగి పడవ సరంగుల చెయితప్పి. తలకిందులై బాటసారులు మునిగిపోవచ్చుకూడా. పడవలో కూర్చున్నవారిలో కొంతమంది ముందుగా ఒడ్డుకు చేరుకొందామని ఒకవైపుకు తోసుకొని రాగా పడవ తలకిందులై మునిగిపోయి ఒక్కొక్కప్పుడు ముప్పయి నలభైమంది జనం చనిపోయినట్లుకూడా మన మనేకసార్లు విని ఉన్నాము. పామో, తొండో, కప్పో వచ్చిందని గల్లంతుపడి పడవలో ఉన్న బాటసారులు అటూ ఇటూ తోసుకోవడంమూలాన తటస్థించిన దుర్యోగాలసంగతి మనకు తెలును. రాజకీయ దుర్యోగాలుకూడా మానవుల దుర్దశలవంటివే. క్రమశిక్షణకు లోబడి, నియమబద్ధంగా, నిగ్రహంతో సేవాతత్పరులై ప్రజాసేవకులు జాతీయాభ్యుదయానికి కృషిచేసినప్పుడు మాత్రమే విజయం చేకూరుతుంది. కార్యసాధనకు జాగు ఎలాకూడదో తొందరపాటుకూడా అలాగే కూడదు. అతి జాగువలన అతి వేగిరపాటువలనా యెన్నో విప్లవోద్యమాలు అపజయం పొందినట్లు విని ఉన్నాము. బుద్ధిమంతుడైన సైనికుడు పైవారి ఉత్తరువులకు విధేయుడై పోరాడుతాడు. అంతేకాని అనవసరంగా ఉద్రేకపడి ముందునూ దుముకడు. సోమరిగా వెనుక నిలఒడిపోడు.

ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనా వ్యవహారములలో అనేక ముఖ్య సంఘటనలు జరిగినవి. 1940 మే 10 వ తేదీని జెట్లండు ప్రభువు తన ఉద్యోగాన్ని అమెరీకప్పగించాడు. మూడునాలుగేండ్లనుండీ అమెరీ ప్రజాజీవితంలో జోక్యం కల్గించుకోవడంలేదు. అంతకుపూర్వం అతను చాలా సంవత్సరాలు మంత్రివర్గంలో అనేక ప్రాముఖ్యస్థానాలను ఆక్రమించినవాడే. 1939 శశిర్తువులో ఏడ్వర్డుథాంప్సన్ వార్ధాకు వచ్చినప్పుడు ముందు అధికారంలోకి రానున్న బ్రిటిష్ రాజకీయ నాయకులను ఆరుగురిని పేర్కొన్నాడు. అందులో అమెరీ ఒకడు. వారారుగురి సానుభూతీ ఉన్నయెడల ఇండియా సమస్య పరిష్కారమవుతుందన్నాడు. యల్. యస్. అమెరీయొక్క కరడుగట్టిన కన్సర్వేటివ్ అభిప్రాయాలిండియాకు బాగా తెలుసు. కాని ఆయన ఇటీవల రచించినగ్రంథం పూర్వంకంటె ఆయన అంటే కొంత సరళభావం కలిగించడానికి వీలుగా కనిపించింది. దానినిబట్టి ఆయన ఇండియా విషయంలో నూతన

విధానాన్ని అవలంబించదలచు కొన్నాడని ఎవరైనా ఆశిస్తే, అతడు పొరపాటుపడ్డాడని చెప్పడానికి తగిన సాక్ష్యం చాలాఉంది. ఆయన భారతరాజ్యాంగ కార్యదర్శిగా ఉన్నకాలంలో మాట్లాడిన మాటలూ నడుచుకొన్న నడవడీ చూస్తే ఈ విషయంబాగా ధ్రువపడుతుంది. థాంప్సన్ పేర్కొన్న ఆరుగురు పెద్ద మనుష్యులలో విన్ స్టన్ చర్చిలు పేరొకటి. చర్చిల్ ఆరువారాలలో బ్రిటిష్ ప్రధానిగా రానున్నాడని 1939 నవంబరులో థాంప్సన్ అన్నాడు.

చర్చిల్ బోయరు యుద్ధంలో పత్రికా విలేఖకుడుగా పోయి అక్కడ అయుధం చేపట్టాడు. శత్రువులాయనను పట్టుకోగా తప్పించుకొని మూడువందలమైళ్లు కాలినడకను ప్రయాణంచేసి బ్రతికి బయటపడ్డాడు. ఆయన రాన్ డోల్ఫ్ చర్చిల్ ప్రభువుకు కొడుకుకావడం మూలాన స్వతస్సిద్ధంగా ఉన్న ప్రాముఖ్యత అలాఉండగా, ఇందువలన కూడా అందరికీ ఆయనపేరు బాగా వెల్లడిఅయింది. చర్చిలు నేటియుద్ధాన్ని తీవ్రంగా సాగించి జయించగలడని నలువైపుల వారికీ ఆశ కలిగింది. ఆయన యే విషయమైనా శీఘ్రంగా నిర్ణయించగలడు. పట్టుదలగా పనిచేయగలడు. అటువంటి మనిషి పూనుకొంటే గొప్ప సంఘటనలకు సంసిద్ధంగా ఉండవలెనని మాత్రం బ్రిటనుకు తెలుసు. బ్రిటనునుండి 1939 శీతకాలంలో వార్ధాకు వచ్చిన బ్రిటిష్ మిత్రులందరూ చర్చిల్ నుగూర్చి చాలా శ్లాఘిస్తూవచ్చారు. "చచ్చేటట్లు కొట్టు, ఉదారంగా రాజీపడు" అనే రాజనీతిలో నమ్మకం కలవాడుచర్చిల్. దక్షిణ ఆఫ్రికా విషయంలో బ్రిటిష్‌వారలాగే ప్రవర్తించారు. ఇండియా విషయంలోకూడా అదేవిధంగా ఉండగలరని ఒకప్పుడాయన అన్నాడు. ఆయన దేనికైనా సమర్థుడు. "ద్వారంతెరిచి మిమ్ముల్ను రాయబారాలకు దయచేయండని ఆహ్వానించనూవచ్చు. లేదా ఈ పిచ్చవేషాలు నాకేమీ పనికిరావు. సైనికశాసనం పెట్టబోతూన్నాను. కాచుకోండి!" అనవచ్చు. కాబట్టి ఇండియా పరిస్థితి యింకా త్రిశంకుస్వర్గంలో ఉండదనీ అటో ఇటో వెంటనే తేలిపోతుందనీ అనుకొన్నారు చాలామంది. ఏడునెలలనుండి బ్రిటిష్‌వారు దాగుడుమూతలాడుతూ కాలక్షేపంచేస్తూన్నారు. చావూ బ్రతుకూ కాకుండా యిలా వుండడంకంటె యేదోవిధంగా ముఖాముఖిని నిర్మొగమోటంగా తేల్చుకోగలిగిన మనిషి అధికారంలోకి రావడం కాలముకూడా అందుకనుగుణంగా ఉండడం బాగుందనుకొన్నాం. కాని ఇండియాకు ఆశాభంగం వ్రాసిపెట్టి ఉంది. ఇంగ్లాండులో ప్రభుత్వంమారిన కొలది కాలానికే రాజుగారూ భారతరాజ్యాంగ కార్యదర్శి ఈ యిరువురూ రెండొక ముఖ్య ప్రకటనా చేశారు. విక్టోరియారాణి మరణించినప్పటినుండీ మే 24 వ తేదీ సామ్రాజ్య దినంగా పరిగణింపబడుతూ వచ్చింది. దీనికి ప్రారంభోత్సవం చేసినవారు అరల్ మీాత్.

ఆనాటినుండి యిప్పటికి 40 సంవత్సరాలంగా ప్రతిసంవత్సరమూ ఈ సామ్రాజ్యదినం జరుపబడుతూనేఉంది. 1940 లో జరిగిన ఉత్సవానికి ప్రత్యేక ప్రాముఖ్యతవచ్చింది. ఆనాడు ఇంగ్లాండుదేశపు రాజుగారు తన ఉపన్యాసాన్ని ప్రపంచానికి రేడియోలో ప్రసారంచేశారు. ఆయనచేసిన ఉపన్యాసమిది:-

ఈ సామ్రాజ్యాన్ని నేనీరోజున ఒకకొత్త దృక్పథంనుండి చూస్తూ మీతో మాట్లాడదలచుకొన్నాను. దీనిని నాశనంచేయడానికి పూనుకొన్న ఒకానొక దుష్టవిధానంతో యిది తీవ్రమైన పోటీకీ పోరాటానికీ దిగవలసి వచ్చింది. దీని పరిపూర్ణస్వరూప మింతకంటె ఎక్కువ కాంతివంతమూ ఎక్కువ నిశ్చలమూ అయిన వెలుగులో కాని తెలియరాదు. మన శత్రువులు మనకు వ్యతిరేకంగా 'సామ్రాజ్యతత్వం' అనే పదాన్ని ప్రయోగిస్తూన్నారు. అనగా మనకధికార వ్యామోహం, రాజ్యదురాకాంక్ష ఉన్నవని వారి అర్థం. సామ్రాజ్యంలోని స్వతంత్ర ప్రజలమైన మనం వారిమాటను తిరిగీ వారికే అప్పచెబుతూన్నాము......ఈ దురాశాపరులు వారుకాని మనంకాదు.

మనకు ఒకేఒక ఆశయంఉంది. అదిశాంతి. ఈ యుద్ధంలో బాగా దెబ్బతిని యుద్ధభారాన్ని సంపూర్ణంగా భరించడానికి యుద్ధంవల్ల లభించే స్వాతంత్ర్యంలో భాగం పంచుకోవడానికి ఇండియాకు స్థానంలేదనీ యిదివరకే విశదం చేయబడింది. అమెరీ ఉపన్యాసమూ రాజుగారి రేడియో ప్రసంగమూకూడా ఈ విషయంలో యేమీ ఆశాజనకంగాలేవు. సర్ స్టాఫర్డు క్రిప్సు, ఇండియానుండి తిరిగి వెళ్లి ఇండియాపక్షాన ఒక మంచిమాట చెప్పాడు. ఇండియా సమస్యను పరిష్కరించవలెనంటె రాజ్యాంగ పరిషన్నిర్మాణమొక్కటే సరియైన మార్గమన్నాడాయన. ఆ తరుణంలో ఆయనచేసిన ఈసూచనకు కొంతవిలువఉంది. అమెరీ అధికారంలోకి రాగానేచేసిన మొదటిప్రసంగం ఆయనకు వెనుకవారుచేసిన ప్రసంగాలకు నకలుగాఉంది. అంతేకాదు, ముందాయన ప్రసంగాలే ధోరణిలో యెంత దూరం పోగలవో కూడా దానివల్లనే స్పష్టమయింది. మఱు సంవత్సరంలో ఆయనచేసిన ఉపన్యాస భాగాల సమగ్ర స్వరూపమును పరిశీలనాదృష్టితో అర్థం చేసుకోనేటందుకు ఈ పుటలలో సావకాశము కల్పించెదము గాక! ఈలోగా భారత రాజకీయచరిత్ర నడుస్తూన్న విధానమునూ, యుద్ధంవలన దేశంలో కలుగుతూన్న పరివర్తనములనూ, సరిగా తెలుసుకోవడానికి అమెరీ అప్పుడప్పుడూ చేస్తూవచ్చిన ఉపన్యాసాలలోని ముఖ్యాంశాలను ఉదాహరించవలసి ఉంది. కామన్సు సభలో ఆయన మొట్టమొదటిగా యిచ్చిన ఉపన్యాసంలో యిలా అన్నాడు

"బ్రిటిష్ సమిష్టి సౌభాగ్యంలో (British Commonwealth) భారత దేశం స్వాతంత్ర్యమునుపొంది సమానభాగస్వామిగా ఉండడమే, మాపూర్వ ప్రభుత్వ మువారి ఆశయమూ మా ఆశయమూకూడా". ఇండియా పరిస్థితులకూ, ఇండియా ద్వక్ప థమునకూ అనువైన రాజ్యాంగ నిర్మాణం విషయంలో భారతీయులే ప్రముఖ పాత్ర వహించవలెనని ఆయన అంగీకరించాడు.

1940 ఏప్రిల్‌లో ఇంగ్లండు ప్రభువు, ప్రభువుల సభలోచేసిన ఉపన్యాసంలోని మాటలనే తిరిగి వల్లిస్తూ అమెరీ యిలా అన్నాడు. "యుద్ధానంతరం, ప్రస్తుత ప్రణాళిక లోని రాజనీతినీ, ఉద్దేశాలనూ పునర్విచారణ చేయడానికి "రాయబారాలే కాని నియం తృత్వం" పనికిరాదని మాఅభిప్రాయం అన్నాడు. ఇంకా మిగతా విషయాలకు సంబం ధించి వెనుకటి పదజాలాన్నే అనగా "అందరికీ అంగీకారమైన సమాధానపద్ధతి" "వివిధ సంఘములవారియొక్కయు, వివిధ ప్రయోజనములు కలవారియొక్కయు న్యాయమైన హక్కులు" "సమాధాన విధానానికి మాకృషి" సమాధానం కుదర్చడా నికి వీలులేనట్లుగా తాను భావించని "తీవ్రభేదాభిప్రాయం" "తాత్కాలికపుఏర్పాటు" "మంత్రుల పునరుద్యోగ స్వీకరణము" "కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో ప్రజానాయక ప్రాతినిధ్యం"వంటి బ్రిటిష్ పురాతన సంప్రదాయాల కలవాటైన మామూలు మాటలను ప్రయోగిస్తూవచ్చాడు.

చర్చిల్ మంత్రివర్గంలో ఇండియా రాజ్యాంగ కార్యదర్శిగా నియమింపబడిన లియోపాల్డుఛార్లెస్ మారిస్‌స్టెన్నెట్ అమెరీ ఇండియా సమస్యనుగూర్చి జరిగిన మార్చి నెలలో యిలా అన్నాడు.

> "ఇండియా స్వాతంత్ర్యానికి అర్హతగలస్థితికి వచ్చింది. ఆదేశం ఖండాం తరాలలో సభ్యతకలదిగా మనమిప్పుడు భావించవచ్చును. మానసికాభివృద్ధిని పట్టిచూస్తే ఆశియాజాతులలో నేడు ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తూన్నది ఇండియా.
>
> "సాధ్యమైనంత త్వరలో ఇండియాదేశం అనుభవిస్తూన్న కష్టాలనుతొల గించవలెననియే ఈ దేశంలోని పార్లమెంటు సభ్యులందరూ అనుకొంటున్నారు. ఇంగ్లాండులోని విషయజ్ఞులందరూ ఇండియాదేశ స్థితినిగూర్చి చాలా జాగరూక తతో విచారణ చేస్తూన్నారు. వారిలో ప్రతివారూకూడా ఇండియాదేశ వ్యవ హారాలను ఆ దేశీయులే చక్కబెట్టుకోగలిగిన స్థితికివచ్చారనే సంగతి అర్థం చేసుకొన్నారు. అయితే ఆదేశంలోని అన్ని సంఘాలవారికీ సమాధానంమాత్రం కుదరాలి. వారి గృహాలను వారు నిర్మించుకోవడానికి మనం సహాయ పడ్డాము.

నేడు వాటిని వారు పునర్నిర్మాణం చేసుకోదలిస్తే బ్రిటనందుకభ్యంతరం చెప్పదు. అయితే ఆగృహ పునర్నిర్మాణం జాగ్రత్తగానూ సంపూర్ణంగానూ జరగాలి. భవిష్యత్తులో కూలిపోయేటట్లుగా ఉండకూడదు.

కాంగ్రెసు కోరుతూన్న రాజ్యాంగ పరిషత్తును స్థాపించ వచ్చునా అని అడుగగా ఆమెరీ యిలా అన్నాడు. ''ఇండియా రాజ్యాంగ పరిషత్తు వివిధ రాష్ట్రాలనుండీ 10, 12 మంది ప్రతినిధులతోమాత్రం నిర్మింపబడాలి. వారిలో యూరోపియనులతోసహా అన్ని తరగతుల ప్రజలూ ఉండాలి. ఇదే ఇండియా పరిస్థితులకు బాగా తగినట్టి రాజ్యాంగ పరిషత్తుగా ఉండగల''దని నాఅభిప్రాయం.

కెనడా దక్షిణ ఆఫ్రికాలలో నిర్మింపబడిన రాజ్యాంగ పరిషత్తులలాటి, రాజ్యాంగ నిర్మాణసభ ఇండియాకు తగిఉండదా అని ప్రశ్నించగా ఆమెరీ అనంగీకారాన్ని వెల్లడిస్తూ 'ఒక్కొక్క దేశానికి ఒక్కొక్కపద్ధతి తగిఉంటుంది. కెనడా ఆస్ట్రేలియాలకు పనికివచ్చిన విధానం ఇండియాకు బొత్తిగా పనికిరాకపోవచ్చును.' అన్నాడు. ఇండియాయొక్క ఆంతరంగిక పరిస్థితులనుబట్టిగానీ, బాహ్య పరిస్థితులనుబట్టిగానీ, ప్రపంచంలో ఇండియా ఆక్రమించిన స్థానాన్నిబట్టిగానీ ఆలోచిస్తే, యితర అధినివేశాలలోని రాజ్యాంగ పరిషత్తులలాటి రాజ్యాంగ నిర్మాణసభ ఇండియాకు పనికిరాదని ఆయన అభిప్రాయమిచ్చాడు.

ఈ క్లిష్టదశలో ఇండియాకేమి సూచనలిస్తారని అడుగగా ''కాంగ్రెసు రాజప్రతినిధితోకలసి ఈడూజోడుగా పనిచేస్తే చాలా సంతోషిస్తా''నన్నాడు.

కాంగ్రెసు రాజప్రతినిధితోకలసి సహకారం చేయడానికి బదులుగా శాసనోల్లంఘనం ప్రారంభిస్తే ఏమవుతుందని అడుగగా ''ప్రభుత్వంవారి మనస్సులో ఏమి ఉందో నాకు సరిగా తెలియదు కాని, ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా ఉండని పనిని దేనినైనా కాంగ్రెసు చేస్తే అది నిజంగా చాలా దురదృష్టం. ఇందుకు సందేహమేమాత్రమూ లేదు.'' యు. పి. యుద్ధంవల్లన వచ్చే స్వాతంత్ర్యంలో భాగం పంచుకోడానికి ఇండియాకు హక్కులేకపోయినా యుద్ధంలో బాగా దెబ్బలు తిని గాయపడడానికీ యుద్ధ భారాన్ని పూర్తిగా భరించడానికీ మాత్రం ఇండియాకు హక్కున్నదని ఒకసారికి రెండుసార్లు స్పష్టీకరించబడింది. ఇండియానుండి తిరిగి వెళ్ళగానే సర్ స్టాఫర్డుక్రిప్సుమాత్రం ఇండియాకు అనుకూలంగా ఒక మంచిమాట అన్నాడు. 1939, అక్టోబరు 26 వ తారీఖున కామన్సుసభలో ఆయనచేసిన ప్రకటనకు ఆ తరుణంలో

కొంత విలువ ఉంది. ఇండియా సమస్యలను పరిష్కరించి ఇండియాను రక్షించవలె నంటే రాజ్యాంగ పరిషన్నిర్మాణ మొక్కటే మార్గమని ఆయన సూచించాడు. సర్ స్టాఫర్డుక్రిప్సు ప్రకటనను పూర్తిగా యిందుతో పొందుపరుస్తున్నాము.

## ఇండియా భవిష్యత్తు

### కాంగ్రెసు కోర్కెనుగూర్చి సర్ స్టాఫర్డుక్రిప్సు

యునైటెడ్ ప్రెస్‌కు ప్రత్యేకం యిచ్చిన సందేశంలో "ఇండియా మోక్షం రాజ్యాంగ నిర్మాణపరిషత్తులోనే ఉంద"న్నాడు. సర్ స్టాఫర్డు క్రిప్సు.

కాంగ్రెసు రాజకీయాందోళనలో ప్రతిచోటా మిక్కిలి చురుకుగా పాల్గొన్నది. కార్మికవర్గాలలో మంచి తెలివిగలవారితో ఈడుజోడుగా కలిసిమెలసి పనిచేసింది. ప్రజల నైతికశక్తిని బహుళ ప్రయోజనకరంగా కూడగట్టి తన ఉద్దేశాలను పార్లమెంటుకు విశదంగా తెలియచేయడం ఎలాగా అని కాంగ్రెసిప్పుడాలోచిస్తున్నది. ఇండియా వ్యవహారాలనుగూర్చి, పార్లమెంటేమీ శ్రద్ధతీసుకోవడం లేదనే భావం ప్రజలలో అంతకంతకూ హెచ్చిపోతూన్నది. కాంగ్రెసు కోరే కోరిక భారత జాతీయ వాంఛయే. అది ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబింప చేస్తూన్నది. ప్రజలలోని వివిధాభిప్రాయాల సమగ్ర స్వరూపమని చెప్పాలి దానిని. అయినప్పటికీ ఇటువంటి ప్రజావాంఛితమును కూడా బ్రిటిష్ ప్రభుత్వం లక్ష్యపెట్టదనే భయం హెచ్చుతరిగింది. దీని ఫలితంగా శాసనోల్లంఘనం ప్రారంభం కావచ్చును. శాసనోల్లంఘనం మూలాన జాతీయవాంఛను బలపరిచే ప్రజల నైతికశక్తి విజృంభించగలదని కాంగ్రెసు విశ్వాసం. కాంగ్రెసువారు ప్రారంభించనున్న శాసనోల్లంఘనమనే అంబుల పొదిలో యావద్భారతదేశంలోనూ ఒకే సమయాన సంపూర్ణంగా సమ్మె చేయించడం చిట్టచివరి ఆయుధం. భూస్వాములనుండి రైతులనూ, పెట్టుబడిదారులనుండి కార్మికులనూ, కాంగ్రెసు విడిపించగలదని వారి నమ్మకం. సరిగా అందువల్లనే కాంగ్రెసు యావద్భారతజాతినీ ఆకర్షించగలిగింది. భారతీయులలో అత్యధిక సంఖ్యాకులు కాంగ్రెసేమి ఆదేశిస్తుందా అని ఆతురతతో ఎదురుచూస్తూన్నారు. ప్రతిదీ కాంగ్రెసే చేయగలదని వారినమ్మకం. ఇండియాను రెండుగాచేసే జిన్నాప్రణాళికకు వారుప్రతికూలురు. 'స్వాతంత్ర్యం సంపాదించడానికి సర్వప్రయత్నాలూ చేయండి' ఇదే వారి నినాదం. గాంధి శాంతిమార్గాన్నుండి వైదొలగని మనిషి. అంతేకాదు; బలప్రయోగమును ప్రోత్సహించడం వలన నైతికబలం తగ్గిపోతుందనీ, సత్యం యొక్క అమోఘశక్తిని చులకన చేయడమవుతుందనీ ఆయన నమ్మకం. ఇండియా

లోని అధిక సంఖ్యాకులు దౌర్జన్యమును ప్రోత్సహించడంవలన తమ ఉద్యమం బలహీనః పడుతుందనే అభిప్రాయంలోనే ఉన్నారు. ఇండియాలో నేను సంచారం చేస్తూన్న ప్పుడు అనేక తరగతుల ప్రజలను కలుసుకొన్నాను. వారందఱూ కూడా దౌర్జన్యపద ప్రయోగం వలన శత్రువులు చావరనీ, మిత్రులను పోగొట్టుకొంటామనే అభి ప్రాయంలో ఉన్నారు."

## స్వాతంత్ర్య ప్రేమ

"ఈనాడిండియాలో నివసిస్తూన్న వారు ప్రతివారూ, చదువుకొన్నవారు గానీ, చదువుకోని వారుగానీ స్వాతంత్ర్యమంటేనూ, న్యాయమూ, చట్టమూ, అంటేనూ గాఢానురాగంతో ఉన్నారు. స్వయంనిర్ణయసిద్ధాంతం అంటే ఎంతో గౌరవం వారికి.

"వివిధాభిప్రాయాలు కలవారినీ కలుసుకొనే భాగ్యం నాకు కలిగింది. అందువలన ఇండియాలోని క్లిష్టపరిస్థితి నా మనస్సుకు బాగా నాటుకొన్నది. ఇక్కడ మనకు ఇండి యానుగూర్చి యేమీ తెలియదనికూడా అర్థమయింది. యావద్భారతదేశంలో కాంగ్రె సుకు చాలా పలుకుబడి ఉన్న సంగతి ఎవ్వరూ కాదనజాలరు. నిజంగా అది పట్టుపట్టితే త్వరలోనే బ్రిటిష్ పారతంత్ర్యమునుండి ఇండియా బయటపడగలదు. కాని అది ముస్లిం లీగు సహకారంతో పనిచేయవలెనని కోరడంచేత ఇండియా స్వాతంత్ర్యమింత ఆలస్య మయింది."

## రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు

ఇండియాలోని సాంఘిక సమస్య త్వరలో పరిష్కారం కావలెనంటే మీ సూచన యేమని అడుగగా సర్ స్టాఫర్డు క్రిప్సు ఇలా అన్నాడు. "రాజ్యాంగ పరిషన్ని ర్మాణంలోనే ఇండియా మోక్షం ఉందని నాకు నమ్మకం కలిగింది."

బ్రిటిష్ ప్రభుత్వానికి మీ రేమి సూచించగలరని అంటే సర్ స్టాఫర్డు ఇలా విస్ప ష్టంగా చెప్పినాడు. "యుద్ధం ముగిసిననాటినుండి సంవత్సరంన్నర మాసాలలో స్వపరిపాలన మును ప్రవేశపెడతామని బ్రిటిష్‌ప్రభుత్వ మొక అసందిగ్ధమైన ప్రకటన చేయవలసిందిగా నేను వారిని ఒత్తిడిచేస్తాను. ఆ ప్రకారం వారుచేసేయెడల సాంఘిక సమస్య పరిష్కా రంకాగలదు. యుద్ధం ముగిసేదాకా కాంగ్రెసు మాట్లాడకుండా ఉండవచ్చును కూడా".

1939 శీతకాలంలో ఇండియానుండి ఇంగ్లాండుకు తిరిగివెళ్ళగానే కామన్సుసభలో ఒక ఉపన్యాసమిచ్చాడు. అది యిక్కడ ఉదాహరించడం మంచిది. అందువలన క్రిప్సు మంత్రిగాకమును పెలాఉన్నాడో, మంత్రి అయినతర్వాత యెలా మాఱిపోయినా డో అర్థమవుతుంది.

"నేటి క్లిష్ట పరిస్థితులలో ఇండియాదేశపు ప్రజలూ, ఇండియాలోని రాజకీయ పక్షాలవారూ కూడా సముచితంగా ప్రవర్తించవలెనని చాలామంది గౌరవనీయ సభ్యులుపన్యాసాలు చేశారు. ఈ ఉపన్యాసాలు ఇండియా ప్రజలనుగూర్చి చేయడంకంటే, బ్రిటిష్ ప్రభుత్వాన్ని గూర్చి, బ్రిటిష్ ప్రజల గూర్చి చేయడం ఎక్కువ ముఖ్యమని నా నమ్మకం. భారత జాతీయ మహాసభవారు చేసిన ప్రకటన చాలా సముచితంగానూ గంభీరంగాను ఉంది. అందులో వారి మనస్సులలో గాఢంగా నాటుకొని ఉన్న నిశ్చితాభిప్రాయాలను విస్పష్టంచేశారు; ఒక క్లిష్టపరిస్థితిని పరిష్కరించేటందుకు ప్రభుత్వంవారి సహాయాన్ని కోరారు.

లార్డు ప్రివిసీల్ ఉపన్యాసంలోని చివరభాగం నాకు చాలా విచారకరంగా ఉంది. తప్పనిసరిగా తటస్థించిన నూతన పరిస్థితులను ఆయన సరిగా గ్రహించినట్లు లేదు.... ప్రపంచపరిస్థితులలో కలిగిన నూతన పరివర్తనములూ, బ్రిటిష్‌వారు యుద్ధంలోకి దిగినప్పుడు ప్రకటించిన ఆశయాలు,— వీటినిబట్టి ఇండియా ఒక ఒరిపిడి రాయి అయింది. ఇండియా విషయంలో బ్రిటిష్‌ప్రభుత్వంయొక్క వైఖరి ఎలా ఉంటుందా అని ప్రపంచంలోని ప్రజలు, ఈ దేశంలోని ప్రజలు, ఇండియాలోని ప్రజలూకూడా ఎదురు చూస్తున్నారు. బ్రిటిష్ సామ్రాజ్య భవిష్యత్తును గూర్చిన మన ఉద్దేశాలెట్టివో ఆ ఒక్క విషయమే తేల్చివేయగలదు......

## సారంలేని వాదం

సాంఘిక వివాదముల మూలమున ఇండియాలో సంతృప్తికరమైన కేంద్రస్వపరిపాలనా విధానమును ప్రవేశపెట్టడం కష్టమని లార్డు ప్రివిసీల్ వాదిస్తున్నాడు. ఆ వాదం సరియైనదికాదని నా అభిప్రాయం. ఈ విషయమే పోలాండును గూర్చి కూడా చెప్పవచ్చు. పోలాండులో, రష్యనులు, యూదులు, జర్మనులు, పోలిష్‌వారులూ ఉన్నారుకదా? జెకోస్లోవేకియాకుకూడా యిదేమాట చెప్పవచ్చు. అక్కడ సుడేటెన్‌లు జెక్కులు, స్లోవకులూ ఉన్నారు. ప్రజాస్వామ్యము పేరుతో చేయబడుతూన్న ఈ వాదం నాకు మరీ అర్థంకాకుండా ఉంది. ఇది అల్పసంఖ్యాకుల రక్షణకోసం అధిక సంఖ్యాకుల హక్కులకు భంగం కలిగించడమవుతుంది. అధికసంఖ్యాకుల హక్కులలో కొంత మార్పుచేయడం ఆ మార్పులకు వారిని ఒప్పించడం అవసరమైతే కావచ్చు, అందుకు కాంగ్రెసు బుద్ధిపూర్వకంగానే అంగీకరించింది. అల్పసంఖ్యాకులను రక్షించి తీరాలని పట్టుపట్టి అధిక సంఖ్యాకుల హక్కులను తొలగించడం మాత్రం మీకు న్యాయంకాదు, అలా చేసినట్లయితే మీరు నిజంగా అధిక సంఖ్యాకులను అల్పసంఖ్యా

కలుగా మార్చివేస్తున్నారు. మీకు ప్రజాస్వామ్యమే కావలెనంటే, అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకుల పరిపాలనకు తలవొగ్గితీరాలి. మనదేశంలో ప్రతిరోజూ జరుగుతూన్న పని అదే. మీరు ప్రజాస్వామ్యాన్ని అంగీకరించి ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్థాపించేయెడల యే తరగతి, యే కులం, యే పక్షం, అధికసంఖ్యాకంగా ఉన్నదో అదే తేల్చివేస్తుంది నీ కిష్టమైనా కాకపోయినా ఈ రోజున బ్రిటిష్ ఇండియాలో కాంగ్రెసు పక్షం అధిక సంఖ్యాకపక్షంగా ఉంది.

## మాటలు – ఆచరణ

ఈ క్లిష్ట పరిస్థితులను తొలగించడానికి మనమేమి చేయవలెనో ఒకటి రెండు ఆచరణ యోగ్యములయిన సూచనలనిచ్చే ముందు మరొకవిషయం చెప్పదలచుకొన్నాను. ఈ సమయంలో ఇండియాకు ఇంకా కొంత స్వపరిపాలనమును మనం ప్రసాదించకపోయిన యెడల యూరపులో మన మనుభవిస్తూన్న చిక్కులకు తోడు ఐరోపా పరిస్థితులలో యెటువంటి ఫలితం కలుగుతుందో ఆలోచించండి; అది మూడు విధాలుగా ఉండవచ్చును ఒకటి: మనదేశంలోని ప్రజలే అనేకమంది స్వాతంత్ర్య ప్రజాస్వామ్యములను గూర్చి మనం చెప్పేమాటలలోని ఆ యదార్థమును గ్రహించగలరు. అందువల్ల యుద్ధప్రయత్నాలలో ఐక్యసంఘటనా శక్తి ఎంతో కుంటుపడుతుంది. రెండు; తటస్థులుగా ఉన్నవారిలో ముఖ్యంగా, ఇండియా పరిస్థితులను ఎంతో శ్రద్ధగా పరిశీలిస్తూన్న అమెరికా సంయుక్తరాష్ట్రాలలో, బ్రిటిష్‌వారియెడల గల విముఖత్వాన్ని పెంపొందించి ఐరోపాఖండ వ్యవహారాలకు దూరంగా ఉండవలెననే అభిప్రాయాన్ని బలపరుస్తుంది.... మూడు; ఇప్పుడు చెప్పబోయే విషయాన్ని మనం ముఖాముఖిని ఎదుర్కొని తీరాలి:— ఇండియా వ్యతిరేకంగా ఉండి అసహాయోద్యమాన్ని ప్రారంభిస్తే, ఎంతో ప్రమాదం ఉంది. ఇండియాకు ఉద్రేకం కలిగినకొద్దీ మన చిక్కులలో మనకు సహాయకారి కాదు సరిగదా పైపెచ్చు గొప్ప ప్రతిరోధంగాకూడా పరిణమిస్తుంది.

...ఒకవంక ప్రజాస్వామ్య స్వాతంత్ర్యములను నిలబెట్టడానికే మనమీయుద్ధం చేస్తూన్నామని చెబుతూ, మనమూ గవర్నరుజనరలూ కూడా స్వపరిపాలనమునకూ పూర్తిగా అర్హతకలిగిఉన్నదని ఒప్పుకొన్నట్టియూ, బ్రిటిష్‌సామ్రాజ్యంలో ఒకభాగంగా ఉన్నట్టియూ ఇండియాకు స్వాతంత్ర్యమును నిరాకరిస్తే "బ్రిటిష్‌వారు చెప్పేదొకటి చేసేది మరొకటి అనడానికిది మరొక ఉదాహరణమని" ఇండియా ప్రజలు ఎత్తిపొడుస్తారు. కాబట్టి వట్టిమాటలతో గాక క్రియలో ఇండియాకు స్వపరిపాలనమును సంక్రమింప

చేయవలెనని మన మనుకుంటున్నామో లేదో మనకు నిశ్చయంగా తెలియాలి. నిజంగా మనమిండియాకు స్వపరిపాలనమును సంక్రమింపచేసేయెడల ఆదేశాన్ని శక్తివంతమైన ఒక గొప్ప మిత్రదేశంగా ఆహ్వానించాలి. అప్పుడు భవిష్యత్తులోకూడా శాశ్వతంగా మనకా దేశంమిత్రదేశంగా ఉండగలదు. అలా కాకపోతే ఇండియా పురోభివృద్ధికి ఆటంకంగా ఉన్న సంస్థానాధిపతులతో చేతులుకలిపి, వారూ మనమూ కూడా సమిష్టిగా ఇండియాప్రజలను దోచుకొని తినడానికి ఒప్పుకోవాలి.

## క్రొత్త ఎన్నికలు

ఇండియాకు సంబంధించినంతవరకు మన యుద్ధోద్దేశాలనూ ఆశయాలనూ వివరించి చెప్పవలసిందని కోరిన భారతజాతీయ కాంగ్రెసుకు మనమిప్పుడీయవలసిన ప్రత్యుత్తరమేమిటి? ఆ ప్రత్యుత్తరం యిప్పుడే యిచ్చితీరవలెననీ అది ఈ క్రిందిరీతిగా ఉండవలెననీ నేను సూచిస్తూన్నాను.

......ఇండియాదేశప్రజకు స్వపరిపాలనమును సంక్రమింపచేయుడమే మా తక్షణ యుద్ధాశయమని వారికి నచ్చచెప్పాలి.

రెండు ; బ్రిటిష్ ఇండియా కేంద్రశాసనసభకు క్రొత్తగా ఎన్నికలు జరగడానికి మనం ఒప్పుకోవాలి...... ఇందులో ఏమీ కష్టంలేదు. ఇండియాలో ఎన్నిక జరగకూడదంటాడా గౌరవనీయ సభ్యుడు. క్యూబెక్కులో ఎన్నికలు జరిగినవి. ఇండియాలో ఎందుకు జరగకూడదు? ఉద్యోగస్థులకు పని ఎక్కువగా ఉందంటారూ! ఇంకా ఎక్కువమంది ఉద్యోగస్థులను నియమించండి. ఇండియాలోని మన ఉద్యోగస్థులకు తీరికలేకుండా ఉందనే కారణంతో అక్కడ ఎన్నికలు జరపక మన దేశం యొక్క భవిష్యత్తుకు పూర్తిగా భంగం కలిగించడం తగని పని. ఇప్పటి విషమపరిస్థితులలో ఇంతకంటె అసత్యమైన విషయాన్ని ఊహించడం కష్టం. ఇండియాలో నేడు ఎన్నికలు పెట్టడం యిష్టంలేనివారు చెప్పే సాకేగాని యిది అంతకంటె వేరుకాదు ...

మూడు ; ఇండియా శాసనసభలోని అధికసంఖ్యాక పక్షములవారు ప్రభుత్వం ఏర్పాటుచేసుకొన్నతరువాత, ఆ ప్రభుత్వ సభ్యులనే రాజప్రతినిధి కార్యనిర్వాహక వర్గంగా నియమించాలి.

ప్రస్తుత రాజ్యాంగచట్టం ప్రకారం శాస్త్రరీత్యా కార్యనిర్వాహకవర్గం మంత్రివర్గం కాని మాట వాస్తవమే. అయితే రాజప్రతినిధి అన్ని ముఖ్యవిషయాలలోనూ తన కార్యనిర్వాహక వర్గాన్ని మంత్రివర్గంగా భావించి వ్యవహరిస్తాడని మన ప్రభుత్వం ర్యేల హామీ యీయకూడదో నాకు కారణం కనిపించడంలేదు; అనగా మన మంత్రివర్గం

సక్రమంగా యిచ్చిన సలహాలను మనరాజుగారు ఆమోదిస్తూన్నట్లే రాజ ప్రతినిధి తన కార్యవర్గంవారి సలహాలను అంగీకరించవలెనని తాత్పర్యం. కాబట్టి తక్షణం ఈ యేర్పాటుచేసి యుద్ధానంతరం సంపూర్ణ స్వపరిపాలనా స్థాపనకు హామీ యిచ్చినట్లయితే ప్రపంచంలో ప్రజాస్వామ్యస్వాతంత్ర్యములను పునరుద్ధరించడానికి మనం నమ్మకంగా ధైర్యంతో భారతప్రజానీకముయొక్క హృదయపూర్వక సహకారాన్ని ఆర్థించవచ్చును. యుద్ధానంతరం సాధ్యమైనంత త్వరలో ఇండియా స్వాతంత్ర్య ప్రజాస్వామ్యములను పొందేటందుకు మనం సహకారం చేస్తామనికూడా ప్రకటించాలి. అందువల్ల బ్రిటిష్ ఇండియా ప్రజల సంపూర్ణ సహకారం లభించడమేకాక నిజంగా ప్రజాస్వామ్యవాదులైన ఒక పెద్దజాతి ఒక ఘనకార్యాన్ని నిర్వర్తించినట్లుకూడా ప్రపంచ ప్రజానీకముయొక్క స్తుతికి పాత్రులంకాగలం." అన్నాడు సర్ స్టాఫర్డుక్రిప్సు.

ఇది జరిగిన కొద్దికాలానికే అనగా జూన్ అయిదో తేదీని మాస్కోలో బ్రిటిష్ రాయబారిగా పనిచేస్తూన్న సర్ విలియమ్ సీడ్సు, స్థానే సర్ స్టాఫర్డు క్రిప్సును నియమించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఉద్దేశిస్తూన్నదని యం. మాలటావ్‌కు బ్రిటిష్ వ్యవహర్త (British charge de affairs) తెలియపరిచాడు. ఈసందర్భంలో క్రిప్సు స్థితి మామూలు రాయబారి స్థితియే. ఆయన నిర్వర్తించవలసిన ప్రత్యేక వ్యవహారాలేమీ లేవు. సోవియట్ ప్రభుత్వమేమీ అభ్యంతరంచెప్పలేదు. సర్ స్టాఫర్డుయొక్క ఈ నియామకం బ్రిటిష్ రాజకీయవర్గాలలో చాలా ఆశ్చర్యంకలిగించింది. ఆయన 1939 హేమంతఋతువులో కలకత్తాకువచ్చాడు, అక్కడనుండి విమానంలో చుంకింగుకువెళ్ళి, చైనా అంతా విమానంలోనే ప్రయాణంచేశాడు. సింకియాంగ్‌నుకూడా దర్శించాడు. తరువాత మాస్కోనుండి ఇంగ్లాండుకు చేరుకొన్నాడు. ఇండియానుగూర్చిన ఆయన ఉద్దేశాలూ, ఇండియా విషయంలో ఆయన బ్రిటిష్‌ప్రభుత్వానికిచ్చిన సలహాలూ ఇంతకుపూర్వమే ఉదాహరించి ఉన్నాము. లేబరు పియర్ అయిన పార్‌మూరు ప్రభువు కుమారుడే సర్ స్టాఫర్డు. పార్‌మూరు ప్రభువు 1941 జులై 13 వ తేదీని మరణించాడు. 1930 నాటి కార్మిక మంత్రివర్గంలో క్రిప్సు సొలిసిటరు జనరల్‌గా పనిచేశాడు. సర్ స్టాఫర్డు పాప్యులరు ఫ్రంటులో జరిపిన కార్యకలాపములకు, ఆయనపైన లేబరుపార్టీ నిర్మాణోపసంఘం ఒక నివేదికను తయారుచేసి పంపగా, 1939 జనవరి 25 వ తేదీని నేషనల్ ఎగ్జిక్యూటివ్ వారాయనను కార్మిక పక్షంనుండి వెళ్ళగొట్టారు. ఆయన తన స్థితిని పునరాలోచన చేసుకొని పార్టీ పద్ధతి కనుగుణంగా నడుచుకోవడానికి నిరాకరించడం వలననే ఈ పని జరిగింది. తరువాత మే-జూన్ నెలలలో సౌత్‌పోర్టులో జరిగిన 38 వ కార్మికపక్ష మహాసభలో ఈ నివేదికను పునరాలోచన చేయవలసిందని తేబడిన తీర్మానం అత్యధిక సంఖ్యాకుల కార్మి

వోటుతో వీగిపోయింది. 'పాప్యులర్ ఫ్రంటు'నుగూర్చి కార్మిక మహాసభవారి నిర్ణయానికి కట్టుబడివుంటానని వాగ్దానంచేస్తూ సర్ స్టాఫర్డు మే 30వ తేదీని తనను తిరిగీ కార్మికపక్షంలో చేర్చుకోవలసిందని దరఖాస్తు చేశాడు. కాని ఈ ఉత్తరం నూతన కార్యవర్గంవారి నిర్ణయంకోసం పంపబడింది. చిట్టచివరకు 1945 లో తిరిగి కార్మికపక్షంలో చేర్చుకోబడ్డాడు.

1940 మే చివరవారంలోనూ, జూన్ మొదటివారంలోను ఇండియాలో కలిగిన సంక్షోభంయావత్తూ ప్రపంచ సంగ్రామానికి ఆయువుపట్టయిన ఫ్రాన్సు రంగంలో ఆనాడు తటస్థించిన సంఘటనల ప్రభావమే. ఫ్రాన్సుకుమాత్రం దుర్దినాలు బహుత్వరలో వచ్చినవి. డాన్‌జింగు పతనము, జెకోస్లోవేకియా శత్రు పదాఘాతములకు గుతికావడము, పోలాండు బలాత్కారముగా పరులపాలిని పడడం, హాలెండు, బెల్జియం, నార్వేలు దండయాత్రలకు బలిఅవడం, ఇవన్నీ నానాటికి తీవ్రస్వరూపం తాలుస్తూన్న యుద్ధంలో తటస్థించిన ముఖ్య సంఘటనలు. వీటన్నిటి సమగ్ర పరిణామమే మే 14 న ఫ్రాన్సు పతనమునకు హేతువయింది. మే. 14 న కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశం జరుగుతూన్నది. మే 15, 16 వ తేదీలలో ఫ్రాన్సు శత్రువుకు లొంగిపోయిన సంగతి కొద్దికొద్దిగా రేడియోద్వారా బయటపడుతూ వచ్చింది. మే 17 వ తేదీని ప్రపంచమంతా ఒక్కసారి గుప్పుమన్నది. ఫ్రాన్సుపడ్డదన్న వార్త రూఢి కాగానే ప్రపంచం నివ్వెరపోయింది. డన్‌కిర్కు మహావిపత్తుకూడా యింతకుముందే తటస్థించింది. సరే! ఫ్రాన్సు పని అయిపోయింది. ఇక ముందుసంగతేమిటి? హిట్లరును అణచిపెట్టడం సాధ్యంకాదు. ఇంగ్లాండుపైన దండయాత్ర చేయవలెననే సంకల్పం ఆయనకు బాగా ఉంది. ఇదివరదాకా ఆయన ఊహాకు తోచినట్లు కొట్టినబడాయిలన్నీ ఫ్రాన్సు పతనంతో నిజాలుగా పరిణమించినవి. ఇంగ్లాండు దేశం ముట్టడింపబడే యెడల ఇండియా స్థితి యేమిటి? నూటయేభైయేండ్లనుండి ఇండియా ఇంగ్లాండుకు తోకగా చేయబడ్డది. ఇండియా స్థితినిగూర్చి తెలుసుకోవడానికి కాంగ్రెసుకెంతో తెలివక్కరలేదు. ఇండియా ఆశయమేమిటో తిరిగీ చెప్పవలసిన అవసరం లేకపోయినా సంపూర్ణ స్వాతంత్ర్యమే ఇండియా ఆశయమని కాంగ్రెసు మరొకసారి ప్రకటించింది దాదాపు ఒకవారం రోజులాలోచించి కాంగ్రెసు కొన్ని ముఖ్య విషయాలనుగూర్చి తీర్మానంచేసింది. ఆనాడు కాంగ్రెసు అవలంబించిన వైఖరిని పరిశీలించవలెనన్నచో, సరిగా వర్కింగుకమిటీ సమావేశం జరిగే సమయంలోనే జూన్‌లో, 'గాంధీ' ప్రతి బ్రిటిష్‌వానికీ, అని ఒక ప్రఖ్యాతమైన జాబువ్రాసి దానిని రాజప్రతినిధిద్వారా బ్రిటిష్ ప్రభుత్వానికి పంపవలెననే ప్రయత్నంలోఉన్న సంగతి తెలుసుకోవలెను. కేవలం ఆనాటి సంఘటలకు అనుగుణంగా ఆయన బుద్ధి నడిచింది.

అనుకోకుండా ఆయనకొక క్రొత్తవెలుగు కనిపించింది. అందువలన ఆయన దృష్టిలో అంతకు పూర్వం జరిగిన కాంగ్రెసు చరిత్ర యావత్తూ సూర్యోదయం ముందు మంచువలె మటుమాయమైపోయింది. పూర్వంకంటె స్పష్టంగా ఆయన అభిప్రాయాలకూ కాంగ్రెసు అభిప్రాయాలకూ భేదం కనిపించింది. ఈనాడు సంప్రదాయసిద్ధంగా అందరిచేతనూ ఆమోదింపబడుతూన్న అభిప్రాయాలకు కేవలం భిన్నమైన అభిప్రాయాలు గల గాంధీ కాంగ్రెసు నెలా నడిపించగలడు ? ఇంతకుపూర్వం మూడు నెలలకిందట రామఘుర్ లోనే తాను కాంగ్రెసునుంచి వెళ్ళిపోతానని గాంధీ గట్టిగా చెప్పి ఉన్నాడు. కాని సభ్యుల ప్రార్థనలవలననూ, పెద్దల అనునయవాక్యములవలననూ ఆయన కాంగ్రెసులో ఉండవలసివచ్చింది. జూన్ నెలలో వార్ధాలో మళ్లీ ఆ దేస్థితి తటస్థించింది. ఆయన వ్రాసిన చిత్తుతీర్మానంలో ఫ్రాన్సు పతనమునకు విషాదమును వెల్లడిస్తూ, ఫ్రాన్సుపై దండయాత్రచేసినవారు, ఫ్రాన్సుదేశ రక్షణకు పూనుకొన్నవారూ కూడా అక్కడి అమానుషచర్యలకు బాధ్యులైనందుకు దుఃఖించాడు ఆయన దృష్టిలో విజయం లభించినా అది ఎందుకూ పనికిరాని విజయం. హింసకు ప్రతిగా కాంగ్రెసు సమర్పించిన ఆయుధానికి ఆ సంస్థ గర్వించతగి ఉంది. ఆ ఆయుధం కేవలం బలహీనుల ఆయుధమా ? అది బలవంతుల ఆయుధంగా ఉపయోగపడాలి. ఆంతరంగిక కల్లోలం తటస్థించినప్పుడు గానీ, పరాయి దేశాలనుండి దండయాత్రలు వచ్చినప్పుడుగానీ, దౌర్జన్యమునకు ప్రతిగా యిది బలిష్ఠమైన ఆయుధంగా ఉపయోగపడాలి. ఈ సందర్భంలో వర్కింగుకమిటీవారు నిర్వర్తించవలసిన ధర్మం ఒకటి ఉంది. ఈ నూతన ఆయుధాన్ని వారు స్వీకరిస్తే గత చరిత్రకు భిన్నంగా నడవడం అవుతుంది. అంతేకాదు తమ ధర్మకర్తృత్వమునకు ద్రోహం కావించడమవుతుంది. ఈ ఆయుధాన్ని బ్రిటిష్ వారికి ప్రతికూలంగా ప్రయోగించినమాట నిజమే. కాని అది సాంఘిక సమస్యను పరిష్కరించలేకపోయింది. మంత్రిత్వ స్వీకరణమే సరియైన మార్గమని కొందరు సూచించారు. కాని దానివలన ప్రయోజనంలేదు. తగిన అధికారం కానీ వాతావరణం కానీ లేకుండా మంత్రిత్వాలు పుచ్చుకోవడం కాంగ్రెసు కిష్టంలేదు. బలప్రయోగం లేకుండా పరిపాలన జరుగనియెడల కాంగ్రెసు అధికారంకోసం ప్రయత్నమే చేయకూడదు. ప్రజాసామాన్యంపైన అహింసాయుతమైన పలుకుబడి కాంగ్రెసు కున్నదనుకొంటేనే అధికారం స్వీకరించాలి. అనగా కాంగ్రెసు చిత్తవృత్తిలో తీవ్రపరివర్తనం కలగాలని అర్థం. అహింసను తోసి రాజనడంవలన, నిజంగా వర్కింగుకమిటీపైన ప్రజలకుగల విశ్వాసానికి ద్రోహం కావించినట్లవుతుంది. కాబట్టి కాంగ్రెసు విదేశ దండయాత్రలను ఎదుర్కోవడానికి ఆయుధాలను విసర్జించి, అహింసాసైనికులతో సజీవ ప్రాకారాన్ని

నిర్మించబోతున్నదని భారత ప్రజానీకానికి ఎలుగెత్తి చాటాలి. ఇందుకుగాను అహింసలో విశ్వాసం లేనివారంతా తమంతటతాము కాంగ్రెసునుండి వైదొలగాలి— లేదా అనుమానస్థులందరినీ కాంగ్రెసుసభ్యుల జాబితానుండి కొట్టివేయాలి. ఇలాచేస్తే దౌర్జన్యం ఆధారంగాగల సివిక్ గార్డుల సమస్యకూడా పరిష్కారమవుతుంది. ఆ సందర్భంలోకూడా కాంగ్రెసేమీ సహాయం చేయవలసిన అవసరముండదు. ఇంక కాంగ్రెస్ యుద్ధానికి భౌతిక సహాయమేమీ చేయజాలదన్నసంగతి అందరికీ తెలిసిందే. బ్రిటిష్ ప్రభుత్వంవారు తమ చర్యలవలన మన సహకారాన్ని పొందే అర్హతను సంపాదించుకో గలిగినట్లయితే కాంగ్రెసు వారికి నైతికసహాయం చేయగలదు.

గాంధీ సూచించిన విషయాలను పరిశీలించినప్పుడవి నైతిక దృక్పథమునుండి మే గాక, మామూలు రాజకీయ దృక్పథమునుండికూడా సమంజసంగా ఉన్నవని చెప్పక తీరదు. దౌర్జన్యం చేయడం నీతిదాయకం కానేకాదనే మాట అలా ఉండగా ఇండియావంటి దేశంలో అది నిష్ప్రయోజనంకూడా అయితీరుతుంది. అయితే గాంధీజీ చెప్పినదంతా అంగీకరించేయెడల, అహింస దేశంలో బాగా స్థాపింపబడిన తరువాతనే కాంగ్రెసు పరిపాలనా బాధ్యత వహించవలెననీ ఆ ప్రకారం యిప్పుడు ప్రకటన చేయవలెననీ అర్థమవుతుంది. కాని ఈ సందర్భంలో వర్కింగుకమిటీ భారతప్రజాభిప్రాయాన్ని గుర్తించకుండా ఉండచాలదు. గాంధీజీ చేసిన సూచన ప్రజాభిప్రాయానుగుణంగా లేదని వర్కింగుకమిటీకి సందేహం కలిగింది. అయితే గాంధీజీ తన అచంచలవిశ్వాసంవలన తానుసూచించినమార్గంనుండి వైదొలగడానికి యిష్టపడలేదు. కనుక ఆయనకు తోచిన ప్రకారం ఆయన సిద్ధాంతానికనుగుణంగా నడుచుకోవడానికి గాంధీకి వర్కింగుకమిటీ ప్రతిరోధంకలిగించదలచుకోలేదు. ప్రతివారు తమకు తోచినట్లు నడుచుకోవడం మంచిదని గాంధీ గట్టిగానమ్మతాడు. అంతేకాని పైకి 'అహింస' అంటూ రహస్యంగా హింసచేయడం గాంధీకి గిట్టదు. ఈ సమస్య ముందెప్పుడోకాక అప్పటికప్పుడు పరిష్కరించవలసి వచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వం కూలిపోవడం ప్రారంభించింది. అయితే పూర్తిగా నిర్మూలంకావడానికి కొంతకాలం పట్టవచ్చును. పెద్దవారిని శిక్షించడంలో ఆ ప్రభుత్వం బాగా పనిచేసినప్పటికీ, ప్రజలకు హానికలుగకుండా రక్షించడంలో అది అంత శక్తివంతంగాలేదు. అది బందిపోటులను ఎప్పుడూ ఆపజాలదు. కాని కొన్ని సమయాలలో తానాపగలనని ప్రగల్భాలు కొట్టుకొంది. ఈ చిత్రించిన విషయాలన్నీ నిజాలయితే దేశం అహింసా పోరాటానికి సంసిద్ధంకావాలి. ఎలా సంసిద్ధంకావాలీ అని గాంధీని అడిగితే ఆయన ఫలానా పద్ధతిని తయారుకావాలని స్పష్టంగా ఒక కార్యక్రమాన్ని ఈయజాలకపోవచ్చును. కాని ప్రజలప్పటి పరిస్థితులను సరిగా అవగాహన చేసు

కోవాలి. (1) దేశంలో దొమ్మీలు బందిపోట్లూ జరిగితేనూ (2) ఆఫ్ఘనులు దేశంలోకి వస్తేనూ కాంగ్రెసువారేమి చేయాలో ప్రజలు వారికి చెప్పాలి. "ఆఫ్గనులువస్తే వారి ముందే మనమంతా మరణింతుముగాక! ఇండియా అంతా నేడు నాచేతిలో ఉన్నప్పటికీ సేనాపనేచేస్తాను. నాకు సైన్యమక్కరలేదు. బందిపోట్ల విషయంలోకూడా అంతే. కాంగ్రెసు అటువంటి అహింసాయుత ప్రభుత్వాన్నే స్వీకరించాలి. ఈరోజున మనమాపని చేయజాలము. మనమీనాడింగ్లీషువారితో పోరాటం మాని మనలో మనం పోట్లాడుకొంటూన్నాము" అన్నాడు గాంధీ. అహింసా స్థాపనమునకిదే సమయమని ఆయన తలంపు. "తూర్పుకు మొగంపెట్టి పడమరకెవ్వడూ నడువజాలడు. "నిజంగా అహింసాస్థాపనకు సమయం వచ్చిందా" అని సందేహాత్ములు ప్రశ్నిస్తూన్నారు. అసహాయోద్యమము, సాత్విక నిరోధము, త్రివిధ బహిష్కరణము, నిర్మాణకార్యక్రమము, శాసనోల్లంఘనము, సత్యాగ్రహములనుగూర్చి కూడా వారిలాగే ప్రశ్నించారు. ఈ అన్నిటినీ పునాదిగా కలిగిన స్వరాజ్య శిఖరానికి అహింస మకుటాయమానంగా వెలుగొందుతూంది. ఇదంతా యిలా ఉండగా భారతజాతి చావు బ్రతుకులతో ఉన్నప్పుడు, తన సిద్ధాంతాలనే గట్టిగా పట్టుకొని వేలాడుతూ గాంధీ కాంగ్రెసును విడనాడిపోకూడదని చాలామంది వాదించారు. సిద్ధాంతాలు వేరు. నిత్యజీవితం వేరు. గాంధీగారి గాఢవిశ్వాసం వలన దేశీయులలో నిర్మాణకార్యక్రమమును కొనసాగించవలెననే ప్రయత్నం హెచ్చుకావాలి. కాని మన దౌర్బల్యం గాంధీకి చాలాకాలంనుండీ తెలుసు. అయితే ఔదార్యంగా ఉండడం ఆయన ధర్మం. న్యాయం చాలా కఠినమైనది. అది ఔదార్యాన్ని కూడా సహించదు. 50 సంవత్సరాలు కష్టపడి కావించి 20 సంవత్సరాలనుండి తీర్చిదిద్దిన ఈ శిల్పకళాభవనాన్ని భారతజాతి ఒక్కసారిగా కూలద్రోయకుండుగాక! భారతీయులు దానిని వికృతంగాగానీ నిరుపయోగంగానీ చేయకుందురుగాక! భారతజాతి ఒక చికిత్సాలయం. గాంధీ - వైద్యుడు. చికిత్సాలయంలోని రోగులు పవిత్రులు కానంతమాత్రాన వైద్యుడు వారికి వైద్యంచేయకుండా మానతాడా? ఎలా అయితేనేం గాంధీ చివరకు మెత్తపడ్డాడు. ఆయన సహచరులాయన అభిప్రాయాలను తెలుసుకోగలిగితేచాలు సంతోషమాయనకు. వారి తీర్మానంలో హింసకూ అహింసకూ కూడా స్థానం ఉండడానికి వీలులేదు. వారు ప్రస్తుతం సైన్యాన్ని సహిస్తూన్నమాట నిజమే. కాని దానిని రద్దుచేయడం గాంధీ ఆశయమూ, కోరికా కూడా. రాష్ట్రాలకు సంబంధించినంతవరకే పద్ధతిని ఆయన అంగీకరిస్తూన్నాడు. కాని కేంద్రంలో అధికారం రాగానే ఈ విషయం అప్పుడు నిర్ణయంకావాలి. కాబట్టి 1940 జూలైలో చేయబడిన తీర్మానంలో యిలావుంది. "విదేశ దండయాత్రల విషయంలోగానీ, అంత

రంగిక కల్లోలాల విషయంలోగానీ ఇండియాలోనూ ప్రపంచలోనూ ప్రస్తుతం ఉన్న పరిస్థితుల కనుగుణంగా కాంగ్రెసు నడుచుకోవలసి ఉంది. అయితే ఈ సందర్భంలో కాంగ్రెసు అవలంబిస్తూన్న కార్యక్రమంతో గానీ చర్యలతో గానీ గాంధీకేమీ బాధ్యత లేకుండా చేయబడింది. తనకు తోచిన విధానం, తన మహదాశయముల ననుసరించి కృషి చేయడానికి ఆయనకు స్వాతంత్ర్యం ఉంది". ఈ తీర్మానంలో గాంధీకి పోలీసు సైనిక వ్యవహారాలలో మాత్రం బాధ్యత లేకుండా చేయబడినట్లు కనిపిస్తూన్నప్పటికీ, నిజానికి తదితర బాధ్యతలనుకూడా, అనగా సత్యాగ్రహమును నడిపే బాధ్యతను సైతమూ తొలగించలేదా అని సందేహం తోస్తూన్నది. కాగితంపైన యీ తీర్మానం కనిపిస్తూండగా ఆయన సత్యాగ్రహ సమరాన్ని ప్రారంభించ వీలవుతుందా? అలా కానట్లయితే ఇండియాలో సైన్యము లేకుండా కాంగ్రెసు చేసేటంత వరకూ సత్యాగ్రహం ప్రారంభించడం సాధ్యంకాదని ఆయన అభిప్రాయమా? కాక ఫ్రాన్సు పతనంతోనే బ్రిటిష్ గవర్నమెంటు ఆచరణలో అదృశ్యమై పోయింది గనుక, ఇండియా సర్వస్వతంత్రమై సరియైన అహింసా పద్ధతులతో తన వ్యవహారము లను తాను చక్కపెట్టుకోగలిగిన స్థితికి వచ్చిందని ఆయన నమ్ముతూన్నాడా? గాంధీ కధికారమిస్తే ఆయన యేమిచేస్తాడనేది మనకక్కరలేదు. నిజానికాయన యేమిచేస్తా డో చెప్పలేక పోవచ్చును. కాని ఈ నూతనాభిప్రాయాన్ని అప్పటినుండీకూడా ప్రజల ముందుపెట్టి ప్రచారంచేస్తూ వారి సహకారాన్ని సంపాదించడానికీ భారతజాతి ప్రయ త్నించవలెనని ఆయన కోరిక. మన స్వచ్ఛంద సేవకులు శాంతంగానూ ఉండవచ్చు, లేక దౌర్జన్యమూ చేయవచ్చు, అని సందిగ్ధంగా చెప్పేమాట లాయనకు గిట్టవు. అటువంటి మాటలే ఆయనను కాంగ్రెసుకు దూరం చేయగలవి.

ఆనాటి ప్రజా హృదయం ఎలాఉందో యిక్కడ చర్చించడం అవసరం:— 1940 జూన్‌లో వార్ధాలో జరిగిన తీర్మాన ఫలితం కాంగ్రెసు రెండుగా విడిపోవడమేనా? నాడు కాంగ్రెసుకు తటస్థించినదనుకొనే క్లిష్టదశనుగూర్చి వివిధ దృక్పథాలు కలవారెలా అభిప్రాయపడ్డారో యింతవరకూ సంగ్రహంగా పరిశీలించి ఉన్నాము. ఇక ఈ సంద ర్భంలోనే కాంగ్రెసుకు నిజంగా మిత్రులైనవారు వేసే కొన్నిప్రశ్నల కిక్కడ సమాధాన మీయవలసి ఉంది. తన ఆశయాలకు పరమావధిఅయిన ఈ నూతన ప్రయోగమునకు దేశం సంసిద్ధంగాఉందని గాంధీ నమ్ముతూన్నాడా? ఆయనకువలెనే అందరికీ యిట్టి మహోన్నతభావం నాటుకొనిపోయిందని ఆయన అనుకొంటేనేగదా ఇట్టి నూతన ప్రయోగమునకాయన పూనుకోవలసింది? కానిచో ఇటువంటి పనికి పూనుకోవడం ప్రమాదం కాదా? అని కొందరు ప్రశ్నిస్తారు. అయితే కళాశాలా విద్యార్థులను విశ్వ

విద్యాలయాలలోని ఆచార్యులు పరీక్షచేసి ఉత్తీర్ణులైనట్లు ప్రకటిస్తే, ఆ విద్యార్థులందరూ ఆచార్యులవారంత పండితులూ విజ్ఞానవంతులూ అయినారని అర్థమా? అని ఆ ప్రశ్నకు ప్రతిప్రశ్న వేయవచ్చును. ఆదేవిధంగా ప్రతివిషయంలోనూ, నూటికి కొన్ని మార్కులు వస్తేనూ మొత్తంపైన నూటికి 35 వంతున మార్కులువస్తేను, ఒక విద్యార్థి ఫె[illegible] లేషక పరీక్షలో ఉత్తీర్ణుడయినట్లు భావింపబడుతూన్నాడు. అనగా అతని జ్ఞానం నూటికి 35 వంతులైతే అజ్ఞానం 65 వంతులన్నమాట. అలాఅయినప్పటికీ నూటికి 22 మందిమాత్రమే పరీక్షలలో ఉత్తీర్ణులవుతూన్నారు. కాబట్టి పరీక్షలలో ఉత్తీర్ణులయ్యేవారి సంఖ్యయే చాలా తక్కువ—ఇక వారి జ్ఞానంకూడా అంత తక్కువగానూ ఉంటూన్నది అయినప్పటికీ విశ్వవిద్యాలయాలు నడుస్తూన్నవి. పరీక్షాధికారులు పరీక్షలు నడుపుతూనే ఉన్నారు. తలిదండ్రులు పిల్లలను చదివిస్తూనే ఉన్నారు. విద్యార్థులు కష్టపడి చదువుతూనూఉన్నారు. కాబట్టి మనకందఱకూ అభిమానపాత్రములైన విశ్వవిద్యాలయ ప్రమాణములనుబట్టి భారతజాతియొక్క అర్హతను మనమేల గుర్తించరాదు? 1920 లో అసహాయోద్యమంలోనూ 1921 లో శాసనోల్లంఘన సాత్విక నిరోధములలోనూ ఉత్తీర్ణమై 1930-1932 లలో సత్యాగ్రహ పట్టపరీక్షలో గెలుపొందిన భారతజాతిని 1940 లేక 41 లో తిరిగీ ఆ సత్యాగ్రహములోనే యం. ఏ. పరీక్షకో, ఆనర్సు పరీక్షకో ప్రయత్నించమనడంలో తప్పేముంది? ఈ నూతన జీవిత విశ్వవిద్యాలయ స్థాపకుడు బ్రతికిఉండగానే, ఆయన సలహాతో పట్టపరీక్షానంతర ఉన్నత విద్యను మనమేల అభ్యసింపకూడదు? సత్యాగ్రహసైన్యం సంసిద్ధంగా లేకుండాఉన్నప్పుడు 'దురాగ్రహ' సైన్యాన్ని అనగా దౌర్జన్యయుతమైన సైన్యాన్ని రద్దు చేయజాలమన్నందువలన ప్రయోజనంలేదు. ప్రకృతి శూన్యస్థితిని (Vaccum) ఎలా ఒప్పుకోదో రాజకీయాలుకూడా శూన్యస్థితిని అలాగే ఒప్పుకోవు. శూన్యంలో ఏదోఒకటి ప్రవేశించితీరాలి. ఖాళీఅయిన వస్తువుకు బదులుగా మఱొకదాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయత్నించకపోతే ఆ ఖాళీ అలాగే భయంకరంగా కనిపిస్తూఉంటుంది నీళ్ళలోదిగకుండా ఈత నేర్చుకోవడంలాగా కనిపిస్తుంది కథ. కాబట్టి సత్యాగ్రహసైన్యాన్ని సంసిద్ధంచేయడం మారణసైన్యాన్ని రద్దుచేయడం రెండూ ఒకేసారి జరగాలి. ఈ రెండు పద్ధతులూ ఒకేవైపుకు దారి తీయగలవు. కాని రెండూ రెండు దశలు. అయితే ఇటువంటి విశిష్ట విషయాలలో, ముఖ్యంగా పరివర్తనకాలంలో కొంత రాజీపద్ధతి ఉండాలి. రాజకీయనాయకులు కొందఱు పోలీసులను ఉంచుకొని సైన్యాన్ని తగ్గించాలనీ, మఱికొందఱు సైన్యాన్ని ఉంచుకొని పోలీసులనుతగ్గించాలనీ కోరవచ్చును. గాంధీకూడా కొంతకాలం పోలీసును ఉంచుకోవడానికి గానీ, తాత్కాలికంగా కొంతకాలం సైన్యాన్ని సహితం ఉంచుకోవడానికిగానీ అంగీకరించవచ్చును, కాని

పోలీసుకానీ, సైన్యంకానీ, ఉండవలసిన అవసరంలేని స్థితి యేర్పడవలననే సిద్ధాంతం మాత్రం నిష్కళంకమైన భావంతో అసందిగ్ధమైన భాషలో అంగీకరింపబడాలి. కాంగ్రెసు వర్కింగుకమిటీ నిజంగా అందుకే ప్రయత్నించింది. అది అహింసలో తనకుగల విశ్వాసాన్ని పునరుద్ఘాటించింది. కాని సైన్యాని రద్దు చేయడం విషయంలో తనకున్న భయాన్ని ప్రకటించింది. ఈ స్థితిని 'తూర్పుకు మొగంపెట్టి పడమరకు నడవడంలాగా ఉందని' హాస్యం చేయడం తేలికే. రాజకీయాలలో అవహేళనచేస్తూ తేలికగా కాలక్షేపంచేయవచ్చు. కాని హాస్యాలూ, అవహేళనలూ ఆధ్యాత్మికోన్నతికి యేమాత్రమూ దోహదం చేయవు.

జాతీయ వ్యవహారాలలో హింసను త్యజించి అహింసామార్గాన్ని సూర్దవంగా అవలంబించవలెనంటే, ఒక్కసారిగా జరగడంకష్టం. ఈ కొత్తచట్రంలో మన అహింసా సైన్య విన్యాస రచన యావత్తూ తక్షణం యిమడడం దుస్తరం కాబట్టి మన లోటుపాట్లను గాంధీ సానుభూతితో సర్దుకుపోయేటట్టు చూచుకోవాలి. ఔదార్యానికి అంతరాయంగా ఉండని న్యాయబుద్ధితో ఆయన నిర్ణయాలు జరగాలి. ఇంతా అయితే గాంధీ వైద్యుడు ; మనం ఆసుపత్రి. ఆయన లేకపోతే మనకు చికిత్సలేదు. మనం లేకపోయినా తన నూతన ప్రయోగాలను మరొకచోట ఆయన సాగించవచ్చునుగానీ, యింత వైశాల్యంగా ఒక పెద్ద జాతికి సంబంధించి సాగించజాలడు. ఆయన జీవించఉండే ఈ కొలది సంవత్సరాలలోనే, ప్రపంచానికి చేయగలిగినంత మంచి ఉపకారం చేయడం ఆయన కర్తవ్యం. మనం స్వీకరించగలిగినంత మహోపకారాన్ని స్వీకరించడం మనహక్కు. వార్ధా తీర్మానంవలని ఫలితాలను అతిశయోక్తులతో ఊహించుకొని, యిక నిర్మాణకార్యక్రమం వెనుకపట్టినట్లేనని వృథాగా కంగారుపడవలసిన అవసరం లేదు. వర్కింగుకమిటీ తన ప్రస్తుత విధానంలో తీవ్ర పరివర్తనం కలుగచేయడానికి జంకింది. అంతేకాని తన విధానాన్ని తారుమారు చేయలేదు. కాంగ్రెసు విధానానికి యిప్పటికీ అహింసయే ఆధారం. నిర్మాణకార్యక్రమం అంటే అహింసను ఆచరణలో పెట్టడమే. ఉన్నదానికంటె ఎక్కువగా ఊహించడంవలన కంగారు కలగడం సహజం. ఏదైనా ఒక విషయాన్నిగూర్చి పట్టుదలగలవారే ఎక్కువ భయమూ ఎక్కువ ఆశా వెల్లడిస్తూంటూరు. కాబట్టి పూర్వాచారపరాయణులే తేలికగా, ఇటువంటి భ్రాంతికి లోనవుతూంటారు. మనకిదివరకు తటస్థించిన అపజయాలు మన పట్టుదలకు కారణాలు కావలెనేకానీ, నిరాశకూ, నిస్పృహకూ, నిష్క్రియకూ దోహదములు కాకూడదు. గాంధీజీయొక్క నూతన కార్యక్రమం ప్రారంభింపబడినప్పుడది కాంగ్రెసునూ తన కనుకూలంగా మార్పుచేసుకోగలిగింది. ఈ కార్యక్రమంయొక్క ఉన్నతసోపానములు

కాంగ్రెసును మరింత ఉన్నతపథములకు తీసికొనిపోగలవు. కాని గాలిలో హింసా భావం వ్యాప్తమై ఉందని గాంధియే అంటూన్నాడు. సన్నిహిత భవిష్యత్తులో అరాచకమూ, దౌర్జన్యమూ పొడచూపేయెడల, కాంగ్రెసుమంత్రులు పదవులలోనే ఉంటే తప్పనిసరిగా కటికి హింసకు దిగవలసివచ్చేది. అప్పుడు ఒక్కసారిగా మన ఆశలన్నీ నిరాశలయ్యేవి. కాంగ్రెసొక కొత్త విధానాన్ని నిర్మించవలసివస్తే అడుగునుండి పైదాకా కట్టుకొనిరావాలి. కాబట్టి కొంత నిగ్రహం అవసరం. ఇప్పటికే కాలం బాగాలేదు.. ముందింతకంటెకూడా ఎక్కువ చెడుకాలం రావచ్చు. అరాచకాన్ని ఆపడానికి మంత్రిత్వాలు తిరిగి పుచ్చుకోవలెనని చెప్పేవాదమే, మనం అపఖ్యాతిపాలుకాకుండా ఉండేటందుకు వాటిని పుచ్చుకోకూడదని చెప్పడానికి కూడా పనికివస్తుంది. మంత్రిత్వ స్వీకరణం అహింసకు దారితీయదని గాంధీ స్పష్టంగా అంటూన్నాడు. మనం తగినంత అహింసావలంబులమే అయినట్లయితే, హిందూ మహమ్మదీయుల హృదయపూర్వక సమైక్యతకు బ్రిటిష్‌వారుకూడా ఆటంకం కలిగించగలిగి ఉండేవారు కారని ఆయన నమ్మకం. ఇంతా అయితే అహింస మనకు మార్గంకాని లక్ష్యంకాదు. అది ఒక ప్రయత్నం, ఒక దృక్పథం అంతేకాని పరమావధి కాదు. సత్యానికి పవిత్రతకూ, న్యాయానికీ ఔదార్యానికీవలెనే అహింసకుకూడా ఒక్కసారిగా పరిపూర్ణత్వం కలుగదు. కాని ఈ చెడు ప్రపంచంలో వీటికి పరిపూర్ణత్వం ఆపాదింపబడుతూన్నది. మనం జీవించివున్న అల్పకాలంలో ప్రపంచాన్ని ఇప్పటికంటె ఎక్కువ పవిత్రవంతంగానూ ఎక్కువ దయాపూరితంగానూ చేయాలి. అనగా అజ్ఞానాన్ని అతిక్రమించి ఒక అడుగు ముందుకుపోవడమే విజ్ఞానమైనట్లు. ఒక చెడును తొలగించి ఒక్కడుగు వేయుడమే పవిత్రత అని మా వినయపూర్వకాభిప్రాయం. కాంగ్రెసు సంస్థను గుర్తించవలసిందని కోరుతూ 1931 లో లండనులో జరిగిన రెండవ రౌండుటేబిల్ సమావేశంలో గాంధీ చెప్పిన భావిసూచక వాక్యాలు మనమీ సందర్భంలో జ్ఞాపకం తెచ్చుకోవాలి.

"మీరు నన్ను నమ్ముతూన్నట్లు కనిపించినప్పటికీ కాంగ్రెసు సంస్థను మాత్రం అపనమ్మకంతో చూస్తూన్నారు. నేనా సంస్థ అనే సముద్రంలో ఒక జలబిందువును మాత్రమే. కాబట్టి నన్నా సంస్థనుండి ఒక్క క్షణంకూడా వేరుచేసి మాట్లాడవద్దు. నేనా సంస్థను మించినవాణ్ణికాదు. నాకొక స్థానము మీరిస్తే నాయందు నమ్మకముంచి కాంగ్రెసును కూడా విశ్వసించండని నేను మిమ్ములను కోరుతూన్నాను." మనమొక కొత్త విజ్ఞానశాస్త్రాన్ని ఆచరణలో పెడుతూన్న సంగతి జ్ఞాపకముంచుకోండి. అందులో ఇమిడివున్న మూలద్రవ్యాలేవో మనకు తెలియవు. వేలకొలదీ సంవత్సరాలనుండీ చేయబడిన వందలకొలదీ నూతనప్రయోగాలు పరిష్కరించజాలని సమస్యలను మనమిప్పుడు

పరిష్కరించవలసివుంది. మనలో ఒకనూతన శాస్త్రవేత్త అవతరించాడు. ఆయన ప్రయోగశాలను నిర్మించుకోడానికి మనం సహాయపడ్డాము. మనమందరం కలసి విరోపాఖండం శాశ్వతంగా సర్వనాశనం కాకుండా ఉండే సదుపాయాలను కొత్తగా కనిపెట్టడానికి కృషిచేదాం. మన శాస్త్రజ్ఞుడు కేవల శాస్త్రవేత్తయేకాదు— సుప్రసిద్ధ శిల్పికూడా. కావుననే జాతీయమహాసభ అనే విశిష్టకళామందిరమును ఆయన నిర్మించగలిగాడు. ఈ ప్రసిద్ధ భవన నిర్మాణంలో ఆయనకు తోడ్పడిన మనమే, దీని వినాశనానికి కారకులం కాకూడదు. ఇంత బ్రహ్మాండమైన సంస్థకు మనం నాయకత్వం వహించవలెననే కోరికకలిగితే అందుకు అర్హత సంపాదించుకోవాలి. కనుక యిటువంటి క్లిష్టపరిస్థితులలో మనం నిరాశకుగానీ, నిందకుగానీ చోటీయకూడదు. కాంగ్రెసులోని రెండు పక్షాల వారికీ యింకా ఎక్కువ ఓర్పూ, ఎక్కువ సహనమూ ఉంటే, నూతన ప్రపంచ నిర్మాణానికి తోడ్పడి ఒకానొక మహాకవి,

"ప్రేమతో శాసనము సంచరించునాడు - విడివడిన లోకమానంద వివశమగును
అలమేవచ్చి శాంతి పాదాలబడును - పావురము డేగయును ఒక్కచోవసించు."

అని కన్న కలలను యథార్థముకావించి కాంగ్రెసు తనఉనికిని సార్థకం చేసుకోగలదు. వర్కింగుకమిటీవారు తఱచుగా సమావేశం కావలెనని తమలో తాము నిశ్చయించుకొన్నారు. ప్రతిసభ్యుడూ అధ్యక్షుని పిలుపుకు వెంటనే అందుబాటులో ఉండవలెనని హెచ్చరిక చేయబడింది. 1940 జులై అంతంలో అ. భా. కాం. సం. సమావేశం కానున్నదని ప్రకటింపబడింది. ఈ అన్నికారణాలవల్ల పరిస్థితులు చాలా విషమంగా ఉన్నట్లు దేశం అర్థంచేసుకొంది. కాంగ్రెసు కమిటీలన్నీ క్లిష్టసమయంలో తయారుగా ఉండడానికి తగిన చర్యలు ముందుగా తీసికోవలెనని అఖిలభారత కాంగ్రెసు కార్యాలయంవారు తమ అధీనసంఘాలకు మాటిమాటికీ జ్ఞాపకం చేస్తూవచ్చారు. ప్రమాణపత్రాలు విరివిగా పంపబడినవి. కాంగ్రెసు సేవాదళోద్యమం సరిగా నడుస్తూన్నసంగతి ప్రత్యక్షంగా పరిశీలించి కావలసిన సమాచారమును సేకరించేటందుకు కాంగ్రెసు వర్కింగు కమిటీవారు తమ ప్రతినిధిగా ఆర్. యస్. పండిట్‌ను రాష్ట్రాలకు పంపినారు. కాంగ్రెసు సంస్థలలోని క్రమశిక్షణనుగూర్చి, ముఠాలనుగూర్చి, వారి కార్యకలాపాలను గురించీ వారు కాంగ్రెసుపనికేవిధంగా అడ్డంకుగాఉన్నారో దానినిగూర్చి, కాంగ్రెసువారు నియమభంగంగా ప్రవర్తిస్తూన్నారా అనే సంగతినిగూర్చి పక్షనివేదికలను పంపవలెననీ అధీనసంఘాలకు ఉత్తరువులు జారీచేయబడినవి. అంతేకాదు. ఖాదీని బాగా ప్రచారంలోకి తీసుకొని రావడానికీ హరిజనులతోనూ తక్కిన అల్పసంఖ్యాకుల తోనూ సన్నిహిత సంబంధం కల్పించుకోవడానికీ, కార్యాలయవ్యవహారములు బాగా

నడవడానికీ, యేమిచర్య తీసుకోబడిందని సత్యాగ్రహ సన్నాహాలను గురించి కాంగ్రెసువాదులూ తదితర ప్రజాసామాన్యమూ యేమనుకొంటున్నారు. ఈ సందర్భంలో అధీన కాంగ్రెసు సంఘాలయొక్కయూ స్థానికసంఘాలయొక్కయూ సహకార మెంతవరకు లభిస్తుంది? రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రచారమూ, శిక్షణశిబిరాలూ ఎలా నడుస్తూన్నవి? అని ఒక ప్రశ్నావళిని తయారుచేసి అ. భా. కాం. సం. వారు అధీన సంఘాలకు సమాధానాలకోసం పంపారు. ఇక ప్రభుత్వంవారుకూడా ఊరకుండలేదు. నిర్బంధవిధానాన్ని ద్విగుణీకృతోత్సాహంతో సాగించారు. అరెస్టులు, ఖైదులు, సోదాలు, డిటెక్షన్లు విరివిగా సాగినయి. కాంగ్రెసు తన కర్తవ్యమును నెరవేర్చి తీరవలెనని సంకల్పించుకొంది. ప్రపంచయుద్ధపరిణామంలో ఫ్రాన్సు పతనమొక ప్రధాన ఘట్టము. కాబట్టి గాంధీ మరొకసారి రాజప్రతినిధిని దర్శించడం అవసరమనిపించింది. గాంధీ ఒక పక్షపు మనిషిగాగానీ, ఒక నాయకుడుగాగానీ ఆహ్వానింపబడలేదు. ఈ సంగతి ఆయనే ఒకసారిలా వ్రాశాడు.

“ఆయన ఒక నిర్ణయానికి వచ్చేటందుకు నాచేతనైనంతవరకాయనకు సహాయం చేయడానికి ప్రధానంగా కాంగ్రెసు దృక్పథము నాయనకు వివరించి చెప్పేటందుకు నేను స్నేహితుడుగా ఆహ్వానింపబడ్డాను.” ముఖ్యంగా యుద్ధవ్యవహారాలు విద్యుద్వేగంతో నడుస్తూన్నప్పటి కథ యిది. “వెస్టుమినిస్టరు మోస్తరు అధినివేశ ప్రతిపత్తి ఇండియాకు అంగీకారంగా ఉంటుందా కాదా అనే విషయమే ప్రస్తుతం ప్రతివారూ ఆలోచించవలసిన విషయం. ఇప్పటికే అది వట్టి బూటకం కాకుండా ఉంటే యుద్ధానంతరమైనా అది బూటకంగా పరిణమించి తీరుతుంది. బ్రిటను గెలిచినా ఓడినా కూడా జరిగిన కొలది శతాబ్దాలలో ఉన్నట్లు దాని స్థితి యికముందు ఉండదు. అయితే ఆ దేశం ఓడిపోవడమే జరిగితే ఆ ఓటమి చాలా శ్లాఘాపాత్రంగా ఉంటుంది. బ్రిటను ఓడిపోతే—అటువంటి పరిస్థితులలోఉన్న దేశమేదీ ఓటమిని తప్పించుకోలేదు గనుక ఓడిపోతుందికూడా—ఆమె విజయాన్నిగూర్చి యింతగట్టిగా చెప్పజాలను. అధికార కేంద్రీకరణ విధానాన్ని క్రమానుగతంగా అవలంబించడంమూలాన బ్రిటను విజయం పొందగలదు” ఇవి గాంధీజీ అభిప్రాయాలు. కాంగ్రెసు చేస్తానన్న ఆ నైతిక సహాయాన్నికూడా బ్రిటను నిరాకరించినందుకు గాంధీ మిక్కిలి చింతాక్రాంతుడైనాడు. బ్రిటను దానిని అంగీకరించిఉంటే యుద్ధ వాతావరణం ఆదేశాని కెంతో అనుకూలంగా మారిఉండేది. బహుశా గాంధీ కాంగ్రెసు కున్నదనుకొనేటంత నైతికబలం, నిజంగా దానికున్నట్లు బ్రిటను భావించిఉండకపోవచ్చును. ఇండియాయొక్క ఆశయం తక్షణ సంపూర్ణ స్వాతంత్ర్యంగా ఉండవలెననీ అందుకేమాత్రమూ తక్కువగా ఉండ

రాదనీ గాంధీ ఉద్దేశం. ఆంతరంగిక కల్లోలాలను అణచివేసేటందుకు గానీ, పరాయి దేశాలనుండి వచ్చేదండయాత్రలను తట్టుకొనేటందుకు గానీ కాంగ్రెసువాదు లాయుధ బలప్రయోగాన్ని నిరాకరించవలెనని ఆయన ఆశించాడు. రాజప్రతినిధి కార్యనిర్వాహక వర్గము పెద్దది చేయబడవలెననే ఆలోచనలు జరుగుతూన్నవి. కాంగ్రెసావంక చూడ దలచుకోలేదు. కాంగ్రెసుకు కావలసింది సంపూర్ణ స్వాతంత్ర్యమూ—అహింస. ఈరెం డింటికోసం కాంగ్రెసు ప్రమాణం చేసింది. రాజప్రతినిధి కార్యనిర్వాహకవర్గంలో ఉండ డానికంగీకరిస్తే వెంటనే రాష్ట్రాలలో మంత్రివర్గాలను కూడా తిరిగీ స్వీకరించవలసీ వస్తుంది. అనగా కాంగ్రెసుకూడా యుద్ధయంత్రంలో ఒక ప్రధానాంగంగా పనిచేయవల సివస్తుందన్నమాట. గాంధీకి సంపూర్ణాధికారమిస్తే ఈ ఉద్యోగాలవంకకు పోడాయన. లేక ఈ ఉద్యోగాలను అన్నిటినీ ఆక్రమించడంకూడా ఒక రాజకీయపుఎత్తేనని అందఱూ నమ్ముతూన్నట్లుగా కాంగ్రెసుకూడా నమ్మితే ఆయనకు తగాదాలేదు. కాబట్టి కాంగ్రె సీరెండు పద్ధతులలో యేపద్ధతిని అవలంబించదలచుకొన్నదో నిర్ణయించుకోవాలి.

ఐరోపాఖండ యుద్ధ పరిస్థితులలో అనుక్షణమూ తటస్థిస్తూన్న ఆశ్చర్యకర సంఘ టనలనుబట్టి అఖిలభారత కాంగ్రెసు సంఘసమావేశం జరుగవలసివచ్చింది. వర్కింగు కమిటీవారు తీసుకొన్న కొత్తచర్యను ఆ సమావేశం ఆమోదించవలెను. ముఖ్యంగా రామ ఘర్ తీర్మానము ననుసరించి భారతదేశ సమస్యను సర్వతోముఖంగా పునఃపరిశీలన చేయడంకూడా ఆ సంఘమునకు అవసరమయింది. వర్కింగు కమిటీ ప్రతిదినమూ సమా వేశమై ఎప్పటి సమస్యలప్పుడు పరిష్కరిస్తూండడం మంచిదనికూడా దాదాపు అని పించింది. కాని అలా సమావేశం కాకపోయినప్పటికీ వార్ధాలో సమావేశమైన ఒక పక్షంరోజులలోనే ఢిల్లీలో జులై 3 వ తేదీని మరల సమావేశమయింది. అక్కడ తిరిగీ ఆ పాత చిక్కులన్నీ ద్విగుణీకృత బలంతో ప్రత్యక్షమయినవి. గాంధీజీ తిరిగీ అహింసా సిద్ధాంతాన్ని చర్చకు తీసుకొనివచ్చాడు. జూన్ 21 వ తేదీని కాంగ్రెసు వర్కింగుకమిటీవారు వార్ధాలోచేసిన ప్రకటనకు వ్యాఖ్యానం చేయడంలో కాంగ్రెసు వాదులలో కలిగిన పరస్పర విభేదాలను స్పష్టంగా సభవారికి తెలియపరిచాడాయన. వార్ధా తీర్మానంలో రెండు పేరాలు కాంగ్రెసుయొక్క అహింసా విధానమునుగూర్చి స్పష్టంగా వ్రాయబడి ఉన్నప్పటికీ, కొన్ని పత్రికలున్నూ కొంతమంది కాంగ్రెసువాదు లున్నూ కాంగ్రెసు విధానములో అహింసకున్న పరిపూర్ణస్థానం తొలగింపబడినదని నమ్ముతూన్నారు. కాబట్టి వర్కింగుకమిటీవారి అభిప్రాయాన్ని తిరిగీ విశదీకరించడం ఉచితమని గాంధీ భావించాడు. సాధ్యమైనంతవరకు ఆంతరంగిక కల్లోలాలను అణచివేయు డానికి, కాంగ్రెసు క్రమశిక్షణకు లోబడి అహింసాతత్పరులైన కాంగ్రెసు సేవాదళముల

పైననే వర్కింగుకమిటీ పూర్తిగా ఆధారపడి ఉన్నదనిన్నీ, మన వలంటీర్లుగానీ సివిక్ గార్డులుగానీ తమతోడి యితర సంస్థలనుచేసే సహాయమంతా అహింసా పూర్వకంగానే ఉంటుందనీ వర్కింగుకమిటీవారు తిరిగీ ప్రకటించవలెనని ఆయన కోరినాడు. అంతవరకూ భారతజాతి కర్తవ్యమునుగూర్చి చెప్పవలసిన అవసరం వర్కింగు కమిటీకి కలుగలేదని గాంధీ ఒప్పుకొన్నాడు. కాని యూరోపియను జాతుల రక్షణవిషయంలో హింసా విధానం సంపూర్ణంగా నిరుపయోగమయిందని తేలిన తరువాత వర్కింగుకమిటీ యేదో ఒక నిర్ణయం చేయవలసిన తరుణం వచ్చిందని ఆయన భావించాడు. అంతవరకూ వర్కింగు కమిటీవారెటూ ఒరగకుండా ఉండడం ఉచితమేనని ఆయన తలంపు. దీనినిబట్టి కాంగ్రెసు వాదులకు సైనిక శిక్షణలోగానీ, సైనిక చిత్తవృత్తికి దేశాన్ని తయారుచేసే యితర కార్యకలాపంలోగానీ సంబంధం ఉండకూడదని అర్థమవుతుంది. కాబట్టి యిప్పుడు ఇండియా రక్షణకోసం సంఘటితపరుస్తూన్న సైనిక సన్నాహాలను కాంగ్రెసువర్కింగు కమిటీ కాతరహృదయంతో వీక్షించక తప్పదని ఆయన భావించాడు. (ఇప్పుడు మనం చర్చిస్తూన్నది ఢిల్లీసమావేశపు ప్రారంభదశను గూర్చికాని అంతిమదశను గూర్చి కాదు. కాబట్టి ఇక్కడ ఊహింపబడిన సైనిక రక్షణ సివిక్‌గార్డ్సుకు సంబంధించింది మాత్రమే. అంతేకాని ఢిల్లీ తీర్మానంలో ఇండియా రక్షణకు వాగ్దానం చేయబడిన సైనిక సహాయమునకు సంబంధించి కాదు.)

ఆనాటి సంఘటనల క్రమ పరిణామమును సరిగా పరిశీలించేటందుకు వీలుగా, 1940 జులై మొదటివారంలో రాజకీయ పరిస్థితులనుగూర్చి కాంగ్రెసు వర్కింగుకమిటీ వారుచేసిన తీర్మానం తరువాత జరుగుతూవచ్చిన విషయాలను తెలియపరచడం సముచితం. వార్ధాలోవలెనే ఢిల్లీలోకూడా ఒక పక్షంరోజులు ముందుగానే గాంధీ ఒక చిత్తు తీర్మానాన్ని తయారు చేశాడు. కాని దానికి బదులుగా వర్కింగు కమిటీవారు మరొక తీర్మానాన్ని అంగీకరించారు. వర్కింగుకమిటీవారు అన్ని పరిస్థితులను సమగ్రంగా ఆలోచించి యిలా తీర్మానించారు. "ఇండియాయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యమును గ్రేటుబ్రిటను ప్రకటించినప్పుడే ఇండియా బ్రిటను దేశాలను ఎదుర్కొంటూన్న సమస్యలు పూర్తిగా పరిష్కారం కాగలవు. ఆ ప్రకటనను తక్షణం ఆచరణలోకి తెచ్చేటందు కనుగుణంగా కేంద్రంలో తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించవలెను. ఆ ప్రభుత్వం కేంద్ర శాసనసభలోని ఎన్నిక సభ్యులందరి విశ్వాసమునకూ పాత్రమయినట్టిదిగానూ, రాష్ట్రాలలోని బాధ్యతాయుత ప్రభుత్వాల సహకారమును పొందగలిగింది గానూ ఉండవలెను". ఈ పై చర్యలను బ్రిటిష్ ప్రభుత్వమువారు తీసుకొన్నయెడల దేశరక్షణ సన్నాహాలలో కాంగ్రెసు సంపూర్ణంగా తోడ్పడానికి వీలవుతుందని కూడా

కాంగ్రెసు వర్కింగు కమిటీ ప్రకటించినది. ఈ తీర్మానాన్ని అనేకమంది తప్పుగా వ్యాఖ్యానంచేశారు. చాలామంది తప్పుగా అర్థం చేసుకొన్నారు. కాబట్టి దీనిని అనేకసార్లు వివర్శగా చెప్పవలసివచ్చింది. పూనా అ. భా. కాం. సం. సమావేశంలో చేయబడిన తీర్మానాన్ని పోలి ఉన్నది యిది. ఈ సంగతి యిప్పుడే మీరు తెలుసుకోగలరు. యుద్ధం జరుగుతూండగానే భారతదేశ రాజ్యాంగ చట్టమును పూర్తిగా మార్చివేయవలెనని ఈ తీర్మానం కోరుతూన్నట్లు అమెరీ తప్పు వ్యాఖ్యానం చేశాడు. శాసన సభలోని ఎన్నిక సభ్యుల అందఱి విశ్వాసమునకు పాత్రమైన ప్రభుత్వమని చెప్పినప్పుడు, బాధ్యతాయుత ప్రభుత్వం కోరబడ్డట్టుగా అర్థం చెప్పబడింది. బాధ్యతాయుత ప్రభుత్వం అందఱి ఎన్నిక సభ్యుల విశ్వాసమునకూ పాత్రం కానక్కరలేదు. ఆ ప్రభుత్వాన్ని అధికారంలో పెట్టిన అధిక సంఖ్యాక సభ్యుల విశ్వాసమునకు పాత్రమైతే చాలును. ఆ పద్ధతి ప్రకారం అయితే ఫెడరల్ శాసనసభకు క్రొత్త ఎన్నికలను జరపాలి. అప్పుడు అమెరీ చెప్పినట్లు రాజ్యాంగచట్టమును పూర్తిగా మార్చివేయవలసిన అవసరం వస్తుంది. ఎందువల్లననగా యుద్ధం ప్రారంభం కాగానే ఇండియా రాజ్యాంగచట్టం రెండవభాగానికి సంబంధించిన ఫెడరల్ విధానం అమలులోకి రాకుండా ఆపుదల చేయబడింది. కనుకనే కేంద్రశాసనసభలోని ఎన్నిక సభ్యులందరి విశ్వాసమునకూ పాత్రమైన ప్రభుత్వముండ వలెనని ఢిల్లీ తీర్మానం విస్పష్టం చేసింది. "భారతదేశ రక్షణ సన్నాహాలలో కాంగ్రెసు సంపూర్ణసహాకారం చేయవలెనంటే" ముందుగా ఇండియాదేశ స్వాతంత్ర్య ప్రకటనయున్నూ, తాత్కాలిక జాతీయ ప్రభుత్వస్థాపనయున్నూ జరుగవలెనని పున రుద్ఘాటన చేయబడిన ఢిల్లీ తీర్మానముయొక్క సంపూర్ణాభిప్రాయం చదువరుల మనస్సుకు చక్కగా నాటేటందుకే యింతగా ఈ తీర్మానం వ్యాఖ్యానించబడింది.

వరుసగా తెలియడానికి తరువాతి జరిగిన విషయాలుకూడా యిప్పుడే చెబుతూన్నాము. సేవాదళ నిర్మాణమును నిషేధిస్తూ ప్రభుత్వం చేసిన ప్రకటననుగూర్చి వర్కింగుకమిటీవారు వ్రాసిన తీర్మాన మీదిగువ ఉదాహరింపబడింది.

కాంగ్రెసు వర్కింగుకమిటీవారు ఆరురోజులు వరుసగా సమావేశమై ఈ తీర్మానముచేశారు. ఇటీవల ఇంత దీర్ఘకాలమెన్నడూ వర్కింగుకమిటీ సమావేశంకాలేదు.

"ఈ అత్యవసర శాసనం (Ordinance) చాలా సందిగ్ధమైన భాషలో ఎక్కువ విశాలంగా ఉంది. దీని నిజమైన ఉద్దేశమేమిటో వర్కింగుకమిటీవారు గ్రహించలేకుండా ఉన్నారు. ఆచరణలో యిది చాలా దుర్వినియోగం చేయబడవచ్చును." అని వర్కింగుకమిటీ తీర్మానంలో ఉంది.

" భయపెట్టి, దౌర్జన్యంచేసి. తమ రాజకీయ సాంఘికోద్దేశాలను కొనసాగించుకొనేటందుకు ప్రత్యేక సైన్యాలుగానీ సంస్థలుగానీ ఉండడం తప్పనీ, అలా ఉండనీయకూడదనీ పూర్తిగా అంగీకరిస్తూ, అటువంటి సైన్యాలకూ కాంగ్రెసు సేవాదళాలకూ యేవిధా పోలిక లేదని కాంగ్రెసు వర్కింగుకమిటీవారు సూచిస్తూన్నారు. కాంగ్రెసు సేవాదళాల చట్టబద్ధమైన కార్యకలాపాలను అణచివేసేటందుకీ అత్యవసర శాసనం ఉద్దేశింపబడలేదనీ అలా దుర్వినియోగం చేయబడదనీ వర్కింగుకమిటీవారు విశ్వసిస్తూ తమ మామూలు వ్యవహారాలను, అవి సాగిస్తూండవలసిందని ఆదేశిస్తూన్నారు. "

సెప్టెంబరు 15 వ తేదీకి నిర్ణయింపబడిన అ. భా. కాం. సం, సమావేశం బొంబాయిలో జరుగగలదని తెలిసింది.

గాంధీ మొదటినుండి చివరిదాకా అహింసాయుత ప్రభుత్వాన్ని గూర్చియే పట్టుదలగా ఉన్నాడు. వరసగా అన్ని సంగతులను పరిశీలించిన యెడల 1939 సెప్టెంబరు 14 తేదీని వర్కింగుకమిటీ అంగీకరించిన తీర్మానములో కొన్ని షరతులతో కాంగ్రెసు బ్రిటనుకు సహాయము చేయడానికి ఒప్పుకున్నట్లు తేలుతుంది. అయితే కాంగ్రెసు ఆ తీర్మానములో ఉద్దేశించిన సహకారమెట్టిది? గాంధీ మొట్టమొదట వైస్రాయిని కలుసుకొన్నప్రడు తానేవిధమైన షరతులు లేకుండా సహాయము చేస్తానని వాగ్దానం చేశాడు. మరికొంత కాలానికి ఆయన చేస్తానన్న సహాయము నైతికసహాయమే కాని భౌతిక సహకారము కాదని వివరించాడు.

యుద్ధం ప్రారంభమైన దాదాపు ఒకపక్షం రోజులలో అనగా 1939 సెప్టెంబరు 14 వ తేదీని వర్కింగుకమిటీ యుద్ధాన్ని గూర్చి ఒక చరిత్రాత్మకమైన తీర్మానం చేసింది. యీ సందర్భంలో గాంధీయున్నూ వర్కింగుకమిటీయున్నూ సహకారమనే పదానికి వేరు వేరు అర్థాలు భావించుకున్నారు. కొంతకాలానికి లండనులోని ఒక పత్రిక ప్రశ్నించగా తాను ఏ షరతులూ లేకుండా చేస్తానన్న సహకారము కేవలం నైతిక సహకారమేనని గాంధీ ప్రత్యుత్తరమిచ్చాడు. దీనినిబట్టి గాంధీ ఇంతకాలమూ తానుగాని, కాంగ్రెస్‌గాని చేస్తానన్న సహకారము నైతిక సహకారమే నన్నట్లు స్పష్టపడుతుంది.

జూన్ 14 వ తేదీని ఫ్రాన్సు పడిపోయిన తరువాత యీ విషయం విమర్శకు వచ్చింది. వార్ధాలో జూన్ 17 వ తేదీని కాంగ్రెస్ వర్కింగుకమిటీ సమావేశమయినప్పటి కప్పుడే రాజకీయ వాతావరణంలో పూర్తిగా మార్పువచ్చింది.

అహింసాసమస్య ప్రాముఖ్యత వహించింది. ఆ విషయములో కలిగిన తీవ్ర భేదాభిప్రాయాలు, బాగా వెల్లడిలోకి వచ్చినవి. ఢిల్లీలో యీ సమస్య మరింత ప్రాముఖ్యత వహించింది. ఎందువల్లనంటే కాంగ్రెసు తన కోరికనుగూర్చి బ్రిటిషు గవర్నమెంటుకు తాను సహకరిస్తానన్న వాగ్దానమునుగూర్చి అప్పుడు నిర్ణయం చేయవలసివచ్చినది. ఆ నిర్ణయం యీ సమస్యపైనే ఆధారపడి ఉంది. గాంధీ తక్షణం భారతదేశముయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని బ్రిటను ప్రకటింపవలయునని కోరినాడు. అందుకు బదులుగా యిండియా బ్రిటనుకు నైతికసహాయం చేస్తుందన్నాడు. ఇండియా సంపూర్ణస్వాతంత్ర్య ప్రకటనవిషయములో. వర్కింగుకమిటీ గాంధీతో ఏకీభవించింది. కాని నైతికసహాయం విషయంలో భేదించింది.

యీ భేదం కేవలం సిద్ధాంతానికి సంబంధించింది. అంతేగాని వ్యక్తిగత భేదమూ కాదు; బ్రిటన్ యెడల ఇండియా అవలంబించవలసిన దృక్పథముయొక్క భేదమూ కాదు. వర్కింగుకమిటీ సభ్యులు, గాంధీయూకూడా ఆనాటి ఫాసిస్టు సామ్రాజ్యతత్వాలను నిరసించడంలో ఏకీభవించే వున్నారు. బ్రిటను తన సామ్రాజ్యతత్వాన్ని వదలుకొని భారత స్వాతంత్ర్యాన్ని ప్రకటించేయెడల తనపైన ఇంతకాలమూ చేయబడుతూన్న నిందారోపణలను తొలగించుకొన్నట్లు అవుతుంది — అప్పుడు స్వతంత్రభారత దేశముయొక్క సహాయసహకారములను పొందడానికి ఆదేశం రాయబారాలు జరుపవచ్చును. ఇదే భావమును గాంధీజీ డిశంబరు 4 వ తేదీని న్యూస్ క్రానికల్ పత్రికకు కేబుల్ ద్వారా పంపియున్నారు. "నాకూ బ్రిటనుకూ అనేక వ్యక్తిగత సంబంధాలున్నాయి. అందువల్ల నేను బ్రిటనుకు స్నేహితుడుగా బ్రిటనే యుద్ధంలో జయంపొందాలని కోరుతున్నాను. అయితే ఆ విజయం ఆయుధ బలాధిక్యతవల్లను గాక న్యాయబలాధిక్యత వలన కలగవలెనని నా కోరిక"

స్వతంత్రభారతదేశం బ్రిటనుయొక్క క్షేమంకోరుతున్నప్పటికీ బ్రిటనుకు సహాయం చేయడానికి యే విధంగా సన్నాహం కావలెననే విషయంలో భేదాభిప్రాయాలున్నవి. స్వతంత్రభారత ప్రభుత్వమికముందు అహింసాయుతంగా ఉండడం మంచిదని ఒప్పుకున్నవారు కూడా కాంగ్రెస్ ఆమోదంకోసం ఎదురుచూస్తున్నారు. కాని యీ సమస్య గాంధీవలెనే ప్రతిఒక్కరూకూడా త్వరగా పరిష్కరింపబడవలెననియే అనుకుంటూన్నారు. ఢిల్లీతీర్మానంలో కాంగ్రెస్ చేసిన వాగ్దానమును పూనాలో ఆమోదించవలసియున్నది. అహింసకు సంబంధించినంతవరకు తీర్మానమును పరిశీలించి వున్నాము. ఇక జాతీయ ప్రభుత్వానికి సంబంధించి పరిశీలించడం అవసరం. కాంగ్రెస్ తనకోరికలకు ఏమాత్రమూ కొరతబడని పద్ధతిని జాతీయ

ప్రభుత్వంలో పనిచేస్తూ స్వాతంత్ర్యాన్ని పొందకలదా అని ఆలోచించవలసి యున్నది. జాతీయ ప్రభుత్వంతోబాటు అనేక చిక్కులు అనేక సమస్యలు తటస్థించే మాట నిజం. కాంగ్రెస్ చేసేన ప్రతి పని ఋజువర్తనమునకు భిన్నంగా ఉండకూడదు. బ్రిటిషు ప్రభుత్వమువారు మనకు జాతీయప్రభుత్వం ఇచ్చేటప్పుడు, మనం దాన్ని అంగీకరించేటప్పుడూ కూడా, బ్రిటిషువారు చాలా క్లిష్టదశలో వున్నారనే సంగతి వారూ మనమూ ప్రపంచమూకూడా తెలుసుకొని ఉండాలి.

గాంధీ జాతీయప్రభుత్వ ప్రణాళికను అర్థంచేసుకొని అందులోని సాధకబాధకాలను బాగా గ్రహించేవున్నాడు. కాబట్టి ఆయనకది అంత ఆకర్షవంతంగాలేదు. మరొక విషయంకూడా గాంధీ ఆలోచించాడు జాతీయప్రభుత్వం అంటే రాజప్రతినిధి ఐ. సి. యస్. ఉద్యోగులూ ఉండని ప్రభుత్వమేనా? ఈ సంగతి జాతీయ ప్రభుత్వాన్ని ఉద్దేశించినవారి దృష్టిలో వుందా? రాజప్రతినిధి ఐ. సి. యస్. ఉద్యోగులు ఉండని ప్రభుత్వం అంటే వారందరూ వైదొలగిపోవాలని కాదు. రాజప్రతినిధి గవర్నర్ జనరలుకూడా, అన్నివిషయాల్లోను చిట్టచివరకు సైనిక వ్యవహారాలలోకూడా జాతీయ ప్రభుత్వానికి లోబడి ఉండాలని గాంధీ అభిప్రాయం.

ఐ. సి. యస్. ఉద్యోగులకున్న కాంట్రక్టులనుబట్టి వారిని తీసివేయడం సాధ్యం కాని పని. అదీగాక యిప్పుడు భారతరాజ్యాంగ చట్టమును తయారుచేయబోవడంలేదు. అందువలన వారి కాంట్రాక్టులను రద్దుచేయుడంకానీ, వారి ఉద్యోగాలను తొలగించడం కానీ యిప్పుడు జరిగేపనికాదని ప్రతివారూ తేలికగా గ్రహించగలరు. కాబట్టి రాష్ట్రాల లోవలెనే కేంద్రప్రభుత్వంలోకూడా ఐ. సి. యస్. ఉద్యోగులు యథాప్రకారం ఉంటారు. వారితోపాటు రాజప్రతినిధికూడా ఉంటాడు — బహుశా గవర్నర్లకంటె ఎక్కువ మంచిస్థితిలో ఉంటాడు. ఉభయులకూ సంబంధించిన ముఖ్యవిషయాలను గూర్చి ఆయన చర్యతీసుకొంటాడు. శాసనబద్ధమైన ప్రభుత్వంకింద పనిచేయని కారణాన సహజంగా తన అభిప్రాయాలను ఆచరణలో పెట్టడానికి ప్రయత్నంచేస్తాడు. అటువంటి సందర్భాలలో 'ఇది చాలా చెడ్డపని. కాబట్టి చేయడానికి వీలులేదని' ఆయన చెప్పవచ్చును. అప్పుడు కార్యనిర్వాహకవర్గం రాజీనామా ఈయవలసివస్తుంది. అటువంటి పరిస్థితి రాకుండా చూడాలి. అందుకోసం మంచి యేర్పాటేదైనా ఉండాలి. అప్పుడు రాజప్రతినిధి జోక్యంకల్గించుకోవడానికి వీలుండదు. కాని తన అభిప్రాయాలు తాను గట్టిగా చెప్పవచ్చును. కార్యవర్గ సభ్యులను తొలగించే అధికారంమాత్రం ఆయనకుంటుంది. అనగా జాతీయప్రభుత్వానికి సైన్యంపైన అధికారం వచ్చిందనుకోండి. ఏదైనా ఒక విషయంలో సైనికాధికారులకూ, సైన్యానికి సంబంధించిన సభ్యునికీ భేదాభి

ప్రాయం వస్తే, సైనికాధికారులు సరిగా ప్రవర్తించారనీ, సైన్యానికి సంబంధించిన సభ్యుడు తప్పుగా ప్రవర్తించాడనీ రాజప్రతినిధికి తోచేయెడల ఆయన ఆ సభ్యుణ్ని తొలగించవచ్చును. బాధ్యతాయుత ప్రభుత్వంలోకూడా యిటువంటి సందర్భమే తటస్థించవచ్చునుకదా అని విమర్శకులు ప్రశ్నించవచ్చును. నిజమే కాని బాధ్యతాయుత ప్రభుత్వ నిర్మాణం అడుగునుండి జరుగుతుంది; ఈ జాతీయ ప్రభుత్వమూ పై నుండి ప్రారంభమవుతుంది. అంటే యిప్పుడు జాతీయప్రభుత్వమనే పేరుతో వ్యవహరింపబడే ప్రభుత్వం నిజంగా జాతీయ ప్రభుత్వంకాదు. అందువలన భారతజాతి ప్రమాదకరమైన వలలో చిక్కుకొంటుంది. భారతీయులు తప్పుచేసినట్లుగా కూడా వారు ప్రచారం చేయవచ్చును ఇప్పుడు బ్రిటిష్‌వారు చెప్పే జాతీయప్రభుత్వం, రాజప్రతినిధి కార్యనిర్వాహక సంఘానికి పర్యాయపదం. జాతీయప్రభుత్వంలో రాజప్రతినిధి, పైన ఉండే మాట నిజమే — కాని ఈ కార్యనిర్వాహకవర్గానికి నాయకుడే రాజప్రతినిధి. అదీ ఈ రెంటికీ భేదం. అయితే రాజప్రతినిధి కార్యనిర్వాహక సభ్యుణ్ని తొలగించినప్పుడేమి జరుగుతుంది? ఆయనకు కార్యవర్గ సభ్యులందరిమాటను తోసివేసి వ్యవహరించే అధికారం ఉంటుందని అంటే వారిని తొలగించవలసిన అవసరమే లేదు. వారిమాటను తోసివేసి తనపని తాను చూచుకోగలడు రాజప్రతినిధి. అటువంటి పరిస్థితులలో మరొక ఏర్పాటుకానీ ఒడంబడికగానీ జరగడానికి వీలులేదు. జాతీయ ప్రభుత్వ నిర్మాణం జరుగకపోయినప్పటికీ, అడుగునుండి ప్రభుత్వమును నిర్మించుకొనే విధానం ఉండనే ఉంది కదా అని గాంధీకి సంతృప్తి. జాతీయప్రభుత్వానికి పైనుండి నిర్మాణం జరుగుతుంది. కాబట్టి ఆది గాంధీజీ ప్రణాళికలో భాగం కానేకాదు. అధికారం వచ్చినప్పుడు దానిని చేపట్టి పనినిర్వహించుకొనే అవకాశాన్ని కాంగ్రెసెప్పుడూ కాదనలేదు. కాని యిప్పుడధికారాన్ని చేపట్టడానికి తగినకాలం రాలేదు. పైగా యిప్పుడటువంటి పనిచేయడం ప్రమాదమనికూడా గాంధీజీ విశ్వాసం.

అయితే కాంగ్రెసు అధికారాన్ని పుచ్చుకొనే విషయం శ్రద్ధగా ఆలోచించే పక్షంలో, ఇండియా ప్రభుత్వంవారు బ్రిటిష్‌వారి చేతులనుండి ఇండియాకు అధికారం ఒప్పగింతచేయడం తాము స్వయంగా చూడదలచుకొన్నారు. కాని యుద్ధంలో కాంగ్రెసు తన చేతనైనంత సహాయంచేస్తుందనేసంగతి మాత్రం స్పష్టంగా వారికి తెలియాలి. అప్పుడు ప్రభుత్వం కేవలం ఒక పార్టీ పద్ధతులమీద గాక, అన్నిపక్షాల కలయికతోనూ సహకారంతోనూ జరుగుతుంది. కాని కాంగ్రెసుమాత్రం యుద్ధంకోసం శ్రద్ధగా పనిచేయాలి. అంటే అహింసను తీసి అవతలపెట్టాలి. కాంగ్రెసు పేరుమీద భారతజాతి హృదయపూర్వకంగా యుద్ధానికి సహాయం చేసినట్లయితే ఇండియా

స్వాతంత్ర్యమును పొందగలదు. కాంగ్రెసువిషయంలో శ్రద్ధవహించడం ప్రభుత్వానికి లొంగిపోవడంకాదు. ప్రభుత్వంవారు కాంగ్రెసుయొక్క సహాయం పొందడానికి చాలా ఆతురపడుతూన్నారు. వారెంత ఆందోళనపడుతూన్నారో అదంతా పూర్తిగా కాంగ్రెసుకు తెలియక పోవచ్చును. గాంధీ చెప్పిన ప్రకారమైతే ప్రభుత్వంవారు కేవలం నైతిక సహాయాన్నిమాత్రమే పొందగలరు. వారొక సైనికుణ్నికానీ, ఒక రూపాయి కానీ పొందజాలరు. అయితే భౌతిక సహాయంకంటే ఎంతోవిలువగల నైతికసహాయం వారికి లభిస్తుంది. భారతదేశపు నైతిక సహాయం వలన బ్రిటను స్వభావంలో మార్పు వస్తుందని గాంధీ అభిప్రాయం. అదే ఆయన ఆశయం కూడాను. ఆయన ఇండియా దేశపు మూకజనానికి ప్రతినిధి. ఆయన ఈ మూకజనం దగ్గరకూ, కాంగ్రెసులో చేరిన ప్రాథమిక సభ్యులదగ్గరకూ పోయి మీరహింసావలంబకులుగా ఉండవలెనని ప్రబోధిస్తే, వారి జీవితాలలో వారు బలిష్ఠుల అహింసను ప్రదర్శించలేకపోయినప్పటికీ వారందుకు తప్పక సుముఖత చూపిస్తారని గాంధీకి తెలుసు. అందువలన ఆయన వారి మధ్యకుపోయి పనిచేయుదలచుకొన్నాడు. "నేను 'ప్రతి బ్రిటిష్ దేశీయునకూ' అనే శీర్షికతో చేసిన విజ్ఞప్తినిచూచి అధికారంలో ఉన్నవారాగ్రహించరని నేననుకోవడంలేదు. కాని యింతవరకూ వారాగ్రహించలేదు." అన్నాడు గాంధీ.

పూనాలో తరువాత ఆమోదింపబడిన ఢిల్లీ తీర్మానాన్ని గురించి చర్చ జరిగేటప్పుడెట్టి తీవ్ర వాదోపవాదాలు జరిగినవో ఎంత సంక్షోభం కలిగిందో వర్ణించడం కష్టం. ఢిల్లీలో వర్కింగుకమిటీ సమావేశమింకా జరుగుతూండగానే ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ తన సభ్యత్వానికి రాజీనామా యిచ్చాడు. ఇంక తక్కిన విషయాలన్నీ సహజంగా ఆంతరంగిక విషయాలు. కాని అప్పటి అవసరాన్నిబట్టి గాంధీ వాటిని ఒక ప్రకటనలో వెల్లడించవలసి వచ్చింది. అందులోనే కాంగ్రెసు వాగ్దానంచేసిన సహాయాన్ని నిరాకరించవద్దని, బ్రిటిష్ ప్రభుత్వానికాయన స్వార్థరహితుడైన మంచి స్నేహితుడుగా ఒక సలహా యిచ్చాడు. కాంగ్రెసిప్పుడు గాంధీ అహింసాసిద్ధాంతాన్ని గానీ, ఢిల్లీ తీర్మానాన్నిగానీ అంగీకరించాలి. ఢిల్లీ తీర్మానం కాంగ్రెసు ఆలోచనాపూర్వకంగా అవలంబించిన విధానాన్ని ప్రతిబింబింప చేస్తూన్నది.

1940 జులై 8 వ తేదీని వార్ధానుండి గాంధీ యిచ్చిన ప్రకటనయొక్క శీర్షిక:

"ఎవరిదృష్టి మందగించింది?"

"కాంగ్రెసు భవితవ్యమును సూచించే వర్కింగుకమిటీవారి తీర్మానం పత్రికలకు విడుదలయినట్లు యిప్పుడే వార్త తెలిసింది. ఆ తీర్మానం నాకళ్ల యెదుటనే అంగీకరింప

బడింది. కాని అది నిజంగా ప్రచురణకు పంపబడేవరకూ నేనేమీ చెప్పదలచుకోలేదు.

“ దీనికోసం అయిదురోజులు వర్కింగుకమిటీ సభ్యులు తమలో తాము కీచులాడుకొంటూ వృథా కాలయాపన చేశారనుకోవడం పెద్ద పొరపాటు. వారు చాలా గొప్ప బాధ్యతను నిర్వర్తించవలసి వచ్చింది. రామఘర్ తీర్మానానికి ఈ తీర్మానానికీ యేమీ భేదం లేదని వాదం చేయవచ్చును. కాని భావంలో మాత్రం భేదం ఉన్న మాట వాస్తవం. భాష సాధారణంగా ఒకటిగా ఉంటుంది. భావం మాత్రం మారుతూంటుంది. కారణాలేవైనప్పటికీ ఇంతవరకూ కాంగ్రెసు ఒకటే విధానాన్ని అవలంబిస్తూ వచ్చింది. బ్రిటను స్వేచ్ఛాపూర్వకంగా ఇండియాయొక్క కోర్కెను సఫలపరచినట్లయితే కాంగ్రెసు యుద్ధానికి నైతిక సహాయం చేస్తుంది. లేదా యుద్ధంలో ఏమీ జోక్యం కల్గించుకోదు. ఇదీ కాంగ్రెసు ఇంతవరకూ అవలంబిస్తూ వచ్చిన నీతి. అయితే వర్కింగుకమిటీ సభ్యులందరూ ఇదే అభిప్రాయం కలవారుకారు. కాబట్టి సందిగ్ధ సమయాలలో ప్రతి సభ్యుడూ తనంతట తాను స్వతంత్రంగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రావలసివచ్చింది. వర్కింగుకమిటీ సమావేశం జరిగిన ఐదురోజులూ చాలా గడ్డురోజులు. సభ్యులందరూ తీవ్రహృదయ పరిశోధనకు గురియైనారు. నేనొక చిత్తు తీర్మానాన్ని తయారు చేశాను. వర్కింగుకమిటీ సభ్యులంతా పూర్తిగా అహింసలో సజీవ విశ్వాసం కలిగి వ్యవహరించినప్పటికీ లేక తమ నియోజక వర్గాలకటువంటి విశ్వాసం కలదని నిజంగా వారు చెప్పగలిగినప్పటికీ ఆ తీర్మానంలోని ప్రతిభావమూ పరమోత్తమంగా పరిగణింప బడేది. కాని కొందఱి కీరెండు పనులూ సాధ్యం కాలేదు. మఱి కొందఱికి అహింసలో వ్యక్తిగతంగా మాత్రం విశ్వాసముంది.

“తనకూ, తన ప్రేమపాత్రులైన ఖుదై ఖిద్ మత్ గార్లకూ మాత్రం అహింసలో అచంచల విశ్వాసమున్నట్లు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ ఒక్కడే చెప్పగలిగాడు. కాబట్టి వార్ధా తీర్మానం జరుగగానే తనకు కాంగ్రెసులో స్థానంలేదని ఆయన నిర్ణయించుకొన్నాడు. తన అనుచరులలో ఆయన ఒక ప్రత్యేక ధర్మప్రచారమునుచేస్తూ వారియెడ తన కర్తవ్యమును నిర్వర్తించవలసి ఉంది. కాబట్టి ఆయన కాంగ్రెసునుండి విరమించుకోవడానికి వర్కింగు కమిటీ సంతోషంగా అంగీకరించింది. ఆయన కాంగ్రెసునుండి వెళ్ళిపోయినందువల్లనే కాంగ్రెసుకెక్కువ సేవ చేయగలడని ఆశిస్తున్నాను. తాత్కాలికంగా అహింసలో విశ్వాసం కోల్పోయిన సఖులలో తిరిగి ఆ విశ్వాసాన్ని ఉజ్వలింపచేయడానికి మనలో కాంగ్రెసునుండి విడిపోయినవారెందుకు సమర్థులు కాకూడదు ?

## రాజాజీ విజయం.

"ఈ తీర్మానం వ్రాసింది రాజాజీ. నా విధానంలో నా కెంత నమ్మకం ఉందో ఆయన విధానంలో ఆయనకంత నమ్మకమూ ఉంది. ఆయన పట్టుదల, ధైర్యం, అత్యంత మైన వినయం—వీటివలన ఆయన పక్షాన కొందఱిని తిప్పుకోగలిగాడు. సర్దార్ పటేల్ వారిలో గొప్పవాడు. నే నాయనను ఆపదలచుకొన్నట్లయితే ఆయన ఆ తీర్మానాన్ని ప్రవేశపెట్టవలెననే ఆలోచనే వదులుకొని ఉండేవాడు. కాని నా కెంత ఆత్మ విశ్వాసమూ పట్టుదలా ఉన్నవని నేననుకొంటూన్నానో నా సఖులకుకూడా అంత ఆత్మ విశ్వాసమూ పట్టుదలా ఉండవలెనని నే నంగీకరిస్తాను. మమ్ముల నెదుర్కొంటూన్న రాజకీయ సమస్యల విషయంలో మా దృక్పథాలు వేరువేరుగా ఉంటూన్నవనే సంగతి నేను చాలాకాలం కిందటనే గ్రహించగలిగాను. తాను 'అహింసను' దూరంగా పోతు న్నాడని నేనంటే ఆయన ఒప్పుకోడు. తన 'అహింసా' తత్వమే ఈ తీర్మాన రూపంలో పరిణతి పొందిందని ఆయన విశ్వాసం. అహింస అహింస అంటూ అనవరతమూ ఆలో చిస్తూండడంవలన అది నాకొక ఉన్మాదంగా మారిందని ఆయన అభిప్రాయం. నా దృష్టి మందగించిందనుకొంటూన్నాడు దాదాపుగా ఆయన. నేనుకూడా కొంత హాస్యంగా ఆయనను ఇదేమాట అన్నాను. కాని దానివలన యేమి ప్రయోజనం? నేను చెప్పినది నిజమనీ, ఆయన నమ్మింది నిజంకాదనీ చెప్పడానికి నా విశ్వాసంకంటె నాకు వేఱొక ఆధారంలేదు. కాబట్టి అది అసంభవంకాదా? వార్ధాలో వర్కింగుకమిటీ నా అభి ప్రాయాలతో ఏకీభవించలేదు. కాబట్టి నాకు బాధ్యత లేకుండా చేయవలసిందని వర్కింగుకమిటీవారిని కోరి ఆ ప్రకారం వారి అనుమతిని పొందగలిగాను. నా తీర్మానాన్ని వర్కింగుకమిటీ వారామోదించక పోయినట్లయితే రాజాజీ తీర్మానమును ఆమోదించ డంకంటె గత్యంతరంలేదని నేను స్పష్టంగా తెలుసుకొన్నాను. కాబట్టి రాజాజీ శుద్ధ తప్పు చేస్తూన్నాడని అంతవరకూ నేననుకొంటూన్నప్పటికీ ఆయన తీర్మానాన్ని ఆమో దించేటట్లు పట్టుదలగా పనిచేయవలసిందని నేను రాజాజీని ప్రోత్సహించాను. రాజాజీ చూపిన అపూర్వ సహనంవలనను, చాకచక్యంవలననూ, ప్రతిపక్షులయెడల ఆయన కన బఱచిన ఔదార్యంవలననూ అధిక సంఖ్యాకులాయన కనుకూలంగా వోటు చేశారు. ఐదుగురు తటస్థులుగా ఉన్నారు. నాకాక్షణం భయంకరంగా తోచింది

"సాధారణంగా ఆటువంటి తీర్మానాలు అధికసంఖ్యాక వోట్లతో అంగీకరింపబడ కూడదు. కాని ఇటువంటి క్లిష్ట సమయాలలో ఏకగ్రీవంగా అంగీకరింపబడడం దుర్లభం. రాజాజీ తీర్మానాన్ని ఆచరణలో పెట్టవలెనని నేను సలహా యిచ్చాను. కనుక తుది క్షణంలో ఈ తీర్మానమును పత్రికలలో ప్రకటించడానికి కమిటీవారు నిర్ణయించారు.

"మంచికో చెడ్డకో వర్కింగుకమిటీవారు తీసుకొన్న ఈ మహత్తర చర్యకు పూర్వచరిత్ర తెలుసుకోవడం అవసరమని ఇదంతా వ్రాశాను. బలవంతుల అహింసలో సజీవ విశ్వాసంకల కాంగ్రెసువాదులు ఈ తీర్మానానికి దూరంగా ఉండడం సహజం. అయితే వారింకేమిచేస్తారు అనే విషయం ప్రస్తుతం అనవసరం.

"రాజాజీ తీర్మానం కాంగ్రెసు సమాలోచనచేసి నిర్ణయించిన విధానాన్ని వ్యక్తీకరిస్తూన్నది. కాంగ్రెసు నామత విశ్వాసమునుండి వైదొలగి స్వచ్ఛమైన రాజకీయ దృక్పథాన్ని అవలంబించవలెనని ఆతురపడుతూన్న కాంగ్రెసేతరులందరూ కూడా ఈ తీర్మానాన్ని హృదయపూర్వకంగా ఆమోదించి బలపఱచాలి. అలాగే ముస్లింలీగు వారు, తమ అధికారైశ్వర్యములకంటె ఇండియా శ్రేయస్సునే ఎక్కువగా కోరే సంస్థానాధిపతులు కూడా ఈ తీర్మానాన్ని అంగీకరించాలి.

"బ్రిటిష్ ప్రభుత్వం వారిప్పుడేదో ఒక నిర్ణయానికి రావాలి. రాజాజీ నాదృష్టి ఎంతగా మందగించిందని అనుకొంటూన్నాడో అంతగా బ్రిటిష్ ప్రభుత్వంవారి దృష్టి మందగిస్తేనేగాని ఇండియా స్వాతంత్ర్యాన్ని వా రరికట్టజాలరు. భారత స్వాతంత్ర్యమును వారంగీకరించేయెడల ఢిల్లీ తీర్మానంలోని తక్కినభాగం సహజంగా ఆచరణలోకి వచ్చితీరుతుంది. ఇండియాను వారు పరిపాలిస్తూన్నారు కాబట్టి ఇండియా సహకారాన్ని బలవంతంగా పొందడమూ, లేక స్వేచ్ఛా స్వాతంత్ర్యములు కల భారతదేశం చేసే సహాయాన్ని స్వీకరించడమూ, అనేదే బ్రిటిష్‌వారిప్పు డాలోచించుకోవలసిన సమస్య. ఇందుకు నాకుతోచిన సలహా నేను వ్యక్తిగతంగా ఇదివరకే యిచ్చాను. నా సహాయ మెప్పుడూ నేను చేస్తాననే అంటూన్నాను. నా సలహాను వారంగీకరిస్తే వారి శౌర్యానికది వన్నెపెట్టగలదు. ఒకవేళ వారంగీకరించజాలకపోయినట్లయితే, కాంగ్రెసు మిత్రభావంతో చేస్తానన్న సహాయాన్ని నిరాకరించవలదని నిస్స్వార్థబుద్ధిగల మంచి స్నేహితుడుగా నేను వారికి సలహాయిస్తూన్నాను." ఇది గాంధీ ప్రకటన.

ఈ సందర్భంలో మరొకసంగతి చెప్పాలి. ఇంతకుపూర్వం జులై మొదటివారంలో పంజాబు, బెంగాలు ప్రధానులమధ్యనూ, కాంగ్రెసు నాయకులమధ్యనూ కొన్ని సంభాషణలు జరిగినవి. మౌలానా అజాద్ స్వయంగా సర్ సికందరును కలుసుకొన్నాడు. ఇందుకు జిన్నాకు కోపంవచ్చి లీగు వర్కింగుకమిటీతో నిమిత్తంలేకుండా కాంగ్రెసు నాయకులతో చర్చించడానికిగానీ, రాజీ చేసుకోవడానికిగానీ రాష్ట్రప్రధానులకు అధికారమూ అనుమతీ లేదని ప్రకటించాడు. హిందూ మహమ్మదీయ సమస్య విషయంలో సమాధానం కుదుర్చుకోవడానికి కూడా ఆయన అటువంటి

అనుమతి ఈయలేదని విస్పష్టంచేశాడు. ఈ విషయంలో సర్ సికందరుకూ జిన్నాకూ తంతిద్వారా కొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినవి పంజాబు పరిస్థితినిగూర్చి కాంగ్రెసు నాయకులతోనూ, సావర్కారుతోనూ కలుసుకొని సంప్రతించడానికి ఏమీ అభ్యంతరం ఉండకూడదని సర్ సికిందరు ఆశించాడు. సావర్కారును మధ్యవర్తిగా ఉంచుకొని మాట్లాడడానికి తానంగీకరించజాలనని జిన్నా జవాబిచ్చాడు. పంజాబు పరిస్థితిని చర్చించడానికి సర్ సికందర్ పంజాబు ప్రధానిగా కాంగ్రెసునాయకులతో సమావేశం కావచ్చునని కూడా జిన్నా అన్నాడు. హిందూ ముస్లిం సమస్య విషయంలో హిందూ నాయకులు జిన్నానే కలియవలెను. ఢిల్లీ తీర్మానం తరువాత జరిగిన సంఘటనలవలన విర్వాపైన వాతావరణమునుబట్టి, ఇండియా ప్రభుత్వానికీ కాంగ్రెసుకూ మధ్యనూ, కాంగ్రెసు ముస్లింలీగుల మధ్యనూ సమాధానం కుదరవచ్చునసే ఆశ కాకపోయినా ఒక విధమైన భ్రమ ఆయినా కలిగింది. అటువంటి పరిస్థితులలో కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా ఆజాద్ జిన్నాకొక తంతి పంపడానికి ధైర్యంచేశాడు. దానిని రహస్య తంతిగా భావించవలసిందని కూడా జిన్నాను కోరాడు. జిన్నా వెంటనే జవాబిస్తూ ఆ రెండు తంతులనూ పత్రికలలో ప్రచురించాడు. అవి ఈక్రింద ఉదాహరింపబడినవి.

## అజాద్ జిన్నాకిచ్చిన తంతి:—

"జూలై 9వ తేదీని మీరు చేసిన ప్రకటనను చదివాను. జాతీయ ప్రభుత్వ మనగా ఈ ఒక్క పక్ష ప్రభుత్వమూగాక సంయుక్త ప్రభుత్వ మనియే ఢిల్లీ తీర్మానం స్పష్టంగా భావిస్తూన్నది కాని రెండు జాతుల సిద్ధాంతాని కనుగుణంగా లేని యే తాత్కాలిక ప్రభుత్వాన్ని అంగీకరించకపోవడమేనా లీగు అవలంబించే రాజనీతి? అలా ఆయితే దయచేసి తంతి ద్వారా మీ అభిప్రాయం విస్పష్టం చేయండి." ఈ తంతిని రహస్య తంతిగా భావించవలసిందనికూడా అజాద్ జిన్నాను కోరాడు.

## జిన్నా జవాబు

"మీ తంతి చేరింది నేను మీరు కోరినట్లు మీ తంతిని రహస్యంగా ఉంచజాలను. నీవు భారత మహమ్మదీయుల విశ్వాసాన్ని పూర్తిగా కోల్పోయినావు కాబట్టి నీతో నేను ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా గానీ మరొక విధంగా గానీ చర్చించజాలను. కాంగ్రెసు జాతీయసంస్థ అని చెప్పుకొని విదేశీయులను మోసగించడానికి నీవంటి ముస్లిం బొమ్మను కాంగ్రెసు ప్రెసిడెంటుగాచేసి ప్రదర్శన చేస్తూన్న సంగతి నీకు తెలియదా· యేమిటి? నీవు ముస్లింలకూ ప్రతినిధివికావు. హిందువులకూ ప్రతినిధివి కావు. కాంగ్రెసొక

హిందూసంస్థ. నీకేమైనా ఆత్మ గౌరవముంటే తక్షణం రాజీనామా యియ్యి. ఇంత వరకు నీవు లీగు కెంత అపకారం చేయగలవో అంత అపకారమూ చేశావు. నీ వోడి పోయావు. నీ కిక ఆశలేదు. ఆసంగతి నీకు తెలుసు. కాబట్టి ఇక ఆ ప్రయత్నం మానుకో"

దాదాపు ఈసమయంలోనే సుభాస్‌బాబును ప్రభుత్వం వారరెస్టు చేశారు. దానిని గురించి వర్కింగు కమిటీవారు గమనించినట్లు కూడా లేదు. ఆ విషయాన్ని వర్కింగు కమిటీవారెందుకు దాటేయవలసివచ్చిందని ప్రశ్నించడం సహజం. ఢిల్లీ నుండి వార్ధాకు తిరిగి వచ్చేటప్పుడు గాంధీనే అనేకమంది అలా ప్రశ్నించారు. కాంగ్రెసు అనుమతితో సుభాస్‌బాబు శాసన ధిక్కారం చేయలేదని గాంధీ జవాబిచ్చాడు. ఆయన ప్రభుత్వాన్నే కాదు వర్కింగు కమిటీనికూడా ధైర్యంచేసి బహిరంగంగా ధిక్కరించాడు.

1940 జులై 7 వ తేదీని వర్కింగుకమిటీ అంగీకరించిన తీర్మానాన్ని పూనాలో జరిగిన అ. భా. కాం. సం. వారామోదిస్తూ యింకాయిలా వివరించారు. "స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించినంతవరకూ కాంగ్రెసు గట్టిగా అహింసా సిద్ధాంతాన్నే అవలంబిస్తుంది. కాని ప్రస్తుత పరిస్థితులలో ఇండియా రక్షణ విషయంలోకూడా అదే సిద్ధాంతాన్ని కాంగ్రెసు అవలంబించచాలదు. కాంగ్రెసు నిర్మాణ వ్యవహారాలన్నీ అహింసా సిద్ధాంతాని కనుగుణంగా జరుగవలెను. కాంగ్రెసు స్వచ్ఛంద సేవకులందరూ తమ ధర్మ నిర్వహణంలో అహింసా ప్రమాణమును అక్షరాలా ఆచరించవలెను. అంతే కాదు. అహింసా సిద్ధాంతంమీదతప్ప కాంగ్రెసుకు సంబంధించిన యే స్వచ్ఛంద సైనిక దళమూ నిర్మింపబడకూడదు. నడవకూడదు." ఈ సందర్భంలో వార్ధాలో సమావేశమైన వర్కింగుకమిటీవారు అప్పటి రాజకీయ పరిస్థితులనుగూర్చి ఒక ప్రకటన చేశారు. అది పూనా అ. భా. కాం. సం. జరుగుతూన్నప్పుడు ఎక్కువగా పంచిపెట్టబడింది.

పూనా సమావేశం అనుకొన్నంత మార్దవంగా జరుగలేదు. తీర్మానానికి అనుకూలురు 91 మంది, వ్యతిరేకులు 63. వ్యతిరేకులలో రాజేంద్రప్రసాదు, డాక్టరు ప్రఫుల్ల ఘోష్, ఆచార్య కృపలానీ, శ్రీశంకరరావుదేవ్, హరికృష్ణ మెహతాబుల లాటి సుప్రసిద్ధులున్నారు. రాజేంద్రబాబు తీర్మానాన్ని ప్రతిఘటిస్తూ మాట్లాడాడు కూడా.

అ. భా. కాం. సం. ఎదుట పండిత జవహర్‌లాలు నెహ్రూ ఒక ప్రకటన చేశాడు. దానిలో ఈ కింది భాగాన్ని ఉదాహరిస్తూన్నాము.

"వర్కింగు కమిటీ సభ్యుడనుగా ఈ తీర్మానానికి నేను బాధ్యత వహించవలసి ఉంది. ఈ తీర్మానం ఏకాభిప్రాయంగా ఆమోదింపబడిందికాదని మీ అందరికీ తెలుసు.

## భారత స్వాతంత్రమే దీనికి పునాది

"మనం అప్పుడప్పుడూ ప్రకటిస్తూవచ్చిన కాంగ్రెసు విధానానికి ఈ తీర్మానమున్నూ, ఇందులోని భాషాకూడా అనుగుణంగా ఉండడమే ఇందుకు కారణం కాదు. ఇండియాదేశపు స్వాతంత్ర్యమే ఈ తీర్మానానికి పునాది.

ఈ తీర్మానంలో తాత్కాలిక జాతీయ ప్రభుత్వ స్థాపనకొక మార్గం సూచింపబడింది. అదే సంపూర్ణ జాతీయ ప్రభుత్వమునకు నాందీ కాగలదు. ఈ రెండవసారి స్థాపనబడిన ప్రభుత్వం, రాజ్యాంగపరిషత్తు తరువాత ఏర్పడుతుంది. ఇది ఒక్కటే తక్షణం ఆచరణయోగ్యమైన పద్ధతి.

"ఈ తీర్మానాన్ని తీర్మానం పాటుగా ఆలోచిస్తే మనకేమీ చిక్కులులేవు. కాని ఇందువల్ల తటస్థించే కొన్ని ఫలితాలనుబట్టి మనం పెడతోవను పట్టడానికివీలుంది. ఇందులో ఆ భయమూ ప్రమాదమూ ఉన్నమాట నిజమే. అయితే ఈ పరిస్థితులలో నాయకత్వం వహించి ఏదో ఒక మార్గం తొక్కితీరవలసివచ్చింది. లేనియెడల బ్రిటను కూ ఇండియాకూ కూడా పుణ్యకాలం కాస్తా గడిచిపోతుంది. కాంగ్రెసుకు తగినంత బలమూ వివేకమూ కూడా ఉండడంచేత తప్పుదోవను పట్టడానికి వీలులేదని ధైర్యం చేశాం. ఇదివరకనేకసార్లు స్పష్టంగా ప్రకటింపబడిన కాంగ్రెసు విధానంకూడా మనను తప్పుదారి తొక్కనీయదు.

"అనుక్షణమూ మారిపోతూన్న ఈ పరిస్థితులలో ప్రతి పనీ సకాలంలో జరగాలి. కాబట్టి కాంగ్రెసు చిరకాలం మూకీభావం వహించి ఉండజాలదు. ఇటో అటో త్వరగా ఏదో ఒక నిర్ణయం జరగాలి. ఇక్కడికే మనం చిరకాలం ఓపికతో వేచి ఉన్నాము. ఇండియాయొక్క ప్రతిష్ఠకు భంగం కలిగించి ఇండియాకు హానికరంగా ఉండే విషయాలలో మనం చేతులు ముడుచుకొని కూర్చుండజాలము.

"ఇంతవరకే మేమీ తీర్మానంచేసి మూడువారాలు కడచింది. ఇక మనకొక్కటే మార్గమున్నట్లు కనిపిస్తూన్నది. వర్కింగుకమిటీవారు చేసిన ఈ తీర్మానాన్ని మనమందరమూ ఆమోదించి, తరువాత సాధ్యమైనంత తొందరలో మనం తొక్కవలసిన తోవ యేదో నిర్ణయించుకోవాలి.

"ముందేమి జరుగనున్నప్పటికీ పోరాటమూ, క్లేశమూ, దుఃఖమూ లేకుండా మనకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించదని నా నమ్మకము. యుద్ధంతోనూ పోరాటంతోనూ మగ్గిపోతూన్న ఈ మానవ ప్రపంచంలో స్వాతంత్ర్యంకోసం మనం చెల్లించ

వలసిన ఫణం చెల్లించక తప్పదు. ఈ సంగతి గ్రహించలేకపోతే మనను మనం మోసం చేసుకోవడమే. తుదకు భారతదేశ భవిష్యత్తు ఇండియా ప్రజల బలం పైననూ కాంగ్రెసుయొక్క నిర్మాణశక్తిపైనూ ఆధారపడి ఉంది, దానిని పెంపొందింప చేయడానికే మనమందరం కృషి చేయాలి.” (ఇది నెహ్రూ ప్రకటన)

వర్కింగుకమిటీ సభ్యులలోకలిగిన భేదాభిప్రాయాలను గురించిగానీ, వర్కింగు కమిటీవారంగీకరించిన తీర్మానాలను అ. భా. కాం. సం. వారిచే ఆమోదింపజేయడంలో పెట్టిన వత్తిడినిగూర్చిగానీ అనవసరమైన దాపరికమేమీ జరుగలేదు. అ. భా. కాం. సం. లో అనేక మురాలవారు బహిరంగంగా తమ భేదాభిప్రాయాలను వెల్లడించారు. బేషరతుగా యుద్ధంలో సహాయపడవలెనని రాయిస్టు మతావార నినాదం. షరతులుపెట్టి సహాయపడవలెనని సి. ఆర్. అన్నాడు. షరతులుపెట్టి నైతికసహాయం చేయవలెనని జవహరలాలు అభిప్రాయం. బేషరతుగా నైతికసహాయం జేయవలెనని గాంధీ సిఫారసు జేసినట్లు లోకవిదితమే. కాని ఆయన పూనా సభకు రాలేదు. అయితే పూనా సభానంతరం సంపూర్ణ అహింసావాదులకూ తక్కినవారికీ ఉన్న భేదాన్ని వివరించాడు. అప్పుడు కొంతమంది వర్కింగుకమిటీ సభ్యులు రాజీనామా ఈయవచ్చునని కూడా అనుకొన్నారు. కాని యింకా మరి కొన్ని సంఘటనలు జరిగేవరకూ అటువంటిది తటస్థించదని రాజేంద్రబాబు లాహోరునుండి వెంటనే ఒక ప్రకటన జేశాడు.

గాంధీ యిలా వ్రాశాడు :—

“ పూర్ణ అహింసావాదులు అ. భా. కాం సం. లో అల్పసంఖ్యాకులుగా ఉన్నారని తోచేయెడల వారందఱూ కాంగ్రెసు బయటకువచ్చి ఆ సంస్థను మరింత ఎక్కువగా సేవించడం ఉచితం. వారులోపలనే ఉన్నయెడల తగాదా తప్పదు. అధిక సంఖ్యాకులుగా ఉన్నవారు సంపూర్ణ అహింసను ప్రబోధిస్తూ తీర్మానం చేస్తేనేతప్ప అ. భా. కాం. సం. లో ఆమోదింపబడదు. కాబట్టి అధిక సంఖ్యాకులకూ, అల్ప సంఖ్యాకులకూ దీనివలన భేదాభిప్రాయాలు కలిగి తగాదావచ్చేమాటనిజం. ఇది అహింసామార్గం కాదు. అహింస తాను తప్పుకొని యితరులకు దోవ యిస్తుంది. అల్పసంఖ్యాకులు తాము రాజీనామా యిచ్చిన తరువాత నిర్మాణ కార్యక్రమమును కొనసాగిస్తూ, అధికసంఖ్యాకులతో ఏకీభవించిన విషయాలలో వారికి సహాయపడాలి. ఈ విధంగా నిజమైన అహింసా సైనికులను మనం చేకూర్చ గల్గిన యెడల, వర్కింగ్ కమిటీ తీర్మానం దైవ ప్రేరితముగా తలంపబడునని నా నిశ్చయము.”

ఢిల్లీ తీర్మానం పూనాలో ఖాయంచేయబడగానే దేశమంతటా గందరగోళం పుట్టింది. ప్రతివారూ ఆత్మపరిశోధనలు చేసుకోవడం ప్రారంభించారు. ఆ అస్పృశ్యమైన అగ్రాహ్యమైన, ఆధ్యాత్మికమైన, అనూహ్యమైన, అహింసా సిద్ధాంతము, ప్రపంచాతీత ధర్మ శిఖరాగ్రములనుండి నిజపరిస్థితుల కనుగుణంగానూ అనుదిన రాజకీయముల కత్యంత సన్నిహితంగానూ దిగివచ్చినందుకు కొద్దిమంది మాత్రం సంతోషించారు. కాని భారత ప్రజానీకంలో అత్యధికసంఖ్యాకులు దుఃఖనిమగ్నులైనారు. ఇరవై సంవత్సరాలనుండి భారతజాతికి యేకైక నాయకుడుగా ఉండి, రెండు శతాబ్దాలలో రావలసిన అభివృద్ధిని రెండు దశాబ్దాలలోనే రప్పించి, బ్రహ్మాండమైన బ్రిటిష్ ప్రభుత్వాన్ని లొంగదీసి ఇండియాతో రాజీకిదింపిన మహానుభావుడు గాంధీని ఆ సందిగ్ధసమయంలో తేలికగా జారవిడవడంవలన దేశానికి మహాపకారం జరిగినట్లుగా భావించారు. గాంధీజీ అహింస దేశీయుల ఆచరణకు అసాధ్యంకావచ్చును ; కాని కాంగ్రెసు తీర్మానంవలన భారతజాతి ఆయన సహకారాన్ని పోగొట్టుకొన్నదనుకోవడంకానీ? ఆయన చేయవలసిన పని ముగింపబడినదనుకోవడంకానీ పొరపాటు. మహాపురుషుల జీవితాలలోనూ మహోద్యమముల చరిత్రలోనూ యిటువంటి క్షణాలు తటస్థిస్తూనే ఉంటవి. అవి యుగపరిణామములను సూచించగలవు. 1934 లో గాంధీ, సమిష్టి సత్యాగ్రహమునూ, వ్యష్టి సత్యాగ్రహమునూ కూడా విరమించి, కాంగ్రెసు సభ్యత్వమును సైతం వదులుకొన్నప్పుడు ఇటువంటి ప్రచారమే దేశంలో జరిగింది కాని తరువాతి సంవత్సరాలలో అనుదినమూ, అనుక్షణమూకూడా కాంగ్రెసు కార్యకలాపములందాయన నాయకత్వం అవిచ్ఛిన్నంగా కనిపించింది. మానవ నిర్మాణంలోని అంతరింద్రియము లొకప్పుడు పనిచేస్తున్నట్లూ మరొకప్పుడు విశ్రాంతి తీసుకొంటూన్నట్లు కనిపిస్తాంటవి. మానవచరిత్రలోని సంఘటనలు కూడా అట్లే ప్రపంచం పగలంతా కార్యకలాపములతో కలకలలాడుతూంటుంది. రాత్రి నిద్రాసక్తమై నిశ్శబ్దంగా ఉంటుంది. మనిషీ అంతే. ప్రపంచ చరిత్రలోకూడా అటువంటి హెచ్చుతగ్గులు తప్పనిసరి ఒకప్పుడు సమస్తమూ నిర్ణయమైపోయినట్లు కనపడే సమస్యలు, కొంతకాలానికి తిరిగీ తీవ్ర వాదోపవాదాలకు గురికావడం మనమెరుగుదుము. మనం శాసనసభల నొకప్పుడు బహిష్కరించాం. మళ్ళీ ప్రవేశించాం. తిరిగీ బహిష్కరించాం. శాసనోల్లంఘన మొకప్పుడు అంతర్గర్భితంగా ఉండి మరొకప్పుడు బహిరంగంగా విజృంభిస్తూ వచ్చింది. ఒకప్పుడు పనిచేసిన మంత్రులే తరువాత మరొకప్పుడు రాజీనామాలిచ్చారు. 1922 లోని బార్డోలీ ఉదంతమునకు పిమ్మట జరిగిన విచారణ మానవ సౌజన్యంమీద నమ్మకంలేని విపర్యాస ధోరణిలో నడిచింది. 1934 లో కూడా తిరిగీ అదే విధంగా జరిగింది. ఆ సంగతి యిదివరకే ఉదాహరించి ఉన్నాము.

యెరవాడ జైలునుండి 1924 లో గాంధీ విడుదలయినప్పుడాయన తుపాకీమందూ దహ్ముక్కొని పోయిందన్నారు. 1934 లోకూడా సరిగా అలాగే అనుకొన్నారు. రాజకీయాలలో యెప్పుడూ ముందుండితీరాలనే కోరిక ఆయనకులేదు. అవసరమైనప్పుడాయనను కాలమే ముందుకు లాక్కొని వస్తుంది. అక్కర లేదనుకొన్నప్పుడాయన తేలికగా తెలమఱుగుకు పోయి జాతీయ పునర్నిర్మాణమునకు దోహదం చేయగలడు. అప్పుడప్పుడూ తటస్థిస్తూవచ్చే ఆపదలలోనూ, సంపదలలోనూ, వ్యక్తుల యొక్కయూ, జాతులయొక్కయూ పౌరుషాన్ని పరిశీలించడం దైవేచ్ఛవలె కనిపిస్తుంది" "అని జేమ్సు రస్సెల్ లోవెల్ అన్నమాటలలో యెంతయినా యథార్థం ఉంది. "పురుష ప్రయత్నంవలన ఆపదలు సంపదలుగా పరిణమించగలవు. అది కొఱవడినచో సంపదలే ఆపదలుగా మాఱిపోగలవు." "ప్రభుత్వంపైన తిరుగుబాటు చేయడం పౌరుల హక్కు——హక్కేకాదు ధర్మంకూడాను" అని ప్రబోధించిన గాంధీయే, ప్రభుత్వానికా తిరుగుబాటుదారులను ఉరితీయడానికికూడా అధికారంఉందని అంగీకరిస్తాడు. కాని పరాధీనతవలనను, బానిసత్వంవలనను స్వాతంత్ర్యమును కోల్పోవడం, "నైతిక పతనమనీ, రాజకీయ భ్రష్టత్వమనీ, తెచ్చిపెట్టుకొన్న దురదృష్టమనీ" ఋజువు చేయడానికి తన విశ్రాంతి స్థానమునుండి వెలికివచ్చి నాయకత్వం వహిస్తాడాయన. అధికారమనేది ఎక్కడనుండో ఎరువు తెచ్చుకొనే వస్తువు కాదు. ప్రతి పౌరునిలోనూ అంతర్గర్భితంగా ఉండే ప్రధానశక్తి అది. బుద్ధిమంతుడైన నాయకుడు కార్యాచరణకు దిగనప్పుడు యెప్పుడూ ముందు ఉండడు. మధ్యలోనో వెనుకనో ఉంటాడు. ఇది అనుభవంవలన గ్రహించవలసిన విషయం. మర్యాదను అతిక్రమించకుండా వ్యవహరించడం వలననే నాయకత్వం శాశ్వతంగా ఉంటుంది. ఈ రహస్యాన్ని అర్థం చేసుకోవాలి. గాంధీ తీవ్రవాదిగాఉంటే ఆయనను జనం పిచ్చివాడంటారు. ఆయన కొంచెం వెనుకంజవేస్తే ఆయన పని అయిపోయిందంటారు. ఆయన సరిగా వ్యవహరించాడని ఎప్పుడైనా అంటారా ఈ జనం ?

1940 జులై 31 వ తేదీని గాంధీ వ్రాసిన వ్యాసాన్ని ఈ సందర్భంలో జ్ఞాపకం చేసుకోవడం మంచిది.

" 1934 లో నేను కాంగ్రెసునుండి విరమించడం వలన ఆ సంస్థకింకా ఎక్కువ సేవచేసినవాడనయినాను. ఈ రోజున నేను కాంగ్రెసుకు దూరంగా ఉండడంకూడా ఆ ఉద్దేశంతోనే."

ప్రకృతియొక్క తాకిడీ, ప్రపంచాన్ని ఏకం చేస్తుందంటారు. అలాగే నిరంకుశాధికారుల తాకిడీ రెండువందల సంవత్సరాలనుండి యిండియాను ఏకంచేసింది.

కాంగ్రెసు అనే పెద్దకొండలో కొద్దిగా కనిపించినపగులు, పెద్దదై బ్రద్దలు కావడానికి సిద్ధంకాగా, ఇండియా పరిస్థితినిగూర్చి సోరెక్ సక్ అడిగిన ప్రశ్నకు అమెరీ యిచ్చిన ప్రత్యుత్తరం ఆ ఆపత్తును రానీయకుండా తప్పించింది. ఇండియా పరిస్థితి యెంతమాత్రమూ క్లిష్టంగా లేదని అమెరీ చాలా నమ్మకంగా చెప్పాడు. కాని కాంగ్రెసుకు దూరంగా ఉన్నప్పటికీ గాంధీ వెంటనే ఒక ప్రకటన చేశాడు. ఇండియాదేశ ప్రజానీకములో అత్యధిక సంఖ్యాకులకు తనమీద అత్యంత విశ్వాసం ఉన్నదనీ. తాను ఇండియాలో అందరికంటెను ఎక్కువగా సత్యాగ్రహ తత్వాన్ని జీర్ణించుకొన్నాననే నమ్మకం వారికున్నంతవరకూ వారందరూ తన నాయకత్వాన్ని అంగీకరించి తాను చెప్పినట్లు నిస్సందేహంగా నడచుకొంటారని కూడా గాంధీ విస్పష్టంచేశాడు. మ్యూనిచ్ ఒడంబడిక తరువాత బ్రిటిష్ పరిస్థితి యెంత క్లిష్టదశకు వచ్చిందో ఇంగ్లాండుదేశపు మంత్రులకు బాగా తెలుసు. అందువల్లనే కాంగ్రెసు కోరినట్లు బ్రిటిష్ యుద్ధాశయాలను గూర్చి ప్రకటనచేయడానికి వారెంతో భయపడుతూ వచ్చారు. సాధ్యమైనంతవరకు ఏ విధమైన ప్రకటనచేయకుండా ఉండడానికి ప్రయత్నించారు. "బ్రిటిష్ ప్రభుత్వాన్ని చీకాకుపరచకుండా ఉండవలెననే ఉద్దేశంతో కాంగ్రెసు శాసనోల్లంఘనమును ప్రారంభించకుండా నిగ్రహం చూపిస్తూన్నది. దీనిని అశక్తత అని అమెరీ పొరపాటు పడుతున్నాడు. కాంగ్రెసే నిగ్రహముచూపకుండా ఉంటే బ్రహ్మాండమైన అగ్నిజ్వాల బయలుదేరి ఉండేది. తరువాత ఏమి జరిగిఉండేదో ఎవరికీ తెలియదు. కాంగ్రెసులో ఎంత దౌర్బల్యం ఉన్నప్పటికీ సత్యాగ్రహం సాగించడానికి సావకాశం లేకపోలేదు. కాని కాంగ్రెసు చూపిస్తూన్న నిగ్రహానికికూడా ఒక మేర ఉంది. కాంగ్రెసు నిగ్రహాన్ని ఆధారంగా చేసుకొని దానిని అణచివేయవలెనని బ్రిటిష్‌వారూహిస్తూన్నట్లుగా యిప్పుడిప్పుడే అనుమానం తగులుతూన్నది. ఢిల్లీ తీర్మానాన్ని ఆమోదించడానికి పూనాలో అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులనేకమంది ఎదురు తిరిగిన కారణాన చాలామంది కాంగ్రెసువాదులను ప్రభుత్వంవారు నిర్బంధిస్తూన్నట్లు తెలిసింది. ఆ అనుమానం సరియైనదే అని ఋజువైన యెడల నన్ను యేదో ఒక విధమైన సత్యాగ్రహం ప్రారంభించకుండా నిరోధించగల వారెవ్వరూ ఉండరు. "కాని గ్రేట్‌బ్రిటనుకు తటస్థించిన కష్టం తొలగిపోయేవరకూ సత్యాగ్రహం ప్రారంభించే పరిస్థితి రాకూడదని నేను దైవాన్ని ప్రార్థిస్తూన్నాను. అందుకు తగిన ప్రయత్నంకూడా చేయగలను"

గాంధీ నిర్మొగమోటంగా చేసిన ఈ ప్రకటన తరువాత ఒకవారం రోజులైనా గడవకపూర్వమే రాజప్రతినిధి 8 వ ఆగస్టున ఒక సుప్రసిద్ధ ప్రకటనచేశాడు. తానా ప్రకటన చేయడానికి ముందుగా ఆగస్టు 4 వ తారీఖున ఉదకమండలంనుండి దాని

నకలును కాంగ్రెసు అధ్యక్షునికి పంపుతూ ఆయనను ఆ నెల 20 వ తేదీని తనను కలుసుకోవలసిందని కోరినాడు. రాజప్రతినిధి ప్రకటన చాలా దీర్ఘంగా ఉండడంచేత దానినిక్కడ పూర్తిగా ప్రకటించడానికి వీలుకాదు. కాని దానిలోని విషయాలను సంగ్రహంగా యిక్కడ ఉదాహరించవచ్చును. రాజప్రతినిధి వివిధ రాజకీయ నాయకులనూ కలుసుకొని సంభాషించిన పిదప, చక్రవర్తిగారి ప్రభుత్వసభ్యులతో సంప్రతించి కొంత మంది భారతీయప్రతినిధులను తన కార్యవర్గంలో చేర్చుకోవడానికి ఒక యుద్ధసలహా సంఘాన్ని నిర్మించడానికి అధికారాన్ని పొందినాడు. అల్పసంఖ్యాకులను గూర్చి, అతను వచ్చినప్పుడు బ్రిటిషుసమిష్టి సౌభాగ్యంలోనే (Common Wealth) ఇమిడి ఉండేటట్లొక రాజ్యాంగప్రణాళికను తయారుచేయడమును గూర్చి ఆయన విస్పష్టంగా ప్రకటించాడు. "భారతరాజ్యాంగ ప్రణాళికను తయారు చేసుకొనేబాధ్యత ప్రధానంగా భారతీయుల పైనే ఉండవలెననే కోరికతో ప్రభుత్వంవారికి కూడా సానుభూతి ఉంది. అయితే కొన్ని షరతులకు లోబడి వుండాలి ఆ రాజ్యాంగ ప్రణాళిక. అల్పసంఖ్యాకులక్కర లేదని నిరాకరిస్తూన్న విధానానికి ప్రభుత్వాధికారమీయడం తగనిపని. అటువంటి ప్రభుత్వాన్ని శక్తివంతమైన ఒక పెద్దముఠావారూ వ్యతిరేకిస్తూన్నప్పుడు వారిని బలవంతపెట్టి లొంగిఉండేటట్లుగా చేయడంకూడా సాధ్యంకానిపని" అన్నాడు రాజప్రతినిధి

వైస్రాయిప్రకటన మొత్తంమీద హఠాత్తుగా వచ్చింది. సాధారణంగా ఆశ వలన ఊహ ఎక్కువవుతుంది కాని ఊహించని విషయం తటస్థించేసరికి ఆశ తేలికగా పరిపూర్తి అయినట్లు కనిపిస్తుంది. అందువలననే వైస్రాయి ప్రకటనతో మితవాదులు సంతృప్తిపడ్డారు. కాని కాంగ్రెసు సంతృప్తిపడలేదు.

సూక్ష్మబుద్ధిగల కాంగ్రెసువాదులకు, వైస్రాయి ప్రకటనలో పునరుక్తులు చాలా కనిపించినవి. రాజప్రతినిధి ఓరియంట్ క్లబ్బులో చేసిన ప్రసంగంలో వెస్టుమినిస్టరు శాసనమునకు లోబడిన అధినివేశప్రతిపత్తి అని అన్నాడు. కాని యిప్పుడు మళ్లీ "స్వేచ్ఛాపూర్వక సమానభాగస్వామ్య" మంటాడు. భాగస్వామ్యము స్వేచ్ఛాపూర్వకమయితే దానిని వదలుకోవడానికికూడా హక్కుంది. వెస్టుమినిస్టర్ శాసనంలో అత్యంత శ్లాఘనీయమైన అంశ మీహక్కే. పర్యవసానంలో ఈ రెండూ ఒక్కటేనని చెప్పవచ్చు. అయితే కాంగ్రెసువాదులుకోరేది తక్షణ సంపూర్ణస్వాతంత్ర్య ప్రకటన కాబట్టి ఈ మాటల భేదంతో వారికేమీ సంబంధంలేదు.

మనము కోరింది జాతీయ ప్రభుత్వం. బ్రిటిష్ వారు వాగ్దానం చేసింది పూర్వపు కార్యనిర్వాహక సంఘ విస్తరణమాత్రమే. అది ద్వంద్వ ప్రభుత్వంకూడాకాదు.

కాంగ్రెసుకా సూచన యెంతమాత్రం గిట్టదు. కేంద్రంలో జాతీయ ప్రభుత్వం ఏర్పడి రాష్ట్రీయ మంత్రివర్గాలు పునర్నిర్మితములై రాజ్యాంగ పరిషన్నిర్మాణమునను బ్రిటిష్‌వారం గీకరించి రానున్న భారత ప్రజాపాలనములో అల్ప సంఖ్యాకులూ, సంస్థానాధిపతులూ కాదన్నంత మాత్రంతో పనికి నిరోధం కలుగకుండా హామీఉన్నట్లయితే ఫ్రాన్సు పతనానికి పూర్వం కాంగ్రెసు సమాధానపడి ఉండేది. కాని ఫ్రాన్సు పడిపోయిన తరువాత సామ్రాజ్యవాదం బలహీనమౌతూన్న తరుణంలో ఇండియా సంపూర్ణ స్వాతంత్ర్యం కావలెనని స్పష్టంగా ప్రకటన చేసినప్పుడు వైస్రాయి, మనం 1942 సెప్టెంబరులో కోరిన రాజ్యాంగపరిషత్తును నిర్మిస్తామంటూన్నాడు. 1942 లో మనం రాజ్యాంగపరిషత్తును కోరినప్పుడు బ్రిటిష్‌వారు దానిని నిరాకరించారు. మనం సంపూర్ణస్వాతంత్ర్యం కావలెనంటూన్నప్పుడు వారు 'స్వేచ్ఛాపూర్వక సమాన భాగస్వామ్యం' (Free and equal Fartnership) లభింపచేస్తామంటూన్నారు.

తాను చేసిన ఈ ప్రకటనను చాలా తొందరలో జవాబివ్వాలంటూ ఆ జవాబును పూర్వం సాధ్యమైతే ఆగస్టు 21 కి పూర్వమే తనను కలుసుకోవలెనని రాజప్రతినిధి కాంగ్రెసు అధ్యక్షునికి ఆహ్వానం పంపినాడు. కాంగ్రెసు కేంద్రప్రభుత్వంలోనూ యుద్ధ సలహాసంఘంలోనూ కలసి పనిచేయడానికి పిలవుతుందా అనే విషయాన్నిగురించి తెలియచేయవలసిందని కాంగ్రెసు అధ్యక్షుడు కోరబడ్డాడు. రాజప్రతినిధి కాంగ్రెసు అధ్యక్షునికి వ్రాసిన ఉత్తరంలో యిలా ఉంది ; "ఇండియన్ నేషనల్ కాంగ్రెసు పక్షాన మీరు సక్రమంగా జవాబిచ్చేముందు ఈ విషయాన్నిగూర్చి నాతో ఇంకా ఎక్కువగా చర్చించడానికి సావకాశం ఉంటుందని నేననుకొంటూన్నాను ......... మిమ్మలనూ మీ యిష్టం వచ్చిన మిత్రుణ్ని మీతో తీసికొని వచ్చేయెడల వారినీ, యిందుతో జతపర్చబడిన నా సంచార కార్యక్రమంలోని ప్రదేశాలలో మీ యిష్టంవచ్చిన సమయంలో కలుసుకోవడానికి నేను కుతూహల పడుతూన్నాను. నేను సూచించిన ప్రకారం నాకు సక్రమమైన ప్రత్యుత్తరం పంపేలోగా మీరు నాతో సంభాషించవలెనని వాంఛిస్తూన్నారా? ఇందులో యేమైనా ప్రయోజనమున్నదని మీరు భావించేయెడల ఆ సంగతి నాకు తెలియజేస్తూ మీకు వీలైన తేదీని మీ కేసమయంలో సావకాశం ఉంటుందో తెలియపరచకోరుతూన్నాను." రాజప్రతినిధి ఈ రెండు నిర్ణయాలనూ త్వరలో ఆచరణలోకి తీసుకొని రావలెనని ఆతురపడుతూన్నట్లూ ఆగస్టు చివరలోగానీ, సెప్టెంబరుమధ్యలోగానీ పైన ఉదాహరింపబడిన రెండు సంస్థలకూ సభ్యులను పేర్కొనవలసి ఉన్నట్లూకూడా తన ఉత్తరంలో వ్రాశాడు. ప్రభుత్వంవారు తమ విధానాన్ని యిదివరకే నిర్ణయించుకొని

ఉన్నప్పుడు రాజప్రతినిధిని చూచి సంభాషించినందువలన యేమైనా ప్రయోజన ముంటుందా అని కాంగ్రెసు అధ్యక్షుడాయనను ప్రశ్నిస్తూ వ్రాశాడు. అందుకు బదులుగా రాజప్రతినిధి తిరిగీ యిలా వ్రాశాడు. "నా ప్రకటనలో చక్రవర్తిగారి విధానం స్పష్టీకరించబడియే ఉంది. ఆ విధానానికి లోబడి కాంగ్రెసు, నా కార్య నిర్వాహక వర్గంలోనూ యుద్ధ సలహాసంఘంలోనూ నాతో కలసి పనిచేయడానికి వీలవుతుందని నా ఆశ. కాబట్టి నా ఆహ్వానానికి సక్రమమైన జవాబిచ్చేముందు ఈ విషయాన్ని గురించి మీరు నాతో మాట్లాడడానికి వీలవుతుందా?" అని మళ్లీ వెనుకటి మాటలనే ఉదాహరిస్తూ ఆహ్వానించాడు. ఆగస్టు 8 ని రాజప్రతినిధిచేసిన ప్రకటనకూ కాంగ్రెసు కోరే కోరికలకూ యెక్కడా పొత్తు లేకపోవడం చేతనూ, రాజప్రతినిధి ప్రకటనలో జాతీయ ప్రభుత్వమునుగూర్చిన సూచనకూడా వ్యంగ్యం కావడంచేతనూ తాను వైస్రాయిని చూచి ప్రయోజనంలేదని కాంగ్రెసు అధ్యక్షుడాయన ఆహ్వానాన్ని నిరాకరించాడు.

రాజప్రతినిధికీ కాంగ్రెసు అధ్యక్షునికీ ఈ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగిన కొద్ది కాలానికే 14 ఆగష్టున భారతరాజ్యాంగ కార్యదర్శి పార్లమెంటులో మరొక ప్రకటన చేశాడు. కాని దానినిగూర్చి విచారించేముందు, ఆయన అంతకుపూర్వం బ్లాకుపూలులో ఆగష్టు 11 వ తేదీని చేసిన ప్రసంగాన్ని గురించి కొంత చర్చించడం అవసరం. ఈ ప్రసంగం చేయుబడినప్పుడు దాని ప్రాముఖ్యతకు తగినట్లుగా అది మనదృష్టిని ఆకర్షించలేదు

ఇండియాలోని రాజకీయ వివాదముయొక్కయు, ప్రతిష్టంభనముయొక్కయూ, పుట్టుపూర్వోత్తరాలను గూర్చి అమెరీ కామన్సుసభలో చేసిన ప్రకటన తరువాతనే బ్లాకుపూల్ ప్రసంగం జరిగింది. రాజప్రతినిధి ప్రకటన ఈ రెండు సంఘటనల పర్యవసానమే.

యుద్ధసమయంలో ఇండియా చరిత్రలో ఇదివరకెన్నడూ తటస్థించని క్లిష్టపరిస్థితి సహజంగా తటస్థించింది. రాజప్రతినిధి అక్టోబరు నెలలో అందకుండా పొందకుండా ఒక అవివేక ప్రకటనచేశాడు. దానితో మంత్రులు రాజీనామాలిచ్చారు. తరువాత 1940 జనవరిలో ఓరియంటు క్లబ్బులో కొంత సమాధానపూర్వకంగా మరొక ప్రకటన చేశాడు. వీటన్నిటి తరువాతనూ ఆగష్టు 8వ తేదీని వైస్రాయి చేసిన ప్రకటనయున్నూ కామన్సుసభలో భారతరాజ్యాంగ కార్యదర్శి చేసిన ప్రకటనయున్నూ మాత్రమే ఇండియాలోని రాజకీయ పరిస్థితినిగూర్చీ, కేంద్రప్రభుత్వ పునర్నిర్మాణమునుగూర్చీ చేయబడిన అధికార ప్రకటనలని ఒప్పుకోనితీరాలి. ప్రపంచమున్నంతకాలం బ్రిటిష్‌ప్రభుత్వం వారిండియాను విడవదలచుకోలేదని మనం మాటిమాటికి చేస్తూన్న ఆరోపణను వారు

ప్రకటన మూలకంగా మొదటిసారి యిప్పుడే నిరూపించారు. "ప్రజలలో యేదో ఒక మతానికి చెందినవారుగానీ, సంస్థానాధిపతులుగానీ, లేక యెవరైనా స్వప్రయోజనపరులయిన విదేశీయులుగానీ, భారత ప్రజానీకము చేత ఎన్నుకోబడిన రాజ్యాంగ విధానమునకు అభ్యంతరం చెపుతూన్నంత కాలమూ ప్రస్తుత బాధ్యతారహిత నిరంకుశ పాలనం కొనసాగుతూండవలసిందే" నని ఈ ప్రకటనకు నిజమైన అర్థం. ఇటువంటి ప్రకటనలు అంతఃకలహాలనూ, ఆంతరంగిక పోరాటాలనూ ప్రత్యక్షంగా ప్రోత్సహించడాని కుపయోగపడగలవు. అంతే కాక వివిధపక్షాల కోరికలను సమన్వయం చేసుకొని సమాధానపడడానికి కూడా అవి అభ్యంతరం కాగలవు. 1940 ఆగష్టు 18వ తేదీని సమావేశమైన వర్కింగుకమిటీవారు ఈ ప్రకటనను గూర్చి వెల్లడించిన అభిప్రాయ సారాంశం కూడా యిదే. గాంధీకి వర్కింగుకమిటీకి మఱొకసారి అత్యంత క్లిష్టపరిస్థితి యేర్పడింది. పూనాలో ఇటువంటి పరిస్థితిలోనే గాంధీ సభకురాకుండా మానివేశాడు. కాని పూనా చర్చలకు ఢిల్లీ సమావేశంలోనే పునాది యేర్పడి ఉండడంచేతనూ అక్కడ గాంధీ ఉండి, వివిధ విభిన్నాభిప్రాయాలను స్వయంగా పరిశీలించి ఉండడంచేతనూ, ఆయన పూనా రాకపోయినప్పటికీ తన సహచరులతో సన్నిహితసంబంధం కొనసాగుతూనే ఉంది అందువలన వారి అభిప్రాయాలాయనకు క్రొత్తకావు.

పూనా సమావేశానంతరం జరిగిన ప్రభుత్వ ప్రకటనలవలన పరిస్థితులు పైకి కనిపించేటంత సుకరంగా లేనిమాట వాస్తవం. క్షణక్షణమూ చాలా సున్నితమైన చిక్కు సమస్యలు ఘటిల్లించక తప్పనిస్థితి యేర్పడింది. భారతీయుల కోర్కె నిరాకరింపబడిన మాట స్పష్టంగా తేలిపోయింది. కోరిక కోరినవారికి ఆ కోరిక కూడదన్నవారికీ కూడా గాంధీ ఒక్కడే శరణ్యమైనాడు. ఆయన సలహాను కాంగ్రెసు కోరడం సహజం. కాని ఆ నూతన వాతావరణంలో తాను పనికిరానివాడుగా తోచినందున తన సలహా ప్రయోజన కారి కాదని ఆయన అనుకోవడం కూడా సహజమే. పూనా వాగ్దానాన్ని బ్రిటిష్ వారుత్రోసివేసిన తోనే సిద్ధాంతంమాట ఎలా ఉన్నా ఆచరణలో మాత్రం గాంధీకీ ఆయన అనుచరులకూ ఉన్న భేదం సమసిపోయిందని కొందరనుకొన్నారు. కాని అది నిజంకాదు. గాంధీ అలా అనుకోలేదు. పూనా తీర్మానాని కనుకూలురైనవారు సమయం వచ్చినప్పుడల్లా కాంగ్రెసును అధికారంలోకి పోవలసిందని బలవంత పెడుతూంటారని ఆయనకు తెలుసు. యుద్ధం జరుగుతూన్న సంగతి మఱచిపోకూడదనీ యీ సావకాశం తీసికొని సైన్యంలో చేరడం మంచిదనీ అనుకొనేవారిండియాలో చాలామంది ఉన్నారు. దేశాల భవితవ్యం క్లిష్టదశలో ఉన్నప్పుడు సైన్యాలను సమీకరించి తీరవలెననీ, సైనిక సమీకరణమునకుగానీ, ఆయుధ సమ

పార్జవకుగానీ, అడ్డంకు కలిగించకూడదనీ వారి వాదం. జాతీయ సైనిక నిర్మాణం అవసరమే అయినట్లయితే అది యిప్పుడే జరగడం సముచితమని వారి అభిప్రాయం. రాజ ప్రతినిధి ప్రకటనను ఆమోదించిన వారందరూ తమ తమ సంఘాల శ్రేయస్సు కోసం సైన్య సమీకరణ ప్రయత్నాలను సాగిస్తారు. రాజప్రతినిధి కార్య నిర్వాహక వర్గం ఆయనకు మాత్రమే బాధ్యత వహించవలసి ఉంది. కాబట్టి కార్యనిర్వాహక సభ్యులందరూ బాగా సైనికులను చేర్చడానికి ప్రయత్నాలు చేయాలి. పూనా తీర్మానానికి గాంధీకూడా అంగీకరించి ఉన్నట్లయితే తానుకూడా సైనికులను చేరుస్తున్నట్లుగా ఆయన భావించవలసిన పరిస్థితి యేర్పడిం దానాడు. పూనా తీర్మానం అమలులోనే ఉన్నట్లయితే కొన్ని వేలమంది జైళ్లకు పోవడం నిరర్థకం. అప్పుడు జైలుకు పోవడమే ఒక విధంగా హింస కావచ్చునుకూడా. శాసనోల్లంఘనం ప్రారంభించి ప్రయోజనం లేదు. జనం తుపాకులతో కాల్చివేయబడతారు; మూక శాసనోల్లంఘనమే ప్రారంభింపబడేయెడల అందులో దౌర్జన్యం వచ్చిచేరుతుంది. సిక్కులకు సైన్యంలో చేరవలెనని ఉంది. సర్. సికందరు ప్రభుత్వంతో సహకారం చేయవలెనని ఒక పన్నాగం పన్నినాడు. అందువలన ఆయన సైనికులను చేర్చపూనుకొన్నాడు. బహుశా ఆ సైన్యంలో ముసల్మాను లధిక సంఖ్యాకులుగా ఉండవలెనని ఆయన కోరిక. కాబట్టి భారతదేశ సైన్యం పూర్తిగా జాతీయమైనా, కొంతవరకు జాతీయమైనా, దానితో సంబంధంపెట్టుకొన్న కాంగ్రెసు వాదులు తక్కిన వారి సైన్యాలకంటె తమ సైన్యాలసంఖ్య ఎక్కువగా ఉండవలెనని కోరే మతోన్మాదుల పన్నగడలను భగ్నం చేసేమాట నిజం. అందువలన మత విద్వేషాలు మఱింత చెలరేగడానికి సావకాశముంది. నిజమైన జాతీయ సైన్యమును మనం నిర్మించకలుగుతామనే ఆశ కనుచూపుమేరలో ఎక్కడా కనిపించడంలేదు.

పూనా తీర్మానాన్ని కొందఱు గమనించకనేపోవచ్చు. కాని ఆ తీర్మానమక్కడ ఉన్నంతకాలమూ జాతీయ సంస్థలో ఐక్యతకు సావకాశం ఉండదు. గాంధీ దానినిగూర్చి ఆలోచించినకొద్దీ వార్ధాలో, ఢిల్లీలో, పూనాలో, ఆ తీర్మానం చేయబడడం మహాప్రమాదమని ఆయన విశ్వాసం మఱింత దృఢతర మవుతూ వచ్చింది. ఆయన ఆ. భా. కాం. సం. సభ్యులపైన తన పలుకుబడిని వినియోగించడం యిష్టం లేక బుద్ధిపూర్వకంగా పూనా సభకు వెళ్లడం మానుకొన్నాడు. వర్కింగు కమిటీ వారన్నా అ. భా. కాం. సం వారన్నా తమ విశ్వాసాన్ని ధైర్యంగా వెల్లడించినందుకు వారిని అభినందించాడేగాని తాను మాత్రం ఆ ప్రమాద భూయిష్టమైన తీర్మానానికి బాధ్యుడు కాదలచుకోలేదు. ఆ తీర్మానం చేయడం పొరపాటు. కాబట్టి దానిని రద్దు చేయాలి. గాంధీజీయొక్క ప్రణాళిక ఆచరణలోకి వస్తే దానిని ఆయన అశ్వ

ద్భుతంగా ప్రదర్శించగలిగిఉండేమాట వాస్తవం. కాని అది యింకా పరిపక్వం కాలేదు. అంతవరకూ ఆయన చేసిన పనియొక్క ఫలితమంత స్పష్టంగా కనిపించడంలేదు. కాని వర్కింగు కమిటీవారు తమ యిరవయి యేళ్ల అనుభవాన్ని తెప్పపాటులో విస్మరించారనిమాత్రం ఆయన గ్రహించాడు. అహింసా విషయంలో యింతకాలంనుండీ ఎంతో శ్రద్ధగా పనిచేస్తూన్న మిత్రులు, పూనా తీర్మానం తరువాత తామేమి చేయవలెనో సలహా యీయవలెననీ కోరుతూ ఆయనకు అనుదినమూ ఉత్తరాలు వ్రాస్తూన్నారు. పూనా తీర్మానంలో తగిన మార్పులు జరగనిదే గాంధీ వర్కింగుకమిటీని నడపడం దుర్లభం. కాంగ్రెసువాదుల అహింస అంత బలిష్టమైనది కాదని ఆయనకు తెలియడమే దానికి కారణం. కాంగ్రెసు వాదులు చురుకుగానూ నిర్మాణయుతంగానూ హింసా విధానాన్ని సాగించలేరు సరికదా వారి అహింసావిధానం కూడా బాగా వ్యాపకం కావగనదిగా లేదు. ఇటువంటి సందిగ్ధసమయంలో వర్కింగుకమిటీ కాంగ్రెసును నడపవలసివచ్చింది. అందువలన అహింసావిషయంలో యిదివరకు వారవలంబిస్తూ వచ్చిన విధానాన్ని యావత్తూ మార్పుచేయవలసివచ్చింది. గాంధీజీ దృష్ట్యా వర్కింగుకమిటీ వారు అహింసావిధానానికి స్వస్తిచెప్పినట్లు తోచడం సహజమే. కాని ఆయన జయప్రదంగా పోరాటంసాగించగలిగినప్పుడూ కర్తవ్యమును నిర్వర్తిస్తాడే కాని నిరాకరించడు. కాంగ్రెసును నడిపించలేనని ఆయన ఆతరుణంలో ఎప్పుడో అంగీకరించాడు. అయితే ఎప్పుడో ఒకప్పుడాయన పోరాటంలోకి దూకక తప్పదు. అది కాంగ్రెసు పేరు మీద కాకపోవచ్చు. స్వాతంత్ర్యంకోసంకూడా కాకపోవచ్చు. ఎందువల్లనంటే అప్పుడా పేరుతో వ్యవహరించడం అంతఃకలహాలకు దారితీయడమే. కాంగ్రెసు చూపుతూన్న ఈ పేక్షాభావాన్ని ప్రయోజనంగా చేసుకొని, ఆడగలనని అనుకోవద్దని కర్నల్ అమెరీ కాయన మందలిస్తూ వ్రాసినట్లుకూడా తెలుస్తుంది. బ్రిటిషు వారికి చీకాకుగా ఉన్నా ఉండకపోయినా కాంగ్రెసు దుర్బలముగా ఉన్నా సబలంగా ఉన్నా, అమెరీతో గాంధీ పోరాటం తప్పదు. గాంధీ ఈ దృక్పథం అవలంబించిన పిమ్మటనే ఆయన ప్రతిష్ఠ మళ్ళీ హెచ్చింది: ఆయన స్వాతంత్రాన్ని పొందలేకపోయినా దాని చేరువకైనా రాగలిగినాడు. గాంధీ మత తత్వవాదులను సమాధాన పఱచిన పిమ్మట స్వాతంత్ర్యాన్ని పొందగలడు. కాని అమెరీ ఆ సమయంలో మతోద్రేకాలను రేకెత్తించడం మాత్రం నీచాతి నీచం. ముస్లిములు, నిమ్నజాతులు యింకా యితరులూ అల్పసంఖ్యాకులని వ్యవహరించడం అమెరీయొక్క బానిసత్వమునూ, హృదయ కాఠిన్యమునూ ప్రదర్శిస్తూన్నది. అహింసద్వారా తప్ప అందరికీ అనుకూలమైన రాజ్యాంగచట్టాన్ని కాంగ్రెసు నిర్మించజాలదు. మాటిమాటికీ అమెరీ

ఒక్కొక్క కొత్తసంస్థను హఠాత్తుగా పైకి తీసుకొని వస్తూవచ్చాను. ఇటీవల సంస్థానాధిపతులను ప్రేరేపించాడు. ఈ నాటకమంతా చూస్తూనే 'గాంధీ ప్రస్తుతం తన ఓటమిని అంగీకరించాడు. కాని అది చాలామందికి కష్టమనిపించింది. ఆమెకితో పోరాటం పెట్టుకోవలెనంటే గాంధీకి చాలా అవకాశముంది. కాని అది ఆయన వ్యక్తిగత వ్యవహారమయింది. దానికి కారణం వర్కింగుకమిటీ సభ్యులనుగాని తదితరులనుకాని తన వాదాన్ని ఆమోదించేటట్లు చేయలేనని గాంధీ అనుకోవడమే! అందువలన ఆయనకు కార్యక్రమంకూడా లేకపోయింది. తానొక నిస్సహాయుడ ననుకొన్నాడాయన. తన సహచరులను సరిగా నడపలేకపోయినాను. వారాయనను సమావేశమునకు రమ్మని కోరారు. ఆయన వచ్చాడు. ఆయనపోరాటం సాగించితీరాలి. కాని కాంగ్రెసు పేరుమీదకాదు అయినప్పటికీ ఇరవైసంవత్సరాలు కాంగ్రెసుకు నిరంతరసేవ చేసిన కాంగ్రెసువాదిగానే ఆయన పోరాటం సాగించనున్నాడు.

గాంధీకీ వర్కింగుకమిటీకీ మొదటినుండి చివరవరకూ అభిప్రాయభేదం ఉన్నమాట నిజమే. వారికి కేవలం తీర్మానం ఎలాఉండా అనే విషయంతో ప్రసక్తిలేదు. ఇప్పుడు పోరాటం ప్రారంభించకపోతే అవమానం తప్పదు. కాంగ్రెసు గాంధీ వేరువేరు పంథాలలో పోరాటం సాగించినప్పటికి ఈ రెండు పోరాటాలు ఒకదానికొకటి అనుబంధంగా ఉండాలి. కాంగ్రెసుకూ గాంధీకీ సిద్ధాంతభేదాలెన్ని ఉన్నప్పటికీ రెండు పోరాటాలు అనుబంధాలుగా సాగాలి. బ్రిటిష్ సామ్రాజ్యభవితవ్యం ఆ సమయంలో చాలా క్లిష్టపరిస్థితిలో ఉంది. సిక్కులు మొదలైన సంఘాలవారు ప్రతివిషయమూ సైనికభావంలోనే ఆలోచిస్తూన్నారు. అందువల్లనే బ్రిటిష్‌ప్రభుత్వంవారు పూనా తీర్మానాన్ని ఆమోదిస్తారని కాంగ్రెసులోని ప్రసిద్ధనాయకులకు అనుమానం తోచింది. కాని వారు బ్రిటిష్‌వారికాపాదించిన తెలివితేటలు నిజంగా వారికి లేవు.

తుదకు ప్రతివారూకూడా వర్కింగుకమిటీవారు తమ తీర్మానాన్ని మార్చుకొని గాంధీకి సర్వాధికారం ఈయడం ఉచితమని అభిప్రాయపడ్డారు. వర్కింగుకమిటీలో అధికసంఖ్యాకులు పూనా తీర్మానాన్నిగురించి చాలాదూరంపోయి ఉండడం చేత ఈ పని కొత్త వర్కింగుకమిటీ చేయడం మంచిదనిపించింది. అప్పటి వర్కింగుకమిటీనుండి విరమించుకొనేసభ్యులు తాము వెలుపల నున్నప్పటికీ సంపూర్ణసహాయం చేయగలమనీ వాగ్దానం చేశారు. కాని గాంధీ ఇందుకంగీకరించలేదు. సంపూర్ణసహాయం చేయడాని కంగీకరించినవారు వర్కింగుకమిటీలోనే ఎందుకుండరాదు. వర్కింగుకమిటీకి వెలుపల ఎందుకుండవలెను? అని ఆయన అన్నాడు. వారు పూనా విధానాన్ని మార్పు చేయడాని కంగీకరించారు. కాని వారేస్వయంగా ఆ పని చేయకపోవడంలో మనస్సులో

ఇంకా ఏదో కొరత ఉన్నదని భావించాలి. లేదా తమకు తెలియకుండానే తాము కృత్రిమంగా వ్యవహరిస్తూన్నారనుకోవాలి. కొత్తవర్కింగుకమిటీ నిర్మింపబడేయెడల తరలిపోయిన వర్కింగుకమిటీ సభ్యుల ప్రవర్తనను గూర్చి తీవ్రమైన అపోహలు వ్యాపించడానికి సావకాశం ఉంది. కాంగ్రెసుపేరుతో గాంధీ వ్రాసే అన్ని విషయాలనూ వారంగీకరించి ఊరుకోవడం దుర్లభం. వారు తిరుగుబాటుచేయడానికి అధికారం లేకపోలేదు. వారా పని యిదివరకే చేశారు. ఇప్పుడు గాంధీతో కలసి పనిచేయనైనా చేయాలి. లేదా వర్కింగుకమిటీనుండి విరమించుకోనైనా విరమించుకోవాలి.

అహింసకు అగ్రస్థానమిచ్చి గాంధీజీయొక్క ప్రధాననాయకత్వం క్రింద నడపవలసిన కాంగ్రెసుయొక్క నూతనదశలో వారి పైన ఉదాహరింపబడిన రెంటిలోవలలో యేదో ఒక త్రోవ త్రొక్కక తప్పదు. కొత్త వర్కింగుకమిటీ పూర్తిగా అహింసా సిద్ధాంతాన్ని అంగీకరించాలి. అహింసాచరణంలో భేదాభిప్రాయాలు కలవారెవ్వరూ ఆ కమిటీలో ఉండకూడదు. కాని పాత వర్కింగుకమిటీసభ్యులు తిరుగుబాటూచేయలేదు; కొత్తవిధానాని కనుగుణంగా చేరనూలేదు. గాంధీ తమ కిష్టంలేని విషయాలెన్ని ప్రచారం చేసుకొన్నా అడ్డుతగలమని వాగ్దానం చేశారు. గాంధీ తన సిద్ధాంతాలను గానీ, విధానాలనుగానీ ఆచరణలో పెట్టుకోవడానికి స్వేచ్ఛ యిచ్చారు. తమ వాదాన్ని ప్రకటించకుండా నిగ్రహిస్తామన్నారు. గాంధీ తన కార్యక్రమాన్ని కొనసాగించడానికి పూర్తిగా సావకాశమీయడమే వారి ఆశయమన్నారు. కాని గాంధీ అంతమనిషి ఉద్యమం సాగిస్తూన్నప్పుడు నిన్నటిదాకా కాంగ్రెసు వర్కింగుకమిటీలో ఉన్న సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులు తమ తమ రాష్ట్రాలలో నాయకత్వం వహించి పనిచేయకుండా తిరుగుబాటు చేయమనీ తమ అభిప్రాయాలను వెల్లడించమనీ వాగ్దానం చేసినంతమాత్రాన ఆయన పని యెలా కొనసాగుతుంది? వారాయనకు అడ్డుతగలవలసిన అవసరం లేదని యెవ్వరూ అనడానికి వీలులేకపోయింది. వారాయనకు అడ్డుతగిలారనీ తగులుతారనీ కూడా గాంధీ అభిప్రాయం. జవహరలాలునుగానీ, రాజగోపాలాచారినిగానీ విడిచిపెట్టాలని ఆయనకు లేదు. అయితే వార్ధాలో తాను వ్రాసిన చిత్తు తీర్మానానికి ఎక్కువమంది అనుకూలురుగా ఉంటారని తనకు తోచినప్పటికీ ఆ తీర్మానాన్ని ఆ విధంగా వర్కింగుకమిటీచేత అంగీకరింపచేయడంకూడా ఆయనకిష్టంలేదు. వార్ధాలో తనను నాయకత్వంనుండి తప్పించి ఆ భారాన్ని తొలగించవలసిందని గాంధీ సూచించినప్పుడు అది చాలామంది కిష్టంలేదు. సర్వసేనానిగా ఆయన తన బాధ్యతను నిర్వహించవలసిందేననీ తని అభిప్రాయాలతో కలిసిరాని వారి రాజీనామాలను ఆయన

కోరి ఉండవలసిందనీకూడా కొందరభిప్రాయపడ్డారు. కాని వార్ధాలో అలా కోర దగిన శక్తి తనకానాడు (జూన్ 1940) లేదని ఆయన భయపడ్డాడు. పిదప 1940 ఆగష్టులో తిరిగీ వార్ధాలో సమావేశం జరిగినప్పుడుకూడా అదే అభిప్రాయంలో ఉన్నాడాయన. రాజప్రతినిధి మొదలుకొని చిట్టచివరివాడి వరకూ కల ఆశేషజనం ఆయనను "మీ వయస్సిప్పుడు డెబ్బయి. ఇంకా ఇరవైయేళ్లు బ్రతుకుతానన్నట్లు మాట్లాడుతారు. అంటూ వస్తారు" ఈ మాటలోని యథార్థ మాయనకు తెలిసినప్పటికీ కూడా యిది వ్యక్తిగత విషయం కాదని జవాబిస్తూ వచ్చాడాయన.

వర్కింగుకమిటీవారి కనేక మార్గాంతరాలున్నవి. వర్కింగుకమిటీని తాత్కాలికంగా రద్దుచేసే గాంధీకే సర్వాధికారాలీయడం ఒక పద్ధతి. వర్కింగుకమిటీనుంచి విరమించుకొన్న సభ్యులకు బదులుగా అహింసా సిద్ధాంతంలో సంపూర్ణవిశ్వాసంకలవారా స్థానాలను ఆక్రమించడం మరొక పద్ధతి. రాజేన్‌బాబు ఆ కమిటీకి అధ్యక్షుడుగా ఉండవచ్చును అప్పటి అవసరానికి సరిగా వ్యవహరించగల సమర్థులు కాంగ్రెసులో అర్ధమం పదిమందియైనా ఉన్నారు. అయితే గాంధీ ఒక ఆనకట్టను నిర్మించే ఇంజనీయరు స్థితిలో ఉన్నాననీ, అందరు సబ్ ఇంజనీర్లు తన ఉత్తరువులకు విధేయత చూపనియెడల తనపని కొనసాగదనీ అన్నాడు. కొంతమంది సబ్ ఇంజనీర్లు చనిపోవచ్చును. ఇంకా కొంతమంది మన కందుబాటులో లేకపోవచ్చును. కాని స్థానికంగా ఉన్న సబ్ ఇంజనీర్లు విధేయులుగా ఉండితీరాలి అనికూడా అన్నాడాయన. అయితే అసలు చీఫ్ ఇంజనీయరుయొక్క సమర్థతనుగానీ ఆయన సర్వతోముఖ పాండిత్యాన్నిగానీ యెవడైనా ప్రశ్నించవచ్చును. కాని అహింసా సిద్ధాంతాన్ని అంగీకరించడం ప్రమాణంగా పెట్టుకొంటే దానిని అనుసరించే తక్కిన వ్యవహారాలు నడుస్తాంటవి. అసలీ ప్రధానవిషయంలో అభిప్రాయ భేదాలురావడం వలననే కాంగ్రెసులో చీలిక లేర్పడ్డవి. ఈ సంగతి మనస్సులో పెట్టుకొని కాళీస్థానాలను భర్తీచేసినయెడల యిక తగాదాలకు తావుండదు. అసలుచిక్కు మూలంలోనే ఉంది. గాంధీజీ ప్రతిపాదిస్తూన్న అహింసాసిద్ధాంతాన్ని ప్రారంభంనుండి కట్టకడపటివరకూ ఆమోదిస్తూన్నారో లేదో వర్కింగుకమిటీ సభ్యులే స్పష్టంగాచెప్పలేకుండా ఉన్నారు అహింస అనే పేరుతో ఎదురుచెప్పకుండా ప్రతి విషయానికీ విధేయత చూపవలెనని కాంగ్రెసువాదులను నిర్బంధించడం వలన కాంగ్రెసు కమిటీలన్నీ ఋష్యాశ్రమాలుగా తయారుకాగలవనీ, హింసావాదులు మనుష్యుల తలలు నరుకుతూంటే అహింసావాదులు వారి చిత్తాలను ఉత్తరిస్తూన్నారనీ చాలామంది అనవచ్చునుకూడా. ఏది ఏలా ఉన్నప్పటికీ అసలు సంగతి సంగ్రహంగా చెప్పవలెనంటే ఆచరణయోగ్యమైన కార్యక్రమాన్ని

సూచించడమే మనకిప్పుడు కావలసింది. అందుకుగాను తానున్న అహింసా పోరాటానికి గాంధీని నాయకుణ్నిగాజేసి ఆయన కనుకూలమైన నూతన వర్కింగుకమిటీ నుండి బయటకుపోయే సభ్యులు, సైనికుల విధేయతను చూపగలరు అంతేకాని ప్రతినిధులుగా వ్యవహరించజాలరు. ఈ రెండు కక్షులవారూకూడా ఒకరితో ఒకరు ఎక్కువగా వాదులాడుకో నక్కరలేదు. క్రొత్తవర్కింగుకమిటీని నిర్మించినంత మాత్రాన కాంగ్రెసులోని రెండు పక్షాలనూ యేపక్షాని కాపక్షం విడదీయడంగా గాంధి అనుకోవడంలేదు. ఏ విధమైన సత్యాగ్రహం ప్రారంభంకానున్నదో గాంధీయే ముందుగా చెప్పజాలని స్థితిలో నున్నాడు. కాని మౌలానా అజాద్, వల్లభాయి, రాజాజీ, జవహరలాలునెహ్రూల సహాయాన్ని ఆయన యెప్పుడూ కోరుతూనే ఉన్నాడు.

ఇంకో చిక్కుకూడా వచ్చింది. ఏ సమస్యమీద సత్యాగ్రహం ప్రారంభం కావలెననే సంగతి ముందు నిర్ణయం కావలసి ఉంది. భారత స్వాతంత్ర్యమునుగూర్చి సత్యాగ్రహాన్ని ప్రారంభించడానికి గాంధీ యిష్టపడడంలేదు. ఈ విషయం తనకు వదిలివేస్తే తాను తక్షణం, యే సమస్య తీసికొని సత్యాగ్రహం ప్రారంభించాలో నిర్ణయించగలనని గాంధీ అభిప్రాయపడ్డాడు. కాని వెంటనే నిర్ణయం కావాలి. ఏ సమస్యమీద సత్యాగ్రహం ప్రారంభించాలి. అసలుసత్యాగ్రహం మొదలుపెట్టాలా అక్కరలేదా అన్న ప్రశ్న ఎలా ఉన్నా, మానవత్వాన్ని గక్షించుకోవడానికైనా యేదో ఒక పనిచేయవలసివచ్చింది. దేశంలో జరుగుతూన్న వ్యవహారాలనుచూస్తే సహించడం కష్టంగా ఉంది. కాంగ్రెసుకు ప్రనాదులుగా ఉండి కాంగ్రెసు వలంటీర్లుగా ఉండదగిన వందలకొలది యువకులు ఖైదులలో పెట్టబడుతూన్నారు. అప్పటికప్పుడే రెండువేలమంది జైళ్లలో ఉన్నారు. ప్రతిచోటా కార్మిక సంఘాల నిర్మాతలు నిర్బంధింపబడ్డారు. మహా సభలు నిషేధింపబడుతూన్నవి. అధికారులు సాధారణంగా చాలామందిని యిళ్లలోనే నిర్బంధిస్తూవచ్చారు. ఆ నిర్బంధపు టుత్తరవులను ఉల్లంఘించక పోయినప్పటికీ నిర్బంధితులను అరెస్టుచేసి విచారణలేకుండా డిటెన్యూలుగా చేయడం ప్రారంభించారు. కొంతమందికి [1] ప్రతి సోమవారం పోలీసు స్టేషనుకు హాజరు కావలెననీ [2] యే విప్లవోద్యమంలోనూ జోక్యం కల్గించుకోకూడదనీ, [3] పాఠశాలా విద్యార్థులతోగానీ కళాశాలా విద్యార్థులతోగానీ సంభాషించడం, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, కలిసి తిరగడం కూడదనీ [4] యే సభలకు హాజరు కాగూడదనీ [5] ఒకచోటనుండి మరొకచోటకు వెళ్లే పక్షంలో 24 గంటలు ముందుగా పోలీసు స్టేషనుకు తెలియపఱచవలసిందనీ ఉత్తరవులు జారీ చేయ

బడినవి. 1940 జూలై 2 వ తేదీని కలకత్తాలో ఎల్గిన్ రోడ్డుమీదనున్న తన స్వగృహం లోనే సుభాస్ చంద్రబోసుకూడా ఇండియా రక్షణ చట్టంకింద అరెస్టు చేయబడ్డాడు. ఈ విధంగా పరిస్థితులు విషమ స్థితికి వచ్చినవి. చాలా మందికి ఇదే చివరి వర్కింగు కమిటీ సమావేశం కావచ్చుననే అపోహ కలిగింది. వర్కింగుకమిటీని పునర్నిర్మాణం చేసి పూనా తీర్మానాన్ని రద్దు చేయడమే అప్పటి కాచరణయోగ్యమైన పనిగా తోచింది. గాంధీని అంటిపెట్టుకొని ఉన్న వినుగుకు రాజీనామా ఈయాలా? గాంధీతో ఏకీభవించని తక్కినవారు రాజీనామా ఈయాలా? ఈ రెండూకూడా గాంధీ కంగీ కారంగా లేవు. అందువల్ల ఆయన మళ్ళీ పూర్వంలాగనే ఆలోచించడం ప్రారంభించాడు. వర్కింగుకమిటీవారు తన నిదివరకే నాయకత్వ బాధ్యతనుండి తప్పించారుగదా? మళ్లీ వర్కింగుకమిటీని నడిపే బాధ్యతను తానెందుకు తీసుకోవాలి? అలా తీసుకొన్నప్పటికీ తానొక వ్యక్తిగా తీసుకోవలసిందే గదా అని ఆలోచించాడాయన. అయితే కొంతమందిలో ఒక దురభిప్రాయం కలిగింది. గాంధీ కొంత శక్తి కలవాడనీ ఆయనకు వర్కింగుకమిటీపైన అసంతృప్తి కలిగి కోపం రావడంచేత ఆ శక్తిని వినియోగించదలచుకోలేదనీ అనుకొన్నారు వారు. కాని తనకా శక్తి లేనట్లుగా గాంధీ తలంచాడు. అయితే మిత్రులు కాంగ్రెసును తన చేతులలోకి తీసికొని తగిన శిక్షణ యిచ్చి ఆ శక్తిని సేకరించవలసిందన్నారు గాంధీతో. ఇది చాలా మందికి కష్టమనిపించింది కొంతమందిని కాంగ్రెసునుండి బయటకువచ్చి సత్యాగ్రహ పక్షాన్ని నిర్మించవలసిందని గాంధీ కోరినప్పుడు వారికి కోపం వచ్చింది. అయితే అప్పుడే గాంధీకి అనుకూలురనూ ప్రతికూలురనూ రెండు పక్షాలుగా విడదీయడమూ లేక వారంతట వారు తమ అభిప్రాయాలనుబట్టి క్రమంగా రెండు పక్షాలయ్యేదాకా ఊరుకోవడమూ అనేదే సమస్య. గాంధీ వర్కింగుకమిటీలమధ్య ఆ ఆజానుబాహువు-ఆ మహోన్నతమూర్తి—ఆ మహారాజ వర్చస్వి—కన్నులనుండి విజ్ఞాన తేజస్సులను వెదచల్లు ప్రతిపక్ష భయంకరుడు—కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా అజాదు ఏమీ తోచక నిలబడ్డాడు—ఆ మహానాయకుడు, ఆ విజ్ఞానఖని ఆ ప్రపంచ విఖ్యాత మహమ్మదీయ మత శాస్త్రవేత్త తన అధ్యక్ష పదవి ఒక మహాభారంగా తలపోసి తన నా పదవినుండి తొలగించవలసిందని కోరాడు. తనను అధ్యక్షత వహించమని ఆహ్వానించి అటువంటి విషమ పరిస్థితులలో గాంధీ కాంగ్రెసునుండి తొలగిపోవడం న్యాయం కాదన్నాడాయన. గాంధీ కార్యక్రమమునందు భక్తి విశ్వాసాలు కలిగి ఉండాలనే ప్రశ్న ఎందుకురావాలి? అవిలేని వారెవరైనా యిందులో ఉన్నారా? అని ప్రశ్నించాడు మౌలానా అజాదు. తాను కాంగ్రెసును విడిచిపెట్టి వెళ్లడం కాం

గ్రెసుకింకా ఎక్కువ సేవ చేయగలగడానికే అని గాంధీ అనుకొన్నాడు. ఆ ప్రకార మాయన యిష్టంవచ్చినట్లు ప్రచారం చేసుకోవడాని కాయన కధికారమీయబడింది. అది ఆయన సన్నిహితులలో ఏమి పరివర్తనం కలిగించిందో అంతటికీ తెలిసిందే. కాబట్టి ఆయనను నాయకత్వ బాధ్యతనుండి తొలగించడంవలన నేమి ప్రయోజనము? పరిస్థితులు ప్రతికూలంగా పరిణమించినవి. గాంధీ మూకీభావం వహించి ఊరుకోవడం మంచిదనిపించింది. ఒకరి నొకరు విశ్వసించనంత చెడ్డ వాతావరణం యేర్పడింది. ప్రజలు శాసనోల్లంఘనం చేయడానికి సంసిద్ధంగా ఉన్నారని పెద్ద పెద్ద కేకలు పెట్టేవారు చాలామంది ఉన్నారు. కాని హిందూ మహమ్మదీయ సఖ్యతకోసం, అస్పృశ్యతా నివారణకోసం, మద్యపాన నిషేధం కోసం ఖద్దరు వ్యాప్తికోసం కృషిచేయండని గాంధీ చెప్పినప్పుడాయనను అనుసరించే వారు కనిపించరు. సైన్యంలేకుండా సేనానాయకుడేమి చేయగలడు? గాంధీ చుట్టూ ఉన్నవారే అహింస యేమిటో అర్థంచేసుకోలేదు. గాంధీ సంపాదించిన బలం ప్రజాసామాన్యంనుండి మాత్రమే. ప్రజాసామాన్యాని కహింసలో ఉన్న నమ్మకం వలన ఆయనకాబలం వచ్చింది. తీర్మానాలు, తీర్మానాలభాష, కమిటీలు, కమిటీ సభ్యులు - ఈ విషయాలను గూర్చి గాంధీ యేమీ బాధపడడు. ఆయన కాంగ్రెసును గానీ దేశాన్ని గానీ వదిలి పెట్టదలచుకోలేదు. అయితే తాను చేసేపని కాంగ్రెసు పేరు మీదగాక సొంత బాధ్యత మీద చేయదలచుకొన్నాడు. కాంగ్రెసుపేరుతో తానేపనీ చేయజాలనని ఆయన స్పష్టంగా గ్రహించాడు. తన తరవాత తనంతవాళ్లనదగిన తన సన్నిహితులు చేసిన వ్రాతలవల్ల కాంగ్రెసుకు చాలా అపకారం జరిగినట్లు భావిస్తున్నారని ఆయనకు తెలుసు. రాజప్రతినిధి ఆహ్వానాన్ని నిరాకరిస్తూ మౌలానాఆజాదు ప్రత్యుత్తరం పంపడం ఆయనకు విచారం కలిగించింది. రాజప్రతినిధిని చూచి మౌలానా యింకా సమాధాన ప్రయత్నం జరిపితే బాగుండేదని గాంధీ అభిప్రాయం. మౌలానాకు రాజప్రతినిధి పంపిన ఆహ్వానంలోని షరతులనుబట్టి మొట్టమొదట ఆయన నిరాకరించినా, తరవాత యితరవిషయాలను చర్చించడానికైనా రాజప్రతినిధిని ఆయన చూచి మాట్లాడడానికి అంగీకరిస్తాడని గాంధీ తలంచాడు. తన సహచరుల దృక్పథము నుండి రాయబారాలకు తావున్నదనీ తన దృక్పథము నుండి అటువంటి సావకాశం లేదనీ ఆయన విశ్వాసము. ఈ అన్నికారణాలను బట్టి ఆయన తక్షణం పోరాటం సాగించదలచుకోలేదు. హిట్లరుతో సంధి చేసుకోవలసిందని కూడా ఆయన సొంతంగా యింగ్లీషువారికి వ్రాశాడు. ఇది ఫ్రాన్సు పడిపోకముందు జరిగిన విషయం. తనకు తోచినప్పుడు తానే ఏదోఒక చర్యతీసుకొంటాననీ ఈలోగా తానీయ

వలసిన సలహాయేమీ లేదనీ ఆయన అన్నాడు. ఆయన ఇంతకాలమూ ఉపవాస వ్రత మును గూర్చి మనస్సులో ఆలోచిస్తూ తదేకదీక్షగా తనను కంటూన్న సభ్యులతో గంభీరంగా యిలా అన్నాడు. తాను ఉపవాసం (ప్రాయోపవేశం) చేయ నిశ్చయించు కొన్నాననీ దాని నొక శాసనముగా తయారుచేసినానని యితరులెవ్వరూ తనతోపాటు వుపవాసం చేయకూడదనీ యే ఒక్కరూ తన దగ్గరకు రావద్దనీ ఈ మూడురోజులనుండీ తాను మాట్లాడిన మాటలు ఇన్ని నెలల నుండీ చేసిన చేతలు తప్పుగా పరిణమించినవనీ, లజ్జా విషాదాలను ప్రకటించాడు. అంత టితో ఊరుకోక నిరాశాపూరితునివలె తనబలమూ తనవాజికిగలశక్తి యెప్పుడు నశి స్తుం వోగదా అన్నాడు. మాలానాను కోపపడవద్దని ప్రార్థించాడు. దేవుడిచ్చిన శక్తి సామర్థ్యాలనన్నిటినీ, తానంతవరకూ ఉపయోగించానని ఆశ్వాసించాడు. చెప్పవలసిం దంతా అయిపోయింది, యిక చెప్పేదేమీ లేదంటూ తనను ఆశీర్వదించమని కోరా డక్కడున్న వారిందరినీ చివరకు. రెండు నిమిషాలవరకూ అందరూ నిస్తబ్ధులై ఊరు కొన్నారు, కడకు మాలానా "ఇంక మిమ్ములను నిలిపేటందుకు మాకు గుండెలేదు. మీ అనుజ్ఞఅయితే రేపుఉదయం మిమ్ములను కలుసుకొంటాను" అన్నాడు. "అవును నన్ను పోనీయడమే యిప్పుడు మీరు చేయదగిన ఉత్తమకార్యం తరువాత మీ రంతా సంప్రతించుకోవచ్చును" అన్నాడు. గాంధీ తన సహజ దాక్షిణ్యంతో.

రాజప్రతినిధీ, భారతరాజ్యాంగ కార్యదర్శి చేసిన ప్రకటనలకు వర్కింగుకమిటీ వారిచ్చిన ప్రత్యుత్తరము నిరవలంబ ప్రకటన అనదగి ఉన్నాయి. వర్కింగుకమిటీవారు స్నేహ పూర్వకంగా చేసిన వాగ్దానాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం వారంగీకరించి ఉన్నట్లయితే ఇండియాలో ప్రతిష్టంభనము తుదముట్టిఉండేది. కాంగ్రెసు సహాయ నిరాకరణను మాని ఉండేది. కాని ప్రభుత్వంవారు దానిని అంగీకరించకపోవడం విషాదకరం. అందు వలన వర్కింగుకమిటీకి చాలాకోపమూ కష్టమూ కలిగింది. ఇండియా సామ్రాజ్య ప్రభుత్వానికి ఒక ఉపగ్రహంగా ఉండజాలదనీ స్వేచ్ఛా స్వాతంత్ర్యములు గల దేశమయితేనేగానీ ప్రపంచంలో మర్యాదలేదనీ వర్కింగుకమిటీకి గల విశ్వాసం మరింత ధ్రువమయింది. వైస్రాయీ, భారతరాజ్యాంగ కార్యదర్శుల ప్రకటనలు దేశంలో శాంతి భంగం కలిగించి అంతఃకలహాలను ప్రత్యక్షంగా ప్రోత్సహించినవి. రాజ్యాంగపరిషత్తును కోరడమే ఇండియాయొక్క రాజకీయాభివృద్ధికి తరింపరాని ఆటంకమైనట్లుగా వారు చిత్రించారు. ఆయా అల్పసంఖ్యాకులచే ఎన్నుకోబడిన ప్రతినిధులతో ఒడంబడిక జేసుకోవడం మూలకంగా అల్పసంఖ్యాకుల సమస్యను పరిష్కరించతగునని 'కాంగ్రెసు ప్రతిపాదించింది. బ్రిటిష్ ప్రభుత్వం వారన్నను నిరంతరం భారతజాతీయ జీవితంలో

విభేదాలను సృజించి సుస్థిరంగా పెంపొందించడమే పనిగా పెట్టుకొన్నారు. భారతీయులు యుద్ధంలో సహాయం చేయుబూనుకొన్నప్పటికీ కూడా తమ అధికారాన్ని యేమాత్రమూ వదులుకోవలెననీ బ్రిటిష్‌వారికి యిష్టంలేదు. ఇండియాలోని అధిక సంఖ్యాకులకు ప్రతికూలంగానున్న మతాలనూ వ్యక్తులనూ కూడగట్టుకొని ప్రభుత్వం సాగించవలెనని బ్రిటిష్‌వారి ఉద్దేశం ప్రభుత్వ ప్రకటనలలోని సూచనల నంగీకరించి ఆచరణలో పెట్టేటందుకు వర్కింగుకమిటీ యెంతమాత్రమూ బాధ్యతవహించజాలదు. బ్రిటిష్ ప్రభుత్వ మవలంబించిన ఈ వైఖరిని బహిరంగసభలలో నిరసించవలసిందని కాంగ్రెసు కమిటీలకు, శాసనసభ్యులకు, తదితర ప్రజానీకమునకూ వర్కింగుకమిటీవారాదేశం పంపించారు. కాంగ్రెసు కమిటీలు తమ కార్యకలాపములను ద్విగుణీకృతోత్సాహంతో సాగిస్తూ కాంగ్రెసు దృక్పథాన్ని ప్రజలలో ప్రచారం చేయవలసిందని కూడా వారు సలహాయిచ్చారు. ఈ క్లిష్ట పరిస్థితినిగూర్చి చర్చించేటందుకు అ. భా. కాం. సం. సమావేశం సెప్టెంబరు 15 వ తేదీని పిలువబడింది.

పూనా తీర్మానం చచ్చిపోయి చాలా కాలమయిందని జవహరలాలు నెహ్రూ ఆగస్టు చివరవారంలో ప్రకటనచేశాడు. "ఇక తిరిగీ రామఘర్ తీర్మానాన్ని అనుసరించి భారతజాతి అష్టకష్టాలు పడడానికి సంసిద్ధం కావడం తప్ప మార్గాంతరంలేదు. అంతులేని మారణయంత్రాలతో ఆత్మహత్యాకరమయిన యుద్ధం జరుగుతూన్నప్పుడు తన విధానాన్ని తాను స్వేచ్ఛగా సాగించుకోవడానికి కాంగ్రెసు పట్టుదలగా పని చేయాలని అందరూ ఏకగ్రీవంగా అభిప్రాయపడ్డారు. కాని ప్రతిపక్షంవారు కష్టంలో ఉన్నప్పుడు వారిని చీకాకుపరచడం సత్యాగ్రహలక్షణంకాదు. ఈ సంగతి కాంగ్రెసు గ్రహించి ఉన్నప్పటికీ తానవలంబిస్తూన్న ఆత్మనిగ్రహం ఆత్మహత్యాకరంగా పరిణమించకూడదని భావిస్తూన్నది. కాబట్టి ఎట్టి అవసర పరిస్థితులలోనూ కూడా ఇటువంటి క్లిష్టదశలో అహింసానిరోధానికి దిగవలెనని కాంగ్రెసుకోరడంలేదు. వార్ధాసమావేశం ముగిసిన తరువాతగూడా గాంధీ కొంత మంది స్నేహితులను అక్కడ నిలిపివేశాడు. గాంధీని ఉపవాస వ్రతం విరమింప చేయడంలో వారు విజయవంతంగా పనిచేశారు. అందరూ కలసి ఒక కార్యక్రమాన్ని తయారుచేసి వర్కింగు కమిటీయొక్కయు అ. భా. కాం. సం. యొక్కయు నిర్ణయమునకు ఎదురు చూస్తూన్నారు. కాని గాంధీ నాయకత్వంకిందనే వారు పనిచేయ పూను కొన్నట్లయితే వారందరూ ఒకే మనస్సుతో ఆ చిత్తు తీర్మానానికి ఒకే అర్థం చెప్ప గలిగి ఉండాలి. అందుకు వారు ముందుగా గాంధీ మనస్సు తెలుసుకొనగలగాలి. స్వాతంత్ర్య సంపాదనకోసం ఆయన యేవిధమైన శాసనోల్లంఘనమునూ ఉద్దేశించ

లేదు. ఆయన యింతవరకు పొగలిగాడు:— "యుద్ధంలో బ్రిటిష్‌వారికి ధన సహాయం గానీ మనుష్య సహాయంకానీ యెవ్వరూ చేయకూడదు. నిరంకుశాధికార వర్గంవారిని శ్లాఘించాలి. వారికి తగిన గట్టితనం వారు చూపిస్తూనే ఉన్నారు." కాని యిటీవల ఆయన "భారత జాతియొక్క సహనానికికూడా స్వరూపసిద్ధమైన పరిమితి ఉంది". అని వ్రాసి ఉన్నాడు. భారతీయులు ప్రదర్శిస్తూన్న సహనాన్ని, పెద్దమనిషి తరహానూ దౌర్బల్యంకింద కట్టి కాంగ్రెసును అణచివేయడానికి ప్రయత్నాలు జరుగుతూన్నవి. గాంధీకి సంబంధించినంతవరకిప్పుడు దేశ స్వాతంత్ర్యంకంటె పౌర స్వాతంత్ర్యం ఎక్కువ ప్రాముఖ్యత వహించింది. పౌర స్వాతంత్ర్య రక్షణఅంటే ఒకవిధంగా భారత జాతియొక్క ఉనికిని రక్షించడమని ఆయన అభిప్రాయం.

గాంధీ ఈ పర్యాయం జైలుకు వెళ్లదలచుకోలేదు. ఈ పడవ ఆయనకా లేమాపా చూడవలెనని లేదు. బ్రిటిష్ ప్రభుత్వము ఆయనకు తగినచోటు చూపించజాలదు. ఉపవాసంచేతామనే అభిప్రాయాన్ని విరమించుకొన్నట్లుకూడా ఆయన తన మిత్రులతో అన్నాడు కాని అది ఆ నాటికి సంబంధించిన విషయంమాత్రమే. శాసనోల్లంఘనంద్వారా తగినంత పనిని తాను చేయజాలకపోయినప్పుడు ఉపవాసం చేయడం తప్పనిసరి అవుతుందన్నాడాయన. అయితే ఆయన ఎంతగా ఆలోచిస్తూన్నప్పటికీ దేనికి శాసనోల్లంఘనం చేయకూడదో తెలుసుకోగలిగాడేగాని, దేనికొఱకు శాసనోల్లంఘనం చేయవలెనో తెలుసుకోలేక పోయినాడు. వర్కింగుకమిటీవారు కూడా సత్యాగ్రహ ప్రణాళికను యేకగ్రీవంగా సమర్థిస్తారని నమ్మకంలేదు. మన ప్రతిపక్షులు అడవి జంతువులవంటివారు. మనం సత్యాగ్రహం ప్రారంభించడం వారి నెదురొక్కడం. ఇంతవరకూ వారు మన జాతిని మింగివేస్తూన్నారు. యిక మనజాతి స్వచ్ఛందంగా ఆహుతి అగుగాక. జాతీయ సంస్థ చంపబడుతూన్న సమయంలో భారతజాతి తన అహింసను రక్షించుకోవలెనని తలపెట్టితే జాతియొక్క అహింసయే రూపు మాసిపోతుంది. ఆ అపత్తు స్పష్టంగా కనపడుతూనేఉంది. సంయుక్త రాష్ట్రాల కాంగ్రెసు నాయకుడు శ్రీ కృష్ణదాస్ పల్లివాల్ లాటి వారిని అరెస్టు చేసి కాంగ్రెసును క్రమ క్రమంగా చంపడానికి ప్రయత్నాలు జరుగుతూన్నప్పుడు, పరిస్థితులెంత సున్నితంగానూ విషమంగానూ ఉన్నప్పటికీ, అత్యల్ప ప్రమాణంలో సత్యాగ్రహాన్ని ప్రారంభించడంతప్ప కాంగ్రెసుకు గత్యంతరం లేదు. ఈ విషయంలో గాంధీకి యింకా దూరాలోచన చేయవలెనని తోచింది. తాను చెప్పినది కాదని ఎవరు తనను మందలించడానికి ప్రయత్నించినా ఆలకించడానికి సిద్ధంగా ఉన్నాడు గాంధీ. కాని

సత్యాగ్రహ సంఘటనమును సాధ్యమైనంత వరకు జరగకుండా చూడడానికీ యావచ్ఛక్తి వినియోగిస్తూన్నాడు. ఆయన మనస్సులో పడుతూన్న ఆవేదనకు అంతులేదు. ఏదోఒక మార్గం చూపెడితేనేగాని కాంగ్రెసు నాయకుడుగానీ, సత్యాగ్రహ మూలపురుషుడుగా గానీ ఆయనకుగల స్థానాన్ని ఆయన సమర్థించుకోలేని స్థితిలో ఉన్నాడు. సత్యాగ్రహసిద్ధాంతంపైన ఆయనకు పట్టు తప్పిందని ఎవరైనా ఆయనను ఒప్పించగలిగేయెడల అంతిమ క్షణంవరకూ కూడా వారి వాదాన్ని వినడానికాయన తయారుగా ఉన్నాడు. తగాదాకు కారణం ఉండగా ఆ ప్రవాహంలో పడికొట్టుకొని పోకపోవడం కష్టమే. అసలు తగాదాకు కారణమున్నప్పుడు పోరాటంయొక్క నడకను గూర్చి విచారిస్తూ కూర్చోవడం వివేకం కాదు. ఇక్కడే అభిప్రాయభేదం వచ్చింది. గాంధీకి సత్యాగ్రహం సంజీవివంటిది అధమం యే కొద్దిమందికైనా అది ప్రమాదంగా తోచవచ్చును. కాని అది ప్రమాదమైనప్పటికీ సేనానాయకుడుగా తాను కార్యాన్ని నిర్వర్తించి తీరాలని గాంధీ అనుకొన్నాడు. సత్యాగ్రహం ఒక ప్రమాదమనుకోండి. నూతన ప్రయోగమనుకోండి. సేనానాయకునికి దానిలో సంపూర్ణ విశ్వాసం ఉంది. కనుక దానిని ప్రయోగించ తలచుకొన్నాడు. అంతేకాని గత్యంతరంలేక దానిని ప్రయోగించడంలేదు. గత్యంతరం లేనిమాటకూడా నిజమే — కాని దానిని ప్రయోగించడానికిమాత్రం కారణమదికాదు. ఇందువలన బ్రిటిష్‌వారు లొంగకపోతే లొంగకపోవచ్చు. కాని దీని ఫలితము మన ప్రజలపైన ఉండనే ఉంటుంది. సత్యాగ్రహము యొక్క ప్రధానాశయమే అది. రాను రాను సత్యాహింసలు హాస్యాస్పదములుగా పరిణమించినవి. కాంగ్రెసు అహింసను వార్ధాలోనూ, సత్యాన్ని ఢిల్లీలోనూ విడిచిపెట్టిందని కొందరు మిత్రులు హాస్యంగా అంటూ వచ్చారు. మొదటి దానితో మహాత్మాజీ కాంగ్రెసుకు కాకుండాపోయినాడు. రెండవదానితో బ్రిటిష్‌వారిండియాకు స్వరాజ్యాన్ని నిరాకరించారు. ఈ యుద్ధంలో ఇండియా రక్షణ అనగా బ్రిటిష్‌రక్షణ అని కాంగ్రెసు వ్యాఖ్యానం చేసినట్లు కనిపించింది. భాషలోని ఈ తికమకలు మామూలు మనుష్యుల కర్థంకావు. వాళ్లకు అసందిగ్ధమైన భాషలో తిన్నని సలహా ఈయాలి. అదే బొంబాయిలో వారికి లభించింది.

కర్తవ్యమునకు కదంగవలసిన తరుణం ఇండియాకు వచ్చింది. ఇండియా ఒక ఏడాదివరకూ వేచి ఉంది. బొంబాయిలో సెప్టెంబరు 15 వ తేదీని అ. భా. కాం. సం. సమావేశంకానున్నది. ఆనాటికి యుద్ధం ప్రారంభమై ఒక యేడాది గడచిపోతుంది. కాంగ్రెసు ఆలస్యం చేస్తూన్నకొద్దీ యువకు లదంతా పిరికితనమనుకొంటూన్నారు.

కాంగ్రెసు మర్యాదకోసం దేవులాడుతూన్నకొద్దీ ప్రభుత్వంవారు దానిని దౌర్బల్యమనుకొంటూన్నారు. ఈ యిరువురిమధ్యా అది రెండుతిరగలలో నక్కలాగా నలిగిపోతూంది. ఈ యిద్దరినీ లెక్కపెట్టకుండానూ, ఆపత్తులోఉన్న బ్రిటనుకు చీకాకు కలిగించకుండానూ తన నిర్ణయంప్రకారం కాంగ్రెసు తన కార్యక్రమాన్ని సాగించ దలచుకొంది. పోరాటానికి తరుణం ముందుగా నిర్ణయించలేదు కాంగ్రెసు. అనాడు కాంగ్రెసు ముందుకు సాగితీరాలి అన్నది కేవలం దైవసంకల్పం. క్షేమంగా నిరపాయ మైనకాలంలో కార్యక్రమం కొనసాగించవలెనన్నే వారికి బ్రిటను సుహృద్భావమును విశ్వసించి చేతులు ముడుచుకొని కూర్చోవడంలోనే సుఖముంది. యుద్ధం ప్రారంభం కావడంతోనే ఆత్మగౌరవంగల జాతి అంగీకరించజాలని చర్య తీసుకొన్నది యిండియా విషయంలో బ్రిటను. జర్మనీకి వ్యతిరేకంగా బ్రిటిష్ సింహం గర్జించగానే ఇండియా దానికి తోకలాగా వెనుకపడి పోవలసి వచ్చింది. సామ్రాజ్యంలోని ప్రతి అధినివేశం తోనూ బ్రిటను సంప్రతించింది. కాని ఇండియాతో సంప్రతించకుండానే ఇండియాను యుద్ధంలో కడ్చింది బ్రిటను.

గాంధీజీ ఉద్యమాన్ని నడపదలచుకొన్నారా? మహాత్మాజీ బొంబాయి వెళ్లు తున్నారనీ ఆయన ఉద్యమాన్ని సాగిస్తారనీ మౌలానా అజాదు చెప్పినాడు. బ్రిటిష్ వారింతవరకు ఎప్పుడూ చేయనంత గొప్ప అవమానమిప్పుడు ఇండియాకు చేసినట్లుగా గాంధీ తలంచాడు. ఈ పరిస్థితి అంతాచూస్తే ఆయనకు చాలా విచారంవేసింది. సత్యా గ్రహానికి దేశం తయారుగా ఉందా అని జనం అడగడం మొదలుపెట్టారు. సత్యా గ్రహానికి తయారుగా ఉండడమంటే మనుష్యులు, ధనం, సాధన, సామగ్రి ఉండడమని కాదు. వాతావరణం సత్యాగ్రహానికి అనుకూలంగా ఉందా లేదా అనే విషయమే ప్రధానం. సమిష్టి సత్యాగ్రహం ప్రారంభించవలెనంటే అహింసా వాతావరణం అంతటా వ్యాపించి ఉండాలి. ఆ వాతావరణం లేనప్పుడు కాని శాసనోల్లంఘనం తప్పనిసరిగా ప్రారంభించవలెనన్నే ఉత్సాహంమాత్రం ఉంది. తప్పనిసరిగా తటస్థించిన సంఘటనకు అనుకూలమైన కార్యవిధానాన్ని మనం సృజించుకోవాలి. కాని దేశంలోని వాతా వరణం మనకు ప్రతికూలం కాకుండాకూడా చూచుకోవాలి. గాంధీ కాంగ్రెసులో అవినీతి ఉందని చెప్పినట్లే హింసాపూరిత వాతావరణం వ్యాపించిఉందనికూడా చెప్పినాడు. అయితే ఈ మందలింపు సమష్టి కుటుంబపు యజమాని తన యింట్లో పిల్లలనుగూర్చి చేసిన మందలింపుగా భావించాలి. దీనిని ఆధారంగా తీసికొని ఇరుగు పొరుగువారంతా ఇంటియజమానిని ఇంట్లో పిల్లలనూ దూయబట్టడం సభ్యత కాదు. గాంధీ మందలింపు కేవలం కాంగ్రెసువారు ఆత్మ పరీక్ష చేసుకొని తమ తప్పులను దిద్దుకోవడాని కుద్దేశింప

బడింది. గాంధీ సత్యాగ్రహోద్యమానికి మూలపురుషుడు. తన అనుచరులు హద్దుదాటి ప్రవర్తించినప్పుడు వారిని అదుపులో పెట్టడానికి ఆయన మందలిస్తుంటాడు ప్రపంచంలో. ఏ సంస్థను నడిపేనాయకుడూ కూడా తన సంస్థలో అవినీతి ప్రబలిందని బహిరంగంగా మందలించడం మనం కనీ వినీ యెఱుంగము. గాంధీ యిలా అన్నాడంటే దేశంయొక్క ఆంతరంగిక వ్యవహారాలను సక్రమంగా ఉంచడానికే అన్నాడు. అప్పుడే రానున్న మహత్తర పోరాటానికి దేశం సంసిద్ధంగా ఉంటుంది.

"మన దేశంలోని ఆంతరంగిక పరిస్థితులు మనకు ప్రతికూలంగా ఉండగా బ్రిటనుకూ మనకూ గల నాటి సంబంధ బాంధవ్యాలనుబట్టి పోరాటం తప్పనిసరి అయ్యే స్థితి వచ్చింది. పరస్పర విరుద్ధములైన ఈ పరిస్థితులను సమన్వయం చేసుకొని తీరాలి. ప్రపంచంలో జరిగే అనేక వ్యవహారలౌక సిద్ధాంతానికీ ఒక తర్కానికీ లోబడి ఉండవు. ప్రపంచం అంటేనే రాజీ. 1940 సెప్టెంబరు 15, 16 తేదీలలో సమావేశమైన అ. భా. కాం. సం. కడచిన రెండు నెలలోని పరిస్థితులను సమగ్రంగా ఆలోచించి పూనా అ. భా. కాం. సం. లో ఆమోదింపబడిన ఢిల్లీ వర్కింగు కమిటీవారి తీర్మానం, అంతటినుండీ అసలులో లేనట్లు ప్రకటించారు. దానికి కాలదోషం పట్టిందన్నారు. కాంగ్రెసు తనంతట తాను ఆత్మ నిగ్రహం కలిగి ఉండవలెనని నిర్ణయించుకొంది. కాని ఆ ఆత్మ నిగ్రహం ఆత్మ వినాశకరం కాకూడదు. కాబట్టి కాంగ్రెసు అహింసా సిద్ధాంతంమీద ఆధారపడి తన కర్తవ్యాన్ని కొనసాగించడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగి ఉండాలి అని ఆ సభవారు తీర్మానించారు. కాని పౌర స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవడానికి అహింసా నిరోధం అవసరమే అయితే, కావలసినదానికంటె దానిని ఎక్కువగా ప్రయోగించవలెననే కోరిక కాంగ్రెసుకు లేదనికూడా వారు స్పష్టీకరించారు. సెప్టెంబరు మధ్యలో బొంబాయినగరమున ఒక నూతనాధ్యాయము ప్రారంభమయింది. యుద్ధం ప్రారంభమై ఒక యేడాదిపైన పక్షం రోజులయింది. బ్రిటనును తటస్థించిన ఆ కష్టకాలంలో పోరాటం రాకుండా ఉండేటందుకు సర్వప్రయత్నాలూ జరిగినవి. గాంధీజీ నాయకత్వంకూడా వదులుకొన్నది కాంగ్రెసు. పూనాలో 'వ్రతం చెడ్డా' కాంగ్రెసుకు 'ఫలం దక్కలేదు'. చెడిపోయిన కొడుకు తన శక్తిసామర్థ్యాలన్నీ ఉడిగిన తరువాత రిక్తహస్తుడై పశ్చాత్తాపపడి నమ్మకంతో దీనంగా తిరిగి తండ్రికడకు చేరుకున్నట్లు కాంగ్రెసు గాంధీ చెంత చేరవలసి ఉంది. కాని అంత దీనంగా ఉండవలసిన అవసరం లేదు. కొడుకు తన కర్తవ్యమును తప్పిపోయినా తండ్రికి ప్రేమ ఉండక తప్పదు. ప్రాపంచిక భోగలాలసత్వంలో మునిగి తేలే కొడుకుకు తండ్రి చెప్పేవన్నీ శ్రీరంగనీతులుగా తోచవచ్చును. కాని కొడుకు తప్పిదాన్ని తండ్రి తేలికగా క్షమించ

గలదు. తప్పిపోయిన మంద తిరిగీ తెలివిగా కాపరిదగ్గరకు రావడం మూలనున్న ముందు జరుగవలసిన పని సుకరమయింది. గాంధీ తిరిగీ నాయకత్వాన్ని వహించబోతూన్నాడనీ, భారతీయులకు బ్రిటిష్‌వారితో పోరాటం సాగుతుందనీ విదేశాలలో అప్పటికప్పుడే బాగా ప్రచారం జరిగి ఉండకపోయినట్లయితే బొంబాయిలో గొప్ప సంక్షోభస్థితి యేర్పడి ఉండేది. భారతజాతిమాత్రం మాఉమాట చెప్పకుండా విధేయతను చూపించాలి. జాతీయ అంతర్జాతీయ విషయాలను పరిష్కరించేటందుకు అహింసకు తిరిగీ అగ్రస్థానం లభించాలి. ఇందుకోసమే బొంబాయి సభ జరుగుతూన్నట్లు స్పష్టంగా వెల్లడి అయింది. అయినప్పటికీ బొంబాయిలో వాతావరణం సంక్షుభితంగానే ఉంది. ఈ సంక్షోభం భయంవలన కానీ కంగారువలనకానీ కాదు. ఒకవిధమైన ఆ కాంక్షవలన, ఒక రకమైన ఆశవలన.

అ. భా. కాం. సం కార్యక్రమం ప్రారంభమయ్యే ముందు పూనా సమావేశం తరువాత జరిగిన సంఘటనలనుగూర్చి కాంగ్రెసు అధ్యక్షుడు పర్యవేక్షణ చేశారు. (1940 అక్టోబరు 25 వ తేదీగల కరపత్రంలో 1 మొదలు 22 వ పుటల వరకూ ఉన్న విషయం చదవండి)

ఆ వర్కింగుకమిటీవారు రెండు తీర్మానాలు చేశారు. ఒకటి శాసనోల్లంఘనమును తాత్కాలికంగా విరమిస్తూనూ, రెండవది కేరళ వ్యవహారములనుగూర్చి తీర్మానించారు. కాంగ్రెసు సత్యాగ్రహం ప్రారంభించడానికి ముందు దేశమంతటా శాంతిభద్రతలతో అహింసా వాతావరణం వ్యాప్తికావలెనని వర్కింగుకమిటీవారాకాంక్షించారు. కాని కేరళ దేశంలో 15 వ సెప్టెంబరు తేదీని జరిగిన సంఘటనలు చాలా సంక్షోభకరంగా కనిపించినవి. ఆ నాటికి పోలీసు సబిన్స్పెక్టరును ప్రజలు రాళ్లు రువ్వి చంపినట్లుగా వార్తలు వచ్చినవి. కేరళరాష్ట్రసంఘం క్రమశిక్షణకు భంగకరంగా నడుచుకొంటూన్నదనే ఆరోపణలనుగూర్చి 15 వ తేదీని జరిగిన సభలలో తటస్థించిన అల్లరులనుగూర్చి విచారించడానికి ఒక ఉపసంఘాన్ని అక్కడకు పంపడం అవసరమని వర్కింగుకమిటీవారు భావించారు. గాంధీ వద్దనుండి తిరిగీ కొత్త ఉత్తరువులు చేరేవరకూ కాంగ్రెసుకమిటీలు వ్యక్తి శాసనోల్లంఘనమునుగానీ తదితర శాసనోల్లంఘనమునుగానీ వెంటనే ఆపివేయవలెనని వర్కింగుకమిటీవారు అధీన కాంగ్రెసు సంఘాల నాదేశించారు. ఈ పని రెండు ఉద్దేశాలతో చేయబడింది. ఒకటి గాంధీ రాజప్రతినిధిని చూడబోతున్నాడు గనుక ఆయన వెళ్ళేపని సవ్యంగా జరగడానికిది అవసరమని తలంపబడింది. రెండు కాంగ్రెసు సభ్యులుగా చేరినవారు, సభ్యులుగా చేరని కాంగ్రెసువారు, కాంగ్రెసు చిత్తవృత్తిగల తదితరులూ క్రమశిక్షణకు బద్ధులయి

ఉంటారా లేదా అని తెలుసుకోవడానికి పరీక్షగా యేర్పాటు చేయబడింది. అంతే కాదు శాసనోల్లంఘనం ప్రారంభించడమే అవసరమైతే శాసనాలను ధిక్కరించడానికి ముందు వాటికి విధేయతగా ఉండడం ఎలాగో ప్రజలకు నేర్పవలసి ఉంది.

బొంబాయి సమావేశం జరిగిన ఒక పక్షం రోజులలోగానే సెప్టెంబరు 2౬ వ తేదీని ఓవర్‌సీజ్ లీగులో అమెరీ మళ్ళీ యింకో ప్రసంగం చేశాడు. ఈ తడవ ఆయన భారతస్వాతంత్ర్యాదర్శాలనుగూర్చి ఉత్కృష్టమైన భాషలో యిలా మాట్లాడాడు:

"ఇండియాలో నడుస్తూన్న ఈ పరివర్తనకాలంలో మన దేశంలో మనం ఎదుర్కోవలసిన రాజకీయ కష్టాలెన్ని ఉన్నప్పటికీ ఒక్క సంగతి మాత్రం గమనించాలి, భారత ప్రజానీకముయొక్క స్వాతంత్ర్యాశయాలకు జన్మస్థానమిదే. ఇది మనం న్యాయంగా గర్వించతగిన విషయం. మనయొక్కయూ, భారతీయులయొక్కయూ ఐక్యసంఘటనమునకిది ప్రధాన సూత్రం" అన్నాడు. అంతటితో ఊరుకుంటే బాగుండేది. మళ్ళీ పాతపాట పాడడం సాగించాడు. భారతీయులలో ఐక్యత లేదని ఉద్ఘాటించాడు. "పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ఆధారంగా తీసికొని నిరంకుశంగా పరిపాలింపబడే సంస్థానాలకు భారతరాజ్యాంగచట్టమిచ్చిన అధికారం విషయంలో కాంగ్రెసు అభ్యంతరం పెడుతూన్నది. కేంద్రశాసనసభలోని అధికసంఖ్యాకులైన ఎన్నిక సభ్యులు తమ ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్గించుకొనే అధికారం ఉందని సంస్థానాధిపతులు భయపడుతూన్నారు. శాశ్వతంగా అధిక సంఖ్యాకులుగా ఉండే హిందువుల అధికారమునకు లోబడి, వారిచేతులలో మహమ్మదీయ మహాజనసంఘంయొక్క భవితవ్యమును వదిలివేయడానికి ముస్లిములు నిరాకరిస్తున్నారు.........నిరంకుశాధికారం కింద అంతర్గతంగా ఉన్న విభేదాలు స్వాతంత్ర్యాభ్యుదయచ్ఛాయలు కనిపించగానే మరింత ప్రబలమైనవి" అని అమెరీ తన ఉపన్యాసాన్ని ముగించాడు;



జవహరలాల్ నెహ్రూ



బాబూ రాజేంద్రప్రసాదు



సుభాష్‌చంద్రబోసు



మౌలానా అబుల్ కలామ్‌అజాద్

# ౧౦ సత్యాగ్రహం

[ అక్టోబరు 1940 ]

మళ్ళీ యేడాద తిరిగివచ్చింది. గాంధీజీయొక్క 72 వ జన్మదినోత్సవం లోకానందదాయకంగా సంఘటించింది. ప్రపంచమంతా మహా సంక్షోభంలో మునిగి ఉండగా యుగ యుగాంతరాలనుండి శాంతి సుహృద్భావాలను భూమిపైన ప్రబోధిస్తూ భారతదేశమొక్కటి మాత్రం సభ్యతా లోకంలో ఏకాకిగా నిలచి ఉంది. కాని స్పర్థతో నిండిఉన్న నేటి నాగరికతను కొనసాగనిచ్చేయెడల ఈ సద్భావములెంత కాలం నిలువగలవు? భారతీయ సభ్యతలోని సమష్టి కుటుంబం, వర్ణాశ్రమ ధర్మం, 'లోకాః సమస్తాః సుఖినోభవంతు' అని అనుదినమూ ప్రాతఃకాలమున చేయబడే ప్రార్థన—ఇవన్నీ; దేశాలన్ని స్వయం సంపూర్ణములుగా, స్వయంపోషకములుగా, స్వావలంబములుగా నుండవలెననే ఏకైకసూత్రాన్ని ప్రతిపాదిస్తున్నవి. ప్రతి ప్రాథమిక కేంద్రమూ స్వయంపోషకంగా ఉన్నప్పుడే ఈ దివ్యసంఘటనం సాధ్యమవుతుంది. అనగా మన గ్రామాలకు కావలసిన అన్నవస్త్రాలక్కడనే తయారు కావాలి. పట్టణాలు పరాన్నభుక్కులుగా ఉండకూడదు. దేశం యావత్తూ దురాశాలోభములను త్యజించాలి. కాబట్టి ఖాదీ నూతన వ్యవస్థకు పునాదిగా తయారు కావాలి. ఖద్దరు ఇండియాకు కొత్తకాదు. అది అనాదినుండి 1803 వరకు మనదేశంలో ఉండనే ఉంది. ఈస్టిండియా కంపెనీవారు ఖద్దరమ్మకొని రెండు శతాబ్దాలు కావలసినంత డబ్బు సంపాదించుకొన్నారు. తరువాత దానిని నాశనంచేసి ధనవంతులైనారు మనమంతా కొంత విరాళమిచ్చి ఖద్దరును పునరుద్ధరించాలి. అంటే ఖద్దరు కొనే ప్రతిమనిషీ కొంత ఎక్కువ ఖరీదిచ్చి కొనాలి ఈ సొమ్మంతా ఒక్కసారి ప్రభుత్వం గ్రాంటురూపంలో యిచ్చి ఖద్దరును పోషించలేదు. కిందటి సంవత్సరం గాంధీ 71 వ జన్మదినోత్సవం జరిగింది. ఆనాడామహర్షి, ఆ రాజకీయ దురంధరుడు, ఆ తత్వజ్ఞుడు ఇండియా బ్రిటను దేశాలమధ్య పొంగిపొరలి వస్తున్న యుద్ధతరంగాలకు చెలియలికట్టగా నిలిచాడు. ఆనాటి ఆయన ఆశా లతలు, ప్రయత్నాలూ బ్రిటనుదేశమును దాటి ఎంతదూరమో కొనలుసాగినవి. యుద్ధంముగిసిందనగానే ఆయన హిట్లరుకు ప్రపంచ విఖ్యాతమైన ఉత్తరమొకటి వ్రాశాడు ఒక్కసంవత్సరం ఎడా తెరిపీ లేకుండా కృషిచేసి మఱొక లోకోత్తరమైన ఉత్తరం 'ప్రతిబ్రిటిష్‌వానికీ' అనే శీర్షికతో బ్రిటిష్‌వారికి వ్రాశాడు. బ్రిటిష్ ప్రధాని దానికి సంక్షేపంగా జవాబు వ్రాశాడు. గాంధీజీ వ్రాసిన ఉత్తరమిది;-

## "ప్రతి బ్రిటిష్ దేశీయునకూ"

"1899 లో దక్షిణ ఆఫ్రికాలోనున్న బ్రిటిష్ వారికి నా దేశంనుంచి అక్కడకు కూలీలుగానూ, వర్తకులుగానూ, వారి గుమాస్తాలుగానూ వెళ్ళిన ప్రజానీకం పక్షాన ఒక విజ్ఞాపన పంపి ఉన్నాను. దాని ప్రయోజనం దానికి కలిగింది. ఆ సమస్య ఆనాడు నాదృష్టిలో ఎంత ప్రాముఖ్యంగా తోచి వున్నప్పటికీ, ఈ నాడు నేను విజ్ఞాపన చేయ దలచుకొన్న మహత్తర విషయంతో పోల్చిచూస్తే అది చాలా స్వల్పసంగతి అని పిస్తుంది. దేశాలకూ దేశాలకూ మధ్యనున్న సంబంధ బాంధవ్యాలుగానీ, తదితర విష యాలుగానీ యుద్ధంతోగాక అహింసా విధానంతో పరిష్కారమయ్యే ప్రతిపాదనను ఆమోదించవలెనని, ప్రపంచంలో యెక్కడ నివసిస్తూన్నప్పటికీ ప్రతి బ్రిటిష్‌వానికీ నేను విజ్ఞప్తిచేస్తూన్నాను. ఈ యుద్ధం ప్రజాస్వామ్యంకోసం జరుగుతూన్నట్లుగా మీ రాజ కీయవేత్తలు ప్రకటిస్తూన్నారు. ఈ ప్రకటననూ సమర్థిస్తూ అనేక కారణాలు చూపించ బడినవి. అవి అన్నీ మీరు వల్లించినవే. యుద్ధం ఏవిధంగా ముగిసినప్పటికీ, అది ముగిసే కాలానికి మాత్రం ప్రజాస్వామ్యాన్ని గూర్చి చెప్పుకొనే దిక్కుండదని నా అభిప్రాయం. ప్రపంచ మానవా నీకానికి యుద్ధం భావి దుర్గతిని సూచించే పిశాచంవలె అవతరించింది. ఇది కేవలం మానవులకు పీడాకరంగా ఉండడమేగాక తామిదివరకెన్నడూ ఎరుగని పశుత్వమును వారిలో రంపాదిస్తూన్నది. యుద్ధంలో దిగిన వారూ యుద్ధంలోకి దిగని వారూ అనేభేదంలేకుండా పోయింది. ఎవ్వరికీ దేనికీ రక్షణ లేదు అబద్ధాలాడడం ఒక కళగా పరిణమించినది. బ్రిటను చిన్న చిన్న దేశాల రక్షణకు పూనుకొన్నది. అవి ప్రస్తుతం ఒకదాని తరువాత ఒకట హరించిపోతూన్నవి. భవిష్యత్సూచక సంఘటనలను మనం అర్థం చేసుకోలేక పోయినట్లయితే మనిషి పశువుగా పరిణమించేమాట వాస్తవం. ఇప్ప టికే మనిషిచేసే పనులు పశువులను లజ్జింపచేస్తూన్నది. యుద్ధం మొగిసినప్పుడే నాకీ సంగతి తెలుసు. కాని ఆ మాట చెప్పే ధైర్యం నాకప్పుడు లేకపోయింది. చెప్పికూడా ప్రయోజనం లేనంత ఆలస్యం కాకముందు, ఆ సంగతి చెప్పగల ధైర్యం నాకు దైవం ప్రసాదించాడు.

"యుద్ధం విరమించవలసిందని నా విజ్ఞాపన. మీరు యుద్ధంలో ఆయాసపడి ఉన్నా రని నేనీవిజ్ఞాపన చేయడంలేదు. అసలు యుద్ధమే చెడ్డది గనుక దానిని విరమించవలెనని కోరుతున్నాను. మీరు నాజీతత్వాన్ని నాశనంచేదామను కొంటూన్నారు. మీరే ఆ తత్వాన్ని అవకతవకగా అవలంబించినందువలన దానిని మీరు నాశనం చేయలేరు. జర్మనులే విధ్వంసకచర్యలు చేస్తూన్నారో, మీ సైనికులూ అవే చేస్తూన్నారు. కాక

పోతే జర్మనులు చేసినంత చాకచక్యంగా మీవాళ్లు చేయలేకపోవచ్చు. అయినప్పటికీ కొద్దికాలంలో మీవాళ్లుకూడా జర్మనులను మించిపోకపోయినా వాళ్లంతివాళ్లుకావచ్చు. అలా కాకపోతే మీరు యుద్ధం గెలుపనేలేరు. అనగా నాజీలకంటెకూడా మీరెక్కువ క్రూరంగా ప్రవర్తించి తీరాలి. మీరు పూనుకొన్న కార్యం ఎంతన్యాయమైన దైనప్పటికీ, అనుక్షణమూ యిప్పుడు జరుగుతూన్న అంతులేని హత్యాకాండకు అవసరంలేదు. ఈ నాటి అమానుషచర్యలకు అవసరమును కల్పించే పని యెట్టువంటిదైనా న్యాయమైన దనిపించుకోదు.

“బ్రిటను వోడిపోవలెనని నా కోరిక కాదు. శరీరమును కానీ బుద్ధినికానీ వినియోగించి పశుబలమును ప్రయోగించడంలో పోటీపడి బ్రిటను విజయంపొందడంకూడా నా కిష్టంలేదు. మీరు కండపుష్టి ఉన్నదన్నమాట యెవ్వరూ కాదనజాలరు. మీ కండపుష్టికి తోడు, విధ్వంసకచర్యలు చేయడానికి మీకు నిరుపమాన మేధాశక్తికూడా కలదని ఋజువుచేయవలసి ఉందా? నాజీలతో మీ రటువంటి నీచమైనపోటీకి దిగకుండా ఉందురుగాక! అత్యంత ధైర్యసాహసములుగల సైనికులకు తగినట్లు ఎక్కువ ఉదారవంతమూ శౌర్యవంతమూ అయిన మరొక మార్గం నేను మీకు సూచించదలచుకొన్నాను. మీరు నాజీతత్వాన్ని ఆయుధాలులేకుండా పోరాడవలెనని నా కోర్కె. సైనికభాషనే వినియోగించవలసి వస్తే యెడల అహింసాయుతములైన ఆయుధములతో పోరాడవలెనని నా హెచ్చరిక. మిమ్ములను గానీ ప్రపంచ మానవానీకమును గానీ సంరక్షించేటందుకిప్పుడు మీకడనున్న ఆయుధములు నిరుపయోగములుగా తలంచి వాటిని విసర్జించవలెనని నా అభిప్రాయం. మీస్వాధీనంలో ఉన్నవని మీరు చెప్పుకొనే దేశాలలో హిట్లరుకూ ముస్సోలినికీ, కావలసినవి తీసుకోవచ్చునని వారిని పిలవండి. మీ సుందర భవనాలను వారి వశం చేయండి. ఇవన్నీ మీరు వారికిచ్చి వేసినప్పటికీ మీ ఆత్మలను కాని, మీ మనస్సులనుకాని వారికి లొంగరని చెప్పండి. ఆ యిద్దరు పెద్దమనుష్యులూ మీరు కాపురముండే యిళ్లుకావలెనని కోరితే ఆబాలగోపాలం హతమవండి. అంతేకాని వారి యెడల భక్తివిశ్వాసములు కలిగి ఉంటామనకండి.

“అహింసాయుత అసహాయోద్యమని నాచే పిలువబడుతూన్న ఈ విధానం ఇండియాలో కొంతవరకు జయప్రదంగా ఆచరణలోకి వచ్చింది. నేను చెప్పిన ఈ విషయాన్ని ఇండియాలోని మీ ప్రతినిధులు కాదనవచ్చును. వారలాఅంటే నేను వారిని గూర్చి విచారపడతాను నా అసహాయోద్యమం పూర్తిగా అహింసాయుతమైనదికాదనీ ద్వేషంతో పుట్టిందనీకూడా వారు మీకు నివేదించవచ్చును. వారా అభిప్రాయం వెల్లడిస్తే నేను కాదనను. అది పూర్తిగా అహింసాయుతంగానే ఉండి అన్ని సహాయనిరాకరణ

ములూ మీయెడ సుహృద్భావముతోనే జరిగి ఉన్నట్లయితే, ఇండియాకు శిక్షకులుగా నున్న మీరీపాటికి మాకు శిష్యులై, మాకంటె ఎక్కువ తెలివిగా నిరుపమానమైన ఆ ఆయుధాన్ని ఆదర్శప్రాయంగా తయారుచేసి జర్మను ఇటాలియను మిత్రుల భయంకర చర్యలను దానితోనే ఎదుర్కోగలిగి ఉండేవారు. యూరపుఖండంలో కడచిన కొలది మాసాలలోనే నిరపరాధుల శరీరాలనుండి యిన్ని రక్తస్రవంతులు ప్రవహించి ఉండేవి కావు. చిన్నజాతుల బలాత్కారపతనం ఘటించి ఉండేదికాదు. ద్వేషానలం వ్యాపించి ఉండేదికాదు.

“ఇది పనిలేని మనిషి చేస్తున్న విజ్ఞప్తికాదు. అహింసనూ దాని ఉపపత్తులనూ సశాస్త్రీయంగా యాభైసంవత్సరాల పైనుండీ ఎడతెగకుండా ఆచరిస్తూవున్న మనిషియొక్క విజ్ఞప్తి యిది. నా జీవితంలోని ప్రతి విషయంలోనూ—కుటుంబ విషయాలలో, సంస్థల విషయంలో, ఆర్థిక రాజకీయ విషయాలలో దీని నాచరణలో పెట్టాను. ఏ సందర్భంలోనూ యిది అపజయం పొందినట్లు నేననుకోలేదు. అది ఒకప్పు డపజయం పొందినట్లు నాకు తోచినా అది నా ఆచరణలో ఉన్న లోప మనుకొన్నాను. నేను ప్రమాద రహితుడనని ఎన్నడూ అనుకోవడంలేదు. కాని నేను సత్యాన్వేషణ తత్పరుడనని అనుకొంటున్నాను. సత్యం దేవుడికి మఱొక పేరు. ఆ అన్వేషణలోనే నాకు అహింస ప్రత్యక్షమయింది. అది నా జీవిత ధర్మమయింది. ఆ ధర్మమును నిర్వర్తించడం తప్ప, జీవితంలో నాకు మఱొకపని లేదు.

“నా యావజ్జీవమూ నేను బ్రిటిష్‌వారికి ప్రతిఫలాపేక్ష లేని స్నేహితుడనుగా ఉన్నాను. ఒకప్పుడు నేను మీ సామ్రాజ్య పక్షపాతిగా కూడా ఉంటూ వచ్చాను. అందువలన ఇండియాకు క్షేమం చేకూర్చుడ మనుకొన్నాను. సహజంగా దానివలన ప్రయోజనం లేనట్లు తెలుసుకొనగానే అహింసా పద్ధతితో సామ్రాజ్య తత్వాన్ని ఎదుర్కొన్నాను. ఇప్పటికీ ఎదుర్కొంటున్నాను. చిట్టచివరకు నా దేశముయొక్క భవితవ్యమెలా ఉన్నప్పటికీ మీయెడల నాప్రేమమాత్రము కొఱవడకుండా అలాగే ఉంటుంది. నా అహింస, నేను విశ్వప్రేమకలిగి ఉండవలెనని కోరుతుంది. మీరందులో తక్కువవారు కారు. ఆ ప్రేమవలననే నేను మీకీ విజ్ఞప్తి పంపుకొంటూన్నాను.

నేను మాట్లాడే ప్రతిమాటనూ దేవుడు శక్తివంతంగా చేయునుగాక!. ఆయనపేరు మీదుగానే నేనిది వ్రాయడం ప్రారంభించాను. ఆయన పేరు మీదుగానే నేను దీనిని ముగిస్తాను. నా విజ్ఞాపనను ఆమోదించే బుద్ధీ, ధైర్యమూ, మీరాజకీయవేత్తలకు కలుగుగాక. ఈ నా ప్రార్థనలోని ఉద్దేశాన్ని ఆచరణలోకి తెచ్చే విషయంలో నా సహాయం

అవసరమని తోచినట్లయితే చక్రవర్తిగారి ప్రభుత్వానికి నేను సహాయం చే..డానికి సంసిద్ధంగా నున్నానని ఘనశివకోంచిన రాజప్రతినిధికి మనవి చేసుకొంటున్నాను.”

యుద్ధం అనే పెనుభూతం యిరోపా ఖండాన్ని యావత్తూ కబళించింది. ఇందువలన బ్రిటను హృదయం ఇండియా యెడల మృదులం కావడానికి బదులు వజ్ర కాఠిన్యం వహించింది.

కాని గాంధిజీ దివ్య సందేశంమాత్రం దశదిశలా ప్రతిధ్వనించింది. గడచిన సంవత్సరాలనుండి ఆయనచేసిన ప్రబోధం ఆయన జన్మదినోత్సవ వాసరంలో దేశమంతటా సంస్మరింపబడింది. ఇప్పుడు జరగబోయే మూడవ సత్యాగ్రహ సమరమునకు ముందుగా యిండియా యేయే దశాంతరాలను కడచిందో ప్రజలకు విశదీకరించి చెప్పబడింది. మూడవ సత్యాగ్రహ సమరమునుగూర్చి వర్ణించేనాటికి ఈ పూర్వ సంఘటనలే నిరంతరం ప్రతి చోటా ప్రత్యక్షం కావచ్చును కూడా.

అక్టోబరు 17 తేదీని బ్రిటనుతో ఇండియాకు సమరం ప్రారంభమయింది. వినోభాబావే మొదటి సత్యాగ్రహిగా సత్యాగ్రహం ప్రారంభించాడు. ఈ కింది సత్యాగ్రహ ప్రమాణాన్ని ఆయన పదేపదే అంటూ సత్యాగ్రహం సాగించాడు. ఆ ప్రమాణ మిది. “బ్రిటిష్‌వారి ఈ యుద్ధ ప్రయత్నాలకు మనుష్యులనూ, డబ్బునూ సహాయం చేయడం తప్పు. అన్ని యుద్ధాలనూ అహింసాయుతంగా నిరోధించడంమాత్రమే యుద్ధానికి తగిన ప్రతిక్రియ.”

తరువాతి సత్యాగ్రహి జవహర‌లాలు నెహ్రూ అని అందరికీ తెలుసు. మొట్టమొదట సత్యాగ్రహం చేయతగిన మనిషి కాంగ్రెసు అధ్యక్షుడుగా కానీ ఆయనతో తులతూగగల మరొకరుగా కానీ ఉండకూడదా అని కొందరికి సందేహం తోచింది. కాని మొదటి సత్యాగ్రహిగా ఉండడానికి తగిన అర్హత వినోభాబావేకి తప్ప తదితరులకు లేదని గాంధీ తన అభిప్రాయాన్ని దాచకుండా చెప్పివేశాడు. మనోహరంగా మాట్లాడడంలో గాంధీకి అద్భుతమైన కళా సామర్థ్యం ఉంది అందులో అప్రియమైన మాటలు చెప్పవలసి వచ్చినప్పుడాయన మరీ మృదువుగా చెప్పగలడు నవంబరు 7 వ తేదీని జవహరలాలు సత్యాగ్రహం చేయవలసి ఉంది. గాంధీ ఆయనకు కబురు చేశాడు. తిరిగి వెళ్ళేటప్పుడు అలహాబాదుదగ్గర చియోకీ రైల్వేస్టేషనులో అక్టోబరు 29 వ తేదీని ఆయన అరెస్టు చేయబడ్డాడు.

వాక్స్వాతంత్ర్యమును పొందడంలో దేశ స్వాతంత్ర్యం ఉన్నదన్నమాట నిజమే. అయితే ఆ వాక్స్వాతంత్ర్య సంపాదన నిమిత్తమొక వ్యక్తిని నిర్ణయించి సత్యాగ్రహం

చేయవలసింపని యేర్పాటు చేయడం, గొప్ప విజ్ఞానవంతులూ, దేశభక్తులూ, ధైర్యశాలులూ, త్యాగమూర్తులూ అయిన కొంతమందికి దాదాపు హాస్యాస్పదంగా తోచింది. ఈ సత్యాగ్రహముయొక్క ఆశయమే చాలా పరిమితంగా ఉండడమూ, వ్యక్తి సత్యాగ్రహం కావడంచేత దాని వ్యాపకం కూడా సంగ్రహంగా ఉండడమూ, అందులోనూ, వర్కింగుకమిటీ సభ్యులలోనే కొంతమందికి ఆ మొదటి సత్యాగ్రహి యొక్క పుట్టుపూర్వోత్తరాలు తెలియకపోవడమూ, యిదంతా అగ్రాహ్యంగా తోచింది. వర్కింగుకమిటీలోని ఆ ప్రముఖులందరికీకూడా వినోబా సంగతి తెలియక పోవడానికి కారణం ఆయన ప్రకటనను కోరకపోవడమే. నిర్మాణ కార్యక్రమంలో పనిచేసేవారు రాజకీయాలలో పనిచేసేవారివలె పదిమందికీ వెల్లడికారు. కాని గాంధీకి మాత్రం ఆయన ప్రియుడు, గౌరవనీయుడు, ఆదర్శపురుషుడు — ప్రియమైన స్నేహితుడు, గౌరవనీయుడైన సహచరుడు, ఆదర్శ సత్యాగ్రహి. గాంధీ వినోబాను గురించి యిలా వ్రాశాడు.

"ఆయన నా తరవాత నా అంతవాడు. అహింసనుగూర్చి చక్కగా చెప్పగలవాడు. అహింసయొక్క అపరావతారం. ఆయన నా నుండియే సత్యాగ్రహ సిద్ధాంతాన్ని గ్రహించాడు. నిర్మాణకార్యక్రమంలో నిమగ్నుడై యేదో ఒకచోట ఆయన పాతుకొనిపోయినాడు. నాకన్న కూడా ఆయనకు ఎక్కువ ఏకాగ్రత ఉంది. నిష్కళంకమైన అహింసాతత్వం కలవాడు కావడంచేతనే ఆయనకు యుద్ధమంటే గిట్టదు." తరువాత గాంధీ, జవహరలాలును రెండవ సత్యాగ్రహిగా గ్రహించాడు. తన కార్యక్రమాన్ని ఆమోదించవలసిందని వర్కింగుకమిటీని కోరాడు. గాంధీకి సర్వాధికారం ఉన్నమాట నిజమే. కాని దానిని ఉపయోగించేటందుకు వర్కింగుకమిటీవారి అండ ఉండవలెననుకొన్నాడు. అంతేకాదు, అన్ని సంగతులూ వారికి తెలిసి ఉండవలెనని కూడా ఆయన ఆతురపడ్డాడు. వెనుక ఉన్నవారు బుద్ధిపూర్వకంగా గానీ, అజాగ్రత్త వలనగానీ జైలుకు పోగూడదు. బుద్ధిపూర్వకంగా పోవడం అపరాధమవుతుంది. అజాగ్రతవలన పోవడం క్షమార్హం కావచ్చును కాని తప్పే. ఇందువలన గొప్ప నిగ్రహంతో దేశం నిర్మాణకార్యక్రమంలో నిమగ్నంకావడానికి సావకాశంకలిగింది. శాసనోల్లంఘనంకంటె కూడా నిర్మాణకార్యక్రమం చాలా ఎక్కువది. శాసనోల్లంఘనంలో తప్పు జరుగవచ్చు. నిర్మాణకార్యక్రమంలో తప్పుకు సావకాశంలేదు. నిర్మాణకార్యక్రమం విద్యుద్వాతావరణాన్ని సృజించకలదు. అందరూ జైలుకు పోయినట్లయితే నిర్మాణకార్యక్రమం జరుగదు. జైలుకుపోయినవారేమీ చేయజాలరు. కాంగ్రెసువాది యెవ్వడూ యుద్ధానికి డబ్బియ్యకూడదనికానీ యుద్ధ ప్రయత్నంలో

పాల్గొనకూడదని కానీ యెక్కడా చెప్పకూడదు. దానివలన చాలా కీడు ఉందని గాంధీకి స్పష్టంగా తెలుసు వినోబా అరెస్టయిన తరువాత యేమి జరుగుతుంది? గాంధీ జవహరలాలును సత్యాగ్రహించేయడానికి అనుజ్ఞయిస్తాను సరే! కాని గుంపులు గుంపులుగా సత్యాగ్రహులను పంపడాయన. సత్యాగ్రహ ప్రమాణపత్రంకింద సంతకం చేసినవారిలో మంచివారెవరో, చెడ్డవారెవరో గాంధీకి యెలా తెలుస్తుంది? అందువల్లనే ఆయన ముందుగా ఒకరితో ప్రారంభించాడు. తరువాత యిద్దరన్నాడు ముందేమి చేయాలో అదంతా ఆయన మీదే ఉంది. ఈలోగా ఆరాటకంవస్తే దానిని నిరోధించడానికి తగిన సాధనసామగ్రి కూడా తయారుచేసుకొంటూన్నాడాయన. కొలంబస్ నలుగురితోనే బయలుదేరాడు కాని వారిలో యిద్దరు ఎప్పటికప్పుడు తాము ప్రయాణం చేస్తున్న నావ ఎంతలోతులో ప్రయాణంచేస్తూన్నదో పరీక్షిస్తూనే ఉన్నారు. అదే విధంగా దేశంలో ప్రజల ఆంతరంగిక భావాలను ఎప్పటికప్పుడు గాంధీ పరిక్షిస్తూనేవున్నాడు. వినోబానూ, జవహర్‌లాలునూ పంపిన తరువాత తక్కినవారిని పంపవలెనో లేదో ఆయన నిర్ణయించుకోవాలి. దండీ దండయాత్ర యిలాగేకదా జరిగింది! ప్రతి ఉద్యమమూ మొదట్లో చిన్నగానే ప్రారంభింపబడుతుంది. కాని దానిలో అత్యంతమైన శక్తిసామర్థ్యాలిమిడి ఉంటవి. అయితే అందరూ అలా అనుకొని సంతృప్తిపడరు. ఒక్కమనిషి మాత్రమే జైలుకుపోవడం కృత్రిమంగా కనిపిస్తుంది. కాని ఆ ఒక్కడూ ముందు పంపబడే దళాలకు ప్రాతిపదికగా పంపబడితే ప్రజలకది అర్థమవుతుంది. ప్రతి మనిషికీ యుద్ధనిరోధమును గూర్చి ఉపదేశించవలెననే కోరికవుంది. సత్యాగ్రహులు మాట్లాడిన తరువాతకూడా అరెస్టుచేయబడకుండా ఉన్నట్లయితే వారు కేవలం యుద్ధ వ్యతిరేక ప్రచారం చేయవలసి ఉంది. కాని వారు మర్యాదగానూ పెద్దమనిషి తరహాగానూ మాట్లాడాలి. అయితే యిక ఎక్కడనుండి ఆ విద్యుద్వాతావరణం ఉత్పన్నమౌతుంది? మర్యాదా, పెద్దమనిషితరహాల వలన తక్షణం కలిగే ఫలితం, గాంధీ ప్రారంభించతలచుకొన్న పోరాటాన్ని ముగించడమే కాదా? అంతేకాదు కాంగ్రెసువాది ఎవ్వడూ యుద్ధమునుగూర్చి మాట్లాడకూడదనడం అ. భా. కాం. సం. వర్కింగుకమిటీ యిచ్చిన ఆదేశాలకు విరుద్ధంకాదా? అప్పటికి అక్టోబరు నెల సగం గడిచింది. తరువాతి రెండువారాలు కాంగ్రెసు సభ్యత్వమును చేర్పించడానికి తీవ్రప్రచారం చేయవలసివుంది— గ్రామాలలోని ప్రజానీకమును చైతన్యవంతమొనర్చవలసిన పని ఉంది — యిదంతా విడిచిపెట్టి వినోబా సత్యాగ్రహం చేయబోతున్నాడనడం అందరికీ నచ్చలేదు.

అందువల్ల వాతావరణం విద్యుత్ప్రభావంతం కావడమున కొంతమాత్రము వీలు లేదు పైగా వినోబానెవ్వరూ ఎరుగరు. వినోబా అంతకుపూర్వ మేమిచేస్తూండేవాడో

అయినా కాంగ్రెసువారు తెలియచేయవద్దా? వేయిమందిలో 999 మంది మెదలకుండా ఊరుకొంటే ఏ ఒక్కడో ప్రకృతిని విద్యుత్ప్రభావంతగా చేయగలడా? గాంధీ మరో విధంగా తలంచాడు. భారతదేశం యావత్తూ తమ వెంట ఉన్నదని ఆ నాడు కాంగ్రెసు చెప్పడం నటన అని తోచింది. కాంగ్రెసు తనస్థితిని ప్రపంచానికి వెల్లడిచేసి, తాను అవమానకరంగా మరణించనని మాత్రం ఋజువుచేయగలస్థితిలో ఉంది. ముందు రానున్న భయంకర సంగ్రామమునకిదంతా సన్నాహం. సత్యాగ్రహ ప్రమాణపత్రంపైన సంతకంచేసిన ప్రతిమనిషీ జైలుకు పోవడానికి గాంధీ అనుజ్ఞ ఈయదలచుకోలేదు. ఆయన సిమ్లానుండి తిరిగివచ్చిన తరువాతనే వినోబాసంగతి ఆయన మనస్సుకుతట్టింది. గాంధీ ఆసమస్యను గూర్చి అద్వితీయంగా ఆలోచించాడు. దీనివిషయంలో వివిధ విధములగు ఆలోచనలు కలవు. గాంధీకి ముఖ్యంగా సన్నిహితులైనవారే అనేక ఆలోచనలు చేశారు. ఈ సత్యాగ్రహం వలన రాజకీయ ఫలితాలేమీ ఉద్దేశింపబడలేదని గాంధీ అన్నప్పుడు కొంతమందికి ఆశ్చర్యంకలిగి ఉండవచ్చును. పౌరహక్కులకోసం గాక హిందూదేశ స్వాతంత్ర్యం మన ఆదర్శంగా ఉంచవలెనని వారు వాదించారు. ముందొకందుకని చెప్పి హఠాత్తుగా దానిని మార్చి, మరొకందుకీ సత్యాగ్రహం చేస్తూన్నామనడం కేవలం పొరపాటేకాదు అపాయకరంకూడా అన్నారు. ఎప్పటికీ అధికారం పుచ్చుకోకూడదని వారెన్నడూ గట్టిగా చెప్పలేదు. అధికారం కనిపిస్తే ఎగిరిగంతేస్తూ స్వీకరిస్తారు. మనమేదో ఒక చిన్నకోరిక కోరుతూన్నట్లు ప్రపంచానికి ప్రదర్శించడం తప్పు. అన్నివిధములగు సభలనూ ఆపివేయడమంటె ప్రజల నడుములు విరుగగొట్టి నిరుత్సాహ వాతావరణాన్ని పురికొల్పడమే. సామాన్య ప్రజానీకంతో సన్నిహిత సంబంధాన్ని యెప్పటికీ విడిచిపెట్టుకోరాదను. యుద్ధాన్నిగూర్చి యేమీ మాట్లాడక పోవడం అసహజంగా ఉంటుంది. ఇట్టి పరిస్థితులలో ఏమి జరుగనున్నదో అని ప్రతివారూ ఎదురుచూస్తూన్నారు. మొట్టమొదట వేసే అడుగు చాలా జాగ్రత్తగా ఉండవచ్చును. కాని ఉత్కృష్టంగా మాత్రం ఉండితీరాలి. ప్రజాసామాన్యం మానసికంగా సంసిద్ధంకావడం ముఖ్యావసరం. కాంగ్రెసు చాలా పట్టుదలగా ఉందని వాళ్ళకు నమ్మకం కలిగేటట్లు కూడా మనం నడుచుకోవాలి. ఎప్పుడూ చెడ్డగానే ఆలోచించే వాళ్ళకు సైతం మన ఉద్యమంయొక్క పట్టుదలా పటుత్వమూ అర్థమయ్యేటట్టు చేయాలి. మనంవేసిన మొదటి అడుగు ప్రజలు గమనించనంత సూక్ష్మంగానూ సున్నితంగానూ ఉండకూడదు. మొట్టమొదటి సత్యాగ్రహి సుప్రసిద్ధ కాంగ్రెసువాదిగా ఉండాలి. 'కాని గాంధీ కేవలం అందుకు భిన్నంగా ఆలోచించాడు. ఒకమనిషితో సత్యాగ్రహం ప్రారంభించడమంటే యేమిటో ప్రజకు అర్థం కాకపోతే తాను మరొక

విధానం ఆలోచించలేకన్నాడు. ఈ విధానం ప్రజలకు అర్థంకాదనే భయం ఆయనకు లేదు. కాని ఈ విధానంలోని వివేకాన్ని తన సహచరులు సంకోచించడం ప్రారంభిస్తే తనచేయి కంపిస్తుందన్నాడు గాంధి. తన మనస్సుకానీ దృష్టికానీ సమిష్టి సత్యాగ్రహం మీద లేదని పదేపదే చెప్పినాడు అప్పటికి దేశం అందుకు సంసిద్ధంగా లేదు. కావలసిన సాధన సామగ్రి దగ్గర లేదు. ప్రజలను యిప్పుడా ఆ ఉద్యమం కోసం సంసిద్ధపరచలేదు. స్వాతంత్ర్యం అంటూ మాట్లాడడం చాలా తేలిక. నిజానికది ఒకవిధంగా ప్రజల సమక్షంలోనే ఉంది. దానిని గ్రహించలేకపోతే అది ప్రజల తప్పు. ఇంగ్లీషువారు దానిని భారత ప్రజానీకానికి ప్రసాదించే స్థితిలోలేరు. స్వాతంత్ర్యం అనేది వట్టిమాటమాత్రం అయినంతవరకూ, అందరూ యిష్టంవచ్చినట్లు మాట్లాడగలిగారు. కాని దానికొరకు కచ్చితంగా పోరాడవలసివచ్చేసరికి ఆమాటకూడా అనడానికి వీలులేకుండాపోయింది. కాబట్టి ప్రజలకు వాక్స్వాతంత్ర్యం లభించినట్లయితే వారికి నిజంగా క్రియాస్వాతంత్ర్యంకూడా లభించినట్లే. ఇంత పరిమితమైన ఉద్యమం సాగుతూన్నప్పుడు తాను అధ్యక్షుడుగా ఉండి పని సాగింపవలెనా లేక మానుకోవలెనా అని కాంగ్రెసు అధ్యక్షునికి సందేహాలు కలిగినవి. కాని అవి తాత్కాలిక సందేహాలే.

వార్ధాకు ఐదుమైళ్లదూరంలో ఉన్న 'పవనారు' వినోబా ఉండే పల్లెటూరు ఆయన అక్టోబరు 17 వ తేదీ ఉదయం యుద్ధవ్యతిరేకోపన్యాసంతో సత్యాగ్రహం ప్రారంభించాడు. ఆయన ఉపన్యాసం చేసిన సభ నిషేధింపబడలేదు. ఆయన అరెస్టూ చేయబడలేదు. పైగా యావద్భారత దేశంలోని పత్రికలకు ఆయన ఉపన్యాసాలను ప్రచురించ కూడదని ఆయన క్రియాకలాపమునుగానీ కార్యక్రమమునుకానీ వెల్లడించ కూడదనీ ముందుగానే ఉత్తరువులు జారీచేయబడినవి. తరువాత ఆయన ఉపన్యాసాలు చేసుకొంటూ గ్రామాలవెంట తిరిగి అక్టోబరు 21 వ తేదీని అరెస్టుచేయబడి తేలికగా మూడునెలల కారాగారశిక్షకు మాత్రం గురియైనాడు. యీ నవసత్యాగ్రహ మహా సమరంలో మొట్టమొదటగా చేయబడిన ఆయన ఉపన్యాసాలకు కొంతవిలువా చారిత్రకప్రసిద్ధీ ఉన్నది. కాని గ్రంథవిస్తర భీతిచే యిక్కడ వాటిని ఉదాహరించడంలేదు.

రెండవశిక్ష జవహర్‌లాలుది. కాని అది సత్యాగ్రహం చేసినందుకుకాదు. ఒక పెద్ద బహిరంగసభలో ఆయన ఉపన్యసించినందుకు శిక్షింపబడ్డాడు. మొదటిశిక్ష యెంత తేలికగా ఉందో రెండవశిక్ష అంత కఠినంగాఉంది. కాని ఇండియాలోని సత్యాగ్రహులు తమ దీర్ఘశిక్షలను గూర్చి యేమీ దిగులుపడేవారుకారు. వారు సంతోషంగా జైళ్లకుపోయి వడకుకుంటూ చదువుకొంటూ వ్రాసుకుంటూ జబ్బుపడి లేస్తూ

కాలక్షేపం చేశారు. వారిలో కొందఱు విడుదలయిన కొద్దికాలానికి మఱికొందరు జైలులోనూ మరణించారు.

సత్యాగ్రహసమరానికి సంయుక్త రాష్ట్రాలలో ప్రజలెంతవరకు సంసిద్ధంగా ఉన్నారో పరిశీలించేటందుకు జవహరలాలు ఆరాష్ట్రంలో సంచారంచేసి అప్పుడే ముగించాడు. నాటి పరిస్థితులను వివరిస్తూ ఆయన అనేక ఉపన్యాసాలు చేశాడు. ఆయన గాంధీజీ ఆహ్వానంమీద వార్ధాకు వెళ్ళి తిరిగి వచ్చేటప్పటికి 1940 అక్టోబరు 31 వ తేదీని అరెస్టుచేయబడ్డాడు. ఆయనను విచారించిన మేజిస్ట్రేటు నాలుగు సంవత్సరా లాయనకు శిక్ష విధించాడు. సత్యాగ్రహం గాఢంగా ప్రారంభమైన తక్షణం గాంధీని స్తుతించేవాళ్ళలో ఒకడనని చెప్పుకొనే ఆర్థర్ మూర్ స్టేట్సుమన్ పత్రికలో సత్యాగ్రహ వార్తలను ప్రచురించడానికి ఒక "కాలం" ప్రారంభించి దానికి 'లోలాయిల కథనం' అని పేరు పెట్టాడు.

నవంబరు 17 వ తేదీని సర్దారుపటేలు నిర్బంధింపబడ్డాడు. ఆయన ఫలానా నేరం చేసినట్లు ఆరోపణచేయబడడం కానీ, విచారణ చేయబడడంగానీ జరుగలేదు. ఆయనను అరెస్టుచేసి కాలపరిమితిలేకుండా డిటెయిన్ చేశారు. ఇండియాలోని వివిధప్రదేశాలనుండి సత్యాగ్రహంచేసేటందుకనేకమంది పోటాపోటీగా వస్తూన్నారు. అప్పుడు గాంధీ మఱొకప్రకటన చేశాడు. "నాయకులు అరెస్టుచేయబడ్డప్పుడు ప్రదర్శనాలు జరుగకుండా యింకా ఎక్కువ జాగ్రత్త తీసికొనవలసిందని" ఆయన దేశీయులకు హెచ్చరిక చేశాడు. తరువాతి వారంలో వివిధరాష్ట్రాలలోని అనేకమంది ప్రముఖ నాయకులు నిర్బంధింపబడ్డారు. జనాన్ని ఆకర్షించడానికి చేయబడే అన్నిప్రదర్శనములూ చేయకుండా కాంగ్రెసు జాగ్రత తీసుకొంది. బొంబాయి మాజీప్రధాని బి. జి. ఖేరు అరెస్టు చేయబడ్డప్పుడు బొంబాయి గవర్నరాయనయెడల అత్యంత దాక్షిణ్యంతో ప్రవర్తించవలెనని ఉద్యోగులకు ఉత్తరువులు జారీచేశాడు. అమెరీలో మాత్రం ఈదాక్షిణ్యం కానీ సరసంకానీ యేమీ కనపడలేదు. మాజీమంత్రుల అరెస్టులనుగూర్చి ఆయన ఒక ప్రశ్నకు జవాబు చెబుతూ యిలా అన్నాడు.

> "జైళ్ళలో ఉన్న కాంగ్రెసు వాదులకు చదువుకోవడానికీ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోవడానికీ చాలా సావకాశాలున్నాయి. యుద్ధానంతరం చక్కని ఆలోచనతో నిర్మాణయుక్తంగా తయారుచేయబడిన ఒక ప్రణాళికను వారు వెలికి తీసుకొనిరాగలరు. భారత ప్రజాభిప్రాయాని కనుగుణంగా సాధ్యమైనంత తక్కువ కాలంలో తగినట్లుగా అది మార్పు చేయబడగలదు."

నవంబరు చివర వారానికి చాలామంది మంత్రులు పార్లమెంటరీ కార్యదర్శులు అ. భా. కాం. సం. సభ్యులూ జైలుకు పోయినారు. ప్రతిచోటా శాంతి భద్రతలు చక్కగా కాపాడబడినవి. 1940 నవంబరు చివర వారంలో మాత్రం ఒకటి రెండు సంఘటనలు కాంగ్రెసుయొక్క మంచిపేరుకు కళంకం తెచ్చినవి. బీహారు ప్రధానమంత్రి అరెస్టు చేయబడ్డప్పుడు ఒక గుంపు పోగయి ప్రదర్శనాలు చేశారు. అప్పుడు పాట్నా పోలీసుచే లాఠీఛార్జి చేయబడ్డది. లాహోరులో పంజాబు రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుడు మియాన్ ఇఫ్తికరుద్దీన్ అరెస్టుచేయబడి పోలీసుస్టేషనుకు తీసుకొని పోబడుతూండగా చేరిన గుంపులో యెవరో పోలీసువారిమీద ఒక రాయి విసరినారట! పోలీసువారప్పుడు లాఠీఛార్జి చేశారు. అందువల్ల గాంధీజీ, సత్యాగ్రహం చేయబోతూన్న సంగతి కేవలం స్థానికాధికారులకు తప్ప తక్కిన ప్రజానీకానికి సత్యాగ్రహి తెలియపరచనక్కరలేదని రాష్ట్రకాంగ్రెసు సంఘాలకు సూచనలు పంపాడు.

నూతన సంవత్సరంలో కాంగ్రెసు అధ్యక్షుడు అరెస్టుచేయబడ్డాడు. జమియత్-ఉల్-ఉలేమాలు సత్యాగ్రహంలో పాల్గొనేటందుకు నిశ్చయించారు. వాయవ్య సరిహద్దు రాష్ట్ర ప్రధాని సత్యాగ్రహం చేయగా అరెస్టుచేయబడి విడుదలచేయబడ్డాడు. డాక్టరు ఖాన్ సాహెబు తిరిగీ తిరిగీ సత్యాగ్రహం చేశాడు. కాని అరెస్టు చేయబడనే లేదు. మధ్యరాష్ట్రంలో సత్యాగ్రహులను అరెస్టుచేయడం మానుకొన్నారు ప్రభుత్వంవారు.

కేంద్ర శాసనసభలోని కాంగ్రెసుసభ్యు లందరూ తమ సభ్యత్వాలను కాపాడుకోవడానికితప్ప తక్కిన సమయాలలో ఆ సభాసమావేశములకు హాజరు కాకూడదని 1939 ఆగస్టు నెలలో కాంగ్రెసు వర్కింగుకమిటీవారు నిర్ణయించి ఉన్నారు. ఇప్పుడు 1940 నవంబరు నెలలో ప్రత్యేకం బడ్జెటును అంగీకరించేటందుకు పిలువబడిన కేంద్ర శాసనసభా సమావేశానికి కాంగ్రెసు సభ్యులందరూ హాజరై యుద్ధానికి సంబంధించిన ఆర్థిక చట్టాన్ని త్రోసిపుచ్చి ఇండియా బ్రిటిష్ యుద్ధప్రయత్నాలకు అనుకూలంగాలేదని సమస్త ప్రపంచానికీ చాటేటందు కనుమతి ఈయబడింది. ప్రతికూల పక్షనాయకుడయిన భూలాభాయిదేశాయి జాతీయ ప్రభుత్వాన్ని కోరుతూ యిలా ఉపన్యసించాడు. "మేము కోరేది చాలా స్వల్ప విషయం. తేలికగా మా ఎకనీలె ఆచరణ యోగ్యంగా ఉండే యేర్పాటును మాత్రమే మేము కోరుతూన్నాము. ఈ యుద్ధం యిలా జరుగుతూండగానే విప్లవపూర్వకములైన పరివర్తనాలు జరగవలెనని మేమనడంలేదు. కాని మా కోరికల పరిణామమేమిటో అందరికీ తెలిసిందే. కాంగ్రెసువారికీ యింతవరకు మాట్లాడినవారికే మాత్రమేగాక ప్రజాభిప్రాయాన్ని గుర్తించిన ప్రతివారికీ కూడా బ్రిటిష్‌వారి

అసలు ఉద్దేశమేమిటో యిప్పటికి తెలిసివచ్చింది. "మన పేరూ మన నైతిక బలం, మన దగ్గరఉన్న సాధన సామగ్రీ—యిదంతా బ్రిటిష్‌వారి యుద్ధ సన్నాహాలకోసం వార పరం చేయాలి. వారిని ప్రజానురంజకులుగా ప్రచారం చేయడానికి వారి చేతులలో మనం యంత్రాలుగా ఉండాలి. అనగా బానిసలమైన మనం మన యజమానులకోసం పని చేయాలి. వారి ఈ కోరిక యెప్పటికీ సఫలమయ్యే కోరిక కాదు. సఫలం కావడానికి సావకాశం లేదుకూడా"

వాక్స్వాతంత్ర్యంకోసం మన ఉద్యమం ప్రారంభం కాగానే మన అభిప్రాయాలను వ్రాతలో స్వేచ్ఛగా ప్రకటించే స్వాతంత్ర్యాన్ని కూడా అరికట్టేటందుకు 1940 అక్టోబరులో ప్రత్యేకం ఒక ఆర్డినెన్సు చేయబడింది. తాను ప్రచురిస్తూన్న మూడు వారపత్రికలనూ నవంబరు నుండి గాంధియే నిలిపివేశాడు. ఇందుకు సంబంధించిన వివరాలు పత్రికలను గూర్చిన అధ్యాయంలో విశదంగా తెలుపబడినవి.

ఢిల్లీనుండి వెలువడుతూన్న "హిందూస్థాన్ టైమ్సు" యొక్క ప్రత్యేక ఉగాది సంచిక (1941) 91 వ పేజీలో 'వర్కింగు జర్నలిస్టు' 1940 డిశంబరునాటికి మరొక నూతన విషమపరిస్థితి రానున్నట్లుగా వ్రాశాడు.

* * * * *

"గాంధీజీ నిరుడు క్రిస్టమస్‌లో హిట్లరుకొక బహిరంగలేఖ వ్రాశాడు. అందులో నాజీ నియంతను అరుచిగా ఉండే సలహాయిస్తూ ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వమునుగూర్చికూడా తన అభిప్రాయాన్ని నిష్కపటంగా వెలిబుచ్చాడాయన. ఈ సంగతి ఆనాడు చాలా నిగూఢంగా ఉన్నప్పటికీ యిప్పుడు తెలుస్తూన్నది. ఆ ఉత్తరం ప్రభుత్వంవారు బహిటికి పంపనూలేదు మనదేశంలో ప్రచురణ కానివ్వనూ లేదు. కాని ఎలాగో ఆ సంగతి వెంటనే తెలిసి అనేక పత్రికలలో ప్రకటించబడింది. (2) తరువాత మరికొంతకాలానికి సత్యాగ్రహులకు వేయబడుతూన్న జరిమానాలను గూర్చి గాంధీజీ మరియొక ప్రకటనచేశాడు. ఆ ప్రకటన ఇండియా రక్షణచట్టము యొక్క నియమావళిని అతిక్రమిస్తూన్నది గనుక దానిని ప్రకటించరాదని పత్రికలకు సలహాయిచ్చారు ప్రభుత్వంవారు. (3) కాంగ్రెసు అధ్యక్షుని అరెస్టును గూర్చి, సత్యాగ్రహోద్యమంయొక్క భవిష్యత్తును గూర్చి గాంధీజీ చేసిన ప్రకటనలుకూడా అదే విధంగా పైకిరాకుండా చేయడానికి ప్రయత్నాలు జరిగినవి.

"గాంధీచేసిన తక్కిన రెండు ప్రకటనలనూ ప్రభుత్వంవారు నిషేధించడం అక్రమమే అయినప్పటికీ, ఆయన హిట్లరుకు వ్రాసిన ఉత్తరం విషయంలో వారు చాలా

పట్టుదలగా ఉండడంచేత అధమం తాత్కాలికంగానైనా దానిని ఆయన ఉపసంహరించుకొన్నాడు."

యుద్ధం ప్రారంభమై 12 మాసాలు పైచిలుకయినప్పటికీ స్థితిగతులు బాగుపడలేదు సరికదా క్రమంగా మరీ పాడైపోతూ వచ్చినయి. అయినా గాంధీ అక్టోబరులో యిలా ప్రకటించాడు:

"అయినప్పటికీ నేను అపజయం పొందినట్లుగా అంగీకరించను. భారత స్వాతంత్ర్యమునకు ఆటంకంగా ఉన్నది కాంగ్రెసుపక్షంవారికానీ తదితర పక్షాలవారికానీ సమాధానం కుదుర్చుకోలేకపోవడం కాదనీ, సమాధానం కుదుర్చుకోవడం సహజంగా అసాధ్యమైన విషయమనీ, ఇంగ్లీషువారు నిజంగా సముచితమైన పని ఏదో అది చేయడానికి బుద్ధిపూర్వకంగా యిష్టపడకపోవడమే అసలు కారణమనీ, వారిని ఒప్పించడానికి నేను నిండా ప్రయత్నించే తీర్తాను. ఏ విధమైన అపోహలకూ ఆస్కారం లేకుండా చేయడమే నా ఉద్దేశం. పోరాటం చేయడమే తటస్థిస్తే ద్వేషభావంలేకుండా విస్పష్టమైన విషయాలపైన పోరు సాగించడం నా అభిప్రాయం. నా పోరాటంలోని న్యాయమునుబట్టే కేవలం బ్రిటిష్‌వారే కాక ప్రపంచంలోని తదితర దేశాలవారుకూడా ఇండియాను యింతకంటె ఎక్కువ గౌరవపాత్రమైన దేశంగా గుర్తించగలరని ఆశతో నేను పోరాటంలోకి దిగుతున్నాను.

* * * * *

"[illegible] అధికారం కలిగి ఉండడమే ప్రస్తుత సమస్య — అనగా [illegible]న అభిప్రాయాన్ని ప్రకటించే హక్కు — అదే వాక్స్వాతంత్ర్యం. కాంగ్రెసు తనకోసమే ఈ స్వాతంత్ర్యాన్ని కోరడంలేదు. [illegible] కోరుతున్నది అయితే ఆ స్వాతంత్ర్యం అహింసాయుతంగా ఉండాలి. ఈ హక్కు అందరి చిక్కులనూ నివారిస్తుందనుకొంటాను."

రాజప్రతినిధి 1941 జనవరిలో చేసిన ప్రకటనలో వెస్టుమినిస్టరు విధానమునకనుగుణంగా ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించడమే బ్రిటిష్‌వారి ఆశయమని చెబుతూ, ప్రస్తుత రాజ్యాంగ విధానమునకూ, అధినివేశ ప్రతిపత్తికీ కల మధ్య కాలమును సాధ్యమైనంతవరకు తగ్గించవలెననియే తమ ఆతురత అనీ, రాజీనామాలిచ్చిన కాంగ్రెసుమంత్రులు త్వరలోనే తమపదవులకు తిరిగి రాగలరని ఆశిస్తున్నాననీ అన్నాడు.

సమ్మెలు :—

వ్యక్తిగతంగా సమ్మెలుచేయించి వాటిని కొనసాగించడానికి బలవంతంకానీ దౌర్జన్యంకానీ చేసే కాంగ్రెసువాదులపైన క్రమశిక్షణ చర్య తీసుకోబడునని గాంధీ అభిప్రాయమిచ్చాడు. జాతీయవాదులైన వ్యాపారస్థులు తమ కవసరమైనప్పుడు పోలీసును పిలవడంకంటె కాంగ్రెసువాదుల సహాయాన్ని అపేక్షించడం ఉచితమనికూడా ఆయన సలహాయిచ్చాడు.

జవహర్‌లాలుకు వేయబడిన నాలుగు సంవత్సరాల కఠినశిక్షనుగూర్చి కామన్సు సభలో ప్రశ్నించబడినప్పుడు దానికి జవాబిస్తూ అమెరీ నవంబరు 7వ తేదీని చాలా మెలకువగా మాట్లాడాడు. "ఎవరో ఒకవ్యక్తిని న్యాయస్థానములలో విచారించడం, రాజ్యాంగ విధానమును పూర్తిగా మార్చివేయడం కాదనేమాట స్పష్టం" అన్నాడాయన.

తరువాత ఒక పక్షంరోజులకు జవహర్‌లాలు నెహ్రూశిక్షను గూర్చి మరీ వింత పోకడలో మాట్లాడాడు అమెరీ. "పండిత నెహ్రూ శిక్ష కార్యనిర్వాహకవర్గమునకు సంబంధించిందికాదు. చట్టానికి సంబంధించింది. శిక్ష చాలా ఎక్కువగా ఉన్నదని ఆయన అనుకొనే యెడల అప్పీలు చేసుకోవడాని కాయన కధికారం ఉంది. యిది యిలా ఉండగా ఆయన 'ఏ' తరగతి ఖైదీ ఆయనకు పుస్తకాలు, ప్రత్యేక నివాస గృహము, ఇతరుల సహవాసము. తరుచుగా ఉత్తరాలు, వ్రాయడాని కవకాశం బయటివారినిచూచి మాట్లాడడానికి సదుపాయాలు ఇంకా అనేక సౌకర్యాలూ ఆయనకు కల్పించాము. ఇంతా ఐతే ఇటీవల ఆయనచేసిన ఉపన్యాసాలవంటి ఉపన్యాసాలు మాత్రం చేయడానికి స్వాతంత్ర్యం లేకుండా పోయిందాయనకు. తరువాత ఒక నెలకు కూడా అమెరీ యిదేవిధంగా నిర్లక్ష్యంగా మాట్లాడాడు. ఖైదులలో ఉన్నవారిని విడిచిపెట్టించవలెనని కొందరు కోరగా 1941 ఆగస్టు ఒకటో తేదీని "ఖైదులకు పోవలెనని పట్టుపట్టిన వారి యిష్టప్రకారం జరగనీయండి" అన్నాడు అమెరీ. ఇండియాలో వ్యవహారాలు అంతకంతకు చాలాచురుకుగా నడుస్తున్నవి. గాంధీ యెవరో ఒక సత్యాగ్రహిని పంపడం క్లిష్టరాజకీయ సమస్యలను కానీ, బ్రహ్మాండమైన బ్రిటిష్‌సామ్రాజ్యము యొక్క శక్తి సామర్థ్యములనుగానీ, అర్థంచేసుకోలేని ఒకానొక సాధుపుంగవుని వింత ధోరణీకాదు.

నవంబరు మొదటివారంలో మళ్లీ వర్కింగుకమిటీ సమావేశం జరిగింది. గాంధీ ఉపవాసవ్రతం మాట మళ్లీయెత్తాడు. ఎందువల్ల? ఈ తడవ పూర్వపు ఉపవాసాలు

లాటి ఉపవాసంకాదు. సమష్టి శాసనోల్లంఘనానికి బదులుగా చేయదలచుకొన్న ఉపవాసం. ఆయనకు రెండు ఉపాయాలు మాత్రమే తోచినవి. వ్యష్టిసత్యాగ్రహం తరువాత సమష్టి సత్యాగ్రహం వస్తుందనీ, సమష్టి సత్యాగ్రహము దౌర్జన్యానికి దారితీస్తుందనీ ఆయన అభిప్రాయపడ్డాడు. కాబట్టి అందుకు బదులుగా ఉపవాసవ్రతం చేయవలెనని అనుకొన్నాడాయన. అయితే గాంధీ యిది వరకు వ్యష్టిసత్యాగ్రహోద్యమాన్ని, సమష్టి సత్యాగ్రహోద్యమాన్నీ కూడా సరియైన హద్దులలో దౌర్జన్యం రాకుండా ఉంచ గలిగాడు. కాబట్టి యిప్పుడుకూడా దౌర్జన్యం వస్తుందని అనుమానం తగలగానే వ్యష్టిసత్యాగ్రహాన్ని ఆయన ఆపవేయగలడు. ప్రజలందరికీ గాంధీ తమ నాయకుడని తెలుసు. అహింస తమ ఉద్యమానికి మూలమనికూడా తెలుసు. ఇదంతా పోలీసులుకూడా యెఱిగి ఉన్నవిషయమే గనుక వారుకూడా ఆయన చెప్పినట్లే కంటారు. ఎక్కడైనా ఏదైనా చిన్నతప్పుజరిగితే, అది ఆయన క్షమించ తగినది గానే ఉంటుంది. ఢిల్లీలో పూర్తిగా కోపిడి జరుగుతూన్న సమయంలో 'నాదిరుషా చాందినీ చౌకు'లో ఉండి చేసేసరికి అందఱూ ఆగిపోయినారు. ఒకానొక సిపాయి మఱొకనిని చంపడానికి యెత్తిన కత్తిని అలాగేదించివేసి "నీ ఆజ్ఞకు మేము విధేయులం అన్నాడు."

ప్రజలు గాంధీజీమాట వింటారా వినరా అనే విషయంలో భేదాభిప్రాయం యెవ్వరికీ లేదు-గాంధీ వ్రాసిన వ్రాతలకు వారు బాధపడవచ్చును కాని ఆయన వ్రాసినది నిజమని మాత్రం ఆయనకు తెలుసు ఆయనను ఒప్పించలేక పోయినందుకు ప్రజలు కన్నీరు కార్చారు. కాని ఆ కన్నీటికోసే ఆయన యేర్పాటుచేసిన క్రమశిక్షణకు బద్ధులైనా . ఆయన నాయకత్వం లేకుండా తాముకు గడవదని వారికి స్పష్టంగా తెలుసు. తమకు నచ్చినా నచ్చకపోయినా ఆయన ఉత్తరువులను వారనుసరిస్తూనే వచ్చారు. చౌరీచౌరా సంఘటనం జరిగినప్పుడు సమష్టిసత్యాగ్రహం ప్రారంభించబడలేదు సరికదా, గాంధీజీ దానిని తలపెట్టలేదుకూడా. సమష్టిసత్యాగ్రహం ఒకసారి ప్రకటింపబడగానే దానిని ఆపడం దుస్తరం. అలా ఆపినట్లయితే ప్రజలను ప్రభుత్వం నలిపివేస్తుంది. సమష్టి శాసనోల్లంఘనంలో ఉన్న కిటుకే అది. ఒకసారి దానిని ప్రారంభిస్తే ఆపడం అపాయకరం. కాబట్టి అందుకు తగిన వాతావరణంలేదని ఆయన అభిప్రాయం. ఈ విషయం ఆయన అనేకసార్లు గట్టిగా చెప్పి ఉన్నాడు. ఒకవేళ దానిని ప్రారంభించినట్లయితే హింసను సహించి తీరాలి. ఇక దీనికి బదులుగా చేయవలసిన పని ఒకరి తరువాత మఱొకరిని జైలుకు పంపడం. ఆ విధంగా ముప్పది నలుబది వేలమందిని ఖైదులకు పంపవచ్చును. ఇదికూడా చిన్నవిషయం కాదు. క్రమశిక్షణ కనుగుణంగా

పెద్ద యెత్తుమీద ఈ పని జరిగినట్లయితే జాతీయోద్యమం ప్రజ్వలించి బాగా వెలుగొందగలదు. ప్రజలలో ధైర్య విశ్వాసములు పెంపొందగలవు. కాని గాంధీ కిది యిష్టం లేదు. సమష్టి శాసనోల్లంఘనము వ్యక్తిశాసనోల్లంఘనముల మధ్య నేమిచేయవలెనో ఆయనకు తోచలేదు. మొదటిది జరిపే ప్రసక్తియే లేదు. రెండోదానికి కొంత రహస్య చర్య అవసరం కావచ్చును. అది ఆయన సహించడు. ఒకటి అపాయకరమైనది. రెండోది జుగుప్సాకరమైనది. శాసనోల్లంఘనం ప్రారంభించడం దానిని ధ్వంసం చేయడానికే అయితే, గాంధీకి అడవులకు పోవడంకంటె గత్యంతరంలేదు. ఇది ఆయనకెన్నడూ తట్టలేదు. ఆయనకు తోచినది ఉపవాసమొక్కటే. అయితే దానిఫలితమెలా ఉంటుందని ఆలోచించవలెగా. ఆయన జీవించియుంటే ప్రజలు శక్తిహీనులుకారు. ఆయన చావదలచుకోలేదు. కాబట్టి ఉపవాసం మానివేసి ఆయన జీవించవచ్చును. ఆయన చావడమే తటస్థిస్తే, ఆయన అవలంబించిన పని పూర్తియై దేశం స్వతంత్రతను పొందుతుంది. ఇదిఎలా అయినప్పటికీ ఆయన లేకపోతే ఏమీ చేయజాలమనే నిరుత్సాహం ప్రజలలో పుట్టి పోతుంది. నిస్సత్తువపోతుంది. ఈ కారణాలన్నిటినిబట్టీ ఆయన తలచుకొన్న పని ఉత్కృష్టమైనదని మానవగౌరవానికి తగినట్లున్నదనీ అనుకొన్నాడు. ఇతరులకు తల ఒగ్గడంకంటె ప్రజ చావడానికి సంసిద్ధం కావడం మంచిదనుకొనే రోజుకూడా వస్తుంది. ఇండియామీద పడడానికి చుట్టూరా శత్రువులు వేచి ఉన్నారు. వారిని నిరోధించడానికి లక్షలాది ప్రజలను కాంగ్రెసు సేకరించవలసి ఉంది. ఏ విధంగా ఆలోచించినా ఉపవాసం చేయడం తప్పదని తోచిందాయనకు. తానెందుకు తాళజాలనని అంతర్వాణిద్వారా ఆయనకు తోచినప్పుడా పని ఆయన మానివేయదలచుకొన్నాడు. ఇంగ్లీషువారి ఉరినుండి తప్పించుకొనడానికాయన ఆత్మహత్య చేసుకొంటూన్నాడనికూడా విమర్శరావచ్చును. ఉపవాసంతప్ప మరొకమార్గాంతరం లేదని ఆయన తలంపు. అయితే ఉపవాసం మాత్రం హింసకు దారితీయదా? తీయవచ్చు. అలాఅయితే హింసాభయంతో ఏపనీ చేయడానికి వీలులేదు. కాని సమష్టి శాసనోల్లంఘనంలో కంటె ఉపవాసంలో హింసకు అవకాశాలు చాలా తక్కువవుంటవనీ, అందువల్ల ఉపవాసం ఉత్తమమైనదనీ ఆయన వాదం. ఈ విషయంలో దీర్ఘచర్చ జరిగింది. చివరకు సక్రమవిధానంతో జరిపే వ్యష్టి శాసనోల్లంఘనమును ఆయన అంగీకరించాడు. వ్యష్టిశాసనోల్లంఘనం చేసేవారికి కొన్ని అర్హతలేర్పాటు చేయబడినవి. ఆ ఉద్యమం పరిమితంగా ఉంచవలెనని నిర్ణయింపబడింది. బాధ్యతగల కాంగ్రెసు వాదులందరూ శాసనోల్లంఘనం కావించవలె ననియే ఆయన తలంచాడు. వర్కింగుకమిటీ సభ్యులు, శాసనసభా సభ్యులు, అ. భా. కాం. సం. సభ్యులు-వీరంతా కాంగ్రెసు కార్యక్రమంలో నమ్మకముంటే జైళ్లకుపోయితీరాలి. చివర

కాయా రాష్ట్రములలోని స్థానిక సంస్థల సభ్యులందఱు వెళ్ళాలి. మొట్టమొదట వ్యష్టి శాసనోల్లంఘనమును ఇరువురితో ముగించవలెననియే ఆయన అభిప్రాయం. కాని రాజప్రతినిధి అవలంబించిన విధానాలవల్ల ఆయన కది సాధ్యంకాలేదు. కాబట్టి వ్యష్టి శాసనోల్లంఘనము నాయన విస్తరింపచేశాడు. సత్యాగ్రహం చేయడానికి ఆమోదమును పొందిన పిదప ప్రతి సత్యాగ్రహి మున్ముందు కలెక్టరుకు ముందుగా తెలుపవలెను. ఏ వ్యక్తి ఎప్పుడు శాసనోల్లంఘనం చేయవలసినదీ నిర్ణయించేది గాంధీకాదు. గాంధీ యేయే మొదటివారు ముందు సత్యాగ్రహం చేయాలో నిర్ణయిస్తాడు. తరువాత వారే ఆయా రాష్ట్రాలలో ఎవరెవరు యేయే తేదీలలో సత్యాగ్రహం చేయవలెనో నిర్ణయిస్తారు. కాని ఈ ఉద్యమం ప్రజలలోకి వ్యాపించకుండా ఆపవలెనని ఆయన నిశ్చయం. ఇది ప్రయోజనంలేని సామష్టి సత్యాగ్రహంగా పరిణమించకూడదు. ఇది కేవలం వ్యక్తి సత్యాగ్రహంగానే ఉండాలి. ఇంకేమి గానీ వారైనా జైళ్లకు పోదలచుకొంటే వారి స్వంత బాధ్యతమీద వెళ్లవచ్చును. చాలామంది జైళ్ళకు పోవడానికి సంసిద్ధంగానే ఉన్నారు. కాని వారిలో నిర్మాణ కార్యక్రమంలో అసలే విశ్వాసంలేనివారు కొంతమందీ, చాలినంత విశ్వాసంలేనివారు కొంతమందీని. తన కార్యక్రమములో నమ్మకం లేనివారిని జైలుకు పంపే బాధ్యత గాంధీ తీసుకో తలచుకోలేదు. ఆయన నిర్ణయించిన అర్హతలు లేనివారినిగానీ, యిష్టంలేనివారినిగానీ, ఒక్కరినికూడా ఆయన జైలుకు పంపతలచుకోలేదు. రాష్ట్ర కాంగ్రెసులోనూ అ. భా. కాం. సం. లోనూ సభ్యులు కానంత మాత్రానగానీ, తదితర కాంగ్రెసు కార్యవర్గాలలో సభ్యులు కానంతమాత్రానగానీ, యితర అర్హతలు కలవారిని సత్యాగ్రహులుగా ఉండడానికి నిషేధించనూలేదు. అసహాయోద్యమపు మొదటిరోజులలో తనకు సంఖ్యలతో నిమిత్తంలేదని గాంధీ చెబుతూండేవాడు. ఇప్పుడా మాటలను ఆయన స్నేహితులాయనకు జ్ఞాపకం చేస్తూన్నారు. కాబట్టి ఆయన సత్యాగ్రహులను జాగ్రత్తగా ఎంపిక చేసుకోవలసిందని కాంగ్రెసు ప్రముఖులను కోరాడు. అలా తీసుకోబడనివారి బెదిరింపులకుగానీ, కోపములకుగానీ లొంగిపోవద్దని ఆదేశించాడు. రాజీనామా చేస్తామని బెదిరించినాకూడా లోబడ కూడదన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వంవారు కాంగ్రెసు నీ సమయంలో అణచివేస్తారేమోనని కొందఱు భయపడ్డారు. అది అసంభవం. వారు జర్మనీని అణచివేయవచ్చు. కాంగ్రెసునుమాత్రం అణచివేయజాలరు. ఏ జాతినీగూడా శాశ్వతంగా అణచివేయడం అసంభవం—జర్మనీనికూడా అంతే. జైలు శిక్ష అనుభవించిన తరువాత శాసనసభలలో ప్రవేశించడానికి అర్హత ఉండదేమోనని యెవ్వరూ భయపడ నక్కరలేదు. శాసనసభా వ్యవహారములనుగురించి అది ఆలోచించవలసిన తరుణంకాదు. కారణం శాసనసభా కార్యకలాపములకు ఆయన తగినంత విలువ ఈయకపోవడంకాదు. సత్యా

గ్రహాలలో శాసనసభల చిత్తవృత్తి యెంత తక్కువగావుంటే అంతమంచిది. కాంగ్రెసు అభ్యర్థులు నెగ్గిపోయినందున వారు శాసనసభలకు అనర్హులన్నంతమాత్రాన కాంగ్రెసు పలుకుబడి ఈ దేశంలో తగ్గిపోదు—అందువలన శాసనసభలలోని తమ స్థానాలను ఖాళీచేసి జైళ్ళలో అంతకంటె మంచి స్థానాలను సంపాదించడానికి సందేహించనక్కరలేదు. గాంధీ అరెస్టయితే యేమి జరుగుతుందని వారు విచారించనవసరంలేదు ఆయన ఉపవాసం చేసినప్పటికీ ప్రభుత్వంవారు కంగారుపడరు. వారు ప్రచారంచేసి ప్రజాభిప్రాయం తమవైపు తిప్పుకోవడానికి ప్రయత్నిస్తారు కూడా. గాంధీజీ ప్రాణం గొటగొటలాడుతూవున్నప్పుడు ఆయనను విడిచిపెట్టి బయట మరణించేటట్లు చేస్తారు గాంధీ ఎంతకాలం జీవించవలెనని దైవ నిర్ణయముందో, అంతవరకూ ఆయన తన ఉద్యమం నడుపుతూనే ఉంటాడు. ఆయన బంధింపబడితే కొత్త నాయకత్వం వస్తుంది. కాంగ్రెసువాదులు జైళ్ళలో పెట్టబడిన ప్రతిసందర్భంలోనూ, వారు తమ తరువాతి నాయకులను నియోగించనక్కరలేదు. జిల్లాకాంగ్రెసు అధికారులకు ఈ సందర్భంలో సూచనలు పంపబడును. ఏదైనా ఒక సమావేశం నిషేధింపబడినప్పుడు దానిని జరుపనక్కరలేదు. ఒక వ్యక్తిని నిరోధిస్తే అది వేరుసంగతి వ్యక్తులమీద ఈయబడిన ఉత్తరువులను ఉల్లంఘించి తీరాలి. కాని సమావేశాలను నిషేధించినప్పుడు ఆ ఆజ్ఞలను ఉల్లంఘించకూడదు. వ్యక్తులు బ్రహ్మచర్యమును అవశ్యంగాతీసుకొని వ్యవహరించాలి. గాంధీజీయొక్క ఆశ్రమవాసి బ్రహ్మదత్తు అనే యువకునికి కాంగ్రెసు వర్కింగు కమిటీవారు సత్యాగ్రహం చేయడానికి అనుమతి యిచ్చారు. ఆయన అధికారులకు ముందుగా తెలియపరిచి, సత్యాగ్రహ నినాదాలు చేసుకొంటూ, వార్ధా వీధులలో తిరగడం ప్రారంభించాడు. ఆయన వెళ్లుతూవున్నకొద్దీ ఆయనవెంట కొంతమంది జనం మూగారు. అంతకంత కాగుంపు పెరుగుతూవచ్చి వీధులు ప్రతిధ్వనించినవి. వారంతా ఆయనకు సభాసదులైనారు. ఆపైన ఆయన ఉపన్యాసాలుకూడా సాగించాడు. ఆయన పెద్దతోవబట్టి ఆరుమైళ్ళ కాలినడకను ప్రయాణించాడు. పోలీసువారికి ఆయనను వెంబడించడం కష్టమనిపించి ఒక మోటారుకారు సంపాదించుకొని వెంటబడ్డారు. మరునాడాయన అరెస్టు చేయబడి శిక్షించబడ్డాడు. ఆయన రెండవ సత్యాగ్రహి. వ్యష్టి సత్యాగ్రహములో రహస్య పద్ధతులు పనికిరావు. టైపు మెషీన్‌గానీ, సైక్లోస్టయిల్ మెషీనునుగానీ ఉపయోగించరాదు. ఒకవేళ వాటిని ఉపయోగించడమే తటస్థిస్తే ప్రభుత్వంవారు కోరగానే వాటినిచ్చివేయాలి. వాటిని బహిరంగంగానే ఉపయోగించాలి. ప్రభుత్వంవారు వాటిని తీసుకొని వెళ్ళినట్లయితే కొత్తమెషీన్ తెప్పించకూడదు. ఉద్యమం నడుస్తూన్నకొద్దీ కొత్త సూచనలు చేయబడుతూంటవి.

సత్యాగ్రహోద్యమం ప్రారంభమై నడుస్తూన్న సందర్భంలో ప్రతిరాష్ట్రంలోనూ అన్వేషణ కార్యనిర్వహణములు గడియారపు నడకవలె సక్రమంగా జరిగినవి. వర్కింగు కమిటీ సభ్యులు, శాసనసభా సభ్యులూ, అ. భా. కాం. సం. సభ్యులూ ఒకరితరువాత నొకరు సత్యాగ్రహంచేసి జైలుకు పోతూన్నకొద్దీ ఉద్యమం శోభిస్తూవచ్చింది. కొన్ని రాష్ట్రాలలో కొంతమంది సభ్యులు సత్యాగ్రహం చేసేదాకా వేచిఉండడండానే ప్రభుత్వంవారు వారినినిర్బంధించ నిశ్చయించుకొన్నారు. వల్లభాయి, భూలాభాయి, సరోజని బొంబాయి మాజీమంత్రులు, అసెంబ్లీ కౌన్సిళ్ల అధ్యక్షులూ అందరూ డిటేన్ చేయబడ్డారు. మద్రాసులో మంత్రులు సత్యాగ్రహం చేయగా శిక్షింపబడ్డారు. స్పీకరు చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శి మతీనలుగురైదుగురు మాత్రం డిటేన్ చేయబడ్డారు. బీహారు, సంయుక్త రాష్ట్రాలు, మధ్యరాష్ట్రాలలో కొంతమంది మంత్రులదేవిధంగా అరెస్టు చేయబడ్డారు ఒరిస్సా, అస్సాములోని మంత్రులు శిక్షింపబడ్డారు. వాయవ్య సరిహద్దురాష్ట్రాలలో మంత్రులుకానీ, శాసనసభ్యులుకానీ అరెస్టు చేయబడనే లేదు రాజేంద్రబాబు అస్వస్థతగా ఉండడంచేత ఆయనను జైలుకు పోనియలేదు సరోజనీదేవి జైలులో జబ్బుపడి కొలది కాలంలోనే విడుదల అయింది. కృపలానీ గాంధీజీకి కార్యదర్శిగా ఆదినుండి తుదివరకూ ఆయనకు సహాయపడుతూ దేశమంతటా తిరిగి, ఉద్యమ కష్టాన్ని యావత్తూ ఆయనే అనుభవించాడు. ఆయన భార్యా సుచేతాదేవి జైలుకు పోయింది. 1941 వేసంగి కాలంలో జమనలాలుజీ జైలులో జబ్బుపడి వైద్యకారణముచేత విడుదలయినాడు. కాంగ్రెసు అధ్యక్షుడు హఠాత్తుగా అరెస్టుచేయబడి శిక్షింపబడ్డాడు. తక్కిన ఉద్యమమంతా అనుకొన్న ప్రకారం సక్రమంగా జరిగింది గాంధీ స్వేచ్ఛగా ఉన్నాడు.

ఉద్యమం ప్రారంభం కాగానే 'ఇంగ్లీషు స్పీకింగు యూనియను'లో నవంబరు 21 వ తేదీని అమెరీ తిరిగి ఉపన్యాసవేదికపై ప్రత్యక్షమైనాడు. అప్పుడాయనచేసిన ప్రకటన అతి ధైర్యంగానూ అపూర్వంగానూ ఉంది. భారతీయులలోని విభిన్నాభిప్రాయాలను సమాధానపఱచి ప్రధాన విషయాలలో భారతదేశమును ఏకంగా ఉంచగల రాజ్యాంగ విధానాన్ని ఎలా నిర్మించవలెననే సమస్యపైననే ఆయన మాట్లాడాడు. "ఆశ్చర్యకరమైన మన చరిత్ర, స్థానిక పరిస్థితులూ మన దేశంలోనూ మన అధినివేశములలోనూ యే పద్ధతులపైన జయప్రదంగా పనిచేసినవో అవే పద్ధతులపైన పూర్తిగా ఇందుకు భిన్నంగానూ, ఇంతకంటె ఎక్కువ క్లిష్టంగానూ ఉన్న ఇండియా పరిస్థితులలోకూడా పనిచేసినవి. కాని ఇండియాలోని ప్రతిష్టంభనమక్కడి పరిస్థితులనుబట్టి సహజంగా తటస్థించిందే"అంటూ "కాకపోతే 1935 రాజ్యాంగ చట్టంలో తప్పేముంది?" అని ఎఱుగనట్లుగా ప్రశ్నించాడు.

1940 సంవత్సరం అంతం కావచ్చింది. అప్పటికి 16 నెలల యుద్ధం యూరపు ఖండమంతా మహాకల్లోలం చేసింది. ఇండియామాత్రం ఆ భయంకర సంఘటనలకు దూరంగానే ఉంది. అయినప్పటికీ పరాధీనదేశం కావడంచేత వాక్స్వాతంత్ర్యం కానీ క్రియా స్వాతంత్ర్యం కానీ లేకుండా పోయింది. బలవంతంగా ఇండియా యుద్ధంలోకి తోయబడింది. సైనిక సేకరణం, డబ్బు వసూళ్లు, యుద్ధ పరికరనిర్మాణమూ—యివన్నీ జరిగిపోతూన్నవి. కాంగ్రెసు వాదులూ యితర ప్రజానాయకులూకూడా ధనసేకరణం బలవంతంగా జరుగుతూన్నదని స్వచ్ఛందంగా లేదనీ, అక్రమంగానూ, కేవలం డబ్బు ఆశతోనూ సైనిక సేకరణం నడుస్తూన్నదనీ గట్టిగా తమ అసమ్మతిని ప్రకటిస్తూ వచ్చారు. యుద్ధపరికరనిర్మాణం విషయంలో 'ఈస్టర్న్ ప్రొడక్షన్ కౌన్సిల్' వారి కార్యనిర్వాహణ వ్యవహారాలు రహస్యంగా ఉంచబడడంచేత ఇండియాలోని వణిక్ప్రముఖులయొక్కయు, వాణిజ్య సంస్థలయొక్కయు అనుమానమునకు గురియైనవి. ఈ కౌన్సిలుయొక్క ఆడంబర ప్రదర్శనం యావత్తూ ఆస్ట్రేలియాలోనూ ఇతర అధినివేశములలోనూ తయారవుతూన్న వస్తువులను ఇండియాలో ఉత్పత్తికాకుండా చేయడానికే ఉద్దేశింపబడినదని వారి భయం. కాంగ్రెసుకూడా అహింసాపథంలో నడపబడే తన సత్యాగ్రహ పోరాటమును ప్రారంభించకుండా, సంవత్సరం పైచిలుకు గడిపింది. చిట్టచివరకు 1940 అక్టోబరు 17 వ తేదీని బ్రిటనుతో యుద్ధానికి దిగి గాంధీజీ యేర్పాటు చేసిన ప్రణాళిక ప్రకారం 'తు' 'చ' తప్పకుండా తన సత్యాగ్రహ పోరాటాన్ని దృఢసంకల్పంతో నడుపుతూవచ్చింది. 18 సంవత్సరాల వయస్సుకలిగి కాంగ్రెసు ప్రధానసూత్రంపైన సంతకం చేసిన ప్రతి మనిషీ యేవిధంగా కాంగ్రెసులోచేరవచ్చునో అలాగే ప్రతివారూకూడా సత్యాగ్రహంలో చేరవచ్చును. అయితే శాసనోల్లంఘనం చేయదలచుకొన్న సత్యాగ్రహులు కొన్ని కఠిన ధర్మాలను నిర్వర్తించితీరవలసిఉంది. ఎనిమిదిగంటలలో పరిపూర్ణత్వం పొందతగిన ఒకానొక కళను అభ్యసించడానికి శ్రద్ధ తీసుకోని మనిషిని సత్యాగ్రహిగా, అంగీకరించకూడదని గాంధీ అభిప్రాయం. ప్రతి సిపాయీ యుద్ధరంగానికిపోయి ఫిరంగులు కాల్చడానికి సంసిద్ధమయ్యేముందు కవాతు వగైరా క్రమశిక్షణలకు లోనవడం అవసరమైనట్లే, ప్రతి సత్యాగ్రహికూడా బ్రిటిష్ యుద్ధయత్నాలను ప్రతికూలిస్తూ తాను శాసనోల్లంఘనం చేయడానికిముందు పత్తివిత్తనాలు తీయడం, ఏకులు చేయడం, వడకడంలాంటి క్రమశిక్షణను పొందడం, అవసరమని గాంధీ విశ్వసిస్తూన్నాడు. కనీసం ఆయన సొంతంగా వడికిన నూలు ప్రతినెలా వేయి గజాలు తనకు దగ్గరగానున్న అ. భా. చ. సం. శాఖకుగానీ కాంగ్రెసు కమిటీకిగానీ పంపిస్తూ ఉండవలెను. వడకడం క్రియారూపం దాల్చిన అహింస అని గాంధీ తలంపు.

అయినప్పటికీ 1940 లో కూడా నూలు వడకడంలో ఉన్న సుగుణాన్ని విశ్వసించని కాంగ్రెసువారులు లేకపోలేదు.

మత విశ్వాసంగా అహింసలో నమ్మకంలేని కాంగ్రెసువారులున్నారు విశ్వాస పూర్వకంగా గానీ, రాజనీతి పూర్వకంగాగానీ అహింసను అవలంబించవచ్చును. కాని కాంగ్రెసువారులు అహింసకుమాత్రం బద్ధులై ఉండాలి. అలా అయినట్లయితే సత్యాగ్రహి నూలువడకడం అనే అర్హతనుకలిగి ఉండాలనేమాట దానిని అనుసరించే ఉంటుంది. కేంద్ర కాంగ్రెసు కమిటీయొక్క నియమావళికీ సభ్యులగానూ, స్టాండింగు ఆర్డర్లకుకూడా సత్యాగ్రహులు బద్ధులై ఉండాలనే విషయం వేరుగా చెప్పనక్కర లేదు. ఈ ప్రమాణములను బట్టి గాంధీ నాయకత్వంక్రింద చేరదలుచుకొన్నవారి అర్హతలు పరిశీలించబడును.

సత్యాగ్రహోద్యమ సందర్భంలో సంపూర్ణంగా తాను గాంధీనాయకత్వంక్రింద పనిచేయదలచుకొన్నానని సుభాస్‌బాబు వ్రాసినప్పుడు, ఇతరూ ఆయనకూ ప్రధాన విషయాలలో ఉన్న భేదాభిప్రాయాలను వివరిస్తూ, గాంధీ ఆయనను నిరాకరించాడు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలు 1941 జనవరిలో సుభాస్‌బాబు తన స్వగృహంనుండి హఠాత్తుగా అదృశ్యుడై పోవడానికి ముందు జరిగినవి. సాధారణ పందర్భాలలో రెండుసార్లు కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన సుభాస్‌బాబు వంటి ప్రసిద్ధ కాంగ్రెసు నాయకుని విషయంలో, ఈ విధంగా అనుమతినికోరడం అనవసరం. కాని జులై 9 నాటి సంఘటనలకు ఫలితంగా జరిగిన పూర్వోత్తర సందర్భాలను బట్టి ఆ ఉత్తర ప్రత్యుత్తరాలు అవసరమని ఆయన భావించాడు.

1941 జులై రెండోతేదీని సుభాస్‌బాబు అరెస్టయిన సంగతి జ్ఞాపకముండే ఉంటుంది. బెంగాలు ప్రభుత్వంవారు ప్రెసిడెన్సీ జైలులో జరుగుతూన్న నిరశనవ్రతమును గూర్చి నవంబరు 20 వ తేదీని ప్రకటనచేసి ఉన్నారు. ఆ నిరశన వ్రతావలంబకులలో శ్రీ. సుభాస్‌బాబుకూడా ఒకరు. ఇండియారక్షణ చట్టంక్రింద డిటెన్ చేయబడిన సెక్యూరిటీ ఖైదీలు, తమకు ప్రత్యేకం కొన్ని సౌకర్యాలు కావలెనని అక్టోబరు నవంబరు నెలలలో కోరి ఉండిరి. ఆ కోరికలను తీర్చనియెడల తాము నిరశనవ్రతమును పూనెదమని ప్రభుత్వంవారిని బెదిరించిరి ఖైదీలు కోరిన కోరికలపై ప్రభుత్వంవారు తీసుకొన్న చర్యలనుగూర్చి బెంగాలు అసెంబ్లీలో చర్చజరుగుతూన్నప్పుడు హోంమెంబరు వివరించి ఉన్నాడు. అంతేకాక ప్రజలకావిషయాలన్నీ సమగ్రంగా తెలుపుతూ ఒక ప్రకటన చేస్తామని వంగరాష్ట్ర ప్రభుత్వంవారు వాగ్దానం చేశారు. ఖైదీల కోరికలను ప్రభుత్వం

వారు నెరవేర్చిన మేరకు తమ అసమ్మతిని ప్రకటిస్తూ నవంబరు 25 వ తేదీని తాము బెదిరించిన ప్రకారం తిరిగి నిరాహారదీక్షను పూనుకొన్నారు. వారిపేర్లు ప్రభుత్వప్రకటనలో ప్రచురించబడినవి. అందులో సుభాస్ బాబుకూడా ఉన్నాడు. బందిపోటు సందర్భంలో విచారణలో నున్న ముగ్గురు ఖైదీలుకూడా నవంబరు 25 వ తేదీని ఆహారము మానివేశారు. నవంబరు 26 వ తేదీని మళ్ళీ స్వీకరించారు. నవంబరు 29, సుభాస్ బాబు యితర కారాగారంలో ఆహారం మానివేసి యింకా ఆ నిరాహారదీక్షను కొనసాగిస్తూనే ఉన్నారు. తరువాత సుభాస్ బాబు విడుదలైనారు.

బ్రిటిష ప్రభుత్వంతో కాంగ్రెసు జరుపుతూన్న ఈ సంగ్రామ నాటకరంగంలోని కొన్ని ఉపాఖ్యానముల నిక్కడ ఉదాహరించవలసి ఉంది. నాటక ఈ కథలో మొదటి నుండి చివరవరకూ హిందూ-మహమ్మదీయ సమస్య అంతర్లీనమై వేరుచేయడానికి వీలు లేనంతగా యిమిడి ఉంది. ఇది కాంగ్రెసు మంత్రులు రాజీనామాలిచ్చిన తరువాత బయలుదేరిన సమస్యయైనప్పటికీ, అప్పటినుండి ప్రధాన కథావస్తువుతో కలిసిపోయింది. డాక్టరు సప్రూ మార్చినెలలో యిందులో జోక్యం కల్గించుకొన్నాడు. ఆయన యిండియా ప్రభుత్వానికి సన్నిహితుడు. 1930 లోని ఉప్పుసత్యాగ్రహోద్యమం నడుస్తూండగా జయకర్ తో కలసి శాంతి చేకూర్చడానికి జులైనెలలో రాయబారాలు నడిపింది. యుద్ధమనిపించే తరువాత 1931 ఫిబ్రవరి మార్చినెలలలో గాంధీ ఇర్విన్ రాయబారాలు నడుస్తూన్నప్పుడు ఏ మాత్రం పొరపుచ్చుపుట్టినా, జయకరు రైటానరబుల్ శాస్త్రిగార్లతో కలసి సమాధానం కుదర్చడాని కీయన ప్రముఖపాత్ర వహించాడు కాబట్టి 1941 లో తిరిగీ ఆయన జోక్యం కల్గించుకోవడంలో యేమీ వింతలేదు. 1941 మార్చిలో బొంబాయి నగరమున ఈయన మితవాదనాయకుల మహాసభ ఒకటి సమావేశపరిచాడు. అందులో రాజప్రతినిధి కార్యనిర్వాహకవర్గం పూర్తిగా అధికారేతర భారతీయులతో పునర్నిర్మితం కావలెననీ, ఆర్థిక-సైనిక వ్యవహారాలుకూడా భారతీయసభ్యుల అధికారంకిందనే ఉండవలెననీ ఒక ముఖ్యతీర్మానం చేయబడ్డది.

(2) యుద్ధకాలంలో అది సమష్టిగానూ సమూహంగాను కూడా చక్రవర్తిగారికి బాధ్యత వహించి ఉండాలి.

(3) ఇతర అధినివేశ ప్రభుత్వాలతో అది సమాన ప్రతిపత్తి కలిగిఉండాలి. అనగా యుద్ధానంతరం ఒక నిర్ణీతకాలంలో ఇండియాకు సంపూర్ణ అధినివేశ ప్రతిపత్తిని వాగ్దానంచేస్తూ బ్రిటిషు ప్రభుత్వం వారొక ప్రకటన చేయాలి.

సర్ తేజబహదూరుసప్రూ తన ప్రారంభోపన్యాసంలో యిలాఅన్నాడు. "ప్రజాభిప్రాయమునకింత వెలిగానూ దేశంలోని ప్రధాన భావతరంగానికి యింత

దూరంగానూ నేటి ఇండియా ప్రభుత్వం (తిన్నట్లుగా యిదివరకే ఇండియా ప్రభుత్వము లేదని నేను ఘంటాపథంగా చెప్పగలను."

మొట్టమొదటి మహాసభ బొంబాయిలో సర్ తేజబహాదూర్ సప్రూ అధ్యక్షత కిందనే జరిగింది. అప్పుడాయన "నేడు యుద్ధంచేస్తూన్న దేశాలవారంతా కలసి శాంతి సభలో సమావేశమయ్యేరోజు వస్తుంది. ఆనాడు భారతదేశం తన జాతీయ ప్రభుత్వంచే నియోగింపబడిన ప్రతినిధులద్వారా స్వతంత్రాధికారం కలిగి మాత్రమే. ఆ మహాసభలో వ్యవహరించవలెనని నా కోరిక. ఇందుకు భిన్నంగా జరగడం నాకిష్టంలేదు నేనీ విషయానికి చాలా ప్రాముఖ్యత యిస్తున్నాను" అన్నాడు. కాంగ్రెసుకూడా అలాగే అంది. అయితే ఆ జాతీయ ప్రభుత్వాన్ని నిర్మించడమెలాగా అనేదే సమస్య. సప్రూ మహాసభను నమ్ముకొని ఉండడానికికూడా వీలులేకుండా ఉంది. వారు జాతీయ ప్రభుత్వాన్ని గూర్చి ముచ్చటిస్తూనే "లీగునూ కాంగ్రెసునూ విడిచిపెట్టినప్పటికీ దేశంలో ప్రభుత్వంవారు మాట్లాడవలసినవారు లక్షలాది ప్రజలున్నారు" అనీ "నాయకత్వమిచ్చి యెవడిని కూర్చోబెడితే వాడే నాయకుడవుతాడనీ యేమేమో మాట్లాడారు. ఈ ప్రకటనలు అక్షరాలా నిజమే. కాని యివి రాజకీయచర్చ సాగించడానికి యెంతమాత్రమూ సందర్భోచితంగా లేవు. అయితే గాలి యే వైపునుంచి వీస్తూన్నదో అవి స్పష్టంగా సూచిస్తూన్నవి 1940 జూలైలో జరిగిన పూనా తీర్మానానికీ బొంబాయిలో చేయబడిన సూచనలకూ యేమీ భేదంలేదని ఋజువుచేయడానికి బొంబాయి మహాసభవారు చాలా కృషిచేశారు. ఇది రోగి చచ్చి పాతిపెట్టబడినతరువాత, నాని బూమికలను పైకితీసి బ్రతికించవలెనని ప్రయత్నం చేసినట్లున్నది. పూనా తీర్మానం చచ్చిపోయి భూమిలో నిలువులోతున పాతిపెట్టబడింది. ఒక్క బొంబాయిలోని సర్ బిరుదాంకితులే కాదు ఇండియాలోనున్నవారంతా కలిసి ప్రయత్నించినా దానిని బ్రతికించలేరు. అది కేవలం చచ్చిపోవడమేకాదు. సత్యాగ్రహ రూపంలో మరొక అవతారం కూడా ఎత్తింది. వాక్స్వాతంత్ర్యమనే కోరికను ఆధారంగా చేసుకొని ప్రారంభింపబడిన సత్యాగ్రహం యొక్క పర్యవసానం, ఇండియా స్వాతంత్ర్య ప్రకటనమును వాంఛించడమే. అటువంటి ప్రకటనయే జరిగినయెడల ఇంగ్లండుకు ఇండియా మంచి స్నేహితురాలు కాగలదు. ఇంగ్లాండుకు తటస్థించిన కష్టదశలో ఇండియా యెన్నటికీ శత్రువు కాజాలదు. ఇండియా స్వతంత్ర దేశంగా ఇంగ్లాండు పక్షాన ఉండి దానితో సమాన భాగస్వామిగా ఉండగలదు. అంతే కాని పరాధీన దేశంగా ఉండి తన యిష్టానికి వ్యతిరేకంగా బ్రిటను యొక్క అధికారానికీ బలానికీ లోబడి సహకరించజాలదు.

ఒకవిధంగా చూస్తే బొంబాయిలోని నాయకులు కోరిన కోరికకంటె సత్యాగ్రహానికి దారితీసిన కాంగ్రెసు కోరిన కోరిక చాలా చిన్నదనికూడా చెప్పవచ్చును. కాంగ్రెసు ఇండియా స్వాతంత్ర్యాన్ని గుర్తించవలసిందని మాత్రమే కోరింది. అయితే ఒక్కసారి ఇండియాయొక్క స్వాతంత్ర్య ప్రతిపత్తిని గుర్తించినయెడల దాని కనుగుణంగా కార్యనిర్వాహకం జరిగి తీరవలసిన మాట నిజమే. కాని అట్టి పదవిలో ఉంచబడిన మనిషియొక్క శక్తి సామర్థ్యములనుబట్టి కార్యకలాపం జరుగుతూంటుంది. నాయకత్వంలేని అసమర్థునిచేతిలో ఆ అధికారం ఉంటే దానివలన యేమీ ప్రయోజనంలేదు. కాంగ్రెసులో మంచి నాయకత్వమూ ఉంది; సమర్థతా ఉంది. కాబట్టి వారి చేతులలోకి అధికారం వస్తే మార్గమధ్యమునగల ఆటంకములను తొలగించుకొని భారతదేశము యొక్క ఆశయసిద్ధిని పొందగలరు. బొంబాయి మహాసభను సమావేశపరచిన నాయకుల దృష్టిలో, అమెరికా దృష్టిలోవలెనే అనేక రాజకీయ సంస్థలలో కాంగ్రెసుకూడా ఒక సంస్థ అని తోచింది. మహా అయితే కాంగ్రెసుతో సమాన ప్రతిపత్తిగల తక్కిన సంస్థలకంటె అది పెద్ద సంస్థ అని అనుకొని ఉంటారు. అదే వారుచేసిన పొరపాటు. ఇటువంటి అభిప్రాయం అనుగ్రహపరత్వంవలన గానీ, ఏమీచేయలేని నిస్సహాయత వలనకానీ కూడా కలుగవచ్చును. ఈ రెండూకూడా కాంగ్రెసుకు కీర్తిపదములుకావు.

రాష్ట్రప్రతినిధులయొక్క [illegible] కార్యనిర్వాహకవర్గము చక్రవర్తిగారికి బాధ్యత వహించి ఉండవలెనా చెప్పండి. వీనిలో యెట్టి రాజ్యాంగ రహస్యాలిమిడి ఉన్నవి? ఇది కేవలం శాస్త్రసంబంధమైన సందేహం. దీనికి జవాబు కొంతవరకు బొంబాయి తీర్మానములోనూ [illegible] తీర్మానాన్ని సమర్థిస్తూచేసిన నాయకుల ఉపన్యాసాలలోనూ కనిపిస్తుంది. బొంబాయి మహాసభవారు, 'చక్రవర్తిగారికి బాధ్యత వహించని కార్యనిర్వాహకవర్గము' కావలెనని ప్రతిపాదించారు. పూనా అ. భా. కాం. స. వారు ప్రతిపాదించిన [illegible] వ్యతిరేకం. అ. భా. కాం. సం వారి తీర్మానంలో యిలా ఉంది. "కేంద్రంలో తాత్కాలిక జాతీయప్రభుత్వం స్థాపింపబడవలెను. అది పరివర్తనకాలంలో తాత్కాలికంగా ఉండే ప్రభుత్వమైనప్పటికీ కేంద్రప్రభుత్వం లోని అన్ని ఎన్నికవర్గాల వారి విశ్వాసమునకూ పాత్రమైనదిగానూ, రాష్ట్రాలలోని బాధ్యతాయుత ప్రభుత్వముల యొక్క అత్యంతసన్నిహిత సహకారమును పొందగలదిగానూ వుండవలెను" ఇందులో 'బాధ్యత' అనే మాట వాడబడలేదు. కాని అక్కడి పదప్రయోగమునకు మాత్రం దాదాపుగా అర్థమదే. ఒకానొక ప్రభుత్వం శాసనసభకు బాధ్యతవహించి ఉండాలని మనమన్నప్పుడు ఆ ప్రభుత్వం శాసనసభయొక్క విశ్వాసమునకు పాత్రమైనదిగా ఉండవలెననే మన అభిప్రాయం. కాబట్టి పూనా తీర్మా

నంలో 'శాసనసభా విశ్వాసమునకు పాత్రమైనదిగాని అనే మాటలకు బదులుగా 'శాసన సభకు బాధ్యతవహించేదిగా' అని మనం అంటే తప్పుకాదు. కనుక బొంబాయితీర్మానం పూనా తీర్మానం కంటె తక్కువ కోరిందన్నమాట. మొదటిది 'చక్రవర్తిగారికి బాధ్యత వహించే విస్తృతకార్య నిర్వాహకవర్గ నిర్మాణమును మాత్రమే కోరింది. రెండోది కేంద్రశాసన సభలకు బాధ్యత వహించే తాత్కాలిక జాతీయ ప్రభుత్వమును' కోరింది. చక్రవర్తిగారికి బాధ్యతవహించడంలోనూ, మనదేశానికి బాధ్యత వహించడంలోనూ చాలా భేదముంది. దీనికే యింకా విశాలమైన అర్థంకూడా చెప్పవచ్చును. తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని కేంద్ర శాసన సభలోని ఎన్నిక వర్గాలవారు మాత్రమే తొలగించ గలరు కాని విస్తృత కార్యనిర్వాహక వర్గమును వారు తొలగించజాలరు. దీనినే మరొకవిధంగా కూడా చెప్పవచ్చును. ప్రత్యేకం చక్రవర్తిగారికి బాధ్యత వహించవల సిన విస్తృత కార్యనిర్వాహక సభ్యులను రాజప్రతినిధి తొలగించవచ్చును. వారి మాట లను కొట్టివేయవచ్చును. వారి సలహాలను తృణీకరించవచ్చును. పూనా తీర్మానములో ఉద్దేశింపబడిన తాత్కాలిక జాతీయ ప్రభుత్వం విషయంలో అలా కాదు. కాబట్టి బొంబాయి తీర్మానం పూనా తీర్మానంకంటె తక్కువదనే చెప్పాలి. కనుక బొంబాయి తీర్మానాని కనుకూలంగా ఉండేటందుకు కాంగ్రెసు కెంతమాత్రమూ సావకాశం లేదు. కాంగ్రెసు ఆ నాడిటువంటి వైఖరిని అవలంబించడానికి కది ఒక్కటే కారణమా అని అడుగ వచ్చును. ఇది చాలా సమంజసమైన ప్రశ్న. సమంజసమైన ప్రశ్నయేకాదు ఉపయోగ కరమైన ప్రశ్నకూడా. కాంగ్రెసు దృక్పథానికి మితవాద దృక్పథానికి చాలా భేద ముంది. బొంబాయి సర్ బిరుదాంకితులకు యుద్ధ ప్రయత్నాలను యింకా శ్రద్ధగానూ యింకా వ్యాపకంగానూ యింకా యెక్కువగానూ జరగించవలెననే ఆతురత ఉంది. 'ప్రస్తుత కార్యనిర్వాహకవర్గం' ఇండియా యుద్ధ ప్రయత్నాలను సక్రమంగా జరిపి నడిపించగల శక్తిసామర్థ్యాలుకానీ ప్రాతినిధ్యంకానీ కలది కాదని వారి అభిప్రాయం. అందువలన కొత్త కార్యనిర్వాహకవర్గం కావలెనన్నారు వారు.

"ఇండియా క్షేమానికి భంగంకాని పద్ధతిని సాధ్యమైనంత ఎక్కువగా బ్రిటిష్ వారికి సహాయంచేయడమే" వారి ఆశయం.

"ఈ పైనచెప్పిన కారణాలనుబట్టి భారతదేశ ప్రజా జీవితంలో పాల్గొం టూన్న ప్రముఖవర్గాలనుండి తీసుకోబడిన అధికారేతర భారతీయులతో—కార్య నిర్వాహకవర్గం పూర్తిగా పునర్నిర్మింపబడవలెనని ఈ మహాసభవారి అభిప్రాయం." అని బొంబాయి తీర్మానంలో ఉంది. 'తీసుకోబడిన' అనే మాటలు అమోఘవి.

ఎన్నికసభ్యులను సాకంగా ఉండేటందుకు ఉద్దేశింపబడిన మాటలివి. బొంబాయి సర్వపక్షసమావేశంలో కూడా ఈ ఎన్నిక సభ్యుల విషయం ఎత్తకుండా ఉండడంలో కొంత జాగరూకత వహించారు. అటువంటప్పుడు కాంగ్రెసుకూ మితవాదవర్గానికీ ఎక్కడ పొత్తు కలుస్తుంది? కాని ఒక్కసంగతి మాత్రం గ్రహించాలి. సర్ తేజబహదూరు సప్రూ, వారి మిత్రులూ తమ కోరికను మత సామరస్యంతో ముడిపెట్టలేదు. బ్రిటిష్వారి వాద పటిమలో యిది అత్యంత దుర్బలమైన వాదం. దీనితో బ్రిటిష్వాదం ఛిన్నాభిన్నమై పోయింది. అది పోగానే భారతీయుల వాదం నిలిచి తీరాలి.

ఈ మితవాదుల కథనంలోనే మరొక ఉపాఖ్యానం జరిగింది. డాక్టరు సప్రూ సహజంగా ఈ సందర్భములలో గాంధీ జిన్నాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు (ఆయన ఇంకా ఎటూ మొగ్గకుండా ఉన్న సమయంలో యిది సహజం కూడాను.) బొంబాయి మహాసభను యే పక్షానికీచెందని సభగా చేసే అందులో సమగ్రంగా అన్ని విషయాలూ చర్చించడమే ఆయన ఆశయం. అందువలన జిన్నానుకూడా కలుపుకొని పోడానికేమైనా సావకాశం ఉంటుందా అని ఆయన ప్రయత్నించాడు. ఇది నిజంగా శ్లాఘించదగిన ప్రయత్నం

డాక్టరు సప్రూ "ట్వెంటియత్ సెంచరీ" అనే పత్రికకు వ్యాసాలు వ్రాయడంలో తన సంధాన ప్రయత్నాలను ప్రారంభించాడు. అందులో ఆయన ఇండియా రాజ్యాంగ సమస్యనుగూర్చి చర్చిస్తూ మత సామరస్యమును చేకూర్చుకొనే పని భారతీయులదే అన్నాడు. ఈ వ్యాసం చదివి ఈ విషయంలో జిన్నాను సందర్శించవలసిందని డాక్టరు సప్రూకు సూచిస్తూ గాంధీజీ వ్రాశాడు. ఇందుకు బదులుగా జిన్నాను గాంధీ చూస్తేనే ఎక్కువ బాగుంటుందనీ, గాంధీజీ జిన్నాను చూడడాని కంగీకరిస్తే యిద్దరకూ తాను సమావేశం యేర్పాటు చేయగలననీ వ్రాశాడు సప్రూ. తాను జిన్నానుచూస్తే యేమి ప్రయోజనం ఉండదనీ తానొక హిందువుగామాత్రమే జిన్నాను చూడగలనని ఆయన పట్టుపడతాడనీ గాంధీ శంకించాడు. ఈ విషయంలో గాంధీ ఊహ అక్షరాలా నిజమయింది. గాంధీగానీ మరే యితర హిందూనాయకుడుగానీ హిందువుల పక్షానవచ్చి తనను సందర్శించే పక్షంలో తానెప్పుడూ కాదనలేదని, సర్ తేజబహదూరు సప్రూకు జిన్నా వ్రాశాడు. అంతటితో ఆ కథ కంచికి పోయింది. 19 వ ఫిబ్రవరిని వ్రాసిన తన ఉత్తరం తరువాత తననూ గాంధీనీ సమావేశపరచడానికి సర్ తేజబహదూరు యింకనూ ప్రయత్నాలు కొనసాగించలేదని జిన్నా ఆరోపణ చేసినప్పుడీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ప్రచురించబడినవి. తరువాత యింకొక చిన్న

సంఘటనం జరిగింది. జిన్నా వ్రాసిన ఉత్తరంలో ఉన్న "హిందూసంఘంపక్షాన" అనే మాటలు ఆయన ప్రకటనలో లేవు ఆ మాటలు జిన్నా ఉత్తరంలో ఉండడంమూలానే గాంధీ ఆయనను కలుసుకోలేకపోయినాడు. జిన్నా బెంగుళూరునుండి చేసిన ప్రకటనలో బొంబాయి మహాసభ కాంగ్రెసు యేజెంట్లూ, హిందూమహాసభా నాయకులూ కలసి పన్నిన పన్నుగడఅనీ, దీనికి వెనుక యింకా కొంతమంది సుప్రసిద్ధులైన ప్రముఖ నాయకులుకూడా ఉన్నారనీ అనడం మరింత ఆశ్చర్యకరంగా ఉంది. ఈ మహాసభకు పూర్వం జిన్నా, సప్రూలు కలిసికొని మాట్లాడడంవల్ల పత్రికా విలేఖరుల ఊహాపోహలు మిన్నుముట్టినవి. గాంధీ సమాధానం కుదుర్చుకోవడానికి సంసిద్ధంగా ఉన్నట్లు విలేఖరులు వ్రాశారు. ఆయన అలహాబాదులో మాలవ్యా సప్రూలనూ నైని జైలులో మౌలానాసాహెబునూ కలుసుకోవడం కేవలం స్నేహశీల్యానేగాని మరొకందుకు కానేకాదు. సప్రూనివాసంలో సర్ జగదీశప్రసాదును కూడా ఆయన కలుసుకున్నమాట నిజమే. కాని ఆయన సేవాగ్రామంనుంచి బయలుదేరినప్పుడు వీరందరినీ కలుసుకోవలెనని అనుకోలేదు. ఇక మిగిలిన సంజాయిషీ గాంధీ మాటల్లో వ్రాయడమే ఎక్కువ ఉచితంగా ఉంటుంది.

"నేను ఒకే ఒకపనిమీద వచ్చినాను. అంతకుమించి నేను చేసిన పని యే కొంచెమైనాఉంటే అది కేవలం యాదృచ్ఛికం. నేను కొందరు విద్యార్థులనూ కొంతమంది గర్వాలీ కార్మికులనూ కలుసుకొన్నాను. సర్ తేజబహదూరు జబ్బుగా ఉంటే చూడబోయినాను. ఆయనే నన్ను చూడవలసిఉంది. కాని ఆయనకు జబ్బుగా ఉందని విని నేనే ఆయనను చూస్తానని పట్టుబట్టి వెళ్లాను. మేము రాజకీయ పరిస్థితులనుగురించి కొంతవరకూ, హిందూముస్లిం సమస్యనుగూర్చి ఎక్కువగానూ మాట్లాడుకొన్నాము.

"సర్ జగదీశ్ కూడా అక్కడే దిగి సర్ తేజబహదూరు యింట్లో భోజనం చేయడంవలన ఆయనకూడా మా సంభాషణంలో కల్పించుకొన్నాడు. అయితే ఈ సంభాషణల కేమాత్రమూ రాజకీయ ప్రాముఖ్యతలేదు. మేము వ్యక్తులంగా మాట్లాడుకొన్నామేగాని యేదో పనిమీద ప్రత్యేకంగా కలసి మాట్లాడుకోలేదు. ప్రస్తుత ప్రతిష్టంభనమును తొలగించవలెనని సర్ తేజబహదూరు చాలా ఆతురపడుతూన్నాడు. హిందూ మహమ్మదీయుల ఐకమత్యంకోసం ఆయన ఎంతయినా త్యాగం చేయదలచుకొన్నాడు. ఆ ఐకమత్య సంఘటనకు నాకు అత్యధికమైన శక్తిఉన్నట్లు అపాదిస్తూన్నాడాయన. సర్ జగదీశ్ కూడా సప్రూ అంత ఆదుర్దాగానూ ఉన్నాడు. కాని మా సంభాషణలు ఒకరి అభిప్రాయాలు ఒకరు తెలుసుకోవడానికేర్పడిన మిత్రులసంభాషల వంటివి మాత్రమే"

"మాలవ్యాజీని దర్శించడంలోకూడా సరిగా యింతేజరిగింది. ఆయన వృద్ధమూర్తి. నేటి సంఘటనలను గూర్చి ఆయన చర్చించకూడదు. ఆయన చాలా దుర్బలంగా ఉన్నాడు. కాని దేశవ్యవహారాలే ఆయనకు నిత్యజీవనాధారం. ఆయన భగవద్గీతను చదివి మననం చేసుకొంటుండవచ్చును. దేశవ్యవహారాలను గూర్చి ఆలోచించడం మానివేస్తాడు ఇవి ఆయనకు ప్రాణం. ఆయన ఊపిరిపోయినప్పుడు ఈ విషయాలన్నీకూడా దానితోనే ఆగిపోవచ్చు అయినా ఎవరికి తెలుసు? శరీరాన్ని విడిచిన ఆయన ఆత్మ వీటినికూడా తాను పోయిన లోకానికి తీసికొని పోతుందేమో!

"ఇటువంటి స్నేహితులను కలుసుకోవడమొక ప్రత్యేక హక్కు. కాని దేశంలోని రాజకీయ పరిస్థితులకూ మా సంభాషణలకూ యేమీ సంబంధంలేదు. శ్రీమతి విజయలక్ష్మిని నాలానాను జైలులో కలుసుకోవడంలో రాజకీయ సంబంధం యేమీ ఉండడానికి వీలులేదుకదా? ఈ సందర్శనాలనుగూర్చి రిపోర్టరు తోచినట్లు వార్త వ్రాయడం కానీ ప్రజలు శ్రద్ధగాచదివి నమ్మడంగానీ చూస్తే వారంతా మతసామరస్యం వెంటనే చేకూరవలెనని, రాజకీయ ప్రతిష్టంభన పరిష్కారం కావలెనసీ వాంఛిస్తున్నట్లు గ్రహించవచ్చును. అయితే కేవలం కోరిక ఉన్నంతమాత్రాన పనులు జరగవు. ఇటువంటి కోరిక ఉన్నవారంతా కలిసి పనిచేస్తే అది ఫలప్రదం కాగలదు. అందఱూ కలిసి చేయవలసిన పని గూర్చియే అంతా పరిశోధిస్తున్నారు. ఇటువంటి ఊహలు పరిశోధనకు ఫలం కలిగిస్తే కాంగ్రెసు ధ్యేయం కాని కార్యవిధానం కానీ అందరికీ తెలిసినదే. కాంగ్రెసు దేశంలోని తనకనుకూలమైన షరతులను సంపాదించుకోవలెనని ప్రయత్నిస్తున్నదనడం ఒట్టి అబద్ధం. వాక్స్వాతంత్ర్యం అందరికీ కావాలి.

అలాగే దేశ స్వాతంత్ర్యం కూడా కావాలి. దేశానికి ఎటువంటి స్వాతంత్ర్యం కావాలి అనే విషయం ప్రజల వోట్లతో నిర్ణయించబడుతుందేకాని కాంగ్రెసుచే నిర్ణయింపబడదు. ఈ స్వాతంత్ర్య సముపార్జన అహింసాపూర్వకంగానే జరుగవలెనంటే అధిక సంఖ్యాక వోట్లతో అంత ఎక్కువ పని ఉండదు. అల్ప సంఖ్యాకుల యొక్కయూ భారత ప్రజానీకమునకొక్క క్షేమానికి ప్రతికూలురుకాని తదితరుల యొక్కయూ హృదయపూర్వకమైన అనుమతితో తయారు చేయబడిన రాజ్యాంగ చట్టమే స్వాతంత్ర్య పత్రమనిపించుకొంటుంది.

"ఇది యిల్లా ఉండనీ; అన్ని వర్గాలవారికీ వాక్స్వాతంత్ర్యం యుద్ధానికి ప్రతికూలంగా మాట్లాడే స్వాతంత్ర్యంకూడా కలిగించేటందుకే కాంగ్రెసు శాసనోల్లంఘనం ప్రారంభించింది. సమష్టి వాంఛను పరిపూర్తి చేయడానికే

కాంగ్రెసు ఈ పనికి పూనుకొన్నది. ఇది ప్రత్యక్షచర్య విషయంలో చేస్తూన్న కృషి. ఇంతకంటె మంచి ఉపాయం తోచేవరకూ ఇదే అమలులో ఉంటుంది. బొంబాయి తీర్మానముపైన నేను చేసిన వ్యాఖ్యానమునుగూర్చి కొందరు గట్టిగా ఆక్షేపించారు. అది సరియైన వ్యాఖ్యానమనే నా అభిప్రాయం కాని అది ఒక వ్యక్తి చేసిన వ్యాఖ్యానం. కాంగ్రెసు తీర్మానాలను వ్యాఖ్యానించడానికిగానీ మార్చడానికిగానీ కాంగ్రెసునుంచి నాకు అధికారం లేదు. ఆ పని ముఖ్యంగా కాంగ్రెసు అధ్యక్షుడు వర్కింగుకమిటీ సభ్యులు అ. భా. కాం. సం. వారు మాత్రమే చేయతగినవారు."

ఇక రెండవ విషయం ఆలోచించవలసి ఉంది. డాక్టరు సప్రూ జిన్నాల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలున్నూ సప్రూ గాంధీలమధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలున్నూ ఆ నెలలో ప్రకటించబడినవి.

బొంబాయి మహాసభ కాంగ్రెసుతో పూర్తిగాగాని సన్నిహితంగాగానీ సానుభూతి కల సభ కాదు. ఈ సంగతి ముందే తెలుసు. వారికి సంపూర్ణ స్వాతంత్ర్యానికీ చాలా దూరం. బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధానంతరం సాధ్యమయిందని తోచినప్పుడు, ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించడానికి, ఒక తేదీని నిర్ణయించేపక్షంలో ఆ సభవారు ఆ రోజు వచ్చేదాకా వేచి ఉండడానికి హృదయపూర్వకంగా అంగీకరించారు. యుద్ధ సన్నాహాలకు గట్టిగా పనిచేయడమే వారి ఆశయం. అందుకోసం ఇండియా ప్రభుత్వ కార్యవర్గ సముద్ధతైన మనుష్యులతో ఒకేమాటమీద పనిచేసేదిగా ఉండాలి. కాంగ్రెసుకుగాని ముస్లింలీగుకుగాని సంబంధించని వారినుంచి అందుకు ఎంపిక చేస్తే వారున్నారు. అని వారి తలంపు. అయితే భారతదేశంలోని రెండు ప్రముఖ రాజకీయ పక్షాలయొక్క అనగా కాంగ్రెసు ముస్లింలీగులయొక్క ఐక్యతావసరాన్ని వారు గుర్తించకపోలేదు. బొంబాయిమహాసభ సమావేశం కాకమునుపే దాని అధ్యక్షుడు రెండు పక్షాలవారికీ సంధానం చేదామని ప్రయత్నించాడు కాని కాంగ్రెసుకూ ముస్లిం లీగుకూ ప్రధాన విషయాలలో ఉన్న విభేదాలను గుర్తించి, వారి ఉభయులకూ యిప్పట్లో సమాధానం కుదరడం అసంభవమని మహాసభను యేర్పాటుచేసినవారు స్పష్టంగా గ్రహించారు. అయితే ఈ కారణంతో ప్రభుత్వంవారు దేశాభ్యుదయానికి అడ్డంకు కల్గించడం సహించరాని పని అని వారభిప్రాయపడ్డారు. "ఈ విభేదాలుకారణంగా గవర్నరుజనరల్ కార్యనిర్వాహక వర్గమును విస్తృతం చేయడం విషయంలో యింకేమాత్రమూ ఆలస్యము కూడదని" రాజప్రతినిధి ఆగస్టు 8 వ తేదీని అని ఉండలేదా? బొంబాయిమహాసభ కొన్ని ఆచరణయోగ్యములైన సూచనలు చేసిందని వాటిని

ప్రభుత్వం వా రామోదించి ఉన్నట్లయితే దేశంలో యెంతో మానసిక పరివర్తనం కలిగి ఉండేదనీ, అందువలన స్వచ్ఛందంగా సక్రమమైన యుద్ధసన్నాహాలు చాలావరకు జరిగి ఉండేదనీ మితవాద నాయకులంటూ వచ్చారు.

మార్చి నెలలో బొంబాయినగరమున జరిగిన నిష్పాక్షికమహాసభా (Non-Party Conference) తీర్మానములనుగూర్చి తన ఏప్రిల్ 22 వ తేదీ ఉపన్యాసంలో అమెరీ సమగ్రంగా పరామర్శించాడు. డాక్టరు సప్రూగారినీ ఆయన చేసిన సూచనలనూ ప్రశంసిస్తూ ప్రారంభించి, ఆ వారి సప్రూగారి ప్రతిపాదిక ప్రస్తుత ప్రభుత్వంలో మార్పులు తీసుకురావడానికిగాక, దానిని రద్దుచేయడానికే ఉద్దేశింపబడినదనీ ఈ యుద్ధపుతొందరలో [illegible] కష్టతరమైనపనికి పూనుకోవడం సాధ్యంకాదనీ దానిని తోసిపుచ్చాడు. ఇప్పుడు దానికి పూనుకొంటే అంతర్గతంగా రాజ్యాంగ సమస్యలు కొన్ని కొత్తవి సృజింపబడతవి, [illegible] భావి రాజ్యాంగ సమస్యలను ప్రకోపింపజేస్తవనీ అన్నాడు. "ఈ ప్రతిపాదనలను యింతవరకూ అనుభవంలో పెట్టకపోవడానికి కారణం అవి అస్పష్టంగా ఉన్నవని అందరూ అన్నారని కాదు. తమ తమ స్థానాల [illegible] కాంగ్రెసూ ముస్లిములు పడుతూన్న తగాదాలకు సమాధానం చేకూర్చ లేకపోవడమే ప్రధాన కారణం. ఈ మాటను నేనెవరిని చిన్నబుచ్చవలెనని చెప్పడంలేదు" అన్నాడు అమెరీ. 1941 మార్చిలో మొట్టమొదట ఈ సభ జరిగినప్పుడు [illegible] "అందరూ నాయకులే అనుచరులు మాత్రం లేరు" అన్నాడట [illegible]. అమెరీకి ఈమాట బాగా పీలిచ్చింది. అందువలన బొంబాయి తీర్మానాన్ని నిజంగా సమర్థిస్తూన్న వారెవరో తనకు బోధపడడం లేదన్నాడు.

ఏప్రిల్ 7 వ తేదీని డాక్టరు సప్రూ రాజప్రతినిధిని రెండుసార్లు దర్శించి తమ తీర్మానంలోని ముఖ్య విషయాలనుగూర్చి దీర్ఘంగా చర్చించాడు. అందులో యిమిడి ఉన్న భావాలను విమర్శించి ఆయనకు నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. "కాంగ్రెసు ముస్లింలీగులు ప్రభుత్వం లోపలికి రావలెనని యిష్టపడితే రానీయండి. మాకు చాలా సంతోషం. కాని అది వారే నిర్ణయించుకోవాలి; అలా వారు రావడానికి కానీ; వారికీ ముస్లింలీగుకూ, వారికీ ప్రభుత్వానికీ, మధ్యఉన్న భేదాభిప్రాయాలను సరిచేసుకోవడానికిగానీ వారిష్టపడకపోయినట్లయితే వారి యిష్టాయిష్టములమీదనే తక్కిన దేశమంతా ఎందుకాధారపడి ఉండాలో నాకర్థం కావడంలేదు. అటువంటప్పుడు కేంద్ర ప్రభుత్వ రాజ్యాంగ విధానంలో మార్పులు వచ్చితీరాలి" అని వాదించాడు సప్రూ. సప్రూను గూర్చి న్యాయం చెప్పవలెనంటే ఆయన రాజప్రతినిధికి చెప్పిన మాటలలోని సారాంశము నిక్కడ ఉదాహరించడం ఉచితం. "ఎప్పుడయినా కాంగ్రెసుకానీ ముస్లింలీగు

కానీ లోపలికి రావలెనని కోరినప్పుడు ప్రభుత్వంలో యిప్పుడు చేర్చుకోబడేవారు తమ స్థానాలను ఖాళీచేసి వారికి చోటివ్వాలి. అయితే కాంగ్రెసు ముస్లిం లీగులు దేశము యొక్క విశ్వాసమును అప్పటికి కోల్పోయిఉన్నట్లయితే ఈ పని జరుగనక్కరలేదు. అనగా యిప్పుడు ప్రభుత్వంలో చేరదలచుకొన్నవారు ఏ పక్షాన్నిగానీ త్రోసివేసి తామే అధికారంలో ఉండవలెననే కోరిక గలవారు కారు........బొంబాయి మహాసభా తీర్మానంలో ప్రతిపాదింపబడిన కేంద్రప్రభుత్వ పునర్నిర్మాణమును ఆచరణలోకి తీసుకొనివచ్చేటందుకు ఇండియా ప్రభుత్వం చట్టంలో యేమీ సవరణ చేయనక్కరలేదని డాక్టరు సప్రూ వాదించారు. ఇండియాయున్నూ తక్కిన అధినివేశాలున్నూ సమాన ప్రతిపత్తికలిగి ఉండవలెనని ఉదాహరింపబడిన బొంబాయి తీర్మానంలోని వాక్యాన్ని విపులీకరిస్తూ ఆయన యిలా అన్నాడు. "బొంబాయి మహాసభలోగానీ, నిన్న రాజప్రతినిధి కా తీర్మానాన్ని వివరించి చెప్పేటప్పుడుగానీ, నేను ఒకే ఒక విషయంలో పట్టుదలగా ఉన్నాను. ప్రపంచ శాంతిసభలో ఇండియా ప్రభుత్వంచేతనూ, భారత రాజ్యాంగ కార్యదర్శిచేతను, నియమింపబడిన ప్రతినిధులు పాల్గొనవలెను. అయితే వారు భారత రాజ్యాంగ కార్యదర్శి చేతిలో కీలుబొమ్మలు కాకూడదు. వారిక్కడనుండి ఇండియా ప్రభుత్వంవారి ఆజ్ఞలను స్వీకరిస్తూ ఉండవలెను. ఏదైనా సందేహం తోచినప్పుడు ఇక్కడి ప్రభుత్వాన్ని అడిగి తెలుసుకోవాలి. వెస్టుమిన్స్టరు శాసనమువంటి శాసనమే కావలెనని నాకు పట్టుదలలేదు. యుద్ధానంతరం యెటువంటి రాజ్యాంగచట్టం వచ్చినా ఇండియా తక్కిన అధినివేశాలతోపాటు సమాన ప్రతిపత్తి కలిగిఉండవలెననియే నా అభిప్రాయం".

తరువాత మే 10 వ తేదీని సప్రూ 'ట్వెంటియత్ సెంచరీ'లో "అమెరీ-బొంబాయి సభ" అనే పేరుతో ఒక వ్యాసం వ్రాశాడు. బొంబాయి మహాసభా తీర్మానాన్ని అనుసరించి ప్రతిష్టంభనను తొలగించడానికి అమెరీ ఏమీ చేయనందుకు ఆయన చాలా విలపించాడు. "ఇండియాను ఛిన్నాభిన్నం చేయవలెననే కోరికను మన్నించడం ఇండియా యెడల భయంకర విద్రోహమును కావించడమే"నని ఆయన వ్రాశాడు. సర్ తేజ బహాదూరు సప్రూ కాంగ్రెసు ప్రభుత్వాలను సమర్థించే మనిషి కాదు. సత్యాగ్రహోద్యమాన్ని సాగించడం సరియైన పనా అనికూడా ఆయన ప్రశ్నించారు. అయినప్పటికీ నిన్నటివరకూ రాష్ట్రాలలో మంత్రులుగా ఉండి పరిపాలన సాగిస్తూ గవర్నరుల స్తుతులకు పాత్రులైనవారు నేడు ఇనుప కటకటాలమధ్య బందీలుగా ఉండడం ఆయన సహించలేకపోయినాడు.

తమ మంత్రులను తామే ఖైదులో పెట్టుకోవలసిన అవసరం వచ్చేటట్లు చేసుకోవడం రాజకీయ చతురత అనిపించుకోదంటూ యింకా యిలా అన్నాడాయన:—

"ఆ పని అత్యవసరమైనప్పుడు నేనుమాత్రం సందేహిస్తానని కాదు. కాని ఆ స్థితి రాకుండా చేయడానికి ఎంతవరకు సావకాశం ఉంటుందో అంతవరకూ ప్రయత్నించి చిట్టచివరకు తప్పనిసరి అయితే ఆ పని చేస్తాను. సుసంఘటితములైన రెండు రాజకీయపక్షాలవారు ఎవరి మట్టుకువారు తమ తమ అభిప్రాయాల ప్రకారం తమ తమ సిద్ధాంతాలనూ తీర్మానాలనూ ఆచరణలోకి తీసుకొనిరావలెనని వారి లోవారు పోట్లాడి అంతఃకలహాన్ని సాగిస్తూన్నప్పుడు వారు రాజీపడితేనేగాని రాజ్యాంగచట్టంలో యే విధమైన మార్పూ జరగడానికి వీలులేదనడం చాలా అహంకారం. వారిద్దరికీ సమాధానం కుదరకపోతే ఏమవుతుంది? బ్రిటిష్ పార్లమెంటువారు మాకోసం రాజ్యాంగ చట్టమును తయారుచేసే హక్కునువిడిచి పెట్టుకొంటారా?"

ఇండియాలోని పరిస్థితులనుగూర్చి రాజ్యాంగ సంస్కరణములనుగూర్చి ఆమెరీ చేసేవాదాన్ని ఉదాహరిస్తూ యింకా ఆయన యిలా అన్నాడు. "ప్రస్తుతం ఇంగ్లండు కామన్సుచే ప్రకటనాన్ని, మరికొందరి అడ్డగోలుతనాన్నీ చూస్తే భారతదేశ భవిష్యత్తు కొంతమంది నాయకుల మనసుల మీద ఆధారపడి ఉన్నట్లు తోస్తుంది. వారు తమ చేతులలో ఒక మహత్కార్యాన్ని నిర్వర్తించడానికి అవతరించినట్లు తక్కిన వారు తాము చెప్పినట్లు నడుచుకోవలసిన వారైనట్లు భావిస్తున్నారు. ఆమెరీ సూచించే రాజకీయ ప్రతిపాదనలలో ఏ సంఘంలోనూ కూడా మధ్యరకపు మనుష్యులకు తావు లేనట్లు తోస్తున్నది."

పాకిస్థాన్ ప్రణాళికను పరిశీలించి దానిని ఆచరణలోకి తీసుకొని వస్తే యేమి జరుగుతుందో సర్ తేజబహాదూరు ఇలా అన్నాడు. "కాంగ్రెసుతోనో లేక ఇండియాలో యేదో ఒకభాగంలో అధికారంలో ఉన్న కొంతమంది రాజకీయ నాయకులతోనో మీకూ నాకూ యేవో కొన్ని తగాదాలున్నంత మాత్రంతో ఇండియాను ఛిన్నాభిన్నం చేయమని కోరడం న్యాయం కాదు. ఈ విధంగా ఇండియాను విడదీయడం నిరంతరం పరస్పరాభ్యుదయానికి అడ్డుతగులుకొంటూ ఒకరిపైన ఒకరు కుట్రలు పన్నుకుంటూ ఒకరితో ఒకరు పోరాటం పెట్టుకుంటూఉండే రెండు ప్రతికూల యుద్ధ శిబిరాలుగా దేశాన్ని తయారుచేయడమే."

యింతటితో ఊరుకోక చివరకింకా యిలా అన్నాడు "ఈ ప్రణాళికనుగూర్చి బ్రిటిష్‌వారి అభిప్రాయమేమిటో నిశ్చయంగా యెవ్వరూ చెప్పజాలరు. ఆమెరీ బహుశా కాలానుసరణంగా మార్దవమైనభావను ప్రయోగించాడు. కాని ఈ ప్రణాళిక ఆచరణయోగ్యం కాదని ఆయన అభిప్రాయమైనట్లు ఆభావలో కనిపిస్తూనేఉంది.

క్రైస్తవులు సాధారణంగా దాని అంగీకరించటం ఇండియాకు మహా ద్రోహం చేయటం అని నా తలంపు. గత 125 సం వత్సరాలలో ఇండియాలో వాళ్ళు కావించిన చరిత్రాత్మక కార్యకలాపం ఒక్కదెబ్బతో తుడిచిపెట్టబడుతుంది. ఇంతవరకు ఆమెకీ చేసిన విజ్ఞప్తులన్నీ ఎంత సమర్థనీయంగా చేసినప్పటికీ ఇండియా ప్రజలముందు ఎందుకూ పనికి రాకుండా పోయినవి. బహుశా ఎన్నికైనా ఆయన అనుచరులైనా ఏమైనా పని చేసినవేమో! ఆమెకీ ఇండియా కార్యదర్శిగా పనిచేయటం ప్రారంభించి యిప్పటికి ఏడాది పైన అయింది. రాజకీయ ప్రతిష్టంభనమును తొలగించేటందుకు ఆయన చేసిన పనియేమిటో చెప్పలేదని నా నమ్మకం”

ఆమెకీ ప్రవర్తనవలన నిష్పాక్షిక నాయకులందరూ చాలా అసంతృప్తులైనారు. బ్రిటిషు ప్రభుత్వంవారు దురాగ్రహంతో మొండిపట్టుపట్టి పడుతున్నారని భావించి వారిపైన యింకా పట్టుదల తీసుకొని రావడానికి పూనాలో ఒక మహాసభను జరపటం అవసరమని నిశ్చయించుకొన్నారు. బ్రిటిష్ గవర్నమెంటువారు పూనాసభతో (నిష్పాక్షిక సభ) పోటీపడి పనిచేస్తున్నట్లు తోచింది. పూనాసభ జులై 26 వ తేదీని జరుగుతుందనగా జులై 22 వ తేదీనే విస్తృత కార్యనిర్వాహక నిర్మాణమును గూర్చి ఇండియా ప్రభుత్వంవారు ప్రకటన చేశారు. ఈ విధంగా పూనామహాసభను వారు చెప్పబోయే పనిని ముందుగా తామే ప్రకటించి ఇండియా ప్రభుత్వం పూనాసభను పో చేయదలంచుకొంది.

## II

ఆమెకీ ఉద్యోగంలోకి వచ్చి సంవత్సరంపైన అయింది. ఆయన చక్కని మాటలలో దీర్ఘోపన్యాసాలు చాలా చేశాడు. వాటిలోని భాష సమాస భూయిష్ఠమైనది కాదు. వాటిలో మంచి వాదపటిమ ఉంది. అవి సందిగ్ధంగా ఉండవు. అసలు సమస్యను గూర్చి స్పష్టంగా చర్చిస్తాంటవి. వాటిలో యేమైనా లోపముంటే అది ఉపన్యాసకుడిలో ఉన్న లోపమే. ఆయన పచ్చి కన్సర్వేటివ్ పార్టీమనిషి. ఆవిషయంలో చర్చలు తరువాత చర్చలంతవారు. చెప్పిందే చెప్పడంలో ఆయనకు నమ్మకం ఉంది. ఆయన చెప్పిన ఉపన్యాసాలుగానీ, ప్రయోగించిన తర్కాలుగానీ యితరుల మనస్సులలో యెట్టి అభిప్రాయాలను కలిగించినవనే సంగతి ఆయనకక్కరలేదు. 1906 07, 08, 09 సంవత్సరాలలో మార్లీ ప్రభువు మితవాదులందరినీ కూడగట్టడం వలన లాభముందని అనుకొన్నాడు. ఆమెకీ అంతకన్నా మంచిపని చేశాడు. మితవాదులనూ కాంగ్రెసునూ అన్ని రాజకీయ పక్షాలనూకూడా విడిచిపెట్టి వారిష్టంవచ్చినట్లు ఒకే రాజకీయపు టూబిలో పడి దొర్లేటట్టు చేశాడు. గుర్రం గాడిదా అంతా ఒకటేనన్నట్లు మాట్లా

డాడు. ఇండియాలోని రాష్ట్రశాసనసభల అధికారాలను గవర్నర్లు స్వాయత్తం చేసుకొన్న ప్రభుత్వానికుక్క కాలపరిమితిని మరొక సంవత్సర కాలం పొడిగించవలె నని కామన్సు సభలో ఏప్రిల్ 22 వ తేదీని అమెరీ ఒక తీర్మానాన్ని ఉపపాదించాడు. ఈ సందర్భంలో యిచ్చిన ఉపన్యాసమే యిందుకు తార్కాణం.

బ్రిటిషు ఇండియాలోని యావత్తు జనసంఖ్యకు స్థానమైన బెంగాల్, అస్సాం సింధు, పంజాబు రాష్ట్రాలలో రాష్ట్రప్రభుత్వాలు పనిచేస్తూనే ఉన్నవని అమెరీ కామన్సు సభవారికి జ్ఞాపకించేశాడు. తరువాత "తక్కిన ఏడు రాష్ట్రాలలోనూ నివసిస్తూన్న 20 కోట్లమంది ప్రజలూ కాంగ్రెసు అధిష్టానవర్గంవారి ఆజ్ఞలవలన స్వపరిపాలనా సంప్రదాయములకు దూరం కావడం చాలా విచారకరం" అన్నాడు. ఇండియా దేశపు రాజకీయాభ్యుదయం విషయంలో బ్రిటిషువారి కార్యవిధానమును సూచిస్తూ భారతీయులందరూ కలసి పనిచేయడానికంగీకరించిన రాజ్యాంగపద్ధతి కొరకు యావత్తు రాజ్యాంగ సంస్కరణలూ పునర్విచారణ చేయబడవచ్చుననికూడా విశదపరిచాడు. "మాదేశంలో ఉన్న ప్రజాస్వామ్యపద్ధతి ఇండియాలో అందరికీ అంగీకారంగా ఉండదని అక్కడి రాజకీయ దురంధరులు నిర్ణయించినట్లయితే ఫెడరేటెడ్ యూనిట్లనుండి ప్రత్యక్షంగా అధికారమునుపొంది శాసనసభలనుండి స్వతంత్రంగా ఉండే కార్యనిర్వాహకవర్గంగల అమెరికన్ రాజ్యాంగవిధానమును అనుసరించవచ్చును." అంటూ యింకా యిలా ఉపన్యసించాడు. మిస్టర్ అమెరీ. "యుద్ధం జరుగుతూండగానే ఇండియా ప్రభుత్వచట్టమును మార్పుచేయడం సాధ్యంకాదు. కాని ముందుగా అందుకు సంబంధించిన చర్చలను జరుపుకోవడానికి భారతీయ నాయకుల కెక్కడా ఏమీ అడ్డంకులేదు. ప్రస్తుతచట్టం కాంగ్రెసుకు ఇండియా అంతటిమీదా పలుకుబడినీ యాజమాన్యమునూ యిస్తూన్నది. ఈ విధంగా కాంగ్రెసుకు అధికారమిచ్చే మరొక చట్టమేదీ నేటి పరిస్థితులలో సాధ్యంకాదు. ఆ అపాయాన్ని కాంగ్రెసు బొత్తిగా గ్రహించడం లేదని నాభయం." అని యింకా ఇలా అన్నాడు. "ఇండియాయొక్క వాయువ్యదిశా భాగములను ఈశాన్య (North eastern) దిశాభాగములను తక్కిన ఇండియానుండి విడగొట్టి ప్రత్యేక సైన్యం, ప్రత్యేక విదేశరాజనీతి, ప్రత్యేక ఆర్థిక వ్యవహారాలూ గల సంపూర్ణ స్వతంత్ర దేశాలుగా చేయవలసిందని జిన్నా కోరుతూన్న కోరికకు అంతకంతకు బలం చేకూరుతూండడమే ఇందుకు ముఖ్య నిదర్శనం.

"ఇంత తీవ్రరూపం దాల్చిన పాకిస్థాన్ ప్రణాళికను ఆచరణలోకి తీసుకొని రావడంలోగల అంతులేని చిక్కులను నేనిక్కడ వివరించదలచుకోలేను. ఇందుకోసం 18 వ శతాబ్దమునాటి ఇండియా చరిత్రలోని విషాదకర సంఘటనలను కానీ నేడు మన

కళ్ళముందు జరిగిన బాల్కాను ప్రజల వినాశహేతుకమైన అనుభవములను గానీ ఎత్తిచూపనక్కరలేదు. ఇండియాయొక్క ప్రధాన ఐక్యత విచ్ఛిన్నమయినందువల్ల ప్రతిష్ఠించే బహుళరాష్ట్రాలకివి మంచి తార్కాణములు ”

తరువాత ఆమెరి ఆగస్టు ప్రకటనను గూర్చి ఉదాహరించాడు. ఇండియా రాజ్యాంగచట్టమును తయారు చేసేది బ్రిటిష్ పార్లమెంటు కాదనీ, భారతీయులేననీ ఆ ప్రకటనలోని ప్రధానోద్దేశం. అది చాలా అభ్యుదయకరమూ, విప్లవాత్మకమూ అయిన ప్రకటన.

ఇండియాయొక్క అధినివేశ ప్రతిపత్తి ఆ ప్రకటనవలన ముందుగానే అంగీకరింపబడుతూన్నది. అయితే ఆ అంగీకారం రెండు షరతులకు లోబడి ఉంది. ఒకటి ఇండియాతో తనకుగల చిరకాల సంబంధం వలన తటస్థించిన బాధ్యతలను బ్రిటను సరిగా నిర్వర్తించుకోవాలి; రెండు ఇండియా అవసరాలకూ ఇండియా పరిస్థితులకూ ఇండియా చిత్తవృత్తికీ తగినట్లుగా తయారుచేయబడి భారతీయ సంప్రదాయముల కనుగుణంగా ఉండాలి భారతభవిష్యద్రాజ్యాంగం.

ఆమెరీ యింకా యిలా తన ఉపన్యాసాన్ని సాగించాడు. “మరొక షరతు కూడా ఉంది. ఇండియా నూతన రాజ్యాంగచట్టం జయప్రదం కావలెనంటే భారత జాతీయ జీవితంలోని ప్రధానవర్గాలవారు తమలో తాము సమాధానం కుదుర్చుకొని తయారుచేసుకొన్నదిగా ఉండాలని.”

“ తమకేవిధమైన రాజ్యాంగచట్టంకావలెను అనే విషయం పైననే ఏకాభిప్రాయానికి రాలేని భారతీయులు తరువాత దానిని అమలుపరచడానికేవిధంగా సమాధానపడగలరు? ఇండియా ప్రభుత్వబాధ్యత భారతీయుల భుజములపైననే పెట్టవలెనని మేము ఆత్రపడుతూన్నాము. ప్రభుత్వయంత్రానికి తక్షణం కుంగిపోకుండాగాని విచ్ఛిన్నంగాకుండాగానీ ఉండే యేదో ఒక అధికారసంస్థకు మా బాధ్యతను సమర్పించగలము. ఈ షరతుకు లోబడి ప్రస్తుతచట్టాన్ని ప్రధానంగా పునర్నిర్మించడంగానీ సంపూర్ణంగా మార్చివేయడం గానీ జరుగుతుంది కేంద్రప్రభుత్వవిధానమువలన గానీ, కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రములకూ సంస్థానాలకూ మధ్యనున్న సంబంధ బాంధవ్యములవలనగానీ భారత రాజకీయనాయకులు కట్టుబడి ఉండనక్కరలేదు ”

“పార్లమెంటరీ ప్రభుత్వం జయప్రదం కావడానికది మూడు బాధ్యతలను నిర్వహించవలసిఉంది. రాజుగారికీ, పార్లమెంటుకూ, పార్లమెంటుకు ఓటిచ్చేవారికీ. మొదటిది “రాజుగారి ప్రభుత్వం నడుస్తూన్నది” అనే పురాతన లోకసంప్రదాయమునకు జననహేతువయింది” అన్నాడు ఆమెరి. కాని కాంగ్రెసు కోరుతూన్నది సంపూర్ణ

స్వాతంత్ర్యాన్ని అంగీకరించవలసి ఉంది. రెండవది "పార్లమెంటు అధికారమునకు లోబడి అల్పసంఖ్యాకుల హక్కులపైనూ స్పీకరు అధికారంపైనూ ఆధారపడి అది నిర్వహింపబడుతుంది" అన్నాడు. ఇక్కడనే సదరు మంత్రులు రాజీనామా తీయగానే శాసనసభలో జరుగవలసింది చేసి స్పీకరు క్రియాహీనుడుగా నొనర్చిన సంగతి అమెరీ తెలియని విషయం కాదు. ఇక మూడవ బాధ్యత మన మంత్రులు శాశ్వతంగా నిర్వహిస్తూనే ఉన్నారు. కాబట్టి అమెరీ చెప్పినట్లుగా యిక్కడ "పక్ష కేంద్రీకరణాధికారం" లేదని స్పష్టపడుతూన్నది. ప్రధానరాజకీయ వర్గాలవారిని రాజప్రతినిధి కార్యనిర్వాహకవర్గంలో చేరవలసిందని ఆహ్వానిస్తూ వైస్రాయిచేసిన ప్రకటనను గూర్చి కొంత మాట్లాడాడు అమెరీ. ఈ ఆహ్వానం వ్యక్తులుగా ఆయా ప్రభుత్వ శాఖలకు యాజమాన్యం వహించి పనిచేయవలసిందని మాత్రమే కాదు, సంపూర్ణంగా సమష్టిబాధ్యత వహించి ప్రభుత్వ కార్యనిర్వహణం జరుగవలెనని ఆయన ఆశయం. ఈ విషయం రాజప్రతినిధియొక్క విస్తృత కార్యనిర్వాహక సభనుగూర్చి కామన్సుసభలో శ్వేతపత్రమును (white paper) సమర్పిస్తూ అమెరీ యింకా విపులీకరించాడు. ఆ సందర్భంలోనే ఒక ప్రశ్నకు జవాబుగా వైస్రాయి కార్యనిర్వాహకసభ యావత్తుకూ శాసనానుగుణమైన సంపూర్ణ సమష్టి బాధ్యత ఉన్నదని ప్రకటించాడు. కాని వారు శాసనసభలకు బాధ్యతవహించవలసి ఉన్నదనేమాట ఎక్కడా లేదు. కాబట్టి వైస్రాయిచేసిన వాగ్దానం మేడిపండువంటిది. "ఇంతవరకు మా ఆశ నిరాశ అయింది. మా ప్రధాన సూచనలనూ తాత్కాలిక సూచనలనూకూడా కాంగ్రెసు నిరాకరించింది. 'ఇస్తే అంతా ఈయండి లేకపోతే అసలేవద్దు' అనే వైఖరిలో ఉంది కాంగ్రెసు. 'అంతా' అంటే 'అధికసంఖ్యాకుల అధికారాన్ని దృఢపరిచే రాజ్యాంగశాసనంతో కూడిన తక్షణ సంపూర్ణస్వాతంత్ర్యం' అని అమెరీవ్యాఖ్యానం చేశాడు. తరువాత గాంధీ చిత్రమైన ఎత్తుగడ ఎత్తాడనీ, అందులో ప్రధానమంత్రులు తదితర మంత్రులేగాక, సాధారణ కాంగ్రెసువాదులలో ఆ పనకు నచ్చినవారు కొంతమందికూడా పాల్గొంటూన్నారనీ, వారంతా కాంగ్రెసు మంత్రులున్నప్పుడు పక్షనాయకత్వాని కెంత విధేయులుగా ఉన్నారో అంత విధేయతతోనూ ఖైదులను, జరిమానాలనూకూడా లెక్కపెట్టకుండా యుద్ధప్రతికూలోపన్యాసాలను చేస్తున్నారనీ మాట్లాడాడు. పిమ్మట సత్యాగ్రహముయొక్క మూడుదశలనూ ఆయన వివరించాడు. "కాంగ్రెసులో నాయకులుగా ఉండేవారు మాత్రమే మొదటిదశలో సత్యాగ్రహం చేశారు. తరువాత రాష్ట్ర కాంగ్రెసు సంఘాలలోనూ స్థానిక సంఘాలలోనూ ఉండే ప్రతినిధులకు సంబంధించింది రెండవదశ. మూడవదశ యిప్పుడు జరుగుతూన్నది. సామాన్య కాంగ్రెసువాదు

లుపుటయూ యింటిలో పొల్గొంటున్నారు. మేజస్ట్రేట్లు చాలా బుద్ధిసూక్ష్మతతో వ్యవహరిస్తున్నారు. నాకు శాసనాన్ని నిలబెడుతూ కూడా అనాయపులను ఉపేక్షించి చాలా సందర్భాలలో జరిమానాకు బదులుగా ఖైదుశిక్ష చెప్పకుండా కేవలం జరిమానాతో విడిచి వేస్తున్నారు. ఇందువల్లనే తమ ఖైదుశిక్షను రాబోయే ఎన్నికలలో ఉపయోగించుకోదలచుకొన్న వారికి చాలా మందికి నిరుత్సాహం కలిగింది. అప్పుడు జరిమానాలు చెల్లించినవారు కూడా జైలులో పడ్డవారితో సమానంగా కాంగ్రెసు పుణ్యపురుషుల త్యాగచరిత్రలో లెక్కింపబడతారని గాంధీ ప్రత్యేకం ప్రకటన చేయవలసిన అవసరం కలిగింది."

ముస్లింలీగువారు హిందూవర్గమునకు ప్రతిగా ఉండదగినంత ప్రాతినిధ్యమును రాజప్రతినిధి కార్యవర్గసభలో తమకు కలుగ చేయవలసిందని కోరడమే గాక, భావి రాజ్యాంగ విధానమునుగురించి కూడా ముందుగానే కొన్ని షరతులను పెట్టడం వలన వైస్రాయి వాటిని అంగీకరించడానికి వీలులేక, కార్యవర్గసభ్యులకోసం తాను చేస్తున్న ప్రయత్నాన్ని నవంబరులోనే మానుకొన్నాడని ఆమెరీ చాలా విలపించాడు.

కామన్సు మహాసభలో ఆమెరీ చేసిన ఉపన్యాసాన్ని గూర్చి గాంధీ యిలా ప్రకటించాడు: "కామన్సుసభలో ఇండియాను గూర్చి జరిగిన దీర్ఘచర్చ నాకు చాలావిచారం కలిగించింది. కష్టదశలో మనుష్యుల మనస్సులు మెత్తపడి నిజం గ్రహించడానికి సావకాశం కలుగుతుందని ప్రతీతి. కాని బ్రిటను కష్టదశ ఆమెరీ మనస్సులో యేమీ మార్పు తీసుకురాలేకపోయింది. ఆమెరీ చూపుతూన్న ఈ నిర్లక్ష్యంవలన ఎన్ని ప్రతికూల శక్తులు ఎదుర్కొన్నప్పటికీ కాంగ్రెసు తన అహింసా పద్ధతికి కట్టుబడి పని చేయవలసిన అవసరం ఉందని నా కింకా ఎక్కువ నమ్మకం కలుగుతూన్నది. కళ్లకు కట్టినట్లు కనపడుతూన్న ఇండియాలోని నిజ పరిస్థితులను అవజ్ఞాపూర్వకంగా తాను గమనించకపోయినందువలన ఆమెరీ బ్రిటనుకేమీ సేవ చేసినవాడు కావడంలేదు. బ్రిటిషు పరిపాలన ఇండియాకు చాలా శాంతిని చేకూర్చిందని ఆమెరీ చాలా చులకనగా మాట్లాడుతూన్నాడు. ఢక్కా, అహమ్మదాబాదు నగరాలలో ఏమి జరుగుతూండినదో ఆయనకు తెలియదా? ఈ రెండు స్థలాలలో శాంతిని చేకూర్చేటందుకు బాధ్యులెవరు? వంగరాష్ట్రం స్వయంపరిపాలనే అనుభవిస్తూన్నది కాదా అని ఎదురు తిరిగి నన్నాయన ప్రశ్నించకుండా ఉంటాడని ఆశిస్తూన్నాను. ఆ స్వయం పరిపాలన ఎంత హాస్యాస్పదమయిందో ఆయనకు తెలుసు. అటువంటి అత్యవసర సందర్భాలలో చదరంగపుటాటలోని మంత్రులవంటి ఈ మంత్రులకు — కాంగ్రెసు వారైనా-లీగువారైనా-మరొకరైనా—వారికేమీ అధికారంలేదని ఆయన ఎరుగును.

"నేను ముఖ్యమైన ప్రశ్న ఒకటి అడగదలచుకొన్నాను. దీర్ఘకాలపు బ్రిటిష్ పరిపాలనా వ్యామోహం కొన్ని శతాబ్దాలనుండి గూండాలకెదురుగా నిలబడలేనట్టి నపుంసకులుగా ప్రజలను ఎలా తయారుచేయగలిగింది? కొన్ని వందలనుండి గూండాలకు ఇళ్లు తగలబెట్టడానికీ, ఘోరాలు చేయడానికీ, దోచుకొనడానికీ అనుకూల పరిస్థితులేర్పడడమూ వాటినిచూచి కలంకలలో వెలుగులపై ప్రజలు కాలికి బుద్ధిచెప్పడం చూస్తే మా కంటెకూడా బ్రిటిషువారే ఎక్కువ అవమానకరంగా భావించాలి. ఆత్మ సంరక్షణ చేసుకోవడం ఎలాగో అది ప్రజలకు నేర్పడమే ప్రభుత్వమని చెప్పుకోదగిన వారి ప్రథమ కర్తవ్యం. కాని భారతీయ ప్రజల క్షేమంతో నిమిత్తంలేని విదేశీయ బ్రిటిష్ ప్రభుత్వం ప్రజలను నిరాయుధులనుగా చేసింది.

"ఇండియన్ సైన్యాలనుగూర్చి ఆమెకీ పొందిన పొత్తు యావత్తూ భారతదేశములో నిరుపయోగమయింది ప్రస్తుతం కాంగ్రెసు యొక్క అహింసా విధానాన్ని అలా దూరంగా ఉంచి ఆలోచిద్దాం. ఇండియాను ఆత్మరక్షణ చేసుకోవడానికి తగిన శిక్షణనూ ఆయుధ సామగ్రినీ యిచ్చి ఉంటేనూ, ఇండియా స్వచ్ఛందంగా బ్రిటనుతో యుద్ధంలో చేరిఉంటేనూ, యూరపులోని విధ్వంసక దేశములన్నీ కలిసినకూడా బ్రిటనును స్పృశింపజాలి ఉండేవికావు.

"భారత దేశంలోని రాజకీయ కక్షలవారు తమలో తాము ఒడంబడిక కుదుర్చుకోవలెనేగాని గ్రేటుబ్రిటను ఐక్య భారతదేశము యొక్క అభిప్రాయాన్ని అంగీకరించి తీరుతుందని మాటిమాటికి విసుగువచ్చేటంతగా ఆమెకి చెప్పుతూండడం భారతీయ విద్యావంతులను అవమానపరచడం. వివిధ పక్షాలవారు ఏకం గాకుండా ఉండేటట్లు చూడడమే. బ్రిటిష్ సంప్రదాయసిద్ధంగా అవలంబిస్తూన్న రాజనీతి అని నేననేకసార్లు చెప్పిఉన్నాను. 'విభజించి పాలించు' అనే దుష్ట రాజనీతినే బ్రిటిష్‌వారు సగర్వంగా అవలంబిస్తూన్నారు. ఇండియా ప్రజలలో చీలికలేర్పడడానికి కారకులు బ్రిటిష్ రాజకీయ దురంధరులే. బ్రిటిష్ ఆయుధాలు ఇండియాను పరాధీన దేశంగా ఉంచగలిగినంత కాలమూ ఈ చీలిక ఇలా ఉండకతప్పదు కాంగ్రెసు ముస్లింలీగుల మధ్య ఐక్యత యేర్పడడానికి వీలులేనంత అఘాతంఉందని నేనంగీకరిస్తాను. అది యేదో గృహచ్ఛిద్రమని బ్రిటిష్ రాజకీయవేత్తలెందుకు ఒప్పుకోరు? "వారిని ఇండియానుండి వెళ్లనీయండి, కాంగ్రెసు ముస్లింలీగు తదితర పక్షాలవారందరూ కూడా తమ క్షేమంకోసమే కలుసుకొని తమ మాతృదేశాని కనుగుణంగా ఉండే రాజ్యాంగ చట్టమును తామే నిర్మించుకోగలరని నేను వాగ్దానం చేస్తూన్నాను. అది శాస్త్రీయంగా ఉండకపోవచ్చు. పాశ్చాత్య రాజ్యాంగముల కనుగుణంగా ఉండకపోవచ్చు. కాని అది చివరకాలం కొనసాగేదిగా మాత్రం

ఉంటుంది. అయితే ఆ పునఃస్థితి వనకు తటసించేలోగా మనలో మనం పోట్లాడుకో వచ్చును. కాని మనం యే విదేశీ ప్రభుత్వముయొక్క సహాయమునూ అభిలషించకుండా ఉన్నట్లయితే ఆ తగాదా ఒక పక్షంరోజు లుండవచ్చును. అనగా ఈనాడు యూరోపులో జరుగుతూన్న యుద్ధంలో ఒక్కరోజున చచ్చినంతమంది జనంకూడా మన పోరాటంలో చావరు. బ్రిటిషు పరిపాలనములో మనం సంపూర్ణంగా నిరాయుధులుగా చేయబడడమే యిందుకు కారణం — ఇందుకయినా మనం వారికి కృతజ్ఞులంగా ఉండాలి.

“సత్యం చెప్పడంలో ఎంతమాత్రమూ ఆసక్తిలేని అమెరీగారు కాంగ్రెసు “అంతా కావలెనంటుంది లేదా అసలక్కర లేదంటుంది” అని యేమీ తెలియని కామన్సు సభ్యులను మోసపుచ్చుతున్నాడు. బ్రిటిష్‌వారి మనస్సులను ఆకర్షించేటందుకే కాంగ్రెసు పూనా తీర్మానానికి దిగివచ్చిన సంగతి ఆయనకు జ్ఞాపకం చేయవలసి ఉన్నది. బొంబాయిలో పూనా తీర్మానం రద్దుచేయబడి నప్పుడు “బ్రిటిషు గవర్నమెంటు ప్రస్తుతం ఇండియాకు స్వాతంత్ర్యమును ప్రసాదించే స్థితిలోగాని ప్రకటించే స్థితిలోగానీ లేదు గనుక మనమిప్పుడు సంపూర్ణమైన వాక్స్వాతంత్ర్యంతోనూ పత్రికా స్వాతంత్ర్యంతోనూ సంతృప్తి పడాలి” అని నేను అధరాత్రి కీత్యా ప్రకటించాను. ఇది “ఇస్తే అంతాయియ్యి లేకపోతే అసలే వద్దు” అనడమా ?”

“బ్రిటిష్ ప్రభుత్వం కేవలం తన ఉనికికోసం పోరాటం సాగిస్తూన్నప్పుడు దానిని చీకాకుపరచ కూడదనే కోరికతో కాంగ్రెసు బుద్ధిపూర్వకంగా మితవాద తత్వమును అవలంబించిన సంగతిని గుర్తించేటంత సామాన్య దాక్షిణ్యమును, అమెరీ యిప్పటి మన స్థితిలో కలిగిఉంటాడనుకోవడం చాలా కష్టం. పైగా సత్యాగ్రహోద్యమం నిరర్థకమయిందంటూన్నాడాయన.

“ఆయన ఇండియా ఐశ్వర్యాన్ని గూర్చి చేసిన ప్రకటనను చదివినప్పుడు నేనాశ్చర్యచకితుడనైనాను. అనుభవాన్ని బట్టి అది ఒక కట్టుకథ అని నా అభిప్రాయం. ఇండియాలోని కోటానుకోట్ల ప్రజలు క్రమక్రమంగా దరిద్రులవుతూన్నారు. వారికి కట్టుకోవడానికి సరియైన గుడ్డా తినడానికి సరియైన కూడూ లేదు. ఒక మనిషి పరిపాలనమే జరుగుతూన్నది గనుక ఆయన కోట్లకొలది రూపాయిల బడ్జెట్టును తయారు చేయగలుగుతూన్నాడు. ఆకలితో బక్కచిక్కిన కోటానుకోట్ల ప్రజల ఐశ్వర్యానికిది తార్కాణం కాకపోగా బ్రిటిష్‌వారి పదాఘాతముక్రింద ఇండియా నలిగిపోతూన్న దనడానికిది ప్రత్యక్ష సాక్ష్యం కాగలదు. పొలంమీద పనిచేసే రైతుల దుఃఖాన్ని ఏమాత్రమైనా ఎరిగిఉన్న ప్రతిభారతీయుడు ఈ నిరంకుశ ప్రభుత్వంపైన తిరుగుబాటు చేయుడం ధర్మం. ప్రపంచ మానవానీకము యొక్క అదృష్టంవలన ఇండియా చేస్తూన్న తిరుగుబాటు శాంతి

చేత ఆర్థరుమూ గారి రాజకీయాభిప్రాయాలనూ ఆయన కార్యకలాపమునహూ ఇక్కడి బ్రిటిష్ వాణిజ్య సంఘమువారు ఊరిత మిస్తూంటారని బ్రిటనుదేశంలోని ప్రజలేకాక ఇతర దేశాలలో వారుకూడా పొరపాటు పడవచ్చు కాబట్టి ఆ ఊహ సరియైనది కాదని మేము వ్రాతమూలకంగా స్పష్టం చేయదలచుకొన్నాము. ఈ సందర్భంలో స్టేట్సుమన్ సంపాదకీయ వ్యాసాలనుకూడా మేమంగీకరించడం లేదు.

"రాజప్రతినిధి ఆగస్టు 8 వ తేదీని చేసిన ప్రకటన ద్వారానూ తర్వాత ఆయన యున్నూ భారత రాజ్యాంగ కార్యదర్శియున్నూ చేసిన ప్రసంగముల ద్వారానూ చక్రవర్తిగారి ప్రభుత్వం ఇండియా యెడల అవలంబించ దలచుకొన్న రాజకీయ విధానమును స్పష్టీకరించి ఉన్నారు. ఆ విధానం వలన సామ్రాజ్యంలో ఇండియా యొక్క రాజ్యాంగ ప్రతిపత్తిని పెంపొందింపచేయడానికీ దానితో పాటు ఏకకాలంలో యుద్ధప్రయత్నాలను కొనసాగించడానికీ అత్యంత సావకాశం కలుగుతుందని మా నిశ్చితాభిప్రాయం." ఇది స్టేట్సుమన్ పత్రికకు బెంగలు వాణిజ్య సంఘంవారు వ్రాసిన ఉత్తరం. దీనిక్రింద కొంతమంది బ్రిటిష్ వర్తకప్రముఖుల సంతకములు గలవు.

1941 జనవరి 22 వ తేదీని రష్యాపై జర్మనీ దండయాత్ర సాగించిన తర్వాత ఇండియా విషయాన్నిగూర్చి పార్లమెంటులోని లేబరు సభ్యులకు మరింత హెచ్చరిక కలిగింది. కామన్సుసభలో లేబరు పార్టీవారు అమెరీని తీవ్రంగా విమర్శించడం సాగించారు. వారు ఇండియా సమస్యనుగూర్చి మాటిమాటికీ ఆయనకు జ్ఞాపకం చేస్తున్నారు. జర్మను దండయాత్ర ప్రారంభమైన వెంటనే బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాలో అవలంబిస్తూన్న విధానమునుగూర్చిన విమర్శలతో కామన్సుసభ మారుమ్రోగుతోంది. ఇండియా అండర్ సెక్రటరీ డ్యూక్ ఆఫ్ డెవన్ షైర్ ఆక్సఫర్డు విశ్వవిద్యాలయంలో ఉపన్యసిస్తూ ఇండియా ప్రభుత్వం "ఇండియాకోసం, ఇండియావల్ల ఇండియాలోనే" సాగింపబడుతుందన్నాడు. "ప్రజాప్రభుత్వం ప్రజలకోసం ప్రజలవల్ల" సాగింపబడుతుందని అబ్రాహాం లింకన్ ఉపయోగించిన భాషను ఆయన యెన్నడూ ఉపయోగించ లేదు. 'డ్యూక్'ఇచ్చిన ఈ ఉపన్యాసమునుబట్టి రూసో జర్మను యుద్ధం ప్రారంభమైన తరువాత సోరెన్ సేన్ ఇండియానుగూర్చి కామన్సుసభలో మొదటిప్రశ్న వేశాడు. "క్రొత్త ప్రతిపాదనలేవీ లేవనీ 'భారతదేశపు రాజకీయపక్షాలతో సంప్రతించే'పసక్తి అసలే లేదనీ అమెరీ ఆ ప్రశ్నకు జవాబిచ్చాడు. జులై 10 వ తేదీని సోరెన్ సేన్ అంతర్జాతీయ పరిస్థితులలో కలిగిన మార్పునుబట్టి ఇండియాలోని రాజకీయ ఖైదీలనందరినీ వదలి, రాజకీయ ప్రతిష్టంభన కొనసాగుతూండడానికి ప్రధానకారణమునుగూర్చి

దానిని తొలగించేటంతవరకు ఇంగ్లండు అంగీకారమైన ఒక విధానాన్నిగురించి పునర్విచారణచేసే విషయం రాజకీయంగానూ మానసికంగానూ మంచి ప్రయోజనం ఉంటుందేమో మీరాలోచించారా? ఇండియాకు ఇచ్చిన రాజకీయ వాగ్దానాలలో అన్నిటినీ సంప్రతించవలెనని మీరేమైనా ఉద్దేశిస్తున్నారా? అని ప్రశ్నించాడు.

దానికి ప్రత్యుత్తరంగా అంతర్జాతీయ పరిస్థితులలో కలిగిన మార్పువలన ఇండియాలో రాజకీయ ప్రతిష్టంభనలో మార్పు కలుగవచ్చునని సోరెన్సెన్ చేసిన సూచనలో తానేమీ ప్రసంగించదలచలేదని, అంతేగాక విషయంలో ప్రత్యేకంగా తానేమీ యిప్పుడు చెప్పదలచుకోలేదని కాని ప్రధానమంత్రిగారి ప్రకటన మాత్రం ఆ విషయాన్నిగూర్చి ప్రత్యేకంగా ఆలోచిస్తూనే ఉంటుందని అన్నాడు ఆమెరీ.

1941 జూలై 17 న లండనులో ఒక సభలో మాట్లాడుతూ ఆర్థరుమూరు యిలా అన్నారు:-

" ఆసియాఖండంలోకెల్లా ముఖ్యమైన పాత్రను మనం సరిగా నిర్వహించెదము గాక! మనం సమర్థులమైతే ఇప్పుడే భారతదేశమొక జాతి అని ప్రపంచానికి చూపవలెననీ రోజులు గడిచిన కొద్దీ మనకు జరిగే అపాయం అంతకంత కెక్కువ కాగలదనీ కాబట్టి చీనా, రష్యాలవలె సంఘటించి ఏకజాతిగా సంఘటితమై ఆస్ట్రేలియావలెనో తరువాత కెనడావలెనో సంపూర్ణమైన సమాన ప్రతిపత్తికలిగి తన సర్వస్వమును యుద్ధంలో అర్పించడానికి సంసిద్ధం కావలెనని స్వతంత్రేచ్ఛగలవారలను సైతమూ చైతన్యవంతంగా చేయగల శంఖారావములతో భారతదేశమును ప్రబోధింతుము గాక!

" ఇప్పుడే ఇండియా ఆ స్థితిని పొందవచ్చునని మనం స్పష్టంగా చెప్పవలసి ఉంది. కేవలం ఇదివరకున్న స్వాతంత్ర్యములను కాపాడుకోవడం కోసం మాత్రమే కాక నూతన స్వాతంత్ర్యములను సృజించడానికిగూడా మనం పోరాడుతున్నామనీ ప్రస్తుత ప్రపంచ రక్షణకోసమే కాక నూతన ప్రపంచ నిర్మాణమునకు గూడా పోరాడుతున్నామనీ ఇండియాకూ తక్కిన ప్రపంచానికి తెలిసేటట్టు చేయాలి.

"చైనా మృతిపొందితే ఇండియా జీవించి ఉండగలదా? ఏషియా మైనరున్నూ సెంట్రల్ ఆశియాయున్నూ జర్మను పదాఘాతములకు గురియైనప్పు డిండియా నిలవ గలదా? హిట్లరు యొక్కయు జపాను సైనికుల పరిపాలకుల యొక్కయూ పన్నాగములను భస్మీపటలము చేయగల ఉత్సాహాగ్నిని ఆశియాఖండంలో ప్రజ్వలింపచేసే బాధ్యత ఇండియా బ్రిటను దేశాలమైన ఉంది"

## రవీంద్రనాథుని స్మృతి

ఆయనకు చాలాకాలం కిందనే పెద్ద జబ్బుచేసి కలకత్తాలో చికిత్సపొంది శాంతినికేతనములో చల్లగా కాలక్షేపంచేయడానికి వెళ్లాడు. జబ్బునుండి తేరుకొంటూన్న ఈ సమయంలోనే ఆ మహాకవి తన ప్రఖ్యాత చరమశ్లోకమును కృతజ్ఞతా పూర్వక ప్రపంచానికి సమర్పించాడు. ఆయన స్వర్గస్థుడైన తేదీ 1941 ఆగష్టు 7. ఆనాటి మరణశయ్యనుండి ఆయన మృత్యువునుగూర్చి శ్లోకం రచించాడు. కాలోచితమైన కరుణారసమూ గాంభీర్యమూ అందులో ప్రస్ఫుటమౌతూన్నవి. ఆయన జీవితాశయములో లీనమైయున్న శాంతికీ, తాత్త్విక చిత్తవృత్తికీ తగినట్లున్నది ఆపద్యం. ఈ భారత కులపతి ఈ మహాకవి, ఈ లోక సేవాధురంధరుడు. విశ్వమానవ పరిచర్యలోనే కాక వయస్సులోకూడా ముగ్గినపండు నేటి భారతదేశపు క్లిష్టపరిస్థితులలో వయోవృద్ధులైన రాజకీయ ధురంధరులయొక్కయూ, మహాకవులయొక్కయూ, మహా యోధులయొక్కయూ కార్యదక్షతను ఎంతో అవసరం ఉండగా ఈయన మరణం మనకు తీరని నష్టం. ఈ మహాకవి జలియన్‌వాలాబాగు హత్యాకాండను ప్రతిఘటిస్తూ తన 'సర్' బిరుదమును త్యజించినది మొదలు తాను మరణించేగంట వరకూ బ్రిటిష్‌వారిండియా యెడల చూపుతూన్న అశ్రద్ధను గమనించి తన కళోపాసనతోనూ, ఆశ్రమయువకుల విద్యావాసంగంతోనూపాటు, మాతృదేశ చరిత్రలో విషమ స్థితి తటస్థించినప్పుడెల్లా, ఆమె గౌరవస్వాతంత్ర్య ప్రతిష్ఠలకోసం నిలబడుతూవచ్చాడు.

తన సర్ బిరుదమును త్యజిస్తూ షెమ్స్‌ఫర్డు ప్రభువుకు వ్రాసిన ఉత్తరంలో ఆయన తన భావాన్ని ఇలా వ్యక్తంచేశాడు "మీరు మాదేశీయులకు చేసే అవమానాలను బట్టిచూస్తే అసంబంధములైన ఈ గౌరవచిహ్నాలు మాకు మరింత ప్రత్యక్షంగా లజ్జ కలిగించడానికే ఉపకరిస్తూన్నవి. అనామకులుగా వ్యవహరింపబడుతూన్న కారణాన మానవులు పొందరాని అవమానాలకు గురి అవుతూన్న నాదేశీయుల పక్కను ప్రత్యేక విశిష్టత యేమీ లేకుండా జీవించవలెనని నామట్టుకు నేను కోరుతూన్నాను."

ఈ మహాకవికి 1937 లో జబ్బు ప్రారంభమయింది. కాని అప్పుడు తేలికగానే తేరుకొన్నాడు. 1937 అక్టోబరులో ఈయన ఆరోగ్యంతో దీర్ఘాయుష్మంతుడుగా నుండవలెనని కోరుతూ అ. భా. కాం. సం. ఒక తీర్మానంకూడా చేసింది.

మహాకవి మృత్యువును గూర్చి వ్రాసిన చరమశ్లోకముయొక్క ఆంగ్లానువాదం అమియచక్రవర్తిది విశ్వభారతీవారు దానిని ఆమోదించారు. దాని తెలుగు అనువదమిది:

## శోక తిమిర నిశీథము

మా కుటీర ప్రాంగణము మాటి మాటికి తొంగిచూచె;
దానికప్డు ఒక్కటే ఆయుధమ్ము కంటి,
యాతనా భ్రూకుటి అం; గాఢాంధ తమసి,
ముందు దాని కైతవము తెల్పు భయ వికట కరాభినయములు;
ఏ వేళనేని దాని భీషణాకృతి నమ్ము తల్లడిలిన
నిష్ఫల పరాజయమ్ము వెన్వెంటనె వచ్చె.
ఈ జయాపజయముల క్రీడాజగత్తు జీవితపుమాయ;
అనుపదం భావహించి యుండు పసినాటనుండి
చింతోపహాస మూర్తివంత మగు ఈ అనుభూతము;
రంగరకపు భయముల చలనచిత్రము
చెదరిన చీకటుల మృత్యుదేవి రచించినకళ.

రాజప్రతినిధి యొక్క విస్తృత కార్యనిర్వాహకవర్గ సభ్యుల నియామకమునుగూర్చి జూలై నెలలో పత్రికావిలేఖరులు ఎక్కువగా వ్రాస్తూవచ్చారు. కొంతమంది అవి ఎవరి ప్రోత్సాహంవల్లనో వ్రాయబడుతూన్నట్లు తలంచారు. మఱికొంతమంది అవన్నీ విలేఖరుల ఊహాజన్యములు మాత్రమేనని భావించారు. ఈలోగా జూన్ 22 వ తేదీని జర్మనీ రష్యాపైన దండయాత్ర సెంచి. అంతట భారతదేశ పరిస్థితిలో నూతన పరివర్తనం కలిగింది. రష్యాకూ బ్రిటనుకూ జూలై 12 వ తేదీని ఒడంబడిక జరిగి ఉండడంచేత ఇండియాలోని రాజకీయ ఖైదీలు ముఖ్యంగా కమ్యూనిస్టులున్నూ డిటెన్యూలున్నూ విడుదల చేయబడవలెనని ఒకపక్కను ఆందోళన ఉంది. అసలుసంగతి ఏమిటంటే జర్మనీ రష్యాలమధ్య పోరుసాగిన తరువాత యుద్ధమునకు సంబంధించిన నూతన రోగచిహ్నాలు కనిపించినవి. పై చిహ్నాలను బట్టి ప్రతి కొత్త వైద్యుడూ ఒక్కొక్క కొత్తచికిత్సను సూచిస్తూవచ్చాడు. వాండరూ కూడా రోగగ్రస్తమైన శారీరకతత్వమును గ్రహించి రోగనిదానంచేసి, రోగమూలమును తెలుసుకొని చికిత్సను సూచించక పైపైన కనిపించే రోగచిహ్నాలను బట్టిమాత్రమే చికిత్సను సూచించారు. రాయిస్టులూ, కమ్యూనిస్టులూ, కిసానులుకూడా యిలాగే పొరపడ్డారు. అఖిలభారత కిసానుసభవారు, కమ్యూనిస్టులు, ట్రేడ్ యూనియనిస్టులూ, భారతదేశపు కర్షక కార్మికులకు రష్యాపితృదేశమని వాదడం ప్రారంభించారు. ఇక్కడ ఇండియాను మాతృదేశమని వాదడం మాత్రమే కాంగ్రెసుకు తెలును. హిందూస్థానమును తమ మాతృభూమి అనీ, రష్యాను పితృభూమి అనీ, మన

కర్షక కార్మికులు వాడుతూండడం కొంత అసందర్భంగా కనిపిస్తుంది. ఈ మిత్రులు మనుష్యులతో డబ్బుతో యుద్ధ పరికరాలతో రష్యాకు సంపూర్ణ సహాయం చేయవలెనని తీర్మానాలు చేశారు. అదే సమయంలో బ్రిటిష్‌వారికి ప్రతికూలంగానే ఉన్నట్లుగా నటిస్తూ వచ్చారు. వారు యుద్ధానికి అనుకూలురు. బ్రిటిష్‌వారికి ప్రతికూలురు రష్యాకు అనుకూలు —అనగా వారి అభిప్రాయాలొక కలగూరగంపగా ఉన్నవి. అప్పటినుంచి పరిస్థితులు మరీ చీకాకుగా కనిపించినవి.

ఈ క్లిష్ట సమస్య ఇలా ఉండగా యుద్ధం ఇండియా మెడకు వచ్చినట్లుగా ప్రభుత్వంవారు కంగారుపడుతూన్న మాటమాత్రం నిజం. సోరెన్ సేన్, గాల్వే మొదలైన లేబరు సభ్యులు అంతర్జాతీయ పరిస్థితులలో కలిగిన మార్పులనుబట్టి ఇండియా విషయంలోకూడా బ్రిటిష్ రాజనీతి మార్పు చెందవలెనని వారం వారం గల్లంతు చేస్తున్నారు. అమెరీ ఎంతమాత్రం ఒప్పుకోవడంలేదు. కాని కొన్ని బ్రిటిష్ పత్రికలలో జరుగుతూన్న ఆందోళననుబట్టి ఇండియా సహాయం మాత్రం సాధ్యమైతే యుద్ధ ప్రయత్నాలను ఇంకా ఎక్కువగా సాగించడానికి ప్రజల సానుభూతి సహకారములను పొందవలెననియే వాంఛించారు. అందుకోసం వారేదో కొంత కృషి చేయదలచారు. దానివలన రాజకీయ ప్రతిష్టంభన తొలగకపోయినప్పటికి ఇండియాలోని ఆస్తిపరులతోనైనా యేదోఒక విధంగా సమాధానపడడం మంచిదనుకొన్నారు. ఆ ప్రకారం జులై 21వ తేదీని రాజప్రతినిధి కార్యనిర్వాహక సభకు ఏడుగురు భారతీయులను కొత్తగా నియమించారు. వారు,—సర్ సుల్తాన్అహ్మద్, సర్ అక్బర్ హైదరీ, మిస్టర్ ఆనీ, మిస్టర్ యన్.ఆర్. సర్కార్, మిస్టర్ రాఘవేంద్రరావు, సర్ ఫిరోజ్ ఖాన్, నూన్ —ఈ ఏడుగురూ సర్ రామస్వామి మొదలియారుతో కలసి ఎనమండుగురు భారతీయులవుతారు. రాజప్రతినిధి కార్యవర్గ సభలో యింకా ముగ్గురు యూరోపియనులూ ఒక సర్వసైన్యాధిపతీ (Commander-in-Chief) ఉన్నారు. డెయిలీ హెరాల్డు పత్రిక ఈచర్యను విమర్శిస్తూ 'దీనివలన భారతీయులకు ఇంకా, కొన్ని ఎక్కువ ఉద్యోగాలు లభించినవే కాని అంతకంటె మార్పేమీ జరుగలేదు. కాబట్టి ఈ సమస్యను మొదటినుండీ పునర్విచారణ చేయవలెనని' కోరింది. ఇండియాలోని మితవాదులుకూడా యింతమాత్రంతో యేమీ సంతృప్తిపడలేదు. ఈ ప్రకటన రష్యా—జర్మను యుద్ధం ప్రారంభమైన తరువాత సరిగా ఒకనెలకు జరిగిందనీ, "యుద్ధ కారణంగా పని వత్తిడి ఎక్కువ కావడంచేత ప్రభుత్వంవారు కార్యవర్గ సభను పెద్దదిగా చేయనిశ్చయించి" నట్లు లోకానికి వెల్లడిచేశారని తెలుసుకొన్నప్పుడీచర్య యెంత హాస్యాస్పదంగా ఉన్నదో అర్థమయింది. ప్రభుత్వప్రకటన ప్రకారం 'లా' సప్లయి శాఖలనూ, వాణిజ్య కార్మిక శాఖ

లనూ విభజిస్తుంటున్నా, ప్రస్తుతపు విద్య, ఆరోగ్యం, భూముల శాఖలను, విద్య, ఆరోగ్యం, భూములు. విదేశాలలోని భారతీయులు, అని ప్రత్యేక శాఖలుగా విభజించేటం మున్నా, వార్తాశాఖ పౌరరక్షణ (Civil Defence) శాఖలను క్రొత్తగా యేర్పాటు చేస్తుంటున్నా ఈ మార్పు చేయవలసివచ్చిందని కనిపిస్తుంది. ఏదిఏమైనప్పటికీ ప్రభుత్వం తనకు కావలసిన సాయం చేసేవాళ్ళు ఒక్కరూ లేకపోయింది. ఎందుకనగా తలివారం పూనాలో జరిగిన కేంద్ర నిర్వాహక సభకు అధ్యక్షునిగానున్న సర్దారు పటేల ఉపన్యాసంలో దేశరక్షణ, రహదారీలు, ఆర్థిక శాఖలలో యుద్ధంమూలాన పని యెంతో పెరిగిపోలేదా అని దేశంలో ప్రతివారు అడుగుతున్నారు. దానికేమి సమాధానం చెబుతారు ప్రభుత్వంవారు? అని సవాలుచేసి ఉన్నారు. రాజప్రతినిధి కార్యవర్గసభ యే ఉద్దేశాలతో విస్తరింపచేయబడిందో అందరికీ తెలియనే తెలుసు. నిర్ణయించి జులై 12వ తేదీని వెలువడిన ప్రభుత్వప్రకటనలో అది స్పష్టీకరింపబడినది. రాజప్రతినిధి కార్యవర్గ విస్తరణము "రాజకీయాలకు గానీ మతసంఘాలకు గానీ సంబంధించింది కాదు" అని ప్రకటించబడింది: ఆ విస్తరణము వలన ఆ సభలో ముగ్గురు ఉద్యోగులు ఎనిమిదిమంది అనుద్యోగులూ ఉన్నారు. అంతకు పూర్వం ఉన్నసభలో సర్వసైన్యాధిపతి కాక నలుగురు ఉద్యోగులూ ముగ్గురు ఉద్యోగేతరులూ ఉండిరి.

ఈ విస్తరణమువలన ఆనాటి ప్రముఖ రాజకీయ పక్షాలవారవలంబించిన వైఖరినిబట్టి సాధ్యావకాశమున్నంతవరకు క్రిందటి ఆగష్టులో చేయబడిన వాగ్దానమును చాలా వరకు చెల్లించుకొన్నట్లుగానే ప్రభుత్వంవారు చెప్పుకొనసాగారు. ఆగష్టు వాగ్దానం తరువాత బ్రిటిషురాజనీతిలో యేమీ మార్పురాలేదనికూడా నొక్కివక్కాణింపబడింది. ఈ విస్తరణముయొక్క ఉద్దేశం యుద్ధంలో చిక్కుకొనిఉన్న ప్రభుత్వ పరిపాలన సమర్థతతో కొనసాగడమేననీ, ప్రస్తుత రాజ్యాంగ చట్టమునకు లోబడియే ఈ మార్పులు కావింపబడినవనీ, వివిధరాజకీయ పక్షాలవారూ తమలోతాము ఒడంబడిక కుదుర్చుకొనే యెడల దానికనుగుణంగా రాబోయే రాజ్యాంగచట్టమునకిందువలన యేమీ భిన్నంకలుగదనీ విస్పష్టంగా వివరింపబడింది.

రాజప్రతినిధి కార్యవర్గ సభావిస్తీర్ణముకానీ, జాతీయరక్షణ సంఘనిర్మాణం (National Defence Council)కానీ, యేరాజకీయపక్షాన్ని సంతృప్తిపరచడానికుద్దేశింపబడలేదనీ, కేవలం యుద్ధసన్నాహాలలో ఒకటిగా భావింపబడవలెననీ కూడా ప్రభుత్వప్రకటన సూచించింది. "ఇందువలన యే రాజకీయవాంఛా నిరాకరింపబడనూ లేదు. పరిపూర్తిచేయబడే నిర్ణయమూ జరుగలేదు. ఆగష్టు ప్రకటనలో చేయబడిన అన్ని వాగ్దానాలూ యింకా అమలులోనే ఉన్నవి. కార్యవర్గసభకు నియోగింపబడ

నున్న వ్యక్తులు ప్రతినిధులుగా ఉండతగిన భారతీయులనడానికేమీ సందేహంలేదు. వారు చక్రవర్తిగారి చిత్తం వచ్చినంతకాలం ఉద్యోగంలో ఉంటారు అని ఆ ప్రకటనలో వివరింపబడింది.

రాజప్రతినిధి విస్తృత కార్యవర్గంలోకి యిప్పుడు కొత్తగా వచ్చేసభ్యులూ యిదివరకున్న సభ్యులూకూడా సంవత్సరానికి రు. 66,000లే పుచ్చుకొంటారుగాని యింతకుపూర్వంవలె రు 80,000 పుచ్చుకోరు వారు అనవసరంగా కాలయాపన చేయక వెంటనే ఉద్యోగంలో ప్రవేశిస్తారనికూడా ప్రభుత్వంవారు తలంచారు.

## సివిల్ డిఫెన్సుశాఖ: (పౌరరక్షణ శాఖ)

పౌరరక్షణశాఖా - వార్తాశాఖల రెండింటిలో మొదటిశాఖకు సైనిక రక్షణ శాఖతో యేమీ సంబంధంలేదనీ, అందులో ఏ ఆర్. పి. కూడా యిమిడిఉందనీ వివరింపబడింది. విమానములనుండీ, సముద్రంనుండీ, భూమినుండీ వచ్చే దండయాత్రలను తట్టుకోవడానికి కావలసిన సిబ్బందినీ, పరికరములనూ నిర్మించుకోవడమూ, ఈ వివిధ దండయాత్రల రక్షణకు కావలసిన ముఖ్యసిబ్బందిని (Essential Services) ఏర్పాటుచేసుకోవడం - కాందిశీకులకూ యిల్లూ వాకిళ్లూలేనివారికీ రక్షణ యీయడం, అనవసరభీతిని పోగొట్టి ప్రజలకు ధైర్యంచెప్పడం - యివన్నీ పౌరరక్షణ శాఖవారు నిర్వర్తించవలసిన పనులు. ఇంగ్లండులోవలెనే యిక్కడకూడా పౌరరక్షణశాఖ ఎక్కువగా అభివృద్ధియై ప్రధానశాఖగా పరిణమిస్తుందనీ, దానిని మరొకశాఖతో కలపడానికి వీలులేదనీ ఊహింపబడింది. ఆశాఖకు సభ్యుడుగా నియమింపబడిన శ్రీ ఈసుపుగంటి రాఘవేంద్రరావుగారు అప్పుడింగ్లండులో ఉన్నారు. ఆయన ఇండియాకు వచ్చేముందక్కడి పౌరరక్షణశాఖావ్యవహారములను ప్రత్యేకం పరిశీలించి తెలుసుకొని వచ్చారు.

దేశంలోని యుద్ధసన్నాహాలను బాగా సాగించడమూ, ప్రజల విశ్వాసమునూ ధైర్యాన్నీ చెదిరిపోకుండా పట్టడమూ వార్తా శాఖావారి కార్యకలాపంలో చేర్చబడినవి.

బాధ్యతగల ప్రధానస్థానాలకు నిజంగా ప్రాతినిధ్యం వహించతగిన అధికారేతరులలో అగ్రగణ్యులను నియమించవలెనని రాజప్రతినిధియున్నూ, చక్రవర్తిగారిప్రభుత్వం వారున్నూ యెంత ఆందోళనపడ్డారో తెలియచేయడానికి రాజప్రతినిధియొక్క విస్తృత కార్యవర్గనిర్మాణమే ప్రబలసాక్ష్యమనీ ప్రభుత్వపక్షంవారు వ్యాఖ్యానం చేశారు.

యుద్ధ పరిస్థితులంతకంతకు విషమంగా పరిణమించి ఇండియా యే యుద్ధకార్యకలాపాలకు కేంద్రం అయ్యే అవకాశం కనబడుతూన్నప్పుడు ఇండియా ప్రభుత్వానికి పూర్వానికంటె యుక్కువ వత్తిడి ఎక్కువకావడం సహజం కనుక, కార్యనిర్వాహక సభలో వాలకంలమునుంచి మనుష్యులు ఉండడం అవసరమనిపించింది. అంతేకాదు. ఆయా శాఖలకు సంబంధించిన సభ్యులు ఆఫీసు పనిలో మునిగి తేలుతూండక దేశంలో సంచారం చేస్తూండడంకూడా మంచిదనిపించింది.

విస్తృత కార్యనిర్వాహక సభా, జాతీయరక్షణసభా (National Defence Council) ఈ రెండూకూడా విస్తరింపచేయబడిన ప్రభుత్వయంత్రంలో రెండు ప్రత్యేక శక్తులుగా వర్ణింపబడినవి. జాతీయరక్షణ సభవారు నిర్వర్తించవలసిన కర్తవ్యమును వారు సరిగా నిర్వహించదలచుకొన్న యెడల, కార్యనిర్వాహకసంఘంవారి కాలం, చాలవరకు వారే వినియోగించుకోవలసి వస్తుంది. కాని రాజప్రతినిధి కార్యవర్గమును విస్తరింపచేయడంతోపాటు జులై 22 వ తేదీని భారతరాజ్యాంగ కార్యదర్శి అమెరీ పార్లమెంటులో ఇండియా యుద్ధములనుగూర్చి ఒక శ్వేతపత్రమును సమర్పించాడు అది కడచిన పదకొండు నెలల సంఘటనలనూ దాదాపుగా వివరిస్తూ రాజప్రతినిధి ప్రకటనను పునః ప్రచురణ చేసింది.

రాజప్రతినిధికార్యవర్గం విస్తరింపచేయబడినపిమ్మట నాయకులేమనుకున్నారో తెలుసుకోవలెనని పాఠకులు కుతూహలపడుతూండవచ్చును. తనకు తెలియకుండానే రాజప్రతినిధి తన మనుష్యులను కూడా ట్టుకొన్నందుకు జిన్నా మండిపడ్డాడు. జిన్నా సామాన్యుడుకాడు. ముస్లిం లీగుకూ, లీగు కార్యవర్గానికీకూడా అధ్యక్షుడు. బెంగాల్, పంజాబు, అస్సాం ప్రధాన మంత్రులపైన క్రమశిక్షణ చర్యతీసుకొంటానని వారిని బెదిరించాడు. నాలగవ రాష్ట్రమయిన సింధురాష్ట్ర ప్రధానికి లీగుతో సంబంధం లేదు. పంజాబు ప్రధానమంత్రి సర్ సికందరు పంజాబు శాసనసభకు యూనియనిస్టుపక్షపు అభ్యర్థిగా నిలబడి జయం పొందాడు. ఇక బెంగాల్ రాష్ట్ర ప్రధాని ఫజుల్ హక్కుకూడా సర్ సికందరువలెనే లీగు అభ్యర్థిత్వంతో శాసనసభకు గెలుపొందలేదు. కృషక్ ప్రజాపక్షపు అభ్యర్థిగా బెంగాలు శాసనసభకు ఎన్నుకోబడి ప్రధాని అయినాడు. సర్ సాదుల్లాను లీగు తన పక్షంలోకి తరువాత చేర్చుకొంది. అంతేకాని ఎన్నికలనాడు లీగుతో ఆయనకు సంబంధం లేదు. ఈ పెద్దమనుష్యులను లీగు వరించింది. కాని లీగును వీరు వరించలేదు. బెంగాల్ పంజాబు ప్రధానులకు లీగులో ఉన్నందువలన కలిగే ప్రయోజనం సందేహం, దానివలన తటస్థించే కష్టం మాత్రం నిశ్చయం. కాబట్టి జిన్నా క్రమశిక్షణ చర్యవలన వారికి పోయేదేమీలేదు. కాని

తమను ప్రధానమంత్రులుగా పనిచేస్తూ ఉండవలసిందని అంగీకరించినంతకాలమూ తన ఉద్యోగధర్మమునకు సంబంధించిన కార్యకలాపములను నిర్వర్తింపవలెనా అక్కరలేదా అని ప్రధానమంత్రులుగానున్న ఆ పెద్దమనుష్యులవాదం. దానికిజవాబుచెప్పడం చాలా కష్టమయింది.

నిమ్నజాతులలో నాయకులలో ఒకరైన డాక్టరు అంబేద్కరు దాదాపు కంగారుపడి అమెరీకి ఈ దిగువ విధంగా కేబిల్ పంపుకొన్నారు.

> "ఆరు కోట్లమంది నిమ్నజాతులను మీరు తృణీకరించారు. ముస్లిములకు దాదాపు హిందువులతో సమానంగా నూటికి 43 వంతున ప్రాతినిధ్యమిచ్చారు. ఆశ్చర్యం. కొన్ని సంఘాలను మాత్రమే ప్రభుత్వంవారు తాకట్టు పెట్టారు. నిమ్నజాతులవారిని జాతీయ జీవితంలో ఒక ప్రత్యేక ప్రధానవర్గంగా గుర్తించారు. రాజ్యాంగ సంస్కరణల విషయంలో వారి ఆమోదంకూడా ఉండవలెనన్నారు. యుద్ధంలో వారి సహకారాన్ని బాగాఉపయోగించుకొన్నారు. వారిని కార్యవర్గ సభలోనుండి మినహాయించడం మీరు నమ్మకద్రోహం చేసినట్లు స్పష్టపడుతూన్నది. మేమెప్పుడూ బ్రిటిష్‌వారి సహాయాన్ని కోరనూ లేదు. పొందనూలేదు న్యాయమొక్కటే కావలెనంటూన్నాము. కార్యవర్గ సభలో ప్రాతినిధ్యం కలిగి ఉండే హక్కును నిమ్నజాతులవారు వదులుకో దలచుకోవడంలేదు. వారిని గుర్తించవలసిందని గట్టిగా వాదిస్తూన్నాను. ఇంకొక సభ్యుణ్ని చేటిస్తే యేమీ ఆపత్తులేదు"

రాజప్రతినిధి కార్యవర్గంలోకి 'ఆనీ' చేరడం అంత సుకరంగా కనిపించలేదు. 'హితవాద' పత్రిక వ్రాసినట్లు ఆయన త్రోవ 'కంటకావృతం'గా ఉంది. కాంగ్రెసు నేషనలిస్టు పక్షానికి నాయకుడైన పండిత మదనమోహన మాలవ్యా ఆయనను ఆపక్షం నుండి రాజీనామా ఈయవలసిందని కోరినట్లు పత్రికలలో వార్తలువచ్చినవి. ఆనీ అంతకంటె ఇంకా ముందుకుపోయి జులై నెలాఖరున కాంగ్రెసు సభ్యత్వానికే రాజీనామా యిచ్చాడు. విస్తృత కార్యవర్గసభకు సంబంధించిన ప్రభుత్వ ప్రకటనలో తనకేమీ శుభం కనపడడం లేదనీ, పరిణత బుద్ధిగల రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రీగారన్నారు. ప్రభుత్వంవారు తమ స్థితిని బలపరచుకోనూలేకపోయినారు. ప్రజల వాంఛలను యెంతమాత్రమూ పరిపూర్తిచేయలేకనూ పోయినారన్నారు. ఈ ప్రకటనవలన కాంగ్రెసు అవలంబించిన దృక్పథంలో యేమీ మార్పు రాలేదనీ కాంగ్రెసు కోరిన కోరిక యిందువలన పరిపూర్తి కాలేదనీ గాంధీజీ అన్నారు. ఒక ప్రశ్నకు జవాబు చెబుతూ "తమ యిష్టం వచ్చినట్లు చేయకుండా అ. భా. కాం. సం. సభ్యులను ఆప

గల అధికారం నాకేమాత్రం లేదని నేను తక్షణం చెప్పగలను. ఆ సంస్థ నాకిచ్చిన అధికారం వలన ఆ సంఘసభ్యుల సంపూర్ణ స్వాతంత్ర్యంతో జోక్యం కల్పించుకోవడానికి నాకు సావకాశంలేదు. నాకధికారమిచ్చిన సంస్థకు ఆ అధికారాన్ని ఉపసంహరించుకోవడానికిగానీ, తొలగించడానికిగానీ యెప్పుడూ హక్కుంది" అన్నారు గాంధీగారు.

'రింప్రప్రసత్వంలో చేర్చుకోవడానికి తమ సంఘానికి చెందిన వారొక్కరూ కూడా లేకపోవటం కానట్లుగా భావించడంచేత సిక్కులు తమ గౌరవాన్నీ, తమ తెలివితేటలనూ అవమానపరచినట్లు భావించారు. ముఖ్యంగా యుద్ధసన్నాహాలను బలపరచడానికి ఉద్దేశింపబడిన ఈ కార్యవర్గ విస్తరణలో తమవారు లేకపోవడమును గూర్చి వారు తమ అసమ్మతిని వెల్లడించారు.

యుద్ధంవలన పని ఎక్కువయినందున మాత్రమే అట్లుచేయవలసి వచ్చిందనీ అది కేవలం యుద్ధమంత్రివర్గం మాత్రమేననీ ప్రభుత్వంవారే అన్నారు. అందువలన వారిస్థితి మరీ బలహీనమయింది. దానిని ఆధారంగా తీసుకొని పూనాలో జరిగిన అఖిలపక్షసభలో డాక్టరు సప్రూ "యుద్ధంవలన భారతీయ సభ్యుల పనియే యెక్కువయిందా? 'క్లి' యాజమాన్యం కిందనున్న రవాణా రహదారీల శాఖలోనూ మాక్స్వెల్ కింద పనిచేస్తూన్న హోంశాఖలోనూ రెయిస్‌మన్ యొక్క ఆర్థికశాఖలోనూ పని యెక్కువ కాలేదా?" అని ప్రశ్నించాడు. సర్ రెజినాల్డు మాక్స్వెల్ ఇండియా గవర్నమెంటులో ఉండకతీరదా? అని కొద్దిగా అవహేళనచేస్తూ అడిగాడు. అయితే ఈ విస్తరణము ఏవిధమైన రాజ్యాంగ సంస్కరణకూ సంబంధించినది కాదనీ, ఆగస్టు 8 ని చేసిన వాగ్దాన మాలాగే నిలిచి ఉందనీ, దానిని ఆచరణలోకి వచ్చేటట్టు పనిచేయవలసినవారు భారతీయులేననీ చెప్పినప్పుడు ఇండియా ప్రభుత్వంవారూ ఆమెరీకూడా నిజమే చెప్పినట్లు భావించాలి. డెయిలి హెరాల్డు పత్రిక అసంతృప్తిని వెల్లడించి ఈ విషయం పునర్విచారణ చేయమని అమెరీని కోరినట్లు యిదివరకే వ్రాసి ఉన్నాను. పార్లమెంటులో ఇండియాకు స్నేహితులుగానున్న లేబరు సభ్యులు తమ అసంతృప్తిని వెల్లడించడమేకాక ఇండియా సమస్యనుగూర్చి కామన్సు సభలో చర్చించడానికి ఒకరోజు సావకాశ మీయవలసిందనికూడా కోరారు. అమెరీ ఆగస్టు ఒకటో తేదీని మాట్లాడుతూ, యుద్ధానంతరం సాధ్యమైనంతలో త్వరలో ఇండియా యొక్క స్వాతంత్ర్యమునూ, సమాన భాగస్వామ్యమునూ అంగీకరించడానికి బ్రిటను సంసిద్ధంగా ఉందని ప్రకటించాడు. ఇండియాను అధినివేశంగా ప్రకటిస్తారా? అయితే ఎప్పుడు ప్రకటిస్తారని కాదు ఇప్పుడాలోచించవలసింది. ఇండియా తనను ఎలా పడి

పాలించుకోబోతూన్నది అనే విషయమే మనకు ముఖ్యం. "తమను తాము పరిపాలించుకొనే విషయంలో భారతీయులు తమలో తాము ఒకరంబడిక కుదుర్చుకోలేక పోవడమొక్కటే ఈ ఆలస్యాని కంతటికీ కారణం" అని చివరకు తేల్చివేశాడు అమెరీ.

అమెరీ అన్ని ఉపన్యాసాలలోనూ ఒకే పల్లవితో ఒకేపాట పాడుతూవచ్చాడు: కాని ప్రతిసారీ క్రొత్త క్రొత్త రాగాలతో క్రొత్త క్రొత్త సంగతులు వేసి పాడాడు. పర్యవసానం ఏమీ చేయనక్కరలేదు. అని "1935 ఇండియా చట్టము అంగీకరింపబడే ముందు బ్రిటను తన అధికారాన్ని పూర్తిగా ఇండియా గవర్నమెంటుకు భారతీయుల చేతులలో వదిలివేయవలెనా లేక ఎంతవరకు వదిలివేయవలెను అనే ప్రశ్న ఉండెను. ఆ విషయంలో భారతదేశపు నాయకులకూ పార్లమెంటుకే గాక, పార్లమెంటు సభ్యులలోనే భేదాభిప్రాయాలు కలవు. నేడా వాదప్రతివాదాలకు తావులేకుండాపోయింది. ఇండియా తనను తాను పరిపాలించుకోవలెనా లేదా అనేదికాదు నేటి సమస్య. ఇండియాకెట్టి స్వపరిపాలనము కావలెను? ఇండియా ఐక్యంగా ఉండి స్వాతంత్ర్యము అనుభవించటానికిన్ని, అక్కడి జాతీయ జీవితంలో పాల్గొనే వివిధవర్గాలవారూ ఉచిత వాక్స్వాతంత్ర్యమును పొందేటందుకున్నూ, యేవిధమైన రాజ్యాంగవిధానంకింద అవకాశం ఉంటుందా అని ఆలోచించటమే నేటి సమస్య." అని వివరించాడు అమెరీ. "1935 చట్టంలో ఉదాహరింపబడిన కేంద్రప్రభుత్వ ప్రణాళిక బాధ్యతాయుత బ్రిటిష్ పార్లమెంటరీ ప్రభుత్వంయొక్క సంప్రదాయసిద్ధములైన పద్ధతులను అనుకరిస్తూన్నది. రాష్ట్రీయ స్వాతంత్ర్య పరిపాలనముయొక్క ఆనరుఖ సందర్భంలో కలిగిన అనుభవములనుబట్టి 1935 నుండీ తటస్థించిన కొన్ని సంఘటనలనుబట్టి, ఆ ప్రణాళిక నడపడానికవకాశం కలదా అని సందేహం కలుగుతుంది. బ్రిటనులోని ప్రభుత్వ విధానము రాజకీయ పక్షములపైన ఆధారపడి వుంటుంది. కాని ఆ యా రాజకీయపక్షములయందు భక్తివిశ్వాసములు కలిగి ఉండటమే వారి ప్రధాన లక్ష్యం కాదు. మొత్తం పైన జాతీయ క్షేమమును గుర్తించి, దేశమునందలి ప్రజాసంస్థమైన పార్లమెంటునందు ప్రధానంగా భక్తివిశ్వాసములను కలిగిఉంటారు. వారు ఇండియాలో నేడు అల్పసంఖ్యాకపక్షంగా ఉన్నవారిని రేపు అధికసంఖ్యాకపక్షంగా మార్చుకోవడానికి తగిన పరిస్థితులు లేవు." అని తన ఉపన్యాసంలో అన్నాడు అమెరీ. దీనినిబట్టి ఇండియాలోని పక్షాలు కేవలం మతసంబంధములైనవీ సాంఘిక సంబంధములైనవీ మాత్రమేనని అమెరీ భావిస్తూన్నట్లు కనిపిస్తుంది. ఆయన అలా ఎందుకనుకోవలసి వచ్చిందో మాకర్థంకావడంలేదు. ఈ పద్ధతినిబట్టి బ్రిటనులోకూడా ఆయన ప్రజలను విడదీయదలచుకొన్నట్లయితే, ప్రొటెస్టెంట్లు, రోమన్ కాథలిక్కులు అవీ లేక మెథడిస్టులు ఎపి

గోక్కపిలియన్సు అనీ లేక హైచర్చిపార్టీ, లోచర్చిపార్టీ అనీ విభజించవలసి ఉంటుంది. అప్పుడుకూడా అల్పసంఖ్యాకు లెప్పటికీ అధికసంఖ్యాకులు కావడానికి వీలులేదు. కాబట్టి ఆమెరీ అన్నమాటలు సరియైన మాటలు కావు. నిజమేమిటంటే ఇండియాలోని అల్పసంఖ్యాకుల మత, సాంఘిక, సాంస్కృతిక హక్కులకు భంగంరాకుండా హామీ యిస్తూ ఎన్నికలలో పోటీచేసే రాజకీయపక్షాలవారు ఆర్థికసిద్ధాంతాలను ఆధారంగా చేసికొని తమ రాజకీయ కార్యక్రమము నిర్ణయించుకొంటూన్నారు. దేశంలోని ప్రజానీకం యావత్తూ ఈవిధమైన రాజకీయపక్షాలను నిర్మించుకోవడానికి సుశిక్షితులు కావాలి అమెరీ 1940 ఆగష్టులో చెప్పినట్లే, తిరిగి 1941 ఆగష్టులోకూడా చెప్పడం చూస్తే 'తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళన్న'ట్లు, కనిపిస్తుంది "రాష్ట్రాలలోని పక్షప్రభుత్వాల అనుభవాన్నిబట్టి భారతజాతీయ జీవితంలో ప్రముఖులుగాను శక్తివంతులుగానూ ఉన్న కొన్ని వర్గాలవారు, ప్రస్తుతం కేంద్రప్రభుత్వ చట్టంలోని నియమాలకింద తమ ప్రాణాలకూ, స్వాతంత్ర్యానికీ రక్షణలేదని భావించారు. వారలా అనుకోవడం తప్పు కావచ్చు ఒప్పుకావచ్చు. అంతేకాదు. ఒకవేళ ఆచట్టాన్ని సవరించినప్పటికీ ఇండియా పరిపాలనాబాధ్యత శాసనసభలోని అధికసంఖ్యాక పక్షమునకు చెందిన వారిచేతులలో ఉండేవారు 'బయటనున్న ఒకానొక కార్యవర్గంవారి ఆజ్ఞలను శిరసావహిస్తూ వచ్చేవారుడల' కూడా తమకు తగిన రక్షణఉండదని వారు భావించారు." అని 1940 ఆగష్టులో వెల్లడించిన భావాలనే తిరిగి 1941లో కూడా అమెరీ మరొకసారి ఉద్ఘాటించాడు. రాష్ట్రస్వాతంత్ర్యంతోపాటు ఇండియా ప్రభుత్వంలోకూడా మార్పువచ్చి ఉన్నయెడల ఈ చిక్కు తటస్థించి ఉండేది కాదు. కాని బాధ్యతాయుత ప్రభుత్వవిధానము ననుసరించి పదకొండు రాష్ట్రాలలో రాష్ట్రీయ స్వాతంత్ర్యమును నిర్మించి కేంద్రంలో బాధ్యతారహిత ప్రభుత్వాన్ని నిలబెట్టడం వలన రాష్ట్రప్రభుత్వాలకూ, కేంద్రప్రభుత్వానికీ కలయిక లేకుండాపోయింది. ఈ కలయికను చేకూర్చడానికి బయటనుండి ఒక కార్యనిర్వాహకసంస్థ అవసరమయింది. కాని ఈ సంస్థ ఎక్కడ నుండో పైనుండి ఊడిపడి, ఏ సంబంధమూ లేక, అనవసరంగా యితరుల విషయాలలో జోక్యం కల్గించుకొంటూన్న దుష్టసంస్థకాదు! ఈ సందర్భంలో మరొకప్రశ్న వేయ వలసిఉంది. పరిపాలనా వ్యవహారాలలో విషమస్థితి తటస్థించినప్పుడెల్ల ఇంగ్లాండు దేశపు ప్రధానమంత్రి మొట్టమొదట బ్రిటనులోని యూనియన్ అసోసియేషన్ నుండి కాదా విశ్వాసతీర్మానాన్ని ప్రతిపాదింప చేసుకొంటూన్నది? బాల్డ్విన్ ఛేంబర్లేనులు కూడా అలాగే విశ్వాసతీర్మానాన్ని ప్రతిపాదింప చేసుకొన్నారు. యూనియన్ అసోసియేషన్ లో విశ్వాసరాహిత్య తీర్మానమంగీకరింపబడితే ప్రధానమంత్రి తక్కిన

మంత్రివర్గమూ కూడా రాజీనామా యిచ్చి తీరాలి-అనగా పార్లమెంటును కాక అమెరీ చెప్పినట్లుగా "బయటనున్న ఒకానొక కార్యవర్గంవారి ఆజ్ఞలను శిరసావహించి" రాజీనామా యిచ్చితీరాలి. "కాంగ్రెసురాజ్యం లేక హిందూరాజ్యము మూలమున సంభవించే ఆపదలకు ప్రతికూలంగా కలిగిన మనః పరివర్తనమువలన ముస్లిములు ఇండియాను ముస్లిం అధినివేశం- హిందూ అధినివేశము అని రెండు భాగాలుగా విడదీయవలెనని గట్టిగా కోరుతూన్నారు. ఇంత తీవ్రమైన ప్రతిపాదనను ఆచరణలోకి తీసుకొని వచ్చేటందుకనేక అభ్యంతరాలు కలవని నేను నేనువేరుగా చెప్పనక్కరలేదు. అందువలన అల్పసంఖ్యాకుల సమస్యను పరిష్కరించడానికి బదులు, దానిని పూర్వంకంటె తక్కువ వైశాల్యంగల ప్రదేశములలోకి మార్చడంమాత్రం కాగలదని నా అభిప్రాయం. విభజన వాంఛ నిరాశవలన కలిగిన ఆలోచన అనీ, ఆ నిరాశకుకూడా కారణం యేమీ లేదనీ నా నమ్మకం. హిందువులలోనూ మహమ్మదీయులలోనూ కూడా తగినంత నిర్మాణశక్తీ, తగినంత సుహృద్భావమూ, తగినంత దేశభక్తీ ఉందనీ వారు వివిధసంఘాలకూ వివిధ ప్రయోజనాలు కల వర్గాలకూ అనుకూలమైన మంచి రాజ్యాంగ ప్రణాళికను తయారు చేయగలరనీ నా దృఢ నిశ్చయం. జరిగిన ఆగష్టు నెలలో లిన్‌లిత్‌గో ప్రభువు భారత భవిష్యద్రాజ్యాంగ నిర్మాణమునుగూర్చి చేసిన ప్రకటన సారాంశంకూడా యిదే" అని ఉపన్యసించాడు అమెరీ. అంతటితో ఊరుకోక ఆయన యింకా యిలా అన్నాడు. "ఆగష్టు ప్రకటన వలన ముస్లింలకూ తక్కిన ప్రముఖ వర్గాలకూ తమకు తెలియకుండా కాంగ్రెసుతో బ్రిటిష్ ప్రభుత్వంవారు రాజీపడి, తమ భవితవ్యమును నిర్ణయిస్తారేమో అనే భయం, తీరిపోయింది. పైగా ఇండియా తన లక్ష్యాన్ని చేరుకోనేలోగా మరొక దశను గడవవలసి ఉన్నదని ఆ ప్రకటన స్పష్టీకరించి ఉండడంచేత అది కాంగ్రెసుకూ ఇండియాలోనూ ఇక్కడనూ ఉన్న తదితర మితవాద వర్గాలకూ కూడా వ్యాకులం కలిగించింది." అమెరీ మరొక కొత్తపద్ధతిని సూచించాడు. పరస్పర సమాలోచనలతో కూడిన సమాధాన ప్రయత్నాలు చేయడమే ఆ కొత్తపద్ధతి. ఈ నూతన పరిస్థితులలో శాసనోల్లంఘనంవలన యేమీ ప్రయోజనం లేదు. ప్రభుత్వమువారవలంబించిన ఈ మధ్యకాలపు రాజకీయ విధానము తమ లక్ష్యసిద్ధికొఱకు ఆ కాలంలో అత్యంత ఆచరణయోగ్యంగా భావింపబడిందనీ, అంతమాత్రంతో భవిష్యద్రాజ్యాంగ సమస్యా పరిష్కారము ఇదమిత్థమని నిర్ణయింపబడలేదనీ, అందులో పాల్గొన్నంత మాత్రాన తామొక రాజ్యాంగ విధానమును అంగీకరించినట్లు ఎవరూ భావించనక్కరలేదనీ, యుద్ధ సన్నాహాలను బలపఱచడానికి మాత్రమే తామంగీకరించినట్లవుతుందనీ అమెరీ స్పష్టీకరించాడు. ఇండియా ప్రభుత్వమును అంతకంత కెక్కువగా భారతీయుల హస్తగతం చేయవలెనని

ప్రభుత్వంవారి దృఢసంకల్పం. అందు కనుగుణంగా వారొక కార్యనిర్వాహక వర్గమును యుద్ధసలహాసంఘమును నిర్మించదలచుకొన్నారు. కాని ఆ సంస్థలకు కావలసిన వారిని రాజకీయ పక్షాలనుండి తీసుకోవలెనని ప్రయత్నించి రాజప్రతినిధి విఫలుడైనాడు. కాంగ్రెసు సహకార విధానాన్ని అంగీకరించలేదు. రాజప్రతినిధి కార్య నిర్వాహక సభను విస్తరింపచేయడంలోని—అనగా ఆయనకు యుద్ధకాలపు మంత్రివర్గమును నిర్మించడంలోని ప్రధానోద్దేశం, పని బాగా సమర్థతతో జరపడం, భారతీయుల హస్తగతం చేయబడిన శాఖలు, ప్రధాన శాఖలు, కార్యవర్గ సభా కార్య కలాపాలను సమిష్టిగా సమర్థతతో నిర్వహించగల కొంతమంది వ్యక్తులతో కూడిన వర్గమును సంపాదించుకోవడమే ఆయన నిర్వర్తించవలసిన పని. ఇందులో ఆయన విజయంపొందాడని అమెరీ ధైర్యంగా చెప్పివేశాడు. 'రాజప్రతినిధి చెప్పినదానికి తలలూచే 'డూ' 'డూ' బసవన్నలు కారు వారు.' అంటూ ఆయన కాంగ్రెసునుగూర్చి యిలా శ్లాఘించాడు. "ముఖ్యంగా కాంగ్రెసు పక్షంవారిచే జరిగిన రెండు తరాలనుండీ ప్రచారం చేయబడుతూ వచ్చిన జాతీ సౌవాద్యమానికి ఇండియా యెంత కృతజ్ఞత చూపవలసి ఉందో నాకు తెలుసు. ఇన్ని సంవత్సరాలనుండీ కాంగ్రెసు ఇండియాకోసం ఏ ఆదర్శాలను ప్రబోధిస్తూ వచ్చిందో ఆ ఆదర్శాలతోనే ఇప్పుడు మనంకూడా ఏకీభవిస్తూన్నాము......ప్రస్తుత రాజ్యాంగ చట్టంలోని ఫెడరేషనుకు సంబంధించిన నియమావళిని అమలుపరచడానికి కాంగ్రెసు సహాయపడి ఉన్నట్లయితే ఇండియా తన స్వాతంత్ర్యానికి నేటికంటె ఎంతో ఎక్కువ సన్నిహితంగా పోయిఉండేది. ఇండియా ప్రభుత్వంలో ముందెప్పుడూ తటస్థించడానికి వీలులేనంత గొప్ప అధికారస్థానంలో కాంగ్రెసు ఉండిఉండేదనడానికి కేమీ సందేహంలేదు."

అయితే అమెరీ ప్రసంగంలో ఎత్తబడిన విషయాలన్నిటికీ అప్పటికప్పుడే తగిన ప్రత్యుత్తరాలు లభించినవి. నిరాశల చిత్తవృత్తిగల రాజకీయవేత్త జయకర్ ఆయనను ఒక తిన్నని ప్రశ్న అడిగాడు. 1931 లో జరిగిన రౌండుటేబిలు సమావేశమప్పుడు హిందువులూ మహమ్మదీయులూ కలసి ఒక విజ్ఞప్తిని పంపుకొని ఉన్నారుగదా దానికి ప్రభుత్వంవారేమి ప్రత్యుత్తరమిచ్చారని ప్రశ్నించాడాయన. హిందూ మహమ్మదీయులిద్దరూ ఏకీభవించి ఇండియా పరిపాలనకు కావలసిన రాజ్యాంగ విధానమును సూచించ లేకపోయినారని మాటిమాటికీ అమెరీ చేస్తూ వచ్చిన ఆరోపణ కది. సరియైన ప్రత్యుత్తరం కాని, అమెరీకి రాజ్యాంగ విషయాలలోనూ న్యాయశాస్త్రంలోనూ, చరిత్ర భూగోళ శాస్త్రములలోనూ, రాజకీయ సాంస్కృతిక విషయాలలోనూ ఉన్నజ్ఞానం, అంతకంతకు సునిశితమై కొత్త కొత్త కారణాలను కనిపెట్టడానికి వీలు కలిగించింది. అందువలన ఒక్క హిందువులూ మహమ్మదీయులే. కాక

తక్కిన అల్పసంఖ్యాకులూ, సంస్థానాధిపతులూ కూడా కలిసి నావాలనడం ప్రారంభించాడు తరువాత.

భారతదేశ పరిశ్రమలనుగూర్చి ఆగష్టు ఒకటో తేదీని కామన్సుసభలో అమెరీ చేసిన ప్రకటనకు బదులుగా విశాఖపట్నంలో నౌకా నిర్మాణమునూ, మైసూరులో విమాన నిర్మాణమునూ సాగిస్తూన్న ఏకైక పారిశ్రామిక నాయకుడు వాల్‌చంద్ హీరాచంద్ తీవ్రమైన ప్రత్యుత్తరమిచ్చాడు. తన పరిశ్రమకోసం 10 లక్షల డాలర్ల అప్పునూ, 10 మంది యంత్రాలయ నిపుణులునూ కావలెనని కోరగా తనకు లభించ లేదని ఆయన నిరాశాపూరిత హృదయంతో అమెరీకి తంతీ పంపినాడు. ఈ అంధకార బంధురంలో ఎక్కడో ఒకచోట మిణుకు మిణుకు మంటూ ఒక కిరణం కనిపించింది. అదే బ్రిటిష్ లేబరు పక్షంవారు ఇండియా యెడల అవలంబించిన వైఖరి. బ్రిటనులోని లేబరు మహాసభకు డోబీ అధ్యక్షత వహించాడు. అందులో బ్రిటను ఇండియా స్వాతంత్ర్యమును గుర్తిస్తూ భారతదేశముయొక్క రాజ్యాంగ చట్టమును భారతీయులే నిర్మించుకొనేటందుకు వీలుగా సాధన సామగ్రిని యేర్పాటుచేయవలసిందని తీర్మానించ బడింది. ఇండియా ప్రభుత్వమును నూతనంగా నిర్మించేటందుకొక తేదీని నిర్ణయించడం కూడా కష్టం కాదని ప్రొఫెసర్ లాస్కీ సూచించాడు. ఇండియాలో జరుగుతూన్న రాజకీయ చర్చలు అమెరీని ఆకర్షించడంలో యేమీ ఆశ్చర్యంలేదు. అయితే మొత్తం మీద రాజకీయ పరిస్థితి యెలా ఉన్నదో ఆయన గ్రహించవలెనే కాని ఎక్కడో మారుమూలల జరిగే చిన్న చిన్న వ్యవహారాలకాయన ప్రాధాన్యమీయకూడదు. జీవించియున్న మనిషియొక్క ఆరోగ్యమును పరీక్షించేటప్పుడు అతని శరీరంలోని ప్రతి అవయవమునూ కోసి విడదీసి పరీక్షించడు ఏ వైద్యుడూ. రోగిని మంచంమీద పరుండబెట్టి మొత్తంమీద ఆయన ఆరోగ్యమును వైద్యుడు పరిశీలిస్తాడు. అవిధంగానే రాజకీయంగా ఒక జాతియొక్క ఆరోగ్యమును పరీక్షించేటప్పుడుకూడా మొత్తంమీద ఆజాతిలో పెంపొందుతూన్న సోదర సుహృద్భావములను గమనించగలిగి ఉండాలి. కాని ఎక్కడో కొన్ని చిన్న చిన్న తగాదాలనుబట్టి జాతీయ చిత్తవృత్తిని నిర్ణయించ కూడదు. కాబట్టి దేశంలో కాంగ్రెసునున్న స్థితిని యిదేవిధంగా పరిశీలనచేయాలి. కార్యక్రమంలోని వివరములలో భేదాలుం ఉండక తీరదు. కమ్యూనిస్టు పక్షంలో విభేదాలుండి పార్టీ సభ్యత్వం నుండి రాజీనామా ఈయడం కానీ వెళ్ళగొట్టబడటం కానీ మన మెరుగుదుము. సోషలిస్టుపార్టీలో సభ్యులు చాలామంది వామదక్షిణ పక్షాలలో చేరిపోతూండడం మనకు తెలుసు. కిసానులలో కొంతమంది కేవలం భూసంబంధమైన కార్యక్రమానికే ప్రాధాన్యమీయడమూ మరికొంతమంది రాజకీయ కార్య

క్రమానికీ, భూ సంబంధమైన కార్యక్రమానికి కూడా ప్రాధాన్యమిస్తూండడం మన మెరుగనిది కాదు. శ్రేడు యూనియనులు ఒకటి రెండు మూడు శాఖలుగా చీలి ఉన్నవి. ముస్లిములలో నాలుగవవంతు మోమిన్లు జాతీయ వాదులు, జమయత్ - ఉల్ - ఉలేమాలు, అహరారులు, ముస్లిం లీగువారు అని భేదాలేర్పడినవి. ముస్లింలీగు బలిష్ఠం కావడంతోనే అందులోకూడా విభేధాలేర్పడినవి. ఇవి రాజప్రతినిధి కార్యవర్గము విస్తరింపచేయబడి డిఫెన్సుబోర్డు స్థాపింపబడిన పిమ్మట మరీ ఎక్కువైనవి. హిందూమహాసభనుండి మే హిందూలీగ్ అనే సోదరసంస్థ మరొకటి పుట్టింది. వీటన్నిటిమధ్యా ఎట్టి నిమ్నోన్నతాలనూ లెక్క చేయక జాతీయత అనే సర్వోచ్చ శిఖరాగ్రమున సగర్వంగా తలయెత్తుకొని నిలబడ్డసంస్థ కాంగ్రెసు ఒక్కటే. తాత్విక ధార్మిక లోకమునుండి రాజకీయ ప్రపంచంలోకి దిగి వచ్చిన ఆ భారత భాగ్యవిధాతయే దాని అధినాథుడు. కడచిన పాతిక సంవత్సరాల నుండీ కాంగ్రెసు కాయన సారథిగా, సచివుడుగా, మిత్రంగా ఉన్నాడు. వేయేల భారతజాతి ఆయనలో మూర్తీభవించింది. భారతదేశంలోని వివిధజాతులకూ వివిధవర్గాలకూ ప్రాతినిధ్యం వహిస్తూన్న జాతీయమహాసంస్థ కాంగ్రెసుఒక్కటే. ఈ సంగతి అమెరికీ తెలుసు. లిన్‌లిత్‌గోకు తెలుసు. పార్లమెంటుకు తెలుసు. బ్రిటనుకు తెలుసు. తెలియని వారెవరు? అందరికీ తెలుసు. అన్నీ తెలిసీకూడా వారిండియాలో తమ అధికారాన్ని విడిచిపెట్టుకోతలచలేదు. అందువలన ఈ ప్రతిష్టంభన పరిష్కారంకాకుండా వచ్చింది. ఖుర్షీద్ బెన్ మీద నిరోధాజ్ఞను (Internment Order) గూర్చి వివరిస్తూ గాంధీ రాజప్రతినిధి కార్యవర్గ విస్తరణముపైన తీవ్రమైన విమర్శ చేశాడు. ఖుర్షెద్ బెన్ భారత పితామహుడని ప్రఖ్యాతిగాంచిన కీ॥ శే॥ దాదాభాయినౌరోజీయొక్క నాల్గవ మనుమరాలనీ, ఆమె తోబుట్టువులందరిలోనూ చిన్నదామెఅనీ బాగాతెలిసిన విషయమే. ఖుర్షెద్ బెను కంతకుముందు వేయబడిన జైలుశిక్ష పూర్తికాగానే ఆమెను తిరిగీ నిరోధించారు. తనపైన జారీచేయబడిన నిరోధపుటుత్తరువులను (Internment Orders) ప్రతిఘటిస్తూ ఆమె కొంతముంది ఉన్నతోద్యోగులకు వ్రాసిన ఉత్తరములను గాంధీ ఉదాహరించి ఉన్నాడు. ఆమె బొంబాయి కదలకూడదని జారీచేయబడిన మొదటి ఉత్తరవులు బొంబాయి రాష్ట్రమును విడిచిపోకూడదని మార్పు చేయబడినవి. ఆమె వార్ధా పోతూండగా "దొంగతనంగా ఎఱవాడ జైలుకు ఎత్తుకొనిపోబడినదని" గాంధీ అన్నాడు.

ప్రభుత్వంవారి ఈ చర్య నాకేమీ అర్థం కావడంలేదు. రాజప్రతినిధి కార్యవర్గ విస్తీర్ణములోని అంతరార్థమును దీనినిబట్టి విమర్శించుకోవచ్చును. ఖుర్షెద్ బెన్ కార్య

క్రమం యుద్ధనిరోధంతో యేవిధమైన సంబంధం కలది కాదని ప్రజలు తెలుసుకోవాలి. ఇలాగే చాలామంది అరెస్టు చేయబడి విచారణ లేకుండా డిటెన్ చేయబడుతూన్న సంగతి ప్రజలకు తెలియదు. అలా నిర్బంధింపబడిన వారిపైన కాంగ్రెసు లోపలగానీ వెలుపలగానీ ఉండి యుద్ధనిరోధ కార్యములను సాగిస్తూన్నట్లుగా కూడా ఆరోపణ చేయబడలేదు. వారెందుకు డిటెన్ చేయబడినారో వారికే తెలియదు. తక్కిన ప్రజకూ తెలియదు. ఇతర సందర్భాలలో ప్రభుత్వంవారి ప్రవర్తనను ప్రజలకు చూపడానికి ఖుర్షెద్ బెన్ నిర్బంధమొక సూచిక.

నిష్పాక్షిక మహాసభయొక్క రెండవ సమావేశం జులై నెలలో జరుగుతుందని ప్రకటింపబడింది. భారతదేశంలోని బిరుదాంకితులు డాక్టరు సప్రూ అధ్యక్షతకింద సరిగా 26 వ జులై తేదీని తిరిగి సమావేశమైరి. రాజప్రతినిధి కార్య నిర్వాహక సభ విస్తీర్ణం చేయబడినందుకాయన సంతోషించాడు. కాని ముఖ్యమైన శాఖలు—పోలీసు శాఖ, దేశరక్షణ, ఆర్థికశాఖలు భారతీయుల హస్తగతం కానందుకు అసంతృప్తిని వెల్లడించాడు. భారత రాజకీయ పోరాటంలో, వచ్చినంతవరకు అధికారం చేజిక్కించుకొని తద్వారా అంతకంతకు దానిని విస్తరింప చేసుకొంటూ స్వాతంత్ర్య సంపాదనముకు దోహదం చేయవలెనని ఆయన ఆశయం. అనగా శత్రు వ్యూహంలో చొరబడి దానిని క్రమక్రమంగా చీల్చుకొని శత్రువులను వోడించి జయం పొందవలెనని ఆయన అభిప్రాయం. ఐతే శత్రు వ్యూహంలో ముందుగా జొరబడినవారికి కావలసిన సాధన సామగ్రిని వెనుకనుండి అందిస్తూ కొత్త సైన్యాలను పంపేవారుకూడా ఉండాలి. శాసన బద్ధమైన ఈ పోరాటంలో అట్టిది జరగడానికి వీలులేదు. కాబట్టి ముందు శత్రువ్యూహంలో చొరబడినవారు చాలా అపాయస్థితిలో పడిపోతారు.

ప్రివీ కౌన్సిలు జడ్జి పదవికి రాజీనామా యిచ్చి ప్రచారంలోకి దుమికిన రైటానరబుల్ యం. ఆర్. జయకరుకూడా ఈ మహాసభకు హాజరు కావడంవలన ఈ సభ మరింత వన్నెకెక్కింది. "బొంబాయి నిష్పాక్షిక మహాసభ అనుచరులు లేని మహానాయకుల సభ. దచ్చి సైన్యంలో సేనానాయకులు తప్ప సైనికులుండరు. అలాఉంది ఆసభ" అన్నాడు జిన్నా. జయకరు దానికి చక్కని ప్రత్యుత్తరం చెప్పినాడు. మొదటి గాలి విసురుకే చల్లగా జారిపోయే 'సైనికులు కలిగిన సేనానాయకునికంటె అసలు సైన్యంలేని సేనానాయకులు ఉత్తములు' అన్నాడు జయకరు.

దీనికి జిన్నా మండిపడి "అల్ప మనస్కులంకు అల్ప విమర్శాలకు మురిసిపోతూంటారు" అన్నాడు. అంతటితో కోపమాగక "జయకర్ వంటి కూడాగల మనిషి

ఇంత నిర్దాక్షిణ్యంగా మాట్లాడ కూడదు. ఆయన ముస్లిం లీగు నుండి లేచిపోయినవారిని గూర్చి హేళనచేస్తూన్నాడు. తన రాజకీయ జీవితంలో జయకరు పెద్దగాలి విసురుకుగాక 'ఉఫ్' అని ఊదినంతమాత్రంతో అనేక రాజకీయకక్షులను విడిచి లేచివచ్చాడు." అన్నాడు జిన్నా. దానికి జయకరిలా అన్నాడు. "బడాయి కోలు తమకుమించిన వారు లేరనుకొంటూంటారనే సంగతి జిన్నాకు తెలిసి ఉంటుందా అనిపిస్తోంది నాకు. రాజకీయాభిప్రాయాలను మార్చుకొన్నందుకు జిన్నా నిందిస్తూన్నాడు. మొట్టమొదట రేవో 14 విషయాలను మాత్రం సూచించిన జిన్నా యిప్పుడు పాకిస్థానం కావలెనంటున్నాడు. ఇంతకంటె విపరీతమైన మార్పును నేను వినికానీ చూచికానీ ఉండలేదు. నా జీవితంలో నాకు చాలామార్పులు వచ్చినవి. కాని ఎంతప్రాముఖ్యమైన సంఘమైనప్పటికీ ఒక అల్పసంఖ్యాక సంఘం జాతీయంగానూ, సాంఘికంగానూ, రాజకీయంగానూ కాక జీవితంలోని ప్రతిప్రాముఖ్యాంశంలోనూ కూడా తన సోదర సంఘాలతో నిరంతర వైమనస్యభావం కలిగి వేరిగా ఉండి ప్రత్యేక జాతీనని చెప్పుకొంటూండడం మా జీవితాలలో మేము చూచిన మార్పులన్నిటిలోకీ పెద్దమార్పు. అదీ కొద్దిమాసాలలో కలిగింది.

"పాకిస్థానమనే తెరమరుగున 'అధిక సంఖ్యాక ప్రభుత్వసిద్ధాంతాన్ని' పూర్తిగా జారవిడచి, ప్రజాస్వామ్య సూత్రంతో నిమిత్తంలేని వృత్తి ప్రాతినిధ్యమున్నూ తొలగించడానికి వీలులేని కార్యనిర్వాహకవర్గమున్నూ కల రాజ్యాంగశాసన నిర్మాణము కొరకు ఇండియా ఇంగ్లాండు దేశాలలో ప్రయత్నాలు జరుగుతూన్నట్లు అనుమానంగా ఉంది." అన్నాడు జయకరు. ఆయన యింకా యిలా మాట్లాడాడు. "ఈదేశప్రజలలో యిప్పుడు ప్రబలిఉన్న ఈ నిరుత్సాహాన్ని దానిమూలంగా తటస్థించిన ప్రతిష్టంభననూ తొలగించడానికి తగినవారిలో ప్రథములు ప్రభుత్వంవారే. వారు అధికారాన్ని భారతీయుల హస్తగతంచేసి యుద్ధానంతరం నిర్దిష్టకాలంలోనే ఇండియా స్వతంత్రదేశమవుతుందని ప్రకటించాలి. ఈ ప్రకటనవలన కాంగ్రెసున్నూ, మహమ్మదీయులలో అధిక సంఖ్యాకులున్నూ యదార్థస్థితిని గమనించగలరు. వివిధరాజకీయ పక్షాలకూ సమాధానం కుదరలేదని చెప్పుతూండడం అధికారాన్ని విడుచుకోవడానికి యిష్టంలేక చెప్పే సాకు. 1935 నాటి ఇండియాచట్టం అటువంటి సమాధానం కుదిరినతరువాతనే తయారయిందని చెప్పడానికి సావకాశంలేదు. రౌండుటేబిల్ పార్లమెంటరీ కమిటీతో కలసి పనిచేసిన ఇండియా ప్రతినిధులు పంపుకొన్న సమష్టివిజ్ఞాపనములోని సిఫారసులతో భారతీయులందరూ ఏకీభవించినప్పటికీ, దానిని ప్రభుత్వంవారు పూర్తిగా అలక్ష్యంచేశారన్న సంగతి అందరికీ తెలిసిందే.

"అధిక సంఖ్యాక పరిపాలనా సిద్ధాంతం రూపుమాయనున్నదని నేనిపుడు చెప్పిన మాటల కుదాహరణంగా అమెరీ వాక్యాలను జ్ఞాపకం చేస్తాను. రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రులు రాజీనామాలిచ్చిన విషయాన్ని విమర్శిస్తూ తను అధికారాన్ని ప్రాబల్యాన్నీ తాముబుద్ధిపూర్వకంగా వదులుకొన్నప్పుడు తాము ముందెప్పుడూ పొందగలమని ఊహించడానికి వీలులేనంతఅధికారాన్నీ ప్రాబల్యాన్నీ యిచ్చేరాజ్యాంగ శాసనమును జారవిడిచినారన్న సంగతి కాంగ్రెసు ప్రభుత్వాలు గ్రహించి ఉండలేదని ఆయన చాలా విచారపడ్డాడు. ఇండియాలోని బ్రిటిష్ పరిపాలనకు ప్రధాన నాయకుడయిన అమెరీ అన్న ఈ మాటలలో యెంతయినా అర్థముంది. బ్రిటిష్ ప్రజాస్వామ్య సిద్ధాంతమున కనుగుణంగా అధిక సంఖ్యాకుల పరిపాలనమును ప్రతిష్ఠించే రాజ్యాంగశాసనమును రచించడానికి తీవ్రమైన అభ్యంతరాలున్నట్లుగా ఈ మాటలు స్పష్టీకరిస్తూన్నవి. కాబట్టి అధిక సంఖ్యాకుల పరిపాలనమునకు మహమ్మదీయుల ప్రాతికూల్యతనూ, అధికసంఖ్యాక పరిపాలనా సిద్ధాంతంమీద ఆధారపడిన ఇండియా ప్రభుత్వ చట్టంలోని ఫెడరల్ రాజ్యాంగమును ముస్లింలీగుతో కలసి కేంద్రశాసన సభలో కాంగ్రెసును త్రోసిపుచ్చడమునూ, బ్రిటిష్ ప్రభుత్వం వారు తమ స్వప్రయోజనాలకోసం పూర్తిగా ఉపయోగించుకొన్నట్లయితే ఎవ్వరూ ఆశ్చర్యపడనక్కరలేదు. అమెరీ తిరిగీ ఈ మాటలనే తరువాతి ఉపన్యాసాలలోకూడా ఇంతకన్న ఎక్కువ లౌకిక భాషలో ప్రయోగిస్తూ వచ్చాడు.

"ముస్లిం నాయకత్వం ఈ విషయంలో చాలా చాకచక్యంగా నటిస్తూన్నది. ఒక వైపున తమ అంగీకారం లేకుండా యుద్ధసమయంలోకూడా ఇండియాలో యేవిధమైన రాజకీయాభివృద్ధి జరుగకూడదని బ్రిటిష్ ప్రభుత్వం వారిని భయపెడుతున్నారు. మరొకవైపున కాంగ్రెసుతో సమాధానం కుదరడానికి వీలులేని షరతులను ప్రతిపాదించి రాయబారాలకు తావులేకుండా చేస్తున్నారు.

"వారు పెట్టిన షరతులు జాతీయతకు భిన్నంగా ఉండడంచేత రాయబారాలు జరపడానికి వీలులేకుండా పోయింది. అందుమూలాన తమ రాజకీయ చతురతవలన తటస్థించిన ప్రతిష్టంభనమును కొనసాగించి అధికసంఖ్యాకులుగా హిందువులుండే రాష్ట్రాలలోని రాష్ట్రీయ పాలనమును పూర్తిగా విచ్ఛిన్నం చేయడానికి సావకాశం కలిగింది.

"కాబట్టి పాకిస్థాన్ ముస్లిముల శ్రేయస్సుకోసం సాధ్యమైనంత ఎక్కువ కాలం ఈ ప్రతిష్టంభనమును కొనసాగించడానికి అన్నివిధాలా ప్రయత్నించడమే వారి తలంపు. అందువలన వారికేమీ నష్టంలేదు. హిందువు లధిక సంఖ్యాకులుగాగల

ఎనిమిది రాష్ట్రాలలోనూ కాంగ్రెసుమంత్రులు అవివేకంగా రాజీనామాలిచ్చినందున అక్కడి ప్రజలకేమి తటస్థించినా ముస్లింలీగునాయకులకు లెక్కలేదు.

"కనుక యీ ప్రతిష్టంభనమును సాధ్యమైనంత త్వరలో తొలగించడం పాకిస్తాన్ ముస్లిములు కానివారి అందరికీ శ్రేయస్కరం. ఈ సందర్భంలో ప్రభుత్వం వారు కానీ ముస్లింలీగువారు కానీ మనకు తోడ్పడతారనే ఆశలేదు. ఇక కాంగ్రెసు మనకు సహాయపడుతుందేమో పరిశీలించాలి." ఇవి జయకరు మాటలు.

ఇక బ్రిటనులో యేమిజరుగుతూన్నదో ఆలోచిద్దాం. ఇండియాలోని శాసన సభల ఎన్నికలను వాయిదా వేయడానికి ఆగస్టు 6 వ తేదీని బిల్లును ప్రతిపాదిస్తూ ఇండియా అండర్ శక్రిటరీ డ్యూక్ ఆఫ్ డివన్‌షైరు "ఇప్పుడు ఎన్నికలు పెట్టినట్లయితే ఇండియాలో ఇంకా ఎక్కువ చిక్కులు తటస్థించేమాట నిశ్చయం" అన్నాడు. "అంతేకాక యిండియా యిప్పుడు మహాసంగ్రామ సన్నాహాలలో తలమునకలుగా ఉంది. ఇప్పుడు ఎన్నికలువస్తే తప్పకుండా ఆ పనికి భంగం వచ్చితీరుతుంది" అనికూడా అన్నాడు.

మార్క్వెస్ ఆఫ్ క్రూ కూడా ఎన్నికలను వాయిదావేసేబిల్లును ప్రవేశపెట్టక తప్పదని యీలా సమర్థించాడు "ఇండియాలోని ముస్లిం తీవ్రవాదుల యొక్కగానీ హిందూ తీవ్రవాదులయొక్కగానీ కోరికలకు లొంగిపోకుండా రాష్ట్రీయపరిపాలనమును సాగించడం దుస్తరం. ఇప్పుడు ప్రవేశపెట్టిన ఈ సవరణబిల్లునుబట్టి 1935 ఇండియా చట్టమునసుసరించి మొట్టమొదట ఎన్నుకోబడిన రాష్ట్రశాసనసభలన్నీ, ఆచట్టంలోని 62 వ సెక్షను 2 వ సబ్‌సెక్షన్ ప్రకారం ముందుగానే రద్దుచేయబడితే సరే! అలా కానియెడల ఆ చట్టంలోని 61 వ సెక్షన్ రెండవ సబ్ సెక్షన్‌తో నిమిత్తం లేకుండా అవి యుద్ధానంతరం 12 నెలలవరకూ కొనసాగుతూనే ఉంటవి. ఈ సెక్షన్‌లో (క్లాజు 1) "యుద్ధకాలం" అనే మాటకు, 1939 ఇండియా రక్షణ చట్టంలో ఉదారింపబడిన అత్యవసరాధికారాలు అమలులో ఉన్నంతకాలమూ' అని అర్థం. ఈ బిల్లు ప్రభువుల సభలో అంగీకరింపబడి కామన్సుసభకు వెళ్ళినప్పుడు దీనిని ప్రతిపాదించడంలో బ్రిటిష్ ప్రభుత్వంవారి అసలు ఉద్దేశాన్ని బయటపెడుతూ ఆమెరీ ముఖ్యమైన ప్రసంగం చేశాడు. 1941 సెప్టెంబరు 10 వ తేదీని ఈ బిల్లు రెండవసారి చర్చకు వచ్చింది. అప్పుడు ఆమెరీ "కాంగ్రెసువారు మంత్రిత్వాలు విడిచి ఉన్నంతకాలమూ ఈ ఎన్నికలు పెట్టడం కొంచెం తమాషాగా కనిపిస్తుంది. పైగా ఈ ఎన్నికలిప్పుడు జరపడం గాంధీగారి నిరాకరణ విధానాన్ని ప్రచారం చేసుకోవడానికి సావకాశం యిచ్చినట్లవుతుంది. అంతేకాని ఎన్నికలైన తరువాతకూడా రాజ్యాంగశాస

నానుగుణమైన పరిష్కారంలో కాంగ్రెసు చేరే అవకాశాలెక్కడా కనిపించడంలేదు.” అని ప్రసంగించాడు. ఇలా ఈ బిల్లు పార్లమెంటులో చర్చ జరుగుతూండగానే యుద్ధం ప్రారంభమై మూడో సంవత్సరం వచ్చింది. అప్పుడు రిఫారమ్సు కమిషనర్‌గా నియోగింపబడిన హెచ్. వి. హడ్సన్‌గారు దేశంలో సంచారంచేసి భారత భావి రాజ్యాంగ చట్టమును తయారుచేసేటందుకు కావలసిన సంజాయిషీని సేకరిస్తూ ప్రజాభిప్రాయమును తెలుసుకొంటూన్నట్లు లక్నో, నాగపూరు, నగరములనుండి కొద్ది కొద్దిగా వార్తలు బయలుదేరినవి. ఆయన ముఖ్యంగా ఈ నాలుగు విషయాలను గూర్చిన భోగట్టాను సేకరిస్తూండెను. (౧) మిశ్రిత మంత్రివర్గములు (౨) తొలగించడానికి వీలులేని కార్యనిర్వాహకవర్గం (౩) భాషాప్రయుక్త సిద్ధాంతం మీదనయినా కాకపోయినా రాష్ట్రాల పునర్విభజనమును (౪) పరిస్థితులను బట్టి ఫెడరేషనో, కాక ఫెడరేషనో నిర్ణయం. ఆమెరీ 1940 ఆగష్టు 11 వ తేదీని ఒక ఉపన్యాసమూ, నవంబరు 21 వ తేదీని మరొక ఉపన్యాసమూ చేశాడు. వాటిలో హాడ్సన్ కు నియోగించబోయే పనులను గూర్చి కొద్దిగా సూచించాడు. కాని ఆ ప్రసంగాలు భారతరాజ్యాంగ సమస్యను గూర్చి ప్రజల దృష్టిని అంతగా ఆకర్షించలేదు. ఆగష్టు 11 వ తేదీని బ్లాకుపూలులో ఆయన యిచ్చిన ఉపన్యాసంలో “తన రాజకీయ సాంఘిక ఆర్థికాశయాలకు అనుగుణంగా తన రాజ్యాంగచట్టమును తనకు తోచినట్లు ఇండియా నిర్మించుకొనేపని యుద్ధానంతరం పరిపూర్తి కావలెనన్న యెడల, అందుకు కావలసిన పరిశీలనము, చర్చలు, రాయబారాలూ యివన్నీ పరస్పర సుహృద్భావంతో యుద్ధకాలంలోనే జరుగవలెను. అందుకేమీ అభ్యంతరం ఉండకూడదు.” అని ప్రసంగించాడు. ఈవిధంగా భారతరాజకీయాలలో ప్రధానపురుషులు జైలులో ఉండగానే హాడ్సన్‌గారు భారతరాజ్యాంగ విధానమును గూర్చిన ప్రాథమిక పరిశీలనమూ, చర్చలూ, రాయబారాలూ సాగించాడు, ఎవరితో? సామ్రాజ్యవిధానంతో కలసిమెలసి వ్యవహరించే వారితో. ఇంకా ఎవరితో? బహుశా భారతజాతీయతకు శత్రువులైనవారితో అనికూడా చెప్పాలి. నవంబరు 21 వ తేదీని ఇంగ్లీషు స్పీకింగు యూనియన్‌వారు చేసిన విందులో అతిథిగా ఉండి యేవిషయంలో ఈ పరిశీలనమూ, చర్చలూ రాయబారాలూ సాగించవలెనో దానినిగూర్చి అమెరీ బయటపెట్టాడు. “ఇండియాలోని విభేదాలను తొలగించి ప్రధాన విషయాలలో ఇండియా ఐక్యతను కాపాడగలిగిన ఆంగ్లరాజ్యాంగ విధానమును నిర్మించేటందుకే” ఈ పరిశీలనమూ, చర్చలూ, రాయబారాలు కావలెనన్నాడు. “ప్రత్యేక చరిత్రా, ప్రత్యేక స్థానిక పరిస్థితులు గల మనదేశంలోను ఇతర అధినివేశాలలోనూ, జయంపొందిన విధానం,

వాటికి పూర్తిగా భిన్నంగానుండి ఎక్కువ చిక్కులతో కూడుకొని ఉన్న ఇండియా విషయంలో సహజంగా విపరీత పరిణామమును కలిగించినందున ఈ ప్రతిష్టంభన యేర్పడింది" అన్నాడు అమెరీ. "ఇది నిర్మూలంకావలెనంటె రాష్ట్రాలను సవ్యమైన పద్ధతులమీద పునర్నిర్మాణంచేసి వాటికింకా ఎక్కువ అధికారాలీయాలి. కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వాలమీద సాధ్యమైనంత తక్కువ అధికారముండాలి. కేంద్రప్రభుత్వానికీ రాష్ట్రప్రభుత్వాలకూ విదేశాంగ వ్యవహారాలలోనూ, దేశరక్షణ ఆర్థిక విధానములలోనూ తగినంత ఐక్యతను యేర్పాటుచేయాలి. వృత్తి ప్రాతినిధ్యముండాలి. అమెరికా రాజ్యాంగంలోవలె కార్యనిర్వాహకవర్గం శాసనసభనుండి స్వతంత్రంగా ఉండాలి." అని సూచనలు చేశాడు.

యుద్ధం తీవ్రంగా సాగుతూండగానే హాడ్సన్‌ను కొత్తగా రిఫారమ్సు కమీషనరుగా నియోగించిన సందర్భంలో, ఆ ఉద్యోగానికి రౌండుటేబిల్ సమావేశంలో పాల్గొన్నవానినే తిరిగి నియోగించిన సంగతి మఱచిపోకూడదు.

---

# ౧౧. ఉద్యమాభివృద్ధి

యుద్ధముయొక్క రెండవ వార్షికోత్సవమునాడు యుద్ధాన్ని నిరోధించిన వారూ, యుద్ధసన్నాహాలలో నిమగ్నులై పనిచేస్తున్నవారూకూడా అంతవరకూ జరిగిన సంఘటనలను పర్యాలోకనం చేయడంమంచిది. 1941 సెప్టెంబరు మూడో తేదీ నాటికింకా జర్మనులు రష్యాదేశపు మహానగరములు నాలుగింటిలో దేనినీకూడా పట్టుకోలేదు. ఇంగ్లాండును ముట్టడించలేదు. ఆఫ్రికాను లోబఱచుకోలేదు. కాని వారు లెనిన్‌గ్రాడ్ సరిహద్దులకు అపాయకరంగా ఉండేటంత సమీపంలో ఉన్నట్లు వార్తలు వచ్చినవి. ఫిన్నుల ఉత్తరసైన్యాలూ, జర్మనుల ఈశాన్యసైన్యాలూ ముందుకు తోసుకొనిరాగా, దక్షిణాన ఉన్న మార్షల్ వార్షిలావ్ సైన్యాలు వారిని మూడుమైళ్లు వెనుకకు నెట్టినవి. లెనిన్‌గ్రాడును ఏకాకిగాచేసి రష్యాకు మార్గం లేకుండా చేయవలెనన్న యెత్తు యింకా కొనసాగలేదు. ఒడెస్సానుండి డాన్ బేసిన్‌కూ, బాటంకూ, తరువాత బహుశా బాకూకుకూడా దారియేర్పడవచ్చును. ఉక్రేన్‌లోని పారిశ్రామిక వ్యవసాయిక ఖనిజసంపదలకు మార్గనిరోధములను తొలగించి కీవు బారంబాట చేయగలదు. నూతన సాంఘికవ్యవస్థకొఱకు 20 సంవత్సరాలు కృషిచేసి లాక్షణికంగా గానీ, నిజంగాగానీ రష్యా నిర్మించుకొన్న యావత్తు ఐశ్వర్యమును మాస్కో జర్మనులకు సమర్పించవచ్చును.

ఈవిధంగా యూరపులోని పరిస్థితులు సందిగ్ధంగా ఉన్నప్పుడు ఆశియా ఖండంలో యుద్ధమేఘాలంతకంతకు సమీపిస్తూండినవి. సెప్టెంబరు మూడవ తేదీని జపాన్ పరిస్థితులు నానాటికి విషమిస్తున్నవనే భయంకరవార్తను ప్రిన్సుకోనాయి రేడియోద్వారా ప్రచారంచేస్తూ జపానులోని ప్రతిమనిషీ సైన్యసేకరణకు కృషిచేయాలని కూడా ప్రబోధించాడు. అన్నిదేశాలలోకి టర్కీదేశస్థితి యెవ్వరికీ అర్థంకాకుండా ఉంది. దానిస్థితికూడా సిరియా, ఇరాక్, ఇరాను దేశాల విషమస్థితికి దగ్గర దగ్గరగా పోలిఉంది. ఇంతలో అమెరికా తన 'అప్పు - కౌలు' విధానాన్ని అమోఘంగా సాగిస్తూ తన వర్తకాన్నీ పరిశ్రమలనూ పెంపొందించు కొంటుంది. యునైటెడ్ స్టేట్సుకు బాకీఉన్న పాతఅప్పును పూర్తిగా రద్దుచేసి బ్రిటనును ఋణవిముక్తురాలినిగా అమెరికా ప్రకటించవచ్చును. 'లార్డ్ హావా' చెప్పినట్లు క్రిస్టియన్ మతస్థులమని ప్రకటించుకొంటూ అమెరికావారు అత్యంతచాతుర్యంగల బోల్షివిస్టు ప్రభుత్వంతో ఐక్యమయినారు. స్వేచ్ఛావాణిజ్యమనే పేరుతో తమ దేశంలోనున్న నూటపదిలక్షల మంది

జనుల పనిలేమిని తగ్గించుకోవడానికి పాత ప్రపంచంలో దుఃఖాలను ఉపయోగించు కొంటున్నారు వారు. తమకు ప్రాదేశికవాంఛలేమీ లేవని అంటూనే ఇంగ్లాండుకు పాతకాలంనుంచి ఉన్న వలసరాజ్యాలను 'అప్పు - కౌలు' విధానంక్రింద గుటకాయ స్వాహా అని, చిరప్రసిద్ధి వహించిన యాభైస్ట్రాయర్లను ఇంగ్లీషువారికి మిమ్మ్రవేశారు. యూరోపియన్ ప్రభుత్వాలవారు యుద్ధంలో కడచిన సంవత్సరాలను మాటిమాటికీ లెక్కించుకొంటున్నారు. కాని ఇండియన్ నేషనల్ కాంగ్రెసు 1940 అక్టోబరు 17 వ తేదీని ప్రారంభించిన సత్యాగ్రహోద్యమమున కింకా ఏడాదినిండలేదు. అనుకొన్న ప్రకారం అంతా సక్రమంగానే జరుగుతూన్నదని జర్మను యుద్ధవార్తలలో గూఢార్థంగా వ్రాస్తున్నట్లే కాంగ్రెసు సత్యాగ్రహం కూడా అనుకొన్న ప్రకారం అంతా సక్రమంగానే జరుగుతూవచ్చింది. పశ్చాత్తాప పడవలసిన అవసరంగానీ, వెనకడుగు వేయవలసిన అవసరం కానీ గాంధీకి రాలేదు. ఉద్యమానికి పక్కనున్నవారూ, దూరంగా కూర్చొని సురక్షితంగా ఉన్న కొంతమంది సద్భావంగల మిత్రులూ, సెలవులు వెతికే పత్రికా విలేఖరులు, మితవాద రాజకీయ నాయకులూ, యే పక్షానికి చెందని ప్రసిద్ధులూ, విడుదలయిన కొంతమంది సత్యాగ్రహులు ఈ ఉద్యమాన్ని ఉపసంహరించవలసిందనీ మంత్రిత్వాలు తిరిగి స్వీకరించవలసిందనీ లేదా ఒక పక్కను మంత్రిత్వాలు పుచ్చుకొని రెండోపక్క సత్యాగ్రహము సాగించవలెననీ గాంధీని వత్తిడిచేస్తూ వచ్చారు. కాని ఆయన ఈమాటలను లక్ష్యపెట్టలేదు. గాంధీ ముందు వెనుకలు చూడక తన లక్ష్యాన్ని సాధించ తలచుకొన్నాడు. అయితే దేశంలో ప్రవహిస్తూన్న నూతన భావతరంగాలను ఆయన గమనిస్తూండక పోలేదు. గాంధీ భారత ప్రజానీకము యొక్క నాడిని యెప్పటి కప్పుడు పరీక్షిస్తూ సక్రమంగా చికిత్స సాగిస్తూన్నాడు. ఆయన ఘనవైద్యుని వంటి వాడు. రోగనిదానం చేయడంలోగానీ చికిత్సా విధానాన్ని నిర్ణయించడంలోగానీ ఆయన నిపుణుడు. ఆంత్ర జ్వరం (Enteric) సాధారణంగా మూడువారాలు ఉంటుందని ప్రతీతి. ఒకప్పుడది మూడు వారాలుదాటి నూట ఎనిమిదిరోజుల వరకూ కూడా సాగుతూ అందులో కొత్తకొత్త రోగచిహ్నాలూ ఇతమిత్థమని నిర్ణయించ డానికి వీలులేని అవాంతరాలూ కనపడవచ్చును. అప్పుడు అనుభవంలేని వైద్యుడికి అన్నీ సందేహాలే కలుగుతయి. ఇదివరకు తాను కాదనుకొన్న మలేరియా జ్వరమనియో ఇప్పుడు తాను కొత్తగా ఊహిస్తూన్న మరొక జబ్బనియో ఆయన తటపటాయించ వలసివస్తుంది. నిపుణుడైన వైద్యుడు ముందుగానే రోగనిదానం చేసుకొని చికిత్సను నిర్ణయించి ఔషధం ప్రారంభిస్తాడు. కొంచెం ఓర్పువహిస్తే కాలక్రమేణా జబ్బునయమయి తీరుతుంది. గాంధీ ఈ సత్యాగ్రహ చికిత్సలో నిపుణుడు. ప్రవాహమధ్యంలో

సూత్రాలను మార్చడం కానీ మాలిష్ చేయడం కానీ తగదు. గాంధీ ఈ సందర్భంలో నిమ్మకు నీరెత్తినట్లున్నారు, మిత్రుల ప్రోత్సాహములకుగాని శత్రుల నిరుత్సాహములకు గాని ఆయన చెవియొగ్గలేదు. కాని ప్రభుత్వాలు కాని రాజ్యాలు గానీ రక్తపాతంతో కూడిన యుద్ధాలకు అలవాటైన దౌర్జన్యమునకు ఒడిగట్టుతూండడంవల్ల సత్యాహింసలు వారికి నచ్చవు. సత్యాగ్రహులకు మార్గదర్శకములైన శాశ్వత సిద్ధాంతాలకు వారు అపార్థాలు కల్పించి నిందిస్తారు. యుద్ధం యొక్క రెండవ వార్షికోత్సవ సందర్భంలో రాజప్రతినిధి చేసిన రేడియో ప్రసంగమును అంతకంటె మరొక వ్యాఖ్యానం చెప్పడానికి వీలులేదు. ఆయన ప్రసంగమిది :—

"ఏమీ కృషిచేయకుండానే మన విజయంయొక్క ఫలమును పొందవలెనని కోరేవారు మనలో కొంతమంది ఉన్నారు. దేశం విపరీతమైన అపాయ పరిస్థితిలో ఉన్నప్పుడు సైతం ప్రజలలో చీలికలు కలిగించి యుద్ధ ప్రయత్నాలను బలహీనపరుస్తూ దేశీయుల విశ్వాసాన్ని విచ్ఛిన్నం చేయడానికి సిగ్గుపడనివారుకూడా కొందరున్నారు. ఇందుకు కారణా లేవైనా కావచ్చు;" కాంగ్రెసు ఉద్యమ ఫలితాన్ని గురించి ప్రభుత్వంవారేమనుకొన్నప్పటికీ, దాని స్వభావమునూ అది నడుస్తూన్న విధానమునూ గొప్ప పదవులలో ఉన్నవారు కూడా శ్లాఘించారు గాని నిరసించలేదు.

1940 లో పోలీసు శాఖా పరిపాలనమును గూర్చి ఒరిస్సా ప్రభుత్వంవారు చేసిన తీర్మాన మీదిగువ నుదాహరింపబడినది గమనించండి :—

> "ముఖ్యముగా ఈ సంవత్సరాంతమున ప్రారంభించబడిన సత్యాగ్రహోద్యమ సందర్భంలో పోలీసులకు అసాధారణమైన వత్తిడి కలిగింది. అయితే అదృష్ట వశాత్తూ ఉద్యమనాయకుడు పంపిన ఉత్తరువుల వలన ఈ రాష్ట్రంలో ఎక్కడా గల్లంతులు జరుగలేదు." (నాగపూరు టైమ్సు 28-8-41)

ఉద్యమాన్ని ఉపసంహరించవలసిందని గాంధీకి వత్తిడి ఎక్కువయింది. కాని ఆయన ఒకమాట అన్నాడు. "ప్రతి పనికి కొన్ని మినహాయింపులుంటవి. అలాగే ఈ ఉద్యమం విషయంలో కూడా కొన్ని మినహాయింపులు మరికొన్ని విప్రతిషేధాలూ ఉండవచ్చును. కనుక ఈ సత్యాగ్రహంలో ఒకసారి జైలుకు వెళ్ళివచ్చినవారు రెండవ పర్యాయం వెళ్ళడానికి వీలులేకపోతే వారు రాష్ట్రకాంగ్రెసు సంఘముల ద్వారా మినహాయింపును కోరవచ్చును. అప్పుడు వారి సంగతి ఆలోచించబడును. అయితే అలా మినహాయింపబడినవారు నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులుకావాలి. కాని వారి పేరులు సత్యాగ్రహుల జాబితాలోనుండి తొలగింపబడుతవి. యుద్ధం ప్రారంభమై రెండేళ్లు కడచినప్పటికీ ఇండియా పరిస్థితి యెప్పటివలెనే ఉంది. పత్రికా

విశేషకులు మాత్రం ఊహాగానాలు చేస్తున్నారు. రాజప్రతినిధి కార్యవర్గంలో కొత్త సభ్యులు చేరడంతోనే రాజకీయ ఖైదీలను విడుదల చేస్తారని ఊహించారు. అయితే ఈ వార్తలను ఖైదీలు లక్ష్యపెట్టడంలేదు. ఎందువల్లనంటే సత్యాగ్రహుల అభిప్రాయంలో, వాక్స్వాతంత్ర్యమును అంగీకరించడమే ఈ యుద్ధం న్యాయమైనదని నిరూపించడం. అయితే బ్రిటిష్ వారిండియాకు ఆ స్వాతంత్ర్యాన్ని లభింపచేస్తారని ఊహించడానికి కూడా వీలులేదు. వాక్స్వాతంత్ర్యం లభిస్తే దేశానికి స్వాతంత్ర్యం వచ్చి చేరుతుంది. దేశంలో అనేకులనేక రకాలుగా ఊహిస్తున్నారు. అనేక సంశయాలను వెల్లడిస్తున్నారు. వీటన్నిటినీ తుదముట్టించడానికా అన్నట్లు సెప్టెంబరు 9వ తేదీని పార్లమెంటులో చర్చిలు ఒక వింత ఉపన్యాసం చేశాడు. ఆ నెలలో సాధారణంగా పార్లమెంటు సమావేశమవడం ఆచారంలేదు. కాని పార్లమెంటు సభ్యులకు యుద్ధ పరిస్థితులను గూర్చి తెలియజేయడానికా అల్పకాల సమావేశం జరుపబడింది. అట్లాంటిక్ ఛార్టరును గూర్చి మాట్లాడుతూ 1941 ఆగష్టు 8వ తేదీని రాజప్రతినిధి యిచ్చిన ఉపన్యాసాన్నే చాలావరకు చర్చిలు తిరిగీ వల్లించాడు. అధినివేశ ప్రతిపత్తి అనే మాట ఆయన ఉచ్చరించనేలేదు. ఒక సంవత్సరం కిందట అమెరీ కొత్తగా సృజించిన "స్వేచ్ఛాపూర్వక సమానభాగస్వామ్యం" అనే మాటలను మాత్రమే. ఆయనకూడా వాడాడు ప్రెసిడెంటు రూజ్వెల్టుతో జరిగిన అట్లాంటిక్ సమావేశం తరువాతి చర్చిలు చేసిన మొట్టమొదటి ప్రసంగంలోనే, వారి ఉభయుల ప్రకటనా ఇండియాకెంతవరకు వర్తిస్తుందో స్పష్టీకరించి లోకుల ఊహలకు తావు లేకుండా చేశాడు. ఆయన చెప్పిన మాటలివి :—

"ఇండియా బర్మాదేశాల యొక్కయు, బ్రిటిష్ సామ్రాజ్యంలోని తదితర భాగాలయొక్కయు రాజ్యాంగ పరిణామమును గూర్చి అప్పుడప్పుడూ చేయబడుతూ వచ్చిన వివిధ ప్రకటనలలో ఇప్పుడు మేముభయులమూ కావించిన ప్రతిపాదన వలన యేమీ మార్పురాలేదు. 1910 ఆగష్టు ప్రకటన ప్రకారం బ్రిటిష్ కామన్వెల్తులోని తక్కిన జాతులతోపాటు ఇండియా కూడా స్వేచ్ఛాపూర్వక సమాన భాగస్వామ్యమును పొందేటందుకు సహాయపడడానికి మేము అచ్చుకొన్నాము. అయితే ఇండియాతో మాకున్న చిరసంబంధమునుబట్టి తటసించిన మా కర్తవ్యములనూ, ఆ దేశంలోని వివిధ మతస్థులయెడ, వివిధ జాతులయెడ. వివిధ ప్రయోజనాలుకల వారియెడల మాకుగల బాధ్యతలను మేము నిర్వర్తించక తప్పదు.

"నాజీల చేతికింద పడిఉన్న యూరోపియన్ జాతులయొక్కయు ప్రభుత్వాల యొక్కయు జాతీయ జీవితమును స్వయం పరిపాలనా స్వాతంత్ర్యములనూ విస్తరింప

చేయడమున్నూ, దేశాల సరిహద్దులలో మార్పులు జరుగవలసి ఉంటే వాటిని ఎలా చేయవలెననే సిద్ధాంతములున్నూ మాత్రమే అట్లాంటిక్ సమావేశంనాడు మా మనస్సులో ఉన్న ప్రధాన విషయాలు.

"బ్రిటిష్‌రాజు నెడల భక్తి విశ్వాసములను చూపవలసిన ప్రజల ప్రదేశముల లోని స్వపరిపాలనా సంస్థల క్రమ పరిణామమునకు సంబంధించిన సమస్యకాదది. అది ఒక ప్రత్యేక సమస్య. ఈ విషయాలలో మేము సమగ్రమైన ప్రకటనలను చేసి ఉన్నాము. వాటిలో ఎక్కడా సందిగ్ధతకు తావులేదు, అవి ఆయా ప్రదేశాలలోని ప్రజల పరిస్థితుల కనుగుణంగా చేయబడ్డవి. మా ఉభయుల సమిష్టి ప్రకటనకూ కారణ భూతములైన స్వాతంత్ర్యమూ, న్యాయమూ అనే సిద్ధాంతాల కవికూడా పూర్తిగా అనుకూలంగానే ఉన్నవి."

చర్చిలు ఇండియానుగూర్చి ఇటువంటి ఉపన్యాసాలు చిరకాలంనుండీ చాలా యిస్తూవచ్చాడు. ఇది ఒక మచ్చు తునక.

ఇంకా కొన్నిటిని ఈ దిగువ ఉదహరిస్తూన్నాము. రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కాగానే కామన్సుసభలో చర్చిలు యిలా మాట్లాడాడు :—

"కేవలం కృత్రిమమూ, సంకుచితమూ అయిన ఈ భాగత రాజకీయనాయకుల గూడుపుఠాణీ వర్గమునకు ఆ బాధ్యతను ఒప్పచెప్పడం, అభివృద్ధి నిరోధకచర్య. అది లజ్జాకరమైన పని. అది అవమానకరం: పిరికితనం; నమ్మినవాళ్ళను జారవిడవడం," 1930 వ సంవత్సరంలో చర్చిల్ యిటువంటి భావాలనే వెల్లడించి ఉన్నాడు. ఈ సందర్భంలో కొండటికవి జ్ఞాపకం రావడం సహజం, ఆయన పరిణతవయస్కుడు కాకమునుపు వ్రాసుకొన్న స్వీయచరిత్రలో "యుద్ధాలు కానీ, యితర పోరాటాలు కానీ మనకున్న బలమంతా వినియోగించి సంపూర్ణ విజయం కలిగేవరకూ చేయాలి. ఆ తరువాత ఓడిపోయిన వారితో స్నేహం చేసుకోవడానికి సంసిద్ధంగా ఉండాలి. ఇదే నేనెప్పుడూ చెప్పేమాట. యుద్ధసమయంలో ఉపేక్షవహించేవారినీ, యుద్ధానంతరం బింకం చూపేవాళ్ళనీ చూస్తే నాకు భ్రాంతిగా పడదు......

"ఐరిష్‌వారిని ఓడించి తరువాత వారికి స్వపరిపాలనను ప్రసాదించి ఉండవలసింది. జర్మనులను పస్తుపెట్టిన తరువాత వాళ్ళకు కావలసిన ఆహారం పంపి ఉండవలసింది, ఇదే నా అభిప్రాయం......యుద్ధంలో గెలిచినవాళ్లు సరియైన సంధిచేసుకోలేరు. సరియైన సంధిచేసుకోగలవాళ్లు యుద్ధంలో గెలువలేరు. నేను రెండింటికీ సమర్థుడనని చెప్పడం బహుశా అధిక ప్రసంగం కావచ్చు.'"

"భారతజాతీయ జీవితాభ్యుదయములపైన బ్రిటిష్‌వారికున్న సంపూర్ణాధికారములను ఏ మాత్రమూ విడిచిపెట్టుకోవడానికి వారిష్టపడరు. మా రాజుగారి మకుటంలో మహోజ్జ్వలంగా వెలుగొందుతూన్న ఆ మహార్ఘ్య మణిని జారవిడవడం మాకిష్టంలేదు. మాకుగల అన్ని అధినివేశములలోకీ, అన్ని సామంతరాజ్యములలోకీ, ఎక్కువగా ఇండియా ఒక్కటే బ్రిటీషు సామ్రాజ్యముయొక్క కీర్తినీ, బలమునూ ప్రతిష్ఠిస్తూన్నది."

1933 మార్చి 29 న చర్చిలు కామన్సుసభలో యిలా ప్రసంగించాడు :

"మనకిప్పుడున్న విస్తారమైన విదేశసంబంధాలు, సగానికి సగం పడిపోయిన మన ఎగుమతి వ్యాపారము, చాలావరకు క్షీణస్థితికి వచ్చిన మన నౌకాయానము, మన సాంఘిక ప్రయోజనములకొరకు పన్నువిధింపబడిన విదేశీ పెట్టుబడులనుండి మనకు వచ్చే ఆదాయమూ లేకుండా వున్నట్లయితే మన దేశంలో కోటీ యాభైలక్షలమందికి కూడు దొరకదు. ఈ దీవులలోని ఇరవై ముప్పయి లక్షలమంది జనులు మన దేశంలోనూ ఇండియాదేశంలోనూ పరస్పర క్షేమంకోసం పనిచేస్తూండడం వలన జీవిస్తున్నారని నా ఊహ. 1935 వ సంవత్సరం 29 వ జనవరిని చర్చిలు చేసిన రేడియో ప్రసంగంలోని వాక్యాలీ దిగువవి :—

"బ్రిటనులోని కూలీలవిషయంలో ఇండియా చాలా పనిచేయవలసి ఉంది లాంకషైరు బట్టలమరలలోని కూలీలది బాగా గ్రహించారు. ఇప్పటి కప్పుడే వారిలో లక్షమంది ప్రభుత్వంవారి బిచ్చం పైన బ్రతుకుతూన్నారు. ఇప్పుడు మనము ఇండియాను పోగొట్టుకొన్నయెడల, దురదృష్టవశాత్తూ స్వయం పరిపాలితమైన ఐర్లండు దేశం మన యెడల యే వైఖరిని అవలంభిస్తూన్నదో అటువంటి వైఖరినే స్వతంత్ర భారతదేశంకూడా అవలంబించే యెడల ఈ దేశంలో ఇరవైలక్షలమంది కష్టజీవులు వీధులలో క్రిక్కిరిసి పనులు సంపాదించుకోవడానికి లేబరు ఎక్స్చేంజెస్ కడ బారులు తీర్చి నిలబడవలసి వస్తుంది."

బ్రిటనులోని మధ్యతరగతులవారి క్షేమం కోసం ఇండియా నిరంతరం పరాధీన దేశంగా ఉండడం ముఖ్యావసరం. ఈ సంగతి చర్చిలు ఎల్లప్పుడూ ఘోషిస్తూనే ఉన్నాడు. 1933 జులై 8 వ తేదీని ఎప్పింగులో చర్చిలు ఇలా మాట్లాడాడు.

"బ్రిటను క్షేమానికి ఇండియా ఆయువుపట్టు. మన ప్రజలకు మంచి ఊతమిస్తూన్న శక్తులు క్రమక్రమంగా క్షీణించి పోవడం చూస్తే నాకు చాలా ఆదుర్దాగా ఉంది. మన విదేశీ పెట్టుబడులు అంతకంతకు తగ్గిపోతూన్నవి. మన నౌకావ్యాపారం చాలా హీనస్థితికి వచ్చింది. వీటికి తోడు ఏదో ఒకరూపంలో ఇండియానుకూడా

పోగొట్టుకోనేయెడల మనమిదివరకెన్నడూ ఎరుగని వర్ణించడానికి వీలులేని క్లిష్టపరిస్థితులలో చిక్కుకొంటాం. ప్రభుత్వం వారు సరిగా పోషించడానికి సాధ్యం కానంత ఎక్కువమంది జనం ఉంటారక్కడ."

యుద్ధానికి ముందు కాన్‌స్టిట్యూషనల్ క్లబ్‌లో మాట్లాడుతూ చర్చిలు ఇలా అన్నాడు:

"ఇండియాకు రాజకీయ సంస్కరణములనూ, స్వపరిపాలనమునూ విస్తరింప చేయవలెనని పార్లమెంటువారు భావించిననాడే మనకు తెలియకుండా ఒక మహా ప్రమాదం జరిగింది. ఇండియాలోని మా హక్కులనూ, ఆస్తులనూ, రక్షించుకోవడానికి మీరు సంసిద్ధంగా లేకపోయినట్లయితే అక్కడ మీకున్న సర్వస్వమునూ పోగొట్టుకొని ఆ తీరములనుండి అవమానకరంగా తోలివేయబడతారు. ఇండియాపోతే మన మిదివరకు కూడబెట్టుకొన్నదంతా నాశనమైపోతుంది."

వెస్టు ఎస్సెక్సు కన్సర్వేటివ్ అసోసియేషన్ కౌన్సిలువారి యాజమాన్యం కింద ఇండియా యొక్క అధినివేశ ప్రతిపత్తినిగూర్చి చర్చిస్తూ చర్చిల్ ఇలా మాట్లాడాడు.

"మన జీవితంలో కానీ మనం దానినిగూర్చి ఆలోచించడం ప్రయోజనకరంగా ఉండే మరొక సమయంలో కానీ, ఇండియాపై ఆశయాన్ని పొందడానికి అవకాశం లేదని స్పష్టంగా చెప్పడం ముఖ్యావసరం.........అంతమంది ప్రజల క్షేమమును భారతరాజకీయవర్గాల హస్తగతంచేయడం బుద్ధితప్పు.

ఇండియానుగూర్చి ఈ విధంగా ఆలోచించే ఒక్క చర్చిలే కాదు. బ్రిటిష్ పత్రికలన్నిటికంటెనూ ఎక్కువ విశాలభావాలు కలిగిన పత్రిక అని పేరుగాంచిన మాంఛెస్టర్ గార్డియన్ ఎలా వ్రాసిందో చూడండి:—

"తన స్వార్థమును గూర్చి ఆలోచించుకొనే ఇంగ్లాండుదేశం ఇండియాపైని తన అధికారాన్ని సడలించడానికి రెండు ముఖ్యకారణాలవల్ల సందేహిస్తూన్నది. ఒకటి, ఇండియానుండి అవసరమైనప్పుడు యుద్ధసామగ్రినీ సైన్యాలనూ సేకరించుకోవడానికి ఇంగ్లాండుకుగల అధికారంవలననే తూర్పుదేశాలలో దానికి పలుకుబడి ఉండడానికి కొంత కారణం. ఇండియా అధినివేశమయితే ఆ అధికారం ఇంగ్లాండుకు పోతుంది. రెండు, ఇండియాదేశం ఇంగ్లాండుకు మంచి వ్యాపారస్థలం. ఇంగ్లాండు ఇండియాలో వెయ్యి మిలియనుల పౌనులు పెట్టుబడి పెట్టింది."

చర్చిల్ ప్రసంగమునుగూర్చి గాంధీ అభిప్రాయమును పత్రికావిలేఖకులు కోరగా ఆయన చెప్పనిరాకరించాడు. తాను చెప్పే మాటలకంటె తాను నడుపుతూన్న ఉద్యమమూ తన మౌనమే చర్చిలుకు తగిన సమాధానమని ఆయన అభిప్రాయం.

"నేనలా అనుకోకుండా ఉన్నట్లయితే, మీరు కోరకుండానే నాఅంతటనేనే ఒక ప్రకటనచేసి ఉండేవాణ్ని. కాని నేను చెప్పేమాటలకంటె కూడా నామౌనమే ఎక్కువ వక్తృత్వాన్ని ప్రదర్శిస్తున్నదని నానమ్మకం. ఇంతా అయితే క్రియకదా మనకు ప్రధానం. నేను చేస్తూన్నపని అఖిలభారత దేశమునకేగాక ప్రపంచానికంతకూ తెలుసు" అన్నాడుగాంధీ. అప్పుడప్పుడూ చర్చిలు చేస్తూవచ్చిన ప్రకటనలవలన ఎవ్వరూ ఆశాభంగం పొందనక్కరలేదు. ఇటీవల ఆయన కావించిన ప్రకటనవలన ఎవ్వరికీ కోపం రానక్కరలేదు. గాంధీ వాటిని తక్షణం తోసివేయడం చాలా మంచి పని

రాష్ట్రశాసన సభల ఎన్నికలను వాయిదా వేయవలసిందని తేబడిన బిల్లు మూడవసారి పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడు పూర్వం చెప్పినకారణాలను పునరుద్ఘాటిస్తూ అమెరీ యింకా యిలా అన్నాడు:- "ఈసభలోనున్న ఒక పక్షమే. కాక అన్ని పక్షాలవారూన్నూ, దేశంలోని ప్రజానీకం యావత్తున్నూ కూడా సాధ్యమైనంత త్వరలో ఇండియా, బ్రిటిష్ కామన్‌వెల్తులో "స్వేచ్ఛాపూర్వక సమాన భాగస్వామి గా" ఉండవలెనని హృదయపూర్వకంగా కోరుతున్నారు:

"అట్లాంటిక్ ఛార్టరు కొత్తసిద్ధాంతాన్ని దేనినీ ప్రతిపాదించడంలేదు, అంతకు పూర్వమే మేమాసిద్ధాంతాన్ని ప్రతిపాదించి ఉన్నాము, దానిని ఆచరణలోకూడా పెట్టవలసిఉంది. భారతీయులందఱూ తమలో తాము సమాధానం కుదుర్చుకొని నడపడానికి వీలైన భారతీయ ప్రభుత్వమునకు భారతీయ వ్యవహార నిర్వాహణమును అప్పగింతచేసేటందుకు తగిన ప్రణాళికలను సమర్పించి సహాయపడినయెడల, వెంటనే పని జరుగవలెనని ఆతురపడుతూన్న సభ్యులందఱికీ నేను కృతజ్ఞుడనుగా ఉంటాను."

లిన్‌లిత్‌గో ప్రభువుయొక్క ఉద్యోగ కాలపరిమితిని మళ్లీ పొడిగించడం కూడా ఈ అభిప్రాయాల కనుగుణంగానే ఉంది

భారతదేశ స్వపరిపాలనమునకు దారి చేస్తున్నామని చెప్పే బ్రిటిష్ రాజనీతిని జవహరలాలు కారాగార నిర్బంధముతో ఎలా సమన్వయం చేయడమని అమెరీని అడుగగా, ఆ భారత నాయకుడు యుద్ధప్రయత్నాలకు భంగం కలిగిస్తూన్నాడని అమెరికా కోసం చేసిన రేడియో ప్రసంగంలో ఆయన జవాబుచెప్పాడు. జవహరలాలు

జైలులో ఉన్నాడుగదా అని ఆమెకీ ధైర్యంచేసి ఉంటూ ఈ మాటలు చెప్పడానికి. "స్వజ్ఞ న్యయుతములో, కోపకారణములూ ఆయన యుద్ధ ప్రతికూలోపన్యాసాలను" జవహర లాలు బుద్ధిపూర్వకంగా చేశాడని చెప్పడానికి ఆమెకీ యెంతో మొండివాడయి ఉండాలి. జవహరలాలును 'క్విస్లింగ్' అన్న నాగపూర్ డిప్యూటీ కమీషనరు ఎంత మొండివాడో ఆమెకీకూడా అంత మొండివాడై యుండాలి. అయితే నాగపూర్ కమీషనర్ ఎ. జి. యఫ్. ఫర్కుహార్ (A. G. F. Farquhar) తరువాత 'అత్యంత హృదయ పూర్వకంగా' క్షమాపణ చెప్పాడు.

ఫరుకుహార్ వ్రాసిన ఉత్తరమిది :—

తేది సెప్టెంబరు, 15, 1941

నాగపూరు టైమ్సు పత్రికకు.

అయ్యా!

నేను పండిత జవహరలాలునెహ్రూను క్విస్లింగు అన్నానన్న ప్రకటన పూర్వా పర సందర్భాలనుండి విడదీయబడి స్పష్టంగా అచ్చులో కనపడ్డప్పుడు దానినిగూర్చి సహజంగా ఎటువంటి వ్యాఖ్యానాలు చేయబడతవో ఆలోచించుకొని కంగారు పడ్డాను. ఒక తుంటరి సమావేశంలో కలిగిన ఉద్రేకం వలన అవిధంగా వ్యాఖ్యానం చేయడానికి వీలైన మాటను నేనన్నందుకు తక్షణం అత్యంత హృదయపూర్వకంగా క్షమాపణ చెప్పనుద్యుక్తుడ నయినాను.

పి యం. నాయుడుగారికి నేను వ్రాసిన ఉత్తరం ప్రచురించబడిన సంగతి చూచాను. అందులో నే నా మాట ఎందుకనవలసి వచ్చిందో ఏ అర్థంలో అన్నానో వివరించి ఉన్నాను. ఆ మాటను నేను ప్రయోగించినందువల్ల మనస్సునకు కించగలిగిన వారు నా క్షమాపణను అంగీకరించి ఈ వివాదానికి ఇంతటతో స్వస్తి చెప్పవలసిందని నేను కోరుతూన్నాను.

భవదీయ విధేయ సేవకుడు,

ఏ. జి. యఫ్. ఫర్కుహార్.

సర్ సికందరు జాతీయరక్షణ సంఘంనుండి (National Defence Committee) రాజీనామా యిచ్చిన తరువాత పంజాబుకు క్రొత్తగా గవర్నరయిన సర్ బెట్రాండ్గ్లాన్సీకి విందుచేశాడు. ఆ సందర్భంలో తాను నూటికి నూరుపాళ్ళు పంజాబీగా ఉండ నిచ్ఛగిస్తూన్నట్లు ప్రకటించాడు - అనగా మతభేదాలతో తనకు

సంబంధం లేదని అర్థం. తరువాత అక్టోబరు ఒకటో తేదీని సర్ సికందరు పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ ఇటీవల చర్చిల్ చేసిన ప్రకటన యావద్భారతదేశంలో ఏవిధంగా కోపకారణమయి విమర్శకు గురియైనదో వివరించాడు. ఆ ప్రకటన ఉద్దేశం కానీ అవసరంకానీ తనకర్థం కాలేదన్నారు. అది ప్రజలలో నిరాశనూ ఆశ్చర్యమునూ కలిగించినదనీ బ్రిటిష్‌వారి మిత్రుల మనస్సులను చీకాకు పెట్టిందనీ వెల్లడించాడు. ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించడానికి కాలపరిమితిని నిర్ణయిస్తూ యుద్ధకాలంలోనే ఇండియా రాజ్యాంగచట్టమును తయారుచేసేటందుకొక కమిటీని వేసి ఒక అసందిగ్ధమైన ప్రకటనను చర్చిలు చేయవలెనని సర్ సికందరు కోరాడు. సర్ సికందరు చేసిన ఈ ప్రకటనను టైమ్సు ఆఫ్ ఇండియా తక్షణం ఆమోదిస్తూ యిలా అంది "చర్చిల్ ప్రకటన ఇండియాలో చాలా అనర్థదాయకమైన అభిప్రాయం కలిగించింది. ఇది కాదనడానికి వీలులేదు" రాజప్రతినిధి విస్తృత కార్యనిర్వాహకమును గూర్చి చేయబడిన ప్రకటనయున్నూ నేషనల్ డిఫెన్సుకౌన్సిలు (జాతీయ రక్షణ సంఘం) నిర్మాణమున్నూ కలిగించిన సుహృద్భావంలో చాలాభాగం చర్చిలు చేసిన ఈ ప్రకటనతో నాశనమయింది. బ్రిటిష్ ప్రభుత్వంవారూ ఇండియా ప్రభుత్వంవారూ ఈ రహస్యం తెలుసుకొని మెలకువతో మెలగవలసి ఉంది.

ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించని యెడల తాను స్వయంగా బ్రిటనుతో పోరాడ సంసిద్ధుడననీ సర్ సికందరు యుద్ధం ప్రారంభమైన కొద్ది రోజులకే స్పష్టంగా ప్రకటించాడు. ఆయనే యిప్పుడు చర్చిలు ప్రకటనలోని సరియైన అర్థం తనకు తెలియలేదంటున్నాడు. యుద్ధంలో బ్రిటనుకు సంపూర్ణంగా సహాయపడవలెనని పట్టుదలతో పనిచేస్తూన్న సర్ సికందరు వంటి ఒక రాష్ట్ర ప్రధాని, బ్రిటిష్ ప్రధాన మంత్రి కుండ పగులగొట్టినట్లు చేసిన ప్రకటనయొక్క మొరటుతనానికి తాను పూర్తిగా ఆశాభంగం చెందినాననీ, చర్చిల్ ఆ ప్రకటన చేయకుండా ఉంటే బాగుండేదనీ, అది ఇండియాలోనున్న బ్రిటిష్ మిత్రులకు చీకాకు కలిగించిందనీ అనడం అల్ప విషయం కాదు.

బ్రిటిష్ ప్రధాని ప్రకటనను గూర్చి అనుకోకుండా వచ్చిన సర్ సికందరు విమర్శనము అంత ఎక్కువ ఆదరణపాత్రము కాలేదు. దానిని గురించి కాంగ్రెసేమీ మాట్లాడలేదు. తనకు బయటనుండి వచ్చే సహాయాన్ని స్వీకరించడానికి కాంగ్రెసెప్పుడూ సంసిద్ధంగానే వుంటుంది కాని ఆ సహాయం చివరదాకా ఉంటుందనే నమ్మకం మాత్రం కాంగ్రెసుకు లేదు. పంజాబు ప్రధాని ముందు ముస్లిం నాయకులను చక్కదిద్దితే బాగుంటుందన్నారు హిందూమహాసభవారు. గాలితో పోట్లాడడం

రాజకీయ చాతుర్యం కాదని ఢిల్లీనుండి అవహేళన బయులుదేరింది. చర్చిలునుండి కొత్త ప్రకటనను కోరుతున్నాడు సర్ సికందరు! బహుశా ఏమైనా గారడీ చేయ వంటున్నాడా ఏమిటన్నారు బొంబాయివారు. సర్ సికందరుకు కొట్టడం యిష్టమే కాని గాయపరచడానికి జంకుతున్నాడని కలకత్తావారు విమర్శించారు. చర్చిల్ కొత్త ప్రకటనతోపాటు ఆచరణకూడా కనపడడం మంచిదని లక్నో వారభిప్రాయమిచ్చారు. ఇండియాకు ఇంతకుముందు చేయబడని వాగ్దానమేదీ కూడా ఇప్పు డట్లాంటిక్ చార్టరులో లేదు కాని చర్చిల్ చేసిన ప్రకటన ఇండియా ఆశలను భగ్నంచేసిన మాట వాస్తవం. ఇండియా అసలు అటువంటి ఆశలు పెట్టుకోవడమే తప్పంటారా అది వేరేమాట. కాబట్టి సర్ సికందరు చెప్పిన "కారణాలు తప్పయినా పర్యవసానం ఒప్పు." అని మద్రాసువారు వ్యాఖ్యానంచేశారు. చర్చిలు ఆ సమయంలో అటువంటి ప్రకటన చేయడం యేమీ బాగాలేదని సర్ సికందరుతో ఏకీభవించారు లాహోరు వారు. భారతీయుల మానసిక ప్రవృత్తిలో అది యెటువంటి దుష్పరిణామాలను కలిగిస్తుందో బ్రిటిష్ ప్రధాని సరిగా యోచించినట్లులేదనీ, ఆయన మాటలు అపోహలకు వీలుకలిగించడమే కాక తప్పు వ్యాఖ్యానాలకు దారితీస్తున్నవనీ వారు విమర్శించారు. ఇండియాప్రజలలో ఆప్రకటన దురదృష్టకరమయిన అభిప్రాయం కలిగించినదని వ్రాసింది "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రిక.

అమేరికావారి ప్రశ్నావళికి అమెరీ యిచ్చిన ప్రత్యుత్తరాలు పరిస్థితులను మఱింత గందరగోళం చేసినవని సర్ సికందర్ అభిప్రాయపడి ఈవిధంగా తన అంతిమ సందేశాన్ని ప్రకటించాడు :—

> "తాను సూచించిన ప్రకారం ప్రకటన రెండు మూడు వారాలలో రానియెడల భారత రాజకీయపక్షాల ఐక్యసంఘటన యేర్పడవలెనని ఉద్బోధించడానికి తాను జంకనన్నాడు."

ప్రజా ప్రభుత్వాలు సాగుతూన్న నాలుగు రాష్ట్రాలలో — అనగా పంజాబు, బెంగాల్, అస్సాం, సింధురాష్ట్రాలలో మొదటి రాష్ట్ర ప్రధాని, తక్కిన మూడు రాష్ట్రాలలో అనాడు నడుస్తూన్న ద్వంద్వ పరిపాలనము యెడల ఆయా రాష్ట్ర ప్రధాను లవలంబిస్తూన్న వైఖరికి కేవలం భిన్నమైన వైఖరిని అవలంబించాడు. పంజాబు ప్రధాని సర్ సికందరు డిఫెన్సు కౌన్సిలునుండి రాజీనామా యిచ్చాడు. బెంగాల్ ప్రధాని ఫజ్ లుల్ హక్ డిఫెన్సు కౌన్సిలునుండీ, ముస్లింలీగు కార్యవర్గము నుండీ కూడా రాజీనామా యిచ్చాడు. సింధు ప్రధాని అల్లాబక్సు రెండింటిసీ ఒప్పుకో లేదు గనుక ఆయన దేనికీ రాజీనామా ఈయవలసిన అవసరం లేకపోయింది.

అస్సాం ప్రధాని సర్ సాదుల్లా అనారోగ్య కారణంగా డిఫెన్సు కౌన్సిలు సభ్యత్వానికీ ప్రధాని పదవికీ కూడా రాజీనామా ఇయ్యబోతున్నాడని మొట్టమొదట ప్రకటించబడింది. కాబట్టి ఈ నలుగురూ ఆనాటి ప్రధాన సమస్యలను గూర్చిగానీ, ప్రకటనలను గూర్చిగానీ రాజకీయాలను గూర్చిగానీ ఏకాభిప్రాయం కలిగి ఉన్నట్లు ఎవ్వరూ అనుకోవడానికి వీలులేదు సర్ సికందరు ప్రకటనరాగానే 1941 అక్టోబరు నాలుగో తేదీని సిమ్లానుండి ఖాన్ బహాదూరు అల్లాబక్సు ఒక ప్రకటన చేశాడు. అది ఇదుగో:—

"సర్ సికందర్ హయత్‌ను నేను సరిగా అర్థంచేసుకొన్నట్లయితే ఆయన కోరేది ఆ ప్రకటనను పునరుద్ఘాటించమని కానీ పునశ్చరణ చేయమని కానీ కాదు. ఇండియా రక్షణను గూర్చి సహాయపడడానికి ముందుకు వచ్చినవారు కానీ సర్ సికందరుకు 'శత్రులు'గా గాక మిత్రులుగా ఉన్నవారు కానీ భావిభారత రాజ్యాంగ నిర్మాణం విషయంలో ప్రత్యేకాభిమానమునకు పాత్రులు కావలెనని ఆ ప్రకారమొక కొత్త ప్రకటన చేయబడవలెననీ ఆయన కోరిక. అనగా ఆయన ఉద్దేశించే రాజ్యాంగచట్టంలో అందరికీ సమానహక్కులూ, సమానాధికారాలూ ఉండవని భావం. అయితే యుద్ధసన్నాహాలకు తోడ్పడ్డవారి మాట మాత్రం ఎక్కువగా చెలామణీ కావలెనట. అటువంటి వైఖరి అత్యంతం విషాదకరమని మాత్రం సంగ్రహంగా చెప్పగలను."

పంజాబు ప్రధానియొక్క ఈ వైఖరి భారతీయ సమస్యను పరిష్కరించడానికి బదులుగా దేశారిష్టదాయకంగా పరిణమించి యింకా ఎక్కువ చిక్కులను తెచ్చిపెట్ట గలదని ఖాన్ బహదూరు అల్లాబక్షు ప్రకటించాడు.

"చర్చిలు మరొక కొత్త ప్రతిపాదన చేయవలెనని పంజాబు ప్రధాని అక్టోబరు ఒకటో తేదీని చేసిన ప్రకటనను చూచి" పంజాబు ప్రధాని కోరిన షరతులతో కొత్త ప్రతిపాదన రాకపోతే ఆయన యేమి చేయదలచుకొన్నాడు?" అని సింధు ప్రధాని ప్రశ్నించాడు. దానికి ప్రత్యుత్తరంగా ఇండియా ఐక్య సంఘటితం కావలెనన్నాడు. పంజాబు ప్రధాని. తరువాత సింధు ప్రధాని యింకా యిలా అన్నాడు.

"సత్యాగ్రహం వలనకానీ, అట్లాంటిక్ ఛార్టరును వర్తింపచేయడం వలనకానీ ఇండియా స్వాతంత్ర్యమును పొందదనీ వివిధ యుద్ధరంగాలలో భారతయోధులు ప్రదర్శించే త్యాగ సాహసముల వలన మాత్రమే భారతదేశం స్వతంత్రమవుతుందనీ అన్నాడు సర్ సికిందరు హయత్ తన అక్టోబరు ఒకటో తేదీ ప్రకటనలో. అంతటితో

ఊరుకోక దేశంలోని వివిధ మతస్థుల మధ్య పరస్పర విశ్వాస సుహృద్భావములు పెంపొందని యెడల ఆ త్యాగశౌర్యములు కూడా ప్రయోజనకరములు కాకపోవచ్చు నని సందేహించా డాయన.

"సర్ సికందరు అభిప్రాయాలకు ఆయన చెప్పినమాటలు అనుగుణంగా ఉన్నట్లయితే, వివిధ మతస్థులమధ్య పరస్పర విశ్వాస సుహృద్భావములను పెంపొం దించడానికి ఆయన శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించాలి. అంతేకాని ప్రకట నలకోసం వేచియుండకూడదు. ఇండియాలో ఐకమత్యమూ సుహృద్భావమూ చాలా అవసరం. పంజాబు ప్రధాని చెప్పినట్లవి ఇండియా చిక్కులన్నిటినీ తీర్చగలవికావు.

"బ్రిటిష్ ప్రభుత్వం వారింతకుపూర్వం చేసిన ప్రకటనలన్నీ చర్చిలు ప్రకటనతో తుడిచిపెట్టుకొని పోయినవనీ నేనభిప్రాయపడడంలేదు. వారింతకు ముందుచేసిన ప్రక టనలను రద్దుచేయవలెననే ఉద్దేశం తమకులేదని చర్చిలు ప్రభుత్వాన్ని కొత్తగా ప్రక టన చేయవలసిందని సర్ సికందరు హయత్ కోరినట్లయితే అందులో యేమీ కష్టం లేదని నానమ్మకం.

"కాని ఇండియాలోని అనేకమంది రాజకీయనాయకులు బ్రిటిష్ ప్రభుత్వంవారి పూర్వ ప్రకటనలతోనే అసంతృప్తిని చెంది ఉన్నారు. సర్ సికందరుమాత్రం వారిలో ఒకడుకాడు. అయితే ఆ ప్రకటనలనే పునశ్చరణచేయమనికానీ పునరుద్ఘాటించమని కానీ అనడంవలన యేమి ప్రయోజనము?

"పంజాబులోని అన్నివర్గాలకూ అన్ని సంఘాలకూ ప్రాతినిధ్యం వహించిన ప్రధానిగా తాను యుద్ధసన్నాహాలకు దోహదం చేస్తున్నానని సర్ సికందరే స్పష్టంగా చెప్పాడు. అటువంటి సందర్భంలో యుద్ధసన్నాహాలకు సహాయపడినందు వలన వచ్చే ప్రయోజనంలో అందరూ సమాన భాగస్వాములుగా ఉండాలి అంతే కాని ఎవరో ఒక ప్రత్యేక వర్గంవారుకానీ ప్రత్యేక సంఘంవారుకానీ దానిని పూర్తిగా అనుభవించకూడదు.

"ప్రస్తుత రాజ్యాంగ చట్టంలో ఉన్న కొన్నిలోపాలవల్లనే ఇండియా సమస్య లను పరిష్కరించడానికి చిక్కులు తటస్థిస్తున్నవని సర్ సికందరుకు తెలుసు.

"ఈ లోపాలిలాగే శాశ్వతంగా ఉండవలెనని ఆయనకూడా నిజంగా కోరడు. కాని కొత్తగా ప్రత్యేక హక్కులూ అధికారాలూకల ఒక వర్గాన్ని సృజించవలెనని ఆయన కోరిన కోరికవలన ఈ లోపాలింకా బలవత్తరమై, యిదివరకుకంటెకూడా ఎక్కువ ప్రతిష్టంభన తటస్థించగలదు.

"సర్ సికందరు హాయత్ ఖాన్ కోరుతూన్న ప్రకారం దేశంలోని కొన్ని వర్గాలవారియెడల ప్రత్యేక పక్షపాతంచూపుతూ ప్రకటనచేయడం బ్రిటిష్ ప్రభుత్వం వారికి కూడనిపని. అటువంటి ప్రకటనలవలన సర్ సికందరు వాంఛిస్తూన్నట్లు వివిధ మతస్థులలో పరస్పరవిశ్వాస సహృద్భావములుకలగడం అసంభవం. కనుక అది ఆయన ముఖ్యాశయానికే భంగం కలిగిస్తుంది. ఆ ప్రకటనయూ అటువంటి ప్రకటన కావలెనని వాంఛించేవారి దృక్పథమూకూడా వివిధమతస్థులలో విద్వేషాలకూ పరస్పర కలహాలకూ కారణభూతములై బ్రిటిష్ ప్రభుత్వాన్ని మరింత చీకాకు పఱచగలవు.

"బ్రిటిష్ ప్రభుత్వమింతవఱకూ ఇండియాలోని వివిధ సంఘాలకు ఐకమత్యం కుదరవలెనని ఆతురపడుతున్నది. ఒక ప్రత్యేకవర్గంకానీ సంఘంకానీ అన్యాయమైన కోరికను దేనిని కోరినప్పటికీ బ్రిటిష్ ప్రభుత్వంవారు దానిని నిరోధించడంవలననే వారి ఆశయం నెరవేరగలదు. ముఖ్యంగా ఆకోరినవారు ఇతరవర్గాలతో కలిసిపోతామని బెదరించినప్పుడు మఱి లొంగకూడదు. బెదరింపుతోకూడిన యేసూచనను ప్రభుత్వం వారామోదించకూడదు. వారి యేకోరికలకు ప్రభుత్వంవారు తలయొగ్గరాదు. అందువలన ఈ కోరికలను కోరినపక్షంవారితర పక్షాలతో కలియడానికి సావకాశమిచ్చి తమ సదుద్దేశమును బ్రిటిష్ ప్రభుత్వంవారు ఋజువుచేసినవారవుతారు. వారేమాత్రం లొంగి పోయినా ఇండియాలోని వివిధ సంఘములను విడదీయడంలో బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రయోజనమున్నదనీ, అలా విడదీసి ఉంచడాని కొక్కొక్కప్పు డొక్కొక్క సంఘాన్ని వెంటవేసికొని మేలుచేకూరుస్తూ తక్కినవారికి వారు నష్టంకలుగచేస్తూంటారనే యిదివరకున్న ఆరోపణ ధ్రువపడుతుంది"

అల్లాబక్సుయొక్క ఈ ప్రత్యుత్తరమునకు వెంటనే సర్ సికందరిలా జవా బిచ్చాడు:—

"ఖాన్ బహదూర్ అల్లాబక్సుకు ఆపాదించబడిన ప్రకటనను చూచాను. అక్టోబరు ఒకటవ తేదీని పత్రికా విలేఖరులతో జరిగిన నా సంభాషణలో నేను వక్కాణించిన రెండు ముఖ్యవిషయాలకు విపరీతార్థ చేసినందుకు విచారపడుతున్నాను. నేనుద్ఘాటించిన విషయాలు చాలా సర్వసామాన్యమైనవి. స్పష్టమైనవీని. ఒకటి, ఒక నిర్ణీతకాలంలో ఇండియా బ్రిటిష్ కామన్‌వెల్తులో స్వతంత్రమై సమానభాగస్వామిగా ఉండే స్థితిని పొందగలదని అసందిగ్ధంగా అందఱికీ తెలిసే భాషలో కొత్తగా ఒక ప్రకటన చేయవలెనని. రెండు, అందఱికీ అనుకూలమైన రాజ్యాంగ చట్టనిర్మాణంకొఱకు దేశంలోని ప్రధానవర్గాల ప్రతినిధులను ఆహ్వానించవలెననీ, ఏకారణంవలననైనా వారు తమలో తాము సమాధానం కుదుర్చుకోలేక పోయినట్లయితే బ్రిటిష్ ప్రభుత్వంవారే

'ఇండియా రక్షణ విషయంలో సహాయపడిన వర్గాలవారి సహకారంతో "స్వతంత్రము సమాన భాగస్వామ్యము" అనే "సిద్ధాంతంపైన ఇండియా రాజ్యాంగమును తయారుచేయవలెననీ కోరి ఉన్నాను."

సర్ సికందరు విమర్శననుకూడా ఇంగ్లాండు ప్రజలు గమనించి వ్యవహరిస్తూన్నట్లు తోచింది. ఎడ్వర్డు థాంప్సన్‌కు చర్చిలుల్ అంతులేని విశ్వాసమున్నదని యుద్ధం ప్రారంభమైనవెంటనే వర్కింగుకమిటీకి తెలియవచ్చింది. చర్చిల్‌లో అంత నమ్మకమున్న థాంప్సన్ సైతం, ఇండియా రాజ్యాంగ సంస్కరణాభివృద్ధికి ముందుగా వివిధ సంఘాలమధ్య సమాధానం కుదరవలెనని షరతు పెట్టడం సరికాదని నిరసిస్తూ అది యెప్పటికీ కుదరనే కుదరదన్నాడు. రాజప్రతినిధి కార్యనిర్వాహకవర్గం సమిష్టిబాధ్యత గలిగిన నిజమైన మంత్రివర్గంవలె వ్యవహరించవలెననీ, తక్షణం అధినివేశ రాజ్యాంగ నిర్మాణంకొరకొక చిన్న ఉపసంఘం పని ప్రారంభించవలెననీ ఆయన కోరాడు "ఇటువంటి ఉదారమైన ప్రకటనల చేయబడేయెడల అల్పసంఖ్యాకుల విషయంలో కాంగ్రెసును అంతులేని త్యాగం చేయమనికోరి కాంగ్రెసు - ముస్లింలీగు వివాదములను తుదముట్టించవచ్చును." అంటూ థాంప్సన్ అంతటితో ఊరుకోక ఇంకా యిలా అన్నాడు "చర్చిలు భారతీయులను మన సమానులుగానూ సఖులుగానూ భావించి మాట్లాడవలెను. అప్పుడు అమెరికాలోనూ తదితర దేశాలలోనూ ఉన్న మన శత్రువులు ఇండియాను ఉపయోగించుకొని మన రక్షణకు ప్రతికూలంగా దుర్మార్గం చేయలేరు. ఇంతవరకు మానవులనేక ఘనకార్యాలకోసం కృషిచేసి మరణించారు, వాటన్నిటిలోకీ ఇప్పుడు మనంచేసేపని పరమ పవిత్రమైనదిగా ఉంటుంది" ఇవి థాంప్సన్ మాటలు. బ్రిటిషు పత్రికలుకూడా మూకీభావం వహించి ఊరకోలేదీ విషయంలో.

ఇండియా విషయంలో బ్రిటిషు వారవలంబిస్తూన్న రాజనీతినిగూర్చి బ్రిటిషు ప్రజాభిప్రాయం పొంగిపొరలెత్తింది 1941 సెప్టెంబరు నెలలో దూరప్రాచ్యదేశాల మంత్రి డఫ్‌కూపర్ అమెరికాలో సంచారం చేశాడు. ఆయన వెళ్ళినచోటనెల్ల ఇండియానుగూర్చి ప్రశ్నించడం ప్రారంభించారు ప్రజలు. ఆయనకు చాలాచిన్నతనమయింది. చిట్టచివరకు ఉడికిలి "జర్మనీతో ఇంగ్లాండు చేసే యుద్ధానికీ ఇండియాకూ సంబంధమేమిటన్నాడు."

ఇదే సమయంలో పురాతన ప్రఖ్యాతిగల తొంబయి యేళ్ళ వృద్ధమూర్తి యొక్కడనో విశ్రాంతి తీసుకొంటూన్న పెద్దమనిషి కర్నల్ యంగ్ హజ్‌బెండ్ తన గౌరవానికి తగినంత ప్రబలమైన భావంలో ఇండియా స్వాతంత్ర్యాన్ని సమర్థిస్తూ

ఒక ఉత్కృష్టమైన వ్యాసాన్ని వ్రాశాడు. ఇండియాను పోగొట్టుకొనియైనా బ్రిటను ఆత్మను రక్షించవలెనని ఆయన ఆశయం.

అక్టోబరు 15 వ తేదీ లండన్ టైమ్సు పత్రిక సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్ బెండుయొక్క ఈ దిగువ ఉత్తరాన్ని ప్రకటించింది.

“ఇండియాలో మనం చెడ్డ తప్పిదం చేశాం. ఇతరదేశాలలో ప్రతిదానినీ స్వతంత్రంగా చేయడమే మన ఆశయమని చెప్పుకొంటూ ఇండియా స్వాతంత్ర్యమును గూర్చి ముఖ్యంగా కొన్ని మినహాయింపులు చేశాం. ఇందువల్ల హిందువులకూ మహమ్మదీయులకూ కూడా చాలా కోపం కలిగింది. మనకెందుకీ అనుమానం? ఇండియాపైన మన అధికారాన్ని కొంచెం సడలించేసరికి ఆదేశం ముక్కలు ముక్కలైపోతుందని మన భయం. అయితే ఎందుకా భయం? ఇండియనులు మూఢులుకారు చైనా వారికీ జపానువారికీ రష్యావారికీ ఉన్నంత రాజకీయజ్ఞానము సైనికజ్ఞానమూ భారతీయులకూ ఉంది. వారు చాలా స్వాభిమానం కలవారు. సున్నితమైన హృదయం కలవారూను. మనం, ఈజిప్షన్లు సిరియనులు అరబ్బులు అబిసీనియనుల విషయంలో ప్రవర్తించేటంత ఉదారంగానైనా వారియెడల ప్రవర్తించకపోవడం భారతీయులకు హృదయశల్యంగా ఉంది. బ్రిటిష్ సామ్రాజ్యంలో నివసిస్తూన్నందుకు గర్వపడని యే ఒక్క వ్యక్తినీ కూడా తమ సామ్రాజ్యంలో ఉంచుకోవడం బ్రిటిషు ప్రవృత్తికి విరుద్ధం. నేను ఇండియాలోపుట్టి ఇండియనులతో ౭౯ సంవత్సరాలనుండి సన్నిహిత సంబంధం కలిగి ఉన్నాను. ఇండియనులను అత్యంత విశ్వాసపాత్రులైన సఖులుగానూ ప్రేమాస్పదులైన మిత్రులుగానూ తప్ప మరొక విధంగా చూడడం నామట్టుకు నాకెంతో గర్హనీయంగా కనిపిస్తుంది. భారతీయుణ్ని నమ్మితే ఆయన ఆ మరణాంతం నిన్నంటిపట్టుకొని ఉంటాడు. ఆయనను అవమానిస్తే నీపనిపట్టించేదాకా నిద్రపోడు. మన జాతి చాలా గొప్పది. ఈ విషయంలో వట్టి మాటలకోసం తగవులాడుకోవడం మనకు తగదు. దాక్షిణ్యంతో మహత్కార్యం చేయండి! బ్రిటిష్ సామ్రాజ్యంలో ఇండియా ఉండకోరుతూన్నదో లేదో నిర్ణయించవలసిన పని భారతీయులదే: ఆ విషయం యుద్ధం ముగిసిన సంవత్సరంలోగానే తేల్చి చెప్పవలసిందని వారిని కోరుతూ ప్రకటించండి! ఇందుకు ప్రతికూలంగా వంద కారణాలు చెప్పవచ్చును. వందకాదు వేయి కారణాలు ఉన్నప్పటికీకూడా ఒక్క విషయ మాలోచిస్తే వాటినన్నిటినీ దూరంగా పెట్టవలసిందే. అది ఇంగ్లాండుకున్న మంచిపేరు. ఇందువల్ల మనం ఇండియాను పోగొట్టుకొనవచ్చును. కాని మన ఆత్మలను కాపాడుకొన్నవాళ్ళ మవుతాము. ఇంగ్లాండుయొక్క ఆత్మ అనేకమంది భారతీయుల విలువ.”

ఇండియా పక్షాన ఇంత గట్టిగా వాదించిన ధైర్యశాలి అయిన కర్నలుకు ఒక గంటలో ప్రత్యుత్తరమిచ్చాడు టోరీ నాయకుడు సర్ ఆల్‌ఫ్రెడ్ నాక్స్ “ఇండియా భవిష్యత్తును భారతీయులకు వదలివేయడం పిరికితనం” అన్నాడు. ఇండియాకు బ్రిటిషు వారు ట్రస్టీలని దబాయించాడు.

బ్రిటిష్ పత్రికలుకొన్ని, బ్రిటిషు పెద్దలు కొందరు, ఇండియాలోని బ్రిటిషు రాజనీతిని నిరసిస్తూ అసందిగ్ధములైన ప్రకటనలను అనేకం చేశారు. వీటికితోడు భారత ప్రజానీకమున కొక ఆశాజ్యోతి కనిపించింది. భారతదేశమునుగూర్చి ఒక మంచి మాట వినపడింది అది ఇంగ్లండునుండి కాదు ఇండియానుండి కాదు. కొత్త ప్రపంచం నుండి- పశ్చిమార్ధగోళంనుండి. ఆదేశపు బిడ్డలలో ఒకానొకరు క్రైస్తును క్రైస్తవపరిచర్య మాని దైవాన్ని సరియైన భావనలో సత్యరూపంలో కొలవవలెనని వేగిరపడ్డాడు.

లక్నో క్రిస్టియన్ కళాశాలలో ఆర్థికశాస్త్రం బోధించే ఆచార్యులుగానూ మెథడిస్టు చర్చిలో మిషనరీగానూ పనిచేస్తూన్న హారోల్డు ఇ. బుయల్ (Harold E. Buell) 1941 అక్టోబరునెల ప్రారంభంలో తన పదవులకు రాజీనామా యిచ్చినట్లు తెలియవచ్చింది. తాను అమెరికాకు వెళ్ళదలచుకొన్నానని డిశంబరు ఒకటో తేదీనాడు తనను ఉద్యోగంనుండి విడుదల చేయవలసిందనీ బుయల్ ప్రార్థించాడు.

ఇండియాకు తానువచ్చేటప్పుడు ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రతికూలంగా ఉండనని వ్యాఖ్యానం చేసేటందుకు వీలైన యేపనిని తాను చేయనని అందరి విదేశీ మిషనరీల వలెనే ఆయనకూడా ప్రమాణంచేసి ఉన్నాడు. ఇప్పుడా ప్రమాణాని కనుగుణంగా తాను ప్రవర్తించడం తన అంతరాత్మ చెప్పినట్లు తాను నడుచుకొనే హక్కును పోగొట్టుకోవడమని ఆయన అభిప్రాయపడ్డాడు. అదే ఆయన రాజీనామాకు ముఖ్యకారణమని తెలియవచ్చింది. మిస్టర్ బుయల్ తన రాజీనామాలో యిలా వ్రాసినట్లు తెలిసింది “నేనుమిషనరీగా ఇండియాలో ప్రవేశించడానికి బ్రిటిషుప్రభుత్వంవారు అనుమతించేముందు ఒక ప్రమాణపత్రంపైన సంతకం చేయవలసిందిగా నన్ను కోరారు. ఆ ప్రమాణ పత్రంలో ‘నేను నియోగింపబడిన దేశంలో శాస్త్రీయంగానిర్మింపబడిన ప్రభుత్వమునకు అవమానకరంగా గాని ప్రతికూలంగా గానీ ఉండే యే పనినీ చేయనని ఇందుమూలంగా హామీ యిస్తున్నాను.’ అని ఉంది నేను ఇంటిదగ్గరనుండి యింకా రెండు రోజులకు బయలుదేరుతాననగా మెథడిస్టు చర్చికి మిషనరీగా నియోగింపబడ్డాను. అప్పుడు క్రైస్తుబోధలనూ సిద్ధాంతాలనూ నా అంతరాత్మకు తోచిన రీతిని అనుసరించగలనని మరొక్క ప్రమాణంచేశాను.

బ్రిటిష్ ప్రభుత్వానికి నేను చేసిన ప్రమాణమును అనుసరించవలసి వచ్చినయెడల దేవునివిషయంలో నేను చేసిన ప్రమాణం తిరస్కరించవలసి వచ్చునని ఇండియాకు చేరిన కొలది మాసాలలో నాకు తెలిసింది. ఈపని నేను చేయజాలను”

“నేను సాధారణంగా యుద్ధ ప్రతికూలుండను. ముఖ్యంగా ఈ యుద్ధానికి మరీ ప్రతికూలుణ్ని.” అంటూ మిస్టరు బుషల్ తన రాజీనామాలో ఇంకా ఇలా వ్రాశాడు.

“ఇండియాలో ఉండి ఈదేశంలో జరుగుతూన్న సాంఘిక ఆర్థిక రాజకీయ అన్యాయములను గూర్చి మూకీభావం వహించడం నా అంతరాత్మకు విరుద్ధం కాబట్టి నేను రాజీనామాను పంపుతున్నాను. మెథడిస్టు చర్చివారి ‘సాంఘిక సిద్ధాంతంలో’ ఇలా ఉంది ‘అన్యాయమూ దరిద్రమూ స్వార్థపరత్వమూ చెలరేగుతూన్నప్పుడు మూకీభావం వహించడం దేవునికి ద్రోహం చేయడమని మా విశ్వాసం ‘తమకు కావలసిన ప్రభుత్వాన్ని తాము నిర్మించుకొనే హక్కును అందరి ప్రజలకూ సంపాదించి పెట్టడం కోసమే పోరాడుతున్నా’మని చెప్పుకొంటూ అదే హక్కు కోసం ప్రయత్నిస్తూన్న అపరాధమునకు జైళ్ళలోనూ డిటెన్షన్ క్యాంపులలోనూ అయిదువేలమంది భారత నాయకులను అట్టే ఉంచిన ఒకానొక విజేతయొక్క అన్యాయాన్ని చూచి నోరుమూసుకొని ఊరుకోవడం నాకు చేతకాని పని. ఇండియా పరాధీనంగా ఉన్నంత వరకూ నియంతృత్వానికి ప్రతికూలంగానూ ప్రజాస్వామ్యమునకు అనుకూలముగానూ, పోరాడుతున్నామని చెప్పే మాటలను విని నేను సహించజాలను. తరతరాల నుండీ తమ ప్రభుత్వం సాగుతూన్నప్పటికీ ఇండియాలో మూడుకోట్లమంది ఆకలితో అలమటిస్తూన్నారని తెలిసి ఉన్నప్పుడు, ఇండియా ప్రజల క్షేమం కోసమే ఇండియాను, పరిపాలించ కోరుతున్నామని చెప్పేవారి మాటలకు ప్రతికూలంగా నేను పెద్దమనిషినయితే నా అసమ్మతిని చూపితీరాలి. ఇండియాతో సహా అనేక మంచి మంచి ప్రదేశాలను లభించినంతవరకు గట్టిగా తమ స్వాధీనంలో ఉంచుకొని తమ లాభంకోసం వాటిని దోచుకొంటూ తమకు ప్రాదేశిక వాంఛలేవీ లేవని పైకి పెద్దమనుష్యులలాగా ప్రకటిస్తూన్న కాపట్యాన్ని చూచి నేను ఊరుకోలేను. అటువంటి అన్యాయాన్ని దోపిడీపద్ధతిని చూచి మిన్నకుండడం క్రైస్తుకు ద్రోహంచేయడం. కాబట్టి నేను బ్రిటిష్ ప్రభుత్వానికి చేసిన ప్రమాణాన్ని అనుసరిస్తూ దేవునికి ద్రోహమైనా చేయాలి; లేదా హిందూదేశాన్ని విడిచివెళ్ళి నా ఉన్నతాశయాల కనుగుణంగానైనా ప్రవర్తించాలి నాకు క్రైస్తే ముఖ్యం.

విదేశాలలో ప్రజాభిప్రాయమీ విధంగా ఇండియా కనుకూలంగా రూపొందుతూన్నప్పుడు, అంతశ్శుద్ధిగల అమెరికన్ మిషనరీలు రాజకీయ కర్తవ్యములతో కూడిన

తమ మిమనకి ధర్మాలను తమ సొంత రాజకీయ విశ్వాసములతో సమన్వయం చేసుకొని నిర్వర్తించడం దుస్తరమని భావించినప్పుడు, మన దేశంలోనే రాజప్రతినిధి కార్యవర్గంలో కొత్తగా నియమింపబడిన కొంతమంది ప్రతినిధులనోట వెలువడే ప్రకటనలను వినవలసిన దుర్గతి మనకు పట్టింది. మర్. ఆర్. సర్కార్ కొంతకాలం క్రిందట యిచ్చిన ఉపన్యాసాలకు కేవలం విరుద్ధంగా మాట్లాడాడు. శ్రీ మాధవరావు అనే స్వరాజ్యం క్రమేణా లభించవలెనన్నాడు. ఇండియా ప్రజలలో సమాధానం కుదరనిదే ఇండియాకు నూతన రాజ్యాంగ చట్టాన్ని నిర్మించడం అసంభవం అన్నాడు డాక్టరు రాఘవేంద్రరావు.

సర్ ఫిరోజుఖాన్ నూన్ ఇండియాకు రాగానే పాతపల్లవి లోనే ఒక కొత్తపాట పాడాడు 'గాంధీకి స్వరాజ్యమీయగలవాడు జిన్నా, జిన్నాకు పాకిస్థానమీయగలవాడు గాంధీ." అన్నాడు. సంగ్రహంగా నూన్ చెప్పినమాట వినడానికి ఆకర్షవంతంగాఉంది. కాని అందువలన రాజకీయ పరిస్థితులలో యేమీ మార్పురావడానికి వీలులేదు.

అమెరీ ఎంతవరకు చెప్పినా యుద్ధంలో అపజయం పొందిన రాజ్యాలకు మాత్రమే అట్లాంటిక్ ఛార్టరు వర్తిస్తుందంటాడు. మాగ్నకార్టాను అమెరికా స్వాతంత్ర్య ప్రకటనకూ తరువాత గొప్ప స్వాతంత్ర్య పత్రంగా భావింపబడుతూన్న అట్లాంటిక్ ఛార్టరు యొక్క వైశాల్యం సంకుచితం చేయబడింది. అంతటితో అమెరీకి సంతృప్తిలేక పార్లమెంటులో గ్రహింపు తక్కువగల తన సహచరులకు కొంతమందికి కూడా యిదే అభిప్రాయాన్ని కలిగించినట్లున్నాడు. ఇండియా బ్రిటిష్ సామ్రాజ్యంలో ఒకభాగమనీ అటువంటి భాగాలకు ప్రపంచరాజకీయాలలో సంబంధముండరాదనీ కూడా చెప్పడం సాగించాడు. చిట్టచివరకు మిస్టరు అమెరీ అట్లాంటిక్ ఛార్టరు కంటె కూడా రాజప్రతినిధి ఆగస్టు ప్రకటనలో చాలా ఎక్కువ ఉందనీ అది భారతీయులు గ్రహించడంలేదనీ చెప్పి ఇండియా ప్రజలను హుషారుచేసి నమ్మించడానికి ప్రయత్నించాడు. అయితే పర్యవసానమేమిటంటే రాజప్రతినిధి ఆగస్టు వాగ్దానం ఉండగనుక అట్లాంటిక్ ఛార్టరు వర్తించదనీ, భారతీయులలో ఐకమత్యంలేదు గనుక వైస్రాయి ప్రకటన అమలులోకి రావడానికి వీలులేదనీని,

౨

**1940—41** సంవత్సరాలలో వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించి సాగించడంలో గాంధీకి సునిశ్చితమైన ఒక కార్యక్రమం ఉంది. దానిని ప్రారంభించడానికి ముందు

ఒక సంవత్సరం ఆయన వేచియున్నాడంటే అది రాకుండా చేయడానికాయన యెంత కృషిచేశాడో అర్థమవుతుంది. జాతి మొత్తంమీద పోరాటం రాకుండా చేయడానికి మఱొకప్రక్క తాను ఉపవాసం చేయవలెనని పట్టుపట్టాడు. ఇందువలన కూడా ఆయన సదుద్దేశం మఱింత ధ్రువపడింది. ఆయన ఉపవాసం అంతర్జాతీయ ప్రాముఖ్యత వహించేమాట వాస్తవం కావచ్చు, కాని సమిష్టి సత్యాగ్రహం ప్రారంభించి ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వాన్ని చీకాకు పఱచడం ఆయన కిష్టంలేకపోయింది. అందువలన ఎలాగైనా సరే ఆస్థితి రాకుండా చేయవలెనని ఆయన ప్రయత్నించాడు. సమిష్టి ఉద్యమం వలన ఇండియాలో సైతం అనేక విపరీత పరివర్తనములు కలుగవచ్చుననుటకు సందేహంలేదు. ఈ విషయాలన్నీ సమగ్రంగా ఆలోచించబడిన పిమ్మటనే గాంధీ నాయకత్వం క్రింద వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభమై నిర్ణీత కార్యక్రమం ప్రకారం సక్రమంగా నడిచింది. గాంధీ స్వేచ్ఛగా ఉండడం కూడా భారతజాతి అదృష్టం. అందువలన ఆ ఉద్యమానికి నాయకత్వం వహించి యెప్పటికప్పుడు జాగ్రత్తగా పరిశీలనచేస్తూ నడిపించడానికి ఆయనకు వీలయింది. కొన్ని రాష్ట్రాలలో ఆయన పంపిన సర్క్యులర్లుగానీ ప్రకటనలుగానీ ప్రచురించడానికి ప్రభుత్వమువారు వీలులేకుండా చేసినమాట వాస్తవమే. గాంధీగారి వారపత్రికయందు ప్రత్యేక పక్షపాతంగానీ ప్రత్యేక గౌరవం కానీ చూపించడానికి ప్రభుత్వంవారు నిరాకరించిన మాట కూడ నిజం. ఆయన వ్యక్తిగతంగా వ్రాసిన వ్రాతలుకానీ ప్రకటనలుకాని ప్రభుత్వం వారి ప్రత్యేక గౌరవమునకు పాత్రములుకాలేదు. సత్యాగ్రహులపైన విధింపబడిన జరిమానాలను పూర్తిగా చెల్లించివేయవలసిందనీ, ఆ పైకం దమ్మిడీలతోసహా జాతీయ ప్రభుత్వం తిరిగీ వారికి యిచ్చివేస్తుందనీ గాంధీజీ చేసిన ప్రకటనను మొట్టమొదట నాగపూరు టైమ్సు ప్రచురించింది. తక్కినచోట్ల దాని ప్రచురణము నిషేధింపబడింది. ఇన్ని చిక్కులు తటస్థించినప్పటికీ రాష్ట్ర నాయకులతోగానీ, ఏజంట్లతోగానీ గాంధీ ఉత్తర ప్రత్యుత్తరములు నడుపుతూ సన్నిహిత సంబంధం కలిగే ఉన్నాడు. జిల్లాల సహాయంతో రాష్ట్రాలు సత్యాగ్రహుల జాబితాలను తయారుచేసి పంపుతూంటే ఆయన ప్రతిపేరూ పరిశీలించి అందులో కొన్నిటిని కొట్టివేస్తూ, తక్కిన పేర్లను గూర్చి కొత్తసంజాయిషీని అడుగుతూ, సత్యాగ్రహంచేయడానికి తగినవారిని జాగ్రూకతతో నిర్ణయించాడు. కాంగ్రెసు సాధారణ కార్యదర్శి జె. బి. కృపలానీ, గాంధీజీ అంతరంగిక కార్యదర్శి మహాదేవదేశాయి గార్లాయనకీ పనిలో మొదటినుండి తుదివరకూ తోడ్పడుతూ వచ్చారు. వారితోపాటు రాజేంద్రబాబు సలహానుకూడా గాంధీజీ నిరంతరం పొందుతూండేవారు. మహాదేవదేశాయి, కృప్లానీ, ఈయిరువురూ ఇండియాలో

ఒక కొననుండి మరొక కొనవరకూ సంచారంచేసి స్థానిక పరిస్థితులను జాగరూకతతో పరిశీలనచేసేవారు. రాష్ట్రాలలో, రాష్ట్రనాయకులుగానీ, యేజెంట్లుకానీ వారి తరువాత ఆ స్థానమును ఆక్రమించగలవారి పేర్లను సూచించి గాంధీజీ ఆమోదమును పొందుతూండేవారు. పోలీసువారు జైలు అధికారులూకూడా దీనికి తగినట్లుగా తమ ప్రవర్తనను దిద్దుకోలేకపోయినారు. నూలువడకడమొక జైలుపరిశ్రమగా అంగీకరింపబడినప్పటికీ ఖైదీలకు రాట్నాలిచ్చి ఏకులులేకుండా చేశారు. జైలు అధికారులు దక్షిణాది జైళ్లలో 'సి' క్లాసు ఆహారము ఎప్పటివలెనే అసహ్యంగా యిస్తూవున్నారు. అప్పుడప్పుడూ జైళ్లలో లాఠీచార్జీలు జరుగుతూనేవచ్చినవి. రాజకీయ ఖైదీలను కనిపెట్టి ఉండడానికి అర్హులుకాని పాత సూపరింటెండెంట్లు తమ మామూలు ధోరణిలోనే ప్రవర్తిస్తూవచ్చారు. దక్షిణ యిండియాజైళ్ల సిబ్బందీ విషయంలో ఒకకొత్త విధానం అవలంబింపబడింది. పోలీసు డిప్యూటీ సూపరింటెండెంట్లు ఆంగ్లోఇండియనులుకానీ యూరోపియనులుగానీ జైలుపనిలో యేవిధమైన అనుభవమూ లేకుండానే కొద్ది శిక్షణతో డిప్యూటీజైలు సూపరింటెండెంట్లుగా నియోగింపబడిరి. జైలు మొట్టమొదట రాజకీయ డిటెన్యూలతో నిండిపోతూవచ్చినవి. మొదటి కొద్దిమాసాలలో నెల 1 కి రు 10/ లేక రు 5- లు అలవెన్సులు డిటెన్యూలకు ముడుతూండేవి. పైగా దీనికితోడు వారు రెండు తరగతులుగా విభజింపబడ్డారు. మొదటి తరగతికి (ఏ) తరగతి ఖైదీ రేషనులున్నూ రెండవ తరగతికి (సి) తరగతి ఖైదీ రేషనులున్నూ ఈయబడినవి. మొదటి తరగతి రేషనుఖరీదు 0-4-3 రెండవ తరగతి రేషనుఖరీదు 0-1-4 ఈ విషయంలో రాష్ట్రప్రభుత్వాలకు ఖైదీల విజ్ఞాపనలు పంపుకొన్నారు. వాటివలన ప్రయోజనం కలుగకపోయినందున నిరాహారదీక్షను అవలంబించారు. ఇండియా ప్రభుత్వంవారికి రాష్ట్రప్రభుత్వాలు కేవలం బ్రాంచి పోస్టాఫీసులుగా పనిచేసినవి. అందువలన తక్కిన జైలుసిబ్బందీవలెనే రాష్ట్రప్రభుత్వాలుకూడా యేమీ చేయలేకపోయినవి. వార్డరు చీఫ్ వార్డరు వంకా, చీఫ్వార్డరు డిప్యూటీజైలరువైపుకు, డిప్యూటీజైలరు జైలరువైపుకు, జైలరు డిప్యూటీ సూపరింటెండెంటువైపుకు డిప్యూటీ సూపరింటెండెంటు సూపరింటెండెంటు వైపుకూ, ఆయన ఇన్స్పెక్టరు జనరల్ ఆఫ్ప్రిజన్సువంకకూ, ఇన్స్పెక్టరు జనరల్ ఆఫ్ప్రిజన్సు చీఫ్ శక్రటరీవంకకూ చీఫ్శక్రటరీ అడ్వైజరువంకకూ అడ్వయిజరు గవర్నరువంకకూ గవర్నరు ఇండియా ప్రభుత్వంవంకకూ చూచి, చివరకు అందఱూ కలసి ఆకాశంవంక చూడడం ప్రారంభించారు. ఇంత చిన్నవిషయం తేలికగా పరిష్కారంకాకపోవడం అత్యాశ్చర్యం. ఇంతా అయితే తాము చెప్పుకొనేటంత సమర్థత బ్రిటిష్ ప్రభుత్వానికి లేదు. జైళ్లలో ఉత్తరాలు చాలా ఆలస్యంగా యిస్తూండే

వారు. ఒక్కొక్కప్పుడు నెలరోజులుకూడా పట్టేది. ఖైదీలు వ్రాసిన ఉత్తరాలుకూడా వారియిళ్లకు అంత ఆలస్యంగానూ అందుతూండేవి. ఉత్తరాలను ముందుగా పరిశీలనచేయడానికి తగిన యేర్పాట్లులేనందున ఆలస్యం జరుగుతూన్నదని సాకుచెబుతూండేవార్లు జైలుఅధికారులు. యిటువంటిసాకులు చాలా ఉండి ఉండవచ్చును. కాని ఇవన్నీకూడా ఖైదీజీవితాన్ని దుర్భరంచేయడానికిన్నీ, ప్రభుత్వంవారు చాలా సమర్థులని చెప్పుకోనేమాటను నమ్మచేయడానికిన్నీ మాత్రమే ఉపయోగపడుతూన్నవి.

## మేజస్ట్రేట్లు - ప్రభుత్వము.

సత్యాగ్రహులను శిక్షించడంలో ప్రభుత్వంవారు కాలానుగుణంగా వివిధపద్ధతులను అవలంబిస్తూ వచ్చారు. మొట్టమొదలు శిక్షలు చాలా కఠినంగానూ జరిమానాలు దుర్భరంగానూ ఉండినవి. శిక్షలలో విపరీతమైన భేదాలు కనిపించేవి. నెహ్రూశిక్షకు వినోబాశిక్షకూ ఉన్న భేదమే అందుకు తార్కాణం. మొదటివారి శిక్షాకాలం రెండవవారి శిక్షకు పదహారురెట్లు, ఒక ఆంధ్రదేశంలో వేయబడిన జరిమానాల మొత్తమే రూ 1, 18, 969-12-0.

వార్ధాగంజినుండి మార్చి మూడవ తేదీని చేయబడిన పత్రికా ప్రకటనలో యిలా ఉంది:-

వ్యక్తి సత్యాగ్రహంలో అరెస్టు చేయబడినవారి సంఖ్య 4,749 సత్యాగ్రహులపైన విధించబడిన జరిమానాలమొత్తం రు 2, 09. 663. ఈ భోగట్టా వివిధరాష్ట్రాలనుండి అ. భా. కాం. సం కార్యాలయమునకు చేరింది. ఇందులో పంజాబులో అరెస్టయినవారి సంఖ్యకాని విధించబడిన జరిమానాలమొత్తంకాని చేరలేదు. పంజాబురాష్ట్రంవారింకా యిందును గూర్చిన సంజాయిషీపంపి ఉండలేదు.

ఇది అ. భా. కాం. సం సాధారణ కార్యదర్శి ప్రచురించిన ప్రకటనలోని సంజాయిషీ. అరెస్టుల సంఖ్యలో సంయుక్తరాష్ట్రాలగ్రస్థానం వహిస్తూన్నవి. ఫిబ్రవరినెల మధ్యకాలం వరకూ సంయుక్త రాష్ట్రాలలో అరెస్టయినవారి సంఖ్య 1495. ఆంధ్రులు జరిమానాలలో అగ్రస్థానం వహించారు. ఆంధ్రదేశంలో ఆ నాటికి విధింపబడిన జరిమానాల మొత్తం 76,538

సేవాగ్రామంలోని అ. భా. కాం. సం. కార్యాలయమునుండి జారీచేయబడిన ఈ దిగువ పట్టీలో ఆయారాష్ట్రములయందు అరెస్టయినవారి సంఖ్యయూ, విధింపబడిన జరిమానాల మొత్తమున్నూ సూచించబడినవి.

| రాష్ట్రం | | అరెస్టులు | | జరిమానాలు |
|---|---|---|---|---|
| అజ్మీరు | ... | 10 | ... | 565 |
| ఆంధ్రా | ... | 882 | ... | 76,533 |
| అస్సాం | ... | 176 | ... | 3,145 |
| బెంగాల్ | ... | 39 | ... | 3,625 |
| బీహార్ | ... | 242 | ... | 4,340 |
| బొంబాయి | ... | 47 | ... | చేర లేదు |
| ఢిల్లీ | ... | 39 | ... | 2,050 |
| గుజరాతు | ... | 296 | ... | 6,150 |
| కర్నాటక | ... | 210 | ... | 5,385 |
| కేరళ | ... | 70 | ... | 5,700 |
| మహాకోసల | ... | 137 | ... | 10,302 |
| మహారాష్ట్ర | ... | 221 | ... | 1.915 |
| నాగపురం | ... | 21 | ... | 5;215 |
| వాయవ్యరాష్ట్రాలు | ... | 2 (యిప్పుడు విడుదలైనారు) | ... | లేదు. |
| తమిళనాడు | ... | 424 | ... | 29,030 |
| సంయుక్తరాష్ట్రాలు | ... | 1,495 | ... | 38,000 |
| ఉత్కళం | ... | 315 | ... | 9,532 |
| విదర్భ | ... | 123 | ... | 8.176 |
| | | 4,749 | | 209.663 |

తరువాత తరువాత రెండు, మూడు, నాలుగు నెలలకు మించకుండా చాలా తక్కువ శిక్షలు వేయబడుతూ వచ్చినవి. అయితే రెండవసారి సత్యాగ్రహం చేసినవారికి ఎక్కువ శిక్షలు వేయబడుతూ వచ్చినవి. దక్షిణభారతదేశంలోని కోయంబత్తూరు జిల్లాలో ఒకానొక సత్యాగ్రహి విడుదలై వచ్చినప్పుడు ఆయనను ఆహ్వానిస్తూ ఒక సమావేశం జరిగింది. అందులో మాట్లాడినందుకు తిరిగీ ఆరు నెలల శిక్షవిధింపబడిందాయనకు. దానిని యింకా ఎక్కువ చేయించవలెనిందని గవర్నమెంటువారు హైకోర్టుకు పిటీషన్ పెట్టుకొనిరి.

ఇక ఖైదీల తరగతులను రద్దు చేయవలెనని చిరకాలంనుండీ ఆందోళన జరుగుతూన్నది. ఆ సమస్యను ప్రభుత్వం వారిప్పటికీ పరిష్కరించనేలేదు. సత్యాగ్రహ

ఖైదీల విచారణ సందర్భంలో మేజిస్ట్రేట్లవలంబిస్తున్న వైఖరినిగూర్చి ఒక మాట చెప్పవలసి ఉంది. వీరిలో బాగా ప్రసిద్ధికెక్కినమనిషి మిస్టర్ ఆర్. గెలిటీ. ఐ. సి.ఎస్. ఈయన నెల్లూరు జిల్లాలోని గూడూరు సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు. ఈ ఉద్యమానికి ప్రధాన కారకులైన ముఖ్య కుట్రదారులను విడిచిపెట్టి చిన్న చిన్న వాళ్ళపైన కేసులు పెట్టడంలో పోలీసువారు తప్పుచేస్తున్నారని కోర్టులో అనడమేకాక, బహిరంగ సభలలో పాల్గొని ఆ ఉద్యమంవలన కలిగే బాధనష్టాలనుగూర్చి వాదించడంకూడా ప్రారంభించాడు. ఈయనతండ్రి క్యాడిల్ హక్ డి గెల్లెటీ ఉదార హృదయంగల పరిపాలకుడు. ఇండియాలో సివిలియన్ ఉద్యోగిగా పనిచేసి తెలుగు, ఇంగ్లీషు నిఘంటును రచించినాడు. ఆయన కుమారుడైన ఈ గెలిటీ మంచి చురుకైన మనిషి. ఉజ్వలమైన తెలివితేటలుకలవాడు. ఉన్నతాశయాలుకల ఉత్సాహవంతుడైన భావుకుడు. ఆయన యిచ్చిన ఉపన్యాసాలలో ఈ దిగువ ఉపన్యాసం ఒకటి.

“యావద్భారతదేశంలోనూ, ఉభయపక్షాలవారు తమ తమ అభిప్రాయాలను వెల్లడించేటందుకు వీలు కల్పింపబడిన ప్రప్రథమ సమావేశమిది. ఇందుకు సావకాశం కల్గించిన అధ్యక్షులవారిని అభినందించవలసి ఉంది. భారతదేశంలోని బహిరంగసభలలో ఇరుపక్షాలవారి అభిప్రాయాలను వెల్లడించడానికి అవకాశాలు చాలతక్కువ.” అని చెబుతూ గూడూరులోని ప్రజలు ఉభయకక్షులవారి వాదనలనూ విని నిర్ణయించవలసిందని కోరాడాయన. బి. వేంకటనారాయణ రెడ్డిగారున్నూ కె. షణ్ముఖంగారున్నూ సత్యాగ్రహం చేసినప్పుడు సమావేశములకు తానుహాజరుకావలెనని అనుకొనికూడా కార్యాంతర నిమగ్నుడు కావడంచేత రాజాలకపోయినాడు. కాబట్టి ఆయన వారి దృక్పథాన్ని తెలుసుకొందామనే కోరికతో ఆ సత్యాగ్రహుల అభిప్రాయాలను వెల్లడించడానికి కోర్టులో సావకాశమిచ్చాడు. కాని ఖైదీలు ప్రత్యుత్తరమీయకపోవడమేకాక కోర్టులో వాదమునకు దిగ నిచ్ఛగించలేదు. అంతకుపూర్వం ఒకనో జున నరసారెడ్డి సత్యాగ్రహం చేసినప్పుడు కోర్టులో ఆయననుగూర్చి ఈ మేజిస్ట్రేటే కొన్ని కఠినమైన మాటలన్నాడు. అందుకు తగిన కారణాలు లేకుండా యితరులెవరో చెప్పిన మాటలను నమ్మి తాను పొరపాటుపడినట్లయితే క్షమాపణ చెప్పడానికి సంసిద్ధంగా ఉన్నట్లు అప్పుడనడమేకాక తిరిగీ యిప్పుడుకూడా అన్నాడు. నరసారెడ్డి విడుదల చేయబడిన పిమ్మట ఆయన తీర్పును గాంధీజీ చూచి, పదిహేను రోజులు నూలువడికి తిరిగీ సత్యాగ్రహం చేయవలసిందని నరసారెడ్డికి ఆదేశించినట్లు తెలుస్తూన్నది ఇది నిజమేనా అని మిస్టరు గెల్లెటీ నరసారెడ్డిని అడిగాడు. నరసారెడ్డి నిజమేనన్నాడు. తనను అన్న మాటలకు తానంతగా లెక్కపెట్టననీ

యావద్భారత దేశముయొక్క గౌరవానికి పాత్రులైన నాయకులను తూలనాడినందుకు తాను విచారపడుతున్నాననీ తానిప్పుడు ప్రతిరోజూ నూలు వడుకుతున్నాననీ నరసారెడ్డి అన్నాడు. ఆ మాటను తాను విశ్వసించడంలేదని మిస్టరు గ్లెట్ ప్రతిఘటించాడు. శీలసంపన్నులు లోకవేళ పొరపాటు పడ్డప్పటికీ తాను గౌరవించేవననీ అదిలేనివారిని అవహేళన చేయడానికి వెనుదీయననీ కూడా ఆయన అన్నాడు. తన డివిజన్‌లో జరుగుతూన్న యుద్ధసన్నాహాలకు ప్రతికూలంగా సత్యాగ్రహులేమీ చేయజాలరని విశ్వసిస్తూ, గాంధీ స్వయంగావచ్చి తన డివిజన్‌లో ప్రచారం చేసినప్పటికీ భయం లేదన్నాడు. రెడ్‌క్రాస్ ఉద్దేశాలనూ ఆదర్శాలనూ గూర్చి నెల్లూరు జిల్లాజడ్జి మిస్టరు మ్యాల్ వ్రాసిన జాబుకు ప్రత్యుత్తరంగా రెడ్‌క్రాస్ ఉద్యమానికి చందా లీయడం కాంగ్రెసు క్రమశిక్షణకు విరుద్ధం కాదని గాంధీ విస్పష్టంచేశాడు. గాంధీ తన ఆత్మ నిశ్చయమునుండి ఎప్పుడూ వెనకడుగు వేయడని, అందరికీ తెలిసిన విషయమే నన్నాడు మిస్టరు గ్లెట్. యారపుఖండంలోని క్వేకర్సు అంతరాత్మ అభ్యంతరాలవల్ల యుద్ధంలో పాల్గొనరు. కాని యుద్ధంలో గాయపడినవారికి సహాయం చేయడానికి వారు ముందుకువస్తారు. గాంధీ కూడా అంతే. అయితే రాష్ట్రీయ కాంగ్రెసు సంఘం ఏమిచేస్తూన్నది? రెడ్‌క్రాస్ పనిలో కాంగ్రెసువారు జోక్యం కల్గించుకోవచ్చునని యిచ్చిన గాంధీజీ అభిప్రాయానికి ప్రతికూలంగా అనేకమంది కాంగ్రెసువాదులు తమ ఆగ్రహాన్ని వెల్లడించారు. కొద్దిమంది నిజాయితీగల కాంగ్రెసువాదులున్నారు. కాని చాలామందిలో అదిలేదు. వారిలో అనేకమంది మౌలానా అజాద్, రాజగోపాలా చార్యులవంటి మహానాయకులు కూడా పరస్పర విరుద్ధంగా మాట్లాడుతూంటారు.

1941 సెప్టెంబరు 5వ తేదీని జి. వి. సుబ్రహ్మణ్యంగారిని విడుదలచేస్తూ ఆ మేజస్ట్రేటే గూడూరులో మరొక తీర్పు చెప్పినాడు :—

ఈ కేసులో ముద్దాయి మార్చి 15న గూడూరులో జరిగిన ఒకానొక బహిరంగ సభలో అరెస్టు చేయబడినాడు. తరువాత ఆయన యిల్లుకూడా సోదా చేయబడింది. ఆ సమయంలో దౌర్జన్యమును ప్రేరేపిస్తూన్న రాజద్రోహకరములైన కరపత్రములు కొన్ని ఆయన ఇంట్లో లభించినట్లు తెలిసింది. ఆయనపైన పోలీసువారు ఇండియా రక్షణచట్టం కింద కేసుపెట్టారు. ముద్దాయి తాను నేరంచేయలేదనీ తన యింట్లో అటువంటి కరపత్రములు లేనేలేవనీ వాదించాడు. తాను నిష్కళంకమైన కాంగ్రెసు వాదిననీ దౌర్జన్యంలో తనకునమ్మకం లేదనీకూడా చెప్పాడాయన.ఆయనపక్షాన కొంత మంది ఉత్తరసాక్షులు విచారింపబడ్డారు. అందులో నెల్లూరు జిల్లాబోర్డు అధ్యక్షు

లున్నూ నెల్లూరు జిల్లాకు కాంగ్రెసు నియంతయున్నూ అయిన కోదండరామరెడ్డి కూడా ఉన్నారు.

ఈ కేసులోని ముద్దాయిని విడిచిపెడుతూ మిస్టరు గెల్లిటే యిలా వ్రాశాడు. ఇందులోని ముద్దాయి తాను ప్రయోగించిన వ్యర్థపదాడంబరమునకు తానే గురియైనాడు. ఈయన స్వచ్ఛందంగా జైలుకు పోవలసిన వారిజాబితాలో ఉండనేఉన్నాడు. కొద్దికాలంలో ఆ ప్రకారం పోయి అక్కడి కష్టాలను సంతోషంతో భరించి ఉండేవాడు. ఈలోగా గూడూరుస్టేషన్ హౌస్ ఆఫీసరు తెలివితక్కువగా ఆయనను అరెస్టు చేశాడు. ముద్దాయి ఒక ఉపన్యాసం ఈయగానే అరెస్టుచేయబడ్డాడు. అనుకొన్న ప్రకారం ఆయన నినాదాలను చేసేదాకా పోలీసు ఉద్యోగి వేచి ఉండవలసింది; ఆయన చేయదలచుకొన్న నినాదం యుద్ధనినాదం కాదు. యుద్ధవ్యతిరేక నినాదం. పరాయ సైన్యాల దండయాత్రలనుండి స్వసైన్యం ద్వారా తమ హక్కులనూ తమ గృహాలనూ తమ కుటుంబాలనూ రక్షించుకోవడం అపరాధమని తమ దేశీయులను ప్రబోధించడమే దాని ఉద్దేశం. ఆ ప్రకారం ముద్దాయి అరెస్టుచేయబడిన తరువాత తక్కిన మిత్రుల వలెనే తానుకూడా మాట్లాడకుండా నిరాడంబరంగా జైలుకుపోయి ఉండేవాడు. (వాక్స్వాతంత్ర్యమును నిలబెట్టుకోవడానికది ఒకటే మార్గంగా కనిపిస్తూన్నది. నిజానికి వాక్స్వాతంత్ర్య మెప్పుడూ నిరాకరింపబడనేలేదు.) కాని దురదృష్ట వశాత్తూ పోలిసువారు ముద్దాయి యింటిని సోదాచేసి, దౌర్జన్యాన్ని పోత్సహిస్తూ విప్లవాన్ని ప్రబోధించే అనేక గ్రంధాలనూ కరపత్రాలనూ పట్టుకొనివచ్చారు. వాటి వల్ల కాంగ్రెసువిధానం నిరర్థకమనికూడా నిరసింపబడ్డట్లు స్పష్టమవుతూన్నది. స్థానిక కాంగ్రెసు నాయకులలో ఒకరైన ఈయన నిప్పులుకక్కే కమ్యూనిస్టు నాయకుడుగా జైలుకుపోవ నిశ్చయించకపోవడం సహజం. అందువలన తక్కినవారివలెగాక తన వాక్స్వాతంత్ర్యమును వినియోగించుకోవలసి వచ్చింది. గూడూరు జాయింటు మేజస్ట్రేటు కోర్టుకువచ్చిన కాంగ్రెసువాదుల నడతలనుగూర్చి చరిత్రలనుగూర్చి కోర్టువిచారించడం, ముద్దాయి అరెస్టుకు కారణభూతమైన ఉపన్యాసంలో విమర్శింపబడింది. కాని యితరుల విషయంలో కోర్టు కోరినదానికంటెకూడా ఆయన తనను సమర్థించుకోవడానికి తననుగూర్చి, తన జీవితమునుగూర్చి తన కుటుంబమునుగూర్చి, ఎక్కువగా చెప్పుకోవలసివచ్చింది. "కనుక అవస్థాభేదములనుబట్టి అనుకొనివి తటస్థించవచ్చును. అయితే కోర్టువారు తమను విమర్శించిన వారికి ప్రత్యుత్తరం చెప్పగలగడం చాలా అరుదు. అందులో ఆ ప్రత్యుత్తరం విమర్శకుని నోటినుండియే వెలువడడం అంతకంటెనూ అరుదు" మార్చి 15 వ తేదీని ముద్దాయి అరెస్టు చేయబడిననాడు, ఆయన

యిచ్చిన ఉపన్యాసంలో డిఫెన్సు రూల్సు క్రిందకు వచ్చే నేరం లేదని గూడూరు స్టేషన్ హౌస్ ఆఫసరు సాక్ష్యమును బట్టి తెలుస్తూన్నది. "నేటి యుద్ధంతో భారతీయులకేమీ సంబంధంలేదనే విపరీతధోరణిలో ఆయన మాట్లాడినట్లు కనిపిస్తున్నది. ఈమాటలు కాంగ్రెసువారికి కూడా రుచించవు. ఆనాటి సత్యాగ్రహి చెప్పేమాటలను వినవలెనని ముద్దాయి ప్రజలను హెచ్చరించాడు. సత్యాగ్రహ నినాదాలను యిదివరకే ఆ ప్రజలు అనేక పర్యాయములు వినిఉండడంచేత మళ్లీకొత్తగా విన్నా వినక పోయినా ఒకటే. ఇందువలన యుద్ధసన్నాహాలు కొఅవదేటంతగా గూడూరు ప్రజా బాహుళ్యంయొక్క వైఖరి మారిఉంటుందన డానకేమీ సాక్ష్యంలేదు."

ముద్దాయి స్వాధీనంలో ఉన్న మూడు కరపత్రాలను గూర్చి వివరిస్తూ అవి అభ్యంతరకరములైనప్పటికీ పార్టీప్రచారమునకు మోసపోయి వారివలలో పడినవారు తప్ప తక్కినవారెవరూ వాటిని చదివి కాలయాపం చేసుకోరనీ, అవి డిఫెన్సు రూల్సుప్రకారం యుద్ధవ్యతిరేక కరపత్రములుగా భావింపబడవనీ, చెప్పి వాటిని ప్రభుత్వం స్వాధీనపఱుచుకోవలసిందని తీర్పుచేశాడు. ఆ సందర్భంలోకూడా మేజ స్ట్రేటు ముద్దాయిని నేరస్తుడని తలంచలేదు.

మార్చి ప్రారంభంనుండీ సత్యాగ్రహం చేసిన వారిని ప్రభుత్వం వారు అరెస్టుచేయక విడిచివేయడం చాలా ఎక్కువయింది. అరెస్టు కాని సత్యాగ్రహులు యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసుకొంటూ కాలినడకను ఢిల్లీకి ప్రయాణం చేయవలసిందని మొట్టమొదట ఉత్తరువులు జారీచేసిన గాంధీయే మార్చి మొదటి వారంలో కొత్త ఉత్తరువులిచ్చాడు. ఢిల్లీ ప్రయాణానికి ముందుగా తన జిల్లాలోని ప్రతి గ్రామమునకూ పోయి యింటింటా మనిషి మనిషి దగ్గరా యుద్ధ వ్యతిరేక ప్రచారం చేయవలసిందని అరెస్టుకాని ప్రతి సత్యాగ్రహికీ ఉత్తరువులు పంపబడినవి ప్రతి జిల్లాలోనూ కొన్ని తాలూకాలను నిర్ణయించుకొని అక్కడి గ్రామాలలోని ప్రతియింటికీ ప్రతి మనిషికడకూ పోయి ప్రచారం చేయడమే ఆయన వాంఛ. కేవలం వాక్స్వాతంత్ర్యమును పొందడమే ఆయన ప్రధానాశయం. ఆయన ఫిబ్రవరి 15 వ తేదీని 'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రికకు పంపిన ఉత్తరంలో ఈవిషయం స్పష్టంగా కనిపిస్తుంది. ఈ సత్యాగ్రహోద్యమం యొక్క ఆదర్శములను గూర్చి కార్యవిధానమునుగూర్చి అందులో వివరింపబడింది. 'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రికలో ఆయన వ్రాసిన ఉత్తరమిది :—

"అయ్యా! ఫిబ్రవరి 7 వ తేదీ సంచికలో అంతశ్రద్ధగా మీరు వ్రాసిన మాటకు నేను ప్రత్యుత్తరం ఈయవలసిఉంది. మానవస్వభావం అత్యంతపతన

సేతికి వచ్చినప్పటికీకూడా అహింసను ఆమోదించి తీరుతుందని నానమ్మకం మీరు విశ్వసించజాలకపోయినా నాకునమ్మకం ఉంది. ప్రతికూలభావాన్ని పూర్తిగా జయించడమే అహింసయొక్క సారాంశం. అటువంటి అహింసను నేను ప్రబోధించలేకపోయి ఉండవచ్చును. తక్కినవారు నామాత్రంకూడా ప్రబోధించజాలరనడానికి చాలా సావకాశంఉంది. కాని అహింసాశక్తినిమాత్రం నేను కించపరచజాలను. నిజమైన అహింసకు అనుగుణంగా ఫ్యూరరు (హిట్లరు) ప్రవర్తించజాలడనికూడా నా కవిశ్వాసంలేదు.

మీ అవిశ్వాసమును సమర్థించుకొంటూ మీరు చూపిన ఉదాహరణాలు చాలా విచారకరంగా ఉన్నవి. అవి యిక్కడ వర్తించనే వర్తించవు. అస్త్రసన్యాసం చేసినంత మాత్రాన యెవ్వడూ అహింసాయుతుడుగా ఉండవలసిన అవసరంలేదు. జెక్కులూ డేనులు, ఆస్ట్రేలియనులు, పోలులూ ఈ అందరూ చాలా వివేకంతో ప్రవర్తించి ఉండవచ్చును; కాని అహింసాయుతంగా మాత్రంకాదు. వారు ఆయుధములతో జయప్రదంగా రక్షించుకోగలిగి ఉన్నట్లయితే తమ దేశీయుల పొగడ్తకు పాత్రులైయుండేవారు. కాని సాయుధనిరోధం నిరుపయోగమైనప్పుడు వారు లొంగిపోయినందున వారిని నిందించడం నాపనికాదు. అయితే శారీరక బలం కలిగినవారు ఆధునికమారణ యంత్రములతో బలహీనులను ఎదుర్కొన్నప్పుడు, వారు నిస్సహాయుల మనుకొని చేతులు ముడుచుకొని ఊరుకోకుండా ఉండేటందుకే సత్యాగ్రహమనే శాస్త్ర ఆయుధాన్ని కనుపెట్టి 1907 లో దక్షిణ ఆఫ్రికాలో జయప్రదంగా ప్రయోగించి ఉన్నాను. తరువాత అది వివిధ క్లిష్టపరిస్థితులలో కూడా విజయవంతంగా ప్రయోగింపబడింది. అయితే ఇంతవరకూ ఈ సత్యాగ్రహాయుద్ధంతో నే నెదుర్కొన్న శత్రువులకూ హిట్లరు ఇండియాపైన దండయాత్రచేసినప్పుడు ఎదుర్కోవలసిన శత్రువులకూ చాలా భేదం ఉందని నేనంగీకరించచాలనందుకు నన్ను మీరు మన్నించాలి. ఆయన ప్రతిసత్యాగ్రహినీ చంపవచ్చుననే సావకాశాన్ని ఊహించి భయంకానీ నిరాశకానీ పడవక్కరలేదు. భారతదేశానికటువంటి పరీక్షయే తటస్థించి కొంతమంది సత్యాగ్రహులు తమ హృదయాలలో యేమాత్రమూ ద్వేషభావం లేకుండా హిట్లరు సైన్యాలను ఎదుర్కొని మరణించగలిగినట్లయితే వారందరూ పురాణాలలోనూ చరిత్రలలోను ఉదాహరింపబడిన వీరులతోను వీరపత్నులతోను తులతూగగలిగినవారుగా భావి ప్రపంచ చరిత్రలో వన్నెకెక్కేమాట నిజం.

అయితే నా సహచరుల నిజాయితీని అహింసనూ గూర్చి మీరు సందేహిస్తూ మాట్లాడేయెడల మీవాదమంత దుర్బలమయిందని నేను భావించను. మీరు పూనా

తీర్మానాన్ని నామొగాన విసిరికొట్టడానికి వీలుంది. తాత్కాలికంగా నాకు స్వాతంత్ర్యం తటస్థించకుండా ఉన్నట్లయితే పూనా తీర్మానం అంగీకరించబడి ఉండేదికాదని నేనిదివరకే వొప్పుకొన్నాను. సత్యాగ్రహులలో నిజాయితీలేదని కానీ, అహింస లోపభూయిష్టంగా ఉందనికానీ మీరనేయెడల మానవులెంత సత్య సంధులుగానూ ఎంత అహింసాయుతులుగానూ ఉండగలరో అంత సత్యసంధులుగానూ అంత అహింసాయుతులుగానూ సత్యాగ్రహులు ఉండగలరని భవిష్యత్తే నిరూపించగలదు. అహింసా ప్రమాణమునకు సాధ్యమైనంతవరకు భిన్నం కలుగకుండానే జాగ్రత్తగా సత్యాగ్రహులను నిర్ణయిస్తున్నాము. అయినప్పటికీ కొంతమంది కృత్రిమ సత్యాగ్రహులు చేరినమాట నిజమే. అయితే అత్యధిక సంఖ్యాకులు నిజాయితీగలవారనే నా విశ్వాసం. తన అహింసకుగల పరిమితులను కాంగ్రెసు అధ్యక్షుడు నిష్కపటంగా వివరించాడు. నాకాయన హృదయం తెలుసు. ఆయన మనస్సు నాకు తెలియకపోతే ఇంకెవరికీ తెలియదనే చెప్పాలి. ఆయన వివరించిన పరిమితులలో ఆయన అహింస యే ఆకర్షణలకూ లొంగిపోయేదికాదు. నాలాగా సాహేబుకున్న పరిమిత విశ్వాసంగల సహచరులతో హిట్లరుకు వ్యతిరేకంగా అహింసాయుత నిరోధమునకు పూనుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు. అయితే ఆ అహింస పరీక్షకు నిలవగలదా లేదా అనే సంగతి విచారణీయాంశం. ఇంతవరకు నేను పొందిన విజయం అటువంటి సాధనసామగ్రితోనే. పత్రికా స్వాతంత్ర్యంకానీ వాక్స్వాతంత్ర్యముకానీ నిరాఘాటంగా ఉండవలెనని నేను కోరుతూన్నట్లు మీరు వ్రాశారు. అహింసకు అనుగుణంగా ఉన్నంతవరకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఉండవలెనని మాత్రమే నేను కోరింది.

కాంగ్రెసు మంత్రుల పరిమితచర్య ఈ హద్దును మించిపోయినట్లు నాకు తెలియదు. నిజంగా అలా జరిగినట్లయితే అది కాంగ్రెసు విధానానికి వ్యతిరేకం. నేను దానిని ఉదాహరణంగా గానీ ప్రమాణంగా గానీ తలంచను.

వాక్స్వాతంత్ర్యం కోసం నేను కోరిన ఈ కోరిక బ్రిటిష్‌వారినుండి "రాజకీయ ప్రయోజనాలను బలవంతంగా గుంజుకోవడానికి పన్నిన పన్నుగడ" అని అనడం నాకన్నిటికంటెను ఎక్కువ బాధాకరంగా ఉంది. శాసనోల్లంఘనం చేస్తానని బెదిరించి రాజకీయ ప్రయోజనాలను పొందినప్పటికీ కూడా తప్పుకాదు. కాని పూనా తీర్మానం రద్దయినసంగతి ప్రజాబాహుళ్యానికి విదితమే, యుద్ధం కొనసాగుతూవున్నంతవరకూ కూడా నాకు సంబంధించినంతవరకది రద్దయినట్లే.

నిజంగా వాక్స్వాతంత్ర్యం పునరుద్ధరింపబడి ఎప్పటిస్థితికి వచ్చినట్లయితే శాసనోల్లంఘనం ఉపసంహరింపబడేమాట నిశ్చయం.

ఇంతవరకు పూర్వపుటుద్యమాలు చాలాకాలం కొనసాగుతవని నేనెన్నడూ అంచనావేసి ఉండలేదు. కాని ఈ ఉద్యమం విషయంలో నేనలా అంచనా వేశాను. ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం లభిస్తేనేతప్ప యుద్ధం జరుగుతూండగా కాంగ్రెసుకు బ్రిటనుతో రాజీ కుదరడానికి వీలులేదు. ఎందుకల్లనంటే బ్రిటనుకు కావలసిన మనుష్యులనూ, ధనాన్నీ యిచ్చి యుద్ధసన్నాహాలకు తోడ్పడడానికి కాంగ్రెసు అచ్చుకోజాలదు. యుద్ధసన్నాహాలకు తోడ్పడేటందుకు కాంగ్రెసు ఆమోదించడమంటే ఇరవై సంవత్సరాలనుండి ఆ సంస్థ అవలంబిస్తూన్న విధానాన్ని ఒక్కసారిగా తలక్రిందులు చేయడం. అంతేకాక యుద్ధం జరుగుతూండగా రాజీనామా ద్వారా స్వాతంత్ర్యం లభించదు. కాబట్టి అహింసాయుతంగా అభివృద్ధికావడానికి సంపూర్ణస్వాతంత్ర్యం ఉంటేచాలు. కాంగ్రెసు సంతృప్తిపడుతుంది. ఇండియాలోని అన్ని పక్షాలవారికీ అందఱు ప్రజలకూ సంబంధించియే కాంగ్రెసీ కోరిక కోరింది.

ఈ అన్ని సంగతులూ తెలిసి ఉండికూడా నేనీ ఉద్యమం సాగించడం న్యాయమా, అనీ నైతికంగా మంచిదా" అనీ మీరు ప్రశ్నిస్తూ కాదని జవాబుకూడా మీరే చెప్పుకొన్నారు. మీ జవాబుతో నేనేకీభవించను. పైన వివరించిన ప్రకారం అసలు మీరు వ్రాసిన విషయాలు సత్యములని నేనంగీకరించడంలేదు. ఇక మీ జవాబును నేనామోదించడమంటే నా తెలివి తేమిని తెలియచేస్తుంది. అహింసాశక్తిలో అర్ధశతాబ్దమునుండీ నాకుగల అచంచల విశ్వాసాన్ని త్రోసిపుచ్చడమవుతుంది. నేను ఓడిపోతూన్నట్లుగా కనిపించవచ్చును నన్నితరులెంత తప్పుగా అర్థం చేసుకొన్నప్పటికీ కూడా నావిశ్వాసాని కనుగుణంగా ఆచరిస్తూ జీవించదలచుకొన్నాను. నేనా విధంగా ఇండియానూ బ్రిటనునూ ప్రపంచ ప్రజానీకమునూ సేవిస్తూన్నట్లు భావిస్తున్నాను. బ్రిటనుకు అశుభం కలిగి ఇండియాకు శుభం కలుగవలెననికానీ, జర్మనీ నాశనమై ఇంగ్లాండు జీవించవలెననికానీ నేను కోరను. హిట్లరు పుట్టుతూ గిట్టుతూ ఉంటారు. హిట్లరు చచ్చిపోయినా ఓడిపోయినా అతని తత్వం నశిస్తుందని నమ్మేవారు చాలా పొరపడుతున్నారు. ఆ తత్వాన్ని ఎదుర్కోవడమెలాగా అనేదేప్రశ్న. హింసాయుతంగానా అహింసాపూర్వకంగానా అని ఆలోచించాలి. హింసాయుతంగా ఎదుర్కోవడమంటే ఆదుష్ట తత్వాన్ని బలపరచడం. అహింసాయుతంగా అయితే ఆ తత్వాన్ని బలహీనపరచడం."

గాంధీజీ నిరంతరం సూచనలు చేస్తూనే ఉన్నారు. ఆయన ఎప్పటికప్పుడు భారతప్రజానీకముయొక్క నాడిని పరీక్షిస్తూ జాగరూకతతో ఉన్నారు. ఆదివారాలు సెలవుదినములుగా ప్రకటించబడినవి. మధ్యలో క్రిస్టమస్ వచ్చింది డిశంబరు 23

మొదలుకొని జనవరి నాలుగో తేదీవరకూ సెలవులు. 5 వ జనవరి ఆదివారమయింది. ఫిబ్రవరి మొదటివారమునుండీ గాంధీ అరెస్టు కావచ్చుననే ప్రవాదం బయలుదేరింది. 1941 ప్రారంభంలో రాష్ట్రీయ గవర్నరులు ఒకరితరువాత ఒకరు రాజప్రతినిధిని సందర్శించారు. గాంధీని అరెస్టుచేయడం మంచిదా కాదా అనే విషయంలో అంతకు పూర్వంనుండీ గవర్నరుల సలహాను అడుగుతూన్నట్లున్నూ ఇప్పుడు ప్రత్యక్షంగా కూడా ఆ సంగతి మాట్లాడినట్లున్నూ నమ్మదగిన వార్తలు బయలుదేరినవి. కాని గాంధీ తనంతటతాను యుద్ధప్రతికూల కార్యకలాపంలో జోక్యం కల్గించుకొనేటంత వరకూ ఆయనను అరెస్టుచేయడం ఉచితంకాదని ప్రభుత్వం తలచినట్లు తోచింది. ఇంతకుపూర్వం గూడూరు సబ్‌డివిజనల్ మేజస్ట్రేటు మిస్టరు గిల్లెట్ అభిప్రాయాలను వ్రాసి ఉన్నాము. వాటికి ఇండియా ప్రభుత్వం వారి అభిప్రాయాలకూ ఎంత భేదం ఉందో ఆలోచించండి. సత్యాగ్రహుల జాబితాలనుగూర్చి అప్పుడప్పుడూ పరిశీలన జరుగుతూవచ్చింది. 1941 జనవరి ప్రారంభంలోనే సత్యాగ్రహమునునడిపే ప్రతినిధులందరికీ గాంధీ గట్టిగా ఉత్తరువులు జారీచేశాడు. సత్యాగ్రహిగా నిర్ణయించబడిన ప్రతిమనిషీ సంపూర్ణహృదయంతో నూలు వడకవలెననీ ఎన్నిగజాలు వడకగలిగిఉన్నాడో ఏనంబరు నూలు వడుకుతున్నాడో కూడా చెప్పగలిగి ఉండాలనీ వార్ధాకు వెళ్ళిన ప్రతినిధులకు గాంధీ ఆదేశం ఇచ్చిఉన్నాడు. ఆయనయొద్దకు వెళ్లిన కొంతమంది, సత్యాగ్రహులు నూలువడుకుతున్నారని తాము చెప్పలేమనీ అన్నారు. వారిలో ఒకాయన తనకు నూలు వడకడం తెలుసునన్నాడు.

"అయితే ఎంత వడుకుతారు మీరు?"

"అయిదు లేక పదిగజాలు"

"ఈ అయిదు లేక పదిగజాలు రోజుకా వారానికా నెలకా?" అన్నాడు గాంధీ

"ప్రతిరోజూ కాదు" అన్నాడా ప్రతినిధి

ఇక తక్కిన విషయాలు పరిశీలించవలసిన అవసరమే లేకపోయింది

1940 సెప్టెంబరు నెలలో చేయబడిన బొంబాయి తీర్మానం, స్వరాజ్యపోరాటంలోనేకాక స్వతంత్రభారతదేశంలో కూడా సాధ్యమైనంతవరకు అహింసావిధానాన్ని అవలంబించి ఆచరించుటయందు కాంగ్రెసుకు గట్టి విశ్వాసమున్నట్లు విస్పష్టం చేసింది. ఈ యుద్ధంలో తటస్థించిన క్లిష్టపరిస్థితివలన భవిష్యత్తునుగూర్చి ఆలోచించక తప్పిందికాదు. స్వరాజ్యమును సంపాదించడం విషయమేకాక దానిని కాపాడుకొనే

విషయంకూడా ఆలోచించబడింది. కాబట్టి బొంబాయి తీర్మానం పూర్వస్థితి కనుగుణంగా కలిగిన అభివృద్ధి 1941 జూన్ ప్రారంభంనాటికి సత్యాగ్రహముయొక్క రెండవదశ గడిచింది. కాబట్టి ఆనాటి పరిస్థితులను సమగ్రంగా సింహావలోకనం చేయడం అవసరం. ఒకటవ జూన్‌నాటి స్థితిని, నిర్మాణ కార్యక్రమమునకు గాక సత్యాగ్రహోద్యమానికి సంబంధించినంతవరకు మహాదేవదేశాయి యిలా సంగ్రహంగా వ్రాశాడు :—

" సత్యాగ్రహముయొక్క రెండవదశ గడిచింది. కాబట్టి నేటి పరిస్థితులను సమగ్రంగా పరిశీలిద్దాం ఈ ఉద్యమంయొక్క సహజస్వభావమును బట్టి దీనివలన యింత ఫలితం కలిగిందని లెక్కవేయడానికి వీలులేదు. ఒకానొక ప్రాథమిక హక్కును గుర్తింప చేయడమే ఈ ఉద్యమం యొక్క ప్రస్తుతాశయం. దానిని నిరభ్యంతరంగా చలాయించడం వలనగానీ లేదా కావలెనని కారాగారవాసశిక్షను కొనితెచ్చుకోవడం వలనకానీ అది గుర్తింపబడవచ్చును. వాయవ్య సరిహద్దురాష్ట్రాల ప్రభుత్వంవారు వాక్స్వాతంత్ర్యమునూ పత్రికా స్వాతంత్ర్యమునూ ప్రకటించకపోయినప్పటికీ అక్కడ ఆ స్వాతంత్ర్యం వచ్చినట్లుగానే భావింపబడుతూన్నది అక్కడి ప్రభుత్వంవారు సత్యాగ్రహులను అరెస్టు చేయడంలేదు. అందువలన వారికి లాభం లేకపోవడమే దానికి కారణం. రాష్ట్రప్రభుత్వాలేమి చేస్తూన్నవి ఏమిచేయడంలేదు అని కాదు మనమిప్పు డాలోచించవలసింది. మన కర్తవ్యమును మనం సరిగా నిర్వర్తిస్తున్నామా లేదా అనియే మనం పరీక్షించుకోవలెను. ఈ ఉద్యమం స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగం. కాబట్టి యిది మనలోని సత్యమునూ అహింసనూ ఆత్మపరిశుద్ధతనూ అభివృద్ధి చేస్తుంది.

" ఢిల్లీ యాత్రికులూ అరెస్టుకానివారు కూడా ఉన్నారు. వీరు తేలికగా కొన్ని వేలమంది అవుతారు. వారిలో కొంతమంది చాలా ప్రఖ్యాతంగా పనిచేశారు. శ్రీమతి దమయంతీ దర్మాధికారి, శ్రీమతి సరయూతాయిధోత్రే వారిలో ముఖ్యులు. వీరు నిర్మాణ కార్యక్రమముయొక్కయూ సత్యాగ్రహముయొక్కయూ సందేశాలను షుమారుగా 80 గ్రామాలకు అందజేశారు. వీధులూడ్వడం హరిజనవాడలను సందర్శించడం, అందఱూ కలసి వడకడం, సాయంత్రం సభజరపడం— ఇవీ వారి దినసరి కార్యక్రమం. వారి ప్రయాణం చాలా ప్రయోజనం కలిగించింది. మూడు దేవాలయాలలో హరిజనులకు ప్రవేశం లభించింది. వారు వెళ్ళిన చోటులలో వడకవలెననీ ఖాదీ ధరించ

వలెననీ ఆసక్తి కలిగింది. ఆరు పర్యాయములు పెద్ద పెద్ద జరిమానాలు చెల్లించి చివరకు ఆరుమాసాల ఖైదును సంపాదించుకోగలిగిన సుప్రసిద్ధ జకత్ దారు కోడలు శ్రీమతి ప్రభావతీ జకత్ దారు ఈ యిద్దరు సోదరీమణుల అడుగుజాడలలో నడుస్తూన్నది. వీరిరువురు ఇప్పుడు నాగపురం కారాగారంలో విశ్రాంతి తీసుకొంటూన్నారు.

ఢిల్లీయాత్రికులు చేసేపని ఎంతకష్టమైనదో అంత ఆకర్షణీయమైనదికూడా. బెంగాలు గ్రామాలలో ఒకానొక సత్యాగ్రహి ఆహారం లేకుండా కొన్నిరోజులుండవలసివచ్చింది. గ్రామస్థులాయనకు ఆతిథ్యమీయడానికి భయపడ్డారు. కాని ఆతని ఓరిమీ పట్టుదలా చూచి ఒకానొక జమీందారు ఆతడు పోయినచోట్ల ఆతనికి కావలసిన ఆహారమును లభింపచేసే బాధ్యతవహించాడు. ఆంధ్రా తమిళ నాడులలోని వందలకొలదీ సత్యాగ్రహులు తమ తమ అనుభవాలను గడిస్తున్నారు. వారు ఉత్సాహకరములైన స్వాగతాలను అందుకొంటూ యుద్ధనిధులు బలాత్కారంగా వసూలుచేయబడుతూన్న విధానమును కళ్లారా చూస్తున్నారు.

ఈ యాత్రలనుగూర్చి మంచిగానూ చెడ్డగానూ మంచీచెడూ లేకుండానూకూడాని వేదికలు చేరుతూన్నవి కొంతమంది యాత్రికులు అనాలోచితములైన ఉపన్యాసాలిస్తూన్నట్లు మాకు ఉత్తరాలు చేరుతూన్నవి. దుష్టమైన అబద్ధపువదంతులు వ్యాపింపచేయడానికి కొంతమంది మద్యరాష్ట్రాల సత్యాగ్రహులు బాధ్యులైనట్లుగా నిందారోపణలు చేసింది మధ్యరాష్ట్ర ప్రభుత్వం. ఈ ఆరోపణలను మేము విచారిస్తూన్నాము. అవి నిజమని తేలితే మేము తప్పక విచారపడవలసి ఉంది. చాలామంది సత్యాగ్రహులు నిజాయితీకలవారు గొప్పవారు కూడా. వీరంతా గ్రామాలనుండీ వచ్చినవారు, కాని వీరికి భాషాజ్ఞానమంతగాలేదు. అటువంటివారు ఉపన్యాసాలీయకుండా నిర్మాణ కార్యక్రమం మీదనే వారి దృష్టిని నిగుడించాలి. తగినంత హిందూస్థానీ భాషాజ్ఞానం ఉంటేనేతప్ప ఎవ్వరూకూడా సాహసించి తమ రాష్ట్రాన్ని విడిచిపోకూడదు. వీరిలో చాలామంది 'అనామకుల'యినప్పటికీ తమ ఆశయం నెరవేరేవరకూ ఎక్కడా ఆగకుండా అన్ని కష్టాలనూ ఓర్చుకొని తమ యాత్ర కొనసాగించవలెననే నిశ్చయంతోనే బయలుదేరారు.

"ఇటువంటి సందర్భాలను ఇంకా అనేకం వ్రాయవచ్చును. కాని కేవలం నిరాడంబరముగానూ నిశ్శబ్దంగానూ ఢిల్లీయాత్ర సాగించవలెనని నిశ్చయించుకొన్నంత మాత్రాన చాలదు. కొన్నివందలమంది ఢిల్లీయాత్రికులు అరెస్టుకాలేదని నేనిదివరకే చెప్పిఉన్నాను. వేలకొలది సత్యాగ్రహుల జాబితాలను ఇంకా ఆమోదించవలసి ఉన్నది. ఈ జాబితాలనుకూడా అంగీకరించి ఇంకా ఎక్కువమంది సత్యాగ్రహులను

గ్రామస్థుల నెత్తిని పెట్టడం ఉచితమా అని ఆలోచించుకోవాలి. కాబట్టి ఆయా ప్రదేశాలలో సంచారం చేస్తూన్న సత్యాగ్రహుల సంగతి సమగ్రంగా తెలిసేదాక కొత్త జాబితాలను అంగీకరించకూడదని నిశ్చయింపబడింది. కొన్నిచోట్ల మతకలహాలు తటస్థించినవి కాని ఆకలహాలకు ఎక్కడాకూడా మన సత్యాగ్రహంతో సంబంధంలేదు: వ్యక్తిసత్యాగ్రహంలోని ఈ సుగుణాన్ని మనం అభినందించి తీరాలి. అయితే శాంతికి భంగంకలుగుతూన్న ప్రదేశాలలోకానీ ప్రజలు భయభ్రాంతులుగానున్న ప్రదేశాలలో కానీ సత్యాగ్రహం చేయడం వ్యక్తులకుగూడా తగనిపని. కల్లోల ప్రదేశాలకుగానీ కల్లోలం కలుగుతుందని తోచిన ప్రదేశాలకు కాని పోయి ప్రజాహృదయంలో ధైర్యమును పురిగొల్పడమే సత్యాగ్రహి చేయవలసిన పని.

కల్లోల ప్రదేశాలలో ప్రస్తుత సత్యాగ్రహులకు, కానున్న సత్యాగ్రహులకూ కూడా కావలసినంత పనిఉంది. ఇతర ప్రదేశాలలో - ముఖ్యంగా అరెస్టుకాని అనేక మంది సత్యాగ్రహులు సంచారంచేస్తూన్న రాష్ట్రంలో - కాబోయే సత్యాగ్రహులు ముందుగా కఠిన పరీక్షకు గురికావలసిఉంది. వారు గ్రామాలలో నివసిస్తూ తమదినసరి కార్యక్రమాన్ని ఒక డైయరీలో వ్రాస్తూఉండాలి. వీథులూడవడం హరిజన పల్లెలను దర్శించడం, కల్లుదుకాణాలకు పోకుండా ప్రజలను నిరుత్సాహపరచడం, అందరూ కలసిమెలగడం, హిందూ ముస్లిం ఐక్యతకు కావలసిన ప్రత్యక్షకార్యమును దేనినైనా నిర్వర్తించడం, దొమ్మీలను అణచేటందుకు సహాయపడడం మొదలైన పనులను వారు నిర్వర్తించాలి. కానున్న సత్యాగ్రహులందరూ తమ కాలమును ఈ విధంగా సద్వినియోగం చేసేయెడలవారు సత్యాగ్రహం చేయకమునుపే అరెస్టుచేయబడడానికి కూడా సావకాశముంది. ప్రభుత్వంవారి నిర్వచనం ప్రకారం వారు 'అనామకులు' కావచ్చును. కానీ తాము నిర్వర్తించే పనిద్వారా మామిత్రులు తమశక్తిని ప్రదర్శింపగలిగిన యెడల ప్రభుత్వంవారు తమ నిర్వచనమును మార్చుకోగలరు.

ఇందుకు ఉదాహరణం లేకపోలేదు. సంయుక్తరాష్ట్రాలలో సత్యాగ్రహులేకాక నిర్మాణ కార్యకర్తలుకూడా అరెస్టు చేయబడుతూన్నారు. శ్రీ ధీరేన్ మంజుదారు విషయమిదివరకే చెప్పిఉన్నాను. మరొకరు సుప్రసిద్ధకవి మైథిలీశరణగుప్త. ఈయనను ఎందుకరెస్టు చేశారో ఆదేవునకే ఎరుక. ఆయన ఇంట్లో చరఖా తరగతులను సాగిస్తూన్నందుకాయన అరెస్టుచేయబడ్డాడని ఆయన చుట్టాలూ స్నేహితులూ అనుకొంటూన్నారు.

ఈ ఉద్యమం ఒక అద్భుత సంఘటనం కొరకు ఉద్దేశింపబడలేదు. ఇది కల్లోలం కలిగించద్దు. తెలియనివారూ స్వప్రయోజనపరులూ మతకలహాలనూ సత్యా

గ్రహానికి అంటకడుతున్నారు. కాని వాటికీ సత్యాగ్రహానికీ ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గానీ ఎక్కడా సంబంధం లేదు. సత్యాగ్రహం జయప్రదమైతే కాంగ్రెసు వారికీ కాంగ్రెసేతరులకూ కూడా ప్రయోజనం కలుగుతుంది. అది అపజయం పొందనే పొందదు. ఒకవేళ పొందితే ఇచ్ఛాపూర్వకంగా పొందే బాధనే అపకారమనుకొనేటట్లయితే- కాంగ్రెసువారికి తప్ప యింకెవరికీ అందువల్ల అపకారంలేదు. పంజాబు న్యాయవాద సంఘంవారు నిష్పక్షపాత సలహాసంఘంగా యేర్పడి తెను అభిప్రాయం ప్రకారం అన్యాయ్యం జరిగిందనుకొన్న సత్యాగ్రహుల కేసులన్నింటినీ హైకోర్టుకు తీసుకొనిపోయేటందుకు నిర్ణయించుకొన్నారు."

పరిస్థితులు మారినందున సత్యాగ్రహ పోరాటం సలక్షణంగా జరిగేటందుకు నూతన నియమావళిని తయారు చేయవలసి వచ్చింది. అ. భా. కాం. సం. సాధారణ కార్యదర్శి ఆచార్యకృపలానీ గాంధీతో సంప్రదించినపిమ్మటసత్యాగ్రహులయొక్కయూ కాంగ్రెసు కమిటీలయొక్కయూ ఉపయోగం నిమిత్తం 1941 జూన్ 17 వ తేదీని ఈ క్రింది సూచనలను చేశారు.

(౧) విడుదలచేయబడిన సత్యాగ్రహి సాధ్యమైనంత త్వరలో తిరిగీ సత్యాగ్రహం చేయ ప్రయత్నించవలెను. ఏకారణము వలనసైనా ఆయన అలా చేయజాలనియెడల రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుని ద్వారాగానీ,లేక రాష్ట్ర కాంగ్రెసుకు యాజమాన్యము వహిస్తున్న మరొక ఉద్యోగిద్వారా గానీ తనను సత్యాగ్రహం చేయకుండా మినహాయించవలసిందని గాంధీజీకి దరఖాస్తు పెట్టుకోవలెను అందులో దరఖాస్తుదారు తనను మినహాయించవలసిన కారణాలనుకూడా ఉదాహరించవలెను.

(౨) సత్యాగ్రహం చేయదలచుకొన్న వ్యక్తియొక్క దరఖాస్తు గాంధీజీకి పంపబడిన తేదీనుండి, ఆయన, తన సొంతపనులను విరమించి ఈక్రింది నిర్మాణ కార్యక్రమంలోని 13 అంశాలలో యేదో ఒకదానిలోకానీ, కొన్నింటిలోగానీ పూర్తిగా నిమగ్నుడు కావలెను.

(అ) హిందూ ముస్లిం సఖ్యతలేక సాంఘిక సామరస్యము (ఆ) అంటరాని తనము పోగొట్టుట, (ఇ) మత్తుపదార్థ నిషేధము (ఈ) ఖాదీ (ఉ) ఇతరగ్రామ పరిశ్రమలు, (ఊ) గ్రామపరిశుభ్రత (ఋ) నూతన లేక ప్రాథమికవిద్య (ౠ) వయోజనవిద్య (ఌ) స్త్రీజనా అభ్యుదయము (ౡ) ఆరోగ్యము పరిశుభ్రతలను

గూర్చి బోధించుట, (ఎ) రాష్ట్రభాషా ప్రచారము, (ఏ) మాతృభాషాభిరుచిని పెంపొందించుకొనుట (ఐ) ఆర్థికసమానత్వము కొఱకు పనిచేయుట.

(3) సత్యాగ్రహి కానున్న ప్రతివ్యక్తీ దినచర్య వ్రాస్తూ ఉండాలి. దానిని పదిహేనురోజుల కొకతూరి రాష్ట్రకాంగ్రెసు సంఘానికి పంపుతూ ఉండాలి. ప్రతిదినమూ సరియైన పనిచేస్తూ తమ అర్హతను ఋజువుచేసుకొన్న కార్యకర్తలకు మాత్రమే సత్యాగ్రహం చేయడానికి అనుజ్ఞ ఈయబడాలి.

(౪) సత్యాగ్రహ పోరాటం ముందుముందు బాగా అభివృద్ధియై క్రమ క్రమంగా కష్టసాధ్యం కానున్నందున సత్యాగ్రహ జాబితాలను అంగీక రించడంలో ఈ నూతన నిబంధనావళి అవసరమయింది కాబట్టి కొత్తగా ఏర్పాటుచేయబడిన సత్యాగ్రహులీ నూతన పరీక్షకు శాళిగలవారుగా ఉండాలి. సత్యాగ్రహుల జాబితాలను అంగీకరించడంలో అనవసరంగా ఆలస్యమవుతూన్న దని చాలా ఆక్షేపణలు వస్తూన్నవి. సత్యాగ్రహం చేసేటందుకు పేరులిచ్చిన వారెవరూ ఆలస్యమవుతూన్నందుకు ఆదుర్దా చెందనక్కరలేదు. ఈ విరామ కాలంలో వారు నిర్మాణ కార్యక్రమమును కొనసాగించవచ్చును.

మొట్టమొదటి షరతులనుబట్టి సత్యాగ్రహిగా చేరిన వారికి క్రొత్త షరతులు నచ్చనియెడల తమ పేర్లను వాపసుసంహరించుకోవచ్చును. అందువలన వారు లజ్జింపవలసిన పనిలేదు, దేశానికి వారు చేయతగిన సేవ చేస్తూనే ఉండవచ్చును. ఆయనమును పటివలెనే కాంగ్రెసువాదిగా ఉండగలరు

(౫) సత్యాగ్రహులుగా చేర్చుకోబడ్డవారు స్థానికసంస్థల ఎన్నికలకు నిలబడ కూడదు. సత్యాగ్రహులుగా చేర్చుకోబడడానికి ముందే అటువంటి ఎన్ని కలకు అభ్యర్థులుగా నిలబడి ఉన్నవారు సత్యాగ్రహం చేయకుండానైనా విర మించుకోవలెను. లేదా అభ్యర్థిత్వమునైనా వదులుకోవలెను సత్యాగ్రహులు ఈ రెండు స్థలాలలోనూ ఒకేసారి ఉండజాలరు.

(౬) స్థానిక సంస్థలో సభ్యుడై ఖైదునుండి విడుదలచేయబడిన సత్యా గ్రహి, గాంధీజీ ప్రత్యేకం అనుజ్ఞ యిస్తేనేతప్ప, స్థానికసంస్థయొక్క సమావేశాలకు హాజరుకాకూడదు. ఒకవేళ ఆయన అలా హాజరయినయెడల ఆయనపేరు సత్యాగ్రహుల జాబితానుండి కొట్టివేయబడును.

(౭) అరెస్టుచేయబడక ఆయాజిల్లాలలో సంచారం చేస్తూన్న సత్యాగ్రహు లున్నూ సత్యాగ్రహులుగా ఆమోదింపబడిన వారున్నూకూడా స్థానిక సంస్థలసమావేశాలకు హాజరు కాగూడదు.

(౮) వర్షకాలంలో అవసరమైతే సత్యాగ్రహి తన సొంత ఊరుకాని ఒకానొక గ్రామంలో కాని కొన్ని గ్రామాల సముదాయంలో కాని ఉండి పోయి సత్యాగ్రహమునూ నిర్మాణ కార్యక్రమమునూ కూడా కొనసాగిస్తూ ఉండవచ్చును.

(౯) అరెస్టుకాని సత్యాగ్రహులు తమ జిల్లాలలో సంచారం చేస్తూకానీ, ఢిల్లీయాత్ర సాగిస్తూకానీ రాష్ట్ర కార్యాలయానికి పక్షనివేదికలను పంపిస్తూ ఉండాలి. ఆయా సత్యాగ్రహుల కార్యకలాపాలనుగూర్చి రాష్ట్ర కమిటీలప్పుడప్పుడూ నిర్ణీతకాలంలో పదిహేనురోజులకో నెలకో ఒకసారి అ. భా. కాం. సం. నకు సమగ్రంగా నివేదిస్తూ ఉండాలి.

(౧౦) కొంతమంది సత్యాగ్రహులు తూలి మాట్లాడుతూన్నట్లుగా ఆరోప ణలు చేయబడుతూన్నవి. నోటికివచ్చినట్లు నిందావాక్యాలతో ఉపన్య సించడం సత్యాగ్రహ లక్షణం కాదు గనుక అలా ఎంతమాత్రం చేయకూడదు"

గాంధీజీ యింత కఠినమైన నియమావళిని ఏర్పాటు చేసినందుకు లాహోరు వాస్తవ్యుడైన డాక్టర్ సత్యపాల్ కోపగించుకొని జులై మధ్యలో యిలా అన్నాడు. "నేడు కాంగ్రెసు విధానంలో ఉన్న మాంద్యస్థితివలననూ క్రియాశూన్యతవలననూ నాకు చాలా ఆశాభంగం కలుగుతూన్నది." "ఇండియాలో ఆంతరంగిక శాంతి లేక పోవడమూ విదేశ దండయాత్రకు సావకాశముండడమూ- అనే ఈ రెండు ఆపదలను మన మెదుర్కోవలసి ఉంది. గాంధీ విధానంలో 'లోపలికైనాపో బయటికైనా రా' అనే పద్ధతి కనిపిస్తూన్నది. సుభాష్ చంద్రబోసు, యం. యన్. రాయిల విషయంలో జరిగిన వ్యవహారములే యిందుకు ప్రబల నిదర్శనాలు.— — — నాకు కాంగ్రెసు నందు కల భక్తిలో యేమీ మార్పులేదు. అది ఎప్పటివలెనే ఉంది — — — అయితే నేను ప్రభుత్వానికి సహాయపడతాననడం, విదేశ దండయాత్రనుంచి మనదే శాన్ని రక్షించుకోవడానికీ, ఈ సందర్భంలో బ్రిటనుకు నేనుచేసే తోడ్పాటు కేవలం ఒక చిహ్నం."అన్నాడు డాక్టరు సత్యపాల్. తాను ప్రభుత్వంతో సహకారం చేస్తూ న్నాడనడం సరియైనమాట కాదనీ, తాను రోజువారీ పరిపాలనలో ప్రభుత్వానికి తోడ్ప

డడం లేదనీ అన్నాడాయన, అంతటితో ఊరుకోక సహాయనిరాకరణ తత్వానికి ప్రతికూలమైన పనులను పంజాబులోని సత్యాగ్రహనాయకులు చేస్తున్నారని వరుసగా తనకు తోచిన వాటిని పేర్కొంటూ కొంత హేళనగా మాట్లాడాడు. తాను సత్యాగ్రహి కాననీ ఈ సత్యాగ్రహంలో తనకు నమ్మకం లేదనీ కూడా ఆయన ప్రకటించాడు. స్వరాజ్య సమస్యను సత్వరంగా పరిష్కరించడానికి సమిష్టి ఉద్యమం కావలెనంటే తన కరమవుతూందని చెబుతూ జనవరి 14 వ తేదీని తన కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా యిచ్చాడీ మాజీ కాంగ్రెసు కార్యవర్గసభ్యుడు. తరువాత ఒక వారానికి అ. భా. ఫార్వర్డుబ్లాకుయొక్క కార్యనిర్వాహక వర్గంవారు సమావేశమై సత్యాగ్రహోద్యమం, గాంధీజీ ప్రబోధించే అహింస, యుద్ధపరిస్థితులు, రాజకీయఖైదీలు–

ఈ అన్ని విషయాలనుగూర్చి అనేక తీర్మానాలు చేశారు.

"సత్యాగ్రహుల యెడల ప్రభుత్వం వారవలంబించే విధానమును గట్టిగా నిరసిస్తూ, మహాత్మా గాంధీచే నడపబడుతూన్న ప్రస్తుత సత్యాగ్రహోద్యమ ప్రయోజనంలో తమకు విశ్వాసంలేదని ఈ కమిటీవారు ప్రకటిస్తున్నారు. న్యాయసమ్మతమూ శాంతియుతమూ అయిన సకల పద్ధతులచేతనూ స్వరాజ్యమును సంపాదించడమే ఆదర్శంగాగల కాంగ్రెసు ప్రాథమిక సూత్రమును 'తు' 'చ' తప్పకుండా ఫార్వర్డుబ్లాకు అనుసరిస్తుంది. మహాత్మాగాంధీతో ఏకీభవించని కాంగ్రెసువాదులు కాంగ్రెసునుండి రాజీనామా ఈయవలదనీ వారు కాంగ్రెసులోనేఉండి నిర్భయంగా ఆందోళనచేసి దానిని అకలంకంగాచేయవలెననీ ఈ కమిటీవారు సలహా యిస్తున్నారు.

భారతదేశమంతటా జాతీయ రక్షకదళాల నిర్మాణమునకు ఈ కమిటీవారు అనుకూలంగా ఉన్నారు. అవి ఆంతరంగిక కల్లోలాలను అణచివేసేటందుకు విదేశ దండయాత్రలను ఎదుర్కొని రక్షించుకోనేటందుకు ఉపయోగపడగలవు. భారతీయులు ఆయుధాలను ఉపయోగించడం విషయంలో చేయబడిన నిబంధనలను తొలగించవలెననికూడా ఈ కమిటీవారు వాదిస్తున్నారు."

## స్థానిక సంస్థలు

ఉద్యమం చురుకుగా నడుస్తూన్న కొలదీ జైళ్ళ వెలుపల చిక్కుపరిస్థితులు తటస్థమయినవి. 1940-41 నాటి యుద్ధ ప్రతికూల సత్యాగ్రహం చాలా విచిత్రమైనది అందులో మంత్రులు ప్రభుత్వ కార్యాలయమునుండి కారాగారములకు ఒక్కసారిగా ఉరికారు. అధికారంలోకివచ్చిన కాంగ్రెసువాదులందరూ మంచి సమర్థతగలిగిన

నిజాయితీ మనుష్యులు. దేశంకోసం చాలాకాలం కష్టనష్టాలనుభవించి ముఖ్యంగా స్థానిక సంస్థలలో అనేక బాధ్యతాయుత స్థానాలను ఆక్రమించి ఉన్నారు. గ్రేటు బ్రిటనంత విస్తీర్ణమూ జనసంఖ్యాకలిగి ఒకవంక రాష్ట్రీయ స్వాతంత్ర్యమును అనుభవిస్తూన్న రాష్ట్రాలలో మంత్రివర్గాలకు ప్రతికూలంగా ఉండే మనుష్యులతో స్థానిక సంస్థలు నిండి ఉండడం ఊహించడానికి వీలులేని సంఘటనం. సత్యాగ్రహోద్యమం ప్రారంభమైనప్పుడు దక్షిణ ఇండియాలోని ౨౬ జిల్లాబోర్డులలోను ౨౪ జిల్లాబోర్డులు కాంగ్రెసువారి అధ్యక్షతకింద ఉన్నవి. మద్రాసు రాజధానిలోని మున్సిపాలిటీలలో ముప్పాతికవంతు కాంగ్రెసు నాయకుల యాజమాన్యంక్రింద ఉన్నవి. స్థానికసంస్థల అధ్యక్షులనూ సభ్యులనూ రాజీనామా యిప్పించే విషయం రామగఢులో చర్చించబడి ప్రతికూలంగా నిర్ణయించబడింది. యుద్ధ సన్నాహాలంత కంతకు తీవ్రంగా సాగుతూన్నకొద్దీ రెండు సంగతులు తటస్థించినవి. యుద్ధ సన్నాహాలకు స్థానిక సంస్థలనుండి విరాళములీయవలెననీ స్థానిక సంస్థలనిధులతో యుద్ధ పత్రాలు కొనవలెననీ ప్రభుత్వంవారి ఒత్తిడి ఎక్కువయింది. ఈ ఒత్తిడిలో కొంత మంది దుర్బలులు లొంగిపోవడం జరిగింది. అందువలన యుద్ధసన్నాహాలకోసం విరాళాలిచ్చిన స్థానిక సంస్థలనుండి కాంగ్రెసువాదులను బయటకు రప్పించడం అవసరమయింది. ఇది స్థానిక సంస్థలలోని కాంగ్రెసువాదులలో కయ్యాలకు కారణమయింది. ప్రభుత్వంవారి ఒత్తిడివలన స్థానిక సంస్థలలో కలిగిన చీలికలమాట అలా ఉండగా దురాశ, కుట్ర మొదలైన సహజ దౌర్బల్యాలుకూడా సభ్యులలో ప్రకోపించినవి. ఇవన్నీ కలసి పూర్తిగా ఒక కల్లోలపరిస్థితిని కల్పించినవి. మద్రాసులో అప్పటి చట్టాన్ని బట్టి స్థానికసంఘాల సభ్యులు వరుసగా హాజరుకానియెడల మూడునెలలకొకసారి వారి సభ్యత్వం పునరుద్ధరింపబడవచ్చును. కాని జిల్లాబోర్డులయొక్కయూ మున్సిపాలిటీలయొక్క అధ్యక్షుల విషయంలో అలా నిరంతరం పునరుద్ధరిస్తూండడానికి వీలులేదు. అయితే కారాగారబద్ధులయినవారు స్వచ్ఛందంగా సమావేశాలకు హాజరు కాకుండా పోయినారా అనే సూక్ష్మభేదమును గూర్చి సందేహంవచ్చింది. ఇంక డిటెన్యూల విషయం యింతకంటెను సంశయాస్పదమయింది. మద్రాసు ప్రభుత్వంవారు తమ అడ్వకేటు జనరలును విచారించగా స్థానికసంఘాల సభ్యులసభ్యత్వం పోదని ఆయన సలహాయిచ్చాడు. ఈ అభిప్రాయమిలాఉండగా మద్రాసు కార్పొరేషన్ వారు యుద్ధసహాయం నిమిత్తం పదివేల రూపాయిల విరాళమిచ్చినందుకు పదిహేను మంది సభ్యులు రాజీనామాయియ్యగా కార్పరేషనులో పదిహేను ఖాళీలేర్పడినవి. జైళ్ళలో ఉన్నసభ్యులుకూడా కొంతమంది ఉన్నారు. సరిగా ఈ సమయంలోనే

మద్రాసు ప్రభుత్వంవారు తమ పూర్వపు ఉత్తరువులను మార్చివేశారు. "జైళ్లలో బంధింపబడిన వారియొక్కయు డిటేన్ చేయబడినవారియొక్కయు స్థానాలు కాళీ అయినవా లేదా అనే విషయం ఒక్కొక్కటిగా న్యాయమూర్తుల సంఘంద్వారా (Judicial tribunal) నిర్ణయించబడవలసిఉంది. వారంతా తమకు సంబంధించిన కేసులను జిల్లాజడ్జి దృష్టికి తీసుకొని రావలెను" అని ఉత్తరువుచేశారు. ఈ ఉత్తరువుల వలన మరొక కొత్తసందేహం కలిగించి. మొదటి 'జి. ఓ.' కు ముందుగా జరిగిన ఎన్నికలు సరియైనవి కాగలవా అనీ, మొదటి జి. ఓ. కూ రెండో జి. ఓ. కు మధ్య ఎన్నికలు జరిగిఉండవలెనా అనీ, వివిధ జిల్లాజడ్జీలు వివిధ రకముల తీర్పులు చెప్పినప్పుడు, కొంతమంది జిల్లాజడ్జీలకడ కేసులు నిలవఉండగా సభ్యులస్థితి యేవిధంగా ఉంటుంది. అని అనేకసంశయాలు కలిగినవి. దక్షిణాదిని పరిస్థితులిలాఉండగా ఉత్తర హిందూస్థానమున బీహారులో దాదాపు క్లిష్టపరిస్థితి యేర్పడింది. అందువలన గాంధీజీ రాజేంద్రబాబుతో ఆలోచించి కాంగ్రెసువాదులు స్థానికసంస్థలనుండి వెలుపలికి రావలెనని నిర్ణయించారు. ఈ లోగా ప్రభుత్వంవారొక జీ. ఓ. పంపినారు. అందువలన గాంధీజీ నిర్ణయం సరియైనదని మరింత దృఢపడింది. ఆ. జి. ఓ. ఇది:—

"ఇండియారక్షణ చట్టంలోని నియమావళి మార్పువలన, ముందు జాగ్రత్త కోసం కావలసిన చర్యలను తీసుకొనేటందుకు స్థానికాధికారులను కోరడానికి ప్రభుత్వానికధికారం లభించింది. శత్రువులు దండయాత్ర చేసేపక్షంలో ఆయాప్రభుత్వాలవారు, తమ ఉత్తరువులలో ఉదాహరింపబడిన కాలంలోగా ఆయాస్థానికాధికారుల యాజమాన్యం కిందనున్న ప్రదేశంలోని జనులకుగానీ ఆస్థులకుగానీ హానికలుగకుండా కాపాడేటందుకు ప్రభుత్వాభిప్రాయాన్ననుసరించి అవసరమైన చర్యలను తీసుకోవలయునని స్థానికసంఘాలవారిని ఉత్తరువులద్వారా కోరవచ్చును. లేదా ఆ స్థానికాధికారులు ప్రధానంగా చేయవలసిన కార్యకలాపాలను సక్రమంగా చేయించేటందుకు కూడా ఉత్తరువులు జారీచేయవచ్చును. అప్పుడు -

(అ) ఆ ఉత్తరువులకనుగుణంగా నడుచుకోవడం స్థానికాధికారులవిధి.

(ఆ) అలా నడుచుకోవడానికి కావలసిన వ్యయమును యావత్తూ స్థానికాధికారవర్గంవారు తమ నిధులనుండియే భరించవలెను.

(ఇ) స్థానికాధికార వర్గమువారు నిర్వర్తించవలసిన తదితర కర్తవ్యములన్నిటికంటెను ముందుగా ప్రభుత్వంవారి ఈ ఉత్తరువులను అనుసరించడమే తమ ప్రథమ కర్తవ్యమని వారు భావించవలెను.

ఏ ప్రభుత్వంవారి పరిహద్దులలో స్థానికాధికారవర్గం వారున్నారో, ఆ ప్రభుత్వంవా ఉత్తరువులు చేసిన చర్యలను ఆస్థానికాధికారవర్గంవారు తీసుకోక పోయినా ప్రభుత్వంవారు నిర్ణయించిన కాలంలోగా ఆ చర్యలను స్థానికాధికార వర్గంవారు పూర్తిచేసే పరిస్థితి లేదని వారికి తోచినా, ఆ యా ప్రభుత్వమువారా చర్యలను తీసుకొనిగానీ పూర్తిచేసిగానీ, అందుకయిన ఖర్చులను స్థానికాధికారవర్గం వారి నిధులనుండి రాబట్టుకోవచ్చును. అయితే యిందుమూలాన ఆయా ప్రభుత్వంవారి ఉత్తరువులను ఉల్లంఘించినందుకు జరుపబడే చర్యకేమీ భిన్నం రాకూడదు

ఆ యా స్థానికాధికారవర్గం అనే మాటకు అర్థం కంటోన్మెంటు అధికారులు. పోర్టు అధికారులు అని, మేజరు పోర్టులు కేంద్రప్రభుత్వాధికారంలోనూ ఇతర స్థానికాధికార సంస్థలు రాష్ట్రప్రభుత్వాధికారంలోనూ ఉంటూన్నవి.

సత్యాగ్రహం ప్రాముఖ్యమైన విషయాలనుగూర్చి యావద్భారతదేశమునకు సంబంధించి నడుపబడుతూన్న మహోద్యమం. ఇందులో అప్పుడప్పుడూ అవాంఛనీయములైన సంఘటనలు జరుగుతూండడం వింతకాదు. అంటే అట్టి సంఘటనలను నిరసించకూడదనికాదు. మత సంబంధమైన పండుగలలోనూ దేవాలయాలపైనా జాతీయ పతాకమును ఎగురవేయవలెనని ప్రజలు కోరడమే ఇందుకొక నిదర్శనము.

ఈ సందర్భంలో 'జాతీయ పతాకము'ను గూర్చి 'హిందూజెండా' నుగూర్చి షిమోగో హిందూమహాసభా కార్యదర్శికి గాంధీ ఒక లేఖ వ్రాశాడు.

ప్రియమైన కార్యదర్శిగారూ!

> గణపతి ఉత్సవాలలో జాతీయపతాకం ఉపయోగింపబడ్డట్లు నాకు తెలిసింది. దేవాలయాలపైన జాతీయ పతాకాన్ని ఉపయోగించడం తప్పు. కాంగ్రెసు జాతీయసంస్థ. కాబట్టి జాతి మతభేదాలతో నిమిత్తం లేకుండా అందరూ అందులో చేరవచ్చును. కాంగ్రెసుకు తదితర మతాల వారి పండుగలలో ఎంత సంబంధముందో హిందూమతము వారి పండుగలతో కూడా అంతే సంబంధ ముంది.

సత్యాగ్రహం సక్రమంగానడుపబడుతూన్నదని గాంధీసంతృప్తిపడుతూన్నట్లుగా పత్రికలలో పదేపదే ప్రకటనలు చేయబడ్డవి. గాంధీపక్షాన కాంగ్రెసు

సాధారణ కార్యదర్శి శ్రీ కృపలానీ ప్రకటనలుచేస్తూ వచ్చాడు ప్రతి చిన్ని సంఘటనమునుగురించి గాంధీ యేమనుకొంటున్నాడో, ఆ సంఘటనముతో ఉద్యమానికి ఎంతదూరపు సంబంధం ఉన్నదో బయటి ప్రపంచానికి ఎప్పటి కప్పుడాయన తెలియచేస్తున్నాడు.

గాంధీ శ్లాఘించడంలోగానీ నుందలించడంలోగానీ ప్రభుత్వమునెడలను ప్రజల యెడలనూకూడా నిష్పాక్షికంగా ప్రవర్తిస్తున్నాడు. తనను కలుసుకోవలెననీ వార్తాపత్రికకు రాసున్న కుమారిపర్షిడ్ నౌరోజీని నిరోధించినందుకు ప్రభుత్వాన్ని ఆయన తీవ్రంగామందలించాడు. ఆమెకేసుయొక్క పూర్తివివరాలు మఱొకచోట ఈయబడినవి. గాంధీయొక్క తీవ్ర విమర్శకు గుఱియైన తరువాత ఒక వారం రోజులలో ప్రభుత్వమువారామెను విడుదలచేశారు.

ఒక్కొక్కప్పుడు కాంగ్రెసువాదులపైన అవమానకరములైన నిరోధములు కల్పించబడినవి; ఒక సందర్భంలో వాటిని ఉల్లంఘించవలెననికూడా గాంధీ స్పష్టంగా చెప్పి ఉన్నాడు.

సేవాగ్రామంలోనున్న గాంధీనుండి ఇక్బాల్ కృష్ణకపూరుకు సెప్టెంబరు 15 వ తేదీతో ఈ దిగువ ఉత్తరం వచ్చింది

“ ప్రియమైన కపూర్ ! నీకేసు స్పష్టంగా కనిపిస్తూ ఉంది. నీపైన జారీ చేయబడిన ఉత్తరువు అవమానకరంగా ఉంది. నీవు సత్యాగ్రహిగా గాక స్వాతంత్ర్యమని వ్యవహరింపబడేదానికంటెకూడా ఆత్మగౌరవాన్ని ఎక్కువగా చూచుకొనే వ్యక్తిగా ఆ ఉత్తరువును ఉల్లంఘించాలి. కాబట్టి ఇందుకు సాధారణ ఉత్తరువులవసరం లేదు.

మీ శ్రేయోభిలాషి,

యం. కె. గాంధీ.

ఇక్బాల్ కృష్ణకపూర్ ఇండియా రక్షణ నియమం 129 కింద డిటేన్ చేయబడి రెండు నెలలయిన తరువాత సెప్టెంబరు 6 వ తేదీని కాన్పూరు జిల్లానుండి విడుదల చేయబడిన సంగతి పాఠకులకు తెలిసే ఉంటుంది. ఆయన విడుదలచేయబడగానే యు. పి. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, ఆయనను కొత్వాలీ పోలీసు స్టేషన్ సరిహద్దులనుదాటి ఎక్కడక్కూ పోకూడదనీ, వారానికొకసారి స్వయంగా కొత్వాలీ పోలీసు

స్టేషనుకు వచ్చి కనపడి పోవలెననీ, సత్యాగ్రహోద్యమానికి సంబంధించిన యే కార్యకలాపాలలోనూ జోక్యం కల్గించుకోవలదనీ ఆయనపైన ఉత్తరువులను జారీ చేశాడు.

కృపాని సత్యాగ్రహి కానేకాడు. పైగా కాంగ్రెసు కార్యకలాపాలనుండి కూడా ఆయన చాలా దూరంగా ఉంటున్నాడు. కాని ఇటీవలనే ఆయన కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో యెక్కువ ఉత్సాహంతో పాల్గొంటూ వచ్చాడు. అది కారణంగా ఆయన రెండు నెలలు డిటేన్ చేయబడ్డాడు. తనమీద జారీచేయబడిన నిరోధపుటుత్తరువులనుగూర్చి యేమిచేయవలెనో సలహాకోరుతూ ఆయన గాంధీజీకి వ్రాశాడు.

*        *        *        *        *

ఇంకొక వింత సంగతి. గాంధీ నిర్దేశించిన విధానం ప్రకారం ముందుగా అధికారులకు తెలియపరచి సత్యాగ్రహంచేసి శిక్షింపబడిన సత్యాగ్రహులు కొందరు తిరిగి విడుదల కాగానే ప్రభుత్వం వారిచే డిటేన్ చేయబడిరి. అందుకు కారణాలేవో ప్రభుత్వంవారికే బాగా తెలిసి ఉండాలి. మొదటిలో దక్షిణ ఇండియాలోని డిటిన్యూలందరూ ఒకటే తరగతిలో ఉంచబడిరి. తరువాత 1941 మధ్యలో ఎ. బి. తరగతులని రెండు తరగతులుగా విభజింపబడిరి. మొదటి తరగతివారికి రోజు 1 కి 0-4-3 లున్నూ రెండవ తరగతివారికి రోజు 1 కి 0-1-7 లున్నూ భత్యం ఈయబడుతూండేది అంటే శిక్షింపబడి ఖైదులోనున్న 'ఎ' తరగతికీ 'సీ' తరగతికీ యిచ్చే భత్యాలని అర్థం. ఈ తరగతి విభజన మూలకంగా వేలూరు జైలులో నిరసనవ్రతం ప్రారంభమయింది. పైగా నెల 1 కి రు 10 లున్నూ రు 5 లున్నూ తప్పకుండా లవణసు (Allowance) కింద పుచ్చుకొంటూన్న డిటిన్యూల విషయంలో అది రద్దుచేయబడెను. వేలూరులో 150 మంది డిటిన్యూలునార్రు. అందులో ముగ్గురు నలుగురకు మాత్రమే లవణసు వస్తూండేది. అది అయినా రు 7 లు మొదలు 10 రూపాయల వరకూ గల చిన్నచిన్న మొత్తాలు. ఒక డిటిన్యూకు రు 25 లు వచ్చింది. మరొక డిటిన్యూకు అదృష్టవశాత్తూ ఇద్దరు భార్యలుండడం వలన ఒకామెకు రు 10 లున్నూ మరొక ఆమెకు రు 5 లున్నూ యిచ్చారు.

అయితే ఇదంతా యిలాఉండగా తరగతివిభజన అయినందున కొంత అసంతృప్తి కలిగి రెండుతరగతులకూ చెందిన 80 మంది డిటిన్యూలు 1941 మే 5 వ తేదీని నిరశనవ్రతం ప్రారంభించి పదిహేడు రోజులైన తరువాత మే 22 వ తేదీని చేమరతుగా విరమించుకొన్నారు కాని ఈ నిరశనవ్రతం ప్రారంభం కాకమునుపే మద్రాసు

ప్రభుత్వంవారివిషయంలో ఇండియా ప్రభుత్వంవారికి వ్రాసి ఉన్నారని వేలూరులోని నిరశనవ్రతస్థులకు తెలియవచ్చింది. ఈ విషయంలో మద్రాసు ప్రభుత్వంవారిస్థితిని జూచి మనం జాలిపడవలసి ఉంది. వారు కాంగ్రెసు కార్యకర్తలను అరెస్టుచేసి, డిటే యిన్ చేస్తూ చట్టక్రమాలను రక్షించవలసిందిగా కోరబడ్డారు. మద్రాసు ప్రభుత్వానికి తెలియకుండానే తరగతి విభజన జరిగి అమలులోకి తీసికొనిరాబడింది. కేంద్రప్రభుత్వం వారి అపరాధాలకు మద్రాసు ప్రభుత్వంవారు బాధ్యులుకావలసి వచ్చింది. ఈ సంద ర్భంలో కేంద్రప్రభుత్వంవారి వైఖరీ,వారిచర్యలూ, మద్రాసు ప్రభుత్వంవారికే కోప కారణములయినవంటే యేమాత్రమూ ఆశ్చర్యపడనక్కరలేదు. ఏమయినాకానీయండి! కొంతకాలమైన తరువాత రెండవతరగతికి డిటెన్యూలకు 0-4-0 లున్నూ మొదటి తర గతి డిటెన్యూలకు 0-8-0 లున్నూ రోజు 1కి వారి ఆహారంకింద వెచ్చింపబడవచ్చునని ఉత్తరువులు వచ్చినవి. అయితే మొదటివారు రు ౯- లున్నూ రెండవవారు రు 10- లున్నూ తమ ఆహారంకోసం సొంతడబ్బునుండి వినియోగించుకోవచ్చును. అయితే ఎక్కడనుండి వస్తుంవీడబ్బు? చాలమంది డిటెన్యూలు కష్టజీవులు చెమటవోడ్చి సంపాదించుకొనే కార్మికులు. కార్మికసంస్థలంటే ఎద్దుకు ఎఱ్ఱగుడ్డవలె ప్రభుత్వానికి బెదురు. కార్మికసంస్థలతో ఎంతదూరపు సంబంధంకలవారైనా అరెస్టుచేయబడి డిటేన్ చేయబడ్డారు. జైలునుండి విడుదలకాగానే అరెస్టు చేయబడిన సత్యాగ్రహుల విష యంలోకూడా ఈ కార్మికసంస్థల సంబంధం తరచు ఆలోచింపబడుతూనే వచ్చింది. రైల్వేలకు ఓడలకుగానీ, కార్ఖానాలకు నౌకానిర్మాణస్థలాలకుగానీ, యంత్రాలయాలకు ఫ్యాక్టరీలకుగాని, బట్టలమిల్లులకు పంచదార ఫ్యాక్టరీలకుగాని, యంత్రపు పనిముట్లు గల కార్ఖానాలకు చేతిపరిశ్రమల సంస్థలకుగానీ, చిట్టచివరకు బీడీలు, తమలపాకు ఖిల్లీల దుకాణాలకుగానీ సంబంధించిన వారితో సహా ప్రభుత్వంవారి దృష్టిలో రహ స్యంగా పనిచేసే కార్మికులుగా పరిగణింపబడుతూ వచ్చారు. యుద్ధం ప్రారంభమైరెండు సంవత్సరాలు గడచినా రహస్యంగాపనిచేసే కార్యకర్తలు అనేకమంది ప్రభుత్వంవారు పట్టుకోవలెనని ప్రయత్నించినా పట్టుపడకుండా పనిచేస్తూన్నారు. కొన్నిసందర్భాలలో అటువంటివారిని పట్టుకొని ప్రభుత్వమువారు డిటేయిన్ చేయగా వారు జైలునుండియింకా కొంతమంది సామాన్య డిటెన్యూలతో సహా తప్పించుకొని పోవడంకూడా జరిగింది ఇటువంటివారు నలుగురు బళ్లారినుండీ ఐదుగురు వేలూరునుండి తప్పించుకొని పోయి నారు. ఇది దక్షిణ భారత దేశంలోని డిటెన్యూల విషాదగాథ. ఇక పశ్చిమభారతం లోని డిటెన్యూల బాధలు దక్షిణాది డిటెన్యూల బాధలకంటె ఏమాత్రమూ తగ్గగా లేవు. ఇంకా హెచ్చుగానే ఉన్నవి.

# ౧౨. సత్యాగ్రహం - ఆపిమ్మట

సత్యాగ్రహ సర్వసైన్యాధిపతి గాంధీ పరిశీలించి అంగీకరించిన పేర్లుగలవారు మాత్రమే. కాంగ్రెసు ప్రమాణపత్రంలో ఉదాహరించబడిన ప్రకారం వాక్స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనే ప్రత్యేకోద్దేశంతో, ముందుగా మేజస్ట్రేటుకూ, పోలీసువారికీ తెలియపఱచి, నిర్ణీతకాలంలోనూ నిర్ణీత ప్రదేశంలోనూ యుద్ధసన్నాహాలకు సహాయం పడకూడదని బహిరంగంగా ప్రకటించే పరిమిత సత్యాగ్రహం ప్రారంభమై యిప్పటికొక సంవత్సరం గడిచింది. అయితే ఈ ఉద్యమాభివృద్ధిని సంఖ్యాబలమునుబట్టి నిర్ణయించకూడదు. 1921 నాటి సత్యాగ్రహ సమరంలో 30,000 మందిన్నీ 1930 లో 60,000 మందిన్నీ, 1932-33 లో 120,000 మందిన్నీ జైలుకుపోయారు. ఈ సంగతి ప్రపంచానికి బాగా తెలిసిన సంగతియే. ఈ సమరం ఆ పోరాటాల వరుసలోనిది కాదు. దీనివిజయంగానీ అభివృద్ధిగానీ అంకగణితం రేఖాగణితాలనుబట్టి తేల్చతగినది కాదు. తన ఉద్యమం నిరభ్యంతరంగా సాగిపోతుందని దృఢ విశ్వాసమున్నట్లుగా సత్యాగ్రహ సర్వసేనాని గాంధీ అనేకసార్లు ప్రకటించాడు. ఈ సత్యాగ్రహోద్యమం తనకు సంతృప్తికరంగా నున్నదనీ ఈ ఉద్యమాన్ని ఉపసంహరించడంగానీ దీని గమనాన్ని హెచ్చించడంగానీ యిప్పుడు జరగదనీ ఆయన ఇటీవలనే ప్రకటించాడు.

1941 అక్టోబరు 12 వ తేదీని సేవాగ్రామంలో ఆయన పుట్టినరోజు సందర్భమున మూడుకోట్ల గజాల వడుకు నూలున్నూ, 12,000 రూపాయీల రొఖ్ఖమున్నూ గాంధీకి బహుమతి చేయబడింది. అప్పుడాయన నలభైయైదు నిమిషా లుపన్యసించాడు. ఆ ఉపన్యాసంలో ఆయన యిలా అన్నాడు :

“ అనుభవం వచ్చిన కొద్దీ, ఖద్దరు ఉపయోగమును గూర్చిన విశ్వాసం దేశంలో అంత కంతకు పెరుగుతుందని నాకెప్పుడూ నమ్మకం ఉంది. దేశంలో అన్ని మూలలనుండీ ముఖ్యంగా జైళ్లనుండి ఈ సంవత్సరం వచ్చిన వార్తలనుబట్టి చూచినయెడల అత్యంత విశ్వాస పూరితుడనైన నేననుకొన్నదానికంటెకూడా ఎక్కువపని జరిగింది. ఇందువల్ల మనం పూనుకొన్నపని జయంపొంది తీరుతుందని దృఢంగా తోస్తూన్నది. సుప్రసిద్ధ హిందీకవి మైథిలీశరణ గుప్తను ఆయనయున్నూ ఆయన తోడిఖైదీలున్నూ వడికిన ప్రతిగజం నూలువలనను స్వరాజ్యం మఱింత చేరువకు వచ్చిందని వ్రాశాను.

ఇది కేవలం ఉపన్యాసధోరణిలో చెప్పిన అతిశయోక్తి కాదు. నేనను కొన్ని మాటనే నేను చెబుతాను. స్వరాజ్యమంటే నా అర్థం ప్రజాసామాన్యానికి సంబంధించిన స్వరాజ్యమే.

తెల్ల నిరంకుశత్వానికి బదులుగా నల్ల నిరంకుశత్వాన్ని స్థాపించడం స్వరాజ్యం కాదు. నిరుపేదలకు సైతమూ కావలసిన పాలు, నెయ్యి, కూర, పండ్లు దొరకడమే స్వరాజ్యమని నా నిర్వచనం. ప్రతి పురుషునకూ స్త్రీకి శుభ్రమయిన ఇల్లు సముచితమైన భోజనమూ లభించాలి. నేనా ఉత్తరం వ్రాసినప్పుడిటువంటి స్వరాజ్యమే నా మనస్సులో ఉంది.

అన్ని రాష్ట్రాలలోనూ ఉన్న జైళ్ళనుండి వచ్చిన ఉత్తరాలు నా మనస్సుకు చాలా సంతోషమును కల్గించినవి. నాకు వచ్చిన సమాచారం నిజమయితే కమ్యూనిస్టు మిత్రులు కూడా దయతో చర్ఖా వడుకుతూన్నట్లు తెలిసింది. చాలామంది మిత్రులీ పోరాటం వలన ప్రయోజనవేమిటని నిరంతరం అడుగుతూన్న కారణాన యిన్ని వివరాలు చెప్పవలసి వచ్చింది. ప్రభుత్వం వారు దీనిని పరిగణించడమే లేదు.

ఉద్యమంయొక్క ప్రస్తుత గమనం నాకు చాలా సంతృప్తికరంగా ఉంది. దాని వేగాన్ని ఇంతకంటె హెచ్చించడం ఇప్పుడు నాకిష్టంలేదు. అంటే ఇంతకంటె ఎప్పటికీ పెరుగదని కాదు. అహింసా సిద్ధాంతాని కనుగుణంగా క్రమేణా దానంతటది పెరుగుతుంది. ఇప్పుడే ఏదో ఒక అద్భుతం జరిగి తీరాలని ఎవరైనా అనుకొంటే అది అసంభవమని నాతలంపు. అహింస దైవలక్షణాలు కలది. దాని సర్వవ్యాపకత్వం ఇదమిత్థమని వివరించడానికి సాధ్యంకాని పని.

ఇంగ్లాండు దేశపు కష్టస్థితియే మనకు మంచి అవకాశమని అనేకసార్లు అంటూంటారు కొందరు బొంబాయి అ. భా. కాం. సం. సమావేశంలో జరిగిన తీర్మానం అటువంటి విధానానికెక్కడా సావకాశమీయడంలేదు. ఒక ప్రక్క అహింసాయుతంగా ఉంటామని ప్రమాణంచేస్తూ మరొకప్రక్క ఇంగ్లాండుదేశం కష్టస్థితిలోనున్నప్పుడు దానిని మరింత చీకాకు పరచడం కూడనిపని. ప్రపంచాన్ని మోసంచేయడానికి కాంగ్రెసెంతమాత్రమూ ఒప్పుకోదు. కాంగ్రెసు తీర్మానాలంటే జవాబుదారీగల సంస్థయొక్క ప్రమాణవచనాలు.

తుట్టతుదకు అహింస యేవిధంగా జయప్రదం కాగలదో వివరించిచెప్పడానికిది సమయం కాదు. బహుశా మిమ్మలను సంతృప్తిపరచేటంత బాగా

నేను వివరించి చెప్పలేక పోవచ్చును కూడా. కాని అహింస యేవిధంగా పని చేస్తుందో నేను చెప్పగలను. కాబట్టి ఈ క్లిష్ట స్థితిలో ప్రభుత్వాన్ని చీకాకు పఱచే ఉద్దేశం మనకుండ కూడదు.

పెద్దవాళ్ళు కొంతమంది ఈ ఉద్యమంలోకి వచ్చారని ప్రభుత్వం వాపోతున్నారు. పెద్దవాళ్ళ జైళ్ళకు పోకుండా ఉండని రాష్ట్రంలేదని నాకు తెలుసు. అయితే ప్రతిరాష్ట్రంలోనూ నాకు నచ్చినవాళ్ళుకూడా జైలుకు వెళ్ళారు. ఈ వెళ్ళిన కొద్దిమందియైనా తమ సిద్ధాంతాని కనుగుణంగా నడుచు కొన్నట్లయితే మనకు జయం కలిగి తీరుతుంది. అయితే మన నిర్మాణ కార్య క్రమంలోని పదమూడు అంశాలనూ తీసుకొని పనిచేయడమే మనకు జయం కలగడానికి ప్రధాన కారణం.

ఖాదీనిగూర్చి నేను విసుగూ విరామం లేకుండా చెబుతూంటాను. అది నా నిర్మాణ కార్యక్రమానికి కీలకం. ఖాదీలో నమ్మకంలేని కాంగ్రెసువాడి, తన వ్యక్తిజీవితంలో అంటరాని తనమును పాటిస్తున్న కాంగ్రెసువాడి, ఇతర మతాలవారిని ద్వేషించే కాంగ్రెసువాడి, సత్యాగ్రహిగా ఉండేటందు కర్హుడు కాడు. దొంగలూ దోపిడిగాళ్ళూ జైలుకుపోతే ఎంతో ఆయన జైలుకు పోయినా అంతే. శాసనోల్లంఘనం మొక శక్తివంతమైన మహత్తర ఆయుధం. భారతజాతి నిర్మాణ కార్యక్రమమును శ్రద్ధగా కొనసాగిస్తేనే తప్ప ఆ మహాయుధాన్ని మనం సవ్యంగా ప్రయోగించ జాలము.

ఒకసారి జైలుకు పోయినవారు మాటి మాటికీ పోతూఉండవలసిందే. వెనుకడుగువేసే పద్ధతి లేనేలేదు మనకు. అయితే ఈ విషయంలో మనం ఆలో చించి మఱొకవిధంగా చేయడానికి వీలులేదని కాదు.

కొన్ని సందర్భాలలో ఈ సూత్రానికి భిన్నంగా మనం నిర్ణయించ వచ్చును. తానెంత ప్రయత్నించి నప్పటికీ ఒకానొక సత్యాగ్రహి తనశరీ రాన్ని సరియైన స్థితిలో ఉంచుకోలేనియెడల, ఆయన తిరిగీ జైలుకు పోవడానికి నేనొప్పుకోను. అంతేకాదు. అనుకోని సందార్భాలనేకం తటస్థించడంవలన తిరిగీ జైలుకు వెళ్ళడానికి కొంతమంది సత్యాగ్రహులకు వీలుకాకపోవచ్చును. అటువంటివారి విషయంలో మినహాయింపుచేయడం అవసరం. ఈ సందర్భా లలో మన విచక్షణ జ్ఞానాన్ని వినియోగించి నిర్ణయించాలి. కాని సాధార ణంగా అవలంబించవలసిన పద్ధతి స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. ప్రతి సత్యా

గ్రహి విడుదలయిన తరువాత అనవసర కాలయాపన జరగకుండా తిరిగీ జైలుకు పోతూ వుండాలి. ఇది సామాన్య నియమం.

మూడు రాష్ట్రాల పక్షమున మీరు బహూకరించేసిన ఈ సొమ్మును నేనెలా వినియోగించబోతున్నానో ఆసంగతి మీకిప్పుడు చెప్పాలి. ఈసొమ్ము ఖద్దరు పరిశ్రమకు వినియోగపడుతుందని నేను చెప్పకుండానే మీకు తెలిసి ఉంటుంది. మరొక పనికోసం దీనిని నేను ప్రయోగించజాలను. మీ మీ రాష్ట్రాలలోని ఖద్దరు పరిశ్రమకోసం దీనినేవిధంగా వినియోగించడానికి వీలౌతుందో మీరంతా కలిసి సమిష్టిగాగానీ లేక వ్యక్తిగతంగాగానీ నాకున్నూ జాజూజీకిన్నీ సూచనలు చేయకోరుతూన్నాను. మీసూచనలను మేము సమగ్రంగా ఆలోచించ దలచుకొన్నాము.

అహింసా పోరాటంలో చాలా బాధలు పడవలసి ఉంది. చాలా త్యాగం చేయవలసి ఉంది.

యిరోపా ఖండంలో జరుగుతూన్న హింసాపూరిత భయంకర మహాసంగ్రామములో ప్రజలు చెప్పరాని కష్టాలను అయిష్టంగా భరిస్తూన్నారు. మన పోరాటంలో అంత ఎక్కువ బాధ పడవలసిన అవసరంలేదు. ఇక్కడ కావలెనని పదేపదే జైలుకు పొమ్మని మాత్రమే మనం కోరుతున్నాము. ఈ మాత్రం బాధకైనా మనం ఓర్చుకోజాలని యెడల స్వరాజ్యాన్నిగూర్చి మనం మాట్లాడే మాటలన్నీ వ్యర్థ ప్రసంగం."

ఈ ఉద్యమ వార్షికోత్సవంయొక్క ప్రాముఖ్యం కేవలం భావోద్రేకమును కల్గించడంకాదు. రోజుకు నాలుగణాల భత్యంతో దాదాపు ఒక్క సంవత్సరంపాటు రాజుగారి అతిథులుగానుండి తప్పనిసరిగా విశ్రాంతి తీసుకొని వచ్చిన ప్రముఖ నాయకులనేకమంది ఒక్కచో సమావేశం కావడమే. అక్టోబరు 19 నాటికి వార్ధాలో అనేకమంది నాయకులు సమావేశమైనారు. అప్పటికప్పుడే పదకొండుమంది వర్కింగు కమిటీ సభ్యులు జైలునుండి విడుదలైనారు. ఏ వర్గంవారు కూడా ప్రభుత్వంవారి వైఖరినిగానీ చర్యలనుగానీ సమర్థించడంలేదు. అయితే అలా సమర్థించని కారణాలలోమాత్రం ఉభయులకూ భిన్నాభిప్రాయం ఉంది. వారొకప్రక్క కాంగ్రెసు ప్రకటిస్తూన్న ఆత్మగౌరవానికీ పౌరుషానికీ ఆ సంస్థయెడల మనస్సులో సానుభూతి కలిగిఉన్నారు. మరొకప్రక్క రాజకీయ ప్రతిష్టంభనమును తొలగించేటందుకు సూచించబడిన ప్రత్యేక మార్గాలతో యేకీభవించ జాలకుండా ఉన్నారు. కొంతమందికి పూర్తిగా భారతీయ

లతో నిండిన రాజప్రతినిధి కార్యనిర్వాహకవర్గం కావాలి. తక్కినవారికీ ఆకార్య వర్గమే రాజుగారికీ రాజప్రతినిధికీకూడా సమిష్టిబాధ్యత వహించేదిగా ఉండాలి. డాక్టరు సప్రూ నాయకత్వంకింద పనిచేస్తూన్న నిష్పాక్షిక నాయకులు ఈ పైమార్పు లనేకాక, యుద్ధం ముగిసిన తరువాత ఒక నిర్ణీతకాలంలో ఇండియాను అధినివేశంగా ప్రకటించవలెననికూడా కోరారు. అటు ఇటూ చెందని నాయకులనేకమంది, సత్యాగ్రహోద్యమాన్ని విరమించుకోవడం ఉచితమని విసుగూ విరామంలేకుండా గాంధీకి సూచిస్తూ వచ్చారు. ముస్లింలీగువారు మరొక ప్రత్యేకమార్గం త్రొక్కారు. పాకిస్తాన్ సమస్యను పైకి లేవదీసి ఆవిషయం తేలేవరకు యుద్ధసన్నాహాలకు తోడ్పడం గాని రాజప్రతినిధి కార్యవర్గంలోనూ నేషనల్ డిఫెన్సు కౌన్సిలులోను చేరడంకానీ జరుగకూడదని నిర్ణయించారు. ముస్లింలీగు వారాయా రాష్ట్రాలలోని ముస్లిం ప్రధాన మంత్రులు యుద్ధసన్నాహాలకు సంపూర్ణ సహకారము చేస్తూండడమును అరికట్టక పోయినా, వారు లీగు అధ్యక్షుణ్ణి లీగు కార్యవర్గమునూ తృణీకరించి డిఫెన్సు కౌన్సిలులో చేరడానికి అభ్యంతరం పెట్టారు

ఇంగ్లాండు సిరియాను ఆక్రమించుకోవడంతో ప్రారంభమై పర్షియా రాజు రేజాఖాన్ పెహల్వీని రాజ్యభ్రష్టునిచేసి, ఉత్తర పారసీకదేశాన్ని రష్యాయున్నూ దక్షిణదేశాన్ని ఇంగ్లాండున్నూ దాదాపు ఆక్రమించుకొని 1919 నాటివరకూ ఉన్న స్థితినే తిరిగి ఆదేశానికి కల్పించడంతో, ఇస్లాంకు జరిగిన అవమానం పరిపూర్తి అయిందని మహమ్మదీయులు బాధపడుతూన్నమాట వాస్తవం. అంతేకాక ముస్లింలీగు కార్యవర్గంవారు ఇరానునుగూర్చి చేసిన బొంబాయి తీర్మానం, బహుశా ఇండియా రక్షణ నిబంధనలకు ప్రతికూలమని భావింపబడడంచేతనో ఏమో, పత్రికలలో ప్రకటింపబడ లేదు. ఇదికూడా వారికి మరింత చిత్తవిక్షేపమునకు కారణమయింది కాబట్టి అక్టోబరు 26 వ తేదీని సమావేశంకానున్న కేంద్ర శాసనసభలో ముస్లింలీగు సభ్యులే వైఖరిని అవలంబించగలరో చూడవలెనని ఆనాటి ప్రజాబాహుళ్యం తహతహలాడుతూ ఉంది. రాజ్యాన్ని వదలిపోతూ 'షా' చేసిన ప్రసంగం ఇండియాలో హృదయావేదన కలిగించింది. దానిని ఈ క్రింద ఉదహరిస్తున్నాము:

"నేను మిక్కిలి దుర్బలంగా ఉన్నాను. నాలో చాలా తక్కువశక్తి ఉంది. మన దేశవ్యవహారాలను నిత్యమూ పరిశీలిస్తూండవలసిన తరుణమిది. మన ప్రజలకు ఆనందమునూ సంతృప్తినీ చేకూర్చవలెనంటే యౌవనోత్సాహమూ నూతనశక్తి సామర్థ్యములూ కలవారిచేతులలో మన వ్యవహారాలుండాలి. కాబట్టి 1941 వ సంవత్సరం సెప్టెంబరు 16 వ తేదీనుండి నా తరువాత రాజు

కానున్న నా వారసునకు రాజ్యాధికారమును ఒప్పగించి విరమిస్తున్నాను. పారసీక జాతియావత్తూ సివిల్ మిలిటరీ బలాలతోసహా శాస్త్రీయంగా నాకు వారసుడై నా తరువాత రాజ్యాధికారం వహిస్తున్న ఆయనను రాజుగా గుర్తించడమే కాక, దేశశ్రేయస్సు కోసం యింతవరకూ వారు నాకుగాను చేస్తూన్న పనిని ఇంలేటినుండీ ఆయనకోసం చేయవలెను."

మితవాదు లాయా ప్రత్యేక సంఘటనలనుగూర్చి గట్టిగా ధర్మోపన్యాసాలు చేయడంతో సంతృప్తిపడి ఊరుకున్నారు. అంతేకాని అసలు సమస్యా పరిష్కారానికి వారేవిధమైన సూచననూ చేసివుండలేదు. ఇక కమ్యూనిస్టు పక్షంవారున్నారు. కమ్యూనిస్టు పక్షసభ్యులుకాని కమ్యూనిస్టులున్నారు. ఫార్వర్డుబ్లాకువారూ, కిసానులూ ఉన్నారు. వారికి ప్రకటనలు చేయడానికి తగిన విరామంలేదు. ఒకవేళ ఉన్నా బహిరంగంగా వారేమీ చెప్పదలచుకోలేదు. వారిలో కొందరు కనపడకుండా పోయినారు. అయితే వారంతా బ్రిటనుకు ప్రతికూలురే. 1941 జూన్ 22 వ తేదీని రష్యాపైన జర్మనీ దండయాత్ర చేసినప్పుడు వారికొక నూతనదృశ్యం ప్రత్యక్షమైంది యుద్ధమును గూర్చి వారివైఖరిలో మార్పుండవలెనా అక్కరలేదా అని తీవ్ర వాదోపవాదాలు జరిగినవి. కొంతమంది తక్షణం తమవిధానం తల్లకిందులుగా మారిపోవలెననీ యుద్ధ సన్నాహాలలో తీవ్రంగా పనిచేయవలెననీ వాదించడం సాగించారు. మరికొందరు రష్యాకు పూర్తిసహాయంచేస్తూ బ్రిటనుకుమాత్రం సున్నచుట్టవలెనని సలహాయిచ్చారు. అఖిల భారత కిసాన్ సంఘంవారు "మన పితృదేశానికి" సంపూర్ణసహాయం చేయవలెనని వాదిస్తూ, ఇండియా నిస్సహాయస్థితిలో నున్నందున సరియయిన సహాయం చేయజాలనందుకు తమ విచారమును వెల్లడించారు. అయితే ఒక రెడ్‌క్రాస్ వ్రణచికిత్సాదళమునైనా పంపవచ్చునుకదా? దేశమంతటా తిరిగి రష్యాకు సహాయాన్ని సేకరించడానికి కొన్నిదళాలు బయలుదేరినవి. ఇంగ్లాండు రష్యాదేశాలు రెండూ జులై12 వ తేదీని పరస్పర సహాయంకోసం ఒడంబడిక చేసుకొని, ఈ రెంటిలో యే ఒక్కదేశమూకూడా ప్రత్యేకం జర్మనీతో రాజీపడకూడదని అంగీకరించినవి. అయినప్పటికీ బ్రిటను కేవిధమైన సహాయమూ చేయకుండా రష్యాకు ఒక్కదానికే యావత్తుసహాయం చేయడానికీ వీలున్నదని ఆవర్గాలవారు భావించారు. ఇంతలో ఇండియా భవితవ్యమునుగూర్చి అమెరీ చేసిన అసంగత ప్రసంగంవలన రష్యాసహాయం మాటకూడా వెనుకపట్టింది. యుద్ధపరిస్థితులలో కలిగిన ఈ పరివర్తనము వలన రష్యాకు సహాయం చేయవలెనా అక్కరలేదా అనే విషయంలో జైళ్ళలోకూడా తీవ్రవాదోపవాదాలు జరిగి చీలికలేర్పడినవి. అందువలన రష్యాసహాయమునందు ఉత్సాహం తగ్గిపోయింది. రష్యా

పరిస్థితు లంతకంత కతివేగంగా క్షీణదశకు వస్తూండడం, బ్రిటనంత శ్రద్ధ తీసుకోకుండా మూకీభావం వహించడం, అమెరికాధ్యక్షుడు బ్రిటిష్ ప్రధానీ అట్లాంటిక్‌లో కలుసుకొన్న తరువాత చిరకాలంవరకూ మాస్కో సమావేశం జరుగపోవడమూ, అమెరికా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వంవారు మాట్లాడిన ప్రతిమాటగా చేసిన ప్రతిపనీ కేవలం వర్తక సరళిగా ఉండడమూ, అట్లాంటిక్ ఛార్టరు ఇండియాకు వర్తించదని చర్చిల్ స్పష్టంగా చెప్పిన తరువాతకూడా మారుమాటాడకుండా రష్యాపక్షాన చేస్కీ నోరు మూసుకొని దానిని ఆమోదించడమూ-ఇదంతాచూస్తే రష్యాస్థితి ఎంత విషాదకరంగా ఎంత నిరాశాజనకంగా ఉన్నదో తెలిసివచ్చింది. అంతేకాదు మిత్రదేశాలను కొందరు రష్యాను ఆడియాసలతో మోసపుచ్చుతూవున్నవనీ, రష్యామాత్రం శత్రువుకు తలఒగ్గకుండా వీరోచితంగా పోరాడి త్యాగంచేయ సిద్ధంగా ఉందనికూడా అర్థమయింది. ఈ విధంగా కమ్యూనిస్టులు, ఫార్వర్డుబ్లాకువారు వామపక్షీయులుగా తలంపబడే తక్కిన తరులూ ఒకవైపునుండి మరొకవైపుకు ఊగులాడవలసి వచ్చింది. సిక్కులు సైన్యాలను చేర్చి రక్తం ధారపోయడానికి ఒప్పుకొన్నారు. హిందూమహాసభవారుకూడా అంతే. ఈ పోరాటంలోనూ వాదప్రతివాదాలలోనూ తన కార్యక్రమమూ నిర్ణయాలు సరియయినవనే దృఢవిశ్వాసంతో, బ్రిటనుకు యుద్ధసన్నాహాలలో సహాయం చేయకపోవడమేకాక యేవిధంగానూ బ్రిటనును చీకాకు పరచకుండాకూడా కాంగ్రెసు ఒక్కటే నిశ్చలంగా నిలబడగలిగింది. శత్రువు ఆపత్తులో ఉన్నప్పుడు ఆపత్తును మన సొంత ప్రయోజనంకోసం వినియోగించుకోవలెననే క్షుద్రభావం సత్యాగ్రహ సిద్ధాంతాలకు ప్రతికూలం. మూకసత్యాగ్రహంతో శత్రువును తుడిచిపెట్టవలెనని కొందరు చేస్తున్న అధిక ప్రసంగమునకూ గాంధీజీ విశ్వాసానికీ యెక్కడా పొత్తు కలియలేదు.

ఈ సమయంలోనే అణచిపెట్టడానికి వీలులేని కొందరు కాంగ్రెసు కార్యక్రమంలో మార్పు కల్గించాలని ముందుకు తోసుకొని వచ్చారు. కేంద్ర శాసనసభలోని కాంగ్రెసు పక్షపు ఉపనాయకుడున్నూ, కార్యదర్శియున్నూ, తమ పక్షపుసభ్యులు రాబోయే కేంద్రశాసనసభా సమావేశమునకు హాజరు కావడానికి అంగీకరించవలెనని తలంచారు. కేంద్రశాసనసభలో ముఖ్యంగా ఇండో బర్మా వలస చట్టమున్నూ, ఇండో సిలోనీస్ వలస చట్టమున్నూ చర్చకు రానుండడం వలననూ ఆరెండు చిత్తుచట్టాలు కూడా అభివృద్ధి నిరోధకములుగా నుండడం వలననూ ఆవిధంగా తలంపబడింది. కేంద్ర శాసన సాధారణ కాలపరిమితి మూడు సంవత్సరాలు మాత్రమే. ఇంతవరకు నాలుగు సార్లు దానికాలము పొడిగింపబడినది. ఇప్పుడు ఏడో ఏడు నడుస్తూన్నది. సాధారణ సమయాలలో కాంగ్రెసువారు తమ స్థానాలను కాపాడుకొనేటందుకు ఏదో ఒకరోజు

సభకు హాజరయితే చాలు. కాని ఈ చిత్తుచట్టాల చర్చనిమిత్తం వారు హాజరుకావలెనని శాసనసభలోని కాంగ్రెసు పక్షపునాయకుడున్నూ కార్యదర్శియున్నూ తలంచారు. కాంగ్రెసుకు నియోజక వర్గాలలో యెంతపలుకుబడి ఉన్నదో ప్రదర్శించడానికి కేంద్ర శాసన సభలోని కాంగ్రెసు సభ్యులు రాజీనామా యిచ్చి యుద్ధసమస్యమీద తిరిగి ఎన్నికలకు పోటీచేయడం ఉచితమని కొంతమంది గాంధీజీకి సూచించినట్లు తెలిసింది. కాని రాష్ట్ర శాసనసభల కాలాన్ని పొడిగించే విషయంమీద కామన్సుసభలో చర్చ వచ్చినప్పుడు కాంగ్రెసుకు వోటర్లలో పలుకుబడి ఉండనే విషయం అమెరీయే అంగీకరించాడు. "ఈ ఎన్నికలు జరిగిన తరువాత కూడా శాసనబద్ధమైన ప్రభుత్వం ఆచరణలోకి వచ్చేఅవకాశం లేదు. పైగా ఈ ఎన్నికలు గాంధీజీయొక్క ప్రతికూల విధానాన్ని ప్రజలలో ప్రచారం చేయడానికి మాత్రమే ఉపకరిస్తవి అందువల్ల చీలికలు పెట్టడం తనకిష్టములేదని" అమెరీ అన్నప్పుడు అంతేకాదు; బ్రిటిష్ మంత్రివర్గం వారి ప్రోత్సాహంవలన భారత రాజ్యాంగ చట్టమును పూర్తిగా మార్పుచేయవలెననికూడా అమెరీ ఆలోచించాడు. అందుకోసం భారత విశ్వకళా పరిషత్తులలోని యువకులు కృషి చేయవలెననికూడా ఆయన హెచ్చరించాడు.

ఈ పరిస్థితులలోనే వార్ధాలో కొత్తగా సంభాషణలు ప్రారంభమైనవి. ఈ సంభాషణలకు యుద్ధపరిస్థితులెంత మాత్రమూ అనుకూలంగా లేవు. శత్రువు మాస్కోను ముట్టడిస్తాడేమో అనే భీతి కలుగుతూ ఉంది. రష్యాలోని రాయబారుల కార్యాలయాలు మాస్కోనుండి ఎక్కడికో దూరప్రాచ్య ప్రదేశమునకు మార్చబడినవి. ప్రభుత్వ ముఖ్యస్థానమే మాస్కోనుండి వాల్గానది ఒడ్డుననున్న కుబ్జీషేవుకు మార్చబడింది. జపాను మంత్రివర్గం మారింది. కయ్యానికి కాలుదువ్వే మనిషి జపానుకు ప్రధానమంత్రి అయినాడు. అయినప్పటికి అమెరికా తాను యుద్ధంలోకి దిగనని ప్రకటించింది. కాని జపానువారి ఓడలను పసిఫిక్ మహాసముద్రమును విడిచిపోవలెనని ఆదేశించింది. ఇక మనదేశంలో సంగతి; రాజప్రతినిధి కార్యనిర్వాహకసభవారొకరితరువాత ఒకరు ఉద్యోగంలో ప్రవేశించారు. వారి మొదటి సమావేశమూ వార్ధాలోని కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశమూ ఒక్కనాడే జరగడం తటస్థించింది. 19 వ తేదీని వర్కింగుకమిటీ సమావేశం. వర్కింగుకమిటీ సభ్యులప్పటికి 11 మంది విడుదలై ఉన్నారు. 20 వ తేదీని శాసనసభలలోని పక్షనాయకులతోనూ కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులతోనూ మరొక సమావేశమేర్పాటు చేయబడింది. ఈ సంఘటనము పాతసంఘటనము నొకదానిని జ్ఞాపకం చేస్తూన్నది. గాంధీ ఇర్విను సంధి రాయబారాలు జరిగే రోజులలో డాక్టరు అన్సారీ

నివసిస్తూన్న దరియాగంజ్ ఒకటో నెంబరు యింట్లో రాత్రింబవళ్ళు కాంగ్రెసు కార్యవర్గసమావేశాలు జరుగుతూ వచ్చినవి. అప్పుడే ఆయింటికి రెండు మూడు మైళ్ళ దూరంలోనున్న ఇండియా సెక్రటేరియట్ కార్యాలయంలో రాజప్రతినిధి కార్యనిర్వాహక సమావేశాలు జరగడం తటస్థించింది. అదేవిధంగా వార్ధాలోగానీ, సేవాగ్రామంలోగానీ కాంగ్రెసు వర్కింగుకమిటీ సమాలోచనలు జరుగుతూ ఉండినప్పుడు దాదాపు అదేసమయంలో వైస్రాయి విస్తృత కార్య నిర్వాహకవర్గంకూడా ఢిల్లీలో సమావేశం అయింది. రాజప్రతినిధి నూతన కార్యసభ్యులేమి చేయనున్నారు? వారి ఉద్యోగాలను వారెలా సమర్థించుకోగలరు? వారు తమ శాఖలకు సంబంధించినంత వరకైనా జాతీయగౌరవాన్ని కాపాడడాని కేకార్యవిధానాన్ని అవలంబింపనున్నారని రాజకీయ ఖైదీలయెడ వారి వైఖరి యేమిటి? అనే అనేక ముఖ్యవిషయాలనుగూర్చి దేశీయులంతా తలోకవిధంగా ఊహించడం మొదలుపెట్టారు.

సరిగా యిదేసమయంలో డియోలీ క్యాంపులోనున్న ఒకానొక డిటిన్యూ తన భార్యకు పంపవలెనని ప్రయత్నించినట్లు చెప్పబడిన కొన్ని ఉత్తరాలను సంగ్రహపఱచి ఇండియా గవర్నమెంటువారు ప్రచురించారు. అక్టోబరు 18 వ తేదీయే ఈ ఉద్రేక పూరిత సంఘటనముకు తగిన సమయమని ప్రభుత్వం వారెందుకు తలంచారో ఊహించడానికి వీలులేకుండా ఉంది.

వివిధ తరగతుల రాజకీయఖైదీలను, ఇంటర్నీలను డిటిన్యూలను వేరువేరుగా చూడవలెనని సాక్ష్యం చూపించేటందుకో లేక ఇండియా గవర్నమెంటువారు రాజకీయ ఖైదీలయెడ ఔదార్యంగా ప్రవర్తించవలెనని నూతనంగా వచ్చిన కార్యనిర్వాహకసభ్యు లడగడానికి వీలులేకుండా నోరు మూయించడానికో ఈపని ఉద్దేశింపబడి ఉండవచ్చును. ఇటువంటి సంఘటనలనేకం ఒకటి తరువాత మరొకటి జరుగుతూండడం వలన పరిస్థితులు మరింత క్లిష్టదశకువచ్చి నిజంగా కొంతకాలం ఇదమిత్థమని తెలుసుకోవడానికి వీలులేకుండా పోయింది. కాని ప్రభుత్వమువారి విధానం చాలా కాలం గూఢంగా ఉండలేదు. ఈలోగా విడుదల చేయబడిన ప్రతి సత్యాగ్రహీ ఆయన విడుదలైన ఒక వారం రోజులలోగానే తిరిగి సత్యాగ్రహం చేయవలెనని అక్టోబరు 21 వ తేదీని గాంధీ మరింత గాఢంగా మరొక ప్రకటన చేశాడు. విడుదల చేయబడిన నాయకులందరూ అన్నిరాష్ట్రాలనుండీ వచ్చి సేవాగ్రామంలో సమావేశమవుతూన్న ఈ సమయంలోనే గాంధీ యేల ఈ ప్రకటన చేయవలసివచ్చింది? సత్యాగ్రహ కార్యక్రమమును సడలించడానికి తన కేమాత్రమూ జోక్యంలేదని ప్రపంచానికి ప్రకటించేటందుకే సహజంగా ఆయన అలాచేసి ఉంటాడు. రాజ

ప్రతినిధి కార్యనిర్వాహక సభ్యులేవైనా కొత్తసూచనలు చేసేయెడల సత్యాగ్రహం సడలింపబడుతుందనే అపోహతో ఆ సూచనలు చేయబడకూడదు.

వార్ధా సంభాషణలనుగూర్చి అధికార-ప్రకటన యేమీ లేకపోయినప్పటికీ పత్రికా విలేఖరుల ఊహలు చాలా వరకా సంభాషణల స్వభావమును సూచిస్తూ వచ్చినవి. కొంతమంది ఉన్నతస్థితిలోనున్న ప్రజానాయకులు సత్యాగ్రహోపయోగమునుగూర్చి సందేహిస్తున్నారనీ, అది అపజయం పొందినట్లుగా కూడా భావిస్తూన్నారనీ, అహింసావిధానం ఆచరణయోగ్యమైన రాజకీయ సిద్ధాంతంగా పనికిరాదేమోనని సంశయిస్తూ యావత్తు కార్యక్రమమూ పూర్తిగా మారిపోవలెనని కోరుతూన్నారని కూడా బహిరంగమైన ఒక ప్రవాదం బయలుదేరింది. కాని వారెవరూ తమ అభిప్రాయాలను బయటికి చెప్పకపోవడం వలన దానిని ఉపయోగించుకొని యింతవరకు కాంగ్రెసు నాయకులుగానుండి యిప్పుడు కాంగ్రెసు యాజమాన్యం కింద నడుస్తూన్న కార్యక్రమానికి దూరంగా ఉన్న కె. ఫ్. నారిమన్ వంటి కొంతమంది మిత్రులు, సుభాష్‌బాబుయొక్కయు, ఫార్వర్డుబ్లాకుయొక్కయు, సలహాను పెడచెవిని పెట్టడంలో కాంగ్రెసు చాలా తప్పుచేసిందని చెప్పడం సాగించారు. గాంధీస్థితి కురుక్షేత్రంలోని శ్రీకృష్ణుని స్థితిని పోలి ఉంది. దుర్యోధన సభకాయనను రాయబారిగా పంపింది పాండవులే. రాయబారాలు విఫలమై యుద్ధం చేయడం నిర్ణయమైనప్పుడు ఇరుపక్షాల కోరికపైనా, కృష్ణుడు తన సైన్యాలను కౌరవులకు సమర్పించి తానొక్కడూ పాండవుల పక్షం వహించాడు. ఆయన అర్జునునకు సారథిగా ఉండడాని కంగీకరించాడు. రాజప్రతినిధితో రాయబారాలు విఫలమైన తరువాత గాంధీకూడా కాంగ్రెసు నాయకుడుగా ఉండి సత్యాగ్రహోద్యమాన్ని నడపడాని కంగీకరించాడు. కాని మొదటి బాణం విడువగానే అర్జునివలెనే కాంగ్రెసు నాయకులు చేతిలోని అస్త్రశస్త్రాలను జారవిడచి రథంలో జాలగిలబడి అనేకవిధములైన ప్రశ్నలను వేయసాగించారు. మత నైతిక భావోద్రిక్తములైన ప్రశ్న పరంపరలనేకం వేయబడినవి. ఈ ప్రశ్నలువేసిన వారిలో కొంతమంది సుప్రసిద్ధులుకూడా ఉన్నారు. ఇవన్నీ కొత్తవి కావు. కొత్త రూపంలో ఉన్న పాత ప్రశ్నలు. ఇవి పూనాలో చర్చింపబడినవే. బొంబాయిలో యుద్ధాని కనుకూలంగా ఉన్న యివన్నీ నిరాకరింపబడినవి కూడా. గాంధీ యింకేమి చేయగలడు? యుద్ధంనుండి పూర్తిగా విరమించుకొని అస్త్రసన్యాసం చేయవలెనని ఉద్బోధించిన గాంధీ విధానమునకు బొంబాయిలో ఒక్కరైనా ప్రతికూలించిన వారున్నారా? కురుక్షేత్రంలోని సంభాషణలెంత సర్వతోముఖంగానూ సమగ్రంగానూ జరిగినవో వార్ధాలోకూడా అలాగే జరిగినవి. యుద్ధం చేయవలసినప్పుడు అతిరథ మహా

రథులు ఉపేక్షవహించగా శ్రీకృష్ణశెట్టి సందిగ్ధస్థితిలో పడ్డాడో అలాగే విడుదలైన సత్యాగ్రహులందరూ తిరిగి సత్యాగ్రహం చేయవలసిందని గాంధీ కోరినప్పుడు వారి ఉపేక్ష ఆయనను సందిగ్ధ స్థితిలో పెట్టింది.

కాంగ్రెసు కార్యక్రమాన్ని మార్చవలెననీ గత సంవత్సరం సత్యాగ్రహోద్యమంలో జరిగిన పనిని సింహావలోకనం చేయవలెననీ వాదించే వారికి ప్రత్యుత్తరంగా, గాంధీ అక్టోబరు చివర వారంలో ఒకానొక సమగ్ర ప్రకటనము చేశాడు. ఉద్యమానికి మార్గదర్శకములుగానుండే శాశ్వత సిద్ధాంతాలను గాంధీ పునరుద్ఘాటించాడు. శాసనోల్లంఘనమును విరమించడం ప్రమాదం. శాసనోల్లంఘనమే సంపూర్ణమైన అహింసాచర్య. నిరుపమానమైన దౌర్జన్యం నడుస్తూన్న ఈ రోజులలో అది మన ధర్మం.

## విడుదలలు ఆపిమ్మట

1941 అక్టోబరు 27 వ తేదీని హఠాత్తుగా, కొంతమంది డిటెన్యూలు వేలూరు జైలునుండి విడుదల చేయబడుదురని ఒకవార్త ఇండియా అంతటా ప్రచారం చేయబడింది. వారిలో మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ స్పీకరున్నూ మరి ఆరుగురున్నూ ఉన్నారు ఒకటో నవంబరు తేదీని విడుదల చేయబడే ఈ డిటెన్యూలనుగూర్చి అంతేసు నాలుగురోజులు ముందుగానే ఎందుకీ ఆకస్మిక ప్రకటన చేయవలసివచ్చిందని దీనికి జవాబునెవరూ ఊహించలేకపోయినారు. కాని కొంతకాలంనుండీ ప్రభుత్వంవారు కొద్ది కొద్దిగా ఖైదీలను విడిచిపెట్టే తలంపులో ఉన్నట్లు వదంతులు బయలుదేరినవి సత్యాగ్రహ ప్రమాణ పత్రంపైన సంతకం చేసి యుద్ధ ప్రతికూల నినాదములను చేయక పూర్వం గానీ, దానినిగూర్చి అధికారులకు నోటీసీయక పూర్వమేకానీ అరెస్టుచేయబడిన సత్యాగ్రహులను విడుదల చేయడంతో ఈ విధానం ప్రారంభమవుతుందనికూడా తెలియవచ్చింది. నిజంగా విడుదలలు జరుగడానికి నాలుగు నెలలు ముందుగానే ఈ వదంతి బయలు దేరింది. అంతేకాదు. విడుదలచేయబడిన ఈ సత్యాగ్రహులు తిరిగీ ఖైదుకు బుద్ధిపూర్వకంగా పోతారో లేదో అనికూడా ప్రభుత్వంవారు చూడదలచుకొన్నారట. కాని నిజంగా విడుదల జరిగేనాటికి ప్రభుత్వంవారి దృక్పథం మారింది. మామూలుగా మొదటిసారి సత్యాగ్రహం చేసినవారినికూడా అరెస్టుచేయడం ప్రభుత్వం వారు మానివేశారు. కొన్ని సందర్భాలలో రెండవసారి మూడవసారి సత్యాగ్రహం చేసినవారినికూడా అరెస్టుచేయలేదు. మద్రాసులో మొదటి విడుదలలు జరిగిన తరువాత బొంబాయిలో ప్రధానమంత్రితోసహా ఒకటి రెండు విడుదలలు జరిగినవి. అక్కడకూడా సూచన ప్రాయంగా మరికొన్ని విడుదలలు జరిగినవి. అసలు సంగతి యేమి

టంటే సత్యాగ్రహులను విడుదల చేయవలెనని ప్రజలు గగ్గోలు పెట్టడం ప్రారంభించారు. కామన్సుసభలోని ఒక వర్గంవారు జవహరలాలునూ తక్కిన సత్యాగ్రహులనూ విడుదలచేసి ఇండియా ప్రతిష్టంభనమును పరిష్కరించడానికి చేసే నూతన ప్రయత్నానికి అనుకూల వాతావరణమును కల్పించవలెనని ఆందోళన సాగించారు.

1941 అక్టోబరు మొదట్లో మద్రాసు మాజీ ప్రధాని మాజీ రెవిన్యూ మంత్రి వారి శిక్షాకాలం పూర్తియైన కారణాన విడుదల చేయబడ్డారు. కాబట్టి నవంబరు ఒకటో తేదీని చేయబడిన డిటెన్యూల విడుదల వీటినిబట్టి చేయబడినవి. ఈడిటెన్యూలు కూడా మామూలు ధోరణిలో సత్యాగ్రహంచేసి శిక్షింపబడి ఉన్నయెడల ఒకటో నవంబరునాటికి విడుదలై ఉండేవారే. అలా కాక డిటెన్యూలనుగా తీసుకొన్న కారణాన వీరు జైలులో ఉండే కాల పరిమితి యెక్కువ కాకూడదని తలంచి ఒకటో నవంబరునాడు అనగా సత్యాగ్రహం ప్రారంభింపబడిన సంవత్సరం నాటికి వీరిని విడుదలచేసినట్లుగా ప్రభుత్వంవారు సంజాయిషీ యిచ్చారు. సత్యాగ్రహు లందరినీ ఒక్కుమ్మడి విడుదలచేయవలెనని ప్రభుత్వంవారుద్దేశిస్తూన్నట్లుగా చాలా వదంతి బయలుదేరింది. కాని దానినిగూర్చి విచారిస్తే ఆవదంతిని బలపఱచే భోగట్టా తెలియలేదు. ముఖ్యంగా కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా అబుల్ కలాం అజాదునూ పండిత జవహరలాలునూ విడుదల చేయవలెనని చాలా వత్తిడి వచ్చింది. వీరిలో మొదటివారు ఎనిమిది మాసాలున్నూ రెండవవారు మూడు సంవత్సరాలున్నూ యింకా జైలుశిక్ష అనుభవించవలసి ఉంది.

రాజకీయ వాతావరణం మాటి మాటికీ మార్పుచెందుతూన్న ఈ తరుణంలో ఒక వంక ఆశా మఱొకవంక నిరాశా వ్యాపించి ఉన్నవి. వీటి రెంటిమధ్యా సాధారణంగా ఉండే తొట్రుపాటు, సంశయం సందేహాలతో, ఒకవేళ సత్యాగ్రహులందఱూ ఒక్కుమ్మడి విడుదలచేయబడినయెడల జరుగవలసిన పని యేమా అని రాజకీయవర్గాల వారు తటపటాయిస్తున్నారు. మద్రాసు మాజీ ప్రధాని సి. రాజగోపాలాచారికి సత్యాగ్రహమునింకా కొనసాగించవలెననే శ్రద్ధ లేకపోగా, పైపెచ్చు దాని ప్రయోజనాన్ని గుఱించీ, ఆ తరుణంలో దానినీ కొనసాగించడంలోని ఔచిత్యమునుగూర్చి కూడా ఆయన సందేహిస్తూన్నట్లు నమ్మకంగా తెలిసింది. సత్యాగ్రహులు ఖైదులోనున్న కాలంలో జరిగిన ప్రధాన సంఘటనము 1941 జూన్ 22 వ తేదీని జర్మనీవారు రష్యాపైన చేసిన దండయాత్ర, రష్యా సరిహద్దులలో 1500 లేక 2000 మైళ్ళ పొడుగున సైన్యాన్ని సమీకరించి ఉండడంచేత తమకు రష్యాపైన దండయాత్ర చేయడం తప్పనిసరి అయిందనీ హిట్లరన్నాడు. ఏది ఎలా ఉన్నా జర్మనీ దండయాత్ర ఎంత ఆకస్మి

కంగా జరిగిందో అంత జయప్రదంగాకూడా నడిచింది. ఇంగ్లాండు రష్యాలు రెండూ కలసికూడా జర్మనీ సైన్యబలంముందూ యంత్రబలంముందూ ప్రతిక్రి బయటపడ గలవా అని ఆరోజులలో ప్రపంచ ప్రజానీకానికి సందేహం కలిగింది. ఈ సందర్భంలో యుద్ధవిషయాలనుగూర్చి కొంత విచారించడం ఉచితం. యుద్ధంలో బ్రిటనుకు కలుగ నున్న విజయావకాశాలకూ, ఇండియా బ్రిటనుతో సహకరించడానికీ అత్యంత సన్నిహిత సంబంధం ఉంది. ఈ పరిస్థితులలో గాంధీ ఒక్కడే సరియైన నిర్ణయించే సుకల వాడని అందరూ భావించారు. ఆయనకుగల ప్రపంచజ్ఞానమూ దూరదృష్టి రాజకీయ విచక్షణలకుతోడు, వ్యర్థప్రతిష్ఠకోసం పాకులాడకుండా అవసరమైతే తన కార్యక్రమాలనూ ప్రణాళికలనూ మార్పుచేయగల ధైర్యంకూడా ఆయనకేఉంది కాని ఈ గొడవలవలన యేమీ ప్రయోజనంలేదని ప్రపంచానికి తెలియజేయడంలో ఆయన ఒక్క క్షణంకూడా కాలయాపన చేయలేదు. 1941 అక్టోబరు మొదటి వారంలోనే ఆయన వీటికి విరుద్ధంగా ఉన్నట్లు తెలియపరిచాడు. నిడుదలైన ప్రతిసత్యాగ్రహినీ తిరిగి సత్యాగ్రహం చేయమనికూడా ప్రబోధించాడు. అక్టోబరు 31 వ తేదీని తన అభిప్రాయాలను ఎంతో నిష్కపటంగానూ నిర్భయంగానూ వెల్లడిస్తూ మూడు కాలముల వ్యాసాన్ని భారతదేశపు పత్రికలన్నిటిలోనూ ప్రకటించాడు.

ఈలోగా నవంబరు నెలలో డియోలీ పరిస్థితి ఆరోజు కారోజు విషమిస్తూ వచ్చింది. 180 మంది డిటెన్యూలవలంబించిన నిరాహారదీక్ష ఆసేతు హిమాచల పర్యంతం గల విశాల ప్రజానీకాన్ని ఆకర్షించింది. గాంధీ ఒకవంక డిటెన్యూలతోనూ మరొక వంక ప్రభుత్వంతోనూ ఉత్తర ప్రత్యుత్తరాలను నడుపుతూ ఎప్పటికప్పుడు సంగతులు తెలుసుకొంటూ ఉన్నాడు. యన్. యమ్. జోషి డియోలీ జైలును ప్రత్యక్షంగా దర్శించి ఖైదీల కష్టాలను స్వయంగా పరిశీలించిన పిమ్మట కేంద్రశాసన సభలో ఒక తీర్మానం తీసుకొని వచ్చాడు. అప్పటినుండి హోమ్ మెంబరు వైఖరిలో మంచిమార్పు కలిగింది. డియోలీలోని డిటెన్యూలను ఏరాష్ట్రంవారి నారాష్ట్రమునకు తిరిగి పంపివేయడానికాయన అంగీకరించాడు. కాని డిటెన్యూలలో కొంతమంది మరొక క్రొత్త సమస్యను లేవదీశారు. తాము కష్టపడి డియోలీలో సంపాదించుకొన్న హక్కులన్నీ ఆయా రాష్ట్రాలలోకూడా తమకీయవలసి ఉంటుందని వారన్నారు. ఈ విషయంలో నిర్ణయం చేయడానికి కొంతజాగు జరిగింది. డిటెన్యూలారోపణచేసిన కొన్ని నేరాల సత్యాసత్యములను విచారించడానికి గాంధీ మహాదేవ దేశాయిని ఢిల్లీకి పంపాడు. కాని ఆయన ఢిల్లీ చేరేవరకే డిటెన్యూల కోర్కెలామోదింపబడినందున నిరాహారదీక్షను వారు వదులుకొన్నారని రేడియోలో వినవచ్చింది.

అనుకోకుండా జరిగిన ఈ పర్యవసానానికి ఆదివరకే అస్వస్థతగా ఉన్న గాంధీకి కొంత చిత్తశాంతి కలిగించి. తాను వ్యక్తిగతంగా ఎంత ప్రార్థించినప్పటికీ డియోలీ డిటెన్యూలు నిరాహారదీక్షను మానకపోవడం ఆయన మనస్సుకెంతో కష్టంకలిగించింది. 1941 నవంబరు మూడవ తేదీని, జవహరలాలును విడుదలచేయురని ఆయనకు గట్టి నమ్మకం. బ్రిటిష్‌వారు తనమీద కసి తీర్చుకోవడానికైనా జవహరలాలును విడిచి పెడతారేమోనని ఆయనకు తోచలేదు. అది సహజంకూడా. ప్రభుత్వంవారు కసితో యేపనినైనా చేస్తారని ఆయనకు తోచడం దుస్తరం. విడుదలైవచ్చిన సత్యాగ్రహులందరితోనూ వీటినిగూర్చియేగాక ఇంకా యింతకంటెనూ ప్రాముఖ్యమైన అనేక విషయాలనుగూర్చికూడా గాంధీ ప్రత్యేకంగా నవంబరు నెలఅంతా సంప్రదిస్తూ వచ్చాడు. కాని ఎవరెంతచెప్పినా ఆయన తనపట్టుదలనుమాత్రం విడువలేదు. సత్యాగ్రహులు విడుదల కావలెనని తానుకోరడంలేదనీ విడుదలైన సత్యాగ్రహులు తిరిగీ జైలుకు పోవలెననీ, జవహరలాలును ప్రభుత్వం వారేపరిస్థితులలోనూ విడుదలచేయురని గాంధీ అంటూవచ్చాడు. భూలాభాయి దేశాయితో ఒంటరిగా మూడు మధ్యాహ్నాలు మాట్లాడాడు. నాలుగోనాడు మధ్యాహ్నం ఆయన వాదనలకు జవాబుచెప్పే సమయంలో రాజగోపాలాచారికూడా గాంధీజీ అనుమతినిపొంది ఆ సంభాషణలలో పాల్గొన్నాడు. అప్పటికీ గాంధీ తనపట్టు విడువలేదు. అసమాన్య ప్రతిభాశాలియైన భూలాభాయి తన చాకచక్యమంతా గాంధీమీద వినియోగించి ఉంటాడు. అందువల్లనే ఆయన ఏకాంతంగా మాట్లాడదలచుకొన్నది. కాని అవన్నికూడా గాంధీమీద ఏమీ పనిచేయలేదు. కాని తనతో వాదించే తన శిష్యబృందంయొక్క వాదనలలోని యదార్థమును సరిగా ఆయన గ్రహించక పోవడంలేదు. వారందరూ ఆయనకు ప్రతికక్షులుకాదు. పైపెచ్చు చాలా సన్నిహితులు ఆయన ఆదేశాలను ఎప్పటికప్పుడు శిరసావహించి ఆచరణలో పెట్టేవారు. గాంధీకి తన అనుచరులు 'డూ' 'డూ' బసవన్నలుగా ఉండడం యిష్టంలేదు. దాక్షిణ్యంవలనగానీ మర్యాదకోసంగానీ తాను చెప్పిందల్లా సరేననడం ఆయనకు గిట్టదు. స్నేహభావంతో విమర్శించి, చర్చించి పరిష్కార మార్గాలను సూచించేవారినిచూస్తే ఆయనకు చాలా గౌరవం. అదే ఆయనలో ఉన్న గొప్పతనం. మొత్తంమీద రాజకీయఖైదీల నందరినీ జైలులోనుండి విడుదలచేయడం వలన ప్రభుత్వంవారు ఔదార్యంగా ప్రవర్తించినట్లు విశ్వసించవలసివస్తుందనీ అందువలన రాజకీయ వాతావరణంలో సంపూర్ణంగా పరివర్తనం కలుగవచ్చుననీ మాత్రం ఆయన ఈ సంభాషణలలో అంగీకరించాడు. కడలి తరగతుల రాపిడికి తుపాను గాడ్పుల దెబ్బలకూక్కూడ తరతరాలనుండీ ఉన్న కొండఱాయి చలించనిమాట నిజమే.

కాని ఆ వత్తిడికి కాలక్రమేణా అదికూడా కొంతవరకు కలుగక తప్పదు. కాకపోతే బొంబాయిలోని ఎలిఫంటా గుహలకు నేటి జీర్ణావస్థ ఉండేదేకాదు. అదేవిధంగా గాంధీకూడా ప్రతికూలవాద పరంపరలనే తరంగాహతులకు గురియై తన నాయకత్వమును విరమించుకోవడంతప్ప గత్యంతరంలేని స్థితికి వచ్చాడు. అయితే వర్కింగుకమిటీలోనే తన అభిప్రాయాన్ని చెప్పి దానిలో వోటువుచ్చుకోవలెనా? లేక వర్కింగు కమిటీ నిర్ణయాన్ని అ. భా. కాం. సం. లో ఎదిరించవలెనా అనేదే సమస్య. కాని దానినిగూర్చి యిప్పుడే నిర్ణయించడానికి వీలులేదు. ఎందువల్లననగా జవహరలాలింకా విడుదల కానూలేదు. త్వరలో విడుదల కాగలడనే విశ్వాసం గాంధీకి లేనూలేదు.

ఈ విధమయిన సందిగ్ధావస్థలో ఒకవారమైనా గడిచిందోలేదో కాని ఇండియా ప్రభుత్వంవారు హఠాత్తుగా క్రొత్తఢిల్లీనుండి ఒక ప్రకటన చేశారు. ఆ ప్రకటన యిది:

"విజయం కలిగేటంతవరకు యుద్ధానికి ఎడతెగకుండా సహాయం చేయవలెనని ఇండియాలో బాధ్యతగలవారందరూ నిశ్చితాభిప్రాయం కలిగిఉన్నట్లు ప్రభుత్వంవారు దృఢంగా విశ్వసిస్తూన్నారు. కాబట్టి లాంఛనప్రాయంగా శాసనోల్లంఘనం చేసినందుకు కారాగార శిక్షలకు గురియైనవారందరూ మౌలానా అబుల్ కలాం అజాద్-పండిట్ జవహరలాల్ నెహ్రూలతోసహా విడుదల చేయబడగలరు."

ఈ ప్రకటన జరిగిన తక్షణం వారు విడుదలైనారు. అనుకొన్నట్లుగా వెంటనే గాంధీ తన స్థితిని మరింత విస్పష్టంచేశాడు. కాంగ్రెసు అధ్యక్షుడు విడుదలైనందువలన కాంగ్రెసుయొక్క భవిష్యత్కార్యక్రమాన్ని వర్కింగుకమిటీవారున్నూ అ.భా.కాం.సం. వారున్నూ నిర్ణయించగలరని ఆయన ప్రకటించాడు. ఈ క్రింది ఉదహరింపబడిన చరిత్ర ప్రసిద్ధమైన ఆయన ప్రకటన కాంగ్రెసుయొక్క సత్యాగ్రహోద్యమానికి స్వస్తి వాక్యంగా పరిణమించింది, ఆయన ఆ విధంగా తలంచి ఉండకపోవచ్చును.

విడుదలలనుగూర్చి గాంధీజీ ప్రకటన.

"ఈ సంఘటనకు పూర్వం నేనేమి చెబుతూవచ్చానో తరువాతకూడా అదే చెప్పవలసి ఉంది. నాకు సంబంధించినంతవరకు నేను చెప్పవలెనంటే దీనివలన నాభావంలో కించిత్తుకూడా మార్పురాలేదని చెప్పాలి.

నా విద్యార్థిదశనుండీకూడా నేను బ్రిటిష్‌వారికి స్నేహితుడుగానే మెలగుతూవచ్చాను. ఇప్పటికీ నేను వారికి మిత్రుడననే నా అభిప్రాయం. కాని ఇండియాను బ్రిటిషువారు బానిసగా బంధించి ఉంచారనే విషయం మాత్రం

మఱువతగిన గుడ్డిస్నేహం కాదు నాది. నేడు ఇండియా పొందుతూన్న స్వాతంత్ర్యం అంతా బానిస స్వాతంత్ర్యం. అంతేకాని సమానులు పొందుతూన్న సంపూర్ణ స్వాతంత్ర్యం కాదు.

“ఆమెకీ ప్రకటనలు మంట పెడుతూన్న గాయాన్ని మాన్పేవిగా లేవు సరికదా గాయంపైన కారం చల్లినట్లున్నవి. నేనీ విడుదలలను ఆ దృక్పథంతో పరిశీలన చేయవలసి వచ్చింది.

“భారతదేశంలోని బాధ్యతగల వాళ్ళందరూ యుద్ధ సన్నాహాలకు సహాయం చేయ నిశ్చయించుకొన్నట్లు ఇండియా ప్రభుత్వంవారు పూర్తిగా నమ్మి ఉంటే, శాసనోల్లంఘన ఖైదీలను విడిచిపెట్టకుండా తమ ఉద్దీలో ఉంచుకోవడమే వారు చేయవలసిన పని. ఎందుకల్లనంటే సత్యాగ్రహులు పానకంలో పుడకలులాగా వారికి అడ్డుతగులకుండా ఉంటారు. కాబట్టి ఈవిడుదలకు నేనుచేసే వ్యాఖ్యాన మొక్కటే. తమంతటతాము కోరితెచ్చుకొన్న ఈ ప్రవాసంలో శాసనోల్లంఘన ఖైదీలు తమ అభిప్రాయాలను మార్చుకొని ఉంటారని ప్రభుత్వం వారూహించారు. వారి ఊహ తప్పని త్వరలోనే వారు గ్రహించగలరు.

“అత్యంత జాగరూకతతో ఆలోచించకుండా శాసనోల్లంఘనం ప్రారంభించబడలేదు. కేవలం కక్షతో దానిని ప్రారంభించలేదన్న సంగతి కూడా నేను ఘంటాపథంగా చెప్పగలను. తాను ప్రాతినిధ్యం వహిస్తూన్న అధిక సంఖ్యాక ప్రజానీకముయొక్క అభిప్రాయం యుద్ధానికి కేవలం ప్రతికూలంగా ఉన్నదని కాంగ్రెసు ఘోషిస్తూన్నది. ఇందుకు కారణం బ్రిటిష్‌వారు జయం పొంది, నాజీలుకానీ, ఫాసిస్టులుకానీ విజయం పొందవలెననే కోరిక కాదు. ఈ రక్తపాతం వలన విజేతలకుకానీ, పరాజితులకుకానీ మోక్షం ఉంటుందని కాంగ్రెసు విశ్వసించడంలేదు. పైపెచ్చు భారతదేశానికి యీ యుద్ధం వలన స్వాతంత్ర్యం లభిస్తుందనేమాట సర్వాబద్ధం. ఈ విషయం ప్రపంచానికి వెల్లడించడానికి కాంగ్రెసు సత్యాగ్రహాన్ని ప్రారంభించవలసి వచ్చింది. దానిని కొనసాగించగలదనికూడా నా ఆశ.

“ఇండియాలోని నోరులేని కోటానుకోట్ల ప్రజకు ప్రాతినిధ్యం వహిస్తున్నానని చెబుతూ అందుకు ప్రయత్నిస్తున్న కాంగ్రెసు, కడచిన ఇరవై యేండ్లనుండీ ఇండియా స్వాతంత్ర్య సంపాదనార్థం అహింసా సిద్ధాంతాన్ని

ఎడతెగకుండా అవలంబిస్తూ వచ్చింది ఇప్పుడు నడుపబడుతూన్న శాసనోల్లంఘన లాంఛన ప్రాయమే కావచ్చును కాని నేను దానిని నిలిపి వేయడం ప్రధాన సమయంలో అహింసను పరిత్యజించడం కాగలదు.

"కాంగ్రెసెంత ప్రతికూలంగా ఉన్నప్పటికీ తమకు కావలసిన ధనమూ మనుష్యులూకూడా ఇండియాలో లభిస్తూనే ఉన్నారని ప్రభుత్వం వారంటున్నారు. కాబట్టి ఈ సందర్భంలో కాంగ్రెసుచేసే ప్రయత్నాలుగాని ప్రదర్శనాలుకానీ, కేవలం నైతికములు మాత్రమేనని గ్రహించాలి. ఈ విధానం నాకుమాత్రం సంపూర్ణంగా సంతృప్తి కలిగిస్తూన్నది. ఇటువంటి నైతిక ప్రదర్శనములవలననే సమయం వచ్చినప్పుడు ఇండియాకు నిజమైన స్వాతంత్ర్యం లభించకలదు. ఒక రాజకీయ పక్షంయొక్క ప్రాబల్యంకానీ మరొక రాజకీయపక్షంయొక్క విచ్ఛిన్నం కానీ కాదు కావలసింది నాకు.

"కాంగ్రెసు చేస్తూన్న ఈ పోరాటం ఇండియాలోని ప్రతి కేంద్రానికీ సంబంధించి ఉంది. నేను కాంగ్రెసు అధ్యక్షుడు బయటకు రానున్నాడు. కాంగ్రెసు వర్కింగుకమిటీనికానీ, అ. భా. కా. సంఘమును గానీ సమావేశపఱచవలెనా అనే విషయమున్నూ ఎప్పుడు సమావేశపఱచవలెననే సంగతిన్నీ ఆయనే ఆలోచించగలడు. ఈ రెండు సంస్థలు కాంగ్రెసుయొక్క భవిష్యద్విధానమును నిర్ణయించ గలవు. శాసనోల్లంఘనమును నడిపేటందుకు నేనొకచిన్న పరికరమును మాత్రమే.

"అయితే డిటెన్యూలనుగూర్చి తదితర ఖైదీలనుగూర్చి నేనొకమాట చెప్పవలసి ఉంది. ఎవరైతే ఖైదుకావలెనని కోరి వచ్చుకొన్నారో వారిని విడిచిపెట్టడమున్నూ, విచారణలేకుండా ఖైదుచేయబడినవారినీ, తమ వ్యక్తి స్వాతంత్ర్యం కంటె దేశస్వాతంత్ర్యాన్ని ఎక్కువగా ప్రేమించిన కారణాన జైలులో పెట్టబడినవారినీ విడిచిపెట్టక పోవడమున్నూ చాలా వింతగా తోస్తుంది. కాబట్టి ఇలా జరగడానికి ఎక్కడో ఏదో గొప్పతప్పు జరిగి ఉండాలి. కాబట్టి ఇండియాప్రభుత్వంవారి ఈనిర్ణయం నాకు సంతోషకరంగాలేదు"

నిజంగా అయితే జవహరలాలుయొక్కయు కాంగ్రెసు అధ్యక్షునియొక్కయు విడుదలలనుగూర్చి ప్రభుత్వంవారు ప్రత్యేకంగా చెప్పానక్కరలేదు. వారు సత్యాగ్రహంచేసేవరకూ ప్రభుత్వంవారు వేచి ఉండలేరు. సత్యాగ్రహులలో భీతావహం కలిగించేటందుకే ప్రభుత్వంవారీ రెండు సందర్భాలలోను అలా ప్రవర్తించారు. ముఖ్యంగా జవహరలాలుకు నాలుగు సంవత్సరాలు ఖైదు శిక్ష విధించడంలో ప్రభుత్వంవారి కంతకంటే వేరే యేమి ఉద్దేశముంటుంది? కాంగ్రెసు అధ్యక్షుడు యుద్ధ వ్యతిరేక నినాదం చేయుటకునుపాయన చేసిన ఉపన్యాసమునుగూర్చి మేజస్ట్రేటుచేసిన

విమర్శ అనవసరం. కాంగ్రెసు అధ్యక్షుడైన మౌలానా అజాదుకు ఇండియా రక్షణ చట్టం క్రింద ౧౮ నెలలు విడిఖైదు వేస్తూ అలహాబాదు సిటీమేజిస్ట్రేటు వ్రాసిన తీర్పును ఈ దిగువ నుదాహరిస్తున్నాము :—

“ భారత జాతీయ మహాసభాధ్యక్షులయిన మౌలానా అబుల్ కలాం అజాద్ 1940 వ సంవత్సరం డిశంబరు 13 వ తేదీని అలహాబాదులోనున్న పురుషోత్తందాసు పార్కులో ఉపన్యసించినమాట నిజమని అంగీకరిస్తున్నారు. ఆ ఉపన్యాసాన్ని సంక్షిప్త విలేఖకుడు వ్రాసుకొని సాక్షులకు చదివి వినిపించి వారిసంతకాలు పెట్టించుకొన్నాడు. సంక్షిప్త లేఖకుడే ఉపన్యాసాన్ని ఋజువుచేశాడు.

“ సంక్షిప్త విలేఖకుడు వ్రాసిన ఉపన్యాసం అంతా తప్పుల తడక అనీ, అయినప్పటికీ యుద్ధసన్నాహాలకు యేవిధమైన సహాయమూ చేయకూడదనే కాంగ్రెసు విధానాన్ని స్పష్టీకరిస్తున్నంత వఱకది సరిగానే ఉన్నదనీ, తానా నాడిచ్చిన ఉపన్యాసంలో అలా ప్రకటించడమేగాక ఇంకా అనేకచోట్ల అనేకమందికి ఆ ప్రకారం ప్రకటింపవలసిందని ఆదేశించి ఉన్నాననీ, అందుకు తాను సంపూర్ణబాధ్యత వహిస్తున్నాననీకూడా మౌలానా అజాదు కోర్టులో వాఙ్మూలమిచ్చి ఉన్నాడు. ఉపన్యాసంలోని ఆ యా భాగాలు బ్రిటిష్ ప్రభుత్వంపైన అసూయా ద్వేషములను పురికొల్పి యుద్ధసన్నాహాలకు భంగం కలుగజేయవలెనని ఉద్దేశించబడినవి. కాబట్టి ఇండియా రక్షణచట్టం ౩౮ నియమం కింద ఇవి యుద్ధ ప్రతికూల చర్యలుకాగలవు. అందువలన ఆయనపైన ౩౮ (౫) కింద న్యాయంగానే నేరం ఆరోపింపబడింది. ఆ నేరం తాను చేసినట్లు ముద్దాయి ఒప్పుకొంటున్నాడుకూడా.

“ యుద్ధవ్యతిరేక నినాదాలుచేసేవారు తేదీ, స్థలము, సమయమూ - అన్నీ వివరంగా అధికారులకూ తెలియచేయవలసిందని కాంగ్రెసు సక్రమమైన కార్యక్రమంతో ఆదేశంయిచ్చి ఉండగా, సత్యాగ్రహాన్ని నడపడంలో కాంగ్రెసు సూచించిన ఆ సక్రమ పంథాను పూర్తిగా తృణీకరించి కాంగ్రెసు అధ్యక్షుడే తీవ్రమైన యుద్ధ ప్రతికూలోపన్యాసాన్ని చేశాడు. [ హిందూపత్రిక - జనవరి 10, 1941, పుట 8 ]

పై యిరువురనూ విడిచిపెట్టడంలో ప్రభుత్వంవారు చాలావరకు ఆత్మపరిశోధన చేసుకొన్నారనడంలో యేమీ సందేహంలేదు. కాని అంతమాత్రంతో వారికి హృదయ పరివర్తనం కలిగినట్లు భావించరాదు. కొద్ది కొద్దిగా అయిష్టంతో చేస్తున్న విడుదలల వలన ప్రభుత్వంవారి చర్యలోని ఔదార్యంగానీ విలువగానీ సగం తగ్గిపోయింది. ఈ మహానాయకులిరువురనూ విడుదల చేయకుండా ఉన్నట్లయితే ప్రభుత్వంవారు చేసిన పని అంతా హాస్యాస్పదంగా పరిణమించి ఉండేది.

కామన్సుసభలోని కార్మికసభ్యుడు భారత రాజ్యాంగ కార్యదర్శిని యిలా ప్రశ్నించాడు. "భారత భావిరాజ్యాంగ విధానమునుగూర్చి ఏ ప్రజాస్వామిక సిద్ధాంతంపైన భారతీయులు చర్చించి నిర్ణయించుకోవడానికి అధికారము కలదో ఆ విషయాన్ని వారికి తెలియచెప్పవలెనని మీరు భావిస్తున్నారా? రాజ్యాంగ పరిషన్నిర్మాణమున కనుకూలంగా ఉన్న హిందూ, ముస్లిం సంస్థల సంఖ్య (కాంగ్రెసుతోసహా) మీకు తెలుసునా? రాజ్యాంగ పరిషత్సిద్ధాంతానికి ప్రతికూలంగా ఉన్న ప్రజాస్వామిక సంస్థల సంఖ్యను చెప్పగలరా? నేటి భారత రాజ్యాంగ విధానాన్ని అనుకరించేటందుకుగానీ మార్పుచేసేటందుకుగానీ యేమైనా సూచనలో ప్రణాళికలో ఉన్నయెడల వాటిని త్వరలో ప్రకటించ నుద్దేశిస్తున్నారా?"

ఈ ప్రశ్నలకు ఆమెరీ యిలా సమాధాన మిచ్చాడు.

"1940 ఆగస్టు 8 వ తేదీని గవర్నరు జనరలుచేసిన ప్రకటనలోనే భారత రాజ్యాంగ సమస్యను గూర్చి, ఘనతవహించిన రాజుగారి ప్రభుత్వోద్దేశాలు స్పష్టీకరించబడినవి. యుద్ధానంతరం నిర్మింపబడనున్న ప్రతినిధిసంస్థ భారతభావిరాజ్యాంగ విధానమును యేరూపంలో నిర్మించవలెననే విషయంపైనను, యేయే సిద్ధాంతాలతో యేయే ప్రాతిపదికలను అవలంబించి యేయే పద్ధతులతో రాజ్యాంగ చట్టమునుగూర్చిన నిర్ణయము చేయవలసి ఉంటుందో దానిని గూర్చిన్నీ, భారతీయులు స్నేహపూర్వకమైన సమాధానమునకు రావలెనని ఆ ప్రకటనలో ఉంది."

విడుదలలు

విడుదలైన నాయకులు శరపరంపరలుగా ప్రకటనలు చేస్తారని చాలామంది అనుకోవడం సహజం. మొట్టమొదటగా 1941 జనవరి నాలుగో తేదీని జవహరలాలొక ప్రకటన చేశాడు. ఆయన తన స్నేహితులకూ సహచరులకూ మనఃపూర్వకాభినందనాలు పంపుతూ యిలా ప్రకటన చేశాడు. అది మానవ హృదయాలను కలచివైచేటంత శక్తివంతంగా ఉంది:—

భారతదేశానికి నెహ్రూ పిలుపు

నా సహచరులకూ, కాంగ్రెసువాదులకూ, సంయుక్తరాష్ట్రాల ప్రజలకూ- అందరికీ నా హృదయపూర్వకాభివందనాలు. పాతస్నేహితులను తిరిగి కలుసుకొని పరిచితములైన ముఖాలనుచూస్తూ, పెదవులమీద చిరునవ్వు చిందులాడే సఖుల గాఢాలింగనాలనూ కరస్పర్శలనూ పొందగల భాగ్యం లభించడం చాలా సంతోషం. సస్య

శ్యామలములైన విశాల భూఖండాలనూ క్రిక్కిరిసినవీధులనూ, తరంగాయితంగా సంచరిస్తూన్న జన ప్రవాహమునూ చూస్తూన్నప్పుడెంతో ఆనందంగా ఉంటుంది. కాని పరాయి ప్రభుత్వం జైలులోకి పొమ్మనమంటే పోవడం, బయటకు రమ్మనమంటే రావడం మాత్రం యేమీ బాగాలేదు, ఆ చిన్న ఖైదులోనుండి యిండియా అనే పెద్ద ఖైదులోకి రావడంకూడా ఎంతమాత్రం బాగుండలేదు మన శరీరాలనూ మనస్సులనూ కూడా బంధించివేస్తూన్న ఖైదుగోడలనన్నిటినీ యెప్పుడో ఒకప్పుడు మనం భగ్నంచేసి స్వతంత్రులంగా వ్యవహరించుకోవలసి ఉంటుంది. కాని ఆ సమయం యింకారాలేదు. ఆ సమయాన్ని మనం మఱచిపోయి అర్థంలేని చిన్న చిన్న విషయాలను తలుచుకొని సంతోషిస్తూ కూర్చోకూడదు.

"ఈ నిరంతర పీడిత ప్రపంచంలో హింసాద్వేషాలు నిరంకుశంగా రాజ్యం చేస్తూన్నవి ఈ కష్టాలకు విరామంగానీ, తప్పించుకొనే మార్గంగానీ కనిపించడంలేదు. పరదేశీయుల నిరంకుశ పరిపాలనవలన భారతదేశంలో మనమంతా ఉక్కిరి బిక్కిరై నలిగిపోతున్నాము. మనకు శాంతి లేదు. భారతదేశంయొక్క విముక్తికొరకు, ప్రపంచ స్వాతంత్ర్యంకొఱకు కర్మయోగులు కండనే ఘోష నిరంతరం మన చెవులలో మార్మ్రోగుతోంది. భారతదేశపు పిలుపు చెవులున్నవారందరికీ వినబడుతూనే ఉంది. పీడిత ప్రపంచ మానవకోటియొక్క దుఃఖం నానాటికి ఇంకా హృదయ విదారకమవుతోంది." యిది నెహ్రూ ప్రకటన.

1941 డిశంబరు 5 వ తేదీని రాజకీయ ఖైదీల విడుదలనుగూర్చి కాంగ్రెసు యొక్క భవిష్యద్విధానమునుగూర్చి గాంధీ యీ విధంగా ప్రకటించాడు:—

"అ. భా. కాం. సం. సభ్యులున్నూ కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులున్నూ సత్యాగ్రహం చేయనక్కరలేదు. అంతేకాదు. బొంబాయి తీర్మానమును మార్పుచేయదలచుకొన్నవారుకూడా సత్యాగ్రహం చేయనక్కరలేదు. ఇక తక్కిన వారికి సంబంధించినంతవఱకు శాసనోల్లంఘనం నిరంతరాయంగా కొనసాగవలసిందే" అని గాంధీజీ ఒక దీర్ఘమైన ప్రకటన చేశారు.

నిర్మాణ కార్యక్రమంలేని శాసనోల్లంఘనమువలన ఇండియాకు స్వాతంత్ర్యం లభించదని గాంధీజీయొక్క దృఢవిశ్వాసం. నిర్మాణకార్యక్రమం మినహాయింపబడితే శాసనోల్లంఘనమొక హింసావిధానంగా పరివర్తనం చెంది నిష్ఫలము కాగలదని ఆయన అంటారు.

## అసభ్యమైన తొందరవద్దు

విడుదలచేయబడిన సత్యాగ్రహులు సభలకు హాజరవడం కానీ సభలు జరిపి ఉపన్యాసాలీయడం కానీ చేయవచ్చునా అని అడిగితే గాంధీజీ "అవశ్యం చేయవచ్చు నన్నాడు. కాని వారు తక్షణం తిరిగీ సత్యాగ్రహంచేసే అసభ్యమైన తొందర చూప నక్కరలేదు. సాధారణ శాసనోల్లంఘనం నడుస్తూండ వచ్చు నన్నాడు."

"శాసనోల్లంఘనమును ఏవో కొన్ని పై పై కారణాలవలన ఆపివేయడానికి నాకధికారం లేదు. ఒక్క కాంగ్రెసు మాత్రమే ఆపని చేయగలదు. శాంతికోసమే సర్వస్వమూ అర్పించదలచుకొన్న నేను ఈ క్లిష్ట సమయంలో యుద్ధ ప్రతికూల కార్య క్రమాన్ని విరమించడమంటే నాకు నేను ద్రోహం చేసుకొన్నట్లే"

మహాత్మాగాంధీ ప్రకటనయొక్క పూర్తి పాఠమిది:

"ఇప్పుడు జరుగుతూన్న సత్యాగ్రహుల విడుదల అ. భా. కాం. సం వారు బొంబాయి తీర్మానాన్ని మార్పుచేస్తారనే ఉద్దేశంతో జరుగుతూన్నది. నేను నడుపుతూన్న సత్యాగ్రహం బొంబాయి తీర్మానాన్ననుసరించే. అందు వల్ల ఈ విడుదలలు అ. భా. కాం. సం. వారికి ప్రభుత్వంవారు చేస్తూన్న ఒక సవాలుగా మనం భావించుకోవలెను. కాబట్టి సాధ్యమైనంత త్వరలో అ. భా. కాం. సం. యొక్కయు వర్కింగుకమిటీ యొక్కయు సమావేశము లను పిలువవలసిందిగా మౌలానా అజాదుకు నేను సలహా యిచ్చాను. వారు తమ బొంబాయి తీర్మానమును మార్పు చేసుకొనేటంతవరకూ శాసనోల్లంఘనం నడుస్తూండవలసిందే. కాని ప్రభుత్వంవారు శాసనోల్లంఘన ఖైదీలను విడుదల చేస్తూన్నందువలన మా ఉద్యమం కొంత కష్టదశకు వచ్చిందని ఒప్పుకొని తీరాలి. అయితే మేము మా ఆశయమును నెరవేర్చుకొనవలెనంటే ఎన్నో కష్టాలను తరించి పనిచేయవలసి ఉంది. మేము స్వాతంత్ర్యమును పొందేలోగా ఎదుర్కోవలసిన కష్టాలముందిది యెన్నతగినదికాదు. అ. భా. కాం. సం. సమావేశం జరుగబోతూన్నది కనుక ఈలోగా వర్కింగుకమిటీ సభ్యులుకానీ అ. భా. కాం. సం. సభ్యులుకానీ శాసనోల్లంఘనం చేయరాదు. అంతేకాదు బొంబాయి తీర్మానమును మార్పించవలెనని కోరేవారుకూడా యెవ్వరూ శాస నోల్లంఘనం చేయరాదు. వీరుకాక తక్కిన వారంతా ఎడతెగకుండా శాస నోల్లంఘనం చేస్తూండవలసిందే, క్రిస్టమస్ పండుగ రోజున, బాక్సింగు రోజున నూతన ఉగాదిరోజున ఎవ్వరూ శాసనోల్లంఘనం చేయరాదు.

“ఇంతకుపూర్వం ఏర్పాటుచేయబడిన పద్ధతిప్రకారం యుద్ధప్రతికూల నినాదంచేసి శాసనోల్లంఘన మొనర్పవలెనా, లేక మరొక నూతన విధాన మవలంబించవలెనా అని సహజంగా సందేహం కలుగుతుంది. పూర్వపు పాత పద్ధతి అంటేనే నాకిష్టం. అది ఉద్యమానికొక స్పష్టమైన ఐక్యతను కల్పిస్తూన్నది. ఒకే పద్ధతిని ఒకే నినాదం చేయడంలో అత్యద్భుతమైన శక్తి ఉంది. అది సమానాభిప్రాయాలుగల మానవుల యొక్కయు సామాన్య ప్రజానీకము యొక్కయు దృష్టిని ఒకేచోటకు కేంద్రీకరిస్తుంది ఆ నినాదంకూడా సామాన్యమైనది కాదు. భిన్న భిన్న జాతుల అభిప్రాయ భేదాలు యుద్ధంవలననే నిర్ణయం కావలెననే దృక్పథమునెడల భారతజాతియొక్క ప్రతికూల భావాన్ని ప్రకటిస్తూన్నదది. అది భూలోకమున కీయబడుతూన్న శాంతి సందేశం ప్రపంచ మానవకోటియెడల ప్రకటింపబడుతూన్న సుహృద్భావం. ఈనాడు వ్యక్తిగత విషయంగా కనిపించే ఈ నినాదం కాలక్రమేణా సమస్త ప్రజానీకమునకూ సంబంధించింది కావచ్చు. అయితే లాంఛనప్రాయంగా శాసనోల్లంఘనం చేసిన సత్యాగ్రహులను విడిచిపెడుతూన్న ఈ ప్రభుత్వం యుద్ధ ప్రతికూలనినాదం చేసినందుకు తిరిగీ వారిని ఖైదులో పెట్టక పోవచ్చును. అప్పుడు మన మవలంబించతగినవి రెండు మార్గాలున్నవి ప్రభుత్వంవారు మనలను ఖైదుచేయక పోయినంతమాత్రంతో మనం గాబరాపడి కెల్లమొగం వేయనక్కరలేదు. జైలుకు పోవడమే మన ఆదర్శంకాదు. వాక్స్వాతంత్ర్యమే మన ప్రస్తుతాదర్శం. మన నినాదానికి వారడ్డుతగులకుండా ఉంటే కొంతవరకు మనం మన ఆశయాన్ని పొందగలిగినట్లే. కేవలం ఖైదుకు పోవడానికే శాసనోల్లంఘనం చేయడం అవివేకం. కాంగ్రెసువారు నిరుత్సాహపోయి నిస్పృహ చెందడానికి కారణం శాసనోల్లంఘనానికీ నిర్మాణ కార్యక్రమానికీ ఉన్న నిరంతర సంబంధమును వారిలో ఎక్కువమంది గ్రహించలేకపోవడమే. నిర్మాణ కార్యక్రమంలేని శాసనోల్లంఘనం వలన మనకు స్వాతంత్ర్యం లభించదు. పైపెచ్చు అది హింసాపద్ధతిగా పరివర్తనంచెంది నిష్ఫలమవుతుంది. చివరకు సమిష్టి శాసనోల్లంఘనంకూడా శరీరబలం కలవారే చేయవలసిఉంటుంది. నిర్మాణ కార్యక్రమం అందఱూ కొనసాగించవచ్చును. భారతజాతి యావత్తూ దానిని శ్రద్ధగా చేపట్టినయెడల అది విరమింపబడవలసిన అవసరమే ఉండదు. మనకు సంపూర్ణ స్వాతంత్ర్యము సంపాదించి పెట్టడానికది ఒక్కటే చాలు.”

"నిర్మాణ కార్యక్రమమును నిర్వర్తించడమంటే స్వరాజ్య సౌధమును నిర్మించడం. నిర్మాణ కార్యక్రమంలో నిజమైన విశ్వాసం లేనియెడల నేను భావించిన సమిష్టి అహింసా సిద్ధాంతం యావత్తూ తుత్తునియలై పోతుంది. అహింసాపూర్వక స్వరాజ్య సాధనమంటే నిర్మాణ కార్యక్రమమును నిర్వర్తించడమేనని నా అభిప్రాయం కాబట్టి అధికారులు మనలను ఖైదులో పెట్టినా పెట్టకపోయినా మనం నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించవలసిందే.

"విడుదల చేయబడిన సత్యాగ్రహులు సమావేశాలు జరుపుచడంకానీ సభా వేశాలకు వెళ్ళడంకానీ ఉపన్యాసాలీయడంకానీ చేయవలెనా అని నన్ను చాలామంది అడుగుతున్నారు. వారివన్నీ చేయవలసిందే. వారు తక్షణం శాసనోల్లంఘనం చేయవలెనని నేననుకోవడంలేదు. వారిలా చేయవలెనని కోరనుకూడా. అది అసహ్యాకరమైన అత్రంగా కనిపిస్తుంది. కాని మామూలు శాసనోల్లంఘనం మాత్రం నడుస్తూనే ఉండాలి. విడుదల చేయబడిన వారికిమాత్రం ఊపిరి పీల్చుకోవడానికైనా కొంత సావకాశముండాలి వారు స్థానికంగా ఉపన్యాసాలిస్తూ ఆ యా సమావేశాలలోని ప్రజా హృదయాన్ని పరిశీలిస్తూండాలి. సాధారణ రాజకీయ విషయాలనుగూర్చి వారి అభిప్రాయాలను విస్పష్టంచేస్తూ కాంగ్రెసు అవలంబించిన యుద్ధప్రతికూల వైఖరి వ్యాఖ్యానించడంలో వెనుదీయరాదు.

"చిహ్నప్రాయంగా నడపబడుతూన్న సత్యాగ్రహంలో ఒక విశిష్ట భావం ఉంది. అయితే కాంగ్రెసు వాదులకు సత్యాగ్రహంచేసే ఉద్దేశం లేకపోయినప్పటికీ వారిచ్చే ఉపన్యాసాలకే వారిని ప్రభుత్వంవారు ఖైదుచేయవచ్చును. మౌలానా సాహెబును పండిత జవహరలాలునూ వారలాగే ఖైదుచేశారు ఇక తక్కినవారిమాట చెప్పనక్కరలేదు పైపై కారణాలను ఆధారంగా చేసికొని శాసనోల్లంఘనమును విరమించడానికి నా కధికారంలేదు. అందుకు కాంగ్రెస్సే సర్వాధికారి నాకు సంబంధించినంతవరకు ఒక్కటేమార్గం ఉంది. శాంతిస్థాపనకోసం కంకణం కట్టుకొన్న నేను ఈ సందిగ్ధ సమయంలో యుద్ధప్రతికూల ప్రచారాన్ని మానడమంటే నాకు నేను ద్రోహం చేసుకొన్నట్లే కాబట్టి నావలె భావించేవారందరూకూడా ప్రజల అపోహలకు ఓర్చుకొని యే ఆపత్తు వచ్చినా జంకక, వారిచర్యలద్వారా తమ విశ్వాసాన్ని ప్రకటించవలసిందే. అందువలన, మనిషిని అధోలోకంలోకి కొనిపోతూన్న దుష్పాతమునుండి తప్పించుకోవలెనంటే మనం చూపెట్టిన ఈ మార్గమొక్కటే నని ఇప్పుడే యుద్ధం చేస్తూన్న జాతులవారందరూ తుట్టతుదకు గ్రహించగలరని నా ఆశ.

1941 డిశంబరు మధ్యభాగంలో రెండు సుప్రసిద్ధమైన ప్రకటనలు వెలువడినవి ఒకటి కలకత్తాలోని ఫెడరేటెడ్ ఛేంబర్సు ఆఫ్ కామర్సు సమావేశంలో రాజప్రతినిధి 15 వ తేదీని చేసినది; రెండవది లక్నో విశ్వవిద్యాలయంలో డిశంబరు 13 వ తేదీని రాజగోపాలాచారి యిచ్చిన స్నాతకోపన్యాసం. మొదటిదానిలో రాజప్రతినిధి 1940 ఆగస్టు 8 వ తేదీని చేసిన ప్రకటనను తిరిగీ పునరుద్ఘాటించాడు. అనగా లండన్ లోని వైటుహాలు ప్రకటన కది నకలుగా ఉంది. ఒక్క సంవత్సరం శిక్షపడినంత మాత్రంతో భారత రాజకీయవేత్తలకు బుద్ధివచ్చి ఉంటుందని లిన్‌లిత్‌గో ప్రభువు అనుకొనిఉంటే అది గొప్ప పొరపాటు. ఇంగ్లాండు అనే స్వర్గధామంలో ఉన్న దేవుడి కిన్నీ ఇండియా అనే భూమండలంలో ఉన్న ప్రజలకున్నూ పొత్తు చేకూర్చవలెనంటే లిన్‌లిత్‌గో అనే యేసుక్రీస్తు మహానుభావుడు తన ధోరణినీ వైఖరినీ మార్చుకొని పూర్వకాలపు పెద్దపెద్ద ప్రసంగాలను కట్టిపెట్టాలి. "ఆగస్టు 8 వాగ్దానాన్ని ఆమోదించిన వారదృష్టవంతులు. వారు హిందూస్థానమనే స్వర్గధామమునకు వారసులవుతారు" అనే పద్ధతిలో మాట్లాడడం పనికిరాదు.

రెండోది సి. ఆర్. చేసిన స్నాతకోపన్యాసం. అదియొక సుప్రసిద్ధసంఘటనం. అంత ప్రాముఖ్యమైన సమయాన ఆనాడు తీవ్ర వాదోపవాదములకు గురిఅవుతూన్న అహింసనుగూర్చి ఒక ఉత్కృష్టమైన ప్రకటనను ఆధునిక భావసమన్వితంగా చేసేటందు కవకాశం తీసుకొన్నాడాయన.

నాటి రాజకీయ పరిస్థితులలో అహింస యెంతవరకు ఆచరణ యోగ్యమవుతుందో వివరిస్తూ రాజగోపాలాచారి ఆంతరంగిక సంభాషణలలో ముచ్చటించినట్లు కూడా లక్నోనుంచి తెలియవచ్చింది. మానవ వ్యవహారాలలో అహింసను ఆచరణలో పెట్టడానికి కొంత పరిమితి ఉందనికూడా ఆయన నొక్కి వక్కాణించాడు. బ్రిటనుకో మిత్రమండలివారికీ ప్రతికూలంగా ఉన్నవారితో చేతులు కలిపేవారినిగూర్చి తనకేమీ సానుభూతి లేదనికూడా రాజగోపాలాచారి అన్నట్లు తెలుస్తూన్నది. భారతీయులకు నిజమైన స్వాతంత్ర్యం లభించేపరిస్థితులను బ్రిటిష్‌వారు కల్పించేయెడల వృద్ధుడైనప్పటికీ తాను సైన్యంలోచేరి ఆయుధాలు తీసుకొని పోరాడడానికికూడా తాను భావిస్తూన్న అహింస తనకు అడ్డంరాదని రాజగోపాలాచారి అన్నాడు. బ్రిటిష్‌వారు మొట్టమొదట చెప్పిన మాటలనే పునరుద్ఘాటిస్తే చాలునని ఆయన అభిప్రాయం. ఎందువల్లననగా బ్రిటిష్ వారి ఆ వాగ్దానం కాంగ్రెసు వర్కింగుకమిటీ పూనాలో చేసిన తీర్మానానికి దగ్గరగా ఉందని, కేంద్రంలో జాతీయసంయుక్త ప్రభుత్వం ఉండవలెననీ రాష్ట్రాలలో ప్రజాప్రభుత్వాలు ఉండవలెననీకూడా ఆయన అన్నాడట. ప్రభుత్వాన్ని భారతీయం చేయడ

మంటే అర్థంలేని మాట అని పండిత జవహర్‌లాల్ నెహ్రూతో ఆయనకూడా ఏకీభవించాడు.

సత్యాగ్రహాన్ని విరమించి తన రాజకీయ ఆదర్శాలను స్పష్టీకరిస్తూ తటస్థంగా ఉండడమే ప్రస్తుతం కాంగ్రెసు వారవలంబించవలసిన రాజనీతి అని రాజాజీ అభిప్రాయం. బ్రిటిష్ ప్రభుత్వానికి అనుకూలంగా ఉండేపద్ధతిని తన దృక్పథాన్ని మార్చుకోవలెనని ఆయన ఆదుర్దా పడడంలేదు. కాంగ్రెసు తన వైఖరిని స్పష్టంగా ప్రపంచానికి తెలియచేయడం ఉచితమని ఆయన తలంపు. ప్రభుత్వంవారు దానిని అంగీకరించనూ వచ్చు, తృణీకరించనూవచ్చు. ఆ బాధ్యతవారికే వదలివేయాలి

ప్రభుత్వవైఖరి యేమిటో తనకు తెలియదనీ తెలియడానికి వీలులేదనీ అంటూ, కొంతకాలానికి అసలు పరిస్థితులను సరిగా అర్థంచేసుకొని కాంగ్రెసుచేసిన వాగ్దానాన్ని తోసిపుచ్చడం బ్రిటనుకు క్షేమదాయకం కాదని వారే ఒప్పుకొంటారన్నాడు రాజగోపాలాచారి "వారొక పంథాను అవలంబించిన తరువాత దాని కనుగుణంగా అందరినీ, భిన్నమతస్థులనుసైతం, కూడగట్టుకొని తమస్థితిని బలపరచుకోవడం వారిపని అందుకోసం ఎవ్వరూ ఎదుర్కోలేనంత వత్తిడిని వారే తీసుకొని రావలెను.' అని రాజాజీ అభిప్రాయం.

సత్యాగ్రహ ఖైదీలను విడిచిపెట్టగానే సాధ్యమైనంత త్వరలో కాంగ్రెసు వర్కింగుకమిటీని, తరువాత అ. భా. కాం. సం ను సమావేశపరచి కాంగ్రెసుయొక్క భావి కార్యక్రమాన్ని నిర్ణయించవలెనని గాంధీజీ ప్రకటించాడు. ఆప్రకారం 1941 డిశంబరు 23 వ తేదీని వర్కింగుకమిటీ సమావేశం పిలువబడింది. శీతాకాలంలో అనగా డిశంబరు జనవరి నెలలలో కొన్నాళ్ళు బార్డోలీలో కాలక్షేపంచేయడం కొన్ని సంవత్సరాలనుండీ గాంధీకి ఆచారమయింది. 1941 కి పూర్వం రెండు మూడేళ్ళకిందట గాంధీని తిరిగి గుజరాతుకు తీసుకొనిపోయి ఆయనను శాశ్వతంగా బార్డోలీలోనే ఉంచుకోవలెనని ప్రయత్నాలు జరిగినవి. కాని అహింసాయుతమైన భారతదేశానికి వార్ధాను ప్రధాననగరంగా చేసుకొన్న గాంధీ, సేవాగ్రామమును తన నివాసస్థానంగా పెట్టుకొని, సత్యాహింసలలోనూ, గృహ పరిశ్రమలు, ప్రాథమిక విద్య, సాంఘిక సేవ మహిళా శిక్షణము మొదలగు నిర్మాణ కార్యక్రమమునందలి వివిధ విషయాలలోనూ నూతన ప్రయోగములను చేయడం మొదలుపెట్టినాడు. అందువల్ల ఆయన బార్డోలీ కోసంగానీ చివరకు గుజరాతు కోసంగానీ వార్ధాను విడిచిపెట్ట నిచ్ఛగించలేదు. అనుకొన్న ప్రకారం గాంధీగారి శీతకాలపు మకాంలోనే (బార్డోలీ) నాటి చారిత్రాత్మకమైన వర్కింగు కమిటీ సమావేశం జరిగింది. కాని అక్కడ, 'అవాంఛనీయములు

కాకపోవచ్చును కాని, కొంతవరకు అనుకోని ఫలితాలుమాత్రం జరిగినవని చెప్పక తీరదు.

కాంగ్రెసు వర్కింగు కమిటీవారామోదించిన తీర్మానముయొక్క పూర్తి పాఠమిది :—

"వర్కింగుకమిటీ క్రిందటిసారి సమావేశమై యిప్పటికి పదునాల్గు మాసాలు గడిచింది. ఈ కాలంలో ప్రపంచమంతా యుద్ధపు సుడిగుండంలోపడి అంత కంతకు ఆత్మవినాశనానికి దోహదం చేసుకొంటూన్నది మానవచరిత్రలో అత్యంత క్లిష్టదశ యేర్పడిన ఈ తరుణంలో, వర్కింగుకమిటీసభ్యులు ఖైదునుండి విడుదలై జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను ఆమూలాగ్రంగా అత్యంత శ్రద్ధతో పరిశీలించారు. నేడు పాత సమస్యలకొక కొత్త ప్రాముఖ్యత వచ్చింది. ఇండియా సరిహద్దులవరకు యుద్ధ జ్వాలలు వ్యాపించినందున నూతనసమస్య లుత్పన్నమైనవి ఇటువంటి విషమస్థితిలో భారత ప్రజానీకముయొక్క సంపూర్ణ సహకారంతోనే ఈ కమిటీవారు తమపైనున్న గురుతర బాధ్యతను సక్రమంగా నిర్వర్తించ గలరు.

"కడచిన అనేక సంవత్సరాలనుండీ కాంగ్రెసు యే సిద్ధాంతాలకోసం యే ఆదర్శాలకోసం పనిచేస్తూన్నదో వాటిని విస్మరించకుండా ప్రపంచ పరిస్థితులకూ ప్రపంచ స్వాతంత్ర్యమునకూ వాటిని సమన్వయం చేసుకొంటూ ఈ కమిటీవారు సమాలోచనలు సాగించారు. భారత ప్రజానీకమునకు సంపూర్ణ స్వాతంత్ర్యం అవసర మనీ ముఖ్యంగా నేటి ప్రపంచ కల్లోల పరిస్థితిలో అది ఇండియా క్షేమమునకేగాక ప్రపంచక్షేమమునకుగూడా తప్పని సరి అనీ ఈ కమిటీవా రభిప్రాయపడుతూన్నారు. స్వతంత్ర జాతుల పరస్పర సహకారం మీదనే శాంతి స్వాతంత్ర్యములు స్థాపింపబడి సుస్థిరంగా ఉండగలవనికూడా ఈ కమిటీవారి తలంపు

"1939 సెప్టెంబరు 14 వ తేదీని ఈ కమిటీవారు చేసిన ప్రకటనలో యుద్ధము నెడల వారి వైఖరి విస్పష్టం చేయబడింది. అందులో వారు నాజీ ఫాసిస్టు దురాక్రమణలను ఖండించారు. ప్రస్తుత పరిస్థితులలో యుద్ధాశయాలు స్పష్టంగా ప్రకటింపబడి యెంతవరకు సాధ్యమో అంతవరకు ఆచరింపబడేయెడల ప్రజాస్వామ్య స్వాతంత్ర్యముల కొరకు సహకారం చేయడానికికూడా వారు హృదయపూర్వకంగా ఒప్పుకొన్నారు. స్వాతంత్ర్య ప్రజాస్వామ్యములే యుద్ధాశయాలైనయెడల సామ్రాజ్యతత్వ మంతమై ఇండియా స్వాతంత్ర్యం గుర్తింప బడాలి. బ్రిటిష్ ప్రభుత్వ పక్షాన తరువాత చేయబడిన ప్రకటనలున్నూ బ్రిటిష్‌వారి అభివృద్ధి నిరోధక నిర్బంధ చర్యలున్నూ ఇండియాలో తమ సామ్రాజ్యమును నిలబెట్టుకొని అంత కంతకు దానిని బలిష్టం చేసుకొంటూ

ఇండియా ప్రజలను దోచుకోనవలెనని వారు తలంచుతూన్నట్లు స్పష్టపడింది. భారత జాతీయతను బుద్ధిపూర్వకంగా అవమానించడమూ అంతులేని నిరంకుశాధికారాన్ని కొనసాగించడమూ, అభివృద్ధి నిరోధకములూ విచ్ఛిన్నకరములూ అయిన శక్తులను ప్రోత్సహించడమూ, ఇదే బ్రిటిష్ రాజనీతి. అందువల్ల కాంగ్రెసు సూచించిన గౌరవ ప్రదమైన ప్రతి సమాధాన ప్రయత్నమూ నిరాకరింప బడడమేగాక మితవాద సంస్థల వారు వెల్లడించిన ప్రజాభిప్రాయంకూడా తృణీకరించబడింది.

"కాబట్టి ఇండియా ప్రజల ప్రాథమిక హక్కులనూ, గౌరవమునూ, భారత జాతీయోద్యమం యొక్క ప్రతిష్ఠనూ కాపాడేటందుకు తానునడపవలచుకొన్న కార్య క్రమానికి నాయకత్వం వహించవలసిందని కాంగ్రెసు గాంధీని కోరక తప్పిందికాదు. మహాత్మాగాంధీ సాధ్యమైనంతవరకు ప్రతికూల పక్షంవారికి- ముఖ్యంగా యుద్ధంలో చిక్కుకొనీ ఆపదలో ఉన్నవారికి- చీకాకుకలిగించకూడదనే ఉద్దేశంతో తాను నిర్ణ యించిన శిక్షణకు లోబడిన కొంతమంది వ్యక్తులతో మాత్రమే పరిమితంగా సత్యా గ్రహం ప్రారంభించారు. అది యిప్పటికి పదునాల్గునెలలనుండి సాగుతూన్నది. షుమారు 25,000 మంది కాంగ్రెసువాదులు ఖైదుశిక్ష ననుభవిస్తున్నారు. సరిహద్దు రాష్ట్రాల లోనూ తదితర ప్రదేశాలలోనూ సత్యాగ్రహం చేసిననూ నిర్బంధింపబడని వారింకా అనేకవేలమంది ఉన్నారు.

"గాంధీజీ నాయకత్వమున కనుగుణంగా భారతజాతి అనుసరించినందుకు ఈ కమిటీవారు గౌరవ పురస్సరంగా వారిని శ్లాఘిస్తున్నారు. గాంధీ నాయకత్వం ఈ తరుణంలో భారత ప్రజానీకాన్ని బలపరిచిందని కూడా ఈ కమిటీవారు ప్రకటిస్తు న్నారు. బ్రిటిషు ప్రభుత్వవైఖరి ఇండియా స్వాతంత్ర్యమునకు ప్రతికూలంగా ఉండడమే గాక భారత ప్రజానీకముయొక్క హృదయాంతరాళాలలో ఎంతకాలం నుండియో నాటుకొని పోయిన భావాలకూ విశ్వాసాలకూ అవమానకరంగా ఉండేటంత సంపూర్ణ నిరంకుశాధికారాన్ని ఇండియా అంతటా ఆ ప్రభుత్వం చలాయిస్తున్నది. ప్రజాస్వామ్య స్వాతంత్ర్యములనే నినాదములుకానీ, యుద్ధం వలన తటస్థించిన విపత్తులుకానీ ప్రళ యాలుకానీ, బ్రిటిషువారి ఈ వైఖరిలో యేమీ మార్పు కలిగించలేదు. వారి వైఖరిలో యేమైనా మార్పువస్తే పూర్వంకన్న ఇంకా చెడ్డమార్పు వచ్చింది కాని మంచి మార్పు రాలేదు.

"ఇటీవల జరిగిన రాజకీయ ఖైదీల విడుదలకు ఏమీ ప్రాముఖ్యత లేదు. ఆ విడుదలలు జరిగిన పరిస్థితులనుగానీ, అధికారుల ప్రకటనలనుగానీ పరిశీలించినయెడల అవి ప్రభుత్వవైఖరిలో మార్పు వచ్చినందున జరిగినవి కావని స్పష్టపడుతుంది. విడే

శీయుల పరిపాలనమును సహించలేక ఇండియాకు స్వాతంత్ర్యమును సంపాదించవలెనని బద్ధకంకణులై ఉన్న ప్రసిద్ధ దేశభక్తు లెందరో ఆ నేరమునకు విచారణలేకుండా ఇండియా రక్షణచట్టం కింద డిటెన్యూలుగా పంపబడి ఖైదులో మ్రగ్గుతూనే ఉన్నారు. ఇటీవల జరిగిన ప్రఖ్యాత పురుషుల నిర్బంధమున్నూ ఖైదులో వారియెడ చూపబడు తూన్న నిరాదరణమున్నూ బ్రిటిషువారి పూర్వపు వైఖరిలో యేమీ మార్పులేదని నిరూపిస్తూన్నవి

"ఇండియా యెడల బ్రిటిషు ప్రభుత్వం అవలంబిస్తూన్న వైఖరిలో యేమీ మార్పు లేకపోయినప్పటికీ ప్రపంచ మహాసంగ్రామంగా పరిణమించిన నేటి యుద్ధ పరిస్థితుల వలన కలిగే నూతన ప్రపంచ స్థితినీ, ఈ సందర్భంలో ఇండియా అవలంబించ వలసిన విధానమును వర్కింగుకమిటీవారు సమగ్రంగా ఆలోచించవలసి ఉంది. దురా క్రమణకు గురియై స్వాతంత్ర్యం కొరకు పోరాడే జాతులయెడలనే కాంగ్రెసుకు తప్ప కుండా సానుభూతి ఉంటుంది. కాని స్వేచ్ఛా స్వాతంత్ర్యములుకల భారతదేశం మాత్రమే జాతీయ రక్షణకు పూనుకొని సంగ్రామ కల్లోలములనుండి వెలువడిన మహ త్తర సమస్యల పరిష్కారమునకు తోడ్పడ గలదు.

"బ్రిటిషు ప్రభుత్వం అంటే ఇండియాలో ప్రతివారికీ విరోధమూ అవిశ్వాస మూను. వారెంత గొప్ప గొప్ప వాగ్దానాలు చేసినప్పటికీ ఈ పూర్వచరిత్రను ఎవ్వరూ విస్మరించలేకుండా ఉన్నారు. కాబట్టి ఫాసిస్టు నియంతృత్వమునుండి ప్రత్యేకించి వీలు లేని నిరంకుశ సామ్రాజ్య తత్వమునకు పరాధీనమైన భారతదేశం స్వచ్ఛందంగా సహా యం చేసేటందు కిష్టపడజాలదు. కాబట్టి 1910 సెప్టెంబరు 16 వ తేదీని బొంబా యిలో జరిగిన అ. భా. కాం. సం. వారి తీర్మానము ననుసరించియే నేటికిని కాంగ్రెస్ కార్యవిధానం ఉండవలెనని ఈ కమిటీవారి అభిప్రాయం."

కాంగ్రెసు వర్కింగు కమిటీవారింకా ఈ దిగువ తీర్మానాలు చేశారు

గాంధీజీ దగ్గరనుండి వర్కింగుకమిటీవారికి వచ్చిన ఉత్తరంలో ఆయన పేర్కొన్న విషయం సమంజసంగా ఉందని గ్రహించి, బొంబాయి తీర్మానం ప్రకారం ఆయన పైన ఉంచబడిన బాధ్యతను ఈ కమిటీవారు తొలగిస్తున్నారు. కాని స్వరాజ్యసంపాద నార్థం ఆయన అవలంబించిన అహింసా విధానం ప్రజాసామాన్యంలో చైతన్యం కలిగించడానికి అనేక విధాల జయప్రదంగా తోడ్పడినందున, కాంగ్రెసు ముందుకూడా అదేవిధానాన్ని అవలంబిస్తుందని ఆయనకు ఈ కమిటీవారు హామీ యిస్తున్నారు.

"అంతేకాదు స్వతంత్ర భారతదేశంలోకూడా అహింసకుగల అవకాశాన్ని సాధ్యమైనంత పెంపొందించగలమని ఈ కమిటీవారాయనకు వాగ్దానం చేస్తున్నారు. గాంధీ అవలంభించిన ధర్మనిర్వహణమునకు అవసరమైతే శాసనోల్లంఘనములో పాల్గొనడంతో సహా కాంగ్రెసు వాదులు సహాయపడగలరని ఈ కమిటీవారాశిస్తున్నారు.

కాంగ్రెసువాదులందరికీ వర్కింగుకమిటీ వారీ దిగువ ఉత్తరువులను జారీచేశారు.

ప్రపంచ పరిస్థితులలో ఇటీవల జరిగిన పరిణామములవలన భారతదేశపు సరిహద్దుల వరకూ యుద్ధం వ్యాపించింది. ఇందువల్ల దేశంలో కొన్నిచోట్ల రణరంగాలు ఏర్పడవచ్చును. కొన్ని నగరాలు విమాన దండయాత్రలకు గురికావచ్చును.

ఎటువంటి ఆపత్తులూ చిక్కులూ వచ్చినప్పటికీ కంగారు కాకుండా నిమ్మళ నీరత్తివల్లు ఉండడమే నిజమైనమందు. ఎప్పుడూ గాబరాగానీ ఆదుర్దాగానీ పడకూడదు. కాంగ్రెసువాదులు తను నియమిత స్థానాలలో కదలకుండా ఉండి అవసరం వచ్చినప్పుడల్లా ప్రజలకు సహాయంచేసే స్థితిలో ఉండాలి. తమ సురక్షిత స్థానాలను ఎక్కువ ఆపత్తులో ఉన్నవారికి వశం చేయాలి. ఎక్కువ అవసరం కలవారికి సహాయం చేయడానికికూడా వారు సంసిద్ధంగా ఉండాలి.

"కాంగ్రెసు సంస్థ బలిష్ఠంగా ఉండే క్రమశిక్షణకు బద్ధమై ఉన్నప్పుడున్నూ కాంగ్రెసువాదులుగానీ కాంగ్రెసు కమిటీలుగాని స్థానికంగా ప్రజల విశ్వాసమును చూరగొంటూన్నప్పుడూ మాత్రమే వారు ప్రజలకు తగిన సహాయం చేయగలరు.

"కాబట్టి కాంగ్రెసు కమిటీలున్నూ కాంగ్రెసు వాదులున్నూ తక్షణం తమ సంస్థను బలిష్ఠం చేసుకొనే ప్రయత్నాలను కొనసాగిస్తూ పట్టణాలలోనూ గ్రామాలలోనూ ఉన్న ప్రజలతో తమకుగల సన్నిహిత సంబంధాన్ని పునరుద్ధరించుకోవాలి. ప్రతి గ్రామం కాంగ్రెసు సందేశాన్ని తెలుసుకొని రాబోయే కష్టాలను ఎదుర్కొనగలిగిన స్థితిలో ఉండాలి."

తరువాత రాజేంద్రబాబు, సర్దారు పటేల్, కృపలానీ, డాక్టర్ ఘోషులు, రాబోయే అ. భా. కాం. సం. సమావేశంలో ప్రతి సభ్యుడూ స్వతంత్రంగా వ్యవహరించవలెనని ఒక ప్రకటన చేశారు.

హరిజన్‌లో ప్రకటింపబడిన గాంధీజీ ఉపన్యాసమువలన బార్డోలీ తీర్మానములోని విశేషాంశములింకా కొన్ని అర్థమయినవి. ఆ ఉపన్యాస సారాంశ మిది:-

"కాంగ్రెసులోనున్న అన్ని వర్గాలవారూ తమ స్వరూపాలను సరిగా చూచుకోగలగడానికీ తీర్మానమొక అద్దం వంటిది. దీని మూలమును రచించింది జవహరలాలు నెహ్రూగారు. తరువాత దీనిని ఒక ఉపసంఘంవారు పరిశీలించి ప్రాముఖ్యమైన మార్పులను కొన్నిటిని చేశారు.

రాజాజీకి మూలమును సవరించవలసిన అవకాశం లేకపోయింది. సబ్‌కమిటీవారుమాత్రం రాజాజీ దూరడానికి కొంచెం సావకాశం కల్పించారు. యుద్ధసన్నాహాలకు సహాయం చేయడానికి నేనెంత ప్రతికూలంగా ఉన్నానో జవహరలాలుకూడా అంత ప్రతికూలంగానూ ఉన్నాడు. కాని మా కారణాలుమాత్రం వేరు. కాంగ్రెసుకు అంగీకారములైన షరతులను కొన్నిటిని బ్రిటిషు ప్రభుత్వంవారు నిర్వహిస్తే రాజాజీ యుద్ధంలో పాల్గొనదలచుకొన్నాడు. రాజేంద్రబాబువంటి అహింసాయుత సహాయ నిరాకరణవాదులకు నిజంగా స్థానముంది ఎందువల్లననగా ఏవో దూరపు సంఘటనలు తటస్థించేవరకు అహింసకు అగ్రస్థానం ఉండనే ఉంది."

గాంధీ యింకా యిలా అన్నాడు.

"అ. భా. కాం. సం. లో ఈ విషయాన్నిగూర్చి వోట్లు తీసుకోవచ్చునని అనుకొనేటప్పుడు, చిట్టచివరకు గాంధీ నాయకత్వాన్ని నిలబెట్టడానికాయన యిచ్చే పిచ్చిసలహానే కాంగ్రెసు సభ్యులు విని ఇన్నేళ్ళనుండి రాజకీయ సంస్థగానున్న కాంగ్రెసును ఒక మతసంస్థగా మారుస్తారేమోననికూడా చాలామంది భయపడ్డారు. కాంగ్రెసు అటువంటిపని యెప్పుడూ చేయదనీ, కడచిన ఇరవై సంవత్సరాల కాలమునూ కాంగ్రెసు వృధాచేయలేదనీ నేను వారికి చెప్పి వారి భయాన్ని పోగొట్టదలచుకొన్నాను. ప్రపంచం అర్థం చేసుకోగలిగిన భాషలోనే కాంగ్రెసు వ్యవహరించదలచుకొన్నది. కాంగ్రెసుకు సూచించే షరతులు తగినంత బాగాఉంటే కాంగ్రెసు వాటి నంగీకరించి తీరుతుంది. కాని కాంగ్రెసు తేలికగా సంతృప్తిపడి ఊరుకోదు. తాను కోరింది లభించేవరకు "ఇది కాదు" "ఇది కాదు" అంటూనే ఉంటుంది.

"కాబట్టి మీ కేమి కావాలో మీరు సరిగా చెప్పండి: నాకేమి కావాలో నేను చెబుతాను. అందువల్లనే నేను నామూడు వారపత్రికలనూ ప్రకటించ తలచుకొన్నాను. వాటిలో నా అభిప్రాయాలను నేను స్వేచ్ఛగా ప్రకటించడానికి వీలున్నంతకాలమూ ప్రకటిస్తూంటాను. ఈలోగా మీరు కోరింది రావడానికి వీలుంటే మీరే బేరం ఫైసలు చేసుకోండి. అందువల్ల నేనెంతమాత్రమూ విచారపడను. నమ్మండి! ప్రపంచదృష్టిలో కాంగ్రెసు హాస్యాస్పదం కావడంమాత్రం నా కిష్టంలేదు. నా నాయకత్వం నిలబెట్ట

డానికి మీ విశ్వాసాలకు ప్రతికూలంగా మీరు ప్రవర్తించారనే అపఖ్యాతి రావడం నేనిచ్ఛగించను,

బార్డోలీ తీర్మానంలోని పరమార్థమును 1942 జనవరి 5 వ తేదీని గాంధీ వివరించాడు.

"నా అభిప్రాయం ఎలాఉన్నా మీరందఱూ యీ విషయంలో స్వేచ్ఛగా వ్యవహరించాలి" అని గుజరాతులోని కాంగ్రెసు సేవకులనూ గుజరాతు రాష్ట్రి కాంగ్రెసు సంఘాన్ని ప్రబోధిస్తూ గాంధీ ఉపన్యసించాడు. సభకు హాజరైన వారిలో డాక్టరు రాజేంద్రప్రసాద్, సర్దార్ వల్లభాయిపటేల్, ఆచార్య కృపలానీ, డాక్టరు ప్రఫుల్లచంద్రఘోషులు కలరు.

బార్డోలీ తీర్మానములమగూర్చి గాంధీ ఒక గంటసేపు ఉపన్యసిస్తూ వార్ధాలో జరుగబోయే అ. భా. కాం. సం సమావేశంలో తమ వోటును నిష్పక్షపాతంగా వినియోగించవలసిందని గుజరాతు సభ్యులను ప్రబోధించాడు.

తాను కాంగ్రెసును విడనాడలేదనీ బొంబాయికీ యిప్పటికీ తన స్థితిలోయేమీ మార్పు రాలేదనీ అన్నాడు గాంధీ. నేను కాంగ్రెసు సేవకుడను సత్యాహింసలకు అనుగుణంగా నేను కాంగ్రెసును సేవించదలచుకొన్నాను. బ్రిటను ఇండియాకు స్వరాజ్యమును ప్రసాదించినయెడల యుద్ధంలో ప్రభుత్వం వారితో సహకారం చేయడానికి వర్కింగుకమిటీ వారు ఒప్పుకొన్నారు. కాంగ్రెసు అహింసా సిద్ధాంతాన్ని అతిక్రమించిందన్న సంగతి సత్యంకాదు. కాని బ్రిటనుతో చేతులు కలిపే డందుకది చిన్న సందు కల్పించిన మాట నిజం మనమందరమూ కూడా సాయుధ హస్తులమై యుద్ధసన్నద్ధులం కావలె నని రాజాజీ అభిప్రాయం. కాని ఈ అభిప్రాయంతో అందఱూ ఏకీభవించక పోవచ్చును."

నిర్మాణ కార్యక్రమం కొనసాగించవలెనని ప్రభోదిస్తూ గాంధీ యింకా యిలా అన్నాడు.

"ప్రజలలో వ్యాపించిన భీతిని పోగొట్టడానికి కాంగ్రెసు ప్రచారకుల సేవ చాలా అవసరమైఉన్న ఈ తరుణంలో నేను వారిని జైలుకు వెళ్ళవలసిందని కోరను." తరువాత, అధ్యక్షుడు సర్దారు పటేలు యిలా ప్రసంగించాడు. "చాలా విషమపరిస్థితులు రానున్నవి; అప్పుడు మన బాధ్యతలింకా ఎక్కువ కాగలవు. ఆసమయంలో మనం ప్రభుత్వంపైన ఆశపెట్టుకొని లాభంలేదు. వాళ్ళ పనులలో వాళ్లు నిమగ్నులై ఉంటారు. మన కర్తవ్యమేమిటో మనంతటమనమే నిర్ణయించుకోవాలి."

ఈ ఉపన్యాసాల ధోరణి ఇంగ్లాండు దృష్టిని తక్షణం ఆకర్షించింది. కాని నిజమైన ప్రయోజనం కలగలేదు

జనవరి 9 వ తేదీని భారత రాజ్యాంగ కార్యదర్శి కామన్సు సభలో యిలా ప్రకటించాడు.

"డిశంబరు చివర వారంలో ఇండియాలోని రాజకీయ పక్షాలవారు చేసిన తీర్మానాలనూ, వాటికి సంబంధించిన వివిధ నాయకుల ప్రకటనలనూ గమనించాను. కాని రానున్న విపత్తును ఎదుర్కోవడానికి అందరూ ఐకమత్యంతో సహకారం చేయవలెనని ఇటీవల రాజప్రతినిధి చేసిన ప్రకటనకు సంతృప్తికరమైన జవాబు వాటిలో ఎక్కడా కనిపించనందుకు విచారగపడుతూన్నాను." అంటూ యింకా ఆయన యిలా అన్నాడు. "ఇండియా విషయంలో ప్రభుత్వంవారు చేసినవాగ్దానాలను చెల్లించడానికవసరమైన సమాధానమును కుదిర్చేటందుకు వారు తమ ప్రయత్నాలనూ విరమించజాలరు. వారు చేసిన వాగ్దానాలు అట్లాంటిక్ ఛార్టరుకు సంబంధించి చేయబడినవి కాకపోయినప్పటికి దాని మూలసిద్ధాంతాలకు మాత్రం అనుగుణంగానే ఉన్నవి."

జనవరి 13 వ తేదీని కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశమయి కాంగ్రెసు వ్యవహార నిర్వహణమునుగూర్చి చర్చించింది. స్వాతంత్ర్య దివసమును జరపడమునుగూర్చి, కాంగ్రెసు కమిటీలను తిరిగి కార్యాచరణకు పూనుకొనేటట్లు చేయడమునుగూర్చి, కాంగ్రెసు సభ్యులను చేర్పించడమునుగూర్చి కాంగ్రెసువాదులకు సూచనలిచ్చింది.

వ్యక్తి శాసనోల్లంఘనోద్యమమునకు సంబంధించిన భాగాలను తొలగించి స్వాతంత్ర్య ప్రమాణ పత్రమును వర్కింగుకమిటీ తగినట్లుగా మార్పుకావించింది.

మార్పు చేయబడిన స్వాతంత్ర్య ప్రమాణ పత్రం :—

ఈవిధంగా స్వాతంత్ర్య ప్రమాణపత్రం మార్పు చేయబడింది

" స్వాతంత్ర్యమును పొంది తమ కృషిఫలమును అనుభవిస్తూ, అభివృద్ధి కావడానికి కావలసిన జీవితావసరముల నన్నిటినీ సంపాదించుకొనేహక్కు అందరి ప్రజల వలెనే భారత ప్రజానీకమునకుకూడా ఉంది. దాని నెవ్వరూ కాదనజాలరు. ఏ ప్రభుత్వమైనా ప్రజలకుగల ఈ హక్కులను తీసివేసి వారిని అణగద్రొక్కే యెడల ఆ ప్రభుత్వాన్ని మార్చడానికికానీ రద్దుచేయడానికి గానీ, కూడా వారి కధికారం ఉంది. బ్రిటిషు ప్రభుత్వం ఇండియా ప్రజల స్వాతంత్ర్యమును అపహరించడమేకాక, భారతప్రజానీకమును తనస్వార్థం కోసం వినియోగించుకొని భారతదేశమును ఆర్థికంగానూ రాజకీయంగానూ

వైజ్ఞానికంగానూ ఆధ్యాత్మికంగానూ కూడా ధ్వంసం చేసింది. కాబట్టి ఇండియా బ్రిటనుతో సంబంధమును విడగొట్టుకొని పూర్ణ స్వరాజ్యమును పొందవలెనని మా నమ్మకం.

"మేము స్వాతంత్ర్యము పొందడానికి తగిన ఉత్కృష్టమైన మార్గం దౌర్జన్యం ద్వారా కాదని మాకు తెలుసు. భారతదేశం శాంతియుతమైన సక్రమ మార్గములను అవలంబించినందువననే బలిష్ఠమై ఆత్మవిశ్వాసంతో స్వరాజ్యమార్గమున చాలాదూరం అనుగమించింది. ఈ పద్ధతులను సక్రమంగా అనుసరించినందుననే మనదేశం స్వాతంత్ర్యమును పొందగలదు.

"భారత స్వాతంత్ర్య సంపాదనార్థం తిరిగి క్రొత్తగా ఈనాడు ప్రమాణం తీసుకొంటున్నాము. సంపూర్ణ స్వరాజ్యమును సాధించేటంతవరకూ ఈ పోరాటాన్ని అహింసాయుతంగా సాగించగలమని హృదయపూర్వకంగా ప్రమాణం చేస్తూన్నాము.

"సాధారణ అహింసా చర్యకుగానీ, ప్రత్యేకం అహింసాయుత ప్రత్యక్ష చర్యకు కావలసిన సన్నాహాలకుకాని, ఖాదీ, మత సామరస్యం, అస్పృశ్యతా నివారణములవంటి నిర్మాణ కార్యక్రమమును జయప్రదంగా సాగించడం అవసరం. కుల, మత భేదాలతో నిమిత్తం లేకుండా తోడి మానవులందరిలోనూ సుహృద్భావమును పెంపొందింప చేయడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నించగలం. ఇంతవరకూ నిర్లక్ష్యం చేయబడినవారిలో గల దారిద్ర్యమును అజ్ఞానమును నిర్మూలించడానికి కృషిచేస్తాం. అధోగతిలోఉండి యింకనూ అణగద్రొక్కబడుతూన్న ప్రజల క్షేమంకోసం అన్నివిధాలా పనిచేస్తాం. సామ్రాజ్య విధానాన్ని నాశనం చేయడానికి మేము కంకణం కట్టుకొన్నప్పటికీ ఉద్యోగులైనా ఉద్యోగేతరులైనా ఇంగ్లీషువారితో మాకేమీ వ్యక్తిగత పోరాటం లేదు. కులీన హిందువులకూ హరిజనులకూ ఉన్నభేదం పోవాలి. హిందువులు తమ నిత్య వ్యవహారాలలో ఈ విభేదాన్ని విస్మరించాలి. ఇట్టి వ్యత్యాసాలు అహింసా ప్రవర్తనకు ఆటంకాలు. మన మత విశ్వాసాలలో భేదాలు ఉంటే ఉండవచ్చును. కాని మన మందరమూ ఒకే జాతీయత ఒకే ఆర్థిక రాజకీయ ప్రయోజనాలుగల భారతమాత బిడ్డలంగా పరస్పరం నడుచుకోవాలి.

"భారత దేశంలోని ఏడు లక్షల గ్రామాల పునరుజ్జీవనార్థం, భారత ప్రజానీకమును పీల్చి పిప్పిచేస్తూన్న దారిద్ర్యమును నిర్మూలించేటందుకు ఏర్ప

డిన నిర్మాణ కార్యక్రమంతో రాట్నానికీ ఖాదీకీ ఎడతెగని సంబంధం ఉంది. కాబట్టి నిత్యమూ మేము నూలు వడుకుతూ మాకు కావలసినంతవరకూ ఖాదీ బట్టలనుతప్ప, వేరే బట్టలను ఉపయోగించము. సాధ్యమైనంతవరకు గ్రామంలో తయారైన వస్తువులనే ఉపయోగించగలము. ఇతరులనుకూడా అందుకు ప్రోత్సాహం చేస్తాము కాంగ్రెసు సిద్ధాంతాలనూ, కార్యక్రమాన్నీ క్రమశిక్షణతో అవలంభించగలమని భారత స్వాతంత్ర్య సంపాదనార్థం పోరాటాన్ని సాగించడానికి కాంగ్రెసు పిలవగానే సన్నద్ధులం కాగలమనీ యింపు మూలంగా ప్రమాణం చేస్తున్నాము. ”

అ. భా. కాం. సం. సమావేశంలో జరిగిన చర్చలకు సమాధానమిస్తూ, కొన్ని నినాదాలనూ మాటలనూ పట్టుకొని వేలాడడం మంచిదికాదని నెహ్రూ తీవ్రంగా విమర్శించాడు. కమ్యూనిస్టులూ, సోషలిస్టులూ గాంధేయులూకూడా ఈ దురభ్యాసానికి సమానంగానే బలి అవుతున్నారని ఆయన అభిప్రాయం. పాశ్చాత్య దేశాలలోని అనుభవాలమీద ఆధారపడిన శాస్త్రీయ సిద్ధాంతాలను ఇండియా పరిస్థితులతో నిమిత్తం లేకుండా అనువర్తింపచేయవలెనని కమ్యూనిజం కానీ సోషలిజం కానీ ఎప్పుడూ భావించి ఉండలేదు. వ్యవసాయానికి భారతదేశ భవితవ్యమును నిర్ణయించవలసింది రాజ్యాంగ పరిషత్తే. అయినప్పటికీ, ఇప్పుడే రాజ్యాంగ పరిషత్తును పిలవవలసిందని కాంగ్రెసు సోషలిస్టులు చేసిన సూచన ప్రస్తుతం సాధ్యంకాదని నెహ్రూ అభిప్రాయమిచ్చాడు.

“ నూటికి నూరువంతులు అహింసాయుతంగా ఉండవలెనని” ఒకప్రక్క అంటూ హింసపైనా అన్యాయం పైనా ఆధారపడి ఉన్న నేటి ఆర్థిక సాంఘిక నిర్మాణమును మరొకప్రక్క సహిస్తూ, ఆస్తిపరులయొక్కయు పెట్టుబడిదారుల యొక్కయు మనః ప్రవృత్తులలో మార్పుకలిగించి నూతన సమాజమును నిర్మించవలెనని తలపెట్టేవారి వైఖరి తనకర్థం కావడం లేదన్నాడు నెహ్రూ. అంతేకాదు. ఇంగ్లాండు అమెరికా దేశాలు అనుభవిస్తూన్న స్వాతంత్ర్యంలాటి స్వాతంత్ర్యమును అంగీకరించజాలమని చెప్పే రాజేంద్రప్రసాదుతోనూ ఆయన మిత్రులతోనూకూడా ఏకీభవించలేకపోయినాడాయన. ఆ స్వాతంత్ర్యం సర్వ లక్షణ సమన్వితం కాకపోవచ్చు. కాని దాని నంగీకరించి దానిలోని లోపాలను సవరించుకొని దౌర్జన్యానికీ యుద్ధాలకూ తావులేని నూతన సమాజ నిర్మాణమునకు పూనుకొంటా నన్నాడు నెహ్రూ పండితుడు.

బార్డోలీ తీర్మానమును గూర్చినవార్త అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఉన్నప్పుడే చర్చిలుకు తెలిసింది దానినిగూర్చి ఆయనను ప్రశ్నించగా ఇండియాలో ఇటీవల జరుగుతూన్న సంఘటనలను గూర్చిన వివరాలు తనకంతగా తెలియనందున ఏమీ చెప్పజాల నన్నాడు. కాని ఇదే విషయమునుగూర్చి లండను పార్లమెంటులో కూడా ప్రశ్నించబడింది. ఈ సందర్భంలో డాక్టరు సప్రూ వాషింగ్టన్‌కు పంపినవార్త తీరా తాను అమెరికాను విడిచివచ్చేటప్పుడు చేరిందనీ తానా విషయాన్ని జాగ్రత్తగానూ సమగ్రంగానూ ఆలోచించి బహిరంగంగా ప్రకటించడానికి వీలైన భాషలో ప్రత్యుత్తరం పంపగలననీ చర్చిలు అన్నాడు.

1942 జనవరి 22 వ తేదీని కామన్సుసభలో ఒక ప్రశ్నకు జవాబిస్తూ ఇండియాలోని రాజకీయ పరిస్థితినిగూర్చి తానింకా చెప్పవలసిందేమీ లేదన్నాడు. పెథిక్ లారెన్సు, 1942 జనవరి 27వ తేదీని కామన్సుసభలో ప్రసంగిస్తూ ఇండియాయొక్క క్లిష్ట రాజకీయ సమస్యను పరిష్కరించడం యుద్ధసన్నాహాలలో ప్రధానాంశమనీ, యుద్ధానంతరం ఇండియాకు నిజమైన స్వయం పరిపాలనగల అధినివేశ ప్రతిపత్తిని ప్రసాదించేటందుకు ఇంగ్లాండులోని అన్ని పక్షాలవారూ అనుకూలంగా ఉన్నట్లు ప్రధాన మంత్రి ఇండియా ప్రజలకు తెలియచేయవలసి ఉంటుందనీ అన్నాడు. చర్చిలు ప్రభుత్వంపై విశ్వాస ప్రకటన తీర్మానం చర్చ జరిగిన మొదటి రెండు రోజులలోనూ కామన్సుసభలో ఇండియా ప్రశక్తి రాక తప్పిందికాదు.

“ఇండియాయొక్క సాధన సామగ్రి యావత్తూ యుద్ధానికి ఉపయోగించుకొనే యేర్పాటు ప్రభుత్వం చేయగలదని ఆశిస్తూన్నాననీ, మన ప్రధాన మంత్రి ఇతర అధినివేశాలకు చేసిన వాగ్దానాన్ని ఇండియా ప్రజలకు కూడా చేసేయెడల ఇండియా ప్రతినిధిసైతం యుద్ధమంత్రివర్గంలో ఉండడానికి వీలవుతుందనీ నేషనల్ లిబరల్ పార్టీ సభ్యుడు ఎడ్గార్ గ్రాన్‌విల్లే అన్నాడు.

1942 ఫిబ్రవరి మూడవతేదీని ప్రభువుల సభలో మరొకతూరి ఇండియానుగూర్చి తీవ్రమైన చర్చ జరిగింది. అందులో లేబరు సభ్యుడు లార్డు ఫేరింగ్టన్ ప్రముఖ పాత్ర వహించాడు.

ప్రస్తుత కాలంలో అత్యంతావసరమయిన సమస్యను ప్రభుత్వంవారు పరిష్కరించకుండా అశ్రద్ధచేస్తున్నారనీ అంతకంతకు పరిస్థితులు దినదినమూ విషమిస్తూన్నవనీ ఆయన ఆరోపణ చేశాడు.

"భారత స్వాతంత్ర్యమునుగూర్చి, ఘనతవహించిన రాజుగారి ప్రభుత్వం ఇంకా ఎక్కువ స్పష్టంగా ప్రకటించకపోవడం దురదృష్టం. అట్లాంటిక్ ఛార్టరు ఇండియాకు వర్తించదని ప్రధానమంత్రి చేసిన ప్రకటన మూలాన ఇండియాలో దానివలన, కలుగవలసిన మంచి ఫలితం 'కాస్తా పాడయి పోయింది. ప్రస్తుత ప్రతిష్టంభనమువలన కడచిన కొన్ని మాసాలనుండీ మరీ క్లిష్టస్థితి యేర్పడింది. మలయాదేశపు ప్రజలు యుద్ధంలో యేమాత్రమూ శ్రద్ధవహించడం లేదని తెలియవస్తూన్నది. కాబట్టి ఈప్రతిష్టంభనమును పరిష్కరించేటందుకు ఆచరణయోగ్యమయిన సూచనను దేనినయినా చేయవలెనని" లార్డు ఫరింగ్టన్ అన్నాడు.

ఆయన ఇంకా యిలా అన్నాడు.

"ఎప్పుడో భవిష్యత్తులోకాక ఇప్పుడే ఇండియాకు స్వపరిపాలనము ప్రసాదిస్తున్నామని బ్రిటిష్ ప్రభుత్వంవారు స్పష్టంగా ప్రకటించవలెనని నా మొదటి సూచన. ప్రభుత్వంతో రాయబారాలు నడపదగిన భారతీయ పెద్దమనుష్యులున్నారని నానమ్మకం. కాబట్టి ప్రభుత్వం వారా పెద్దమనుష్యులతో మాట్లాడి ఇండియా కౌన్సిలులోని సభ్యులందరినీ విదేశాంగ కార్యదర్శి, దేశరక్షణ సభ్యులతోసహా, భారతీయులనే నియమించే యేర్పాటు చేయవలెను. ఆ కౌన్సిలును తాత్కాలిక భారత ప్రభుత్వంగా గుర్తించడానికికూడా బ్రిటిష్ ప్రభుత్వం ఒప్పుకోవాలి. ఆ తాత్కాలిక నూతన ప్రభుత్వానికి రాజ్యాంగ పరిషత్తునుగానీ రాజ్యాంగ నిర్మాణ సభనుగానీ ఆహ్వానించడానికి తగిన అధికారం కూడా ఉండాలి. ఈ రాజ్యాంగ పరిషత్తు చేసిన నిర్ణయాలననుసరించి, బ్రిటిష్ ప్రభుత్వం వారే ఇండియా రాజ్యాంగ చట్టమును బిల్లురూపంలో యుద్ధం ముగిసిన మూడేళ్ళలోపుగా పార్లమెంటుచే ఆమోదింపచేయగలమని ప్రకటన చేయాలి.

"భారతదేశంలోని రెండు ప్రధాన రాజకీయ పక్షాలూ ఒక సమాధానానికి వచ్చినట్లయితే దానిని తామామోదిస్తామని ప్రభుత్వం వారంటున్నారు. ఇది ఒక విధంగా అన్యాయం. ముస్లిములకు ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెబుతూన్న ముస్లిం లీగు కోరే హిరణ్యాక్ష వరాలు కాంగ్రెసెన్నటికీ ఆమోదించ జాలదు. నిజానికి ముస్లింలీగు ఇండియాలోని ముస్లిం లందరి పక్షాన మాట్లాడడం లేదు. ముస్లిం తీవ్రవాదుల వలలోపడి ఇండియా రాజ్యాంగ పరిష్కారముకు అడ్డు తగులరాదని బ్రిటిష్ ప్రజలు గ్రహించడం అవసరం. ముస్లింలీగు ఇండియాలోని అధిక సంఖ్యాక ముస్లింలకు కూడా ప్రాతినిధ్యం వహించడంలేదు. ఇండియాను రెండుగా చీల్చడానికి ముస్లింలీగు వేసిన పథకం ఆచరణయోగ్యం కాకపోగా అభివృద్ధి నిరోధకం కూడా." ఇవి లార్డు ఫరింగ్టన్ చెప్పిన విషయాలు.

లార్డు హేయిలీ ఇలా అన్నాడు :

“ చిన్న చిన్న మర్యాదలకోసం కాలయాపనచేసే సమయం కాదిది. సిరియా విషయంలో ప్రకటనలు చేయడానికి చూపిన ధైర్యం ఇండియా విషయంలోకూడా చూపాలి. యుద్ధ సమయమున రాజ్యాంగ చట్టములో మార్పులు చేయడానికి వీలు లేదంటారు. భారత రాజ్యాంగ చరిత్రలో చిరస్మరణీయంగా ఉందతగిన ప్రకటన 1917 లో యుద్ధం జరుగుతూండగానే చేయబడింది. యుద్ధం అత్యంత క్లిష్ట పరిస్థితిలో ఉండగా మాంటేంగుషేమ్సుఫర్డు నివేదిక సంతకం చేయబడింది. మనకొక స్పష్టమైన ఆదర్శం లేకుండా ఈ ప్రతిష్టంభనమును పరిష్కరించడం కష్టసాధ్యం. 1935 నాటి ఇండియాచట్టం విషయంలో బ్రిటిష్‌వారు చాలా జాగ్రత్తగానూ దీర్ఘంగానూ ఆలోచించారు. అంత ఆలోచన యే యితర అధినివేశ రాజ్యాంగ విషయంలో కానీ సామ్రాజ్యచట్టం విషయంలో కానీ చేయలేదు. నాటి చట్టం సంయుక్త భారతదేశపు సమాఖ్యకు (Federation of an United India) సంబంధించింది.

“ భారత సంస్థానాలకు ఇండియాలో ఎటువంటి స్థానం కల్పించ బడాలి? ముస్లిములు కోరుతున్నారు కనుక సంయుక్త భారతదేశాన్ని విచ్ఛిన్నం చేయవలసిందేనా? ఇండియాలోని రెండు పక్షాలవారూ ఫలానా తేదీనాటికి సమాధానం కుదుర్చుకోవాలనిగానీ, ఫలానావిధంగా సమాధాన పడవలెననిగానీ ప్రభుత్వం వారొక ప్రకటనచేస్తే దానివలన ప్రయోజన ముంటుంది.

“ యుద్ధ సన్నాహాలకు ఎక్కువభంగం కలుగకుండా ఉండవలెనంటే యేదో ఒక విధంగా సమాధానం కుదుర్చుకొని రాజకీయ విభేదాలను తొలగించుకోవడం అత్యవసరం. కేంద్రశాసనసభకు రాష్ట్రాలను నియోజకవర్గాలుగా యేర్పాటుచేసి పునర్నిర్మాణం చేయడం సాధ్యం కాదా?” అన్నాడు లార్డు హేయిలీ.

లార్డు కెట్టో ఇలా అన్నాడు :

“ చాలామంది భారతీయ నాయకులింకా ఈ యుద్ధం తమ దనుకోవడంలేదు. తమతోడి దేశీయులను వారు హెచ్చరిస్తేనే గాని యుద్ధం వలన కలిగే అపాయములను గూర్చి వారు తెలుసుకోలేరు. అప్పుడుగాని యుద్ధసన్నాహాలకు కావలసినంత ఎక్కువ సహాయం లభించదు. రాజకీయ సమస్య పరిష్కారమై అధినివేశ ప్రతిపత్తినిగూర్చిన వాగ్దానం పరిపూర్తియైతేనేగాని భారతీయ ప్రజలలో ఈ అశ్రద్ధ పోదు.”

అమెరికి సహాయ కార్యదర్శిగా పనిచేస్తూన్న డ్యూక్ ఆఫ్ డెవన్ షైరు ప్రభువుల సభలోచేసిన ప్రసంగమునుబట్టి, సామ్రాజ్యం అత్యంత విపద్దశలో ఉన్నప్పు

టికే ఇండియా యెడల బ్రిటిష్ వారవలంబిస్తూన్న వైఖరిలో యేమీ మార్పు రాలేదని స్పష్ట పడింది.

డ్యూక్ చేసిన ప్రసంగం ఇండియా ప్రజలకు చాలా కోపకారణమయింది. అందులో కాంగ్రెసు పలుకుబడిని తగ్గిస్తూ ముస్లింలీగును శ్లాఘిస్తూ ఉపన్యసించాడు. ఆయిన మాట్లాడిన మాటలివి :— "కాంగ్రెసు పక్షంయొక్క బలం తగ్గుతూన్నకొద్దీ ముస్లిం లీగుయొక్క బలమూ పలుకుబడీ నానాటికి హెచ్చుతూన్నవి. కాంగ్రెసు పక్షంవారు తమకున్న హక్కులనుగూర్చి ముస్లిం మహాజనులు కాదంటారు. కాంగ్రెసు కోరే కోరికలను వారెన్నడూ ఒప్పుకోరు." అన్నాడు.

సాంఘిక విభేదములను గోరంతలు కొండంతలుచేసి మాట్లాడుతూ 1940 ఆగస్టు ప్రకటనను ఆమోదించినందున అవి అంతరించగల వన్నాడు డ్యూక్ ఆఫ్ డివెన్‌షైరు. భారతీయ ప్రభుత్వం కానీ ప్రభుత్వాలుకానీ నిర్మింపబడవలెనని ఒక సూచన చేశాడు. ఇంగ్లాండులోని ఇండియా కార్యాలయం వారు భారతదేశాన్ని పరిపాలించడంలేదనీ ఉద్యోగాలలో యూరోపియనులు చాలామంది తగ్గింపబడిరనీ సందర్భవశాత్తూ చెప్పినట్లు చెప్పాడాయన. కాని "ఏదో ఒక విధంగా సమాధానం కుదరకుండా ఇండియా ప్రభుత్వ యాజమాన్యమును భారతీయులకు విడిచిపెట్టడం దేశాన్ని అల్లకల్లోలంలో ముంచడం" అన్నాడు.

భారత యుద్ధసన్నాహాల విషయంలో డ్యూకు కేమీ చీమ కుట్టినట్లు లేదు. రాజకీయాందోళన సాగుతూన్నప్పటికీ యుద్ధప్రయత్నాలు నడుస్తూనే వుంటవని ఆయన ధైర్యం. పార్లమెంటు చర్చలలో కొన్ని ఉపన్యాసాలు చాలా అర్థవంతంగా ఉన్నమాట వాస్తవమే. కాని భారత జాతీయ మహాసభవారు చేసిన బార్డోలీ తీర్మానానికి డ్యూక్ ఉపన్యాసమును ప్రత్యుత్తరంగా గ్రహించ వచ్చును.

ప్రభువుల సభలో జరిగిన చర్చానంతరం, యుద్ధసన్నాహాలకు బ్రిటిష్ సామ్రాజ్యం చేసిన సహాయాన్నిగూర్చి ఫిబ్రవరి 4 వ తేదీని లీడ్సులో సింహావలోకనం చేస్తూ మిస్టర్ యల్. యస్. అమెరి తన మామూలు ధోరణిలో రాష్ట్రీయ స్వాతంత్ర్యమును శ్లాఘించి యింకా యిలా మాట్లాడాడు.

" ఇతర అధినివేశాలు మాతోకలిసి యేవిధంగా సమాన స్వేచ్ఛా స్వాతంత్ర్యములను అనుభవిస్తున్నవో అటువంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యములనే యుద్ధానంతరం వీలైనంత తొందరలో ఇండియాకూడా అనుభవించేటందుకు సహాయపడగలమని వాగ్దానం చేస్తున్నాము. ఇతర దేశాలలోవలెనే ఇండియాలోకూడా రాజ్యాంగ నిర్మా

ణమునకు ఆంతరంగిక సమైక్యత అవసరం. ఆ పునాదిపైననే స్వపరిపాలన నిలబడగ తుంది. కాబట్టి ఇండియా రాజ్యాంగంతో సన్నిహిత సంబంధంకల అందరి ప్రజలకూ స్వేచ్ఛాపూర్వకమైన ఒడంబడిక కుదరాలి. అనగా ఇండియాకు స్వాతంత్ర్యమును లభింపచేయగలవారు ఇండియా ప్రజలేనని పర్యవసానం, ఇండియాలోని వివిధ వర్గాల వారికీ సమాధానం కుదరని పక్షంలో యేదో ఒక రాజ్యాంగ చట్టాన్ని ఏంకేగా ప్రజలపైన బలవంతంగా రుద్దజాలం. వీరోపాఖండానికి ఒక రాజ్యాంగ చట్టాన్ని బల వంతంగా ప్రవేశపెట్టడం ఎంతకష్టమో ఇండియా విషయంలో కూడా అంతేకష్టం.

"మేము ఇండియాకు స్వాతంత్ర్యమును ఈయడానికి వాగ్దానం చేశాము. ఇండియా ప్రజలు ఐకమత్యంగా ఉండవలెనని మా కోరిక. ఈ రెండింటికీ మేమిదివరకే పునాదులు వేశాము." ఈ మాటలతో "చీలదీసి పాలించడం" బ్రిటిష్ రాజనీతిఅని మన మారోపిస్తూన్న నేరంనుండి అమెరీ విదుదల కావలెనని వాంఛించాడు. సాంఘిక విభేదాల వలననే ఇండియా స్వాతంత్ర్యానికీ ఐక్యతకూ అడ్డుకలుగుతూన్నదని ఇది వరకంటూన్న మాటలనే మఱొకసారి చెప్పి తక్షణం రాజ్యాంగ నిర్మాణంలో మార్పులు చేయుడానికి వీలులేదని వాదించాడు. భారత రాజ్యాంగ కార్యసరళి, అదృష్ట వశాత్తూ కానీ దురదృష్టవశాత్తూ కానీ బ్రిటనుపైన ఇటువంటి నేరారోపణ చేస్తూ న్నది. ఇండియా ఒక్కటేకాదు, ఐర్లండు అధినివేశ ప్రతిపత్తిని పొంది కొన్ని సంవత్స రాలు కడచినప్పటికీ యింకా ఇండియాకు తోడు-గానే ఉంది ఆవేళం.

చీలికలు లేనిచోట్ల చీలికలను చూడగల బ్రిటిష్ రాజనీతినిగూర్చి ఇ విల డీవెలరా ప్రపంచానికి చెప్పి ఉన్నాడు. అమెరికాలోని ఉత్తర రాజ్యాలకూ దక్షిణ రాజ్యాలకూ బానిస వ్యాపారమునుగూర్చి 1860-65 ల మధ్య అంతఃకలహం వచ్చి నప్పుడు బానిస వ్యాపారమును కొనసాగించవలెనని పోరాడే దక్షిణ రాజ్యాలను బ్రిటనున్నూ, గ్లాడ్ స్టన్ నున్నూ ప్రోత్సహించడం సాగించారు. అమెరికాలో ఉత్తర రాజ్యాలకూ దక్షిణ రాజ్యాలకూ, ఐర్లాండులో అల్స్టరుకూ తక్కిన దేశానికీ పరస్పర విరోధ భావాలున్నట్లు బ్రిటిష్‌వారు ప్రవర్తించారు. "ఇండియాలో ఒక సంఘానికి మఱొక సంఘానికీ, సంస్థానాధిపతులకు తక్కిన దేశానికీ పడదట. యుద్ధానంతరం బర్మా ప్రజలకు అధినివేశ ప్రతిపత్తి ఈయవలెనంటే బర్మాలోనున్న కారేనులు, కాచినులు, చినులు వీరంతా వ్యతిరేకంగా ఉన్నారట." అమెరీ అంటాడు. కెనడి యన్ పత్రికా విలేఖకుడు డేవిడ్ మార్టిన్‌తో సంభాషిస్తూ అమెరీ యిలా అన్నాడు. "బర్మా విషయంలో కేవలం అంతర్జాతీయ పరివర్తనాలను గమనించినంత మాత్రాన చాలదు, ఆంతరంగిక వ్యవహారాలనుకూడా పరిశీలించవలసి ఉంది. కేంద్ర బర్మా

ప్రభుత్వానికి లోబడి ఉండేటందుకు 'షార్' నాయకులు రౌండుటేబిలు మహాసభలో ప్రతికూలభావాన్ని వెల్లడించారు" అన్నాడు. నూరు సంవత్సరాల కిందట కెనడా విషయంలోకూడా యిలాగే వాదించబడింది. డర్హాం ప్రభువు కెనడాను దర్శించి దానికొక రాజ్యాంగ శాసనమును సిఫారసు చేసిన పాపాన ఆయన 'లండన్ టైమ్స్' పత్రికచే దేశద్రోహిగా చిత్రించబడ్డాడు. ఫ్రెంచివారికీ ఇంగ్లీషువారికీ నివాసస్థానమైన కెనడాలోకాని బానిసల వ్యాపారంచేసే అమెరికా రాజ్యాలలో గాని, క్యాథలిక్కులు ప్రొటెస్టెంట్లూఉన్న ఐర్లండులోకాని, యూదులూ అరబ్బులూ కల పాలస్తానంలోకాని, ముస్లింలూ హిందువులూకల ఇండియాలోకాని, బర్మీనూ షానులూకల బర్మాలోకాని, బ్రిటను ఒక్కటే రాజనీతిని అవలంబిస్తూన్నది. పూర్వ కాలంలో 'బూర్ బానుల' వలెనే బ్రిటను కొత్తగా నేర్చుకోగలిగినదీలేదు. పాతది మఱచి పోగలిగినదీలేదు. లార్డునార్డు మొదలుకొని విన్స్టన్ చర్చిలు వంటిగల రాజకీయ దురంధరులుచేసే తప్పిదాల ఫలితం బ్రిటను పూర్తిగా అనుభవించి తీరాలి.

భారతీయ నాట్యకళలో ఒక విశిష్టత ఉంది. కథాగమనంలో ప్రేక్షకులకు విసుగుపుట్టకుండా ఉండేటందుకు మధ్య మధ్య హాస్యం ఉంటూంటుంది. తరువాత వచ్చే కథలోని అంతరార్థమును బాగా గ్రహించేటందుకే వీలుగా ఈ హాస్యం ప్రేక్షకుల మనస్సులకు నూతనోత్సాహం కలిగిస్తుంది. అదే విధంగా మహాసంగ్రామంవంటి విషాదపూరిత నాటకంలోనూ, అంతకంటెనూ విషాదభూయిష్టమైన భారతస్వాతంత్ర్యం పోరాటనాటకంలోనూ మధ్య మధ్య అమెరీ అనే విదూషకుడు ప్రత్యక్షమై సోరెక్ సేక్ లు, 'సిల్వరుమక్ లు' వేసే మామూలు ప్రశ్నలకు మామూలు సమాధానాలుచెప్పి రంగస్థలమునుండి విరమిస్తుండేవాడు. ఆ సమయంలోనే బ్రిటిష్ ప్రధానమంత్రి, బీవరు బ్రూకు, గ్రీన్ ఉడ్, కింగ్స్లీఉడ్ లాటి వారిని తన మంత్రివర్గమునుంచి సాగనంపి క్రిప్సు లాంటివాళ్ళను నియమించుకొన్నాడు. కాని అమెరీ మాత్రం మాలాగే ఉన్నాడు. కామన్సుసభలో అభ్యుదయ పంథాను అవలంబించే సభ్యులకు తెలిసిన భోగట్టాకూడా తనకు తెలియదని చెప్పినందున ఫిబ్రవరి 19 వ తేదీని అమెరీపైన ప్రశ్నపరంపరలు కురిపింపబడినవి. అప్పుడాయన "భారత రాజకీయ పరిస్థితినిగూర్చి తాను కొత్తగా యేమీ ప్రకటన చేయగల స్థితిలో లేననీ, ఆ విషయంలో తాను పూర్వం కంటె ఎక్కువ సంతృప్తికరమైన సంజాయిషీ ఈయజాలననీ" అన్నాడు. భారతీయ ప్రజకు స్వాతంత్ర్యమిచ్చి వారి స్వతంత్ర దేశంకొఱకు పోరాడేటందుకు భారతప్రజాసామాన్యముయొక్క సహకారమును పొందరాదా అని సిల్వర్ మన్ సూటిగా ప్రశ్నించినప్పుడు అమెరీ బెల్లం కొట్టిన రాయిలాగా నోరు మెదల్చకుండా ఊరుకొన్నాడు.

ఫిబ్రవరి 20 వ తేదీని బ్రిటిష్ మంత్రివర్గంలోని మార్పులు ప్రకటింపబడినవి. కాని అమెరీ అనే విదూషకుడు మాత్రం కొండవలె కదలకుండా ఎప్పటిపాటే పాడుతూ మునుపటి చోటనే ఉన్నాడు. ఇందువల్ల ఇండియాలో కలిగిన అశాభంగానికి మేర లేదు. బ్రిటనులో ప్రదర్శింపబడుతూన్న ఉద్రేకం కాని అమెరికాలో చేయబడు తూన్న విమర్శలుకాని ఈ 'కుంభకర్ణుణ్ని' నిద్ర మేల్కొల్పలేకపోయినవి. గాంధీ - చియాంగ్ కై షేకులు కలకత్తాలో సంభాషించుకొన్న విషయం న్యూయార్కువారి దృష్టినాకర్షించింది. భారత జాతీయవాదులు సమయంకోసం వేచిఉన్నారని వ్రాసింది. "న్యూయార్కు టైమ్సు" పత్రిక "ఇండియాకు చైతన్యం వచ్చేసమయం ఆసన్న మయిందా? ఆసంగతి మాకు తెలియదు. కాని, యికె ఇండియా చైనాదేశాలు తెల్లవాని గుమ్మం దగ్గర యాచకదేశాలుగా మాత్రం ఉండవు" అని జోస్యం చెప్పిందాపత్రిక.

1942 ఫిబ్రవరి 9 వ తేదీని చాలా దూరపు ఫలితాలతో కూడుకొని ఉన్న అంతర్జాతీయ ప్రాముఖ్యం గల ఒకానొక సంఘటనం జరిగింది. చైనా సర్వసైన్యాధి పతి మార్షల్ చియాంగ్ కై షేకున్నూ ఆయన సతీమణినీ ఆయన సిబ్బందిలోని ప్రధా నోద్యోగులనూ రాజప్రతినిధికి అతిథులుగా ఉండేటందుకు భారతదేశం ఆహ్వానించింది. ఆ సందర్భంలో భారతప్రభుత్వం ఇలా ప్రకటించింది. "ఇండియా చైనా దేశాలకు సంబంధించిన విషయాలను ఇండియా ప్రభుత్వంతోనూ ముఖ్యంగా భారత సర్వసై న్యాధిపతితోనూ సంప్రతించేటందుకు చైనా సర్వసేనాని ఇండియాకు దయచేశాడు. ఆయన ఇండియాలో ఉన్నకాలంలో భారత ప్రజా జీవితంలో ప్రముఖులైనవారిని కలుసుకొవలెనని కోరుతూన్నారు. చైనా రిపబ్లికుయొక్క మొఖ్యాగ్రేసరుని ఆహ్వానిం చడంలో భారతప్రజానీకం పాల్గొంటుందని ఇండియా ప్రభుత్వంవారు గట్టిగా విశ్వ సిస్తున్నారు."

ఆధునిక చైనాను ఉద్ధరించిన మార్షలును ఆహ్వానిస్తూ ఇండియాలోని వివిధ ప్రాంతములనుండీ సందేశాలు పంపబడినవి. అనుకోకుండా జరిగిన ఈ మహత్తర సంఘటనమునకు బ్రిటను అమెరికాదేశాలలోని పత్రికలు తమ సంతోషాన్ని వెల్లడించినవి. జవహరలాలు నెహ్రూ ఆయనను అనేకసార్లు దర్శించాడు. మొదట ఒంటరి గానూ, తరువాత కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా ఆజాదుతో కలసి, మూడోపర్యా యం తన సోదరి, కుమార్తెలతోనూ దర్శించాడు. చైనా సర్వసేనాని గాంధీజీని కూడా కలుసుకొంటాడని అనుకొన్నారు. కాని అలా జరుగలేదు.

చియాంగ్ కై షేకు దంపతుల గౌరవార్థం రాజప్రతినిధి తన మందిరంలో ఒక విందుచేసి యిలా ప్రసంగించాడు.

"కాన్ ఫ్యూషియస్ వంటి మహామేధావియైన తత్త్వవేత్త" ఒకే భావాలుగలవారు దూర ప్రదేశాలనుండి వచ్చి సమావేశం కావడం ఆనందదాయకంగా ఉండదా అని ప్రశ్నించాడు. భావి సంతానం కోసం వ్రాసిన ఈ వ్రాతలోని యథార్థ భావాన్ని ఈనాడు చైనాదేశమురొయొక్క ఇరువుర ప్రముఖ నాయకులనూ వారి ప్రధాన సహచరులనూ ఆహ్వానించే భాగ్యం కలిగిన మనకంటె ఎవ్వరు ఎక్కువగా గ్రహించి ఉంటారు ?

చైనాదేశపు కడచిన పది సంవత్సరాల చరిత్రా, ఈనాడు మనం అతిథులుగా గౌరవిస్తూన్న వీరిపేర్లతోనే సమ్మిళితమై ఉంది. ధైర్యసాహసములతో కూడినవారి శౌర్యమూ, దృఢనిశ్చయమూ, ఐక్యసంఘటనము ఇవన్నీ నేటి చైనా స్వాతంత్ర్య పతాకగా రచించబడి విశ్వమానవ ప్రపంచంలో వెలుగొందుతూన్నవి.

"ఇప్పుడా పూర్వచరిత్రను మీకు నేను జ్ఞాపకం చేయనవసరంలేదు కడచిన ఐదేళ్ళనుండీ చైనా పరిస్థితి మహాగడ్డుగా ఉంది. ఈ సమయాన జపాను దండయాత్రలను అమోఘంగా ఎదుర్కోవడంలో స్వతంత్ర చైనాదేశం చూపుతూన్న శౌర్యం ఈ దంపతులలో కేంద్రీకృతమై మూర్తీభవించి ఉంది. బ్రిటిష్ సామ్రాజ్యానికి తటస్థించిన ఒకానొక క్లిష్టసమయంలో అవసరమైతే సంవత్సరాల తరబడి ఒంటరిగానైనా పోరాడ నిశ్చయించుకొన్నామని బ్రిటిష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిలు గర్జించాడు. ఈ మాటల లోని యదార్థాన్ని గ్రహించగల గౌరవం ఒక్క చైనాకే ఉంది. సర్వసన్నద్ధమూ శక్తివంతమూ అయిన శత్రుదేశాన్ని ఏకాకిగా ఎదుర్కొని స్వాతంత్ర్య జ్యోతిని ప్రజ్వలితం చేయగలిగింది చైనా. ఆ వీరోచిత పోరాటంలో, పూజ్యులైన మన అతిథులు ఆదినుండి అంతంవరకూ అత్యంత భారాన్ని వహించారు.

"ఇప్పటికీ ఆ భారం ఇంకా తేలికకాలేదు. కాని దైవానుగ్రహంవలన వారుగానీ మనంగానీ ఒంటరిగా లేము. నేడు మనం మిత్రులంగా కలుసుకొని మన బలాలనూ సాధన సామగ్రినీ సమిష్టిగా వినియోగించుకొంటున్నాము. నూతన విశ్వాసంతోనూ దృఢ నిశ్చయంతోనూ భవిష్యత్తును ఎదుర్కొగల స్థితిలో ఉన్నాము. ఘనత వహించిన ఈ చీనా సర్వసేనాని కొలది వారాల కిందటనే చైనా రంగంలో పనిచేసే మిత్రమండలి సైన్యాలన్నింటికీ ఇండో-చైనా థాయిలాండు సైన్యాలతోసహా సర్వ సైన్యాధిపతిగా నియమితుడయినాడు. ఈ సర్వసైన్యాధిపత్యమును స్వీకరించిన పిమ్మట ఈ దంపతులు చేసిన మొదటిపని మన దేశానికి రావడమే. అందుకు మనం చాలా గర్వించవలసి ఉంది. వారు దయాపూర్వకంగానూ ధైర్యయుతంగానూ చూపిన ఈ సుహృద్భావంవలన మన రెండు దేశాలమధ్యను ప్రకృతి నిర్మించిన అడంకులు శీఘ్రంగా

తొలగిపోయి ఇండియా చైనా లెంత సన్నిహితంగా ఉన్నవో ఈ ఉభయ దేశాలు నాగరికతలకు పరస్పర సంబంధం ఎంత ఉందో కూడా మరింత విస్పష్టంగా తెలియగలదు. ఈ ఉభయ దేశాలలోనూ దయా సంస్కృతీ ఆదర్శాలుగా వెలుగొందుతూన్నవి. ఉభయ దేశాలలో స్వాతంత్ర్యజ్యోతి ప్రజ్వరిల్లుతూన్నది. పరదేశీయుల భయంకర దండయాత్రలను ఎదుర్కొని సజీవంగా ఉండేటందుకూ స్వార్థరహితమైన ఆదర్శం కోసం సమిష్టిగా పనిచేసేటందుకూ త్యాగమూర్తులూ శౌర్యవంతులూ అయిన స్త్రీ పురుషులు నిర్వర్తించలేని మహత్కార్యం లేదని చైనానుచూచి మనం గ్రహించ వచ్చును.

"మాడం చియాంగ్ కై షేక చైనాదేశమునకేగాక యితర ప్రపంచానికి కూడా ముఖ్యంగా ఇండియాకు ఉత్తేజం కలిగించగలిగినవ్యక్తి. యుద్ధంలో గాయ పడినవారికి ఉపచారం చేయడంలోనూ, కాందిశీకుల బిడ్డలకు శరణాలయములను నిర్మించడంలోనూ యుద్ధంలో మరణించిన తల్లిదండ్రులుగల బిడ్డలకు వసతులు కల్పించ డంలోనూ ఆమె చేసిన నిరంతర కృషినిగూర్చి మనం వినియే యున్నాము. ఆమె భర్తతోసహా తఱచుగా యుద్ధరంగంలోకిపోయి అక్కడి అపాయముల నెదుర్కొ వడం కూడా మనకు తెలుసు. ఆమెకూడా తన భర్తతో కలిసి ఉభయదేశాల సుహృ ద్భావమును పెంపొందించడానికి రావడం మన అదృష్టం ఈరాత్రి ఆమె మన సమా వేశంలో పాల్గొన్నందుకు మనం చాలా గర్వపడాలి.

మన కోటకు తూర్పుభాగాన శత్రు సైన్యాలు దాడి వెడలేటందుకు సిద్ధంగా ఉన్నప్పుడు ఏవిధమైన సందేహాలుగానీ సంకోచంగానీ లేకుండా బర్మారంగంలో చైనా సైన్యాలు మన పక్షాన ఎలా నిలబడ్డవో మనం విని ఉన్నాము. అది మన మిత్రుడూ సోదరుడూ మనయెడల నిర్వర్తించిన మహత్కార్యం ఆయన ఇక్కడనే ఉన్నాడు. యుద్ధ సత్కారములను పొందిన ఆమహాయోధులు చాంగ్లా, షైరుష్వాంగులుకూడా యిక్కడనే ఉన్నారు. కాబట్టి మనం కష్టసుఖాలన్నిటిలోనూ చైనాతో సమాన భాగస్వాములంగా ఉంటూ ఈ యుద్ధంలో విజయం పొందేటంతవరకూ పోరాడగల మని సగర్వంగా విశ్వాసపూరిత హృదయాలతో ఉండాలి. జాన్ బనియన్ వ్రాసిన యాత్రికునివలె మనం ధైర్యంగా ముందుకు పోవాలి. అంతే!

ఆశియా ఖండంలోనూ యూరపులోనూ తదితర సముద్రాంతర దేశాలలోనూ గల మన శత్రువులందఱూ పరాజయం పొందేటంతవరకు మనం చైనాతోనూ తదితర మహత్తర మిత్రదేశాలతోనూ జైత్రయాత్ర కొనసాగించవలసిందే. దౌష్ట్యమూ- దౌర్జన్యమూ నిర్మూలింపబడి మన పతాకం స్వేచ్ఛగా స్వతంత్రాకాశంలో ఎగిరేటంత

వరకూ మన పట్టుదలను విడువరాదు. చైనా స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపుతూన్న ఈ మహానాయకులు మనతో కలసి ఉన్న ఈనాటి రాత్రికంటె రానున్న విజయ ప్రభాతమునకు ఆనందదాయకమైన శుభసూచకము మఱొకటిలేదు.

సోదరీ సోదరులారా; ఘనతవహించిన ఈ దంపతులు నిరంతరారోగ్యవంతులుగా నుందురుగాక!

## మార్షల్ చియాంగు ప్రత్యుత్తరం:

"ఘనతవహించిన రాజప్రతినిధి దంపతులారా! సోదరీ సోదరులారా!

ఘనతవహించిన రాజప్రతినిధి మాకు అపూర్వ గౌరవం చేసినందుకు మేము చాలా కృతజ్ఞులం, మా మహత్కార్యములను పేర్కొని మీరు మమ్ములను శ్లాఘించడంలో యెంతో ఔదార్యం చూపినారు. కడచిన ఐదు అతిక్లిష్ట సంవత్సరాలలో మేము కావించిన సేవను మీరు చాలా కొనియాడినారు. కాని మేము చేయవలెనను కొన్నంత సేవను చేయలేకపోయినాము. ప్రజాస్వామ్య సంస్థాపనకోసం, తమ ఆదర్శాల కనుగుణంగా చైనాలోని సంయుక్త ప్రజానీకమే యుద్ధకష్టాల నన్నిటిని భరించింది. చైనా నేలపై జపానువారు దండయాత్ర సాగించిన నాటినుండీ చైనా ప్రజల తత్వజ్ఞానం, దేశభక్తి, స్వార్థత్యాగం, ధైర్యం, సహనం, ఔదార్యం — ఇవన్నీ ఎంతో ఉన్నతస్థాయిలో నడవసాగినవి. వారందటికీ ఒక్కటే ఆదర్శం. చైనా ప్రజానీకం భరించిన కష్టనష్టాల ఫలితంగా స్త్రీ పురుషులు శాంతి సంతోషములతో జీవించ గలిగిన నూతన ప్రపంచం స్థాపింపబడవలయుననియే వారి ఆశయం.

"పసిఫిక్కు మహాసముద్రంలో యుద్ధం ప్రారంభమైన నాటినుండీ చైనా ఇండియా సన్నిహితత్వం యింకా ఎక్కువయింది. యుద్ధం జరుగుతూన్న ఈ క్లిష్టసమయంలోనే ఇండియాను దర్శించడానికి తటస్థించిన ప్రథమావకాశాన్ని నేను వినియోగించుకొని; మన ఉభయుల క్షేమంకోసం ఇండియా ప్రదర్శించగల శక్తిసామర్థ్యాలను ఎక్కువగా అవగాహన చేసుకోవలెననుకున్నాను. నేను వచ్చిన కొలదికాలంలోనే నాకు చాలా సంగతులు తెలిసినవి. అందుకు సంతోషం. "వినడంకంటె కనడం నూరురెట్లు సంతృప్తికరంగా ఉంటుందని" చైనాభాషలో ఒక సామెత ఉంది. ఇండియా యొక్క ఘనత నన్ను చాలా ఆకర్షిస్తూన్నది.

"ఘనతవహించిన రాజప్రతినిధీ! మిమ్ములను కలసి స్వయంగా పరిచయం చేసుకొన్నందుకు మాకు చాలా సంతోషంగాఉంది. ఇండియా వ్యవహారాలన్నీ మీకు సమగ్రంగా తెలుసు. మీ రాజకీయ పరిజ్ఞానం పరిపూర్ణం. మీ బుద్ధికుశలతనుండి నేనెన్ని

విషయాలైనా గ్రహించవచ్చు ననిపిస్తూన్నది. ఘనతవహించిన లిన్ లిత్ గో ప్రభ్వీ! మేమిదేశం రాకమునుపే మీ సంఘసేవా పరాయణత్వమును గూర్చి మాకు తెలుసు, మేము మీకు మా హృదయపూర్వక గౌరవాభినందనములను సమర్పించుకొంటున్నాము "ఇంగ్లాండు ప్రధానమంత్రి చర్చిలును గూర్చి మీరు మాట్లాడినారు. ఆయన ఉద్యోగం స్వీకరించిన నాటినుండీ, మా రెండు దేశాల మధ్యనూగల దూరమును బట్టి మాకు వీలున్నంతవరకు మేమిరువురమూ సన్నిహిత సంబంధం యేర్పాటుచేసుకొని ఉన్నాము. ఆయనలో మంచి ఉత్సాహోద్రేకాలు పొంగిపొరలెత్తుతూన్నవి.

"బర్మాలో చైనా సేనలు ఉండడాన్నిగూర్చి తాము కొంత ముచ్చటించారు. చుంకింగులో జనరల్ సర్ ఆర్చిబాల్డు వేవెలును కలుసుకొన్నప్పుడు, విదేశ దండ యాత్రలను సమిష్టిగా నిరోధించేటందుకు చైనాయొక్క సహాయ సహకారములను లెక్కలోకి తీసుకోవచ్చునని నేనాయనకు హామీయిచ్చాను. ఈ వాగ్దానమును చెల్లించు కొనే విషయంలో నేను శక్తివంచనలేకుండా పనిచేశాను. ఇది నేనొక ఘనకార్యంగా చెప్పడంలేదు. ఒక మిత్రదేశం మఱొక మిత్రదేశమునెడల నిర్వర్తింపవలసిన కర్తవ్యమిది.

"సోదరీ సోదరులారా! ఘనతవహించిన రాజప్రతినిధి దంపతులు చిరాయు రారోగ్యవంతులుగా నుండవలెనని నేనిప్పుడు ప్రతిపాదిస్తున్నాను."

1942 ఫిబ్రవరి 19 వ తేదీని మార్షల్ చియాంగ్-కై-షేకు దంపతులిరువురకూ శాంతినికేతనంలో హృదయపూర్వకమైన సన్మానం జరిగింది.

రథీంద్రనాథ టాగూరు సన్మానపత్రం చదివాడు. అందుకు ప్రత్యుత్తరంగా చైనా సర్వసేనాని యిలా మాట్లాడాడు :

"ఈ అంతర్జాతీయ విద్యాపీఠంగల ఈ స్థలంలో మేముభయులమూ మహాకవి సొంత భవనాన్ని దర్శించగలిగినందులకు నాకు చాలా ఆనందంగా ఉంది. మీరు మాకీ సన్మానపత్రమును సమర్పించినందుకు మిక్కిలి కృతజ్ఞులం. మహాకవిని మేము ప్రత్యక్షంగా చూడలేదు. కాని ఆయన స్థాపించిన ఈ సంస్థలో ఆయన ఆత్మను మేము చూడగలుగుతున్నాము.

"మీ గురుదేవులు నిర్వర్తించనున్న మహత్కార్యమునకు పునాది యిదివరకే వేయబడింది. ఇక్కడ సమావేశమయిన అధ్యాపకులూ విద్యార్థులూకూడా ఆ సంప్రదాయములను పోకుండా కాపాడవలెనని ఆశిస్తున్నాము. మాలో విశ్వమానవ సౌభ్రాతృత్వమును పెంపొందించి చైనా కీర్తిని దిగంతములకు వ్యాపింపచేసిన

సఙ్ యట్ సేను వలెనే, మీ గురుదేవులు కూడా మీ దేశముయొక్క ఆత్మోన్నతికి తోడ్పడి మీకు నూతన చైతన్యమును కల్గించారు.

“నేను చైనానుండి మీకేమీ బహుమతులు తీసుకొనిరాలేదు. మా ప్రజల సుహృద్భావములను, నా అనురాగమును మాత్రమే నేను మీకు సమర్పించగలను. మీ దేశముయొక్క మహానాయకుడు మీ చేతులలో పెట్టిపోయిన ఈ నిక్షేపాన్ని మీ మహత్తరకృషితో అభ్యున్నతికి తీసుకొనివత్తురు గాక!.”

జనరలిస్మో చియాంగ్ కై షేకు ఆయన సిబ్బందితో కలసి పండిత జవహరలాలు నెహ్రూ ప్రత్యేకపు రైలుబండిలో కలకత్తానుండి శాంతినికేతనమునకు చేరుకొన్నారు.

బోల్పూరు స్టేషనులో చియాంగు దంపతులను రవీంద్రనాథ టాగూరు కోడలు ప్రతిమా టాగోరు, విశ్వభారతి ప్రధానాధ్యాపకులు క్షితిమోహనసేన్, కార్యదర్శి అనిలచంద్రుడు ఎదుర్కొని ఆహ్వానించారు. వారంతా తిన్నగా ఉత్తరాయణానికి చేరగానే రథీంద్రనాథ టాగూరు, వారికి అర్ఘ్యపాద్యములు సమర్పించి లోనికి గొని పోయినారు.

రవీంద్రుడు తన అంతిమ దినాలలో నివసించిన “ఉడిచీ”లో కొంత విశ్రాంతి తీసుకొనిన పిమ్మట షియాంగు దంపతులు శాంతినికేతనములోని కళాభవనమును సందర్శించారు.

మధ్యాహ్నం సింహాసదనంలో చియాంగ్ కై షేకు దంపతుల గౌరవార్థం ఒక సన్మానసభ యేర్పాటు చేయబడింది. అతిథులు ఉచితాసనము లలంకరించిన తరువాత వేదపఠనంతో ఆశీర్వాదం జరిగింది భారతీయ పద్ధతిని వారి నుదుట చందన తిలకము లను దిద్ది వారిని పుష్పమాలాలంకృతులుగా చేశారు సభాసదులు.

విశ్వభారతి పక్షాన మార్షలు చియాంగు కొక పట్టుధోవతీ శాలువయున్నూ, మ్యాడం షియాంగు కొక సుందరమైన పట్టుచీరయున్నూ బహుమతి చేయబడినవి.

విశ్వభారతి పక్షాన ఈ దంపతులకు సన్మానపత్రం సమర్పిస్తూ, రవీంద్రు డస్తమించేక్షణంవరకూ కూడ ఆయనకు చైనామీద అంతులేని ప్రేమా సానుభూతీ ఉన్నట్లు ఉద్ఘాటించాడు.

“ఇట్టి జీవన్మరణ సమస్యలో చిక్కుకొని ఉండికూడా మీ ప్రజలు మానసికా భ్యున్నతికోసమూ, విజ్ఞాన సముపార్జనకొఱకూ చేస్తూన్న కృషిని ఆయన నిరంతరం శ్లాఘిస్తూండేవారు. మీ ప్రజల మహత్తర సుగుణసంపత్తికి ముగ్ధుడై మీ దేశముయొక్క భవితవ్యమును గూర్చి ఆయన నిరంతరం కొఱవడని శ్రద్ధతో గమనిస్తూండేవాడు.

విశ్వభారతికి ప్రియాంగు దంపతుల రాక ఒక గౌరవంగా భావిస్తున్నామనీ, ఈ కళాపరిషచ్చరిత్రలోనూ తమ వ్యక్తి జీవితాలలోనూ కూడా ఈ సహా సంఘటన మను విస్మరింపజాలమనీ రథీంద్రుడన్నాడు. ఈనాడీ సహాసభకు అధ్యక్షునుగా ఉండి తమరాకను గూర్చి ఉచితమైన భాషలో ఈ సహస్యుల సంతోషమును వెల్ల డించగల ఆ మహావ్యక్తి ఇక్కడ లేకపోవడమే తమకు విషాదహేతువనీ. ఈ ఆశ్ర మానికి ఈ అతిథులను ఆహ్వానించడంలో ఆయనకన్న ఎక్కువ ఆనందించగల వారుం డరనీ రథీంద్రుడు ప్రకటించాడు.

ఆయన యింకా యిలా అన్నాడు.

"మీ యెడలను మీతోపాటు వీరోచిత కార్యములకు వెనుదీయని ఉదార చరితయగు మీ సహధర్మచారిణి యెడలను మానాన్నగారి కెంత గౌరవభావం ఉన్నదో మీకు తెలిసిన విషయమే. మిమ్మును గూర్చి మీ మాతృదేశముయొక్క భవితవ్యమును గూర్చి అనేకసార్లు మా తండ్రిగారు ముచ్చటిస్తూవచ్చారు. మీరూ మేమూ కలసి మన పూర్వసంప్రదాయములను పునర్జీవింప చేసుకొంటూ ఒకప్పుడు మన రెండు దేశాలకూ గల సన్నిహిత సంబంధమును తిరిగీ సంస్థాపించుకొనగల శుభదిన మునకు మాతండ్రి గారెదురు చూస్తూండేవారు. ఈ శుభముహూర్తంలో మా తండ్రి గారు ఉంటే ఆయన ఆత్మ ఎంత ఆనందించి ఉండేదో! మీ సిబ్బందికి మేమిప్పుడు సమర్పిస్తూన్న ఈ సన్మానపత్రంలోని, మా మాటలతో శ్రుతికలిపి ఆయన ఆనందం అంతర్వాహినిగా ప్రతిధ్వనిస్తూన్నదనియే నా విశ్వాసం.

"మన ఇండియా చీనా దేశాలు రెండూ కేవలమొక రాజకీయ సంబంధంవలన మాత్రమే కలిసిలేవు. తాత్కాలిక రాజకీయ ప్రయోజనాల కొఱకు మన రెండు రాజ్యాల బాంధవ్యమూ యేర్పడలేదు. మన రెండు దేశాలూ చరిత్రా సభ్యతా ప్రారంభమైననాటనుండీ పరస్పర సహకార సుహృద్భావములతో అర్థంచేసుకొని వ్యవహరిస్తూన్నవి. దురదృష్టవశాత్తూ ఇండియా చైనాలు రెండూ ఒకటి కొకటి దూరమై. దీర్ఘనిద్రావస్థలో నుండడంచేత కాలక్రమేణా వాటి సన్నిహిత బాంధవ్యం సడలిపోయింది. చీనాతో ఇండియాకు సన్నిహితమిత్రత్వం ఉండవలెనని మొట్టమొదటి సారి గ్రహించగలిగింది మా తండ్రిగారే. మన రెండు దేశాల మధ్యనూగల సనాతన సాంస్కృతిక సంబంధమును పునరుజ్జీవింప చేసేటందుకు, ఈ విశ్వకళాపరిషత్తును స్థాపించిన నాటనుండీ మా తండ్రిగారు కృషిచేస్తూన్నారు. మీ ప్రజానాయకులున్నూ మీ విజ్ఞానవేత్తలున్నూ మా నాన్నగారి ఆదర్శాలకు అనుగుణంగా భావిస్తూండడం వలన ఆయన ఈ విషయంలో కొంతవఱకు విజయం పొందినాడనే సంతృప్తిపడు

తున్నాము. మేమిప్పుడు వినుతించిన మా చీనా భవననిర్మాణంలో మీరు ప్రత్యక్షంగా పరిదర్శించిన ఉత్సాహమే మన రెండు పురాతన దేశాల ఐకమత్యమునకూ చిహ్నం.” అంటూ “లాంగుబాటెలుగని అమర చైనాయొక్క ఆత్మ మార్షల్ చియాంగ్ కై షేకులో మూర్తీభవించింది. ఆయన తన దేశానికి విజయ పరంపరలను చేకూర్చగలడని ఆశిస్తున్నాను.” అని ముగించాడు రవీంద్రుడు తన సన్మాన పత్రాన్ని.

ఇందుకు ప్రత్యుత్తరంగా మాడం చియాంగ్ కై షేకు యిలా అంది. “ఈనాడు మా దేశంలో వేలకొలదీ ఉన్న విద్యార్థుల కడకు నామనస్సు పరుగెత్తుతూన్నది. మీ యువకుల ముఖాలు చూచినప్పుడు నూతన చైనాయొక్క అమృతాత్మను సగర్వంగా ఆశాపూరిత హృదయంతో స్మరింపగలుగుతున్నాను. అంతేకాదు ఈనాడు వారి ఘోరవిపద్దశ నాకు జ్ఞాపకం వస్తూన్నది. చైనాపైన జపాను దండయాత్ర సాగినప్పటినుండీ వేలకొలదీ విద్యార్థులు బాంబులనూ టాంకులనూ ఫిరంగిగుండ్లనూ ఎదుర్కొవలసి వచ్చింది. వారి యిళ్ళూ, విశ్వవిద్యాలయాలు కూడా విచ్ఛిన్నం చేయ పడినవి. కాని చైనా అంతర్భాగంలో ప్రభుత్వంచే స్థాపింపబడిన విద్యాలయాలకు వారు వందలకొలదీ మైళ్లు నడిచిపోయినారు. వారు చైనా మనస్సుకు చైతన్యం కలిగించడమే గాక చైనా ప్రజల దేశాభిమాన జ్యోతిని మరింత తేజోవంతంగా ప్రకాశింప చేయగలిగారు. జపాను సైనికదళాల అత్యాచారాలకు గురికాని శాంతియుతమైన మీదేశంలో మా కష్టాలను గ్రహింపడం దుస్తరం.

మానవత్వానికి సంబంధించిన సిద్ధాంతాలు, జీవితంలో కార్య శూరత్వమునకు మార్గదర్శకములు కావలెనని మీరు గ్రహించారో లేదో నాకు తెలియదు. కేవలం ద్వేషరహితంగా ఉన్నంత మాత్రంతో చాలదు. ఇతరులు తమ అత్యాచారాలనూ దౌర్జన్యాలనూ కొనసాగించకుండా అరికట్టలేనియెడల అది అర్థంలేని మృతసిద్ధాంతంగా పరిణమిస్తుంది. కోటాను కోట్ల ప్రజలకు స్వాతంత్ర్యమునూ సమానత్వమునూ సంపాదించి పెట్టగల మహదవకాశం మీకున్నది. విదేశ దండయాత్రలను నిరోధించగల రణరంగాలుగా భావించి జపానువారు మా విశ్వ విద్యాలయాలపైన బాంబులు విసిరారు. మా విద్యార్థులు వాటిని నిజమైన రక్షణ కేంద్రాలుగా చేశారు. మా ప్రజానీకంలో చొరబడి వారు బాగా పనిచేశారు. వారే మహత్తరసంయుక్త చైనాకు పునాదులు వేశారు.

“మీ విశ్వవిద్యాలయ సంస్థాపకుడు మీరంతా నాయకులు కావలెనని వాంఛించి ఉంటాడు. ఆయన ప్రజాసామాన్యానికి వెలిగాఉన్న నాయకమ్మన్యుడు కాడు. మీ దేశానికి మోక్షమిప్పించేటందుకు తరతరాలవారిలో చైతన్యం కల్గించగలిగిన మహావ్యక్తి ఆయన. నేనిక్కడకువచ్చే సంగతి మా యువకులకు తెలిసి ఉన్నట్లయితే

వారందఱూ తమ హృదయపూర్వక సౌహృదాభినందనములను నా ద్వారా మీకు సమర్పించగలిగి ఉండేవారు. మీ మహాకవి మా వారి హృదయపీఠికల యందాసీనుడై ఉన్నాడు. చైనాప్రజల హృదయమందిరాలలో ఆయనకు నిరంతరం పూజ్యస్థానముంది”

ఆనాడు ధారాపాతంగా వర్షం కురియడంచేత మావి తోపులక్రింద జరుగవలసిన ఆ సమావేశం సింహసదనంలో జరిగింది.

శాంతి నికేతన విద్యార్థినులు పసుపు చీరలతో చియాంగు దంపతులకు స్వాగత మిచ్చారు. నెహ్రూ పర్యవేక్షణక్రింద ఈస్వాగతం జరిగింది. పిమ్మట మార్షల్ చియాంగ్ కై షేకు దంపతులు కళాభవనమును శ్రీ భవనమును దర్శించారు. చైనా చిత్రకళతో మనోహరంగా అలంకరించబడిన చీనా భవనమునందు మధ్యాహ్నం వారికి తేనీటివిందు జరిగింది. తరువాత వారు ఉత్తరాయణమునకు వెళ్ళినారు. అక్కడ వినోద కార్యక్రమంతో కాలక్షేపం చేశారు. భారతీయులకు మార్షల్ చియాంగ్ సందేశం :—

నేను భారత దేశంలో ఉన్న రెండు వారాలలోనూ అక్కడి సివిల్ మిలిటరీ ఉన్నతాధికారులతోనూ తదితర భారతీయ మిత్రులతోనూ, విదేశ దండయాత్రలను నిరోధించడానికి మన ఉభయదేశాలూ సమిష్టిగా నిర్వహించవలసిన కార్యప్రణాళికలనుగూర్చి నిష్కపటంగా సంభాషించడం జరిగింది. మన ఉభయ దేశాలమధ్యనూ పరస్పర సుహృద్భావం ఉన్నందుకు చాలా సంతోషం. నేను వచ్చిన పని సానుకూలం అయినట్లే నేని దేశాన్ని విడిచివెళ్ళే సమయంలో ఇండియాలోని నా మిత్రులందరకడనుండీ సెలవు తీసుకోనవలసివుంది. నా యెడలను నా గృహిణి యెడలనూ మీరు చూపిన ఆదరణకు నేను మిక్కిలి కృతజ్ఞుడను. నేను చాలా తక్కువ కాలమే ఇండియాలో ఉండడంచేత ఇండియా ప్రజలకు నేను చెప్పదలచుకొన్న దంతా చెప్పవీలైనదికాదు. కాబట్టి వారికి సందేశాన్ని పంపదలచుకొన్నాను. ఇది ఇండియా యెడల నాకుగల మహోత్కృష్ట గౌరవములకు, ఇండియా భవితవ్యమును గూర్చి చిరకాలంనుండీ నేను పెట్టుకొన్న ఆశలకూ ప్రతిబింబం. ఇది నా హృదయాంతరంగమునుండి వెలువడినది.

విదేశదండయాత్రను నిరోధించే విషయంలో భారతీయులందరూ ఏకాభిప్రాయం కలిగి ఉన్నారని ఇండియాలో అడుగుపెట్టిన తక్షణం నాకు తెలిసింది. అది నాకు చాలా సంతోషం. చైనా ఇండియా దేశాల జనసంఖ్య ప్రపంచ జనసంఖ్యలో సగభాగం ఉంటుంది. వాటి సరిహద్దు మూడువేల కిలోమీటర్ల పొడవు వ్యాపించి ఉంది. ఈరెండు దేశాలకూ రెండువేల సంవత్సరాల నుండి వైజ్ఞానిక సంబంధమూ వాణిజ్యసంబంధమూ ఉన్నది కాని ఎన్నడూ తీవ్రమైన విభేదాలు లేవు.

ఇంత సన్నిహితంగా ఉన్న రెండు ఇరుగు పొరుగు దేశాలమధ్య, ఇంతకాలం నుండీ నిరంతరాయమైన శాంతి ఉండడం ఇంక ఎక్కడా చూడము. ఇందువలన మనం ఉభయులమూ కూడా శాంతిప్రియులమనే మాట చక్కగా ఋజువవుతూన్నది. దీనిని ఎవ్వరూ కాదనజాలరు. ఈనాడు ఈ రెండు దేశాలకూగల ఆశయ మొక్కటే. ఈ రెండు దేశాల ప్రయోజనాలూ కూడా ఒక్కటే. అందువల్ల రెండు దేశాల ప్రజలూ ఏకమై విదేశ దండయాత్రలను ఎదుర్కొంటూన్న దేశాల పక్షాన నిలబడి వారితో కలసి నిజమైన ప్రపంచశాంతిని చేకూర్చడానికి కృషిచేయడం ధర్మం.

అంతేకాదు. మన రెండుదేశాల ప్రజలలోనూ ఒక్క విశిష్ట లక్షణం ఉన్నది. న్యాయంకోసం ధర్మంకోసం త్యాగం చేయగలిగిన ఉదారస్వభావం మనవారిది. సాంప్రదాయసిద్ధంగా వచ్చిన ఈభావం వలననే మానవజాతి మోక్షమునకు మార్గ దర్శకమైన నిస్స్వార్థపరత్వము మన హృదయాలను స్పందింపచేస్తూన్నది. ఈ భావం మూలముననే విదేశ దండయాత్రకు ప్రతికూలంగా చీనా మొట్టమొదట కత్తిదూయ వలసి వచ్చింది. ఈ యుద్ధంలో దురాక్రమణకు ప్రతికూలంగా నిలచిన దేశాల పక్షాన చైనా చేరడం, కేవలం తన స్వాతంత్ర్యమును రక్షించుకొనేటందుకే కాదు. ప్రపంచం లోని మానవులందరి స్వాతంత్ర్యమును కాపాడేటందుకు కూడా.

మన ఉభయదేశాల సభ్యతా చరిత్రలోనూ అత్యంత సందిగ్ధసమయం ఆసన్న మయిన ఈ తరుణంలో మానవజాతి స్వాతంత్ర్యం కోసం గట్టిగా కృషిచేయవలెనని నా సోదరులను నేనిందుమూలంగా హెచ్చరిస్తున్నాను. స్వేచ్ఛా ప్రపంచంలో మాత్రమే చైనా ఇండియాదేశాల ప్రజలు కూడా తమ స్వాతంత్ర్యమును పొందగలరు. అంతేకాదు, ఇండియాకు గానీ చైనాకు గానీ స్వాతంత్ర్యం లేకపోయినట్లయితే ప్రపంచంలో నిజమైన స్వాతంత్ర్యం ఉండనే ఉండదు.

నేటి అంతర్జాతీయ పరిస్థితులలో ప్రపంచమంతా రెండుగా విభజింపబడి ఉంది. ఒకటి దురాక్రమణకు అనుకూలంగానూ రెండవది ప్రతికూలంగానూ ఉంది. దురాక్ర మణకు ప్రతికూలంగా ఉండి మాతృదేశ స్వాతంత్ర్యంకోసమూ మానవ స్వాతంత్ర్యం కోసమూ పాటుపడేవారంతా ఒక పక్షాన చేరాలి. అంతకు తప్ప మరొక మధ్య మార్గం లేదు. పరిస్థితుల పరిణామమును గమనిస్తూ వేచి ఉండేటందుకు తగిన సమయం కాదిది. మానవ భవిష్యత్తును నిర్ణయించగల ముఖ్య తరుణమిది. ఇది యేదో ఒక మనిషికి గానీ ఒక దేశానికిగానీ సంబంధించిన తగాదా కాదు. ఒక దేశ ప్రజకూ మరొక దేశ ప్రజకూ సంబంధించిన ప్రత్యేక విషయాలను గూర్చిన సమస్యకూడా కాదిది. కాబట్టి దురాక్రమణకు ప్రతికూలంగా చేరిన ప్రజలు యే ఒక్క దేశంతోనో సహకారం చేయ

డానికి మాత్రమే చేరారని చెప్పడానికి వీలులేదు. ప్రపంచంలో దురాక్రమణను ఎదుర్కొంటున్న యావత్తు ప్రజానీకంతోనూ చేరారని తలంచాలి. కాబట్టి ఈ పసిఫిక్కు మహాయుద్ధమును జాతీయతా చరిత్రలో ఒక ముఖ్య పరిణామమును కలిగించే ప్రధాన ఘట్టంగా పరిగణించాలి. ప్రపంచంలోని వివిధదేశాల ప్రజలు తమ స్వాతంత్ర్య సంపాదనార్థం వివిధ పద్ధతులను అవలంబిస్తూ ఉండవచ్చును. ప్రపంచ స్వాతంత్ర్యమును సుస్థిరంగా కాపాడేటందుకు జరిగే ఈ పోరాటంలో ఇండియా తన పాత్రను సరిగా నిర్వహించవలెననీ సంపూర్ణబాధ్యతను వహించవలెననీ దురాక్రమణకు ప్రతికూలంగా యుద్ధంచేస్తూన్న దేశాలన్నీ ఆశిస్తూన్నవి. ప్రపంచంలోని అత్యధిక సంఖ్యాక ప్రజానీకం ఇండియా యొక్క స్వాతంత్ర్యాశయముతో సంపూర్ణ సానుభూతి కలిగి ఉంది. ఇటువంటి సానుభూతి అమూల్యం. దీనిని సంపాదించడం కూడా చాలా దుస్తరం. దీనిని ధనరూపంలో కానీ వేడుకల రూపంలోగాని లెక్కతేల్చి చెప్పడం కష్టం. కాబట్టి ఈ సానుభూతిని శాశ్వతంగా నిలబెట్టుకోవాలి.

ఇప్పుడు జరుగుతూన్న పోరాటం స్వాతంత్ర్య పరాధీనముల మధ్య జరిగే పోరాటం. చీకటికీ వెలుతురుకూ మధ్య జరిగే పోరాటం మంచి చెడ్డల మధ్య జరిగే పోరాటం. దురాక్రమణ, ఆత్మరక్షణల మధ్య జరిగే పోరాటం. ఈ పోరాటంలో దురాక్రమణదారులు జయం పొందినట్లయితే ప్రపంచ సభ్యత ఒకశతాబ్దం వెనుకపడి పోతుంది. మానవ దురవస్థకు అవధి ఉండదు.

ఆశియా ఖండంలో జపాను సైనికులు చేసిన ఘోరకృత్యాలు వర్ణనాతీతాలు. జపానువారికి లొంగిపోయిన తరువాత ఫార్మోజనులు కొరియనులూ పడుతూన్న బాధలు ప్రపంచానికొక గుణపాఠంగా ఉండాలి. మేమీ ఆత్మరక్షణ యుద్ధాన్ని సాగించిన పిమ్మట 1937 డిశంబరులో తటస్థించిన నాన్కింగ్ పతనం, జపానీయులు కావించిన హత్యాకాండకు నిదర్శనం. ఒకవారంలో రెండు లక్షలమంది మామూలు ప్రజలు సంహరించబడ్డారు. కడచిన ఐదేళ్ళనుండీ స్వతంత్ర చీనాదేశంలోని ప్రజానీకం ఆకాశంనుండి బాంబులవల్లను, భూమినుండి మరఫిరంగులవల్లనూ నిత్యమూ మరణములకు గురి అవుతున్నారు. జపాను దండయాత్రకు పాల్పడిన ప్రతిచోటనూ స్త్రీలు బాలుర పిల్లలూ వారి దెబ్బలకు గురియై మరణిస్తున్నారు. విద్యావంతులైన యువకులను, విజ్ఞానమూ స్వతంత్ర భావములూ కలవారినీ, జపానువారు ప్రత్యేకం హింసిస్తున్నారు. ఇంతేకాదు. విజ్ఞానములకు ఆటుపట్టులయిన సంస్థలనూ, చరిత్రాత్మక విశేషములను నిరూపించగల వస్తువులనూ, నిత్య జీవితావసరములకు కావలసిన వంట సామానులు, నాగళ్లు, పశువులు మొదలైన వాటి నన్నిటినీ వశపర్చుకొని నాశనం చేశారు.

జపాను ఆక్రమిత ప్రదేశాలన్నింటిలోనూ స్త్రీలను మానభంగం చేయడం, దోపిడీలు చేయడం, కొంపలు తగుల బేయడం, హత్యలు జరిగించడం — ఇవి నిత్యకృత్యాలయి పోయినవి. అంతేకాక ఉద్యోగుల షెరీకుతో నల్లమందు అమ్మే దొంగ దుకాణాలు, జూదపుటిండ్లు, వ్యభిచార గృహములు నిర్మింపబడ్డవి ఇవన్నీ చైనా ప్రజల శక్తి సామర్థ్యములను నాశనమొనర్చి వారిని నిర్వీర్యులనుగా చేసే ఉద్దేశంతో ఏర్పాటు చేయబడ్డవి. ఇట్టి లజ్జాకర విషయము లొక్క జపాను ఆక్రమిత ప్రదేశములలో తప్ప తదితర దేశాలు ఆక్రమించిన స్థలాలలో ఎక్కడా జరగడంలేదు. చీనా దేశీయు లున్నూ తదితర విదేశీయులున్నూ ప్రత్యక్షంగా చూచిన విషయాలను మాత్రమే నేనిక్కడ ఉదాహరించాను. అందువలన అక్కడి పరిస్థితులను నేను సమగ్రంగా వర్ణించినట్లుగా మీరు భావించకూడదు.

ఇట్టి రాక్షస కృత్యాలు జరుగుతూన్న ఈ భయంకర సమయాలలో చీనా దేశపు ప్రజలున్నూ వారి సోదరులయిన భారతీయులున్నూ కలసి, ప్రపంచ సభ్యతనూ, మానవ స్వాతంత్ర్యమునూ కాపాడేటందుకు, అట్లాంటిక్ ఛార్టరులో ఉదాహరింప బడిన సిద్ధాంతాలనూ ఇరవై అరు దేశాలవారు చేసిన సమిష్టి ప్రకటననూ బలపరుస్తూ దురాక్రమణను ప్రతిరోధిస్తూన్న దేశాలతో ఏకంకావలెను. ప్రపంచ స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేయగల సంపూర్ణ విజయం లభించేవరకూ వారు మిత్రమండలివారితో, అనగా చీనా, గ్రేటు బ్రిటను, అమెరికా, సోవియట్ యూనియనులతో కలసి మెలసి ఒక్కుమ్మడిగా వ్యవహరించగలరని ఆశిస్తున్నాను. ఈ క్లిష్టసమయంలో తమ ధర్మాలను వారు సక్రమంగా నిర్వర్తించగలరని కూడా భావిస్తున్నాను.

మా మిత్ర దేశమైన గ్రేటు బ్రిటను సైతం ఇండియా ప్రజలు కోరే కోరికల కోసం వేచివుండకుండా, సాధ్యమైనంత త్వరలో వారికి నిజమైన రాజకీయ స్వాతంత్ర్యమును ప్రసాదించి; భౌతికంగానూ ఆధ్యాత్మికంగానూ కూడా వారి అభివృద్ధికి దోహదం చేయగలదనీ, అందువల్ల వారు కేవలం దురాక్రమణను ప్రతిరోధించేవారి విజయం కొఱకు సహాయపడడమే గాక, భారత స్వాతంత్ర్య పోరాటంలో ఒక నూతనాధ్యాయమును ప్రారంభించినట్లు భావించగలరనీ హృదయపూర్వకంగా విశ్వసిస్తున్నాను. ఈ పని బ్రిటిష్ సామ్రాజ్యము యొక్క రాజనీతి ధౌరంధర్యమునకు తగినంత కీర్తిప్రదంగా ఉంటుందని నా అభిప్రాయం.

చీనా సర్వసేనాని చియాంగ్ కై షేక్ చీనా భాషలో భారత ప్రజానీకమునకు పంపిన సందేశాన్ని, ఆయన గృహిణి పంపిన దాని అంగ్లానువాదాన్నీ కూడా ఆలిండియా రేడియో కలకత్తా స్టేషను నుండి ప్రసారం చేసింది.

చియాంగ్ కై షేక్ ఇండియాకు హఠాత్తుగా వచ్చాడు. దాదాపు ఎవ్వరికీ తెలియదు. అధికారేతరులకు సంబంధించినంతవరకు మ్యాడం చియాంగ్ కై షేక్ జవహర్‌లాలు నెహ్రూయొక్క సంచార కార్యక్రమమును గూర్చి మొట్టమొదటగా విచారించింది. పిమ్మట చీనాసర్వసేనాని చియాంగ్ కై షేక్, ఆయన గృహిణి కలకత్తారు చేరుకొన్నట్లుగా ఆయనకు తెలియవచ్చింది. చీనా అగ్రనాయకులైన ఈ యిరువురూ ఇండియాకు వారంతట వారు వచ్చారో లేక ఇండియా ప్రభుత్వంవారి ఆహ్వానంపైన వచ్చారో తెలియదు. బహుశా ఇండియా ప్రభుత్వపు పిలుపు పైనే వచ్చి ఉండ వచ్చును. కాని ఇండియా ప్రభుత్వంవారు వారికి చూపుతూన్న పరిమిత మర్యాదలను బట్టి ఆలోచిస్తే ఆ ఊహ నిజంకాదేమో అనిపిస్తూన్నది. ప్రభుత్వంవారి మర్యాదలతో వారు సంతృప్తిపడనట్లుగా పెద్ద వదంతి బయలుదేరింది. ఏవిధంగా ఆలోచించినప్పటికీ, గాంధీజీని దర్శించడంలో వారికి తటస్థించిన కష్టాన్ని బట్టి వారి రాక యెట్టిదో మనం నిర్ధారణ చేయవచ్చును. ఈ భూమండలంలో ఎక్కడనైనా సరే చియాంగును కలుసు కోవడానికి గాంధీ సంసిద్ధంగా ఉన్నాడు కాని వారెక్కడ సమావేశం కావలెననే ప్రశ్న వచ్చింది. లక్నోలో గాని వారణాసిలో గాని కలుసుకొంటే బాగుండదా అని ఆలోచించారు. సేవాగ్రామంలో కలుసుకోవడం అసంభవంగదా! ఇక కలకత్తాలో కలుసుకోవడానికి గాంధీకి వీలవుతుందా అని చియాంగ్ కై షేకు విచారించాడు. ఆ ఉత్తరం వచ్చిన తరువాత గాంధీ కొంత ఆందోళనతో చియాంగుకు జవాబిచ్చాడు. చియాంగు ఆ జవాబును చూచుకొని గాంధీని కలుసుకోవలెనని మరింత ఆతురపడ్డాడు. తరువాత కలకత్తాలో ఉభయులూ సమావేశం కావడమూ, పరస్పర గౌరవ పురస్సరంగా ఒకరి బసకు మరొకరు రావడమూ జరిగింది. వారుభయులూ హృదయ పూర్వకంగా చాలాసేపు మాట్లాడుకొన్నారు.

భారతదేశం వెంటనే యుద్ధంలోకి దిగవలెనని చియాంగ్ సిద్ధాంతం. ఇది అందరికీ తెలిసిందే. గాంధీ ఇందుకు కేవలం ప్రతికూలం. ఏ సందర్భంలోనూ ఇండియా ఈ యుద్ధంలో జోక్యం కల్గించుకోకూడదని గాంధీజీ విశ్వాసం. కాబట్టి వీరిరువురకూ ఈ విషయంలో పొత్తు కలియకపోవడం సహజమే. అయితే ఇండియా చైనా దేశాలను ఐక్యం కావించిన ఉన్నత సంస్కృతి ఒక్కటే వీరికి పొత్తుకలుపగలిగింది. జిన్నాకూడా చియాంగ్ కై షేకును కలుసుకొన్నాడు. కాని ఆయనను అనువదించింది చియాంగ్ సిబ్బందిలో ఒకరు. గాంధీ సంభాషణను అనువదించినమ్యాడం చియాంగ్ కై షేకు కాదు.

1942 ఫిబ్రవరి 21 వ తేదీని చియాంగ్ దంపతు లిరువురూ కూడా కలకత్తా రేడియో నుండి తమ సందేశాలను ప్రసారం చేశారు. చీనా సర్వసేనాని పంపిన

దేశం చాలా బాగుంది. బ్రిటను ఇండియాకు తగిన రాజకీయ సంస్కరణలను వేశపెట్టగలదనీ, పెద్ద పనులు చేయడానికి తగిన పెద్దవాడు చర్చిలేననీ ఆయన ఆశను వెలిబుచ్చాడు.

చైనా సర్వసేనాని ఇండియాకు రావడంలో గల రాజకీయ ప్రాముఖ్యత మాట ఉండగా ప్రపంచ సంస్కృతికి సంబంధించి కూడా ఒక విశిష్టత ఉన్నట్లు వింపబడింది. ప్రపంచంలోని జనసంఖ్యను, ఈ రెండు దేశాల జనసంఖ్యతో పోల్చిచినప్పుడు, ప్రపంచంలో మూడవవంతు జనసంఖ్యగల ఈ దేశాల సాంస్కృతిక కారం వలన ప్రపంచ సభ్యతలో కలిగే విశాల పరిణామాలను ఊహించడం స్తరం కాదు. ఈ సంఘటనను ఆధారంగా చేసుకొని "చీనాను గౌరవించగలిగిన ను ఇండియాతో కూడా సరిసమానంగా ఎందుకు చేతులు కలపకూడదు" అని మ్ పత్రికలు వ్యాఖ్యానం చేయసాగినవి. సరిగా యిదే సమయంలో బ్రిటిష్ ద్ధ మంత్రివర్గములోకి ఇండియా కూడా ఒక ప్రతినిధిని పంపవలయునని నిర్ణయింప ది. ఈ ప్రకటనను చూచి ఇండియాలోని పలువురు పలువిధాలుగా భావించారు. తకాలం కిందట, లాయడ్ జార్జి ఇండియా ప్రతినిధిని వలసరాజ్యాల ప్రధాన త్రులతో సమానంగా సామ్రాజ్య యుద్ధ మంత్రివర్గంలో (Imperial War binet) సభ్యుడుగా చేసిన సంగతి స్మరణకు వచ్చింది. 1914–18 సంవత్సరాల కి మహాసంగ్రామంలో సర్. యస్. పి. సిన్హా ఇండియా ప్రతినిధిగా ఉన్నాడు. పర్యాయం బ్రిటను సదుద్దేశాన్ని పరిశీలించే ఉద్దేశంతో ఇండియా ప్రతినిధికి వేశ ప్రతినిధులతో సమాన ప్రతిపత్తి ఉంటుందా అని పార్లమెంటులోని సభ్యులు ంకీని ప్రశ్నించారు. ఆమెరీ ఉంటుందన్నాడు. ఇండియా ఆమోదించిన ప్రతినిధులను మించి రాజప్రతినిధి ఈ అవకాశాన్ని సద్వినియోగం చేయవలెనని మాంచెస్టరు యక్ హెచ్చరించింది. టైమ్సు పత్రిక ఈ విషయాన్ని యింకా వివరంగా ంచింది.

" 1917 నుండీ కూడా సామ్రాజ్య యుద్ధ మంత్రివర్గంలో ఇండియా ప్రతినిధి మించబడడం ఆచారమయింది. ఈనాడు జరిగిన కొత్తమార్పు, అధినివేశ పత్తికి ఇండియా మరెంత సన్నిహితమైనట్లు సూచిస్తున్నది. 1917 నాడు యుద్ధ త్రివర్గంలో ఇండియా ప్రతినిధులను భారత రాజ్యాంగ కార్యదర్శియే నియమిం ఆ నియమింపబడిన వారిలో తానొకడు. ఈనాడు రాజప్రతినిధి తన ఆహ్వా తన కార్యనిర్వాహక వర్గ సభ్యులకు అందచేశాడు. వారు తమ ప్రతినిధులను నవలసి ఉంది. ఈ ఆహ్వానం నిస్సందేహంగా ఆమోదింపబడుతుంది. జపాను

దండయాత్రను నిరోధించడానికి తగిన శక్తిసామర్థ్యాలు ఇండియాకు కలుగవలెనన్నచో బ్రిటనుతోనూ తదితర పాశ్చాత్య ప్రభుత్వాలతోనూ హృదయపూర్వకంగా సహకారం చేయడం ఉచితమని భావించే అశేష ప్రజానీకమునకూ ప్రాతినిధ్యం వహించి, అధికారరీత్యా తగిన హుందాతో మాట్లాడగలిగిన భారతీయ ప్రతినిధులను నియమించడం అందరూ వాంఛిస్తూన్న విషయం" అని టైమ్సు పత్రిక వ్రాసింది.

యుద్ధం ముగిసిన తక్షణం ఇండియాకు స్వాతంత్ర్యం యిచ్చేటట్లు బ్రిటను పూర్తిగా వాగ్దానం చేయవలెనని తన అభిప్రాయమైనట్లు సర్ స్టాఫర్డు క్రిప్సు ఇంతకు పూర్వమే అని ఉన్నాడు.

తన ప్రకటనను విశదీకరిస్తూ రాయిటరు విలేఖకునితో ఆయన యింకా యిలా చెప్పాడు.

"1926 లో బెల్ఫూరు ప్రభువు చెప్పినట్లుగా అధినివేశ ప్రతిపత్తి అనే మాట విస్పష్టం చేయబడాలి. అనగా అధినివేశానికి బ్రిటిష్ కామన్ వెల్తులో కలసి ఉండడానికి గానీ విడిపోవడానికి కానీ అధికారం ఉందనే విషయం స్పష్టం చేయబడాలి. అదే స్వాతంత్ర్యం పొందే హక్కు. యుద్ధానంతరం ఈ హక్కు ఈయబడుతుందని వాగ్దానంచేయబడేయెడల ఇప్పటి చిక్కులంతీరిపోగలవని నానమ్మకం. అయితే ఈ యుద్ధ సమయంలో మాత్రం ఇండియా యుద్ధ సన్నాహాలకు తోడ్పడాలి. అయితే ఆ తోడ్పాటు బ్రిటిష్‌వారు చేసే అసందిగ్ధమైన వాగ్దానంపైన ఆధారపడిఉంటుంది" ఇవి క్రిప్సు చెప్పిన మాటలు.

మార్షల్ చియాంగ్ కై షేక్ దూరప్రాచ్య దేశము నుండి ఇండియాకు రావడంతో తూర్పుదేశాలకు మరొకసారి సన్నిహితత్వం యేర్పడిన మాట సత్యం. ఇక సమీప ప్రాచ్యదేశంలో పరిస్థితులను గమనిస్తూ కొన్ని సంవత్సరాలనుండీ వేచి ఉన్న నాహుస్‌పాషా తిరిగీ ఈజిప్టులో తన మంత్రివర్గాన్ని నిర్మించుకొన్నాడు. 1942 ఫిబ్రవరి అయిదో తేదీని కెయిరో నుండి వచ్చిన రాయిటరు వార్త పాఠకుల ఉత్సాహం నిమిత్తం ఇక్కడ ఉదాహరింప బడుతూన్నది.

"ఈజిప్టు యొక్క ఆంతరంగిక వ్యవహారాలతో జోక్యం కల్పించుకోకుండా, ఆంగ్లో ఈజిప్షన్ సంధిని అమలుపఱచడంలో, స్వతంత్ర ప్రభుత్వంగల మిత్రదేశంతో హృదయపూర్వక సహకారం చేయడమే తామవలంబించ దలచుకొన్న రాజనీతి అని బ్రిటిష్ రాయబారి సర్ మైల్సు లాంప్‌సన్, నూతన ప్రధానమంత్రి నాహస్‌పాషాకు ప్రత్యుత్తరమిచ్చాడు.

ఈజిప్టుకు గల సంపూర్ణ స్వాతంత్ర్య ప్రతిపత్తి వలనగానీ, ఆంగ్లో ఈజిప్షన్ సంధి వలనగానీ, ఈజిప్టు యొక్క ఆంతరంగిక వ్యవహారాలలో బ్రిటను జోక్యం కల్పించుకోవడానికి వీలులేదనే సిద్ధాంతం పైననే తాను మంత్రివర్గమును నిర్మించినట్లూ, ఉభయదేశాల మధ్యనూ జరిగిన సంధి షరతుల ప్రకారం సర్ మైల్సు లాంప్సన్ కూడా ఆ అభిప్రాయాన్నే బలపరుస్తూ వ్యవహరించగలడని తాను తలంచుతూన్నట్లు, నాహస్‌పాషా ఆయన ఉత్తరంలో వ్రాశాడు.”

1942 ఫిబ్రవరి 11 వ తేదీని, రాజకీయవేత్తగా వ్యవహారదక్షుడుగా, మహాదాతగా ప్రఖ్యాతివహించిన జమన్‌లాలు బజాజ్ వార్ధాలో హృద్రోగంతో మరణించాడు. జమన్‌లాలు బజాజు జయపూరు సంస్థానంలో 1889 నవంబరులో ఒక మార్వాడీ కుటుంబంలో జన్మించాడు.

ఆయన ప్రజా జీవితం 1920 నుండీ ఎక్కువగా ప్రారంభమయింది. ఆయన ఆనాడు రావు బహదూరు బిరుదమును త్యజించి కాంగ్రెసులో చేరి నాగపూరులో జరిగిన కాంగ్రెసు మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షుడైనాడు. దేశానికి అన్నివిధాలా సహాయపడడానికి ఆయన యెప్పుడూ సంసిద్ధంగా ఉండేవాడు. దేశభక్తి పూరితములైన ప్రయత్నాలలో ఆయన ఈవికి అంతులేదు. గాంధీజీ ప్రారంభించిన శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్న లాయర్ల సహాయార్థం వసూలుచేయబడిన తిలకు స్వరాజ్య నిధికి, ఆ మఱుసంవత్సరమే ఆయన ఒక లక్ష రూపాయీలు విరాళంగా యిచ్చాడు. అప్పటినుండీ ఆయన యిచ్చిన దానాలు 25 లక్షల రూపాయిలకు మించి ఉంటవి.

జరిగిన పాతిక సంవత్సరాలలో సేట్ జమన్‌లాల్ బజాజ్ ప్రధానంగా పాల్గొనని కాంగ్రెసు విధానం కానీ, ముఖ్య కార్యక్రమం గానీ దాదాపు మృగ్యమని చెప్పవచ్చును. అంతకంటెనూ కూడా వివిధ సంఘ సంస్కరణోద్యమాలకూ, గాంధీజీకి ప్రియతమమైన నిర్మాణ కార్యక్రమానికీ ఆయన యిచ్చిన విరాళాల వలన ఆయన పేరు చిరస్మరణీయమయింది. వార్ధాలోని గాంధీ సేవాసంఘమును నిర్మించింది ఆయనే. సంఘ సేవా పరాయణత్వమునకు కంకణం కట్టుకొన్న అఖిలభారత అగర్వాల్ మహాసభలాటి సంస్థలను స్థాపించింది కూడా ఆయనే. 1921 నుండి తుదివరకూ అఖిల భారత చరఖా సంఘమున కాయన అధ్యక్షుడు. ఆ పదవిలో ఉండి ఖాదీ పరిశ్రమను ఆయన సుస్థిరం చేయగలిగాడు.

‘జమన్‌లాలు బజాజు కారాగారా జీవితమును మొదటిసారి చవిచూచింది 1923 లో. నాగపురం పోలీసువారు జాతీయ పతాకోత్సవాన్ని 144 సెక్షను కింద

నిషేధించినప్పుడు అహింసాయుత ప్రతీకారంగా 'జెండా సత్యాగ్రహం' ప్రారంభ మయింది. అందులో పాల్గొని ఆయన జైలు శిక్షను అనుభవించాడు. ఈ సత్యాగ్రహోద్యమ ప్రారంభకుడే బజాజ్. ఆయన నిర్బంధింపబడిన తక్షణం నాగపూరులో సమావేశమయిన కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆయనను అభినందిస్తూ తీర్మానం చేసింది. అంతేకాదు, ఆ ఉద్యమానికి వర్కింగు కమిటీ వారు సహాయం చేయగలమని కూడా తీర్మానించారు. ఆయనకు విధింపబడిన రు 3,000 వసూలు చేసుకొనేటందుకు ప్రభుత్వం వారాయన మోటారుకారును జప్తుచేశారు. కాని బజాజ్ మీద నాగపూరు పౌరులకు గల గౌరవం వలన ఆ కారుకు వేలం పడలేదు. కతియవారులో తిరిగి వేలం పెట్టబడింది. 1930, 1932 సంవత్సరాల శాసనోల్లంఘనోద్యమాలలో పాల్గొని ఆయన భార్యాసహితంగా శిక్షింపబడ్డాడు. ఆయన జైలులో సంతోషంగా కాలక్షేపం చేశాడు.

భారతదేశంలోని 'అస్పృశ్యుల' కోసం 1928 లో ఆయన వార్ధా నగరమున శ్రీ లక్ష్మీనారాయణ దేవాలయాన్ని నిర్మించాడు. ఈ ధర్మ సంస్థ నిరంతరాయంగా కొనసాగే సంస్థ. ఆయన దాతృత్వానికిది చిరస్మరణీయమైన ప్రబల నిదర్శనం. భారతదేశంలో దీనికి సాటివచ్చే దేవాలయం మరొకటి లేదు.

శ్రీమంతుడు తన ఐశ్వర్యాన్ని సంఘ క్షేమంకోసం వినియోగించవలసిన ధర్మకర్త మాత్రమేనని గాంధీజీ అభిప్రాయం. దానిని అక్షరాలా ఆచరణలోకి తెచ్చిన మహానుభావు డొక్కడే. ఐశ్వర్యం సేవాపరాయణత్వమునకు దోహదం చేసేదే అయితే అవిశ్రాంతంగా తోడి మానవుల దుఃఖాలను కష్టాలనూ నివారించడానికి దానిని వినియోగించిన మహాపురుషు డొక్కడే. అహింసకు శత్రువులూ మిత్రులూ అనే భేదం లేనిమాట నిజమే అయితేనూ, సృష్టిలో ఉచ్చమూ నీచమూ అనే అంతరువు లేవనే సంగతి సత్యమే అయితేనూ, మానవులనూ మృగాలనూ సమాన ప్రేమతో ఆదరించిన కరుణామూర్తి ఒక్కడే. ప్రపంచంలో సర్వతోముఖ జీవితాన్ని సాగించడమే మానవుని ధర్మమైతే, ఏకాగ్రతతో కష్టించి సమగ్ర జీవితాన్ని సర్వవిధాలా నడపగలిగిన పుణ్యపురుషు డొక్కడే. మనిషి వయస్సును బట్టిగానీ దీర్ఘాయువునుబట్టిగానీ ఆయన ప్రపంచానికి చేసిన సేవను పరిగణించక, స్వతస్సిద్ధంగా లభించిన సుగుణాలను బట్టి మాత్రమే పరిగణించే యెడల, స్వార్థత్యాగంలో, ఆత్మనిగ్రహంలో, నిర్మలత్వంలో, వినయంలో, సుహృద్భావంలో, సౌభ్రాతృత్వంలో, తాను జీవించి ఉన్న యాభైరెండు సంవత్సరాల స్వల్పకాలంలోనూ, కొన్ని తరముల వరకూ శ్రీమంతులందరికీ ఆదర్శప్రాయంగా ఉండతగిన ప్రసిద్ధతను గడించిన సజ్జనుడొక్కడే. ఆయనయే జమన్‌లాలు బజాజ్.